# స్వ వి ష య ం



లింగం వీరభద్రయ్యచౌదరి
బి. ఏ. (ఆక్స్ఫర్డ్), బార్-ఎట్-లా

ప్రథమ ముద్రణ: మే 1973

స్వామ్యములు గ్రంథకర్తవి

ముద్రణ: త్రివేణి ప్రెస్, మచిలీపట్నం-1

మూల్యం: 8 రూపాయలు

*Sole Distributors:*

త్రివేణి పబ్లిషర్సు

మచిలీపట్టణము - 1 & మదరాసు - 1

# విషయ సూచిక

# అంకితం

సద్గుణశీల, సహనరాశి, ధీరచిత్త,

నా తల్లి పున్నమ్మగారి

పూజ్యస్మృతికి

ప్రేమాంజలితో, పుత్రుడు

లింగం వీరభద్రయ్యా చౌదరి

# ఎందుకు వ్రాసినట్లు?

కొంత డొక్కశుద్ధిఅయినా, జీవితమున కొంతస్థాయిని సంపాదించినా, మొత్తంమీద నేను సామాన్యమానవుని క్రిందనే లెక్క. నేనే శాస్త్రములోను నిష్ణాతుడను కాను, ఏవిషయంలోను నిధిని కాను, ఏ దేశ సేవ, సంఘ సేవ, మానవ సేవ చేయలేదు. ఏగొప్ప పదవిని, ఏ రాజకీయ ప్రతిష్ఠను పొందలేదు. అయితే, "స్వవిషయం" పేరుతో నేనెందుకు నా జీవితచరిత్రను వ్రాశాను, వ్రాయుచున్నాను? ఆలోచిస్తే, ఇది ఉబుసుపోకకు ఆరంభించినట్లున్నది. 1953లో ఉద్యోగ విరమణానంతరం ఈ పల్లెటూరు, పెదసనగల్లుకు, చేరాను. భూములసేద్యం మొదలుపెట్టాను. కొన్ని పాడిపశువులను మేపి వానిపోషణ నారంభించాను. కాని, అలవాటుచొప్పున పుస్తకాలుకొనటం, వానిని తిరగవేయటం తప్పలేదు. ఎంత సేపనిచదువుతాం? విసుగుపుట్టి, ఏదైనా వ్రాయాలనిపించింది. వ్రాయటం నాకు బొత్తిగా క్రొత్తకాదు. 1928లో కొన్ని ఇంగ్లీషు, కొన్ని తెలుగు వ్యాసాలు వ్రాసియుండినాను. ఉద్యోగరీత్యా, 25 సంవత్సరాలు, తెగవ్రాశాను. వ్రాసే చేయి ఊరుకుంటుందా? అందుకని, నా స్వవిషయం ఎందుకు

వ్రాయకూడదని అనిపించింది. మొదలుపెట్టాను. ఎప్పుడు? 1956 సంవత్సరం జనవరి 15-వ తారీఖున. రెండు మూడు పేజీలు వ్రాసి విడిచిపెట్టాను. తిరిగి 6-11-1957 న మొదలు పెట్టి 10-11-1957 వరకు కొన్ని పేజీలు వ్రాశాను. అంతటితో ఆపివేశాను. మరలబుద్ధిపుట్టి, 1-9-60 తారీఖున పునర్ప్రారంభించి, ఒకటి రెండురోజులు కొద్దిగా వ్రాసి విడచి పెట్టాను. తర్వాత 14-7-1964 న ఎత్తుకొని, 16-7-64 వరకు, 9-9-64 నుండి 15-9-64 వరకు వ్రాసి, తిరిగి 9-10-1966 తారీఖున కొన్ని పేజీలు వ్రాశాను. అంతటితో "స్వవిషయం" అను పేరుతో వ్రాయబడింది ఆగిపోయింది.

పై విధముగా తెమలదని భావించి, "నాజీవిత సంఘటనలు, దృశ్యాలు" అని కొత్తగా శీర్షిక పెట్టి, 23—2-1967 తారీఖున వ్రాయటం ప్రారంభించాను. రెండు పేజీల తర్వాత ఆపి, 1-8-1967 నుండి మధ్యమధ్య కాలీల (గాప్సు) తో 13-12-1967 వరకు వ్రాసి దానిని కూడా ఆపివేశాను. పిమ్మట నోట్సు అని కొన్ని వ్రాశాను. ఇవన్నీ అసంపూర్తిగా వుండినందున యలమంచిలి గాంధిజీబాబు అనే కుర్రవానికి చెప్పి 1970-71 లో వ్రాయించాను. ఇది అంతా గందరగోళంగా ఉన్నదనితలంచి, ఒక బంధువుకు ఒక మిత్రునకు చూపి, ఈ మూటిని పునశ్చరణ లేకుండా సమన్వయం చేయండని కోరాను. వారు కొంత కాల మట్టిపెట్టుకొని ఉన్నదున్నట్లే తిరిగి యిచ్చారు. ఇక లాభంలేదని నేనే ఓపికపెట్టి ఒక సూత్రంగా సమన్వయం

చేసి, నాకు తెలిసియున్న శ్రీమతి జి. నాగరత్నం అనే ఉపాధ్యాయినిగారి చేత సాఫీ వ్రాయించాను. ఈ సాఫీని కూడా దిద్ది, తిరిగి రాఘువేంద్రరావు అను యువకుని దగ్గరబెట్టుకొని కడపటి (ఫైనల్) సాఫీ వ్రాయించాను. ఇంత శ్రమతో ఈ మొదటి భాగాన్ని ముద్రింపించి, వెలువరించుచున్నాను. ఈ భాగమున నాజననం నుండి స్వదేశ విద్యాభ్యాసం, విదేశముల విద్య, దానిని పూర్తి చేసుకొని ఇంటికి తిరిగి వచ్చి, 1929 లో ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంటు ఉద్యోగంలో చేరేవరకు చేర్చబడింది. రెండవ భాగంలో నేను ఇన్‌కమ్‌టాక్స్ అసిస్టెంటు కమిషనర్‌గా 1-7-1953 తారీఖున ఉద్యోగ విరమణ చేయు వరకుండును. ఇక మూడవ భాగంలో ఉద్యోగ విరమణ నుండి, ఇప్పటి వరకుండును. రెండో భాగం సాఫీ వ్రాయటం కూడా ఈ నెలాఖరుకు (1973 మార్చి) పూర్తి అవుతుంది. మూడవ భాగం మొదలుపెట్టలేదు. పెట్టగలనో లేదో, 75 సంవత్సరాల వయస్సు నిండవచ్చుచున్న నే నిప్పుడు చెప్పలేను.

పైన చెప్పినట్లు, ఒక ఉబుసుపోకకుమాత్రమేనా ఇదంతా వ్రాసిందని పాఠకులకు సందేహం రావచ్చును. నిజానికి ఉబుసుపోకకే అయితే, ఇన్నిసార్లు ఆపి, తిరిగి తిరిగి కొనసాగించిఉండను. కాబట్టి, ఇంకొకటి ఒప్పుకోవాలి. నేను చెప్పుకోవలసినంత వ్యక్తిత్వం, ఆధిక్యత కలవాడను కాదు. గొప్ప గొప్పవారు వ్రాసుకొన్న జీవితచరిత్రలనే, ఏ కొలదిమంది పాఠకులోతప్ప, వాని ఊసెత్తేవారే లేని

పరిస్థితులు మనవి. కాబట్టి, నాజీవితచరిత్రను కావాలని చదివేవారుండరని నాకు తెలుసును. అయినా, మానవ స్వభావం, ఎవరిడబ్బా వాళ్ళు వాయించుకోవటం పరిపాటి కదా. పైగా, ఇంగ్లండులో ఆరున్నర సంవత్సరాలు నివసించి, ప్రఖ్యాత విశ్వవిద్యాలయం ఆక్స్‌ఫర్డ్‌లో చదువు కొని, లండన్ మహానగరంలో బ్యారిష్టర్ పట్టానుపొంది, జర్మని, ఫ్రాన్సు మొదలైనచోట్ల తిరిగిననేను, కొన్నివింతలు, విశేషాలు చెప్పటాని కవకాశమున్నది. పాఠకులకు కొంత కుతూహలాన్ని, అభిరుచిని కల్గించవచ్చునుకదా, ఎందుకీ అవకాశాన్ని పోగొట్టుకోనాలి అనే అభిప్రాయం కూడా తోడ్పడింది. కొంత ఓపికున్నది, ముద్రణఖర్చులకు డబ్బు న్నది. బంధువులకు, మిత్రులకు, తెలిసినవారికి పంచిపెట్ట డానికి వీలున్నది. సరే, ఎవరేమనుకొన్నా, ముసలివానికి నాకు వచ్చే నామోషిగాని, నష్టంగాని ఏముంటుందని ఈ "స్వవిషయం" వ్రాశాను, వ్రాస్తున్నాను.

ఇందులోని కొన్ని సంఘటనలు, కొన్ని విప్పి చెప్పటాలు, కొన్ని ఒప్పుకోళ్ళు పవిత్రులమనుకొనే కొందరికి అయిష్టతను కల్గించవచ్చును. వారికి నేను క్షమాపణ చెప్పుకోదలచ లేదు. మానవస్వభావ పోకడలను దాచటం అసత్యం చెప్పటమే. అసత్యం చెప్పటంకంటె, తన జీవితాన్ని గురించి వ్రాసుకొనక పోవటమే ఉత్తమం. ఇంతటితో ముగిస్తున్నాను.

పెదసనగల్లు
కృష్ణాజిల్లా

లింగం వీరభద్రయ్యచౌదరి
18-3-1973



# నా జననం

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరు గ్రామంలో నా జననం. అది నా మాతామహుని గ్రామం. ఏ కారణం వల్లనో, నేను పుట్టిన ఇల్లు మా తాతగారు త్రిపురనేని వెంకటాద్రి గారిది కాదు. ఆయనకు ఆరుగురు కూతుళ్లు, ఒక్క కొడుకూను. మా తల్లి అందరికంటె పెద్దది. ఆమె పేరు పున్నమ్మ. ఆమె తరువాతామె పేరు చిన పున్నమ్మ. ఆమె భర్తదికూడ అంగలూరే. ఆమెగారింటిలో నా జననమట. నేనెప్పుడు పుట్టినది సరిగా ఎవరూ చెప్పలేదు. మా తల్లి తల్లి లక్ష్మమ్మ, నేను తొలిఏకాదశి ఇంకా 5 రోజులుందనగనో, ఆరురోజు లుందనగనో తెల్లవారుఝామునో దానికి దగ్గరగా పుట్టినట్లు చెప్పుచూ వచ్చింది. నేను 1913-వ సం॥ జూన్‌లో బందరు నోబుల్ కళాశాల కనుబంధంగా నుండిన హైస్కూలులో, 3-వ ఫారములో చేరునప్పుడు, లెక్కవేసి 1898 జూలై 1-వ తారీఖు నా జన్మకాలమని అక్కడి పెద్దలు నిర్ణయించారు. తరువాత జ్యోతిషులు, ఆ సంవత్సరం జూను 24, 25 మధ్య అని నిర్ణయించారు. నాడీ గ్రంథముల ప్రకారం అదే కాలమన్నారు. కొద్దిరోజుల భేదముతో, నా జనన కాలమదేయని తోచుచున్నది. విద్యాసంస్థల పుస్తకములలో నమోదు చేసినట్లు, ది 1-7-1898 అనియే నా ఉద్యోగ పత్రాలలో పేర్కొనబడింది.

నా జన్మ విషయాలు నా కంతగా ఎవరూ చెప్పలేదు. మాది రైతు కుటుంబం. నా మాతామహుని కుటుంబం చదువుకొనినదైనా, వారిదికూడా రైతుకుటుంబమే. ఆ రోజుల్లో ఎంత ఉన్న రైతుకుటుంబమైనా, జాతకాలు వ్రాయించుకోవటం గాని, పుట్టిన తేదీలు వ్రాసి భద్రపరచుకొనుటగాని అలవాటులేదు. గ్రామాల్లో మునసబు, కరణాలు జనన మరణాల నెప్పుడో ఒకప్పుడు రిజిస్టరులో నమోదు చేసికొనేవాళ్లు. ఆ కారణాన, ఆ రికార్డులు వెదికించటానికి నేను ప్రయత్నించలేదు.

రైతుకుటుంబాల్లో పుట్టిన పిల్లల విషయములో, రాజ భవనాల్లో పుట్టిన పిల్లలను గురించినట్లు, చెప్పుకో తగ్గ గాథలేమీ ఉండవు. మా ముత్తవ తల్లి, మా పినతల్లి నేను పుట్టినప్పుడు బొద్దుగా, ఎర్రగా యుండేవాడనని చెప్పుతూ వచ్చేవారు. మా తల్లి గర్భవతిగా నున్నప్పుడు మాంచి పండిన బంగినపల్లి మామిడిపండ్లు తిన్నదట. వానిరంగు నాకు కొంత సోకిందని వారి అభిప్రాయం కాబోలు. మా పినతల్లి చిన పున్నమ్మ భర్త, దుగ్గిరాల పెద బసవయ్యగారు, మాటకారి. చిలువలు, పలవలుగా వర్ణించే శక్తి కలవారు. ఆయనగారు అనేకమార్లు నేను మిక్కిలి పసిబాలుడనై వున్న కాలంలో ఒక సంఘటన జరిగిందని చెప్పేవారు. ఆ ఊరి కోమటి పిచ్చిరత్తమ్మ అనే ఆమెకు పిచ్చి ముదిరి, ఊరి వెంట విచ్చల విడిగా తిరుగుతూఉండేదట. ఒకనాడు తలుపు తెరచి వుండగా, నేను పడుకొని వున్న గదిలోపలికి వచ్చి, నన్ను చేతుల్లోకి తీసుకొని లాలించుచుండెనట. అంతలో మా పిన్ని వచ్చి భయపడి కేకలువేయగా, సమీపములో వున్న మా పినతండ్రి పెద బసవయ్యగారు పరుగెత్తికొనివచ్చి కర్ర చూపించి బెదిరించి ఆమెను పారద్రోలినారట. ఏ గుణములో నున్నదో, ఆ రత్తమ్మ నన్నక్కడ మంచముమీద వేసి వెళ్ళిపోయినదట. నాకు ఆయువు లేకపోయినట్లైతే, పురిటిలోనే సంధిగొట్టినట్లైపోయే దట. దీనిని విశేషముగా ఎంచుకొనిన పెద బసవయ్యగారు, నేను గజెటెడ్ ఆఫీసరుగా 1929 లో ఇన్కమ్టాక్సు డిపార్ట్మెంటులో చేరకముందే, చనిపోయారు. లేకపోతే, నేనట్లు ఆనాడు పిచ్చి రత్తమ్మ వల్ల ఏ హాని లేకుండా విడువబడటం,



కీ. శే. శ్రీ లింగం వెంకటరత్నంగారు

( గ్రంథకర్త తండ్రి )

సర్వేశ్వరుడు నన్ను గొప్ప పదవులకుద్దేశించి వుండబట్టే, అని ప్రచారం చేసేవారు.

మా పూర్వులది, సుప్రసిద్ధ పదకర్త క్షేత్రయ్య జనించిన గ్రామం అని చెప్పబడు కృష్ణాజిల్లా, దివితాలూకా, మొవ్వట. దీనికి చారిత్రక సాక్ష్యాధారాలున్నట్లు కన్పడవు. ఇది ఎట్లున్నా, మా ముత్తాత, లింగం పాపినీడుగారి తండ్రి వీరన్న చిన్నతనములో, చల్లపల్లి ఎస్టేటు జమీందారుగారితో భూమి విషయమై తగాదాపడి, కుటుంబంతో ఆ గ్రామం విడిచిపెట్టి గుడివాడ తాలూకా బొమ్ములూరు గ్రామం చేరినాడుట. వీరన్నకు పాపినీడు ఒక్కడే కుమారుడు; కుమార్తె లున్నట్లు లేరు. పాపినీడుకు ఇద్దరు కొడుకులు: మా తాత వీరభద్రుడు, మా పిన తాత వెంకటరత్నం. ఏడుగురు కుమార్తెలు—మహాలక్ష్మమ్మ, వెంకట చాయమ్మ, శేషమ్మ, జలగమ్మ, కౌసల్యామ్మ, బుచ్చమ్మ, అప్పమ్మ. మా తాత వీరభద్రునకు మా తండ్రితో సహా ఏడుగురు కుమాళ్ళు, కూతుళ్లు లేరు. మా తండ్రి వెంకటరత్నం కడగొట్టువాడు. మా తండ్రి పిన్నవయస్సులోనే మా తాత వీరభద్రుడు నల్భైఏళ్లు నిండీ నిండకముందే చనిపోయాడట. మా పెద పెద్దయ్య వెంకటప్పయ్యగారు ఎత్తు, లావు, దార్ఢ్యము గల తన తమ్ముళ్లవలె గాక, కురచగాను, బక్కగాను ఉండేవారు. కాని మంచి మాటకారి, తెలివితేటలుగల మనిషి. ఆయన భార్య, మా పెద పెద్దమ్మ బుల్లెమ్మ, మిక్కిలి విచక్షణ, విజ్ఞతగలది. వెంకటప్పయ్య బుల్లెమ్మగార్లయందు తమ్ములు, తోడికోడళ్లు మిక్కిలి పూజ్యభావముతో మెలగేవారు. వారికి సంతానము లేనందున మొదటి తమ్ముడు నాగభూషణంగారి ప్రథమపుత్రుడు వెంకట సుబ్బయ్యగారిని ఆ దంపతులు దగ్గరకు దీసి పెంచుకొన్నారు. నాగభూషణంగారు మిక్కిలి బలశాలి యని వాడుక. నా చిన్నతనములోనే ఆయన చనిపోవుటచేత నా కంతగా గుర్తులేదు. ఒకప్పుడు జ్వరముతో ఆయన ఇంటిలో పడుకొని వుండగా, గొడ్లకాపరి పరుగెత్తికొనివచ్చి పశువులదొడ్డి దగ్గర ఊబిగుంటలో పెద్ద ఎద్దొకటి కాలుజారి పడి, ఎదురొమ్ము వరకు కూరుకొనిపోయి బైటికి రాలేక పోతున్నదని చెప్పినాడు,

అప్పుడు మధ్యాహ్నము. పనుల కాలముగుట చేత, చుట్టు ప్రక్కల ఎవరూ లేరట. వెంటనే నాగభూషణంగారు లేచి, కాడి ఒకటి తెప్పించి, బండిమోకు దానికి, ఎద్దుకు కట్టి, కాడి బుజాన వేసికొని మోకాళ్లు తండావేసి, ఎద్దును బయటకు లాగివేసినారట. చాలా సంవత్సరాల తర్వాత నే నొక ముసలమ్మను వారి బలమును గురించి అడిగినాను. మనిషి మరీ అంత లావు, పొడవు కాదు. కాని, ఆయన కవయవ పొందిక తీర్చి దిద్దిన ట్లుండేది, అందువలన మిక్కిలి బలమైన పనులు చేయగలిగేవాడు అని ఆమె చెప్పింది. ఇది విన్నప్పుడు, ఒకప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుని శరీరదార్ఢ్యమును గురించి చెప్పుచు, విజయుడు అవయవ సౌష్ఠవము గలవాడు, ఒక్క తొడలు మాత్రము ఉండవలసిన లావుకంటె ఒక్క పిసరు లావు ఎక్కువ, అందువలన అతని శారీరక శక్తి కొంచెము కుంటుబడిందని చెప్పినాడట. మా రెండవ పెద నాయనగారి శక్తి వారి భారీ విగ్రహము వలనగాక, అంగముల సరితూకాన్నిబట్టి యుంటుంది. వారికి నలుగురు కుమాళ్లు. పెద్దకుమారుడు బుల్లిసుబ్బయ్య అనే వెంకటసుబ్బయ్యగారిని అన్న వెంకటప్పయ్యగారు పెంచుకొన్నారని పైన వ్రాశాను. మిగతా ముగ్గురు, వెంకటకృష్ణయ్య, సుందరరామయ్య, దూర్వాసులుగార్లు. కూతుళ్లు లేరు. మూడవ వారు ఆదినారాయణగారు. వారికి ముగ్గురు కుమాళ్ళు— వీరభద్రుడు, అంజయ్య, సత్యనారాయణగార్లు. శోభనాద్రమ్మ, మాణిక్యమ్మ, నాగరత్నమ్మ, అన్నపూర్ణమ్మ, సీతామహాలక్ష్మమ్మ అను ఐదుగురు కుమార్తెలు. వీరు వీరి పెద్దన్నగారివలె బక్క పలుచని మనిషి. కాని, స్ఫురద్రూపి. అన్నకంటె ఎక్కువ పొడవు. ఈయన వ్యవసాయంలో మిక్కిలి యావగలవాడని, నౌకరులు సరిగా పనిచేస్తున్నారో లేదో పొంచి చూచి తెలిసికొనే వారని, ఏ ప్రక్కనుండి వచ్చి వెంటపడతాడో అని పాలేళ్లు మెలకువతో నుండేవారని వాడుక. 80 సంవత్సరాలు పైగా జీవించినారు. నాల్గవవారు వెంకటశివుడుగారు. వీరు సుఖభోగి. మనిషి ఎర్రగా బొద్దుగా నాజూకుగా, బాగుగా ముస్తాబై యుండేవారు. గుర్రాలు మొదలైన వాహనాలమీద

సరదా. మొఖాసాదారులు, జమీందారులు మొదలైన భూస్వాములతో మైత్రి. ఈయన కొక్కే ఒక కుమారుడు, సీతారామాంజ నేయులు; ఒక కుమార్తె సరస్వతమ్మ. ఆమె బాల్యములోనే భర్తృహీనయై నిస్సంతుగా చనిపోయింది. సీతారామాంజ నేయులు నాకంటె 10 మాసాలు పెద్ద. కోళ్లపందెము లన్నా, నాటకాలన్నా మిక్కిలి అభిమానము. కోళ్లపందెముల్లో, పంగిడి గూడెం వగైరా జమీందారులతో పోటీ. 50 ఏళ్ళు నిండీ నిండకముందే చనిపోయాడు. ఏకైక పుత్రునకు తండ్రి వెంకట శివుడుగారి పేరు పెట్టుకొన్నాడు. అయిదవవారు రామశేషయ్య గారు. వీ రన్నదమ్ము లందరిలోను తెలివైనవారు. ఎక్కువ ధైర్యసాహసములు గలవారు. మొట్టమొదట చదువు తక్కువ. ఒకప్పుడు పురాణము చదువుమని ఎవరో కోరగా, చక్కగా చదువలేక పోయినారట. అక్కడున్నవారు ఎగతాళి చేసినారట. దానిమీదట, పంతంతో మేనమామల యూరు పురుషోత్తమపట్నం వెళ్ళి అక్కడ బాగుగా చదువుకొని భారతం, భాగవతం, రామాయణం మొదలైన పురాణాలకు విపులముగా అర్థము చెప్పకల శక్తిని సంపాదించుకొన్నారు. పైగా కొంత సంస్కృత భాషాజ్ఞానముకూడా కల్గించుకొన్నారు. పెండ్లిండ్లు జరుగునప్పుడు, మంత్రములను పురోహితులు సరిగా చెప్పుచున్నారో లేదో, వివాహ తంతును సవ్యముగా జరుపుచున్నారో లేదో తెలిసికొనే శక్తిని పొందారు. అందువలన కార్యక్రమము జరుపువారు, వీరు పెండ్లిపందిరిలో నున్నప్పుడు బహు జాగ్రత్తగా మెలగేవారు. వీరు కుటుంబ పంపిణీలో తన వంతుకు వచ్చిన 100 ఎకరాల మాగాణీని 400 ఎకరాల వరకు పెంచారు. పైగా రామన్న గూడెం అనే 900 ఎకరాలు గల మొఖాసా గ్రామాన్ని సంపాదించారు. వీరి కిద్దరు కుమారులు: నాగభూషణం, వెంకట్రామయ్య గార్లు, ఒక కుమార్తె సరస్వతమ్మగారు. సమర్థవంతుడగు యువకుడుగా పెంపొందిన వెంకట్రామయ్యగారు పిన్నవయస్సు లోనే సంతానవిహీనంగా చనిపోవుటవలన, మిగిలిన నాగభూషణం గారు సమర్థుడు కాకపోవుటచేతను, వీరు చనిపోయిన కొలది సంవత్సరములలోనే, వారు సంపాదించిన ఆస్తిలో చాలాభాగము

నష్టపడిపోయింది. ఆరవవారు వెంకటసుబ్బయ్యగారు, భారీ విగ్రహం కలవారు, వ్యవసాయదక్షుడు. పిన్నవయస్సులోనే మరణించారు. వీరికి నల్గురు కుమాళ్లు: వీరభద్రయ్య, నారాయణ రావు, నాగభూషణం, వెంకటకృష్ణయ్యగార్లు, ఒక కుమార్తె శ్రీమతి లక్ష్మీశ్వరమ్మ. ఏడవవారు, మా తండ్రి వెంకటరత్నం గారు. ఈయన కృష్ణవర్ణుడు, ఎత్తు 5 అడుగుల 8 అంగుళాల వర కుండేవారు. సరిపడ్డ లావు, తిన్ననైన నెన్నుదురు, కోటేరువంటి ముక్కు, వాటమైన బొద్దుమీసం, తెల్లని తిన్నని పండ్లు, కొంత ముఖ వర్చస్సు కల్గివుండేవారు. వస్త్రధారణ, గాంభీర్యం, హుందాతనం, సంపన్న వ్యవసాయదారునిగా తోపించేవి. పకాలున నవ్వే స్వభావం కలవారు. ఆ నవ్వు పండువెన్నెల విరిసినట్లుండేది. సుజనత్వం, దయార్ద్ర హృదయం, సత్యసంధత వారి సుగుణాలు. వారి దుర్గుణం ఒక్కటే: వారు ముక్కోపి. తట్టుకోలేక తీవ్రమైన దుర్భాష నుపయోగించేవారు. కాని వారికోపము, ఆ మరు నిముషమే అంతర్ధానమయ్యేది. నౌకర్లను బూతులు తిట్టినా, తక్షణమే ఇంకొక బస్తా ధాన్యము కొల్చేవారు. వర్షించేముందు గర్జించే మేఘమువంటి మనస్తత్వం. మిక్కిలి నిజాయితీమనిషి. అబద్ధం చెప్పటంగాని, మోసపుచ్చటంగాని, అన్యాయం చేయటం గాని ఆయన స్వభావానికి పూర్తి వ్యతిరేకం. ఆయన దృష్టిలో చట్టనిబంధనలు, దగాకోరులకుగాని న్యాయబుద్ధి కలవారికి గావని. ప్రామిసరి నోటులు, జ్ఞాపకార్థమునకేగాని, వాయిదా తప్పితే బాకీ ఎగవేయటానికి గావని ఆయన గట్టి నమ్మకం. అందువలన ఎవరైన వచ్చి, వాయిదా ప్రస్తావనచేస్తే బాధపడేవారు. నాకు తెలిసినంతవరకు, రెండు కేసులలో వాయిదా పోయినవారు, గాభరాపడి పరుగెత్తికొనిరాగా వెంటనే తిరిగి ప్రోనోటులు వ్రాసి యిచ్చారు. నిష్కల్మషహృదయం, జాలిగుండె, పాపభీతి, న్యాయ బుద్ధి, ఇతరులను ఆదుకొనే స్వభావం, బంధుప్రేమ, డాంబికము లేని అమాయకత్వం కలవారు. పోతే, వారి ఆరోగ్యం కొంత కాలమైన తర్వాత దెబ్బతిన్నది. మిక్కిలి వేగముగా నడిచేవారు. నా చిన్నతనములో మా పాలేళ్లు ఆయన వస్తూవుంటే రైలు ఇంజను వస్తున్నదనేవారు. తన పిన్నవయస్సులో, మా ఊరికి

25 మైళ్ళ దూరానవున్న బెజవాడకు తెల్లవారుఝామున కాలి నడకను బైలుదేరి వెళ్లి ఆ సాయంత్రానికే ఇంటికి తిరిగి వచ్చేవారట. అటువంటి ప్రయాణాలు కొన్ని చేసిన తర్వాత పెద్ద జబ్బుపడ్డారు. ఆ దెబ్బనుండి పూర్తిగా కోలుకొననేలేదు. వారికి మూడు వివాహాలు. మొదటి భార్య, గుడివాడ తాలూకా పెయ్యేరు గ్రామంలోని దుక్కిపాటి జగన్నాథంగారి కుమార్తె వెంకట శేషమ్మగారు. ఆమె మిక్కిలి చక్కనిదని వాడుక. మేలైన నిమ్మపండు రంగువంటి శరీరఛాయ, నిగనిగలాడే మిక్కిలి బారైన తలవెంద్రుకలు, ఆమె అంగసౌష్ఠవమును ముఖవర్చస్సును ఇనుమడించినవట. మా నాయనగారు నలుపగుటచేత, ఆ వివాహ సమయమున కాకిముక్కుకు దొండపండు కట్టినట్లున్నదని కొంద రన్నారట. ఆమెగారికి ఒక స్త్రీ సంతానము కలిగి పురిటిలోనే చనిపోయింది. తరువాత మా తల్లి పున్నమ్మగారిని వివాహ మాడినారు. మొదటి వివాహమునకు పూర్వమే మా తల్లి నిచ్చెదమని, మా తాతగారు కబురుపంపగా పెయ్యేరు అమ్మాయి ఎక్కువ అందమైనదని అటు వెళ్ళినారట. తరువాత పెయ్యేరులో చేసికొనటం, ఆమె మరణించటం, అంతా ఒక సంవత్సరములోనే జరిగిపోయింది. తిరిగి మా అమ్మనే వివాహము చేసికొన్నారు. ఈ అంగలూరు సంబంధం, మా కుటుంబానికి క్రొత్తగాదు. మా మూడవ పెదతండ్రి ఆదినారాయణగారి భార్య కాంతమ్మగారు, మా తల్లి పెదతండ్రి కుమార్తెయే. మా తల్లిగారు స్ఫురద్రూపి కాదుగాని, పచ్చగా బొద్దుగా ఉండేవారు. వెడల్పైన నుదురు, కొంచెం మందమైన బుగ్గలు, సమమైన పెదవులు, తగిన ఎత్తు, లావు ఉండి పొన్నచెట్టువలె ఉండేవారు. మిక్కిలి సాధు స్వభావం గలవారు. సహనం జాస్తి. మా నాయనగారికి రెండవ సంబంధమగుటచేతను, అంతకుముందే అన్నదమ్ములు విడిపోయి, ఎవరికివారు క్రొత్త ఇళ్లు కట్టుకొని వేరేకాపురాలు పెట్టుకొని యుండుటచేతను, వేరే సాయములేకపోవుటచేతను, పెండ్లి అయిన వెంటనే మా అమ్మ కాపురానికి రావలసివచ్చింది. చిన్నవయస్సు గుటచేత, మా తల్లివెంట ఆమె మూడో చెల్లెలు మా యింటి లోనే ఉండినట్లున్నది. మా తల్లిగారికి తొమ్మండుగురు పురుష

సంతానం, ఇద్దరు స్త్రీ సంతానం కలిగింది. నేను రెండో సంతానం. (నేను మూడో సంతానం అని, నా కంటె పెద్దవాడు పురిటిలోనే చనిపోయాడని చెప్పినట్లు గుర్తు) నేను నెలల పసి వాడనుగా నుండగా, అతిసారంవల్ల నీళ్ల విరేచనాలు జాస్తిగా అగుచుండేవట. మా పిన్ని శేషమ్మ నాకు ఉపచారాలుచేస్తూ ఉండేదట. ఏడుగురు మగపిల్లలు పురిటిలోనో, కొద్దికాలం పెరిగియో చనిపోగా, ఇద్దరం, నేను, నా తమ్ముడు సత్యనారాయణ, మిగిలినాము. స్త్రీ సంతానం ఇద్దరిలో, పెద్దామె శేషారత్నం నాకంటె పెద్దది. ఆమె 20 వ ఏట నిస్సంతుగా చనిపోయింది. ఆమె భర్త అంగలూరు వాస్తవ్యులు దుగ్గిరాల రామశాస్త్రులుగారు. రెండవ ఆమె ద్రౌపదమ్మ మా ఇద్దరికంటె చిన్నది. ఆమె భర్త మా ఊరు సమీప గ్రామం సిద్ధాంతం నివాసి నిమ్మగడ్డ దుర్గా నాగేశ్వరుడుగారు. వారికి నలుగురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు. మా తల్లి తన 32, 33 ఏటనే పురిటిలో మరణించింది. అప్పటికి మా చెల్లెలు ద్రౌపదమ్మకు అయిదేళ్లు, నాకు పద మూడున్నర సంవత్సరాలు, నా తమ్మునికి 12 సంవత్సరాలు.

మా లింగంకుటుంబం ప్రస్తావన ముగింపుకు ముందు, మా పినతాత వెంకటరత్నంగారి సంతానాన్ని పేర్కొనటం సముచితం. మా పినతాతగారికి మూడు వివాహాలు. మొదటి భార్యకు వెంకటసుబ్బయ్య, వెంకటశివుడు అనే కుమాళ్లు, శేషమ్మ, ఆదెమ్మ, సుబ్బమ్మ అను కుమార్తెలు కల్గినారు. ఈ భార్య అంగలూరు వాస్తవ్యులు తిపిర్నేని జగ్గయ్యగారి కుమార్తె పుల్లమ్మ గారు. రెండో భార్య, అడ్డాడగ్రామం వీరపనేని సుబ్బన్నగారి కుమార్తె నరసమ్మగారు. ఈమె నిస్సంతుగా చనిపోయింది. మూడవభార్య ఎలమర్రు గ్రామం శిరిపురపు మల్లన్నగారి కుమార్తె మహాలక్ష్మమ్మగారు. ఈమెకు ముగ్గురు కుమారులు: నాగభూషణం, పాపినీడు, వీరభద్రయ్య. కూతుళ్ళు లేరు.

ఇక్కడ మా పినతాతగారికి, మానాయనగారికి సామ్యం కన్పడుచున్నది. ఇద్దరి పేర్లు వెంకటరత్నం. ఇద్దరికీ మూడు వివాహాలు. మా తండ్రిగారి అన్నలు ఆరుగురికి ద్వితీయం లేదు. మా పినతాతకుమాళ్ళు ఐదుగురిలో రెండోవారికి, మూడోవారికి

అనగా వెంకట శివుడు, నాగభూషణంగార్లు మాత్రం రెండోసారి వివాహం చేసికోవలసి వచ్చింది. అయితే, పినతండ్రి వెంకటరత్నం గారికి, ఆయన అన్నకొడుకు వెంకటరత్నంగారికి సామ్యం పేరులోను, భార్యలసంఖ్యలోను మాత్రమే.

ఈ భాగం దాటిపోవుటకుపూర్వం అప్పటి గ్రామ పెత్తనం, ఇతర పరిస్థితులను గురించి రెండుముక్కలు చెప్పటం బాగుంటుం దని తోస్తున్నది. మా ముత్తాత తండ్రి వీరన్న మొవ్వ నుండి బొమ్మ్మలూరుకు వలసవచ్చినప్పుడు, గ్రామంలో ఏ కుటుంబా లుండినవో, ఎవరిది పెద్దరికమో తెలియదు. కాని ముత్తాత పాపినీడు గారి కాలానికి గుత్తా కుటుంబం, కోగంటి కుటుంబం పాదుకొని యుండినట్లు కన్పడుచున్నవి. పాపినీడు గారి ఏడుగురు కూతుళ్లలో ఇద్దరు కూతుళ్ళను ఒకరిని గుత్తా సుబ్బన్నగారికి, ఇంకొక కూతురును కోగంటి పురుషోత్తంగారి కిచ్చి యుండిరి. ఈ గ్రామ బంధుత్వాలవల్ల క్రొత్తగా చేరిన లింగం కుటుంబం తన చేతులను బలపర్చుకొని అక్కడ స్థిరపడిపోయినది. నా చిన్నతనం వినికిడి, కోగంటి పురుషోత్తంగారి కుటుంబం మా తాత లకు ఎక్కువ తోడునీడగా ఉండేదని. బొమ్మ్మలూరులో నే నెరిగి యున్నప్పటికి వర్ఘ్యావారు, అన్నేవారు వగైరా కుటుంబాలున్నా, గుత్తావారు, కోగంటివారే, మా కుటుంబంగాక, ఎన్నికలలో ఉండేవారు. సంఖ్యాబలం కోగంటి వారికంటె గుత్తావారిదే ఎక్కువ. అయితే, నా చిన్నతనంనాటికి లింగం కుటుంబానికి గ్రామంలో ఎదురులేదు. వారి మాటయే శాసనం, వారి పెత్తనం, పెద్దరికమే చలామణి. గ్రామమునిసిఫ్ గిరి లింగంపేరుతోనున్న ఇంకొక కుటుంబానికి కట్టబెట్టబడినా, బొమ్మ్మలూరనగా లింగం వీరభద్రుడు, వెంకటరత్నంగార్ల కుటుంబాలకు చెందిన బొమ్మ్మలూ రనియే అర్థం. బొమ్మ్మలూరు అంటే లింగంవారి బొమ్మ్మలూరా అనిన్ని, లింగంవారంటే బొమ్మ్మలూరు లింగంవారా అనిన్ని తెలుసుకొనే ప్రశ్న.

మా తాత వీరభద్రుడుగారు ఎఱ్ఱగా, పొట్టిగా, లావుగా, గుమ్మడిపండువలె ఉండేవారట. తరుచు ప్రయాణంచేస్తూ

ఉండేవారట గుర్రంమీద. ఎక్కడకైనా వెళ్ళుచూ, దారిలో సరిగా వ్యవసాయంచేయక, పాడుబడియున్న ట్లుండిన భూమిని చూస్తే, ఎవరి దని అడిగి, ఏ అగ్రహారకునిదో, వ్యవసాయం చేయలేని ఏ బ్రాహ్మణ, వైశ్యునిదో, వ్యవసాయవృత్తిగాని ఏ యింకొకనిదో అని తెలిసికొని, సరాసరి ఆ యింటికి వెళ్ళి బేరమాడి ఏ స్వల్ప ధరకో కొనేవారట. ఆ విధంగా వారు చాలా గ్రామాల్లో భూములను సంపాదించారు. మా తండ్రులు, మా పినతాత కుమాళ్లు, తలా వంద ఎకరాలు పంచుకొన్నారట. పంచుకొనని భూములు, స్థలాలు అక్కడక్కడ ఇప్పటికిని మిగిలిపోయి యున్నవి. ఒకనాడు, 80 ఏండ్ల వృద్ధు మా మూడో పెదతండ్రి ఆదినారాయణగారు, "మన జాయంటు భూములు, నూజివీడు జమీందారుల కులదేవత స్థానమగు శోభనాచల ప్రాంతంలో పంచుకోకుండా ఉండి పోయాయి. కొంతభాగం మన్యం కాగా, మిగతాది పరాక్రాంత మయిం" దన్నారు. నేను 1940-43 లో, బెజవాడ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా ఉద్యోగం చేస్తుండినప్పుడు, కేసుల విచారణకొరకు గుడివాడలో మకాం చేస్తుండేవాడను. అప్పుడు మా పినతాత కుమారుడు నాగభూషణంగారి కుమాళ్లు, మా తండ్రుల కుమాళ్లం గుడివాడలోను, సరిహద్దు మందపాటి అగ్రహారంలోను పంచుకోకుండా ఉండిపోయిన పాటి దిబ్బలను, స్థలాలను, వానిమీద పాక వేసుకొని యుండిన వారిని తొలగించి స్వాధీనం చేసుకోవా లను కొన్నాం. మాలో మాకు ఒకరితో నొకరు కలసిరాక, ఆ ప్రయత్నం సఫలం కాలేదు. ఇప్పుడు ఆ దిబ్బలు, స్థలాలు మా చేతులు దాటిపోయాయి.

మా పినతాత వెంకటరత్నంగారు అన్నవలెగాక చామన చాయగా, బక్కపల్చగా, సామాన్య పొడవుతో ఉండేవారని. ముఖం మీద స్ఫోటకంమచ్చ లుండేవని నాకు గుర్తు. వారు నా కైదారు సంవత్సరాలు వచ్చేవరకు బ్రతికియుండినారు. ఆయన మిక్కిలి చలాకీ పురుషుడు. గుర్రపుస్వారీ ఇష్టం. వ్యవసాయ దక్షుడు. మోటుతనంకూడా ఉండే దని, కోపం వస్తే బూతులు

తిట్టేవా రని, సామాన్యంగా వారి ఎదుటబడుట కితరులు భయపడే వా రని చెప్పుతుండేవారు. ఎంత ఘటికు లైనా, వారి కోపానికి జడిసేవారట. ప్రక్క-గ్రామం సిద్ధాంతం కాపురస్థుడు అద్దుమిల్లి సుబ్రహ్మణ్యంగారు క్రిందిస్థాయిలో జీవితాన్ని ఆరంభించినా, ఆబ్కారీ మొదలైన వ్యాపారాలలో ధనికుడై పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. వారు ఆజానుబాహువు, స్ఫురద్రూపి. విశాల మైన ఫాలభాగంలో మనోహరంగా పంగనామాలుపెట్టుకొని శ్రీ వైష్ణవుడుగా తోచేవారు. అట్టి వారు సిద్ధాంతంనుండి మా ఊరి మీదుగా గుడివాడకు వెళ్ళేటప్పుడు, రాజవీధిగుండా గాక, చుట్టు తిరిగి మాలపల్లి మీదుగా వెళ్ళేవారట. ఎవ్వరైన ఎదురై, "ఏమండి, సుబ్రహ్మణ్యంగారు, మాలపల్లిమీదుగా వెళ్ళుచున్నా రేమి" టని అడిగితే, "ఆ దుర్మార్గుడు వెంకటరత్నం తన మేడ అరుగుమీద కూర్చునిఉంటాడు. కన్పడితే దుర్భాష లాడతాడు" అని చెప్పేవారట. వెంకటరత్నంగా రంత ప్రచండుడు. కాలిలో ముల్లు విరిగితే, ఎన్నడూ మంగలిచేత తీయించుకొనేవాడు కాదట. ఒక బూతు తిట్టి, పాదాన్ని నేలకు రాచి, ఏమాత్రం పట్టించుకొనేవాడు కాదట.

నిజానికి మా కుటుంబం, మోటు కుటుంబం. వీరన్న, పాపినీడుగార్లు చదువుకొనియుండినారని తలంచను. వీరన్నగారు బొమ్మలూరుకు వలసవెళ్ళినప్పుడు ఇంచుమించుగా కట్టుబట్టలతో వెళ్ళివుంటాడు. కాయకష్టంమీద భూవసతులు వగైరా సంపాదించుకొని యుంటాడు. ఆ రోజుల్లో భూమి అంతగా ఫలించేది కాదు. వర్షాలు అధికమట. పల్లపుభూములు ముంపుకు లోనయ్యేవి. మెరకభూములు తగిన ఎరువులులేక, దుక్కి సరిగాపడక, బీదస్థితిలోనుండి, సరిగా ఫలించేవికావు. పైగా అధికవర్షాలవల్ల, మెట్టదుక్కి వీలుపడేదికాదు. దమ్ముచేయవలసి వచ్చేది. మా పెదతండ్రి కుమారుడు వెంకట సుబ్బయ్యగా రొక సారి చెప్పాడు. ఆయన చిన్నతనంలో, భూములను నిరంతరం దమ్ముచేస్తూ ఉండటంవల్ల కాళ్లు తెగ పాచిపోయేవట. రాత్రిళ్ళు కరధూపం అనగా దీపంకొడి మసిని పాదాలకు పట్టించుకొనే వారట. భూమి కొంత మెరకయినా, ములకవచ్చి ఊడ్చిననాడు

కొట్టుకుపోదని నమ్మకముండేదికాదట. ఈ పరిస్థితుల్లో వీరన్న గారు, లంబాడీ ఎడ్లను సంపాదించి, వానిమీద బియ్యం వగైరా సరుకుల గంతలను వేసికొని హైదరాబాద్ వరకు కిరాయి వెళ్ళే వారట. వీరన్నగారు మా తాతల తాత అని పైన చెప్పియే యున్నాను. మా పెద తండ్రి వెంకటప్పయ్యగారి చిన్నతనంలో కూడా హైదరాబాద్‌కు కమాన్ అనగా బండ్లలో ధాన్యాదులు వేసుకొని చుట్టుప్రక్క గ్రామాలవారితో కలసి పెద్ద బిడారు (కారవాన్) గా హైదరాబాద్ వరకు వెళ్ళేవారట. నా చిన్న తనంలో మా తండ్రి వగైరాలు, మేము పండించిన ధాన్యాన్ని మా స్వంత బండ్లమీద బందరు తీసికొనివెళ్ళి అక్కడ రెండు మూడు రోజులు పడిగాపు లుండి అమ్ముకొని వచ్చేవారు. ఈ విధముగా కాయకష్టంచేసిన పక్కా రైతు కుటుంబం మాది. విద్యాగంధం తక్కువ, కార్యదీక్ష, దక్షత ఎక్కువ. మా తండ్రి గారి చిన్నతనంలో 20 నాగళ్ళవరకు కట్టేవారట. నౌకరులు చాలామంది ఉండేవారు. ఇప్పటికంటె రెట్టింపు కష్టపడితేనేగాని పనులు జరిగేవికావు. భారీ వ్యవసాయం అగుటవల్ల ఒకరో, ఇద్దరో తప్ప మగవాళ్ళంతా వళ్ళు వంచి పని చేయవలసినదే. ఏడుగురులో మా తండ్రి కడపటివాడగుటవలన, అడ్డమైన వెట్టి చాకిరి ఆయనమీద పడేదట. తెల్లవారుజామునే లేచి, నౌకర్లతో బాటు పశువుల చావిళ్ళు శుభ్రంచేసి, పాలు పితుకుటలోను, మంచి నీళ్ళు తెచ్చుటలోను తోడ్పడి, వండిన అన్నాలు నౌకర్లతో బాటు, కావిడితో పొలం మోసుకొని వెళ్ళేవారట. ఆ రోజుల్లో, అధమం వత్తిడి పనుల సమయంలోనైనా, నౌకర్లకు యజమానియే అన్నం పెడుతూ ఉండేవాడు. ఏడుగురు అన్నదమ్ములు కలిసి పెద్దకుటుంబం, భారీ వ్యవసాయం. అందువల్ల ఎక్కువమంది నౌకర్లు. కాబట్టి ఎక్కువ అన్నం కావిళ్ళు. ఇంట్లో ఆడంగు లందరికి చేతినిండా పని. ఏ పచ్చడో, పులుసో అయినా, కుండలు కావలసిందే. అయితే పాడి పుష్కలంగా ఉండేదికాబట్టి, పెరుగు, మజ్జిగ కావలసినంత. మా ముత్తాతకాలంలో మొక్క జొన్న సంగడి, గుమ్మడికాయ కూర, గడ్డకట్టిన పెరుగట. మా

తాతలకాలంలో మొక్కజొన్న సంగడి కొంతవరకైనా ఉండి యుంటుంది. నాకు ఊహ వచ్చినప్పటికి అది కంటబడలేదు. మా కుటుంబానికి తుమ్మలపల్లి వంటి పల్లపు గ్రామాలు, కొంతకు కొంతైనా ధాన్యం సమకూర్చేవి. కాబట్టి సంగడి, ఇతర కుటుంబాలకంటె ముందుగానే మా లింగం కుటుంబాన్ని విడిచిపెట్టి యుంటుంది.

ఏవిధముగానైతే నేమి, మా లింగం కుటుంబం బొమ్మలూరులో పూర్ణాధిక్యాన్ని సంపాదించింది. ఊరిలో ఎదురులేదు. స్త్రీలు ఎదుటబడేవారు కాదు, ప్రక్కకు తప్పుకొనే వారు. గ్రామస్థులు పెద్దరికాన్ని గుర్తించి మెలగేవారు. నౌకరులు, కూలీలు ప్రక్కకు ఒదిగి ఉండేవారు, భయభక్తులతో వర్తించేవారు. అయితే, లింగం కుటుంబీకు లెప్పుడూ దుర్మార్గులు కారు. పెత్తనం చేసినా, ఇతరులకంటె తా మధికులమని విఱ్ఱవీగేవారుకాదు. అందరం రైతులం, సమానం అనే ధోరణిలో ఉండేవారు. ఎంత బీదవాడైనా, బంధువు వారికి రాజబంధువు. దయాదాక్షిణ్యాలు, బీదలయందు కనికరం, నౌకరులయందు అభిమానం జాస్తి. పాలేళ్ళు వారికి కన్నబిడ్డలవంటివాళ్లు. కరువు కాటకాలు వస్తే ధాన్యాగారాన్ని తెరచేవారు. ఏ పొలంలో ఉన్నధాన్యం ఆ పొలంలోనే ఖర్చు అయేదని వాడుక. మోసం, పిచ్చి కొంచాలు, తప్పుడు లెక్కలు ఎరుగరు. అందువల్ల మా పిన తాతగారి కుటుంబీకులతో మా తండ్రులకు వ్యతిరేకాలు ఏర్పడినా, గ్రామస్థులతో తగాదా లుండేవికావు.

నా చిన్నతనంలో రాజవీధి మధ్యలో నున్న మా లింగం కుటుంబం తాలూకు ధాన్యం కొట్ల సమీపంలో ఒక నేరస్థుని బండకొయ్యలో గ్రామమునసబు బంధించటం చూచాను. దొంగతనమో, ఇంకొక తప్పో చేసిన నౌకరిని యజమాని దండించటం నే నెరుగుదును. "దండం దశగుణం భవేత్" అను సూత్రాన్ని అమలుపరచటంలో సందేహించేవారుకాదు. ఇది కొన్ని సంవత్సరాలవరకు పల్లెటూళ్ళలో వాడుకలోఉండేది. మారిన పరిస్థితులవలన, ఈ మోటుపద్ధతి మాయమైంది. కాని దుర్మార్గుల దుష్టత్వాలు, దొంగతనాలు, హింసలు వగైరా తగ్గి,

గ్రామాలు శాంతియుతంగా, గ్రామస్థులు సుఖజీవనంతో ఇప్పు డున్నారని చెప్పలేము. అయితే ప్రజాస్వామ్యవ్యవస్థలో, పంచాయితీరాజ్య పరిపాలనలో దండనీతి అనువుకాదు. కాలం ప్రజల మనస్తత్వాన్ని మంచిమార్గంలో స్థిరపరచి, శాంతియుత సుఖ సహజీవనానికి తోడ్పడుతుందని ఆశిద్దాం.

మా స్వగ్రామం బొమ్ములూరు గుడివాడ—బందరురోడ్డు మీద, గుడివాడకు దక్షిణాన, అంగలూరుకు ఉత్తరాన, గుడివాడ (తాలూకా హెడ్ క్వార్టర్స్) కు రెండు మైళ్ళ దూరములో ఉన్నది. వైశాల్యంలో, జనాభాలో మధ్యరకం గ్రామం. తూర్పు చివర మా పెద్దలు త్రవ్వించిన చెరువు, చెరువుకు సమీపంలో మా తాత లిద్దరు కట్టించిన దేవాలయం, పడమర చివరగా గ్రామస్థులు (ముఖ్యంగా గుత్తావారు) త్రవ్వించిన చెరువు, తూర్పు చెరువును పడమర చెరువును కలిపే రాజవీధి, రాజవీధికి ఉత్తరంగావున్న మొదటి ప్రక్క వీధికి మొగను ఊరి వైశ్యులు కట్టించిన రాముని గుడి, తరువాత రాజవీధికి దక్షిణ ప్రక్కన ధాన్యం కొట్లు, వాని తర్వాత మా పినతాతగారి మేడ, మేడకు సమీపంలో ఇంకొక ఉత్తర వీధి, దీని కించుమించు ఎదురుగా ఒక సందు, కొన్ని గజాలు దాటిన తర్వాత ఉత్తరంగా ఇంకొక వీధి— ఇవి ముఖ్యమైనవి. రాముని గుడి వీధిలో ముఖ్యంగా గుత్తావారు, వైశ్యులు కాపురం. మేడకు దగ్గర సందులో మొదటి ఇద్దరు పెద్ద తండ్రులు, మా పినతాత పెద్ద కుమారుడు వెంకట సుబ్బయ్యగారు నివసించేవారు. చివరి (మూడో) ఉత్తర వీధిలో మూడవ, నాల్గవ, ఐదవ, ఆరవ పెదతండ్రులు, మా నాయనగారు, పినతాత గారి రెండో కొడుకు కాపురముంటూఉండేవారు. మా నాల్గవ పెదతండ్రి వెంకట శివుడుగారి తోడిఅల్లుడు పినతాతగారి రెండో కొడుకు వెంకట శివుడుగారు. వారిల్లు ఒకదానిప్రక్కన రెండోది. ఈ ఆరు ఇళ్ళు ఇంచుమించు ఏకకాలమందు కట్టబడినవి. పడమర చెరువుకు ఉత్తరంగా రాజవీధి నానుకొని గ్రామమునిసిఫ్ ఇల్లు ఉండేది. ఇప్పుడు ఇళ్ళు, స్థలాలు మారాయి. గ్రామ మిప్పుడు విస్తరించి తూర్పు చెరువు దక్షిణంగా, పడమర చెరువు ఉత్తరంగా చాలా ఇళ్ళు వెలిశాయి. మా యిల్లుండిన చివరి

ఉత్తరం ప్రక్క వీధి ఇప్పుడు చాలా మార్పుచెంది, కళా విహీనంగా నున్నది. మా కుటుంబ ఆస్తిపాస్తులు తరిగిపోయినవి. కొన్ని ఇళ్ళను పడగొట్టినారు. ఆ స్థలాల్లో ఇతరులు క్రొత్త ఇళ్లు కట్టుకొన్నారు. అజ పజ లేకయుండిన కొన్ని కుటుంబాలు, వ్యక్తులు ప్రబలులై, గ్రామానికి క్రొత్త రక్తం ఎక్కినట్లున్నది.

మా తాత వీరభద్రుడుగారు, పినతాత వెంకటరత్నంగారు కలసియున్నప్పుడు, మా ఊరి శివాలయాన్ని కట్టటం ప్రారంభించారు. కట్టటం పూర్తిఅయింది. ధ్వజస్తంభాన్ని నెలకొల్పక ముందే మా తాతగారు చనిపోయారు. మా పినతాతగారు ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించి, శివుని, పార్వతిని, వీరభద్రుని నెల కొల్పి దేవాలయానికి శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత సోమేశ్వర స్వామి ఆలయం అని పేరు పెట్టారు. దానికి బొమ్మలూరులో, సమీప గ్రామాల్లోఉన్న భూములనుకూడ దేవాలయ కైంకర్యానికి నియమించారు. భూముల మొత్తం 60 - 70 ఎకరాలమధ్య. కాని యిప్పుడు 40 ఎకరాల లోపే అమలులోనున్నది. పడమర చెరువు కూడా మరమ్మతు కావలసియున్నది కాని, తూర్పు చెరువు పాడుబడియున్నది. ఎవరూ పట్టించుకొనునట్లు లేదు.

## బాల్యం

నాకైదవ యేడు చొరబడిన తర్వాత అక్షరాభ్యాసం చేయించదలచి, మా ఊరి వృద్ధబ్రాహ్మణుడు ఎప్పుడూ దగ్గు చుండే దగ్గు సుబ్బయ్యగారికి, మా నాన్నగారు పనిని ఒప్ప గించారు. వర్జం వగైరా లేని మంచిరోజు చూచి మొదలు పెట్టటానికి సుబ్బయ్యగారు మా యింటికి రాగా, నే నంతకుముందే పారిపోయి ఊరు చివర, గొల్లయిండ్ల సమీపాన ఉండిన తాటిచెట్ల మధ్య దాగుకొన్నాను. మా నాయనగారొకప్రక్క, నొక ర్లొక ప్రక్క వెదికి, చివరకు మా తండ్రిగారు తాటిచెట్ల మధ్య నక్కి యున్న నన్ను పట్టుకొన్నారు. వారు రావటం చూచి నేను ఒక తాటిచెట్టు మరుగునుండి మరొకదానికి తప్పించుకొని, వారికి శ్రమ

కల్గించాను. దొరికిన దొంగను పట్టుకొని వెళ్ళినట్లు తీసికొని వెళ్లి నన్ను దగ్గు సుబ్బయ్యగారి కొప్పగించారు. నేలమీద వారు వెలుబూడిదలో 'ఓం, నమః శివాయ' వ్రాసి దిద్దించారు. ఈవిధముగా నా విద్యారంభం, ఆ రోజుల్లో నేలమీద వెలుబూడిదలో అక్షరాలు వ్రాసి నేర్పించటమే పద్ధతి. సామాన్యంగా అక్షరాలు వచ్చినగాని పలకా బలపం చేతికివచ్చేవికావు. రైతుకుటుంబాల్లో, అక్షరాభ్యాసానికి తంతేమి ఉండేదికాదు. పంతులుకు ఏదైనా బహుమానం ఇచ్చేవారేమో, బహుశా కొంతమంది పిల్లలను ప్రోగుచేసి, పప్పుబెల్లాలు పెట్టేవారేమో. నా విషయంలో ఏమి జరిగిందో గుర్తులేదు. సామాన్యంగా అక్షరాలు దిద్దించటం, వెలుబూడిదలోనే అని నాకు బాగా గుర్తు. మా పెద తండ్రి వెంకట సుబ్బయ్యగా రింటిముందు చావడిలో మేము చదువుకొనుచుండినప్పుడు అక్షరాలునేర్చుకొనే పిల్లలను వరుసగా కూర్చోబెట్టి ఎదురుగా వెలుబూడిద పరచి ఒక పంక్తిగా అక్షరాలు దిద్దించటం నా స్మృతిపథాన నాటుకొనిపోయింది.

దగ్గు సుబ్బయ్యగారు మా ఊరువారే. ఇంటిపేరు మల్లాప్రగడ అనుకొందును. వా రంటే పిల్లలకు భయం. కారణం, ఆయ నెప్పుడూ చిల్లత్రాడు చేతబట్టుకొని ఉండేవారు. తరుచు చిన్నచిన్న చురకలు అంటిస్తూ ఉండేవారు. తరువాత పేము బెత్తాలు వచ్చాయి గాని, అసలు చిల్లత్రాడు, దాని తర్వాత ఏ కానుగ పుల్లో, వేప పుల్లో బెత్తం. చిల్లత్రాడు అనగా గోగు నారతోనో, జనపనారతోనో పేనిన, చివర మూడు చిలవలు కల త్రాడు. మూడు చిలవలు తగిలి నొప్పి గట్టిగా కలిగించేదే. వీరి వద్ద గుణింతాలు వరకైనా చదివియుందును.

దగ్గు సుబ్బయ్యగారు కొలదికాలానికే చనిపోయారు. వారి మృతి తరువాత కొంతకాలం, నే నంగలూరులో మాతాతగా రింటనుండి చదువుకొన్నానేమో గుర్తులేదు. కాని ఆ ఊరిలో చిన్నపిల్లల బడిపెట్టి చదివించుచుండిన కోనయ్య పంతులుగారి విషయం గుర్తు. వారు మనిషి మోటు. చదువు మోటు, తిండి మోటు. చదువు మాట కేమి గాని, వారి తిండితినే శక్తి గొప్పది. పందెం వేసి అడ్డెడు బియ్యంతో అన్నం

తిన్న వెంటనే, అడ్డెడు పప్పుగారెలను ఏకధాటిగా తిని, త్రేవున త్రేపారట.

నాకు గుర్తున్నది; దగ్గు సుబ్బయ్యగారి శిష్యరికం తర్వాత మా దేవాలయం పూజారి శ్రీ యడవల్లి పుల్లయ్యగారి వీధిబడి. మా చదువుకు ఆధారం యడవల్లివారు. వెల్నాటి బ్రాహ్మణులు, అనగా ఈ ప్రాంతాలలో నివసిస్తున్న మామూలు వైదిక శాఖకు చెందినవారు. అందువలన శుభాశుభ కార్యాలలో, పౌరోహిత్యం వగైరా చేసే ఇతర వైదిక బ్రాహ్మణులతో సమాన గౌరవం కోరేవారు. సర్వ సాధారణముగా స్మార్తులలోగాని, వైష్ణవులలో గాని పూజారితనం గౌరవాన్ని కుంటుబరచి, కొంత న్యూనత నాపాదించి, శిష్ట బ్రాహ్మణులతో సమానత్వానికి పాలుపడదు. కాని మా యడవల్లి పూజారులు మాత్రం తక్కువచూపుకు ససేమిరా అనేవారు. మా తాతలు దేవాలయాన్ని ప్రతిష్ఠించి నప్పుడు, యడవల్లి సుబ్బయ్యగారిని ఎక్కడనుండో తీసికొనివచ్చి దేవాలయార్చనను వారి కొప్పగించారట. సుబ్బయ్యగారికి ముగ్గురు కొడుకులు—వీరభద్రయ్య, పుల్లయ్య, సుందరరామయ్య గార్లు. వీరభద్రయ్యగారు లౌకికవృత్తి నవలంబించి కరణంగా వ్యవహరిస్తూ, గుడివాడలో కాపురంబెట్టి కోర్టు వగైరా వ్యవహారాలు నడిపిస్తూ ఉండేవారు. వారెట్టి ధనాపేక్ష లేక, మా లింగం కుటుంబంమీద అభిమానంచేత, మా కుటుంబచరిత్రను త్రవ్వి వెలికితీసి, మా ముత్తాత తండ్రి వీరన్నగారు మొవ్వ గ్రామంనుండి బొమ్ములూరుకు వలసవచ్చారని నిర్ధారణ చేసికొని, వీరన్నగారి నుండి మా బిడ్డలదాకా వంశవృక్షాన్ని వ్రాసి, నే నప్పటి కింగ్లండు నుండి తిరిగివచ్చినందున, నా కిచ్చారు. వారి శ్రమకు నే నేమియు నిచ్చియుండినట్లు గుర్తులేదు. చిల్లర మల్లర ఖర్చుల కని ఏమైనా ఇచ్చినానేమో. వారిని ఈపని చేయండని నేను కోరియుండలేదు. వారు నన్ను కలసికొని ఈ విషయం చెప్పి, వంశవృక్షపత్రం నా కిచ్చువరకు వారీ కృషి చేశారని నాకు తెలియదు. వారిని, మా పూర్వులది మొవ్వ గ్రామం అని చరిత్రాధారాలేమి టని అడిగితిని. వా రేదో చెప్పినారు. అది సంతృప్తికరంగా నాకుతోచ

లేదుకాని, వారు విపులంగా వ్రాసిన మా కుటుంబ సభ్యులపేర్లు, బంధుత్వాలు నా కిప్పు డుపకరించినవి. మా కుటుంబం, వారికి ఋణపడియున్నది. వీరభద్రయ్యగారు సునిశిత మేధస్సుగలవారు, మిక్కిలి పట్టుదల, గుండె నిబ్బరము కలవారు. కాని కయ్యానికి కాలుదువ్వే మనస్తత్వం, ముక్కోపం, మొండితనం వారిని వృద్ధిలోనికి రానీయలేదు.

పుల్లయ్యగారు మా బాలాత్రిపురసుందరీ సమేత సోమేశ్వర స్వామివారి పూజారి. వారి తండ్రి సుబ్బయ్యగారిని నే నెరుగను. నా ఎరుకనుండి శ్రీ పుల్లయ్యగారే మా పూజారి. వారి తమ్ముడు సుందరరామయ్యగారు బందరులో నేదో దేవాలయంలో అర్చకులుగా ఉండేవారు. పుల్లయ్యగారు మా దేవాలయ పూజారియే గాక, నాకు, నా పెద తండ్రుల బిడ్డలకు, గ్రామస్థుల బిడ్డలకు నా బాల్యంలో కొంతకాలం చదువుచెప్పిన గురువులు. వారి శిక్షణ పల్లెటూరు వీధి బడిలో. ఆ రోజుల్లోఉండే శిక్షణ వంటిదేగాని, బొత్తిగా వానాకాలం చదువుకాదు. ఎక్కడనుండో నాల్గురోజులు జీవనం గడపటానికి బైటనుండి వచ్చి పబ్బం గడుపుకొనిపోవు బడిపంతులువలె గాక, తన శక్తికొలది, ఓపికఉన్నంతవరకు, శ్రద్ధగా చెప్పేవారు. బెత్తంతో కొట్టటం నాకు గుర్తులేదుకాని, గోడకుర్చీలు వేయించుట పుల్లయ్యగారి ప్రత్యేకత. ఒక సందర్భంలో వారు నాతో వేయించిన గోడకుర్చీ నా కిప్పటికీ జ్ఞాపకమున్నది. మోకాళ్ళనొప్పి వారంరోజులవరకు పోలేదు.

పుల్లయ్యగారు చదువుచెప్పే గురువులుగానేగాక, మా దేవాలయ పూజారిగా, నావంటివారి మెచ్చుకోలును పుణికిపుచ్చుకొన్నారు. వారు అర్చన తంతులో మిక్కిలి దక్షులే గాక మంత్ర, స్తోత్ర పఠనలో మిక్కిలి ఘటికులు. మా కుటుంబానికి వీరభద్రస్వామి ఇష్టదైవము. మా కుటుంబంలోని మగపిల్లల వివాహాలసందర్భంలో కంకణాలు ( ఆ రోజుల్లో 5-వ నాటి సాయంత్రం ) ఊడదీసిన మీదట, వీరభద్ర పళ్లెం ( పళ్లెంలో వెలిగించిన ప్రమిదలుపెట్టుకొని స్తోత్రించుటవలన పళ్లెం అనే పేరు ఈ పూజకు వచ్చి యుండవచ్చును ) పట్టుచుండే వాడ్లము.

పుల్లయ్యగారు వీరభద్రస్వామిని ఆహ్వానించి "నీ పూజ పూర్తి అయ్యేవరకు ఇక్కడనే ఉండవలసిన"దని 'ఆన' పెట్టేవారు. దీనిని ఖడ్గములనే స్తోత్రములతో చేసేవారు. ఈ ఖడ్గములు వారు సహజ కంచు కంఠంతో ఎలుగెత్తి ఢంకాకొట్టినట్లు విస్పష్టంగా పాడుతుంటే ఒళ్లు జలదరించేది, ఆవేశం పెచ్చుపెరిగేది. పూనినట్లయ్యేది.

అర్చకుడు దేవాలయంలో మధ్యాహ్నం 'ఆన' కట్టిన తర్వాత, సాయంత్రం స్వామివారికి పూజాద్రవ్యములతో వీరాంగణ సహితంగా, నారసాలు వెలిగించుకొని సాంబ్రాణి, గుగ్గిలం ధూపం క్రమ్ముకొనుచుండగా భక్తు నింటినుండి రాత్రి బైలుదేరి, రాజవీధిగుండా, ఉల్లడిక్రింద నడుస్తూ, దేవాలయం చేరి, స్వామికి పూజ సర్పించి, చివరి ఘట్టంగా, భక్త్యావేశ సూచకంగా, బారు గుంటదీసి గోగు పుల్లలు వగైరాతో రగులజేసిన ఎర్రని మంట గుండా ఈప్రక్కనుండి ఆప్రక్కకు నడచి వెళ్ళి, తరువాత స్వామివారి ప్రసాదము స్వీకరించి, ఎవరిదారిని వారు వెళ్ళిపోవటం జరిగే తంతు. దారిపొడుగునా గజం, అంతకంటె తక్కువ నడచిన తర్వాత, ఎవరో ఒకరు ముందుకు దుమికి కత్తిని చేతపట్టుకొని ఝుళిపించుచు, సాంబ్రాణీధూపం ఆఘ్రాణించి "అర్ధ శ్శరభా, శర భావతార, శంభుని వర కుమార" అని ఆరంభించి, ఖడ్గం (స్తోత్రం) చదివి, నారసంను (పంగలుగల్గి మొనను సూదివలె పదును పెట్టబడిన ఇనుప ఊచ—పంగలకు నూనెలో ముంచిన గుడ్డముక్కలను చుట్టి వెలిగించుదురు) నాలికమీదనో, బుగ్గలకో, ముంజేతిమీదనో పొడుచుకొని, ప్రమిద దీపాలున్నపళ్లెం చేత బట్టుకొని వీర వాయిద్యంతో, పళ్లెంలోని దీపాలు ఆరిపోయేవరకు, వీరాంగణ, అనగా గంతులు చిందులు వేస్తూ, చుట్టూ తిరుగుచు, ముందుకు సాగిపోతూ ఉండేవారు. కొలది దూరములో ఇంకొకరు ముందుకు దుమికి పైజెప్పిన తతంగాన్నంతా నడపేవారు, ఈవిధంగా ఏ ఏడు గంటలకో మొదలుపెట్టిన ఊరేగింపు, దేవాలయానికి ఏ 11 గంటలకో చేరుకొనేది. దేవాలయంలో పుల్లయ్యగారి ఆవేశపూరిత స్తోత్రం, నిప్పులగుంట నడక, ప్రసాదం పంచిపెట్టటం అధమం ఒకగంటవరకయినా పట్టేది.

ఉద్రేకంతో ఖడ్గాలు చదవటం, పరవళ్ళు త్రొక్కటం, సాంబ్రాణి, గుగ్గిలం పొగత్రాగటం, నారసాలు వేసుకోవటం మా కుటుంబంలోని పిన్న పెద్దలు అందరం జరిపేవారం. వీరభద్ర పూజలలో ఖడ్గాలు చదివి, చిందులు ద్రొక్కి పెద్ద పెద్ద నారసాలను వేసికొనుటలో అంగలూరు గ్రామ నివాసులు, జంగములు, కోటయ్య వగైరాలు సుప్రసిద్ధులు. మేము వీరభద్రపళ్లెం జరిపినప్పు డల్లా వారే ముఖ్య సహాయకులు. కపాలనారసం అనగా తల పైభాగంనుండి? గడ్డంక్రిందివరకు నారసం దింపుకొనటం ప్రత్యేక విశిష్టచర్య. నిజంగా పైనుండి క్రిందికి దింపుకొనేవారో లేక ఏదైన తంత్రం చేసేవారో గాని, నేను స్వయముగా రెండు మూడు సార్లైనా తలమీద నారస పైభాగం, క్రింద నారస చివరి సూదిభాగం గడ్డంక్రింద చూచాను. బహుశా రెండు ముక్కల నట్లు చూపించియుంటారు.

ఈ కుటుంబాచారం తగ్గిపోయిందనే చెప్పాలి. పూర్వపు ఆస్తులు తరిగిపోయాయి. పూర్వపు పూజాపునస్కారాలు, నమ్మ కాలు, విధానాలు లేవు. దేవుని గుడిని గాని, అందులోని దేవుళ్లను గాని సరియైన పరామర్శ చేయని ఈ రోజుల్లో, వీరభద్ర పూజవంటి ప్రత్యేక పూజలకు శ్రద్ధవహిస్తారా! నేను ప్రాతవాసనలు పోనివాడను కాబట్టి, నా యిద్దరు కుమారులలో పెద్దవాని పెండ్లికి సమకూడ లేదు కాని, రెండోవాడు సుధాకర్ పెండ్లికి వీరభద్రపళ్లెం పట్టించాను. అంగలూరు జంగములు ప్రాతవాళ్లు పరమపదించగా, క్రొత్తవాళ్ళకు చేత కాదు. అందువల్ల చిన పారుపూడిలో నుండిన విశ్వబ్రాహ్మణులచేత కార్యక్రమం జరిపించాము. ఇదివరలో వలె మంగళ్లు వీరవాయిద్యం వాయించటం లేదు. అందువల్ల గంగిరెద్దువాళ్ళను ఏర్పాటుచేశాం. అన్ని తంతులు, అగ్ని గుండంలోనుండి నడచివెళ్ళటం సహా, సక్రమంగా జరిపాము. నేను కూడా నారసాలు వేయలేదు కాని, ప్రమిద దీపాలున్న పళ్లెంతో చిందులు గంతులువేసి పూనకం పూనిన వాని వలె ఆవేశం పొందాను. ఇంకొకటి చెప్పాలి: 'ఆన' కట్టుటకు మధ్యాహ్నం గుడికి వెళ్ళేటప్పుడు, ధూప దీపాలు నారసాలుండవుగాని, దారి పొడుగునా ఖడ్గాలు చదువుతూ వెళ్తాం. ప్రక్క టిళ్ల భక్తులు,

ఎండకు కాళ్లు కాలుచుండునని కాబోలు ఆచారం, బిందెలతో నీరు తెచ్చి కాళ్ళకు దారిలో పోస్తారు. ఇష్టంవచ్చినవాళ్లు ముందుకు దుమికి ఖడ్గాలు స్తోత్రిస్తారు.

ప్రసాదం మామూలు పెసరపప్పు, కొబ్బరి, బెల్లంకాక చిట్టిగారెలు. చిన్న బిస్కత్తులవలె పల్చగా గుండ్రంగా మినప పిండితో చేసినవి. ఇవి కరకర లాడుతూ, రుచిగా ఉంటవి. అవి నాకు చాలా యిష్టమని పుల్లయ్యగారు అందరితోబాటు పంచి పెట్టుటయేగాక, చాటుగా నాకు ప్రత్యేకంగా ఒక కాగితంలో పొట్లంగా ఇచ్చేవారు. నే నింగ్లండు నుండి 1927 లో తిరిగివచ్చి నప్పటికి పుల్లయ్యగారు లేరు. వారి పెద్ద కుమారుడు సుబ్బారావు గారు గుడివాడ ఆంజనేయస్వామి అర్చకులుగా యుండినారు. రెండో కుమారుడు శ్రీ సత్యనారాయణ మా దేవాలయ అర్చకు లుగా ఉంటున్నాడు. ఆయన నాకు చిట్టిగారెలు యిష్టమని ఒక చిన్న డబ్బాడుచేయించి నా కిచ్చారు.

శ్రీ యడవల్లి పుల్లయ్యగారి వీధి బడిలో చదువుకొను చున్నప్పు డొక విషయం జరిగింది. సమీపానగల మా దేవాలయం మీది పావురాయిలను పట్టుకోవాలని ముగ్గురు, నల్గురు పిల్లలం కలసి వెళ్ళాం. ఒక రిద్దరు క్రింద నుండగా, మరొక రిద్దరు గుడి గోపురం ఎక్కాం. మమ్ములను చూచి పెద్దవి ఎగిరిపోయాయి. పిల్లలు మా చేతికందాయి. వానిని గట్టిగా పిసికి పట్టుకొని ఎత్తు నుండి క్రిందకు పడవేసేటప్పటికి అవన్నీ చచ్చిపోయాయి. మేము భయపడి పారిపోయాం. ఉదయం చచ్చిపడియున్న పావురాయి పిల్లలను చూచి విషయం తెలిసికొని, పుల్లయ్యగారు మా ముగ్గురు, నల్గురకు కోదండం (గోడకు వీపు నానించి మోకాళ్ళువంచి కుర్చీలో కూర్చున్నట్లు కూర్చోవటం) వేయించారు. తతిమ్మా పిల్లలసంగతి ఎట్లున్నా, ఊబ శరీరంగల నాకు ఆ మోకాళ్ళనొప్పి వారం రోజులవరకు బాధించింది.

ఈ సందర్భంలో నా బాల్య సంఘటనలు, అనుభవాలు కొన్ని వివరించుట అసమంజసం కాదనుకుంటాను. మొదటిది నా కిప్పటికిని బాగుగా గుర్తున్నది. అది తేలుకుట్టిన బాధ. నా కా రేళ్లు ఏడేళ్ళు ఉండేటప్పుడు మా ఇంటి కెదురుగా

నుండిన ఖాళీస్థలములో ఆడుకొంటూ ఉండేవాళ్ళం. ఆ ఖాళీస్థలానికి ఒకవైపున మా పెద తండ్రి నాగభూషణంగారి రెండో కొడుకు వెంకట కృష్ణయ్యగా రిల్లుండేది. దానికి ప్రహారీ లేదు. అందువల్ల వా రిల్లు కడుక్కొనే నీరు ఒక బెజ్జంగుండా ఆ ఖాళీస్థలంలో పడుతుండేది. నే నక్కడ ఆడుకొంటూ, బెజ్జంలో వ్రేలుపెట్టాను. చటుక్కున తేలు కుట్టింది. లబో దిబో అంటూ ఇంట్లోకి పరుగెత్తాను. అదే నా మొదటి తేలుకుట్టినబాధ అనుభవం. రెండోసారి నే ననంతపూరు జిల్లాలో ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు ఉద్యోగం 1936-37 సంవత్సరాలలో చేయుచున్నప్పుడు, ఆత్మకూరు రహదారి బంగాళాలో మకాం చేస్తుండేవాడను. ఒక క్యాంపులో తేలుకుట్టింది. అది ఎర్రతేలు. ఆ ప్రాంతాల్లో ఒంటిపూసగల ఎర్రతేళ్ళు కుట్టితే అపాయమట. కాని నా అదృష్టం కొలఁది ఆ తేలుకు మామూలు మూడు పూసలు.

మూడోసారి నేను పింఛను పుచ్చుకొని పెడసనగల్లులో 1953 లో నివసించటం మొదలుపెట్టిన కొద్దికాలానికి, పొలములో చీకటి పడిన తర్వాత ఏదో మట్టిగడ్డ తొలగించబోగా చటుక్కున తేలుకుట్టింది. ఇప్పటివరకు ఈ మూడుసార్లు మాత్రమే. ఇక ఈ బాధ తిరిగి సంభవించదని ఆశిస్తున్నాను.

నా కేడెనిమిది సంవత్సరాలుంటున్నప్పుడు, నేను మా అమ్మమ్మగారింటికి అంగలూరుకు వెళ్లుచుండగా, దారిలో ఎవరో ఒకడు నన్ను పిలిచి రోడ్డు అంచుకు రమ్మని అదుగో, చూడమని చేయిపెట్టి చూపించటం మొదలుపెట్టాడు. వాడి ముఖం తీరు చూచి నేను భయపడి పరుగెత్తాను. వాడిది క్రూరముఖం అని గుర్తు. నేను పారిపోకపోతే వాడు నన్ను చంపి, నా నగలు లాక్కుపోయే వాడని ఇప్పటికీ అనుకొంటూ ఉంటాను.

ఆ పిన్నవయస్సులోనే ఒకసారి ఇంటి ఆవరణలోనే ఆడుకొంటూ ఎందుకో భయపడి అరుస్తూ మా అమ్మ దగ్గరకు పరుగెత్తాను. ఆమె చప్పున నన్నెత్తుకొని వీపు తట్టి లాలించింది. అప్పుడు సంజ చీకటి. ఇంకా దీపాలు సరిగా వెలిగించలేదు. పైగా ఆ రోజుల్లో ఆముదం దీపాలో, చిన్న కిరసనాయిల్

దీపాలో. దయ్యం భయమేసింది. ఏదో దయ్యం ఉన్నట్లు తోచింది. ఆ సంఘటన ఇప్పటికీ జ్ఞాపకానికి వస్తూ ఉంటుంది.

మా ఇంటికి కొద్ది దూరంలో పాడుపడిన మట్టిగోడల దొడ్డి ఉండేది. కొంతమంది పిల్లలతో కలిసి అక్కడ ఆడుకుంటూ ఉండేవాళ్ళం. ఆ మొండిగోడలమీద కెక్కి అక్కడినుండి క్రిందికి దూకటం సరదా. అట్లా దూకుతుంటే రెక్కలున్న పక్షికివలె గాలిలో తేలుతూ క్రిందకు వాలినట్లు నాకు తోచేది. బహుశా తేలిక శరీరం గనుక బాహువు లల్లాడిస్తూ, ఏమాత్రం వికరులేక క్రిందకు దిగజారినందున అట్లు తోచేదేమో. తరువాత కూడ నిద్రలో అలా తేలికగా పైనుండి దూకినట్లు తట్టేది.

చిన్నప్పుడు గొడ్లకాడ బుడ్డాళ్లతో ఆడుకొంటూ, మా వైపుకు దగ్గరగావున్న పంటకాల్వ వెంట తిరిగేవాళ్ళం. పంట కాలంలో దగ్గరనున్న ధాన్యం కంకులను దూసి, గుప్పెడో, దోసెడో ధాన్యాన్ని కాల్వగట్టు ప్రక్క చిన్న గోతిని తీసి అందులో పోసి, పైన మట్టిబెల్ల మూతపెట్టేవాళ్ళం. నీటి అంచున ఒక విధమైన ఆకు లుండేవి. వాటిని పెరికితే అడుగుభాగంలో ఎర్రని పొడుగాటి సన్న దుంప లుండేవి. ఆ దుంపలను డేగలని పిలుస్తూ, కోడిపుంజులను కొట్లాడించినట్లు ఢీ కొలిపి ఆడించేవాళ్ళం.

ఒకనాడు మా గొడ్లు కాచే ఏనాది కుర్రవానితో కలసి పొలంవెళ్లాను. అది కుప్పలువేసిన తర్వాత రోజులు. మధ్యాహ్నం ఆ నౌకరికుర్రవాడు ఎలుకకన్నంచూచి ఎలుకను పడ్దాం అన్నాడు. సరే అన్నాను. ఎలుకను బట్టి దానిని కాల్చి తిందాం అన్నాడు. నాకు వింతయి, ఉత్సాహం పుట్టింది, భలే అన్నాను. వాడు దాన్ని కాల్చాడు. ఒక ముక్క పెట్టాడు. బెరుకు బెరుకుగా రుచి చూచాను. ఎబ్బెరికం వేయలేదు. మామూలు మాంసం లాగానే తోచింది. కాని అంతటితో చాలనిపించింది. తతిమ్మాది వాడు శుభ్రంగా తినేశాడు. క్రొత్త వింతైనా, అలవాటు లేకపోతే మనస్సు పూర్తిగా అంగీకరించదుకదా!

కొంచెం పెద్దవాడనయిన తర్వాత, ఆ సమయానికి నౌకరు ఇంటిలో లేనందున, మా నాయనకు మధ్యాహ్నభోజనం

(ఆ రోజుల్లో పెద్దవాళ్ళుకూడా మూడుపూటల భోజనం చేసేవారు) ఇంచుమించుగా మూడు మైళ్ళ దూరంలో నున్న మా బిళ్ళపాడు గ్రామం భూమిలో కుప్పనూర్పుడుపని చేయించుచున్నచోటికి నెత్తిని గిన్నె పెట్టుకొని తీసికొని వెళ్ళాను. దారితప్పి సాయంత్రం వరకు అటూ ఇటూ తిరుగుతునే ఉండినాను. ఎంతసేపటికి భోజనం రానందున, మా నాన్న ఇంటికి బైలుదేరి వస్తుండగా నేను కన్పడగా, ఇంటికి తీసికొనిపోయి మా అమ్మను కుర్రవానిని పంపినందులకు చివాట్లు పెట్టారు.

పిల్లలం కలబడి పోట్లాడుకుంటూ ఉంటే, బైటనుండి ఒక బాలుడు మమ్ములను విడదీసే నెపంతో మాలో ఒకరిమీద అభిమానంచూపిస్తూ రెండవవానికి దెబ్బలు తగిలేటట్లు చేసేవాడు. ఈ సందర్భంలో నాకు దెబ్బలు తగలటమేగాక, చొక్కా చిరగటంకూడా జరిగేది. నాతో కలబడినవాడు, నన్ను అడ్డగించి దెబ్బలుతినేటట్లు చేసినవాడు నా పెద తండ్రుల బిడ్డలే.

మా యింటి వెనుకప్రక్క మా పినతాతగారి పెంకుటి పశువులచావిళ్లు ఉండేవి. అందులోని ఒక భాగంలో ఆలపాటి వెంకటేశ్వర్లు, అతని తండ్రి చిల్లరదుకాణంపెట్టి శనగపప్పు, బటాణీలు కూడా అమ్మేవారు. బటాణీలు కొట్టవచ్చినట్లున్న పెద్ద గింజలతో బస్తానిండా ఉండేవి. నేను చాటుగా బియ్యం, డబ్బులు పట్టుకొని వెళ్ళి తరుచు తెచ్చుకొనేవాడను. తరువాత మా ఇంటి నానుకొనిఉన్న మా పెంకుటి గొడ్లచావడి బైటి ముందు వరండా అరుగుమీద ఇద్దరు విధవ వైశ్యస్త్రీలు ( అత్తా కోడండ్రు అనుకుంటాను ) చిల్లరదుకాణం పెట్టుకొన్నారు. ఆ వరండాకు మా చావడి లోపలనుండి బైట త్రోవ దర్వాజా రెక్కలు ఇనుప చువ్వలవి. నేను రహస్యంగా బియ్యం గుడ్డసంచిలోనో, జేబుల్లోనో లేక ఒడిలోనో పోసుకొని, చువ్వల సందుగా ఇచ్చి శనగపప్పు, బటాణీలు తీసికొనేవాడను. ఇది కొన్నిరోజులకు మావాళ్ళకు తెలిసి, ఆ స్త్రీలను చివాట్లుపెట్టి నా దొంగతనాన్ని మాన్పించారు. పెద్దయ్యాక నిజాయితీగా తయారైనవారు కూడ చిన్నతనములో ఇటువంటి చిల్లర మల్లర దొంగతనాలు చేయటం కద్దు. మా అమ్మ చిల్లరడబ్బులు ఒక పిడతలోవైచి దానిని గోడమేకుకు

తగిలిస్తూండేది. అది కనిపెట్టిన నేను కానో, అర్థంకాకో దొంగిలించుకు పోయేవాడను. ఇది బాల్యచాపల్యమో లేక నా తత్వంలో బలహీనం ఉండినదో చెప్పటం కష్టం. కాని వయస్సు వచ్చిన తర్వాత ఏ రకమైన దొంగతనమయినా నేను మిక్కిలి అసహ్యించు కుంటాను. నటనతోనో, అబద్ధంతోనో ఇతరులది, ఇతరులకు చెందవలసినది ఇంకొకరనుభవిస్తే, స్వాధీనం చేసుకుంటే పరమ దుర్మార్గం అనిపిస్తుంది. ఒక ఉదాహరణ : మా తండ్రిగారు ఒక కొద్దిపాటి భూమి బేరం ఖరారు చేసికొన్నారు. ఆ సమయానికి తనకేదో ఇంకొక పని తగులగా, తన అన్నకొడుకును పిలిచి దాని మూల్యం ఇచ్చి "నీవు వెళ్ళి దస్తావేజు వ్రాయించుకొని ర" మ్మని చెప్పారు. ఆ అన్న కొడుకు వెళ్ళి ఆ కాగితం తనపేర వ్రాయించు కొని వచ్చాడు. ఇట్టిది దొంగతన మనే నా అభిప్రాయం.

అప్పుడు మా మాతామహుల ఇంటికి అంగలూరుకు వెళ్లు చుండేవాడను. కొన్నిరోజు లక్కడుండేవాడను. ఆ సమయాల్లో మా సమీపానగల పిల్లలతో ఆడుకొనేవాడిని. మా మేనమామ గారి ఇంటిప్రక్కనేయుండిన ఇంటి పైకప్పును ఇంటివారు తొలగించి తీసికొనిపోగా, మొండిగోడలు నిలిచియుండినవి. ఆ గోడలమధ్య ఆడుకొనేవారం. ఒకనాడు ఎవరో పిల్లడు మల విసర్జనం అక్కడ చేశాడు. ఆడుకొనేస్థలంలో ఉన్న ఆ మలాన్ని నేను తీసి బైట పారవేయ ప్రయత్నించగా ఎబ్బెరికంగా తీయటం వలన కాబోలును కొంత బైటకుపోయి, కొంత గోడకు తగిలింది. మరునాడు ఆ సంగతి తెలిసిన కుర్రవాళ్ళు నేనేమో దానిని కావాలని గోడకు పిడకలు కొట్టినట్లు కొట్టానని హాస్యమాడి, నాకు ఉడుకుబోతుతనం తెప్పించి దెబ్బలాటలోకి దింపారు. ఇప్పటికీ నా సమకాలికుడైన ఒకాయన, సంస్కారం తక్కువైనందున, ఆ ప్రస్తావన తెచ్చి నేను నిజంగా కావాలనే గోడమీద కొట్టానని సూచిస్తాడు.

నే నింకా బాల్యదశలో నుండగా, మా తల్లి ఐదుగురు సోదరీలలో చిన్న ఆమె శ్రీమతి తులశమ్మగారికి ఆ గ్రామవాసి పండిత దుగ్గిరాల పురుషోత్తంగారి ప్రథమ కుమారుడు అష్టావధాని,

కవి, రచయిత శ్రీ రాఘవ చంద్రయ్య చౌదరిగారితో వివాహం జరిగింది. ఆ సందర్భంగా నేను పోగులు పెట్టుకోవాలని గల్లంతు చేయగా, మా వాళ్ళు కంసాలిని పిలిపించి చెవులకు బెజ్జాలు వేయమన్నారు. తొందరపాటులో వేసిన బెజ్జాలు కొంచెం క్రిందకు వేయటంవల్ల, తిరిగి చెవి తమ్మిలకు రెండోసారి బెజ్జాలు వేయవలసివచ్చింది. ఇప్పటికీ ఒక్కొక్క తమ్మికి రెండు బెజ్జాలు కన్పడుచునే ఉంటవి.

నాకు చిన్నప్పుడు తోలుబొమ్మలన్నా, కూచిపూడివారి యక్షగాన నాటకాలన్నా మిక్కిలి సరదా. మా బొమ్మలూరుకు అరమైలు దూరంలో వున్న సిద్ధాంతంలో అడ్డుమిల్లి సూర్య నారాయణ, గోపాలకృష్ణయ్యగార్ల తండ్రి సుబ్రహ్మణ్యంగారు కట్టించిన శివ విష్ణు దేవాలయాల సాంవత్సరిక ఉత్సవాలకు ఈ ప్రదర్శనలు జరిగేవి. నేను ప్రతి సంవత్సరం తప్పకుండా సాయంత్రం పెందలకాడే వెళ్ళి, తెల్లవార్లు తదేక దీక్షతో చూచి వస్తూఉండే వాడను. ఆ ఉత్సాహం ఇప్పటికీ ఉన్నది. నా రెండో కుమార్తె చి. సౌ. కమలకుమారి వివాహానికి 1958 లో కూచిపూడివారిచేత వారి ఉషాపరిణయాన్ని ఆడించాను. 1960 లో జరిగిన నా పెద్ద కుమారుడు చి. రాధాకృష్ణ పెండ్లికి మామూలు నాటకం ఆడించినా, నా రెండో కుమారుడు పెండ్లికి 1961 లో తోలుబొమ్మలవారిని పిలిపించి ఆడించాను.

మా కుటుంబం శ్రీమంతమైనదైనా అప్పటి పద్ధతులను బట్టి, నాకు బంగారు వస్తువులుగాక వెండి మురుగులు, వెండి కంటె, వెండి బేడీ లుండేవి. అయితే ముక్కుకు పోగు, కుడిచెవి పై భాగంలో పోగు బంగారంతో చేసినవే.

పుల్లయ్యగారి బడి విడిచిన తర్వాత ఒక నాయుడు ( బలిజ కులస్థుడు ) చేత మావాళ్ళు బడి పెట్టించారు. అది మా పెద తండ్రి వెంకట సుబ్బయ్యగా రింటి బైటి ప్రక్కగది. ఒక కొట్టం లా గుండేది. అక్కడ చదువుచుండగా నాయుడుగారు లేని సమయంలో కొందరు పిల్లలు బీడీలు కాలుస్తూ, నేను కాల్చనంటే నన్ను క్రిందకు పడద్రోసి గట్టిగా పట్టుకొని బలవంతంగా నోటిలో

బీడీ పెట్టారు. నాకు ఉక్కిరిబిక్కిరై డోకువచ్చి కక్కటం మొదలుపెట్టాను. నా కిప్పటికీ పొగత్రాగటం అలవాటు కాలేదు. నే నింగ్లండులో నున్నప్పుడు క్వచిత్తుగా స్నేహితులతో కలసి వున్నప్పుడు సిగరెట్లు కాల్చేవాడను. మన దేశానికి తిరిగివచ్చిన కొంతకాలంవరకు ఎవరైనా సిగరెట్ ఇస్తే వద్దనేవాణ్ని కాను. ఇప్పు డొక నమస్కారంపెట్టి వద్దంటాను. ఆనాడు ఆ విధంగా ఇతర బాలురు నాకు డోకు తెప్పించకుండా ఉంటే, బహుశా బీడీ సిగరెట్లు అలవాటు అయ్యేవేమో. మా నాయుడు గురువుగారు భోజనప్రియులు. ఆయనకు కోడిమాంసం అంటే చాలా యిష్టం. అడపా దడపా, మా ఊరుకు రెండు మైళ్ళదూరంలో నున్న గుడివాడపట్టణానికి వెళ్ళి కోడిమాంసం, పప్పునూనె వగైరా తెచ్చుకొనేవాడు. నూనెతో వండితే కోడిమాంసం బహు రుచి కరంగా ఉంటుంది. మూడు, నాలుగు రోజులైనా నిల్వ ఉంటుం దని దాచి దాచి తినేవాడు. ఒంటరిగా వచ్చారు. స్వయం పచనం.

నాయుడుగారితర్వాత నాకు జ్ఞాపకంఉన్న వ్యక్తి శ్రీ కేశిరాజు రామకృష్ణారావుగారు. ఆయనగారు పెట్టిన బడి మా యింటి అరుగుమీద. మా యింటిముందు వరండా ( రీపర్ బద్దలు పాలాస్త్రీ పెంకుతో సహా ), దానికి మధ్య క్రిందికి మెట్లు, రెండు ప్రక్కల గట్టి గచ్చు టరుగులు—వీని మీద బడి. రామ కృష్ణారావుగారు సరదామనిషి. చదువుచెప్పటకంటె అజ మాయిషీ ఎక్కువ. ఆయన విలాసపురుషుడు కూడా. నియోగుల నీటు, గోటు జాస్తి. చదువుచెప్పట మధ్యరకంగా ఉండేది. నాయుడుగారివద్దకంటె వీరివద్దనే చదువు కొంతకు గొంతమైన అబ్బింది. చాలా సంవత్సరాలు గడచిన తర్వాత, నే నింగ్లండు నుండి తిరిగివచ్చిన క్రొత్తలో మా అత్తవారి ఊరు పెదసనగల్లుకు సమీప గ్రామమగు భట్లపెనుమర్రులో వారిని చూచాను. ఏవిధముగా జరిగినదోగాని, వారు భట్లపెనుమర్రు గ్రామంలో బొమ్ములూరు గ్రామంలోవలెనే పిల్లలకు చదువు చెప్పటకు చేరినారు. తరువాత ఆ ఊరు బ్రాంచి పోస్టు ఆఫీసు మాస్టరై బడికి స్వస్తిచెప్పారు. నేను చూచిన తర్వాత కొలది

కాలానికే ఆ ఊరు విడిచిపెట్టి వెళ్ళిపోయారు. వారిప్పుడెక్కడున్నారో తెలియదు. వారి తర్వాత శ్రీ పోడూరి జోగయ్యగారు మా ఊరు టీచరుగా వచ్చుటకుముందు ఎవరివద్దనైనా చదివితినేమో గుర్తులేదు. చదివినా స్వల్పకాలమే అయియుండును.

శ్రీ పోడూరి జోగయ్యగారు నా ఉన్నతవిద్యకు పునాది వేసిన గురువుగారు. వారిది పశ్చిమగోదావరి జిల్లా, భీమవరం పట్టణం. వారిది వైదిక కుటుంబం. వారి కిప్పుడు ఎనభై సంవత్సరాలు నిండినా, ఆరోగ్యంతో పుష్కలమైన కుటుంబంతో సుఖజీవనము చేయుచున్నారు. ఈ మధ్య వారిని కలుసుకుంటూ నా గురుభక్తిని, కృతజ్ఞతను అందజేయుచున్నాను. వారు నాయందు శిష్యవాత్సల్యంచూపుచు ఆదరించుచున్నారు. వారు మా స్వగ్రామం బొమ్మలూరుకు, నా వివాహం 1911 ఏప్రిల్‌లో జరిగి నే నత్తవారింటిలో నుండగా వచ్చారు. వారిని మా పినతాతగారి కుమారుడు లింగం నాగభూషణంగారు పశువుల కొరకు ఉండి సంతకో, భీమవరం సంతకో వెళ్ళి, అక్కడ తటస్థపడిన వారిని మాట్లాడుకొని మా ఊరు తీసికొనివచ్చారు. శ్రీ జోగయ్యగారు అంతకు కొంచెం ముందే స్కూల్ ఫైనల్ పరీక్ష ప్యాసైనారు. కాలేజిచదువు చదువుటకు స్తోమత లేక ఈ ఉద్యోగాని కొప్పుకున్నారు. వారి కప్పటికి ఇరవై సంవత్సరాలుండవచ్చును. పచ్చని శరీరఛాయ, తేనె కళ్ళు, పల్చని శరీరం, మధ్యరకం ఎత్తు. నేను అత్తవారింటివద్దనుండి తిరిగివచ్చిన కొంచెంసేపటికే క్రొత్తపంతులు వచ్చాడు. పూజారికి క్రొత్తగా కట్టించిన ఇంట్లో బడి అని, పంతులు ఛండశాసనుడని ఇతర పిల్లలు చెప్పగా విన్నాను. ఛండశాసనుడనటంతోనే, ఏమాత్రం తలబిరుసువాడో తెలుసుకొందామని అహం నాలో పెరిగింది. అదివరకెట్లున్నా పెండ్లి కావటం, అత్తవారింటిలో మెక్కటం, ఆదరణతో చూడబడటం, స్వేచ్ఛగా తిరగటం వల్ల నా అంతవాడు లేడనిపించింది. సరే, బళ్లోకి మరునా డుదయం వెళ్లాను. తలబిరుసుగా నడచాను, మాట్లాడాను. మాష్టారుగారికి నా ధోరణి ఏమాత్రం నచ్చక వెంటనే గ్రహించి, న న్నెట్లయినా లొంగ



శ్రీ లింగం నాగభూషణంగారు

దీయాలని సంకల్పించారు. ఆ రోజో, మరునాడో ఏదో నెపం మీద బెత్తంతో నాలుగు అంటించటానికి చేయి చాపుమని ఆజ్ఞాపించారు. నేను చాపనని ఎదురుతిరిగి, తిరస్కరించి ఇంటికి వెళ్ళిపోయాను. మా నాన్నకు కబురు వెళ్ళింది. వారు నాలుగు చివాట్లుపెట్టి బలవంతంగా నన్ను బళ్లోకి పంపారు. దెబ్బలు తినందే క్లాసులో కూర్చోటానికి వీలులేదని మాష్టారు గట్టి పట్టు పట్టారు. ఏమి చేసేది? తప్పనిసరిగా తలొగ్గాను. నాలుగు అంటినవి. ఆ దెబ్బలు ఒక లెక్కలోనివి కావు కాని, నా కిది వరకు భార్యగా నిస్తామని చెప్పిన మా వ్రేలువిడిచిన మేనమామ త్రిపురనేని గోపయ్యగారి కూతురు, సరస్వతి అనే పిల్ల, ఆ సమయా నికి ఎందుకో ఆ బళ్లో ఉండటంవల్ల నాకు మిక్కిలి సిగ్గువేసింది. 'మొగుడు కొట్టినందుకు కాదు, తోడుకోడలు దెప్పినందుల'కని సామెత. తనను పనికిరాదని పరాయి పిల్లను చేసికొన్న యీ ఘనుడు కుక్కినపేనువలె దెబ్బలుతిన్నాడే అని ఆ పిల్ల అనుకొన్న దేమో అని నా కించ. సరస్వతి అందకత్తె, స్ఫురద్రూపి. ఇంచు మించు శ్వేతకన్యవలె ఉండేది. కళ్లు తేనెకళ్ళు గాని, ఆ శ్వేత రంగువల్ల వికారంగా ఉండేవికావు. నిజానికి ఏ పట్టణమో తీసికొనివెళ్ళి శ్వేతజాతీయుల దుస్తులు వేస్తే అచ్చంగా ఏ దొర సాని పిల్లేమో అని భ్రమింపజేసేది. కారణాంతరాలవల్ల ఆ సంబంధం తప్పిందికాని, అప్పుడప్పుడు ఆ పిల్లను చేసుకొంటే ఎట్లా ఉండేదో అనిపిస్తుంది.

శ్రీ జోగయ్యగారు మిక్కిలి శ్రద్ధగా చదువుచెప్పారు. తరువాత సుమారు రెండు సంవత్సరాలకు నన్ను, నా పెదతండ్రి కొడుకు నాకంటె రెండేళ్ళన్నర చిన్నవాడైన నాగభూషణంను, మా పినతాత వెంకటరత్నంగారి కడసారి కొడుకు, నాగభూషణం బాబాయిగారి తమ్ముడు, నాకంటె పదిమాసాలు తక్కువ వయస్సు గల భద్రయ్య అని మామూలుగా పిలువబడే వీరభద్రయ్యను, శ్రీ నాగభూషణంగారి ప్రోత్సాహం, సాయంవల్ల బందరు నోబుల్ కళాశాల హైస్కూలు మూడవఫారంలో 1913 జూను నెలాఖరున శ్రీ జోగయ్యపంతులుగారు చేర్పించారు. పిల్లలకు

అండదండగా ఉంటారని నాగభూషణంగారు ప్రోత్సాహపరచి జోగయ్యగారిని కూడా నోబుల్ కళాశాలలో ఇంటర్ జూనియర్ లో చేరునట్లు చేశారు. అయితే కొలది రోజులకే, జోగయ్యగారు కాలేజిని విడిచి, బొమ్మలూరుకు తిరిగివెళ్ళి అక్కడ తతిమ్మా పిల్లలకు కొంతకాలం చదువుచెప్పి భీమవరం వెళ్ళిపోయారు. జోగయ్యగారు మంచి వక్త. ఇంగ్లీషు, తెలుగులో ధారాళంగా చిలువలు పలవలతో, ఏకధాటిని గుక్క త్రిప్పుకోనకుండా, గంటలకొలది మాట్లాడే శక్తిగలవారు. మరిన్ని సాంఘిక సేవా తత్పరులు. ప్రతి ఉద్యమంలోను పాల్గొని ఆ కార్యమును తన స్వంత మనునట్లు నిరంతరం కృషి చేయువారు. ఇప్పుడు వృద్ధాప్యంలో కూడా, భీమవరం ప్రతి ఉద్యమంలోను పాల్గొనుచుందురు. వారు మా ఊరిలో పాఠశాల మొదలుపెట్టినది మా దేవాలయం ప్రక్కనున్న క్రొత్తగా కట్టబడిన పూజారి గృహంలో. తరువాత మా పినతాత పెద్ద కుమారుడు పీచు సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారింటి కానుకొనియున్న వారి పెంకుటి చావడిలో మా పాఠశాల సాగింది. శ్రీ వెంకట సుబ్బయ్యగారు మిక్కిలి బక్కగా ఉండేవారు. అందువలన 'పీచు' అనే బిరుదు వారిని వరించింది. వారి భార్య తలిదండ్రులది, మా మేనమామల ఊరు అంగలూరు. మా కుటుంబాలకు చుట్టుపట్ల అయిదారుగ్రామాలలో భూము లుండేవి. అంగలూరు సరిహద్దులలోనున్న భూములను తన వాటాకు తీసుకొని వెంకట సుబ్బయ్యగా రక్కడ స్థిరపడిపోయారు. అయినా, మండువాలోగిలి, పెంకుటి చావిళ్ళు కొన్నిసంవత్సరాల వరకు బొమ్మలూరులోనే యథాప్రకారం ఉండేవి. వెంకట సుబ్బయ్యగారు చనిపోయిన తర్వాత వారిభార్య మహాలక్ష్మమ్మగారు, కుమారుడు నాగభూషణం, కుమార్తెలు బొమ్మలూరులోనే తరచు ఉండేవారు. గొడ్లచావడిలో బడి ఉండగా, ఒకనాడు ఎలిమెంటరీ స్కూళ్ళ సూపర్ వైజరు తనిఖీకి వస్తాడని తెలిసింది. ఆ రోజుల్లో మా బడివంటి ప్రైవేటు స్కూళ్ళకు గవర్నమెంటువారు పిల్లల సంఖ్యనుబట్టి, వాళ్ళ హాజరునుబట్టి, గ్రాంటు లిస్తుండేవారు. పిల్లలతండ్రు లిచ్చిన స్వల్ప రుసుములుగాక ఈ గ్రాంట్లు పంతుళ్ళకు అదనపు ఆదాయం. కాబట్టి సూపర్ వైజరును మంచి

చేసుకోటానికి, ఎలిమెంటరీ టీచర్లు తంటాలుపడుచుండేవారు. సూపర్‌వైజరుగారు మరునాడుదయమే వేంచేస్తారని ఆ సాయంత్రం మా మాష్టారుగారికి తెలిసింది. ప్రాత పశువులచావిడి కాబట్టి అంతా గలీజుగా ఉండింది. ఒకప్రక్క పెంటప్రోగు, గోడలకు, పై కప్పుకు బూజుపట్టి ప్రదేశమంతా అసహ్యంగా ఉండింది. పైగా, నేలచూస్తే అక్కడక్కడ పేడెత్తి మెరక పల్లాలుగా ఉండింది. ఏమి చెయ్యాలి ? మాష్టారు ఇద్దరు ముగ్గురు పిల్లల తండ్రులకు, సాయం కావాలని కబురు పంపారు. అవి పని రోజులు కాబట్టి, ఎవరినుండి సాయం రాలేదు. ఇక లాభంలేదని నిరాశపడుచుండగా, మాలో కొందరు పిల్లలం ముందుకువచ్చి, మేము చక్కబరుస్తామని బైలుదేరాం. చావడి ప్రక్కనున్న పెంటపోగును, దాని కవతలి ఖాళీస్థలంకు జేరవేశాం. చీపుళ్ళతో నేల, గోడలు, పైకప్పు శుభ్రపరిచాం. పేడతో నేలను, గోడలను అలికాం. రాత్రి ప్రొద్దుపోయేవరకు ఊపిరాడకుండా పనిచేసి ఆ చావడిని ఒకదారికి తీసికొని వచ్చాం. ఇంటి యజమానురాలు చాలా ఆదుకొని, తన నౌకరిపిల్లను కలుపుకొని శ్రమించి, ముగ్గులు వగైరా వేసింది. తెల్లవారే టప్పటికి ఆ గొడ్లచావడి, పెళ్ళిపందిరి. గుమ్మానికి కట్టిన మామిడి తోరణాలతో, క్రొత్త అలుకుడుతో శృంగారంగాపెట్టిన ముగ్గులతో ముసిముసి నవ్వులు కురిపించింది. మాష్టారు మనస్సు కుదుటబడి సంతోషించింది. ఈ సంగతి విన్న మా పెద్దలు కొంత విస్తుపోయారు.

ఒకనాడు సాయంత్రం (శ్రీ) నాగభూషణంగారు మా బడి లోనికి వచ్చి, మమ్ములను పరీక్షించా లనుకొన్నారు. పెద్ద పిల్ల లందరం లేచి వరుసగా నిలుచుండినాము. నాగభూషణంగారు ఎదురుగా మధ్యకు వచ్చి "వీసెడు ఇనుము ఎక్కువ బరువా, వీసెడు దూది ఎక్కువ బరువా, ఏది ఎక్కువ బరువు ?" అని మమ్ములను ప్రశ్నించారు. మాలో ఒక రిద్దరం అనాలోచితంగా వెంటనే ఇనుము ఎక్కువ బరువన్నాము. మా ప్రక్కనే నిలుచుండిన మా మాష్టారుగారు ఆందోళనతో సమానమే అని గొణుక్కొన్నారని నే ననుకొన్నాను. వారు గొణుక్కొని ఉండక పోవచ్చును. గొణుక్కొన్నా, మా పంక్తిలో నిలుచుండిన వారి

తమ్ముడు శ్రీరామమూర్తి వినకపోవచ్చును. శ్రీరామమూర్తి ఒక్క-క్షణం ఆలస్యంగా రెండూ సమానబరువే అన్నాడు, దానితో మా గురువుగారికి గండం గడచినట్లైనది. తనను మా ఊరు మాకు టీచరుగా తీసికొనివచ్చి ప్రవేశపెట్టింది నాగభూషణంగారు. రాకరాక వారు వచ్చి సరదాపడి ఒకే ఒక ప్రశ్న వేస్తే తప్పు జెప్పితే పాపం, మా పంతులుగారికి నిస్పృహ కలుగదా? ఏ టీచరుకైనా తన శిష్యులు బాగా చదువుకొనుచున్నారని ఇతరులు సంతోషించాలని ఉండదా?

ఈ కాలంలో జరిగిన మరొక సంఘటన నాకు బాగాజ్ఞాపకం. ఇప్పటికి కూడా గుర్తుకు వస్తూ ఉన్నది. ఉత్తర హిందూస్థానం తాలూకొక బట్టలవ్యాపారి నారపట్టు పైపంచెలు అమ్మకానికి తెచ్చాడు. అవి పసుపుపచ్చరంగులో, పెద్ద ఎర్రగీతల చెంగులతో చాలా ముచ్చటగా ఉండినవి. తానొకటి కొని విద్యార్థులను కొనుడని జోగయ్యగారు ప్రోత్సహించారు. డబ్బుకొరకు మా నాన్నను విసిగించగా ఆయనకు కోపంవచ్చి ఛెళ్ళున చెంప కాయపెట్టారు. నేను అన్నుడనవగా, కొంతసేపటికి రూ 10, 11 డబ్బిచ్చి పంపారు.

## కౌమారం

నా వివాహం 1911 సం. ఏప్రిల్ 21 వ తేదీన జరిగింది. నా కప్పటి కింకను పదమూడేండ్లు నిండలేదుకాని, కౌమారదశ ప్రారంభించినట్లు చెప్పవచ్చును. నా భార్య కృష్ణాజిల్లా, దివి తాలూకా, పెడసనగల్లు కాపురస్థుడు శ్రీ సూరపనేని సీతారాముడుగారి రెండో కుమార్తె. ఆమె కప్పుడు సుమారు పదివర్షములు. ఆయన పెద్ద కుమార్తెను, నా పెద తండ్రి కుమారుడు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి పెద్ద కుమారుడు సత్యనారాయణునకిచ్చి 1909 లో వివాహంచేశారు. కాబట్టి నాకు కుదిర్చిన పిల్ల నాకు కోడలు వరస అవుతుంది. మా కుటుంబంలో అంతకు చాలా సంవత్సరాలకుముందే కొడుకు, తండ్రి

వరసవారు పద్ధకులై యుండినారు. కమ్మరికంలో ఇది తప్పుగా ఎంచబడలేదు. అయితే తండ్రి ముందు వివాహం చేసుకొంటే, ఆయన మరదలు పినతల్లి అవుతుంది కాబట్టి, ఆ పిల్లను చేసుకోవటం సమంజస మవుతుందా అన్న ధర్మసందేహం నావలెనే చాలామందికి కలుగవచ్చును. అయితే ఒక సామె తున్నది. "కమ్మకు వరసలేదు, కప్పకు తోకలేదు" అని. ఇది అతిశయోక్తి అనుకోండి. అయితే ఇంకొక సామెత కూడా ఉన్నది, 'కోడలితో కులకవచ్చని'. అయినా మరీ రక్తసంబంధం, జ్ఞాతివర్గం కాకపోతే కమ్మ సంఘంలో వివాహ నిబంధనలు కొంత సులువుగానే వుంటవనుకొంటాను. రక్తసంబంధంలోకూడ మేన కోడలిని చేసికోవటం ఇప్పటికిని తప్పుగా ఎంచబడటంలేదు. ఇతర కులాల్లోకూడ ఈ ఆచార మున్నట్లున్నది. కాని అక్క కొడుకును చెల్లెలు కూతురు చేసికోవటం మిక్కిలి అధర్మంగా ఎంచబడు తుంది. ఎందుకీ భేదం ? ఆచార మయ్యుండాలి. రక్తసంబంధ మించుమించు సమానమేకదా !

బుల్లి సుబ్బయ్యగారు మా తండ్రికంటె అయిదేళ్లు మాత్రమే చిన్నవాడు. అన్నదమ్ము లేడుగురిలో మా నాన్నగారు కడసారి వాడు. బుల్లి సుబ్బయ్యగారు పెద్దవారి సంతానం. అందువల్ల వయస్సులో తారతమ్యం స్వల్పం. వయస్సులో ఎక్కువ తేడా లేకపోవటంవల్ల, బుల్లి సుబ్బయ్యగారికి మా తండ్రియందు మిక్కిలి చనువు. పైగా మా తండ్రి అమాయక మనస్తత్వం కలవారు. బుల్లి సుబ్బయ్యగారు మిక్కిలి తెలివితేటలు, చాకచక్యం కలవాడు, మంచి మాటకారి. ఎట్టివారినైనా మాటలతో వశపర్చుకొనే కౌశలంకలవాడు. మా తండ్రిగారి కాయనగారంటే ప్రత్యేకాభిమానం, ఇష్టం. ఇదివరకున్న చనువేగాక, తన కోడలుచెల్లెలిని నాకు వివాహంచేయిస్తే, మా తండ్రి మరింత దగ్గరవాడవుతాడని బుల్లి సుబ్బయ్యగారు తలచివుండవచ్చును. ఏ కారణంవల్లనైనా, ఆయన మా తండ్రితో ఈ సంబంధానికి ఒప్పించారు. మా మామ సీతారాముడుగారికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. రైతు పద్ధతిలో సంపన్నుడు. ఆయన బావమరదులు, చెరుకూరి వెంకటరత్నం వగైరా మిక్కిలి

భుజబలం, ధాటి గలవారు. పెద్ద భూస్వాములు. ఆ రోజుల్లో పెడసనగల్లు మిక్కిలి మోటు ఊరు. ఇంచుమించుగా చదువు కున్నవాళ్లు సున్న. మా మామగారికి తన కుమార్తెలను సంపదతోపాటు నాగరికత, చదువున్నకుటుంబాలలో ఇవ్వాలని బుద్ధిపుట్టింది. బావమరది వెంకటరత్నంగారు సంబంధాలకోసం చంకలో పైపంచెపెట్టుకొని బైలుదేరారు. ఆ రోజుల్లో బుల్లి సుబ్బయ్యగారికి ఆస్తిపాస్తులు పుష్కలంగా ఉండినవి. వారి ఠీవి, దర్జా, మాటచెల్లుబడి విశేషంగా ఉండేవి. ఆయన కుమారుడు బందరులో చదువుకొనుచుండేవాడు. ఇక నేం, ఆ సంబంధంకొరకు వెంటబడ్డాడు. ఆ రోజుల్లో కట్నాలు బహు స్వల్పం. సంపదగల కుటుంబాల్లోకూడా వెయ్యో, రెండు వేలో ఉండేదేమో. తాము ఎనిమిది ఎకరాల మాగాణి భూమి, వెయ్యి న్నూటపదహార్లు నగదు ఇస్తామనిన్ని, ఇతర లాంఛనాలు బాగుగా జరుపుతామని, పిల్లకు బోలెడు నగలున్నవని నచ్చజెప్పారు. వివాహం జరిగింది. ఆ రోజుల్లో దేవరకోటసీమలో ముఖ్యంగా పెడసనగల్లువంటి గ్రామాల్లో ఆడపిల్లలకు తలమీద, మెడలో బంగారు వస్తువులేగాక, కాళ్ళకు మూడురకాల వెండి వస్తువు లుండేవి. బేడీలు, వంకెలు, గొలుసులు. మా వదినెకీ మూడు వస్తువులు మిక్కిలి ఘనంగా ఉండేవట. వాని మందం, మోటు తనం అంపకాలయి వధువు మా ఊరు వచ్చినప్పుడు, ఊరులోని అమ్మలక్కలు వింతగా చూచి గుసగుసలు పోయారట. ఇంచు మించుగా ఆ పద్ధతిలోనే ఆమె చెల్లెలికాభరణాలుండేవి. సరే, మా నాన్నకు నచ్చజెప్పి, బుల్లి సుబ్బయ్యగారు ఖాయమని కబురు పంపిన తర్వాత ఎందుకైనా మంచిదని కాబోలును, మా బావ మరది పున్నయ్యగారు తన చెల్లెలికి కాబోయే భర్త ఎట్లా ఉంటాడో చూడటానికి మా ఊరు వచ్చాడు. అప్పుడు మా తండ్రులు పెరిగిన ప్రాత యింట్లో మా పెద పెద్దయ్య, అనగా బుల్లి సుబ్బయ్యగారి అభిమాన జనకుడు వెంకటప్పయ్యగారి స్వాధీనంలోనే ఉండింది. నే నప్పు డెక్కడో తిరిగి మురికిబట్ట లతో, ధూళి ధూసరతో ఆ యింట్లో ఉండినాను. పున్నయ్యగా రక్కడకు వచ్చునప్పటికి సాయంత్రమయింది. నన్ను చూచి



కీ. శే. శ్రీమతి లింగం అన్నపూర్ణమ్మగారు

( గ్రంథకర్త భార్య )

ఫలానా అని తెలిసికొన్నాడు. మరునాడుదయమే తన ఊరుకు తిరిగివెళ్ళి, తన తలిదండ్రులతో "పిల్లవాడు వికారంగా ఉన్నాడు, మన పిల్లకు ఏమాత్రం సరిగాడు" అని చెప్పాడు. అందుమీద సంబంధం అక్కరలేదని మా ఊరికి కబురువచ్చింది. దానితో బుల్లి సుబ్బయ్యగారికి నడుము విరిగినట్లై, ఎకాఎకిని పెడసనగల్లు వెళ్ళి వారిని సమ్మతిపరచటానికి ప్రయత్నించాడు. మా అత్తగారు గట్టి పట్టుపట్టి సుతరాం వద్దన్నారట. బుల్లి సుబ్బయ్యగారు తిరిగివచ్చి మా పెద్దలను అనగా తనను దగ్గరకుతీసిన తండ్రి వెంకటప్పయ్యగారిని, అప్పటికే పేరు ప్రఖ్యాతులు గడించిన నాగభూషణంగారిని, మాటకారి, సమర్థుడు, సమయస్ఫూర్తి కలవాడు, బుల్లి సుబ్బయ్యగారి వియ్యంకుడు, మాకు ప్రాతబంధువు గుత్తా వెంకటరత్నంగారిని, ఇంకొక ఇద్దరిని వెంటతీసికొని తిరిగి పెడసనగల్లు ఆ మధ్యాహ్నానికే చేరుకొన్నారు. మా అత్త రంగమ్మగారు పట్టుపట్టి వీలుకాదనటం, వీరు బ్రతిమాలటం, వాదోపవాదాలు. ఆరాత్రి ఏ ఒంటిగంట రెండుగంటలకో ఆమెతో "ఊ" అనిపించగలిగారట. భోజనానంతరం సంభాషణలు ప్రారంభంకాగా మా అత్తగారు వారి ఇంటిమధ్య వున్న పెద్ద భోషాణంమీద ముసుగుపెట్టుకొని పడుకొన్నదట. వీరు ఆ హాలులోనే మంచాలువేసుకొని కూర్చుండినారట. వారు మా మామ, అక్కడుండిన వారి బంధువులు చెప్పగా చెప్పగా, బ్రతిమాలగా బ్రతిమాలగా, నిష్ఠూరాలు వగైరా జోరుగా వర్షించగా, చిట్టచివరకు ఆమె "ఊ" అనటం గగనమై పోయిందట.

మా మామ సీతారాముడుగారు మంచి తెలివితేటలు కలవాడు, ఉపాయశాలి, సమర్థుడు. అయితేనేమి, మా అత్త చాలా బింకం, పట్టుదలగల మనిషి. ఆమెది మూర్ఖపు మొండితనం. మనిషి మిక్కిలి బలంగల ఆజానుబాహువు. ఊళ్లోని అన్న దమ్ములు మిక్కిలి భుజబలంగల సంపన్నరైతులు. మా మామ సామాన్య కుటుంబంలోనివాడు. చిన్నప్పుడే ఆయన తలిదండ్రులు పోయారట. ఆయన వాళ్ళ ముగ్గు రన్నదమ్ములలో కనిష్ఠుడు. ప్రాత బంధుత్వం కలుపుకొని, ఆ ఊరి చెరుకూరి వెంకన్నగారు

మా మామకు చాలా చిన్నవయస్సులోనే, తన కూతురు బాలిక రంగమ్మగారినిచ్చి పెండ్లిచేసి, ఇంట్లోనే కొన్ని సంవత్సరాలు పెట్టుకొని తరువాత వాళ్లేపూనుకొని, ఇల్లొకటి కట్టి అందులో సంసారం పెట్టించారట. వాళ్ళ అండదండలవలననే, మా పెళ్ళి నాటికి సంపన్నగృహస్థుడైన మా మామ, మా కదివరకు లేనంత పెద్దకట్నం ఇచ్చి తన కూతుళ్ల నిచ్చాడు. చిత్రమేమి టంటే, ఈ సంబంధం నలుగుచుండగా, ఈపిల్లయే నాకు భార్య కావాలని నేను మా దేవాలయానికివెళ్ళి చాటుగా మా దేవుడు సోమేశ్వరస్వామివారిని ప్రార్థించి మొక్కుకొన్నాను. తర్వాత ఒక ఘట్టంలో ఈ భార్య నా కెందుకు దాపురించిందిరా అని దిగులుపడ్డా, విధి బలీయంచేత కాబోలును నా పిన్నవయస్సు లోనే ఆ పిల్లను చూడకుండానే, ఆమె తలిదండ్రుల విషయం తెలియకుండానే, ఆ పిల్లనే నా భార్యగా చేయుమని భగవంతుని ప్రార్థించాను. కర్మఫల మెవరు తప్పించగలరు ?

తొలిసారి అత్తవారింటికి భార్యతో వెళ్ళినప్పుడు, ఏకా ఎకిని మూడు మాసా లక్కడే ఉండిపోయాను. ఈ రోజుల్లో ఏ మూడు నాలుగు రోజులో ఉండి తిరిగి వస్తారుగాని, ఆ రోజుల్లో మూడు మాసా లుండటం పెద్ద విశేషంగాదు. మా నాన్నగారు మొదటి అత్తవారింటివద్ద ఏకాఎకిని ఆరు మాసా లుండినారట. ఒకప్పుడు, మా పినతాత నాల్గవ కుమారుడు శ్రీ పాపినీడుగారు మాటల ప్రస్తావనలో మా నాన్న ఇంటికి తిరిగివచ్చినప్పుడు కాలులుతిరిగిన పడుచు ఆబోతులాగా తయారై వచ్చారని నవ్వుతూ అన్నారు. ఆ రోజుల్లో అల్లుళ్ళను నిజంగా ఆబోతును మేపినట్లే మేపేవారు. 'అత్తవారింటి అల్లుడైనా కావాలి, ఆబోతైనా కావా'లని సామెత. ఇప్పుడు తలచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. రేకులు రేకులుగా సన్నని ప్రొయ్యిమీాద వండిన కందిపప్పుతో, చేరెడు నేయితో, రెండు మూడు కూరలతో, కడుపునిండా మెక్కటమేగాక, మధ్యాహ్నం భోజనమైన ఏ రెండున్నర మూడు గంటలకో పెద్ద పెద్ద మినపగారెలు ఒక్కొక సారి పెసరగారెలు కూడా పండ్రెండుకు తక్కువ లేకుండా తినే వాళ్ళం. ఆ రోజుల్లో మినపగారెలు చాలా పెద్దవిగా వుండేవి.

పెసరగారె లిప్పటి సైజుకంటె కొంచెంమాత్రమే హెచ్చుగా వుండినా, మధ్య మధ్య అవీ ఇవీ తింటూనే వుండే వాళ్ళం. ఆ తిండిలో ఇప్పటి కుర్రవాళ్లు సగంకూడా తిని జీర్ణించుకోలేరు.

అప్పుడు ఊరి అల్లుళ్ళు నేను నా షడ్డకుడుగాక, ఇంకా ఇద్దరు ముగ్గు రుండేవాళ్ళం. మేము ప్రతి సాయంత్రము ముస్తాబై షికారుకు ఊరిబైటకు కాల్వగట్టుకో, చెరువు ప్రక్కకో పోతూ ఉండేవాళ్ళం. మా ఉభయులు ధోవతి చెంగులు లాగువలె కన్పడేటట్లు కాళ్ళకు చుట్టి, (సైకిల్ కట్టు అంటా రిప్పుడు) పైపంచె జంధ్యంలాగు ఒక భుజంనుండి రెండో డొక్కమీదకు ముడివేసి జారవిడిచి షికారుకు బైలుదేరేవాళ్ళం. ఆ రోజుల్లో మల్లుపంచెలు, ఎర్రసిల్కు వోణీలు (పై పంచెలు) చాలా సరదా.

ఆ మొదటిదఫా అనుకొంటాను, ఒకసారి నా భార్య ఇంట్లో నుంచి బైటకు గెంతుతూ ఉంటే, బైటనున్న నేను ఎందుకో యింట్లోకి పరుగెత్తుచూ మెట్లమీద తారసపడిన ఆ పిల్ల చేయి ఉత్సాహంతో పట్టుకోగా, "ఇదిగో! మా నాన్న వస్తున్నా" డని ముందుచూపు చూచి, చటుక్కున చేయి విడిపించుకొని పారి పోయింది. అప్పుడు పరికిణీలు కట్టుతూ ఆడుకొనే వయస్సుపిల్ల. నేనుకూడ బాలుడనే. ఆ ఒక సంఘటన తప్ప, మరే ముచ్చట నా కా రోజుల్లో సంభవించలేదు. తరువాతకాలంలో ఇంచు మించుగా లేనట్లే. సహజంగా ఉత్సాహవంతురాలైన పిల్లయే కాని ఆ యింటి వాతావరణం వల్లనో, నా మందకొడి వల్లనో మేము పరస్పరం సరసాలవంటివి ఎన్నడు జరుపుకొనలేదు.

ఆ మొదటి సంవత్సరాలలో జరిగిన సంఘటనలు, దృశ్యాలు కొన్ని జ్ఞాపకంవస్తున్నవి. నా షడ్డకుడు, నాకంటె మూడేండ్లైనా పెద్దవాడు, నాకంటే దృఢకాయుడు. నేనుకూడా లావుగా, నిండుగా ఉండేవాడను. మత్తెక్కించే భోజనంవల్ల గర్వం బలిసింది. అందువల్ల అతనితో రెండు మూడుసార్లు హుషారుతో ఎదుర్కొనటం, మే మిద్దరం కలబడటం జరిగింది. కాని అతనికి చాలక, క్రింద పడిపోయేవాడను. అతను, చూచే వాళ్ళ మెప్పులతో విజయసూచకంగా నామీద ఎక్కి ఒకక్షణం

కూర్చునేవాడు. విరోధభావంతోగాక వినోదంగానే ఈ కుస్తీలనుకోవాలి.

మా మామ సూరపనేని సీతారాముడుగారు ఆ గ్రామంలో పేరుగల మనిషి. మిక్కిలి తెలివితేటలు, ఇంగితజ్ఞానము కలవాడు. కోర్టులో సాక్ష్యము చెప్పవలసివస్తే చెప్పినమాట చెప్పకుండా, వకీలుకు ఏమాత్రం సందివ్వకుండా మిక్కిలి చాకచక్యంగా చెప్పేవాడట. నిశాని పద్దుకాని, మిక్కిలి కుశాగ్రబుద్ధి, కార్యదక్షుడు, లౌకికుడు. ఎటువంటివారినైనా మాటలతో పడగొట్టేవాడు. అవతలివాని కిష్టములేకపోయినా, ఏవో కల్లబొల్లిమాటలు చెప్పో, ఏదో ఆశపెట్టో, లేక తన పలుకుబడి చేతనో, పనులు చేయించుకొనేవాడు. ఆయనమాటలకు ఎదురు చెప్పుటకు చాలామందికి సాహసముండేదికాదు. ఎక్కడ, ఏ తంటా తెచ్చిపెడతాడో అని భయముండేది. దీనికితోడు ఆజానుబాహులు, మిక్కిలి బలిష్ఠులు. పెద్దగా భూవసతిగలవారు. బావమరదుల మిక్కిలి చాకచక్యము, తెలివితేటలుగల మామ చెరుకూరి వెంకయ్యగారి అండ ఉండేది. సీతారాముడుగారు ప్రతిష్ఠకొరకు దేవులాడేవారు. వారింటికి సమీపాన పదిగజాల దూరంలో, వీధిలోనే వడ్రంగి బ్రహ్మయ్యగారిల్లుండేది. ముందు చావడిలో ఆయన కుమారుడు పున్నయ్యతో కలిసి కమ్మరం, కొయ్యపనులు చేసుకుంటూ ఉండేవాడు. మేము ఉబుసుపోకకు అక్కడకు తరచు వెళ్లుచూ ఉండేవాళ్లం. ఒకనాడు వాళ్లు పట్టిమంచం కోళ్ళ కనుకొందును, తరిణీ పట్టుకొనుచుండగా వెళ్ళి తరిణీనిత్రిప్పే త్రాడును నేను లాగటం మొదలుబెట్టాను. అంతలో ఎందుకో అక్కడకు వచ్చిన మామగారు చూచి గట్టిగా మందలించి ఇంటికి తీసికొనివెళ్లారు. వారు ఆస్తిపరులు, పలుకుబడి కలవారు. వారి అల్లుడు కూలివానివలె తరిణీలాగటం వారికి నామోషి. ఈ ధోరణిలో చివాట్లు తిని, అప్పటినుండి ఆ వడ్రంగి ఇంటికి వెళ్ళటం తగ్గించాను.

ఆ గ్రామనివాసి, కమ్మవారు శిరిపురపు అంజయ్యగారనేవారు, భక్తిభావంతో హరిసంకీర్తనం చేస్తూ తరుచు గోవిందలు కొట్టుచుండేవారు. ఉదయస్నానాలు, పంగనామాలు తులసిపేర్లు

—హరిదాసువలె తయారవుతూఉండేవాడు. వారి భక్తి ఉత్సాహంలో నేను కూడా కలసిపోయి, వీలైనప్పుడల్లా, ముఖ్యంగా సాయంత్రంవేళ, ఆయనగారితోపాటు పెద్ద వీధి కంసాలివారి అరుగుమీద కూర్చొని గోవిందలు గావుకేకలతో, కొట్టుచుండేవాడను. మా మామగారు తన ప్రతిష్ఠకు భంగమనుకొని నన్ను మందలించి ఆ గావుకేకలు మాన్పించారు. మామగారు దర్జాకు లోటువచ్చే ఏ పనిని సహించేవారుకాదు. మరిన్ని, నామీద అధిక అభిమానంతో నా కుర్రతనపుచేష్టలను మాన్పించి నన్ను బాగుచేయాలి, తన ముద్దుకూతురు సుఖపడాలి అనే కాంక్ష కల్గియుండేవారు.

కాని మేము చీట్లపేక ఆడుకొంటే తప్పుగా ఎంచేవారుకాదు. నేను, నా పడ్డకుడు తరుచు అక్కడ ఇక్కడ చీట్లపేక ఇతరులతో కలసి ఆడేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు మాపెద్దత్త భర్త సూరపనేని శోభనాద్రిగారితో కలసి ఆడేవారం. వారు మాకంటె చాలా పెద్ద. మా పెద్దత్త చనిపోగా సమీపగ్రామం చినముత్తేవిలోని, పుణుకొల్లు పుండరీకాక్షుడు అనే ఘరానావ్యక్తిగారి సోదరి శ్రీమతి వెంకమ్మగారిని ద్వితీయం చేసుకొన్నారు. శ్రీ పుణుకొల్లు పుండరీకాక్షుడుగారు స్ఫురద్రూపి, ఆహ్లాదకరమైన వ్యక్తిత్వం కలవారు. సౌమ్యుడు, బంధుప్రీతి కలవాడు. అతిథి సత్కారములో అందెవేసిన చెయ్యి. దాత. ఆప్యాయతతో మాట్లాడేవారు. శోభనాద్రిగారిది భారీ విగ్రహం, మిక్కిలి లావుగా, బొజ్జమెలికలు తిరిగి గంభీరంగా ఉండేవారు. వయస్సు వచ్చినా, మోయలేనంత శరీరమైనా, మంచి చురుకుగా, ఉత్సాహంతో పేకాట ఆడేవారు. గెలుపు ముక్కను, దబాయించి గట్టిగా చాపమీద చరిచేవారు. వీరి భార్య వెంకమ్మగారు అందమైనవారు. పచ్చని శరీరం, చురుకైన ముఖం, మంచి తెలివితేటలు గల మాటకారి. అప్పటి కామె యౌవనదశ దాటి, సామాన్య గృహిణిగా తోస్తుండేది. ఆమెకు ఈ వయస్సుమళ్ళిన పెనిమిటి చాలా ఉత్సాహంతో పేకముక్కలు గట్టిగా కూర్చున్నచాపమీద కొట్టుచూ, కేరింతలు కొట్టుచు ఆడుచున్నప్పుడు సంతాన విహీనమైన ఆమె ఏమి

భావించేదో కాని బంధువులమైన నన్ను, నా పడ్డకుని ఆప్యాయంగా చూచేది.

వీరు గాక పెనుగొండ గంగయ్యగారనే వైశ్యుడుండేవాడు. ఆయనది పేరుకు చిల్లరదుకాణంగాని, దాని నంత దక్షతతో నడిపించినట్లులేదు. ఆయనకు కబుర్లు, సాంగత్యం ఇష్టం. దూరంగా ఒక ప్రక్కనుండిన వారింటికి వెళ్ళి చీట్లాట ఆడేవాళ్ళం. ఆయనగారు ముందు ఆవరణ దర్వాజా తలుపులు బిగించి వచ్చి, స్థిమితంగా ఉత్సాహంతో గంటలకొలది ఆడేవారు. పెద్దగా నవ్వుచు, మాట్లాడుచు, గట్టిగా ముక్కలను చరుచుచు ఆడేవారు. మాకంటె వయస్సులో చాలాపెద్ద. అయితే మావంటి కుర్రవాళ్లను జోరుచేసేవాడు. మధ్య మధ్య మన్నె వెంకయ్య, యార్లగడ్డ చలమయ్య, ముక్క రాఘవయ్యగార్లతో ఆడుచుండేవాళ్ళం. ఆవిధంగా కొంత కాలక్షేపం, తిన్న తిండి అరగటం జరిగేది.

ఆ రోజుల్లో అల్లుళ్ళను ఆబోతు గిత్తలను మేపినట్లు మేపే వారని పైన చెప్పాను. భోజనపదార్థాలలో ముఖ్యంగ ముద్దగా వండిన కందిపప్పు, దానిలో కమ్మగా కాచిన చేరెడు నెయ్యి ప్రతి ఉదయం తప్పదు. చిన్న పిడతలో నీరు సరిపడాపోసి, పిడకల పొయ్యిలో సన్నని సెగమీద నెమ్మదిగా ఉడికే పప్పుపైన తెట్టు కట్టేటట్లుగా వేయించిన కందిపప్పును వండి, ఆ సుద్దపప్పును అప్పుడే చక్కగా కాచిన చారెడు నేతితో కలిపిన వరి అన్నం ముద్ద, స్వర్గానికి ప్రథమ సోపానం. ఆ రకంగా తయారుచేసి ఉపయోగించిన కందిపప్పు సరియైన జీర్ణానికివస్తే అంతకంటె తృప్తి, బలంగల ఇంకొక ఆహారం ఉండదని ఇతరుల అభిప్రాయమే కాకుండా నా అభిప్రాయంకూడా. తరువాతి రోజుల్లో ఆ విధమైన పచనం ఆగిపోయింది. పూర్వంవలె, తమ చేలోపండిన మంచి కందులను చక్కగా వేయించి పప్పుచేసికొనేవాళ్ళు అరుదైపోయారు. ఇప్పుడే షోలాపూరుపప్పు తెచ్చుకుంటారు. బజారులోపప్పు పచ్చిదేగాని, వేయించినదికాదు. పచ్చిపప్పు ఎంత మంచిదైనా, వేయించిన పప్పుకున్న సువాసన, రుచి దానికి రాదు. నాకు కందిపప్పు చాలా యిష్టం. పైగా పుష్టికరమైన ఆహారమని నమ్మకం. అందువలన ఒకప్పుడు నేను బరంపురంలో ఉండగా ప్రతి నిత్యం

ఉదయభోజనంలో పప్పుండా లని చెప్పాను. కొలదిరోజులు గడచిన తర్వాత కడుపు కుట్టెక్కింది. కాయకష్టంచేసేవాళ్లకు కాని మనకు పడదని పప్పుభోజనం మానేశాను. అయితే ఇప్పుడు కూడా పండుగ పబ్బాల్లో ఏ పిచ్చి పచ్చిపప్పో చేరెడు నేతితో తింటాను. కాని ఇప్పు డింకొక విశేషం, చల్లలో నానవేసి ఎండబెట్టిన మిరపకాయలు, రోఁడోపక్షం బెండకాయ వేపుడు, అప్పడాలు, వడియాలు పప్పులో నంజుగా తింటే బాగాఉంటుంది.

ఈ కాలంలో రెండు మంచిపను లాగ్రామంలో జరుగుచుండేవి. ఒకటి రామభజన, రెండు పురాణకాలక్షేపం. శిరిపురపు సుబ్బయ్య అనే సజ్జనుడు, రామభక్తి పూరితుడై ఎంతో ఉత్సాహంతో, ఉద్రేకంతో రామకీర్తనలు పాడుతూ భజన చేసేవాడు. ఈ భజనలో గ్రామస్థులు ఆసక్తితో పాల్గొనేవారు. నావంటి పిన్నవాళ్ళకు భావోద్రేకం కలిగేది. గ్రామ వాతావరణంలో ఒక విధమైన భక్తిపారవశ్యం, మలయానిలం ప్రసారించినట్లుగా ఉండేది. సుబ్బయ్యగారే గాక, సూరపనేని రామబ్రహ్మం అనేవారు గ్రామం తూర్పుప్రక్కన భజనలు సాగించేవారు. రెండవది, దేవాలయ కట్టడాల ఆవరణలో (దేవుణ్ణి ప్రతిష్ఠించలేదు) కూచిపూడినుండి శాస్త్రులుగారు వచ్చి భారతం వగైరా గ్రంథాలను ఇతరులు చదువుచుండగా తాము అర్థ తాత్పర్యాలు చెప్పుచు నీతులు బోధించేవారు. పద్యాలు చదివేవారిలో శ్రీ లింగంనేని పెద లక్ష్మీనారాయణగారి పెద్ద కుమారుడు ముత్యాలుగారు అగ్రగణ్యులు. వారి కంఠం మిక్కిలి శ్రావ్యంగా ఉండేది. ఉచ్చారణ స్పష్టంగా ఉండేది. వారి తరువాత చెప్పుకోతగ్గవారు, ముత్యాలుగారు లేనప్పుడు చదివేవారు. మణేదాసుగారి తమ్ముడు సూరపనేని లక్ష్మీపతిగారు. ఈ సత్కార్యములతోబాటు ఆ రోజుల్లో పండుగలు, వ్రతాలు, నోములు ఎక్కుడు ఆసక్తితో, శ్రద్ధతో చేసుకొనేవారు. అందువలన స్త్రీలకు కూడా కొంత ఉబుసుపోవటం, కొంత వైవిధ్యంకలగటం, కొంత హుషారు జనించటం జరిగేవి. తమ హిందూమతంమీద అభిమానం సడలకుండా ఉండేది. గ్రామాల్లో ఈ సంకీర్తనలు, వేడుకలు,

పండుగ పబ్బాలు, ఆటలు, పాటలు సన్నగిలిపోవుచున్నవి. భజనలు, హరికథలు బొత్తిగా నిలిచిపోయినవి. అందువలన ముఖ్యంగా స్త్రీలు ఇతర మత సంకీర్తనల, ప్రార్థనల వ్యామోహంలో పడిపోవుచున్నారు. పెడసనగల్లులో ఇప్పుడు క్రైస్తవ పూజామందిరం వెలసింది. కీర్తనలు, భజనలు పెరుగుచున్నవి. ఆ మతపండుగలు, శుభ దినాలు వేడుకగా జరుపబడుచున్నవి. క్రైస్తవమతస్థుల కిట్టివి విధ్యుక్తధర్మాలు, ఆచరించవలసినవి. కాని పాల్గొనేవారు స్థితిమంతులైన రైతుకుటుంబాలకు చెందిన హిందూస్త్రీలు. భర్తలకు ఇష్టంలేకపోయినాసరే, వీరు బొట్టు పెట్టుకోనటం మానివేశారు. హిందూపండుగలను అశ్రద్ధచేయటమో, విడిచిపెట్టటమో చేస్తున్నారు. కీర్తనలు పాడుచూ, తెల్లవారుఝామునో, అప్పటివరకో ఊరంతా సందోహంగా ఊరేగుచున్నారు. కొంతమంది తాలిబొట్టుకూడా తీసివేశారేమో అని నా అనుమానం. ఈ చర్యలవల్ల తమ స్వకులంలో ఉన్నను క్రైస్తవులుగా నున్నారు. నాకు క్రీస్తు అన్నా, క్రైస్తవమత మన్నా నిండు గౌరవం. పైగా మతం వ్యక్తిసంబంధమైనది మాత్రమే అని గాఢంగా నమ్మేవాడను. భార్యగానుండుటకు, తాళిబొట్టు అవసరం కాదని చెప్పేవాళ్లలో మొదటివాడను. కులాభిమానం చంపుకోలేకపోయినా, సమానకులాల్లో అంతర్వివాహాలు కావాలని మనస్ఫూర్తిగా కాంక్షించేవాడను. అయినా హిందూమతంలో పుట్టి పెరిగినవారు ఎందులకు దానిని పరిత్యజించాలో నా కర్థము కాదు. గ్రామాలలో మన మతవ్యాసంగాలు, అనుసరణలు తగ్గిపోవటంవలననే, ప్రొద్దస్తమానం ఇంటిలో వెట్టిచాకిరిచేస్తూ విసుగుచెందుచున్న స్త్రీలకు ఈ క్రైస్తవభజనలు, ఊరేగింపులు వేడుక వినోదాల నిస్తున్నవి. అందుకే వారు ఈ సంబరాలకు ఎగబడుచున్నారు.

పెడసనగల్లు కమ్మేతరులలో గౌళ్లు ఎక్కువ సంఘం. వారిలో రెండు మూడు కుటుంబాలు పొలం పుట్రా ఉన్నవాళ్ళు. అచ్చమ్మ అనే ఆమె మా మామగారింటికి చనువుగా వస్తూ ఉండేది. మా అందరిని పలకరించి మాటలు చెప్పేది. కోడి మాంసం వగైరా అపక్వాలను పంపించటం, తీసుకొనివచ్చి ఇవ్వటం,

వీళ్ళు ఏవైనా పిండివంటలు వగైరా వాళ్ళ కివ్వటం జరుగుతూ ఉండేది. ఇప్పటికీ ఆమెతాలూకు రెండు కుటుంబాలతో ఈ మర్యాదలు జరుగుచునే ఉన్నవి. సామాన్యంగా పల్లెటూళ్లలో చనువుగాఉన్నవాళ్ళు కులాలు వేరైనా, వరసలు కల్పించుకొని పిలుచుకొనటం అలవాటు. కమ్మటూళ్ళలో కమ్మసంఘం పెద్దది, ధనవంతమైంది. కనుక గొడులు వగైరా క్రిందిఅంతస్తులో నున్నవారు కమ్మవారిని బాబాయి అనో, పిన్ని అనో మర్యాదగా సంబోధిస్తారు. అగ్రకులాలకు చెందిన బ్రాహ్మణులు, వైశ్యులు కూడా కమ్మవారిని వరసలుపెట్టి పిలవటం నే నెరుగుదును. రెండవపక్షం వారీ వావి వరసలతో పిలిచేవారు కాదు. పిలిచినా అరుదుగా నని చెప్పాలి. బహుశా భూస్వాములుగా, ధనికులుగా నుండి గ్రామనాయకత్వం గలవారికీ గౌరవ మివ్వటం ఆ రోజుల్లో వేసబబుగా నుండేది కాదు.

కౌమారం దాటకముందు జరిగిన కొన్ని సంఘటనలు, అనుభవాలు గుర్తుకువస్తున్నవి. సామాన్యదృష్టిలో వానిని బయల్పరచ గూడదు. కాని మానవ స్వభావాన్ని మరుగు పరచటం అవివేకం. సహజ పరిణామాలను దాచట మెందుకు? ఒక ఉదయం మా యింటి సందులో నేను, యుక్తవయస్సురాని ఒక పిల్ల ఆడుకొనుచుండగా చటుక్కున బుద్ధిపుట్టి ఆమెను లంగా ఎత్తమన్నాను. ఇంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడికాగా ఆ పిల్ల తుర్రున పరుగెత్తికొనిపోయింది. ఒక సాయంత్రం కొందరు మగపిల్లలం కలసి ఒక యింటి పైభాగంలో కబుర్లు చెప్పుకొనటం తటస్థించింది. ఏ కొంటె పిల్లడో ఆరంభించాడు, ఎవడు ఎక్కువ సేపు తన లింగాన్ని స్ఫారింపచేయగలడో అని. నేనుకూడా పాల్గొన్నాను. ఒక రాత్రి ఎందుకో ఒక యింటిలో కొంతమంది పిల్లలం నిద్రపోవటం తటస్థించింది. నిద్రలో కాబోలును నా ప్రక్కవాని జననాంగం నాకు తగిలినట్లు తట్టి నేను లేచిపోయాను. ఇట్టి మనోస్థితి, యౌవ నారంభ లింగోద్రేకం నాకును ఒకటి రెండు సార్లు తటస్థించింది. కౌమారదశ, యౌవనస్థాయికి మధ్య లింగ సంబంధమైన మనోవికారం, శరీరవాంఛ, ప్రకృతి సహజం,

అయినప్పుడు బహిరంగంగా చెప్పట మెందుకు అను ప్రశ్న రావచ్చును. నేను కూడా ప్రకృతిసహజానికి, శరీర పరిణామాల అనుభవానికి లోనైనవాడనే నని తెలియజెప్పుటకు.

సూర్య చంద్రు లనే నియోగిబ్రాహ్మణ బాలురు మా ఊరిలో నుండేవారు. మల్లాప్రగడ తారకబ్రహ్మంగారి రెండో కుమారుడు సూర్యనారాయణ, అతని పినతండ్రి కుమారుడు చంద్రశేఖరరావు నాకు నా కౌమారంలో మిత్రులు. వాళ్ళ యింటికి నేను పోవటం, వాళ్ళు మా యింటికి రావటం ఉండేవి. చంద్రుడుతో నా కెక్కుడు స్నేహం. ఆ స్నేహం అతని అకాల మరణంవరకు సాగింది. అతడు, నేను బందరులో స్కూల్ ఫైనల్ చదువుచున్నప్పుడు తరుచు తగులుచుండేవాడు. చని పోవటానికిముందు బెనారస్ మొదలైన ప్రదేశాలకు వెళ్ళి అక్కడ కొంతకాలం గడపి, ఒక విధమైన మిస్టిక్ దృక్పథం అవలంబించుకొన్నాడు. నా కేవో మిస్టిక్ పద్యాలు ఇంగ్లీషులో వ్రాయబడ్డవి, చదివి వినిపించేవాడు. అతని అకాలమరణం నాకు తీరని కొరతైంది.

సూర్యనారాయణ నా కంత దగ్గరగా ఉండేవాడు కాడు. చంద్రుడు చామనచాయ మనిషి. సూర్యుడు స్ఫురద్రూపి. ఇద్దరు బక్కపలచనివారు. సూర్యుడు లౌకికపద్ధతుల నవలంబించి తలి దండ్రులు చనిపోగా, ఇల్లు వాకిలి నమ్ముకొని గుడివాడలో చేరాడు. అతని విధవ అక్కకు ఒక కుమారుడుండేవాడు. ఎర్రగా, కోమలంగా ఉండి ఆకర్షణీయముగా ఉండేవాడు. అత నిప్పుడెక్కడున్నాడో నాకు తెలియదు. అతనిని గురించిన చిన్న సంఘటన నాకు గుర్తున్నది. కొన్ని ఏళ్ళ తర్వాత అతనికి 12, 13 సంవత్సరా లున్నప్పుడు ఎట్లా తటస్థపడినదో గుర్తులేదు కాని, అతనిని తీసుకొని షికారునకు వెళ్ళాను. సాయంత్రం కను చీకటివరకు మేము గుడివాడకుపోయే రోడ్డుమీద బ్రిడ్జి కవతల కాల్వ పచ్చికలో ఊసులతో కాలం గడిపాము. నాకైతే ఆర్ద్రభావం కలిగియుండవచ్చును గాని అది అందమైన వ్యక్తిని సమీపంలో చూచే రసోల్లాసం తప్ప ఇతర భావంగాని, చేష్ట

గాని ఉద్భవించ లేదు. కాని తల్లి వగైరా ఆందోళన పడినట్లు తర్వాత తెలిసింది. అటు పిమ్మట ఆ బాలునితో అంత సన్నిహితంగా ఉండటం తటస్థించ లేదు. పెద్దవాడైనతర్వాత గుడివాడలో ఒకటి రెండు సార్లు చూచి మాట్లాడి యుంటాను.

నాకు మొదటినుండి మత్స్య మాంసాదులు చాలాయిష్టం. చేపలంటే నాకు చిన్నప్పుడు మిక్కిలి ఇష్టం. నేను అంగలూరులో నుండగా ఆ గ్రామ చెరువులో చేపలు పట్టారు. ఆ రోజుల్లో చేపలను ఇప్పటివలె వేలంపెట్టి అమ్మే వాడుక లేదు. ఈవాడుక పంచాయితీలు వచ్చిన తర్వాత ఏర్పడ్డది. చెరువు త్రవ్వించిన కుటుంబాలకు వంతులు ప్రకారం, చేపలను పంచిపెట్టేవారు. మా తాతగారివంతు ఒకటో రెండో వచ్చాయి. అప్పుడింట్లో పెద్ద లెవరూలేరు. అప్పటికే మా తాత వెంకటాద్రిగారు చనిపోయారు. మా మేనమామ రామశాస్త్రులు గారు గాని, మా అమ్మమ్మ లక్ష్మమ్మగారు గాని ఇంట్లోలేరు. నేను చేపలను ఎవరైనా ఎత్తుకుపోతారేమో అని, గదిలో పందిరమంచం పరుపు క్రింద దూర్చి జాగ్రత్త పెట్టాను. చేపయందు నాకప్పుడు డంత బలవత్తరమైన ప్రీతి. ఈ ప్రీతి కొంతవరకైనా ఇప్పటికిన్నీ ఉన్నది. నే నెక్కడకు క్యాంపుకు వెళ్ళినా మంచి చేపలకోసం ఎదురుచూస్తూ ఉండే వాడను. కొంచెం దూరమైనను తెప్పించుకొనేవాణ్ణి. చేపలలో కెల్ల మేటి పండుగప్ప. దానినే కుడ్వా అని అరవదేశంలోను, బెకిటి అని చిలకసముద్రం ప్రాంతంలోను అంటారు. బందరు పండుగప్ప బహు ప్రసిద్ధి. అనుభవంమీాద బెజవాడవద్ద కృష్ణలో దొరికిన చేపకూడ మంచి రుచి అని తెలిసికొన్నాను. అది దొరికినరోజు నాకు పండుగే. దీనిని చెరువుల్లో కూడా పెంచవచ్చును. నేను కాకినాడలో ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరుగా పనిచేస్తున్నప్పుడు, రామచంద్రపురం తాలూకా ఒక గ్రామంనుండి ఒకరు భోజనానికి పిల్చి ఈ చేపకూర పెట్టారు. అంత రుచిగా తోచలేదు. మంచి పండుగప్ప కూర కొకవిధమైన పరిమళం వస్తుంది. చెరువులో పెరిగినదాని కా పరిమళం ఉండదు. ఈ సందర్భంలో మాంసాహారంను గురించి కూడా చెప్పకుండా ఉండలేను. మాంసాలలో సామాన్యంగా దొరికేవి

గొఱ్ఱె, మేక మాంసాలు. నేననేకచోట్ల వీని మాంసం తిన్నాను. రసుల్ కొండలో (గంజాంజిల్లాలోనిది) పొట్టి మేకపోతులమాంసం, కళ్యాణదుర్గంలో (అనంతపూరుజిల్లాలోనిది) భారీ మేకపోతుల మాంసం మిక్కిలి రుచి అనిపించింది. గొఱ్ఱె (పొట్టేళ్ళ) మాంసం అనంతపూరుజిల్లాలోని హిందూపురం, పెనుగొండలో దొరికే దాని రుచి జాస్తి. తర్వాత గుంటూరు మాంసాన్ని చెప్పుకోవచ్చు, బరంపురంలోగాని, బందరులోగాని ఈ రెండు రకాల మాంసం హీనముగానే ఉంటుంది. పక్షిజాతి మాంసంలో సర్వసామాన్యంగా దొరికేది కోడిమాంసం. కోడిమాంసంకూడా నాకు మిక్కిలి ఇష్టమే. దేశీయ కోళ్ళమాంసంకంటే, విజాతీయ కోళ్ళమాంసం ఎక్కుడు రుచి అని నా అభిప్రాయం. రసుల్ కొండవంటి ప్రాంతాలలో దొరికే అడవికోళ్ళమాంసం రుచిగా ఉంటుంది. వీనికంటె చిన్నప్పుడే విత్తులుతీసిన కోడిపుంజులమాంసం క్రొవ్వెక్కి, మిక్కిలి మెత్తగా, రుచిగా ఉంటుంది. అలవాటులేని కొంత మందికి ఆ మాంసం వెగటును కల్గించవచ్చును. ఎగిరే పక్షులలో, పచ్చపావురాయిలమాంసం మిక్కిలి మృదువుగావుంటుంది. రుచి కూడా హెచ్చు. ఈ మాంసంకొరకు చాలాశ్రమమైనా ఓర్చుకొనేవాళ్ళలో నే నొకడను. నేను బరంపురంలో ఇన్ కమ్టాక్సు ఆఫీసరుగా నున్నప్పుడు తరుచుగా ఇవి లభించేవి. బరంపురం టౌన్ లోనే గాక, రసుల్ కొండ మొదలైనచోట్ల బాగా దొరికేవి. నేను కాకినాడలో నున్నప్పుడు జగ్గంపేట మొదలైనచోట్ల కూడా జాస్తిగా దొరికేవి. నేను 1952 లో అసిస్టెంటు కమీషనర్ గా ఏలూరులో క్యాంపుచేసినప్పుడు రోజూ వరుసగా ఒక స్నేహితుడు పంపేవాడు. 'తినగా తినగా గారెలు చే'దన్నట్లు, అంతఎక్కువగా దొరికేటప్పటికి విసు గనిపించింది. నీటిమీద తేలే పక్షులలో చిన్నరకం టీల్ బాతులు, చిలువ బాతులు బాగా రుచిగా ఉంటవి. టీల్సు బరంపురంలో ఎక్కువగా దొరికేవి. ఏలూరులో కూడా దొరుకుతవి. రొయ్యల్లో చాలా రుచి గాజురొయ్యలని పిలిచే పెద్ద రొయ్యలకు బందరు ప్రసిద్ధి. రొయ్యకు ఉల్లిబొందు, పచ్చిమిర్చి, అల్లంతోబాటు సోయకూరాకు ముఖ్యం. ఈ మసాళా పడితే కూరకు మహా రుచి వస్తుంది. చేపలు, రొయ్యల వంట

కానికి బందరు నాయుళ్లు ప్రసిద్ధి. నేను బరంపురంలో ఉన్నప్పుడు సముద్రం పీతలు తినేవాణ్ణి. వాని రుచి మొదట చూపించింది అక్కడి మిత్రుడు శ్రీ తాయి రామయ్య నాయుడు. వానిని తెల్లగా వచ్చేటట్లు తోమి, శుభ్రపరచి, ముక్కలుకోసి తగిన మసాళావేసి వండితే ఎంతో రుచిగా ఉంటవి.

## బందరు విద్యాభ్యాసం

పైన చెప్పినట్లు 1913 జూను మాసాంతానికి శ్రీ పోడూరి జోగయ్యగారిద్వారా నేను, నా ఐదవ పెదతండ్రి శ్రీ వెంకట సుబ్బయ్యగారి కుమారుడు నాగభూషణం, మా పినతాత ఐదవ కుమారుడు వీరభద్రయ్య బందరు నోబుల్ హైస్కూలులో మూడవఫారంలో చేరాము. మా డివిజన్‌కు ప్రధానోపాధ్యాయులుగా శ్రీ చోడవరపు జగన్నాథరావుగా రుండేవారు. వారు తమ విద్యార్థిదశలో పేరుపొందిన ఫుట్‌బాల్ ఆటగాడట. ఎత్తైన, బలమైన శరీరంతో, విశాలమైన వక్షస్థలి, చక్కని ముఖకవళికలు, వర్చస్సు గలిగిన శాంత స్వభావులు. మా గ్రామ సమీప గ్రామమగు శేరీ దింటకుర్రు కరణంగారి కూతురు బాల వితంతువును బ్రహ్మ సమాజపద్ధతిని వివాహం చేసుకొన్నారు. ఆమె సౌందర్యవతి, సౌజన్యవతి, సుగుణ శీలి. పిల్ల తండ్రిని ఎరిగియున్న మా పినతండ్రి నాగభూషణంగారికి శ్రీ జగన్నాథరావుగా రెట్లు పరిచయమైనారో నాకు తెలియదుగాని, జగన్నాథరావుగారి అండదండలుంట వని మా పినతండ్రి రెండుమైళ్ళలోపు దూరంలో ఉన్న గుడివాడ హైస్కూలులో చేర్పించక దూరంగా ఉన్న బందరులో చేర్పించారు.

మా ముగ్గురిని (వీరభద్రయ్య, నాగభూషణం, నేను) శ్రీ చోడవరపు జగన్నాథరావుగారి అజమాయిషీ, ప్రత్యేక బోధన క్రింద ఉంచటమే కాక, మా నివాసానికి మిక్కిలి సమీపంలో క్రొత్తగా పెట్టిన హోటలులో మమ్ములను ఒప్పగించి, పిల్లలను శ్రద్ధగా చూచి, బాగుగా భోజనంపెట్టాలని హోటల్ యజమానికి

గట్టిగా చెప్పారు. ఆ హోటల్‌ను చల్లపల్లి సంస్థానంలో వంటపని చేస్తూ ఏ కారణంవల్లనో మానుకొనివచ్చిన కోన రత్తం, అతని బావమరది వెంకయ్య సాయంతో పెట్టాడు. క్రొత్తగా పెట్టటంవల్ల, మా నాగభూషణంగారు పేరుగల ఖురానావా రగుటవల్ల మాకు పుష్కలంగా మాంసాహారాదులు లభ్య మయ్యేవి.

మేము ముగ్గురం ఖొజ్జిల్లిపేటలో, ఆ రోజుల్లో బందరుకు సెంటర్‌గానుండిన రాబర్ట్‌సన్ స్క్వేర్‌కు దగ్గర శ్రీ తాడేపల్లి సుబ్బారావు, శ్రీరాములు, బాపనయ్యగార్లకు చెందిన ఒక కొట్ల గదిలో మకాం. ఆ గది, దానితోపాటు ఇంకా రెండు మూడు గదులు పూర్వం ధాన్యం వగైరా నిల్వచేయుట కుపయోగింప బడినవట. వానికి కిటికీలు వగైరా ఉండినవి కాని, మొత్తం మీద అంత వెల్తురుగా ఉండేవి కావు. మా ఖొజ్జిల్లిపేట గది మెయిన్‌రోడ్డు సందులో ఉండేది. అయితే ఆ సందులో ఇతర వైశ్య కుటుంబాలుండేవి. పైగా, మా గదిసందుకు ఇంచు మించుగా ఆనుకొనే దాని యజమానులు నివసించే గృహం. కాబట్టి మా క్షేమసమాచారాలు శ్రీరాములుగారు అజ కనుక్కుండే వారు. ఆ ముగ్గురన్నదమ్ములలో వారే ఇంటి వ్యవహారాలు, ముఖ్యమైన వడ్డీవ్యాపారం చూస్తూఉండేవారు. వారికి అండ దండగా నుండిన వ్యవహార, వ్యాపారదక్షుడు, నంబూరి సుబ్బారావు గారు మా క్షేమ సమాచారములు తెలిసికొనుచుండేవారు. అక్క డున్నప్పుడు జరిగిన అనుభవాలలో నొకటి బాగా జ్ఞాపకంఉన్నది. మా సందులో తాడేపల్లి పెద సుబ్బారావు, చిన సుబ్బారావు అనే అన్నదమ్ములు కాపురముండేవారు. వారొకప్పుడు సంపన్నులే గాని, మా కాలంనాటికి అంత వృద్ధిలో లేరు. అందులో చిన సుబ్బారావుగారు మంచి హుషారైన మనిషి. వారికి తోటాలు కాల్చుట మొక సరదాయే గాక, విద్య. దానిలో వారు మిక్కిలి ప్రవీణులు. నదురు బెదురు లేని కాల్పుగాడు. అప్పటికి కొంత క్షీణదశలో నుండినను, దీపావళికి జట్టులు పోటీబడి, ద్వంద్వయుద్ధంలో వలె ఎదుర్కొని, తోటాలతో యుద్ధం చేసేవారు. ఎవరు ఎక్కువ కాలం, ఎక్కువ జోరుగా, కవ్వించి కాల్చి అవతలివారు తోక ముడుచుకొనిపోయేటట్లుగా చేయగలిగేవారో వారు గెలిచినట్లు.

వారుపయోగించే తోటాలు అడుగు పొడుగు, నాలు గైదు అంగుళాలు కైవారం కలిగి తిన్నగా, లావుగా, బలిష్ఠంగా ఉండేవి. వానిని వెలిగిస్తే భయ్యిమనిన మోతతో, జయ్యిమని వెదజల్లే రవ్వలతో మిక్కిలి తెల్లకాంతిని కుమ్మరిస్తూ ఉత్సాహకరంగా ఉండేవి. ఆ రోజుల్లో దీపావళిపండుగకు బాణసంచాముచ్చట్లకు బందరు చాలా ప్రసిద్ధిగా ఉండేది. జిల్లీలు, సిసింద్రీలు, కాకరపువ్వొత్తులు, మతాబులు, చిచ్చుబుడ్లు, సీమటపాకాయలు, నేలటపాకాయలు, తాటిటపాకాయలు విరివిగా ఉండేవి. బందరు నేలటపాకాయలకు, తాటిటపాకాయలకు పేరొందింది. పై జెప్పిన చర్మంతో కప్పిన భారీ తోటాలవిషయం చెప్పనక్కరలేదు. ఆ రకం తోటాలు ఇం కెక్కడా చేసేవారుండేవారుకా దని, అంత విరివిగా ఇంకోచోట కాల్చేవారుకా దని నా నమ్మకం.

బందరు ఇంకా రెండు విషయాల్లో పేరుపొందివుండేది. ఒకటి భోగంమేళాలు, రెండు మిఠాయి. ఆ రోజుల్లో సానిని ఉంచుకోవటం ఒక హోదా చిహ్నంగా ఉండేది. ధనవంతులైన వర్తకులు (వైశ్యులు) అది గొప్పగా చెప్పుకొనేవారు. ఫలానా వారి సాని అంటె ప్రతిష్ఠ. ఆమె మంచి ఖరీదుకలిగిన వెడల్పాటి జరీ చెంగులు, బుటావ్‌లు గల బెనారస్‌చీరకట్టుకొని ఏ పెండ్లి సందర్భంగానో, ఏ దేవత ఊరేగింపులోనో బజారులవెంట మేళం చేస్తూంటే, యావన్మంది చూచి ఫలానావారి స్వాధీనంలో ఉన్నదని మెచ్చుకోవాలని ఉబలాటపడేవారు.

ఆ రోజుల్లో సింగ్ అనే బొందిలి ఉండేవాడు. ఆయన మిఠాయిదుకాణం రాబర్ట్సన్ స్క్వేర్ కించుమించుగా ఆనుకొని అనగా దుకాణాల నడిబొడ్డులో నుండేది. సింగ్ మిఠాయిదుకాణానికి అధిక ప్రచారం, పేరు తెచ్చింది మెత్తనిపకోడి. దాని కోసం పెద్దా చిన్నా పడిగాపులుపడి ఉండేవాళ్ళు. ప్రతిరోజు సాయంత్రం దాని నాస్వాదించటానికి ఒక విధ్యుక్త ధర్మంగా విద్యార్థులు, గుమాస్తాలు, సన్నకారు ఉద్యోగులు అంగటిచుట్టూ

మూగేవారు. సర్కిల్ ఇన్‌స్పెక్టరు వరకు స్వయంగా వచ్చి తినటమో, పొట్లాలు తీసుకొని వెళ్లటమో పరిపాటి. అంత రుచిగా వుండే మెత్తనిపకోడి ఇంకెక్కడా ఉండేదికాదు. మెత్తని పకోడి తర్వాత వారి గుల్లపకోడి ఎక్కువ అమ్మకం అయ్యేది. తీపి తినుబండారాలలో వారి ఎర్రహల్వా ప్రసిద్ధి. బర్ఫీ, దూద్ పేడ్, పాలహల్వా మొదలైనవి ఉండేవికాని, ఎర్రహల్వా అంత ప్రసిద్ధికెక్కలేదు. నాకు జ్ఞాపకమున్నంతవరకు వారి మెత్తనిపకోడి, గుల్లపకోడి, బెల్లం హల్వాయే మిక్కిలి ప్రసిద్ధి చెంది జనసమూహాన్ని ఆకర్షించేవి. అప్పుడే ( 1913–1920 ) గాక, తర్వాత కొలది సంవత్సరాలవరకు సింగ్ మిఠాయిదుకాణం పేరు ప్రతిష్ఠలతోనే నడిచింది. నేను 1927–వ సంవత్సరంలో ఇంగ్లండునుండి తిరిగివచ్చినతర్వాత సింగ్‌ను బెజవాడలో దారినిపోతూఉండగా కలసికొని ప్రశ్నించాను. వాళ్ళలో ఒక రిద్దరు చనిపోయారని, దుకాణం క్షీణించిపోయిందని చెప్పినట్లు గుర్తు. తదనంతరం అది పూర్తిగా మాసిపోయింది. ఆ ప్రసిద్ధ స్థలములో ఇతర కొట్లు వెలసినవి. బందరు అనాదినుండి బెల్లంతో చేసిన సాదా లడ్డుకు, బెల్లంపూస మిఠాయికి, బెల్లం జీడిపప్పు పాకానికి చాలా ప్రసిద్ధి. ఆ ప్రసిద్ధి యిప్పటివరకు చాలావరకు నిలిచియున్నది, సరుకులో నాణ్యం బాగా తగ్గినా. ఇప్పుడు పూస మిఠాయి లేదనే చెప్పాలి. బెల్లం జీడిపప్పుపాకం కూడా రంగు భేదం, పాక భేదం వచ్చి నాసిరకంగా తయారైంది. బందరు మిఠాయిలో బెల్లానికే ప్రథమస్థానం. శ్రేష్ఠమైన బెల్లాన్ని తగు పాళ్ళలో ఉపయోగించక పోవటంవల్ల, పంచదార నుగ్గు మిశ్రమంవల్ల, తయారుచేసే నైపుణ్యం తగ్గటంవల్ల బందరు మిఠాయి ప్రాముఖ్యం తగ్గింది. బందరు మిఠాయి పేరుతో గుడివాడ, బెజవాడ, గుంటూరు, ఏలూరు వగైరా చోట్ల మిఠాయి దుకాణాలు వెలసినవి కాని, నాసి రకంగా తయారయి బందరు మిఠాయి పేరు చెడగొట్టుచున్నవి.

నాకు చిన్నప్పటినుండి ముక్కోపం. క్షణంలో ఉద్రేకపడి, క్షణంలో మెత్తబడే స్వభావం. అప్పుడప్పుడు తోటి విద్యార్థులతో భేదాభిప్రాయాలు వచ్చేవిగాని, నాకు జ్ఞాపకమున్నంతవరకు నేను

మూడవఫారం చదువుచున్న మొదటి సంవత్సరంలో తప్ప తోటి విద్యార్థులతో తగాదా పెంచుకోవటం, పోట్లాడుకోవటం జరుగ లేదు. ఒకసారి జరిగిన సంఘటన నాకు బాగుగా జ్ఞప్తియందున్నది. మా స్వగ్రామాని కనతిదూరం గురజ గ్రామం. శ్రీ ఉప్పలపాటి బ్రహ్మయ్యగారి కుమారుడు నాగయ్య అనే చిన్నవాడు థర్డుఫారం మా నోబుల్ హైస్కూల్ మా సెక్షన్‌లోనే చదువుచుండేవాడు. మేము ప్రొద్దున్నే కాలకృత్యాలకు పెద్ద రోడ్డువెంట కొంత దూరానఉన్న చాటు ప్రదేశానికి పోతూఉండేవాళ్ళం. మాతో దారిలో కలసే నాగయ్య నన్ను ఎగతాళి చేస్తుండేవాడు. కొన్ని రోజులు గడచినతర్వాత, నాకు ఉక్రోషంవచ్చి వానితో దెబ్బ లాటకు సిద్ధ మయ్యాను. ఇంతలో తాను కూడా కాలకృత్యాలకు వెళ్ళివచ్చుచున్న బ్రహ్మయ్యగారు మా కెదురవగా, నే నాయనతో "మీ అబ్బాయి నన్ను హేళనచేస్తూ బాధపెడుచున్నాడు, వాణ్ణి తన్ను తాను" వగైరా అని పెద్ద కేకలతో చెప్పాను. గొప్ప సంపన్నుడు, వ్యవహారదక్షుడు, సాధు శీలుడు. వారు "బాబూ! నేను కనుక్కొని మందలిస్తా"నని చెప్పి సాగిపోయారు. తర్వాత నాగయ్య నా జోలికి వచ్చేవాడుకాదు.

మేము మూడవఫారం చదువుచుండగనే శ్రీ నాగభూషణం గారి తమ్ముడు వీరభద్రయ్య చదువు చాలించుకొని వెళ్లిపోయాడు. వివాహం, ఆయన భార్య మామగారి కొక్కర్తె బిడ్డ కావటం, వారి ఆస్తివిషయమై తగాదా రావటం, ఆయనకు చదువునందు శ్రద్ధలేకపోవటం కారణాలు. సెలవు లనంతరం 1914 జూన్‌లో నేను, నాగభూషణం నాల్గవఫారంలోకి వచ్చినప్పుడు అతడు, నేను విడిపోయాము. అతడు ఇంకొకచోట వసతి ఏర్పరచుకొన్నాడు. నన్ను చివర పినతల్లి తులశమ్మ, వారి భర్త దుగ్గిరాల రాఘవ చంద్రయ్యగార్ల ఇంటిలో మా నాన్న ప్రవేశపెట్టారు. రాఘవ చంద్రయ్యగారప్పటికే సంస్కృతాంధ్రములు బాగా చదివి, అష్టావధానం చేసి, కవియై పైగా విజయనగర సామ్రాజ్యం అనే నవల వ్రాసి, 'విజ్ఞాన చంద్రికామండలి' ప్రథమ బహుమతి రు. 500-00 లు పొందియుండినారు. బందరులో చదువుచు,

బచ్చుపేటలో ఇల్లు తీసికొని కాపురం పెట్టారు. వారి అతిథిగా వారి సహపంక్తి భోజనం చేయుచు, నోబుల్ హైస్కూలులో చదువు కొనసాగించాను. వారితో, రాఘవచంద్రయ్య బాబాయి పినతల్లి సీతమ్మగారు తోడుగా ఉండేది. చిన్నతనంలోనే భర్తృహీనయైన ఆమె, చాలా సుస్వభావం కలది. కలసికొట్టుతనం, ఆదరణ, ఆప్యాయత, సేవానిరతి—ఆమె సుగుణాలు. ఆమె నన్నెంతో ఆదరణతో, బిడ్డనువలె చూచేది. రాఘవచంద్రయ్యగారి తండ్రి పురుషోత్తంగారు సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడు. వారు తనకు వ్యాకరణం బోధించే గురువు దొరకలేదని, దానికి కారణం తన కులం అని, ఎట్లో తంటాలుపడి కొంత నేర్చుకొన్నా ఆ శాస్త్రంలో తనకు పాండిత్యం లభించలేదని చింతపడేవారు. వారి తండ్రి సీతయ్యగారి సంగతి తెలియదుకాని పురుషోత్తంగారు, భార్య, పిల్లలు యావన్మంది శాకాహారులు. అందువలన రాఘవచంద్రయ్యగారింట్లో పూర్తిగా కాయగూరలే. నిజానికి ఆ కాలంలో మాంసభక్షకులైన కమ్మవారుకూడా చాలా అరుదుగా దానిని వాడేవారు. పల్లెటూళ్లలో మాంస విక్రయశాలలు లేకపోవటం, నూటికి తొంభై మంది సామాన్య రైతులగుటచేత, పైగా కూరగాయలు పుష్కలంగా దొరుకుటచేత, చేతినిండా పాడివుండి, పాలు పెరుగు కొరత లేకపోవుటచేత మాంసాహారంమీద దృష్టి చాలా తక్కువగా ఉండేది. అప్పుడప్పుడు కోడిగ్రుడ్లు వాడేవారు. ఎవరైనా కావలసిన బంధువులు వస్తే కోడి నుపయోగించేవారు. ఈ సందర్భంలో ఒక సంఘటన గుర్తుకు వస్తున్నది. రాఘవచంద్రయ్యగారింటిలో మకాం తర్వాత కొద్ది సంవత్సరాలకు, నేను ఇంటర్మీడియేట్ నోబుల్ కళాశాలలో చదువుకొనే రోజుల్లో, ఎందుకో ఇప్పుడు జ్ఞాపకంలేదు, నేను, రాఘవచంద్రయ్యగారు కలసి గుడివాడకు తొమ్మిదిమైళ్ళదూరంలోవున్న ముదినేపల్లివైపుకు వెళ్ళి, సాయంత్రానికి ముదినేపల్లికి చేరి ఒకరింటికి వెళ్లాము. వారు మమ్ములనుచూచి ఆ రాత్రికి వారింటియొద్ద వుంటామని గ్రహించి మా ఆహారంకొరకు ఒక కోడిపుంజును పట్టుకోటానికి నౌకరిని నియోగించగా, అతడు దానిని వెంట తరుమ నారం

భించాడు. అది చూచి రాఘవచంద్రయ్యగారు "మా కొద్దో" అని లబాదిబా కొట్టుకొన్నారు. నేను మా కుటుంబం అలవాటునుబట్టి చిన్నప్పటినుండీ మాంసాహారప్రియుడనుకాబట్టి, రాఘవచంద్రయ్య గారి వ్యతిరేకత చాలా కష్టం కలిగించింది. అయినా రాఘవచంద్రయ్యగారి గోల, పైగా వారు నన్నుకూడ వద్దని చెప్పుమని బలవంతంచేయటంవల్ల తప్పని విధికి నేనుకూడా వద్దని చెప్పాను. మా ఇద్దరి వ్యతిరేకతజూచి ఇంటియజమాని నిజంగా మేము కోడిమాంసం తినమని నమ్మి ఆ ప్రయత్నం మానివేశారు. తర్వాతగాని రాఘవచంద్రయ్యగారు పూర్తిగా శాకాహారులని వారికి తెలియలేదు. నా విషయంలో, మా లింగం కుటుంబంసంగతి వారికి తెలియునుకాబట్టి సహచరదోషం చేత తాత్కాలికంగా నాకుకూడా మాంసం నిషేధమైన దని గ్రహించారు.

రాఘవచంద్రయ్యగారు ప్రైవేటు చదువుకొని నోబుల్ హైస్కూలులో 4-వ ఫారంలో చేశారట. తర్వాత రాజమండ్రికి వెళ్ళి వీరేశలింగంపంతులు హైస్కూలులోను, కొంతకాలం గుంటూరులోను చదివి, 1917-1918 సంవత్సరం మద్రాసులో బి. ఏ. చదువు ప్రారంభించారు. 1912 మే నెలలో వారు 25 రోజులలో ఏకబిగిని "విజయనగర సామ్రాజ్యం" అనే నవలను వ్రాశారట. 1914 జూనుకు కొంచెం ముందనుకొంటాను, ఆ నవలకు విజ్ఞానచంద్రికామండలివారి నవలారచన పోటీలో ప్రథమ బహుమతి రు. 500 లు లభించింది. ఆ సందర్భంలో ఒకాయన ఆ గ్రంథాన్ని విమర్శిస్తూ కృష్ణాపత్రికలో వ్రాశారు. దానికి రాఘవచంద్రయ్యగారు కుపితుడై సమాధానమిస్తూ అహంకార పూరితమైన పద్యంతో ఆరంభించారు. కవిసార్వభౌముడు శ్రీనాథుడు "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్" అనే పద్యం ధోరణిలో, కన్నడ రాజ్యలక్ష్మికి బదులు ఆంధ్రలక్ష్మి అని సంబోధించి తిరస్కారపూరితంగా కొన్ని పద్యాలువ్రాసి కృష్ణాపత్రికకు పంపారు. పత్రికాధిపతులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు సవాలుగా తోచే ఆ పద్యాలను

విడిచిపెట్టి గ్రంథకర్త సమాచారాన్ని ప్రచురించారు. ఆ రోజుల్లో కవుల, రచయితల స్పర్ధలు మెండు. ఒకరి నొకరు సవాల్ చేసుకోవటం, పత్రికల్లో కరపత్రాల్లో దూషించుకోవటం, సభా వేదికలనుండి తీవ్రంగా విమర్శించుకొనటం పరిపాటి. పైగా రాఘవ చంద్రయ్యగారు, ఆంధ్రలోకాన్ని తమ కవితా వివాదాలతో, స్పర్థలతో, బహిరంగసవాళ్లతో, దూషణలతో ఉగ్రూతలూగించిన పండితకవులు శ్రీ తిరుపతి వెంకట కవులలో పూజ్యశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి మహాకవిగారికి కొంతకాలం శిష్యరికం చేశారాయె. వారి ఉద్రేకానికి అడ్డుపుల్లవేసి శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు ఆ వివాదాన్ని అంత మొందించారు.

ఇరవై శతాబ్దం మొదటి పాదంలో కమ్మయువకులు ఇంగ్లీషు చదువులకు ఎగబడ్డారు. నేను చదువుచున్నప్పుడు బచ్చుపేటలో కమ్మవిద్యార్థి సంఘ ముండేది. అంతకు కొన్ని సంవత్సరాలకుముందు, బందరులో చదువుకొనుచుండిన శ్రీ మాగంటి బాపినీడుగారు కమ్మవిద్యార్థి సంఘము నొక దానిని నెలకొల్పి కొంతకాలము సాగించినారట. 1914 లో నుండిన సంఘం శ్రీ బాపినీడుగారు స్థాపించినదేమో గుర్తులేదు. కమ్మకులం చిరకాలమునుండి పేరు ప్రతిష్ఠలుగల దైనను, ఒకప్పుడు మహోన్నతస్థితిలోనుండి కాకతీయసామ్రాజ్య పాలకులలో అంతర్భాగముగా నుండినను, తర్వాత ముసునూరు కాపయవంటి హిందూమత రక్షకులను కన్నను, వర్తమాన కాలంలో కూడు గుడ్డకు పుష్కలంగా నోచుకొన్నను, ఇరవయ్యవ శతాబ్దారంభంనాటికి విద్యలో ఇంచుమించు వెనుకబడియుండినది. నిజమునకు కొన్ని సంవత్సరాలక్రితంవరకు కమ్మవిద్యార్థులు విద్యలో వెనుకబడిన తరగతి వారమని సగము విద్యార్థివేతనమున కెగబడు టప్పుడప్పు డుండేది. కత్తి విడిచి నాగలిబట్టిన ఈ కులం, భూమిని దున్నుకొని బ్రతుకుట కారంభించి, ఆ బ్రతుకులోనే కాలంగడుపుట కలవాటైపోయింది. కాలప్రభావమున జరుగు మార్పులు ఎట్టకేలకు ఈ సంఘాన్నికూడా మేల్కొల్పగా 19-వ శతాబ్దము చివరినుండి క్వచిత్తుగా, 20-వ శతాబ్ద మారంభమునుండి విస్తృతంగా విద్యా పిపాసువులై, తమ

బిడ్డలను బడులకు, ఉన్నత విద్యాసంస్థలకు పంపుటకు కులంలోని ధనవంతులు ప్రారంభించారు. మా తండ్రులకాలములో ఏ కొలదిమందిరెూ హూణవిద్య నేర్చుకొనకపోలేదు. కాని వా రున్నత పదవులవరకు పోలేదు. నాగపూర్, బిలాస్‌పూర్ మొదలైన ప్రాంతములకు వలసపోయిన కమ్మవంశస్థులు ఉన్నత విద్యాభ్యాసముచేసి, కొంత పేరు ప్రతిష్ఠలు సంపాదించినట్లు కన్పడుచున్నది. కాని వారి సంఖ్యకూడ బహు స్వల్పము. సంఘు దృష్టిలోకి రాలేదు.

ఎటు వచ్చి, నాకంటె కొద్ది సంవత్సరములుమాత్రమే పెద్ద వారు, నా సమకాలికులుమాత్రమే కొంత విరివిగా ఇంగ్లీషు చదువుట కారంభించినారు. 1914 సంవత్సరంలో నాకంటె వయస్సులోను, చదువులోను పెద్దవారు మంటాడ కాపురస్థులు యలమంచిలి వెంకట సుబ్బయ్యగారు, వారి తమ్ముడు వెంకయ్య గారు, కొరిమెర్ల కాపురస్థుడు కరిపినేని వెంకట కృష్ణయ్యగారు, వారి తమ్ముడు వీరరాఘవయ్యగారు, దుగ్గిరాల రాఘవచంద్రయ్య గారు మొదలైనవా రుండేవారు. 1914 నాటికి బచ్చుపేటలో మేమున్న ఇంటికి సమీపంగా, ఐ దారు గదుల్లో కమ్మవిద్యార్థు లుండేవారు. మే మున్న ప్రదేశం ఒక బహిరంగప్రదేశంగా ఉండేది. ఈ ప్రక్క ఆ ప్రక్క ఉన్న ఇండ్లమధ్య ఖాళీస్థలం ఒక చిన్న మైదానంవలెను, నాలుగు ప్రక్కలవున్న ఇళ్లు దూరంగా బారెక్సు వలె నుండటంచేత మధ్య రోడ్డున్నా మధ్య విశాలమైన చతురస్రంగా ఉండేది. ఇళ్లవరుసల మధ్య బావి, ఆ బావి దగ్గర స్నానం వగైరా. బందరు (మచిలీపట్టణం) చాలా పురాతనమైన పట్టణం. చౌడునేల. మరిన్ని సముద్రతీరప్రాంతంకాబట్టి ఇళ్లు ముసలికొంపల్లా ఉండేవి. మేమున్న బచ్చుపేట చిన్న చిన్న ఇళ్ళతో ఒక మాదిరి పల్లెటూరుగా ఉండేది.

1914 లో కమ్మవిద్యార్థిసంఘానికి కరిపినేని తాత అనే వీరరాఘవయ్యగారు అధ్యక్షులుగా ఉండేవారు. మిక్కిలి చురుకైన మనిషి. ఆటలలో, కసరత్ లో గట్టివారు, ఇంటర్‌మీడియేట్ చదువుచుండినారు. ఆయన అందరివలెనే వేసవి సెలవులకు ఇంటికి

వెళ్ళి తిరిగి రాలేదు. విషజ్వరంవచ్చి అకాలమరణానికి గురి అయినాడని తర్వాత తెలిసింది. ఆయువు గట్టికాకపోతే, దేహ ధార్ఢ్యం ఉపయోగపడదు. వారి అన్న వెంకట కృష్ణయ్యగారు శారీరకంగా బలహీనులు. అప్పటికే వారు మందులు మాకులు వాడుచు భోజనం మితంగా, ఎక్కువగా ఆకుకూరలు, పండ్లతో చేసేవారు. వారీమధ్యవరకు సుఖముగా నుండినారు. ఆ రోజుల్లో టైఫాయిడ్ జ్వరం చాలావరకు మృతికి కారకమయ్యేది. ఇప్పటి వలె దాని ఆటకట్టించే మందు లుండేవికావు. కమ్మసంఘ సమావేశాలు మా యింటికి సమీపంలోని గదులవరసలో బహుశా వీరరాఘవయ్యగారుండే గదిలో జరుగుచుండేవి. ఆ గదికి ప్రత్యేకించి వరండాకూడా ఉన్నట్లు గుర్తులేదు. కొన్ని గ్రంథాలైనా ఉన్నవేమో చెప్పలేను. మినిట్సుబుక్కు ఉండి యుండవచ్చును. ఆ సంఘాన్ని రిజిస్టర్ చేసి వుండినారని తోచదు. అయితే నిరంతరంజరిగే క్రమపద్ధతిగల సంఘంగానే వర్తించి నట్లు జ్ఞాపకం.

ఈ సందర్భంలో తరువాత జరిగిన సంఘటన ఒకటి గుర్తుకు వస్తున్నది. ఆ రోజుల్లో చిన్నచదువులు చదివేవారైనా వయస్సు వచ్చినవారై యుండేవారు. మూడవ ఫారంలో చేరు నప్పటికి నాకు మీసాలు గడ్డాలు బాగా వచ్చియుండినవి. ఇంటర్మీడియేట్, బి. ఏ. చదివే విద్యార్థులు, ఇప్పటి లెక్క ప్రకారం ఇంచుమించు మధ్యవయస్కులుగా కనబడేవారు. వారిలో వెంకట కృష్ణయ్యగారుగాక, యలమంచిలి వెంకట సుబ్బయ్యగారు, వారి తమ్ముడు రామయ్యగారు, కొమ్మారెడ్డి రామయ్య, సత్యనారాయణగార్లు, హనుమోర అప్పయ్య, యల మంచిలి నాగభూషణంగార్లు వగైరా ఉండేవారు. ఒకనాటి సాయంత్రం సంఘంతరఫున పదిమంది విద్యార్థులం చల్లపల్లి ఎస్టేటు కుమారరాజా శ్రీమంతు యార్లగడ్డ అంకినీడుప్రసాద్ బహద్దర్ గారి దర్శనార్థం వారి బందరులోని బంగళాకు ముందుగా వారి అనుమతి తీసుకొని వెళ్ళాము. శ్రీ కుమారరాజాగారు బి. ఏ. ప్యాసై సహకారపద్ధతులనుగూర్చి బాగుగా విజ్ఞానాన్ని

సంపాదించుకొనియున్నారు. అప్పుడప్పుడు సభల కధ్యక్షత వహిస్తూ ధారాళంగా ఇంగ్లీషులో మాట్లాడటం అలవర్చుకొన్నారు. వారు మా అభ్యర్థన ఏమిటని ప్రశ్నించారు. మాలో పెద్దగా వ్యవహరించిన వెంకట సుబ్బయ్యగారు కమ్మవిద్యార్థి సంఘాన్ని గురించి చెప్పి వారి సాయం కోరారు. వారు ఆలోచించి చేస్తామని చెప్పారు. మర్యాదగానే మేము బైటపడ్డాము. కాని కుమారరాజావారు స్వసంఘ విద్యార్థిబృందాన్ని, అందులో బి. ఏ. చదువుచున్న పెద్ద విద్యార్థులతోకూడిన డిప్యుటేషన్‌ను కూర్చోమనైనా అనలేదే, నిలుచోబెట్టి మాట్లాడి వెళ్ళమన్నారే అని వెంకట సుబ్బయ్యగారివంటి కొందరు బాధపడ్డారు. కాని కుమారరాజావారు విద్యార్థులయెడ తా ననాదరణతో మెలగ వలెననిగాని, మెలగుచుంటిననిగాని తలంచలేదు. విద్యార్థులు వచ్చారు, ఏవో కోరుకున్నారు, ఆలోచించి చేస్తామని అన్నారు, వాళ్ళు సెలవుతీసుకొని వెళ్ళిపోయారు. అంతవరకే వారికి తోచింది. నిజానికి వెంకట సుబ్బయ్యగారు కించపడటం అనవసరం. ఆనాటి జమీందారుల పద్ధతే అంత. కుమారరాజా అంకినీడు ప్రసాద్‌గారి తండ్రి శ్రీమంతు రాజా మల్లికార్జునప్రసాద్ బహద్దర్ వారు తమను దర్శించవచ్చిన పెద్ద, చిన్న రైతులకు చాలా రోజులవరకు దర్శనం ఇచ్చేవారుకాదట. భరవసా గల పెద్ద రైతులకు సన్న సువారంలోను, సన్నకారు, మధ్యతరగతి రైతులకు ముతక సువారంలోను రోజులకొలది భోజనాలు జరిగేవి. వారం, పది లేక పదిహేను రోజులు గడచినతర్వాత దర్శనానికి రమ్మని కబురు వచ్చేదట. అప్పుడు వరుసవారిగా రైతులు వారిని దర్శించి కష్టసుఖాలు చెప్పుకొనేవారట. జమీందారులు తమ హోదా అనుకొన్నదానిని కాపాడుకొనేటందుకు పడే తాపత్రయం, ఇబ్బంది, కొంతకాలంక్రిందట జరిగిన సంఘటన వలన విస్పష్ట మగుచున్నది.

కృష్ణాజిల్లాలో అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు రైతు లోకంలో పెద్ద పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. వారు వందలాది మాగాణి భూములను సంపాదించటమేగాక మందపాటి అగ్రహారం,

కొరగుంట అగ్రహారం, రంగాపురం జమీందారీ సంపాదించారు. పైగా రెండు పెద్ద రైసుమిల్లులు, ఉయ్యూరు పంచదారమిల్లులో చాలా షేర్లేగాక పెద్ద పలుకుబడి కలిగియుండినారు. వారు సామాన్య రైతు కుటుంబంలో పుట్టినందున అగ్రహారాలు, జమీ వగైరా సంపాదించినా రైతుగానే చలామణి అయ్యేవారు. అందువలన కొన్ని వందల ఏండ్లనుండి పాతుకొనివున్న నూజివీడు వెలమ జమీందారులలో నొక ప్రముఖ జమీందారు వీరికి సమాన ప్రతిపత్తినిచ్చుట కొప్పుకొనక, ఒకసారి వారితో పనిఉండి శ్రీ గోపాలకృష్ణయ్యగారు వారి ప్రాసాదానికి వెళ్ళగా వారిని వెంటనే కలసికొనక కొంతకాలం బహిర్ దేవిడిలో వేచియుండే టట్లు చేశారు. అది చాల దన్నట్లు కలసికొన్నప్పుడు వారి నుచిత రీతిని ఆసీనులనుచేయక అంత పెద్ద మనుష్యుని నిలబెట్టి, తాను కూర్చోటం బాగుండదని అభిప్రాయపడినారు కాబోలు, తామును కూర్చోక పచార్లుచేయుచు, మాట్లాడి గంటలు గడపినారట. వంశాచారాలు, ప్రతిష్ఠలు అలా ఉంటవి.

1915 జూనులో నే నయిదవ ఫారంకు వచ్చినప్పుడు, బచ్చు పేటలోని ఒక సందులో నున్న ఒక యింటిలో గదిని అద్దెకు తీసికొని, కొద్ది దూరంలో హిందూ హైస్కూల్ రోడ్డు కవతల దాని నానుకొనివున్న గృహంలో భోజనంచేస్తూ ఉండేవాడను. బందరులో అనాదినుండి ఆదివెలమలు ప్రముఖ కలంకారి వస్త్రోత్పత్తి దారులు, వ్యాపారులు, తర్వాత ఉద్యోగాలువగైరా పెద్దహోదాతో పేరుపొందినారు. బచ్చుపేటలో ముఖ్యంగా మే ముండినప్రాంతంలో ఆదివెలమలు జాస్తి. అయితే వీరు సామాన్య కుటుంబీకులు. నేను 1914 లో ఉండిన ఇల్లేగాక 1915, 1916 సంవత్సరాలలో ఉండిన ఇళ్ళుకూడా వెలమవారివే. నాకు భోజనంపెట్టేవారుకూడా ఆది వెలమలే. వారిద్దరూ అత్తకోడండ్రు, విధవలు, నాతోబాటు నలుగు రైదుగురుకు భోజనాలు పెట్టుచు, చిల్లర మల్లర ఉపాహారాలమ్ము కొనుచూ జీవించేవారు. ఉత్తమమైన స్త్రీలు. మంచిగా, మర్యాదగా, మమ్ములను భుజింపజేసేవారు. భోజనం మధ్యరకంగా ఉండేది. అప్పుడు మాతో శ్రీ ఐనాల శేషగిరిరావుగారని గుర్తు, బి. ఏ. విద్యార్థి అక్కడ భుజించేవారు. వారు తర్వాత

గవర్నమెంటు సర్వీసులో డిప్యూటీ కలెక్టరు కంటె ఏదో పెద్ద ఉద్యోగం చేశారు.

ఆ కాలంలో హిందూహైస్కూలులో అయిదో ఫారమో లేక స్కూల్ ఫైనల్ క్లాసో చదువుచు నరసింహాచారి అనే వైష్ణవ యువకుడు, చివితాలూకా పెదముత్తేవి కాపురస్థు డుండేవాడు. అతడించుమించుగా రౌడి. గల్లంతు చేస్తూ తగాదాలు పెట్టుకొంటూ ఉండేవాడు. ఏవిధంగా జరిగిందో జ్ఞాపకం లేదుకాని నేను నరసింహాచారి వగైరాతో కలసి ఏదో గల్లంతో, దొమ్మీయో చేశానని మా హెడ్ మాస్టర్ రాస్ పిళ్ళేగారికి ఫిర్యాదు వెళ్ళింది. బహుశా ఒక సంఘటన వలన అయివుండవచ్చును. మాకు సమీపములోవున్న ఇంటి యజమానో, ఆయన కుమారుడో యూరపియన్ పద్ధతి వేష భాషలతో, పోకడలతో పెద్ద దొరవలె వ్యవహరించేవాడు. ఒకనాడు రైలు దిగి ఒంటెద్దుబండిమీద సామానుతో వచ్చాడు. బండివానితో తగాదాపడి తన మొలకు వేసుకొన్న తోలుబెల్టు తీసుకొని అతనిని చావబాదాడు. బండివాని అరుపులువిని కొంతమంది విద్యార్థులం తగాదా పెట్టాము. అతడు రిపోర్టు యిచ్చివుండవచ్చు. వారు నా సమాధాన మడిగి, సంతృప్తి పడక కాలేజి హాస్టల్ లో బలవంతాన చేర్పించారు.

నేను అప్పటివరకు ఉంటున్న సందులోని గదికంటె హాస్టలులోనిగది, పరిసరాలు చాలా బాగాఉండినవి. పైగా భోజనంకూడా బాగాఉండేది. భోజనం విషయంలో నాకు బాగా జ్ఞప్తికిఉన్నది పండుగప్ప అనే చేపకూర. బందరు సముద్రపు చేపలకు, గాజు రొయ్యలనే పెద్ద రొయ్యలకు చాలా ప్రసిద్ధి అని పైన చెప్పాను. ఆ రేవు విశేష మేమోగాని అక్కడ దొరికే చేప మంచి రుచిగాఉంటుంది. పండుగప్పకూర అనగానే ముందుకురికే వాళ్ళలో నేనొక ప్రముఖుడను. ఆ రోజుల్లో బందరులో చేపలు, రొయ్యలు, కూరగాయలు చాలా చవుకగా ఉండేవి. పెద్ద సైజుగల గాజురొయ్యలు కాసీకి (అణాలో నాల్గవవంతు) రెండు వచ్చేవి. తర్వాత కాసీకి ఒకటైనా

వచ్చేది. పండుగప్ప, మేవ, మాగ మొదలైన శ్రేష్ఠమైన సముద్రంచేపలు వీశె 1కి ఆరణాలో, అర్ధరూపాయో ఉండేవి. పీచురొయ్య అతి చౌక. కాయగూరల విషయం చెప్పనక్కరయే లేదు. బందరులో దమ్మిడీయే కాకుండా, కాసు (దమ్మిడీలో 5-వ వంతు) కూడా మార్కెటులో చలామణి అయ్యేది. రెండణాలు తీసికొనివెళ్ళి ఒక అణాకు పీచురొయ్య, అర్ధణాకు గోంగూర, కడమ అర్ధణాకు పచ్చిమిర్చి, కొత్తిమీర, ఉల్లిబొందు, అల్లంముక్క వగైరా తెచ్చుకొంటే 6, 7 గురు గల కుటుంబానికి ఒక పూటకు పుష్కలంగా కూర సరిపోయేది. కాసుయేగాక, కాసుకంటె తక్కువ విలువగల కౌరీలు ( గవ్వలు ) చలామణిలో ఉండేవట. కాయగూరలను బీదవాడు అర్ధణాకు ఒకపూటకో, రెండుపూటలకో తనకు, తన కుటుంబానికి సరిపడేవి కొనటానికి ఈ కాసులు, కౌరీలు అక్కరపడేవి. బందరులో కూర కుపయోగపడే వస్తువులు అంత కారుచవుక. పీచురొయ్యను గోంగూరతో ఉపయోగించినప్పుడు మిక్కిలి రుచిగావుంటుంది. రొయ్యకూరలో కొబ్బరి, సోయ కూర, ఉల్లిబొందు, పచ్చిమిర్చి, అల్లం తప్పక ఉపయోగించేవాళ్లు. ఆ రోజుల్లో కొబ్బరికాయ ఏ కానీయో అర్ధణాయో ఉండేది. సోయ కూరను బందరు పర ప్రాంతాల్లో మళ్లుగట్టి ఎక్కువగా పెంచే వారు. అదికూడా మిక్కిలి చౌకగా దొరికేది. ఈ సందర్భంలో బందరు సారచేపను గురించికూడా చెప్పవలసియున్నది. సారచేప పిట్టు బాగా వంటచేస్తే మిక్కిలి రుచిగాఉంటుంది. దానిలో పచ్చిమిరప, అల్లం వగైరాయేకాకుండా ముఖ్యంగా పచ్చి కొబ్బరి, గసగసాలు వాడి, నూనెలో వేయించితే జిహ్వను ఉరకలు వేయిస్తుంది. ప్రముఖ న్యాయవాది శ్రీ బొల్లిని నారాయణస్వామి నాయుడుగారింట్లో ఒక వయస్సుమళ్ళిన వంటకత్తె ఉండేది. ఆమె సారచేపపిట్టు రుచిచూచినవాళ్ళు, మరల ఎప్పుడు తిరిగి అవకాశం లభిస్తుందా అని ఎదురుచూచేవాళ్లలో నాది అగ్రస్థానం. బందరు మార్కెట్టు ప్రస్తావనను ముగించుటలో, ఆ రోజుల్లో అక్కడి పండుతమలపాకుల విషయం చెప్పవలసియున్నది. బందరులో పండుతమలపాకులను తయారుచేసినట్లు ఇంకెక్కడనైనా చేసేవారేమో నాకు తెలియదు గాని, అక్కడి

వర్తకులు బహుశ్రద్ధగా ముదురుతమలపాకులను మాగబెట్టి చెడిన, నలిగిన, చీలిన భాగాలను కత్తిరించి, చక్కగా తుడిచి, బంగారు రేకులను ఏర్చి పేర్చినట్లు పేర్చేవారు. ఆ వర్తకు లుదయమే స్నానంచేసి, నీటుగా బొట్టు పెట్టుకొని, పరిశుభ్ర వస్త్రధారణతో గోటుగా ఉండేవారు.

ఈ సందర్భంలో ఒక విషయం గుర్తుకు వస్తున్నది. నే నప్పటికింకా బందరు చదువుకు పోలేదు. ఒకనా డొకవ్యక్తి గుడివాడనుండి మా స్వగ్రామం బొమ్ములూరుమీదుగా రోడ్డు మీద నడచి వెళ్ళుచుండగా, సంజ చీకటిలో తేలుకుట్టి బాధపడు చుండగా, పొలంనుండి వచ్చుచుండిన మా నాన్నగారు చూచి, జాలిపడి, మా యింటికి తీసికొనివచ్చి తగిన ఉపచారాలు చేశారు. భోజన సమయం వచ్చేటప్పటికి ఏ కులం, ఎక్కడ వడ్డించాలి, ఎవరు విస్తరు తీసివేస్తారు అనే ప్రశ్నలు వచ్చాయి. ఆ వ్యక్తి బలిజ కులస్థుడని తెలిసింది. కాబట్టి భోజనం నట్టింట గాకుండా ఇంటి హాలులో పెట్టవచ్చునని నిర్ధారణయింది. ఎంగిలి విస్తరి "నేను తీసివేస్తా" నని అప్పు డక్కడుండిన సాత్విక స్వభావురాలు, పూజా పునస్కారాలుచేసే ఒక విధవబంధువు చెప్పింది. తీసివేసిన తర్వాత "శుద్ధికొరకు స్నానం చేస్తా"నన్నది. నిజానికి ఆ వ్యక్తి హుందాగా, మంచి బట్టలతో, చూచినవారికి మంచి కుటుంబము లోనివాడు, ఆస్తిపాస్తు లున్నవాడని తోస్తుంది. అట్టి పెద్దమనిషి కాబట్టే ఇంట్లో భోజనం పెట్టటానికి ఒప్పుదలయింది. లేకపోతే ఏ బైట వరండాలోనో పెట్టేవాళ్ళు. విచారించగా అతడు బందరు తమలపాకు వర్తకుడని తెలిసింది. తర్వాత ఒకనాడు వారిని ఆయన దుకాణంలో కలిసికొనగా ఎంతో మర్యాద చేశారు. నిజానికి కమ్మ, వెలమ, రెడ్డి, కాపు అనగా తెలగ లేక బలిజ కులాలు సమాన ప్రతిపత్తి, హోదా, మర్యాద గలవి. కాని ఆ రోజుల్లో ఏ కులం అధికంగా, ప్రాబల్యంగా పల్లెటూరులో ఉండేదో ఆ కులం, తతిమ్మా కులాలవారిని తక్కువగా చూచే వారు. ఈ స్థితినుండి బహుశా వెలమలను మినహాయించవచ్చు నేమో. కారణం వారి జనసంఖ్య చాలా తక్కువ. కొన్ని పరిమిత ప్రదేశాల్లోనే ఉండేవారు. పైగా వారిలో జమీందారులు కృష్ణా

జిల్లాలో ఎక్కువ. వారి ప్రాబల్యం చాలా హెచ్చుగా ఉండేది. అయితే ఈ వెలమలు రాచవెలమలు. పై మూడు కులాల వలెనే పద్మనాయక శాఖకు (రెడ్లిప్పుడు మేము రాష్ట్రకూటులం, ప్రత్యేక మంటున్నారు) చెందినవారు. తూర్పు వెలమలు కొప్పు వెలమలనేవారు కాదు. ఈ వెలమలను తక్కువ కులంగా ఇప్పటికిని ఈ ప్రాంతాలవారు ఎంచుదురు.

బందరులో న్యాయవాదు లించుమించుగా బ్రాహ్మణులు, వారిలో చాలామంది ప్రముఖులు. అయినా వైశ్యులకే పట్టణంలో ప్రథమస్థానం. కలంకారి వృత్తిలో ఆదివెలమలు, బలిజలు కూడా పేరు గడించారు. పెద్ద వ్యాపారం చేస్తూ వుండేవారు. ఒకప్పుడు మహమ్మదీయులు ఉచ్చదశలో నుండినట్లున్నది కాని మా కాలానికి, తక్కువ స్థాయిలోని తురకలు మంగలి వృత్తి వంటివి నడుపుకొనుచుండినారు. మా మంగ లొక తురకయే. నిజాని కీ తురకమంగల్లే క్రాపు బాగాచేసేవారు.

మేము 1913 లో మూడవ ఫారంలో చేరినప్పుడు మా హెడ్‌మాస్టరు రాస్ పిళ్లెగారు. వారు గొప్ప క్రమశిక్షణ శాసకుడు. ఆయనను వరండాలో చూచిన విద్యార్థులకు హడల్ గా నుండేది. రీసెస్ లో పిల్లలు అటు ఇటు పోయి, ఆలస్యముగా క్లాసుకు వెళ్ళకుండా రీసెస్ ముగియులోపల ఆయన వరండాలో పేముబెత్తము పుచ్చుకొని తనిఖీకి బైలుదేరేవారు. ఆలస్యముగా వస్తున్న విద్యార్థుల నాపి తలొక చురు కంటించి భయపెట్టేవారు. ఆయన జాడ కనిపెట్టిన విద్యార్థులు అసలు కంటికి కనబడకుండానే దాగుకొనేవారు. రాస్‌గారు మిక్కిలి సునిశితబుద్ధి గలవారు. భయపెట్టినను, సున్నితమనస్సు, సానుభూతి గలవారు. ఉత్తములు. అపకారము చేసి ఎరుగరు. ఆ రోజులలోని కొన్ని సంఘటన లిప్పటికిని సంభ్ర మాశ్చర్యములను కలిగిస్తవి.

నోబుల్ కళాశాలలో ముగ్గురు తెలుగుపండితులుండేవారు. నల్లశాస్త్రి, బుడ్డిచెంబుశాస్త్రి, ఎర్రశాస్త్రిగార్లు. నల్లశాస్త్రి గారు, మొక్కపాటి సూర్యనారాయణశాస్త్రిగారు. కాలేజి క్లాసు లకు తెలుగు, సంస్కృతములను చెప్పుచుండేవారు. బుడ్డిచెంబు

శాస్త్రిగారు, కోరాడ నాగేశ్వరశాస్త్రిగారు. వీరు హైస్కూల్ క్లాసులు అనగా 4 నుండి 6-వ ఫారము వరకు చెప్పేవారు. ఎర్రశాస్త్రిగారు, శిష్టా నృసింహశాస్త్రిగారు. వీరు మూడవ ఫారం తరగతులకు తెలుగు చెప్పేవారు.

సూర్యనారాయణశాస్త్రిగారు గడుసు మనిషి. మాట తరుచు పరుషముగా నుండేది. పాఠములు శ్రద్ధగానే చెప్పేవారు. నేను ఇంటర్ మీడియేట్‌లో భాషాగ్రూపు తీసుకొంటిని. శ్రీహర్షుని రత్నావళి సంస్కృత నాటకము వారివద్ద పఠనము. తెలుగు పాఠములుకూడ కొన్ని వారివద్దనే. మనిషి చామన చాయగా నుండుటనుబట్టి నల్లశాస్త్రిగా రని పేరు వచ్చినది. నాగేశ్వరశాస్త్రిగారు ప్రసిద్ధ సంస్కృతాంధ్రపండితకవులు. రామచంద్రశాస్త్రిగారి కుమారులు. వారు అల్పాచమానం చేసి నప్పుడు నీళ్లు వాడుటకుగాను ఒక బుడ్డిచెంబును అంగవస్త్రమునకు కట్టుకొని వుంచుకొనేవారు. వారు తరచు అల్పాచమానం చేస్తూ వుండేవారు. బహుశా మధుమేహవ్యాధివలన కావచ్చును. బుడ్డిచెంబు వలన బుడ్డిచెంబుశాస్త్రి అయినారు. వారు మిక్కిలి సహృదయులు, మంచి పండితులు. మిక్కిలి చమత్కృతిగా మాట్లాడేవారు. వారిని విద్యార్థులు గౌరవించేవారు. ఎఱ్ఱశాస్త్రి గారు మిక్కిలి స్ఫురద్రూపి. వారు మా మూడవఫారం తెలుగు బోధకు వచ్చేవారు. పాశ్చాత్య దుస్తులు వేసికొంటే లాటిన్ పాశ్చాత్యునివలె కనపడివుండేవారు. గొప్ప సంస్కృత పండితులు. సంస్కృతములో ధారాళముగా మాట్లాడగల్గేవారు. కాని వట్టి అమాయకులు. మిక్కిలి ఆకర్షణీయమైన భారీమని షయినా, ఆయన అలౌకిక శుద్ధ వైదికి అగుటచేతను కాబోలు, విద్యార్థులు ఆయన క్లాసులో అధికంగా అల్లరిచేసేవారు. ఆయన క్లాసురూములో కాలుపెట్టటంతోనే గొల్లుమని క్లాసు క్లాసంతా చప్పట్లుకొట్టేవారు. చేతులతోను, కాళ్లతోను బల్లలు, డ్రాయర్లు గ్రుద్ది, తన్ని, పెద్ద ధ్వనిచేసేవారు. వారు వచ్చి కుర్చీలో చతికలబడి ఉస్సూ అంటూ మోచేతిని బల్లకానించి, కుడి హస్తముతో తల పట్టుకొని కొంచెం వంచుకొని, ఒకటి

రెండు నిమిషాలు అట్టే ఉండిపోయేవారు. గందరగోళం ఆగక సాగుతూఉంటే, కోపము పట్టలేక ఒక్కొక్కప్పుడు గబుక్కున లేచి పెద్దపెద్ద కేకలు పెట్టుతూ "గాడిదల్లారా దున్నపోతుల్లారా" అంటూ తిట్టేవారు. అప్పటికీ గల్లంతు తగ్గనియెడల, ప్రాణము విసిగి "చూడండి, హెడ్ మాస్టరుగారిని తీసుకొనివచ్చి మీ దుంప తెంపుతా"నని హెడ్ మాస్టరు రాస్ గారి గదికి పరుగెత్తేవారు. అంతటితో, గల్లంతు పూర్తిగా అంతర్ధానమయ్యేది. ఇట్టి సన్నివేశాలలో నాకుకూడా కొంత పాత్ర వుండేది. ఆ సంవత్సరం మా సెక్షనులో మా జట్టు ఆ రేడుగురం ఉండేవాళ్ళం. కొల్లిపర సూరయ్యా, వేమూరి సీతారామయ్యా, గొర్రెపాటి (పండిత) వెంకట సుబ్బయ్యా, కొల్లిపర నాగయ్యా, అయినంపూడి గోపాల కృష్ణయ్యా, నేను, ఇంకొక డుండేవాడేమో గుర్తులేదు. మేమందఱం అప్పటికి వయస్సువచ్చి మీసం గడ్డాలతో ఉండేవాళ్ళం. ఒడ్డు పొడుగుగల వాళ్లం. అందరం చిట్టచివరి బెంచిలో కూర్చునే వాళ్ళం. మాలోకల్లా గోపాలకృష్ణయ్య మిక్కిలి చిలిపివాడు. అతన్ని చూస్తేనే హాస్యగానివలె నుండేవాడు. అతడే ఎక్కువ గందరగోళం చేసేవాడు. మాలో మెజారిటి ఘంటసాల గ్రామస్థులు. ఆ విషయం శాస్త్రిగారికి తెలుసు. ప్రాణం విసిగినప్పుడు, "ఘంటసాల గాడెదల్లారా, దున్నపోతుల్లారా" అని అరచేవారు. శాస్త్రిగారు అమృతహృదయులు, చీమకుకూడ హాని చేయనిమనిషి, పవిత్రుడు. ఇతరుల కెట్లావున్నా, నాకు వారియందు మిక్కిలి పూజ్యభావ ముండేది. చాలా సంవత్సరాల తర్వాత నే నింగ్లండు నుండి తిరిగివచ్చిన క్రొత్తలో (1927 సం.) ఒకనాడు బెజవాడ హాస్పిటల్ రోడ్డులో నడచివెళ్తుండగా శాస్త్రిగా రెదురైనారు. దీర్ఘకాలం గడచియుండటంవల్లనేగాక, నా రూపంకూడ చాలా మార్పుచెంది యుండటంవల్ల శాస్త్రిగారు న న్నేమాత్రము పోల్చలేదు. నేను వారికి నమస్కరించి "నేను మీ ప్రాత విద్యార్థి" నని చెప్పగా, మిక్కిలి సంతోషించి దగ్గరకు తీసుకొని, భుజము మీద చెయ్యివేసి ఆదరణగా క్షేమసమాచారము లడిగినారు. తర్వాతగాని నే నింగ్లండుకు వెళ్ళినది, డిగ్రీలు పొందినది మొదలగు సంగతులు చెప్పలేదు. నేను మీ ప్రాత విద్యార్థి నని



నోబుల్ హైస్కూలు, మచిలీపట్టణము
థర్డుఫారం 'ఏ' డివిజన్ — 1913-1914

నిల్చున్నవారిలో - చివరి వరుసలో

నాలుగవ స్థానం ఎల్. వి. వి., 5. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య.
6, కొల్లిపర నాగయ్య

రెండవ వరుస

2, యద్దనపూడి సత్యనారాయణ, 3. పి. ఎల్. నరసింహారావు,
5. పుణుకొల్లు సూర్యనారాయణ, 7. వేమూరి సీతారామయ్య,
8. దుక్కిపాటి నాగభూషణం, 9. తాతినేని సీతారామయ్య

మూడవ వరుస

1. నాదెళ్ల వెంకటదాసు, 2. ఉప్పలపాటి నాగయ్య, 3. పోలవరపు వెంకట నరసింహారావు,
5. ఘంటసాల శేషగిరిరావు, 8. ధర్మరాజు, 10. ఐనంపూడి గోపాలకృష్ణయ్య

కుర్చీలు

1. చోడవరపు జగన్నాథరావుగారు, 2. రాస్ పిళ్లె, 3. శిష్టా నరసింహశాస్త్రి

క్రింద

1. లింగం నాగభూషణం



నోబుల్ హైస్కూలు, మచిలీపట్టణము
ఫోర్తుఫారం 'ఏ' డివిజన్ — 1914-1915

నిల్చున్నవారు - చివరివరుస

1. కొల్లిపర నాగయ్య, 2. వేమూరి సీతారామయ్య, 3. లింగం వీరభద్రయ్యచౌదరి,
7. తిపిర్నేని వెంకట సుబ్బయ్య, 8. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య,
10. అర్బుదనాథం

రెండవ వరుస

1. కంచర్ల చంద్రశేఖరరావు, 2. లింగం నాగభూషణం, 3. మల్లికార్జునరావు,
6. వంకాయల. 8. దుక్కిపాటి నాగభూషణం, 9. పుణుకొల్లు సూర్యనారాయణ,
10. ఐనంపూడి గోపాలకృష్ణయ్య

మొదటి వరుస

1. ఉప్పలపాటి నాగయ్య, 2. నాదెళ్ల వెంకటదాసు, 3. యద్దనపూడి సత్యనారాయణ
8. కొల్లిపర సూరయ్య, 9. ధర్మరాజు, 10. బుల్‌బుల్, 11, వంకాయల

కుర్చీలు

1. వేదనాయకం పిళ్లెగారు, 2. చోడవరపు జగన్నాథరావుగారు, 3. రాస్ పిళ్లెగారు,
5. శివలెంక పున్నయ్యగారు

చెప్పినంతమాత్రానే, అంత అపూర్వప్రేమ జూపుట వారి నిష్కల్మష హృదయాన్ని, సహజ సౌజన్యాన్ని చాటుచున్నవని వేరే చెప్పనక్కరలేదు.

మూడవఫారం మా 'ఎ' డివిజన్‌లో గన్నవరం తాలూకా కపిలేశ్వరపుర గ్రామమునకు చెందిన కొల్లిపర సూరయ్య, కొల్లిపర నాగయ్య; ఘంటసాలకు చెందిన గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, వేమూరి సీతారామయ్య, అయినంపూడి గోపాలకృష్ణయ్య; బొమ్ములూరుకు చెందిన నేను, నా పెదతండ్రి కుమారుడు నాగభూషణం, మా పినతాత కుమారుడు వీరభద్రయ్య ; పెదపార పూడికి చెందిన పుణుకొల్లు సూర్యనారాయణ; పెయ్యేరుకు చెందిన దుక్కిపాటి నాగభూషణం, పోలవరపు వెంకట నరసింహా రావు; గురజకు చెందిన ఉప్పలపాటి బ్రహ్మయ్యగారి కుమారుడు నాగయ్య ; కౌతరంకు చెందిన నాదెళ్ళ వెంకటదాసు కమ్మ కుర్రవాళ్ళ ముండేవారము. కొంతమంది ముస్లింబాలురు, బ్రాహ్మణ బాలురు, వైశ్య బాలురు వగైరా ఉండేవారు. మహమ్మదీయ బాలుర పేర్లు గుర్తుకు రావటంలేదుగాని పెడసనగల్లు సమీప గ్రామం యద్దనపూడికి చెందిన యద్దనపూడి సత్యనారాయణ, బందరుకు చెందిన పి. యల్. నరసింహారావు నాకు బాగుగా గుర్తు. పరీక్షానంతరం మా క్లాసువారు తీయించుకొన్న గ్రూపు ఫొటోను ఈమధ్య చూచి గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు "బందరుకు చెందిన సుబ్బారావు, కపిలేశ్వరపురమునకు చెందిన ఇంకొక కమ్మబాలుడు తాతినేని సీతారామయ్య ఉన్నా"రన్నాడు. మరిన్ని ఘంటసాల శేషగిరిరావు అనే వైశ్య బాలుణ్ణి గుర్తుపట్టి నారు. ఈ ఫొటోలో మా క్లాసు టీచరు చోడవరపు జగన్నాధ రావుగారు, తెలుగు టీచరు శిష్ట్లా నరసింహశాస్త్రిగారు, హెడ్ మాస్టర్ రాస్ పిళ్లైగారు న్నారు. నాకు బాగుగా గుర్తున్నది క్లాసు టీచరు జగన్నాధరావుగారు, తెలుగు టీచరు నరసింహశాస్త్రి గారు. జగన్నాధరావుగారు ఇంగ్లీషుతోబాటు చరిత్ర వగైరా చెప్పేవారు. క్రిస్టియన్ విద్యాసంస్థ కాబట్టి మొదటి పీరియడ్

క్రైస్తవమతగ్రంథం బైబిలునుండి బోధన వుండేది. క్రైస్తవ మతంపుచ్చుకొన్న వైదిక బ్రాహ్మణుడు దర్భా రామశాస్త్రిగారు క్రైస్తవబోధనపాఠం చెప్పేవారు. వారు క్రైస్తవమతం పుచ్చుకొన్నా వారి ఆచార వ్యవహారాలన్నీ శుద్ధ శ్రోత్రియ కుటుంబములోనివంటివే.

జగన్నాధరావుగారు మాకు థర్డుఫారం పూర్తి సంవత్సరం చెప్పలేదు. వారప్పటికి టీచర్ ( ఎల్. టి. ) తరిఫీదు పొంది యుండలేదు. అది పొందితేనేగాని పైక్లాసులకు చెప్పే అర్హత రాదు. అందువలన 1914 జనవరి ( అనగా క్రిస్‌మస్ సెలవులు ) నుండి తరిఫీదుకు మద్రాసు వెళ్ళారు. వారు మిక్కిలి విస్పష్టంగా, సులువుగా తెలిసేటట్లు చెప్పేవారు. వారి కంఠ ధ్వని జీరగాని, బొంగురుగాని లేనిది. భారీ విగ్రహం గలవారు. నిటారుగా నిలుచుండి పాఠం చెప్పుచుంటే వినబుద్ధిఅయ్యేది. వారు మెడనుండి పూర్తిగా గుండీలుపెట్టిన పొడుగు కోటును, తెల్లని ఇస్త్రీచేసిన పంచెను ధరించేవారు. తలకు గోధుమ పసుపురంగుల మిశ్రమన్నట్లుండిన పట్టు తలపాగాగుడ్డను తలకు చుట్టుకొనేవారు. ఒక గుర్తు — ఎవరో బహుశా ప్రిన్సిపాల్ అయివుంటాడు, అటు ప్రక్కకు మా గదుల వరండాలోకి రాగా వారికి విస్పష్టంగా వినబడేటట్లు, క్లైవ్ ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్య స్థాపకుడని ఎలుగెత్తి చరిత్ర పాఠంలో చెప్పారు.

నాల్గవఫారంలోకూడా మాకు "ఎ" డివిజనే వచ్చింది. మా "ఎ" డివిజనుకు చోడవరపు జగన్నాధరావుగారే క్లాసు టీచరుగా వచ్చారు. శిష్టా నరసింహశాస్త్రిగారి తెలుగుబోధ మూడవఫారంతోనే సరియని గుర్తు. నాలుగవఫారానికి బుడ్డిచెంబు శాస్త్రిగారు ( కోరాడ నాగేశ్వరశాస్త్రిగారు ) తెలుగు టీచరు. లెక్కలను శివలెంక పున్నయ్యగారనేవారు బోధించేవారు. మూడవఫారంలోనుండిన కమ్మబాలురమందరము నాల్గవఫారం "ఎ" డివిజనులో సమకూడినాము. క్రొత్తగా అంగలూరుకు చెందిన త్రిపురనేని వెంకట సుబ్బయ్య కనపడుచున్నాడు. ఇతర

కులస్థులలో అంగలూరుకు చెందిన జంగం చంద్రశేఖరరావు; బందరుకు చెందిన కాపుకులస్థుడు మల్లికార్జునరావు, వైశ్యుడు వంకాయల హనుమంతరావు క్రొత్తగా వచ్చినట్లున్నది. మూడవ ఫారంలోనుండిన పి. యల్. నరసింహారావు, యద్దనపూడి సత్యనారాయణ ఉండినారు. వీరుగాక మా రైటరు దేవసహాయం గారి కొడుకు, మా ఇంగ్లీషు లెక్చెరర్ శ్రీ వేదనాయకంపిళ్లెగారి కుమారుడు అర్బుదనాదం మా 'ఎ' డివిజనులోకి వచ్చారు.

మా పెడసనగల్లు కనతిదూరంలోవున్న యద్దనపూడి గ్రామస్థుడు యద్దనపూడి సత్యనారాయణ నా కెందుకో దగ్గరకాలేదు. ఆరోజుల్లో బ్రాహ్మణ బాలురు తమకంటె తక్కువ కులస్థులనుకొన్న బాలురతో అట్టే సంబంధాలు పెట్టుకొనకపోవటం కారణమనుకొనవచ్చును, వ్యక్తిగత ముభావ స్వభావం కావచ్చును. ఆయన చాలా సంవత్సరాలు పెడసనగల్లులో చిన్నపిల్లలకు చదువు చెప్పుటకు స్వంతపాఠశాల నడిపాడు. 1953 లో ఉద్యోగ విరమణానంతరం నేను పెడసనగల్లులో స్థిరపడిపోయినా ఎప్పుడో ఒకప్పుడు తన కూతురుపెండ్లికి సాయంచేయండని వచ్చినప్పుడు తప్ప మా యింటికి వచ్చియుండలేదు. అప్పు డతను నాకు మూడు నాలుగు ఫారములలో సహాధ్యాయియని గుర్తులేదు. ఈమధ్య స్నేహితుడు పుణుకొల్లు సూర్యనారాయణగారు మాటల ప్రస్తావనలో మూడు నాలుగు ఫారముల గ్రూపు ఫొటోలు తనవద్దనున్న వని ఇచ్చిన తర్వాతగాని ఆ శ్రీ సత్యనారాయణ నా సహాధ్యాయియని నేను తెలిసికొనలేదు. అప్పటి కాయన పెడసనగల్లు విడిచి బెజవాడకు వెళ్ళిపోయాడు. తర్వాత ఇంతవరకు మేము కలసికొనలేదు.

బందరు బలిజ నాయుడు కుర్రాడు మల్లికార్జునరావు సాత్వికుడు. తన పనేదో తాను చూచుకొనేవాడు. స్నేహపూర్వకంగా ఉండేవాడు. కొంత ఇష్టం, చనువేర్పడిందికాని మిత్రులంకాలేదు. నిజానికి అతనిని తిరిగి కలసికొనలేదు. ఒకప్పు డెవరినో అడిగి తెలుసుకోగా చనిపోయినాడని చెప్పారు.

అంగలూరు తిపిర్నేని వెంకట సుబ్బయ్య, మా ఊరివారి బంధువు. పైగా మేమందరం స్నేహపూర్వకంగా గౌరవించుచుండిన డా. తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారి పినతండ్రికొడుకు. అల్లరిచేసే రకంకాదు. మా యిరువురి సంబంధాలు సామాన్యంగా ఉండేవి. జంగం చంద్రశేఖరరావు విషయంలో—అతడొకవిధంగా దగ్గరవాడు. అంగలూరు జంగముల విషయం కొంత పైన జెప్పియున్నాను. వారిలో అసాధారణమేధావి, ఆయుర్వేద వైద్యంలో దిట్ట (శ్రీ) సుబ్బయ్యగారు, ఆయన కుమారుడు కోటయ్యగారు బాగుగా తెలిసినవారగుటయేగాక, నాకు మిక్కిలి దగ్గర స్నేహితుడైనవాడు (శ్రీ) కంచర్ల బసవ కోటిలింగంగారు. వారు మిక్కిలి భాషాజ్ఞానులై, చక్కని కవిత్వం వ్రాసేవారు. గాథలెన్నో చెప్పేవారు. హైస్కూల్ తెలుగు పండితులుగా చాలా కాలం గుడివాడలో పనిచేసి, పింఛను పుచ్చుకొని ఈ మధ్యనే గుంటూరులో చనిపోయారు. వారి కుటుంబంలోనివాడు చంద్రశేఖరరావు. అతడు విద్యార్థిగా అజలోకి రాలేదు. పిన్నవయస్సులోనే మృతిజెందాడు.

జగన్నాథరావుగారిని గురించి, బుడ్డిచెంబు శాస్త్రిలుగారిని గురించి పైనచెప్పియున్నాను. శివలెంక పున్నయ్యగారు ఆరాధ్య శాఖకు చెందినవారు. వారు నిష్కపటి, నిర్మొగమాటి, న్యాయబుద్ధిగలవారు. మాకు చక్కగా విడదీసి నేర్పుగా లాలించినట్లు లెక్కలు బోధించేవారు. గంభీరంగా, హుందాగా, నెమ్మదిగా ఉండేవారు. సన్నగా, పొడుగ్గా, చురుకైన కోల ముఖముతో, ఎత్తైన నున్నుదురుతో, వంపుకల్గి కొనతేలిన నాసికతో చూచిన వెంటనే గౌరవించదగిన వ్యక్తిగా తోచేవారు. వారు కొద్ది కాలమే బహుశా ఆ సంవత్సరమే ఉపాధ్యాయులుగా వుండి వుంటారు. తరువాత ప్లీడరుగా కృష్ణాజిల్లా గుడివాడలో స్థిరపడి పోయారు. అంతకుముందు సంగతి గుర్తులేదుగాని, నేనింగ్లండు నుండి తిరిగివచ్చినతర్వాత వారి నప్పుడప్పుడు గుడివాడలో కలసికొంటూవచ్చాను. కుతంత్రము ఎరుగని నిర్మొగమాటి అగుటచేత కాబోలును, వారి తెలివితేటలకు తగినంతగా వారు న్యాయవాదివృత్తిలో పైకిరాలేదు. వారు కొలది సంవత్సరముల

క్రిందటనే చనిపోయారు. అంతకు రెండు మూడు మాసములకు ముందు వారు వ్యాధితో మంచములో నుండగా దర్శించాను.

కొల్లిపర సూరయ్యగారు చాలా నెమ్మదిమనిషి. మితభాషి కూడ. సహజంగా గల్లంతుచేసే స్వభావం గలవాడు కాడు. గిల్లి గజ్జాలు, పోకిరిచేష్టలు ఆయనకు సుతరాం గిట్టవు. పెద్దమనిషి తరహా. ఆయన తరువాతజీవితంలో కృష్ణాజిల్లా కాంగ్రెసు రాజకీయాలలో ఒకప్పుడు గణనీయమైన పాత్రను వహించారు. కొంతకాలం శాసనసభలోకూడ సభ్యులుగా నుండినారు. వారు, మేముచేసే గల్లంతుల్లో పాల్గొన్నారని చెప్పలేను. కొల్లిపర నాగయ్యకూడ చిలిపిచేష్టలు చేసేవాడుకాడు. పోకిరి వేషా లంతకు ముందే లేవు. కాని నల్గురు పిల్లలు కలసి చేసే గల్లంతుల్లో పాల్గొనకుండావుండే స్వభావముగలవాడు కాడు. వేమూరి సీతారామయ్య కూడా తనంతట తాను గల్లంతుచేస్తూ, గందరగోళం సృష్టించే మనస్తత్వంకలవాడు కాడు. సూరయ్యవలెనే శాంతస్వభావుడుగా తోపించేవాడు. కొంత భయస్తుడుకూడాను. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గల్లంతుల్లో ఉన్నాడా లేడా అను సందేహానికి తావు యిచ్చేవాడుకాని తనంతట తాను గల్లంతు మొదలుపెట్టక పోయినా, ఉత్సాహంతో పాల్గొను స్వభావము కల్గియుండినట్లు గుర్తు. ఇక నా విషయము. నేను స్వభావసిద్ధంగా చిలిపిచేష్టలు గల్లంతు చేసేవాడనుకాను. కొంత దర్జా, హుందాతనము కలిగిన వాడనే. కాని రెచ్చిపోయి బరిలో దిగినప్పుడు రణగొణ ధ్వనులుచేస్తూ, చిందులుత్రొక్కే-స్వభావం కలవాడనే. మే మందరం ఒకఎత్తు, అయినంపూడి గోపాలకృష్ణయ్య ఒకఎత్తు. అతడు గల్లంతుకు, చిలిపిచేష్టలకు పెట్టినదిపేరు. అతడు ముందు పుట్టాడా, చిలిపిచేష్టలు ముందుపుట్టినవా అను సందేహానికి అవకాశమిచ్చేవాడు. అసలు అతనిముఖం ఎప్పుడూ వెకిలి నవ్వుతో ఉండేది. పైకుబికివచ్చిన కళ్ళు, ఇకిలించే నవ్వు, హాస్యగాని ముఖమువంటి ముఖం—నడిచే తీరు, చేతు లూపే పద్ధతి, అతనిని చూస్తేనే గల్లంతుచేయ బుద్ధిపుడుతుండేది. ఇతనితో సరితూగకపోయినా పి. ఎల్. నరసింహారావుకూడ తుంటరిచేష్టల

వాడే. గల్లంతు చాలా హెచ్చుగా చేసేవాడు. ఇతడు నాలుగవ ఫారంలో చేసిన గల్లంతు ఇంతా అంతా గాదు. ఒక డెస్కుమీద నుండి ఇంకొక డెస్కుమీదకు దూకటం, వానిమీద చిందులు త్రొక్కటం నా కిప్పటికిని బాగుగా గుర్తు. ఒక్కొక్కప్పుడు శ్రుతిమించి రాగాన పడేవాడు. లాగు క్రిందకు దిగజార్చి, బొడ్డు క్రిందిభాగాన్ని చేతితో ఆటలాడించేవాడు. క్లాసును గగ్గోలు పరచేవాడు. టీచరు వస్తూఉండటం చూచి క్లాసునుంచి పారిపోయేవాడు.

మేము చదివేది మూడవఫారమైనా కొల్లిపర సూరయ్యా, కొల్లిపర నాగయ్యా, వేమూరి సీతారామయ్యా, నేను ఎత్తుగా, లావుగా, వస్తున్న గడ్డాలు మీసాలతో, పిల్లల తండ్రులవలె ఉండేవారం. వెంకట సుబ్బయ్యా, గోపాల కృష్ణయ్యాలుకూడ మాపాటి పొడుగు, లావు లేకపోయినా వారు చదువుకు మించిన వయస్సుగలవారే. మేమందరం వయస్సువచ్చినతర్వాతనే ఇంగ్లీషు చదువు నారంభించినందువల్ల చదువుకుమించిన వయస్సులో వుండే వారము. నాకప్పటికి పదునైదు సంవత్సరాలు. కాబట్టి గడ్డము, మీసము రావటం ఆశ్చర్యంకాదు. మరిన్ని పుట్టుకరీత్యా దొండ్ర శరీరము కలవాడను. సంపన్న కుటుంబములో పుట్టినవాడ నగుటచేతను, స్వభావసిద్ధంగా భోజనప్రియుడ నగుటచేతను, బాగుగా తినటంవల్ల శరీరం లావెక్కింది.

ముస్లింబాలురు గల్లంతుచేసేవారు కాదు. ఒక ఖ్లిద్దరు మిక్కిలి చిన్నవయస్సులో ముద్దుగా ఉండేవాళ్లు. ప్రత్యేకించి ఒక ముచ్చటగొల్పే అబ్బాయిని "బుల్ బుల్" అని పిలిచేవాళ్లం. ఈ పిల్లలలో ఇద్దరి అన్న లదివరకు నోబుల్ కళాశాలలో చదివి ఫుట్‌బాల్ ఆటలో పేరుపొంది కాలేజికి ప్రతిష్ఠ సమకూర్చారు. కాలేజిలో జరుగు ప్రతి ఫుట్‌బాల్ ఆటకు హాజరై ఆటగాళ్లను ఆటస్థలంచుట్టూ గునుకుతో తిరుగుచు, ప్రోత్సహించుచుండే వారు. కాలేజి ప్రిన్సిపాల్ విలియం పెన్‌గారికి ఈ కుటుంబం మీద మిక్కిలి అభిమానం. వీరికికూడా కాలేజియందు మిక్కిలి గౌరవం, మమకారం. మతావేశంలేనప్పుడు, తమకు నచ్చితే

లాభిస్తుందనుకొన్నప్పుడు, రాజభక్తి, స్వామిభక్తి, సేవా పరాయణత్వం, వినయ విధేయతలు మొత్తంమీద ముస్లింలకు ఇతరులకంటె హెచ్చు. ఇది నా అనుభవ పూర్వకం. పైగా ఎంత మిషనరైనా కాలేజి ప్రిన్సిపాల్ ఆంగ్లేయుడు. 'విడదీసి పాలించు' రాజనీతి ప్రభావంవల్ల కూడా పెన్నుగారికి ఈ ముస్లిం కుటుంబములమీాద ఎక్కువ అభిమానం. మా క్లాసు విద్యార్థులైన తమ్ముళ్ళు, అన్నలంత మంచి ఆటగాళ్ళు కాలేకపోయినా మాకంటె ఆటల్లో చాలా మెరుగే. ఫుట్‌బాల్ ఆటలో ఎక్కువ శ్రద్ధ వహించేవాళ్ళు. బ్రాహ్మణ, వైశ్య బాలురు మామూలు ధోరణి, పి. యల్. నరసింహారావు తప్ప.

ఆటల్లో కమ్మ యువకులు చాలామంది శ్రద్ధతీసుకొనేవారు కాదు. తర్వాత కాలేజి చదువుకు వచ్చిన నూజెళ్ల కాపురస్థుడు పర్వతనేని వెంకటరత్నం ఫుట్‌బాల్ ఆటలో ప్రవీణుడై కాలేజి టీముకు కాప్టెన్ కూడా అయినాడు. ఈయనను మినహాయించి నోబుల్ కళాశాల, హైస్కూళ్లలో పేరుపొందిన కమ్మ ఆటగాళ్లున్నట్లు నాకు గుర్తులేదు. బందరు హిందూ హైస్కూలులో చదివి, ముఖ్యంగా ఫుట్‌బాల్ ఆటలో పేరుగడించిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు తప్ప. మూడు, నాలుగు ఫారముల్లో చదివిన మా కమ్మ యువకులలో ఒక్కరుకూడా ఏ ఆటలోను శ్రద్ధవహించలేదు, కృషి చేయలేదు, పైకి రాలేదు. నా విషయం మరీ అధ్వాన్నం. వీలైనంతవరకు డ్రిల్లు మాస్టరు గారిచేత చివాట్లు అప్పుడప్పుడు బెత్తం దెబ్బలు సహించేవాడిని గాని, ఒళ్ళు శ్రమపెట్టకుండా తప్పించుకొనేవాడను.

ఈ కాలంలో మతసంబంధమైన సంఘుట నొకటి బాగుగా గుర్తున్నది. ఆ రోజుల్లో క్రిమినల్ లాయరుగా పేరొందిన జె. డి. శామ్యూయల్ అనే క్రిస్టియన్ ఉండేవారు. ఆయన మసి బొగ్గురంగుతో లావుగా, మధ్య రకం ఎత్తులోఉండినా ఆయన కుమార్తె, ఎర్రగా, సన్నగా, తగిన లావుతో మంచి అందంగా ఉండేది. శామ్యూయల్‌గారిల్లు కాలేజికి అనతిదూరంలోనే. కాలేజి విద్యార్థులు ఆమెను చర్చి పండుగల్లోను, ఆదారిని వస్తూ పోతూ

చూచి లొట్టలు వేసేవారు. మా హైస్కూలు విభాగంలో, కాళీపట్నం నరసింహమూర్తిగారని టీచరుగారుండేవారు. తర్వాత ప్రసిద్ధ న్యాయవాదిగా రాణించిన నరసింహమూర్తిగారు, మొదట ఆర్థిక ఇబ్బందులవలన కాబోలు టీచరుగా చేరారు. వారి తమ్ముడొకరు ( పేరు గుర్తుకు రావటంలేదు ) అయిదవ ఫారమో, స్కూల్ ఫైనల్ క్లాసో చదువుచుండేవాడు. అతనికి శామ్యుయల్ గారి కూతురిమీద మోహం వెర్రెత్తి, ఆ పిల్లను చేసుకొంటానని బైలుదేరాడు. ఈ సంగతి తెలిసి కాలేజి ప్రిన్సిపాల్ పెన్నుగారు ఆ యువకుని చేరదీసి, పెళ్ళి అయ్యేలోపుగా కుటుంబంవారు ఇతరులు అతని మనస్సు విరుస్తారేమో అని, అతనిని శామ్యుయల్ గారి బంగళాకు సమీపానఉన్న తన బంగళాలో అట్టిపెట్టారు. ఒకటి రెండురోజుల్లో ఆ బ్రాహ్మణ యువకుడు క్రిస్టియన్ మతం పుచ్చుకోవటం, వెంటనే పెండ్లి జరగటం ఏర్పాటు. ఈ సంగతి తెలిసి అన్న నరసింహమూర్తిగారు పెన్నుగారి వద్దకుపోయి వారిని ఒప్పించటానికి ప్రయత్నించారు. పెన్నుగారు ససేమిరా అన్నారు. తర్వాత ఒక రిద్దరు హిందూ టీచర్లతోబాటు, చాలామంది విద్యార్థులు పెన్నుగారి బంగళాను ముట్టడించి, బలవంతంగా ఆ యువకుని బైటకు లాక్కొనివచ్చి ఇంటికి తీసికొనివెళ్ళి భద్రపరచి ఒకటి రెండు రోజులు కాపలాకాచారు. క్రిస్టియన్ మిషన్సు దక్షిణభారతంలో ఆంగ్లవిద్యాభ్యాసానికి పునాదులువేసి, దానిని శాఖోపశాఖలుగా అభివృద్ధిచెందింపించారు. ఆ మిషన్సు పెట్టిన భిక్షవలన చాలామంది భారతీయులు విద్యాప్రవీణులై, న్యాయవాది వృత్తులవంటి వృత్తుల్లో ప్రముఖులై దేశనాయకులు కూడా అయినారు. ఉత్తరభారతంలోకూడా వారి విద్యాసేవ మిక్కిలి గణనీయము. కాని మిషనరీలలో బహు కొద్దిమందికి హిందువులను, అందులో అగ్రకులాలవారిని, తమ మతంలోకి మార్చాలని ఆకాంక్ష ఉండేదనుకొందును. ప్రథమంలో సెయింట్ జేవియర్ వంటి మతోన్మాదులు మతమార్పిడి తమధర్మంగా ఎంచుకొనియుండవచ్చును. నోబుల్ విద్యాసంస్థను ప్రతిష్ఠించిన నోబుల్ గారికి అట్టికాంక్ష ఇంచుమించు లేదనియే చెప్పాదురు.



గ్రంథకర్త — బందరు నోబుల్ హైస్కూలు ఫోర్తుఫారం
1914 - '15 సంవత్సరంలో



గ్రంథకర్త — 1919 సంవత్సరంలో



గ్రంథకర్త — 1920 సంవత్సరంలో

ఆంధ్రలో బందరు, గుంటూరు మొదలైనచోట్ల వర్థిల్లిన విద్యాసంస్థల నటుంచి, తమిళనాడులో మద్రాసు, తిరుచనాపల్లి వంటి ప్రదేశాలలో ప్రఖ్యాత కాలేజిలు వర్థిల్లుచున్నవి. మద్రాసు క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్స్ రెవరెండు డా. మిల్లరు, రెవరెండు డా. స్కిన్నరు వంటి మహనీయులు తమ మతధర్మంగా విద్యాదానం చేసేవారుకాని తమ మతంలోకి ఇతరమతస్థులను, మోసం చేసియో, బలవంతపెట్టియో కలుపుకోవాలని చూచేవారుకాదు. తరువాత కాలంలో మద్రాసులోను, విజయవాడలోను ఇతరత్రా కళాశాలలను స్థాపించిన జెస్యుయట్ మిషన్ వారు మతమార్పులను తమ ఉద్దేశాలలో నొకటిగా పెట్టుకొనలేదు.

మతమార్పుడు సర్వసామాన్యంగా ఆర్థికస్తోమత తక్కువగానున్న వెనుకబడిన కులాలలో జరుగుచుండేది. వీళ్లకు మతవిశ్వాసంగాక, తిండికక్కుర్తి మతమార్పుకు ముఖ్యకారణం. అందువల్ల తిండిలేనప్పుడు డబ్బు కాశపడి మతంమార్చినట్లు నటించటం, కడుపునిండా తిండిదొరికినప్పుడు దానిని వదలివేయటం నా చిన్నతనంలో హరిజనులలో జరుగుతూవుండేది. అట్టి మతమార్పు డిప్పు డసలే లేదుకదా, స్వాతంత్ర్యానికి ముందే మాసిపోయింది.

## యౌవనం

నాకు నాల్గవఫారం 1915 మార్చికి పూర్తిఅయినప్పటికే యుక్తవయస్సు వచ్చినది. అప్పటికి నా కింకా 17 సంవత్సరాలు నిండకపోయినను (నా జననం ది 25-6-1898) మధ్యరకం ఎత్తుతో (అ. 5-7½ అం.) మిక్కిలి లావుగా, పెద్ద మీసాలతో వయస్సుముదిరిన వానివలె ఉండేవాడను. నా భార్య అప్పటికి పుష్పవతి అయి అయి దారు మాసాలైనా అయివుంటుంది. ఆమె భారీమనిషి. (ఎత్తు నా ఎత్తంత) లావుగా అవయవ పరిపూర్ణతతో వుండినది. అందువల్ల పెద్దలు, మమ్ములను ప్రేమికులను చేయ

దలచారు. లగ్నం నిశ్చయింపబడినది. (ది 3-6-1915) అప్పటి ఆచారం ప్రకారం పల్లకీలో బైలుదేరాను. నాకు వత్తాసుగా వచ్చే పెద్దలు బండ్లమీద ముందుగానే బైలుదేరారు. భార్యను కలవబోయే యువకుడు అమాయకుడని, రతి రహస్యాలెరుగడని, అసలు సంధాన మెట్టిదో, ఏ విధముగా నాచరించవలెనో తెలియదని, అందువల్ల ఏ పెద్దయో ఈ సృష్టిరహస్యాలను అతనికి చాటుగా బోధించి, ధైర్యముచెప్పి ప్రోత్సాహపరచి, మేమున్నాం కదా, నీకు ఫరవాలేదనే వత్తాసుకోసం పెద్ద లిద్దరు ముగ్గురో, అంతకంటె ఒక రిద్దరు హెచ్చో తోడువెళ్లే ఆచారం.

పూర్వ మెప్పుడో మా ముత్తాతల కాలంనాడో, ఇంకా అంతకుముందో, మా గ్రామాల్లో కొంత వయస్సు ముదిరిన విద్యావిహీనులు, పూర్తిగా సేద్యంలోను, కాయకష్టంలోను నిమగ్నులై ప్రపంచజ్ఞానంలేని వ్యక్తులు, ఇట్టి మద్దతును, రహస్యబోధను ఊతగా చేసికోవలసిన అవసరముండేదేమో. మరిన్ని పూర్వకాలంలో గురుకులంలో గురుసేవ, విద్యాభ్యాసం చేస్తూ ఇతరత్రా ప్రపంచంతో సంబంధంపెట్టుకోని యువకులకు అట్టి బోధ, ప్రోత్సాహం కావలసివచ్చేదేమో! ప్రపంచజ్ఞానం, శరీర సంస్కారంలేని యువకు లుండబట్టే కాబోలు పెండ్లి జరగబోయే ముందు కాళ్లకు చేతులకు గోళ్లు తీసి, తలంటి, తోమి, స్నానం చేయించి, కొత్తబట్టలు కట్టించే ఆచారం ప్రారంభమై ఈ రోజు వరకు జరుగుచున్నది. పూర్వ మెట్లున్నా ఈకాలపు పడుచు వాళ్లకు తెలియని సృష్టిరహస్యాలేమియు నుండవు. పైగా కొంతమంది పూర్వానుభవంకలవారుగా కూడా ఉండవచ్చును. పూర్వపు కుగ్రామా లిప్పుడు చాలా మారిపోయాయి. కాయకష్టంలో మునిగిపోయి ప్రపంచజ్ఞానం లేనివా రీ రోజుల్లోలేరు.

అరువదిసంవత్సరాలనాడు కూడా మా యూరు కుగ్రామం కాదు. మా కుటుంబికులు రైతులైనా, పెద్దరకం రైతులు. సంగతి సందర్భాలు తెలిసినవారు. మరిన్ని నేను ఇంగ్లీషు చదువు కొంటూ బందరుపట్టణం నాగరికత వాతావరణంలో ఉండేవాడిని కదా- నాకు సలహా, మద్దతు లేమిటి? అదొక ఆచారం.

అది అప్పటికే అర్థరహితమైన దనటానికి నాకు రహస్యాన్ని బోధించ ప్రయత్నించినవారు నా కంటె ఏ మూడేళ్లో పెద్దయిన మా పెదతండ్రి కుమారు డొకడు. నన్నా రాత్రి ప్రక్కగా తీసికొని వెళ్లి ఏదో సలహా ఇస్తున్నట్లుగా గొణిగాడు గాని, నా కది సరిగా వినపడ లేదు. ఊకొట్టి మాత్రం ఊరుకొన్నాను. అక్కడితో ఆ సదాచారం నెరవేర్చబడ్డది. సరే, నామద్దతుదారులు సుల భంగానే, సుఖంగానే నా భార్య పుట్టినింటికి ఆ సాయంత్రానికి చేరుకొనియుండిరి. ఇక మిగిలినవాడిని, కథానాయకుణ్ణి—నేను. గర్భాదానపుపెండ్లికొడుక్కు కొంత ముస్తాబు వగైరా చేయాలి కదా! ఆ తతంగం పూర్తిఅయ్యేటప్పటికి కొంత కాలహరణం అయింది. చాకలిబోయీలు వచ్చారు. పల్లకీ ఎత్తారు. నడక సాగించారు. మా వూరు బొమ్ములూరునుంచి అడ్డదారిని చిన ఎరుకపాడు మీదుగా పామర్రుకువెళ్లే గుడివాడ—పామర్రు రోడ్డు ఎక్కారు. దౌడుసాగించారు. పామర్రు చేరారు. పామర్రునుండి మట్టిరోడ్డుమీదుగా చెక్కావారిచెర్వువరకు, అక్కడనుండి అడ్డ దారిని చేలమధ్యగా మురుగుకాల్వ అవతలి సులాబికి చేరాలి. చెక్కావారిచెరువుకు చేరేటప్పటికి బాగా చీకటిపండిది. పైగా బోయీలు పామర్రు చేరేముందు రెండుసార్లైనా దండిగా కల్లు త్రాగారు. కైపుమీద ఉన్నారు. ఇక చూడండి తమాషా! అడ్డ దారిని బైలుదేరినవాళ్లు త్రోవతప్పి దిడ్డదారిని పడ్డారు. అటు ఉరుకులు, ఇటు ఉరుకులు. అక్కడ తుప్పలు, ముళ్లు; ఇక్కడ తుప్పలు, ముళ్లు. వాళ్లు తికమకపడుచుండగా నాకు బేజారయింది. గర్భాదానంమాట దేవు డెరుగునుగాని, నే నసలు ఆ వూరు క్షేమముగా చేరుకొంటానా అనే సందేహం, భయం క్రమేణ ఎక్కువైంది. ఎట్లాగో ఊరు చేరుకొన్నాం. అక్కడివాళ్లు, ఇంకారాలేదు ప్రొద్దు పోయింది. లగ్నం తప్పిపోతుందేమో అని భయపడసాగారు. ఆ రోజుల్లో భర్త, భార్యతో ప్రథమంగా సంగమించటానికి వార, తిథి, నక్షత్రాలనుబట్టి శుభలగ్నం నిర్ణయించేవారు. ఉద్దేశం సరిగా ఆ ముహూర్తానికి గర్భాదానం జరిగితే మంచి బిడ్డపుట్టుతా డని. సరిగ్గా ఆ క్షణానికి పురుష శుక్లం, స్త్రీ శోణితం జతపడుతుం దని ఎవరు చెప్పగలరు? మధ్య

ఎన్ని అడ్డంకులు వస్తవో, పిల్ల ఏ నదురు బెదురుకు లోనౌతుందో, పిల్లడే బిడియం బెరుకు పడతాడో! రెండుగంటలైనా జరిగే పురోహితుని తంతువలన విసిగి వేసారి అలసిపోతాడో, ఎవరు చెప్పగలరు? అర్ధరాత్రి ఆ సమయంలో భార్యాభర్తలు కలియని సందర్భా లుండవచ్చును. అయితేనేమి పూర్వాచారం జరుగ వలసిందే. యువకుని, యువతిని పీటలమీదకూర్చోబెట్టి పురోహితులు, సంభావనపుచ్చుకొనే బ్రాహ్మణులు, పెళ్ళికూతురు తరఫువారు, పెండ్లికొడుక్కు మద్దతుగా వచ్చినవారు—అందరు చేరి ఒక చిన్న వివాహకర్మ జరుపునట్లు పూజాపునస్కారాలు మొదలు పెడతారు. మంత్రాలు, శ్లోకాలు జోరుగా సాగుతవి. కట్టుకొని వుండిన బట్టలనుమార్చి క్రొత్తబట్టలుధరింపజేస్తారు. ఫలప్రదానం వగైరా సంభావనలు జరుగుతవి. ఆశీస్సులతో, చావుదప్పి కన్ను లొట్టపోయిందన్నట్లు భార్యాభర్తలు పీటలమీదనుండి లేచి భార్య గృహాంతరానికి పోగా, భర్త తనవారిని చేరుతాడు. అప్పుడు అందులో పెద్ద పై చెప్పినవిధంగా సలహా యిస్తాడు. అమ్మలక్కలు పిల్ల కేవేవో బోధిస్తారట. భర్త ఆ రాత్రి ఏమి చేసినా అభ్యంతరం చెప్పవద్దని చివర సలహా. అక్కడితో యువతీ యువకుల ఇబ్బందులు తొలగవు. భర్త గదిలో ఉరకలు వేస్తూ గుండె దడదడ కొట్టుకొనుచుండగా ఆతురతతో పందిరి మంచమో, పట్టెమంచమో చివరకు నులకమంచమో ఏదో ఒక మంచం శక్తికి తగినట్లు అలంకరింపబడ్డదానిమీద కూర్చుని ఎదురుచూస్తూ ఉంటాడు. గడియకో, అరగడియకో పిల్లను బలవంతాన ఒక రిద్దరుస్త్రీలు గదిలోకిత్రోసి బైట గొళ్లెం పెడతారు. యువకునితో లోపలి గడియ వేసికోమని హెచ్చరించి మరి తప్పుకొంటారు. అంతటితో వాళ్ళిద్దరిని విడిచిపెట్టితే బాగుండును. కాదు ముసల, ముతక, లేత, పడుచు, అమ్మలక్కలు చేరి సంగమక్రియను సొంత కళ్లతో చూచి ఆనందించాలని, చూరులవెంట, అటకప్రక్క, బైటనే అనుకోండి, నక్కి, నిచ్చెన వేసి, పై చూరు కిటికీకి క్రిక్కిరిసి ఒకరిమీద నొకరు ఎగబడి చూస్తారు. ఎంత నిశ్శబ్దంగాఉండాలని ప్రయత్నించినా మెలకువగల యువకునకు, రహస్యం తెలిసిన యువతికి బిడియం

గాను, అలజడిగా నుండదా? అప్పుడప్పుడు నిచ్చెన జారో, చూరు పట్టు దప్పో, ఒకరినొకరు త్రోసికోవటంవల్లనో, క్రిందబడటం, నోరు నొక్కుకొని పారిపోవటం జరుగుతుంది. తమ ఉద్రేకాందోళనలో నున్న యువతీ యువకులు ఈ సవ్వడిని కొంతవరకు పట్టించుకోకుండా తమ రతిక్రియను నిర్వర్తించుకొనవచ్చును లేక సిగ్గుపడి నీరసంచేసుకోవచ్చును. సరిగ్గా ఆక్రియ జరుగుతూఉండగా బైట పొంచివుండిన స్త్రీలు మెల్లగా జారుకొన్న సందర్భాలుకూడా ఉన్నవని విన్నాను. ఇంత ఆతురత, కామక్రియను తాము కన్నులతోచూడాలనే ఆకాంక్ష, వయస్సు మళ్లిన స్త్రీలకుకూడా ఉండే దంటే సృష్టిక్రియ ఒక్క సంతానానికేగాక, సంభోగానికి కూడా ఏవిధంగా పునాదియో అర్థ మవుతుంది. మరునాడు ఉదయం ఆ యువతిని అమ్మలక్కలు పట్టి పట్టి చూస్తారు. ప్రియుడు ఎక్కడ గంటులు వేశాడో ఎక్కడ గట్టిగా వత్తినాడో, ఏమేమి కొంటెపనులు చేసాడో, కన్యాత్వం విరగడ అయిందో లేదో బహు దిలాసాగా ఆకాంక్షతో గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతారు. ఈ బాధ యువకునికి ఉండదు. రతిసంరంభంలో అలసి సొలసి పోయాడని తలంటుస్నానంచేయించి నిద్రపొమ్మని సలహాయిస్తారు. నావిషయంలో ఇంకొక ఇబ్బంది కల్గింది. నా భార్య ఏకైక సోదరుడు ఏదో పెండ్లికి రెండెడ్లబండిని పరుగులెత్తించుచు, బండి బోల్తాపడగా చెయ్యివిరిగి మంచంలో తీసుకొంటున్నాడు. అందువల్ల గర్భాదానం నాభార్య మేనమామగారింట్లో జరిగింది. ఆ యిల్లు ప్రాతకాలపు చిన్న యిల్లు. మాకిచ్చిన గది సరియైన వెల్తురు, గాలి రానిది. పందిరమంచానికి బదులు పట్టెమంచం, పైగా బైట అమ్మలక్కల అలజడులు. అంత తృప్తిగా ఆ రాత్రి గడువలేదు. ఈ పై విషయాలు 1915 సంవత్సరములో నా అనుభవములోనేగాక, తర్వాత చాలా సంవత్సరాల వరకు జరుగుచుండినవి. ప్రస్తుతం, కొన్ని సంవత్సరాల నుండి ఈ అవివేక పద్ధతి పుర్తిగా విడిచిపెట్టబడింది. ఈ రోజుల్లో లగ్నాలులేవు. పదిమందితో మేము భార్యాభర్తలం ఫలానా రోజున ఫలానా టైముకు ఫలానాచోట ప్రథమ సంగమంచేస్తా మని చాటింపులేదు. పూజా పునస్కారాలు, దక్షిణలు, ఫలప్రదానాలు, సంభావన

వగైరాలు లేవు. విందులు వగైరా ఖర్చులులేవు. పూర్వంవలె భార్యాభర్తలు, తొలిసారి ఆ రాత్రియే ఒకరి నొకరు చూచు కోవటం, పలకరించుకోవటం, ఒకరి నొకరు కౌగలించుకోవటం లేదు. ఇప్పటి యువక భార్యాభర్తలు గర్భాదానానికి పూర్వమే బాగా పరిచయంచేసుకొని వుంటారు. ఏ కొద్ది మందైనా అదివరకే సంగమించియుంటారు. లాంఛనంగా పిల్లతండ్రి ఫలానా రోజు (సంగమకాల నిర్ణయముండదు) మంచిది, అబ్బాయిని తీసికొని వెళ్తాం, లేక అబ్బాయిని పంపించండి అని అంటారు. యువకుడు పండుగకు వెళ్లినట్లుగా వెళ్తాడు. భార్యను దగ్గరకుతీసుకుంటాడు. అంతా గప్ చిప్. మామూలు నడవడిగా జరిగిపోతుంది. ఇంట్లో వారికి తప్ప ఈ సంగతి ఊళ్లో లేని దగ్గరబంధువులకుకూడా తెలియక పోవచ్చును. నిజానికి కొంతమంది నూత్నదంపతులు ఎవరిజోక్యం లేకుండానే బుద్ధిపుట్టగానే కలియవచ్చును. ఈరోజుల్లో వయస్సు వచ్చిన యువతీ యువకులకు వివాహం జరుగుచున్నది కాబట్టి వివాహమైనవెంటనే కామకలాప మారంభిస్తున్నారు. ఎట్టి నిషేధం, ఆజ్ఞ, అనుమతి లేకుండా.

మా గర్భాదానంజరిగిన కొలదికాలానికే 1915 సెప్టెంబరులో మా బావమరది పున్నయ్య తన 22-వ ఏట చనిపోయాడు. చేయి విరిగి సరియైన వైద్యములేక, జాస్తిగా మంచంమీదపడుకొని తిన్న ఆహారం జీర్ణించక, గుండె నంజు లోకిదిగి అకాలమృత్యువుపాలైనాడు. ఆ రోజుల్లో ఎక్స్‌రే లేదు. పల్లెటూళ్లలో మోటువైద్యం. నొప్పి ఒకచోట నయితే వాత ఇంకొకచోటు పెట్టేవారు. కాకపోతే చెయ్యివిరిగినంత మాత్రాన గుండెనంజువచ్చి చనిపోయేవా రున్నారా ఈ కాలంలో? ఆయన అత్తగారిఊరు దేవరకోట. మంచి సంపన్నకుటుంబంలోనిదే ఆయన భార్య. ఆ ఊరివారు ఈ రోజుల్లో తెలివితేటలు గలవారు, దక్షులు, వ్యాపారమనస్తత్వం కలవారేగాని, ఆ రోజుల్లో ఆ ప్రాంతంవారు మా గుడివాడ సీమ వారికంటె జుట్టు, బొట్టు, వస్త్రధారణ, ఆభరణాలు ధరించుటలో మోటుగా ఉండేవారు. వయస్సుమళ్లినస్త్రీలుకూడా రాగిణీ, చంద్రవంకలు, పాపటశేర్లు వగైరా తలమీద, ముక్కుబులాకీ

వగైరా ధరించేవారు. లావుగా, భారీగా పొట్ట. కండలు మెలితిరిగి, వెడల్పాటి మొగాలతో ఉన్న పురుషులు ఎక్కువగా ఉండేవారు. అటువంటివారిని దేవరకోటబ్రీడ్ అనవచ్చునేమో! జమీందారి గ్రామాల్లో ప్రాత పద్ధతులు, ఆచారాలు జాస్తిగా ఉండడం మామూలు. పెడసనగల్లువలెనే దేవరకోట చల్లపల్లి జమీలోనిది.

ఆ రోజుల్లో ప్రస్తుత జమీందారుగారి తాతగారు శ్రీమంతు రాజా యార్లగడ్డ మల్లికార్జునప్రసాద్ బహద్దర్ గారు దేవరకోటసీమకు జమీందారుగా నుండేవారు. వారు వేష భాషల్లో పూర్వాచారపరాయణులు. వారికి జుల్పాలతోగూడిన జుట్టు, క్షౌరంచేయించుకొన్న తల ముందుభాగం, చెవికి జూకా ఉండేవట. చొక్కా వేసికొనటం అరుదుగా నుండేదట. ఇక వారి రైతులు వారిని అనుసరించుట సహజమే కదా!

ఈ సందర్భంలో ఇంకొక సంఘటన జ్ఞాపకమునకు వస్తున్నది. మా బావమరిదికి జబ్బు హెచ్చింది. వెళ్ళి జంగం సుబ్బన్న అనే పేరుపొందిన నాటువైద్యుని అర్జంటుగా తీసికొని రమ్మని నన్ను అంగలూరుకు పంపారు. నేను ఉదయం బైలుదేరి అంగలూరువెళ్ళి సుబ్బన్నగారిని కలసికొన్నాను. నేను వెళ్ళిన సమయానికి ఆయన ఇంటివద్దలేరు. అందువలన ఆయనను కలసికొనేటప్పటికి మధ్యాహ్నం దాటింది. వారు నేను చెప్పింది విని, నెమ్మదిగా ఆలోచించి కొంతసేపటికి నాకు రావటానికిప్పుడు వీలులేదు, మందు ఇస్తాను దానిని తీసికొని వెళ్ళవలసిన దని చెప్పి బైటకువెళ్లారు. తర్వాత కొంచెంసేపటికి పెడసనగల్లునుండి నాకొరకు మనిషివచ్చాడు. పున్నయ్యగారు చనిపోయారు, వైద్యుడు అవసరంలేదు మీరు వెంటనే రావలసిందని కబురు. తీరా అక్కడికి చేరుకొనేటప్పటికి ఆయన దహనసంస్కారం కూడా జరిగిపోయింది. ఆ రోజుల్లో బస్సులు లేవు. కాలి నడక, ఎడ్లబండి. అప్పుడు ఆ ప్రాంతంలో గుర్రపుబండ్లుకూడా ఉండేవి కావు. పెడసనగల్లుకు అంగలూరుకు 14 మైళ్లు. ఇప్పుడున్నట్లు కూచికాయలపూడినుండి అడ్డదారికూడా ఉండేదికాదు. మా

ఊరు బొమ్ములూరుమీదుగా తిరిగి వెళ్ళవలసివచ్చేది. అంగలూరుకు మా ఊరు రెండుమైళ్లు. అక్కడినుండి పెడసనగల్లు పంద్రెండుమైళ్ళు.

జంగం సుబ్బన్నగారి వైద్యం మిక్కిలి చిత్రంగా ఉండేది. ఆయనగారు జబ్బుస్వభావం నిర్ణయించటంలో మిక్కిలి నిపుణులు. నిర్ణయించటంలో ఎక్కువకాలంకూడా తీసుకొనేవారుకాదు. నిర్ణయించినతరువాత ఇచ్చే మందుల ప్రభావంకన్న, నడిపించే అనుపానం మిక్కిలి విశేషం. మామూలు నాటువైద్యులు వాడే మాత్రలు, గుళికలు గాక కషాయాలు, ఏవో సామాన్యవస్తువులతో తయారుచేసిన ద్రవాలు, చూర్ణాలు వాడేవారు. మొత్తంమీద వారి వైద్యం మిక్కిలి చౌకగా ఉండేది. ఏ రంగు నీళ్లైనా, ఏ బూడిదపొడి అయినా ఔషధంక్రింద సరిపోయేది. వారియందు నమ్మకం, వారి అనుపానాల మహాత్మ్యం బాగా పని చేసేవి. రోగి బ్రతుకుతాడో లేదో, ఎంతకాలం బ్రతుకుతాడో వారికి చూచాయిగా రోగిని చూడగానే తెలిసేదనే వాడుకుండేది. వారికి స్వరజ్ఞానం అనగా ఉచ్ఛ్వాస నిశ్వాసాల పోకడలనుబట్టి నిర్ణయించే శక్తివల్ల రోగి చావు బ్రతుకులు తెలుసుకొనే వారని వాడుక (ఏదో మూలిక ప్రభావమని కొందరనేవారు). మా బావమరదివిషయంలో ఈ ప్రజ్ఞవల్ల బ్రతుకడని తెలిసికొన్నారని, అందువల్ల బైలుదేరుట కనిష్టం చూపించారని తరువాత అనుకున్నాం. వారిని తీసుకొనిరావలసిన అవసరంలేదు, రోగి చనిపోయాడని కబురు వారు రానన్న కొద్దినిముషాలకేకదా నాకందింది. నిజంగా సుబ్బన్నగారు మేధావి. రోగనిర్ణయంలో సునిశితప్రజ్ఞకలవారు. సామాన్యవస్తువులద్వారా, సముచితమైన అనుపానంతో రోగిని సేవించేవారు. వారేకనుక ఇంగ్లీషు వైద్యశాస్త్రం చదువుకొనిఉంటే మహావైద్యుల లెక్కలోకి వచ్చేవారు. మా గుడివాడసీమలో వారి పేరు ప్రఖ్యాతులు, వారిలో నమ్మకం చాల హెచ్చుగా ఉండేవి.

ఏకైకకుమారుని మరణం మా మామగారిని పూర్తిగా క్రుంగదీసింది. మా అత్తగారు ఎంత పెద్దగా రోదించినా మనస్సు

చిక్కబెట్టుకొని సంసారం నడుపుతు వచ్చింది. మా మామ గా రట్లుగాక మంచానపడి క్రుళ్ళి క్రుళ్ళి దుఃఖించేవారు. ఈ విధంగా కొంత కాలం గడిచేటప్పటికి వారికి మధుమేహం పెరిగింది. కాలిబొటనవ్రేలికి పుల్లగుచ్చుకొని పుండయి, చీముపట్టి రణంగా మారింది. దానిని నయంచేసికోటానికి కర్నూలుజిల్లా గిద్దలూరుకు దగ్గరనున్న ఒక వూళ్ళో హరిజను డొకడు వైద్యం చేస్తా డని తెలిసి, మా నాయనగారి సాయంతీసికొని బైలుదేరి వెళ్లారు. దారిపొడుగూతా దుఃఖించటం, మధ్య మధ్య ఆగి ఏ చెట్టుక్రిందో కూర్చొని ఇక ముందుకు వెళ్లనని మారంచేస్తూ మొగాన గుడ్డపెట్టుకొని బావురుమనటం జరిగిందట. అక్కడ ఆ వైద్యుడు ఏ ఆకో అలమో కాలుకు కట్టి, ఏవో కొన్ని మాత్ర లిచ్చి పంపాడు. ఇంటికి తిరిగివచ్చిన తర్వాత ఆ మందు సరిగా వాడక మనోవిచారంతో తీసుకొని, కొడుకు చనిపోయిన ఐదుమాసాలకే 1916 ఫిబ్రవరి ఆరంభంలో జీవితయాత్ర చాలించారు. గిద్దలూరు వెళ్లకపూర్వం తన ఆస్తి నేవిధంగా తన మిగిలిన ఇద్దరు కుమార్తెలకు చెందచేయాలని ఆలోచించి నా షడ్డకుని తండ్రి, నా పెదతండ్రి కుమారుడు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారికి కబురంపగా వారు వచ్చారు. మా నాయనకు కబురంపగా " మీ కిష్టం వచ్చినట్లు చేసుకోండి, మధ్య నే నెందు" కన్నారట. కొడుకుచచ్చి ఏడుస్తుండగా ఆస్తికి ఆశ పడటం అధర్మమని మా నాన్నగారు తలంచారని నా నమ్మకం. మా నాన్న రాకపోవటంవల్ల ఒక్క బుల్లి సుబ్బయ్యగారి సలహాయే మా మామగారు తీసుకోవలసివచ్చింది. బుల్లి సుబ్బయ్యగారు ఇప్పటినుండే పిల్లలకు ఒప్పజెప్పితే తల్లిని సరిగాచూడరు వగైరా సంగతులు చెప్పి భార్యపేరను మరణ శాసనం వ్రాయండని సలహా యిచ్చారు. అప్పుడు వా రందరు బైట వరండా అరుగుమీద కూర్చొని నిర్ణయంచేస్తుండగా నేను లోపల పడకగదిలో వున్నాను. మా మామగారు లోపలికి నావద్దకువచ్చి " నీ అన్నగారు మీ అత్తపేర వ్రాయమంటు న్నాడు. కూతుళ్లపేర వ్రాయాలని నే ననుకొన్నాను. నీ వే

మంటావు'' అని నన్ను అడిగారు. నేను పిన్నవాడను. అనుభవం తక్కువ. పైగా మా అన్న వెంకట సుబ్బయ్యగారంటే, పూజ్యభావమేగాక భయంకూడా ఉండేది. నిజానికి బహుళమైన మాకుటుంబంలో వెంకట సుబ్బయ్యగారే ఎక్కువ తెలివితేటలు గలవారు, ఉపాయశాలి, ఎదుటవారి నింతలో లోబరుచుకొనే మాటనైపుణ్యం కలవారు. వారు లావు, పొడుగుతో మంచి శరీరపుష్టి, అందం, వర్చస్సు, వ్యక్తిత్వం కలవారు. ఆకర్షణీయమైన విగ్రహం. వ్యక్తిత్వంతోబాటు చాకచక్యం, లాలన, చిరునవ్వులు, పెద్దనవ్వులు నవ్వటం, అవసరమైనప్పుడు ఎదుటవారిని ఉబ్బివేయటం వారి గట్టి గుణాలు. తన కార్యాన్ని నెరవేర్చుకొనటంలో ఆరితేరినవారు. ఏ ఘరానావ్యక్తిఅయినా, ఏ ఉద్యోగస్థుడైనా వారి మాటలకు ముగ్ధులయ్యేటట్లు సంభాషించే నిపుణులు. అట్టివారి అభిప్రాయాన్ని నే నెదిరించే శక్తి నాకప్పుడు లేదు. వారు వ్యక్తిత్వంగలవారేగాక నాకు సాక్షాత్తు పెదతండ్రి కుమారుడు, వయస్సులో నా కంటె చాలా పెద్ద. ఆయన కుమారుడు నా షడ్డకుడు, సత్యనారాయణ నా కంటె మూడు మూడున్న రేండ్లు పెద్దవాడు. పైగా తల్లిపేరవ్రాయటం మంచిదో, కూతుళ్లపేర వ్రాయటం మంచిదో నాకు ఇదమిద్ధంగా తెలియదు. అందువలన మా మామగారితో "మీ యిష్టం, మా అన్నగారి యిష్టం'' అని చెప్పాను. బుల్లి సుబ్బయ్యగారి ప్రస్తావన ముగించేముందు వారి కార్యసాధన నైపుణ్యంకు వారు చెప్పినదే ఒక ఉదాహరణ ఇస్తాను. చాలా సంవత్సరాలనాడు గుడివాడలో నుండిన సబ్ మేజిస్ట్రేటుగారిచేత ఒక కేసులో ముద్దాయిమీద మోపిన కేసును కొట్టివేయించ దలచారు. లంచమిస్తా మన్న బాతిని పార లేదు. అందువల్ల అర్ధరాత్రివేళ మేజిస్ట్రేటుగారుండి చుండిన మండవా పెంకుటిల్లు మండవా త్రోవగుండా ఇంట్లో ప్రవేశించి వారి భార్యచేతిలో కొన్ని నవరసులు పోసి కేసు కొట్టించేశారట !

1915 డిశెంబరులో ఆస్తినంతా మా అత్తగారిపేరుతో మరణశాసనం వ్రాశారు. కూతుళ్లకు ఆస్తిని విడదీసి, ఎవరికి వారికి దఖలు వ్రాసివుంటే తరువాత 1940 తర్వాత మా బావ

భార్య జ్ఞానప్రసూనాంబ ఎవరినో దత్తత చేసికొన్నట్లుచూపి, తాను, తన దత్తతకుమారుడు కలిసి మా మామగారి ఆస్తి తమకు చెందాలని దావావేయుటకు అవకాశముండేది కా దనుకుంటాను.

పైన చెప్పాను కదా. నాకు 1915 జూను 3-వ తారీఖున కార్యం అయిందని. 1915 జూను ఆఖరకు హైస్కూలు తెరవగానే బందరు నోబుల్ హైస్కూలులో ఫిఫ్తుఫారంలో చేరాను. పినతల్లి పెనిమిటి రాఘవచంద్రయ్యచౌదరిగారు ఇంటర్ మీడియట్ చదువుచు గుంటూరు వెళ్లి ఎ. ఇ. యల్. యమ్. కాలేజిలో చేరారు. అందువల్ల నేను బచ్చుపేటలో నొక సందులోనున్న ఒక ఇంటిలో గదిని అద్దెకుతీసికొని చదువు సాగించాను. బచ్చుపేటకు సరిహద్దు, ఈడేపల్లిరోడ్డు కవతల దాని నానుకొనియున్న ఇంట్లో భోజనం ఏర్పాటుచేసికొన్నాను. ఆ రోజుల్లో మూడుపూటలూ భోజనంచేసేవాళ్లం. ఉదయం భోజనంచేసి స్కూల్ కు వెళ్లేవాళ్లం. ఒంటి గంటకు బడి విడుపు. రెండు గంటలకు తిరిగి స్కూలు. ఈ మధ్య గంటలో నడచి హోటల్ కువచ్చి ఆదరా బాదరాగా భోజనంచేసి వెంటనే బడికి బైలుదేరేవాళ్లం. నోబుల్ కాలేజి దూరంగా రైలుస్టేషను ప్రక్కనున్నది. తొందరగా నడిస్తేగాని భోజనవసతికి చేరలేం. రాను పోను కొంత ప్రయాసే. పిన్నవయస్కుడను కాబట్టి లావుగా, బొజ్జతోఉన్నా సకాలంలోనే క్లాసుకు చేరుకొనేవాడిని. నాకు ఎండ చిన్నప్పటినుండీ శత్రువే. వాననుండి రక్షణకూడా అవసర మయ్యే. అందువల్ల గొడుగు చేతఉండేది. ఇంచుమించుగా పాదరక్షలు ఉండేవికావు. బందరు ఇసుకపుట్ట. ఎండలో చ్రరున కాళ్లు కాలటం సర్వసామాన్యం. అయితే అలవాటువల్ల తట్టుకో కలిగేవాళ్లం.

నాకు చిన్నప్పటినుండి శృంగార సంబంధమైన ఊహాగానా లెక్కువ. అందమైన ఏ వస్తువును, ఏ ప్రాణిని చూచినా ముగ్ధుడనై పోతాను. అందమైన జంతువో, పక్షో, వస్తువో, నన్నాకర్షిస్తవి. ముఖ్యంగా మనుష్యులు. అందులో స్త్రీలు నన్ను సమ్మోహితుణ్ణి చేస్తారు. నేను 1915—16లో ఫిఫ్తుఫారం చదువుచున్నప్పుడు

ఆ నెలలోనే నాభార్య సాంగత్యం లభించిందని పైనచెప్పాను కదా. యౌవనం విజృంభించి యువతులను ఎక్కువ ఆసక్తితో చూడ నారంభించాను. నే నుండే ఇంటిసమీపాన వయస్సులో నున్న అందమైనపిల్లలు కన్పించేవారు. వారిలో నొక పిల్లను ఆసక్తితోచూస్తూ ఊహాజగత్తులో విహరించేవాణ్ణి. మంచి, మర్యాదగల కుటుంబంలోపుట్టి గౌరవంగా వర్తించే స్వభావుణ్ణి గాన నాకు సహజంగా స్త్రీలయెడల కొంచెం జంకు, బిడియం. పైగా ఇతరు లెవరైన చూచి ఏమనుకొంటారో అన్న సంకోచం వల్ల ఇప్పటికిని ఎంత ఆకర్షిస్తున్నా స్త్రీని తేరిపారచూడలేను. ఒకసారిమాత్రమే మామూలుగా చూచినట్లు చూడగలను. ఆ చిన్నతనంలో ఇతరు లేమనుకొంటారో అనే జంకు ఇంకా ఎక్కువ ఉండేది. అందువల్ల అవయవపొంకం బింకంతో, ఎర్రని దేహచ్ఛాయతో, బొద్దుగా, అందంగా ఉండే ఆ పిల్ల నన్నెంత ఆకర్షించినను, ఆమెను గురించి నే నెంత ఊహించుకొన్నను గ్రుచ్చి చూచేవాడనుకాదు. ఒక్కసారైన పల్కరించ సాహసించేవాడనుకాదు. దారినిపోతూ ఎదురైతే తప్పుకొని, తలవంచుకొని పోయేవాడను. అసలా పిల్లకు నేను తన యందాసక్తి పరుడనై ఉన్నానని తోచియుండదు. భీరుడనై, లజ్జావివశుడనై, ఆ పిల్లేమనుకొంటుందో, పిల్ల ఇంటివాళ్ళు ఏమనుకొంటారో అన్న భయం సందేహాలు కలవాణ్ణి కాబట్టి, ఆ యువతి విషయంలోను, ఇతర యువతుల విషయంలోను, ముఖాముఖిని సౌందర్యోపాసన చేయలేదు.

కాని నా సౌందర్యోపాసన కొక యువకుడు లభించాడు. అతడు చక్కని ముఖ వర్చస్సు, అందమైన కళ్ళు, స్త్రీలకుండు సోయగం, ప్రఫుల్లమైన చిరునవ్వు కలవాడై ఉండేవాడు. ఇంచు మించు నా వయస్సు. హిందూహైస్కూలులో నావలె ఫిఫ్తుఫారం చదువుచుండేవాడు. కానూరి హేమంబరదాసు అనే కమ్మ యువకుని స్నేహితుడు. హేమంబరదాసుద్వారా నాకు పరిచయ మయ్యాడు. హేమంబరదాసుది నా స్వగ్రామం బొమ్మలూరుకు ఆరుమైళ్ల దూరములోనున్న కౌతరం. అప్పు డతనుకూడా ఫిఫ్తుఫారం చదువుచుండేవాడు. అతడు మంచి మాటకారి.

అధికమైన ఊహా సంపత్తికలవాడు. అప్పటికప్పుడు కథలూహించి చిలవలు, పలవలుగా మిక్కిలి రక్తికట్టేటట్లు చెప్పేవాడు. ధారళంగా ఉపన్యసించ శక్తిగలవాడు. తన మాటలతో, కథలతో, ఊహా బలంతో ఊర్ధ్వలోకాలకు తీసుకొని పోయేవాడు. తర్వాతకాలంలో అతని స్వభావానికి తగినట్లు హార్మోనిస్టుగా, నాటకాలలో బహు విధ వేషధారిగా పరిణత పొందాడు. అప్పటిలో నాకు స్నేహితుడై తరుచు నాగదికి వచ్చి కాలక్షేపం చేసేవాడు. ఒకనా డతనితో అతని స్నేహితుడు పాణ్యం కృష్ణమూర్తి అనే ములకనాటి బ్రాహ్మణ యువకుడు వచ్చాడు. అతని తండ్రి వెంకట సుబ్బయ్యగారు గవర్నమెంటు రెవిన్యూ డిపార్టుమెంటులో జేరియుండి అప్పుడు బందరులో సబ్ మేజిస్ట్రేటుగా నుండేవారు. అందువల్ల అతడు హేమంబరదాసువలెనే బందరు హిందూ హైస్కూలులో చదువుచుండేవాడు. కృష్ణమూర్తిని చూడటంతోనే అతనియందు నాకొక భావోద్రేకం కల్గింది. అతని అందం మిక్కిలి సాత్వికమైనది. అతని ముఖవర్చస్సు, నిర్మల హృదయాన్ని ప్రతిఫలించేదిగా నుండేది. కళ్లు యోగాభ్యాసం చేస్తూ కామ క్రోధాలను జయించినవాని కళ్లవలె స్వచ్ఛమై వుండేవి. జింక కళ్ళవలె మృదువుగా, పెద్దవిగా, అమాయకంగా ఉండేవి. చిరునవ్వు వెన్నెలవలె మెత్తగా హాయిగాఉండేది. మాటలు చేతలు అలౌకికాన్ని, అమాయకత్వాన్ని సూచించేవి. అటువంటి సాత్వికసంపన్నుడు రాజస, తామస స్వభావుడనగు నన్నాకర్షించుటలో ఆశ్చర్యంలేదు. అతని మెత్తనైన, నిర్మలమైన, అందమైన వ్యక్తిత్వాన్ని నేనెంత ఆరాధిస్తున్నను, నా ఊహాజనిత ప్రేమభారంచేత నెంత ముగ్ధుడనైపోయినను, అతడు కించిత్తైన చలించక, తన మామూలు అమాయకత్వంతో, ఆధ్యాత్మికచింతనలో మునిగియున్నవానివలె, మామూలు స్నేహభావంతో మెలగేవాడు. నేనెంతగా అతన్ని శారీరకంగా దగ్గరకు తీసికొని, భాయి భాయి అని, చెట్టాపట్టాలుపట్టాలని ఉవ్విళ్లూరినను, చిరునవ్వు నవ్వుచూ ఏవో కబుర్లుచెపుతూ ఉండేవాడే కాని, నా భావోద్రేకానికి, అతని శరీరాన్ని కౌగలించుకోవాలనే నా గాఢవాంఛకు లోనైనవాడుకాదు. నేను

ఉద్రేకపడినను, ఒక్కసారైన నే నతనిని పరిష్వంగం చేయలేదు. ఆధైర్యం నా కతని సాత్వికసంపదముందు చాలేదికాదు. నాభావన అతనికి తెలియక పోలేదు. ఆ భావాని కతడు చలించ లేదు. కాని క్రమేణ అతడుకూడా నా యెడ గాఢ స్నేహ భావము చూపించ మొదలుపెట్టినాడు. చివరకు (నే నింగ్లండులో నున్నప్పు డుత్తరాలలో) ప్రేమాలింగనాలని వ్రాయటానికి సందేహాపడలేదు. ఈ ప్రేమసూచక విషయాలు లైంగిక సంబంధమైనవికావు, హృదయ సంబంధమైనవి. ప్లైటానిక్ లా వంటివి. అనగా లైంగికంకాని, స్త్రీల సంబంధంలేని ప్రేమ. పురుషులమధ్య ప్రేమ ఉన్నప్పుడు అది లైంగికముకాకపోతే, ప్లైటానిక్ లా అనటంకంటె ఇంకొకమాట సరిపడదు. నా అనురాగంచూచి అతడు మాటలలోనైనా ప్రేమ చూపించక తప్ప లేదు. ఆర్ద్రహృదయుడు. ఇతరుల మనస్సును నొప్పించని మెత్తని స్వభావము కలవాడు. 1916 ఏప్రిల్ పరీక్షలైన తర్వాత సెలవులువచ్చినప్పుడు అతడు స్వగ్రామమగు కర్నూలు జిల్లాలోని నంద్యాలకు వెళ్లిపోయి తర్వాత ఇతర చోట్ల చదివాడు. ఆతని తండ్రి వెంకట సుబ్బయ్యగారికి బందరు నుండి బదిలీ అయినది. అందువలన తరుచు కలసికొనే అవకాశంలేకపోయినా ఉత్తరప్రత్యుత్తరాలద్వారా మా స్నేహాన్ని నిల్పుకొన్నాం. నిజానికి అది పెరిగింది. 1916-17లో నేను స్కూల్ ఫైనలు పరీక్షకు చదువుచు మధ్యలో చదువు మానివేశాను. తిరిగి 1917 - 18 విద్యాసంవత్స రారంభ ములో నేను మద్రాసు క్రిస్టియన్ కాలేజి హైస్కూలులో చేరాలని మద్రాసుకు వెళ్ళాను. ఆ హైస్కూలులో చోటుదొరకనందున మింటు స్ట్రీటులోని హిందూ థియలాజికల్ హైస్కూలులో చేరాను. అప్పుడు కృష్ణమూర్తి మద్రాసులో చదువుచుండినాడు. అతని నప్పుడప్పుడు కలసికొనుచుండేవాడిని. అయితే బందరులోనుండిన ప్రేమోద్రేకం చచ్చిపోయింది. మామూలు ప్రియస్నేహితునివలె అతడు నా మనస్సులో దృక్పథంలో రూపొందాడు. తర్వాత నే నింగ్లండుకు

బైలుదేరి వెళ్ళేముందు, అతడు నేను కలసి మద్రాసులో దాస్ అను పేరుపొందిన ఫొటోగ్రాఫర్ చేత ఫొటో తీయించుకొన్నాము. ఆ ఫొటో నిప్పుడు చూస్తే మిక్కిలి వింతగా ఉంటుంది. నేను లావుగా, బొజ్జతో, పెద్ద మీసాలతో నాటకంలో వేషంవేసిన వానివలె ఏ ముప్ఫైఏళ్ళ మనిషిగానో కన్పడుతాను. అతడు బక్కపలచగా, శోత్రియ బ్రాహ్మణ యువకుడుగా కన్పడుతాడు. తరువాత నే నింగ్లండుకువెళ్లి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదువుసాగించుచున్నప్పుడుకూడ 1922 వరకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవని, అప్పటివరకు నా వద్దనున్న అతని ఉత్తరాలు తెల్పుచున్నవి. తర్వాత సంగతి గుర్తులేదు. నేను చదువుముగించి 1927 లో స్వదేశానికివచ్చివేసినతరువాత కొద్దికాలానికి బారిష్టరుగా న్యాయవాదిత్వాన్ని మద్రాసు హైకోర్టులో అమలుజరుపబోయేముందు అతనిని చూడవలెనని, అతడుకూడా న్యాయవాదిగా వృత్తిసాగించు చున్నందున, వీలుగా ఉంటే, అతని ద్వారా కొన్ని అప్పీల్సు దొరుకునేమో అని అతడు నివసించుచుండిన నంద్యాలకు వెళ్లాను. ముందుగా వ్రాసి ఫలానప్పుడు వస్తానని తెలుపగా, అతడు రైల్వేస్టేషనులో నన్ను కలసికొని అతనింటికి తీసుకొని వెళ్లాడు. అత నింట్లో ఉండటానికి వీలుకలగనందున, ఇంకొకచోట నా బస ఏర్పాటు చేశాడు. భోజనం అతని ఇంట్లోనే. అయితే నాతో కలసి భోజనంచేయలేదు. మర్యాదగా అతని తల్లియో, అత్తో, భార్య కూడా భోజనం వడ్డించినా, భోజనం విషయంలో నన్ను కేటాగే చూచినట్లు కించపడ్డాను. ఎంత స్నేహముండినా, ఆ రోజుల్లో కుల వివక్షత ఉండేది, ముఖ్యంగా ఇంట్లో ఆడంగుల ద్వారా భోజనం ఏర్పాటుచేయునప్పుడు. తర్వాత నేను ఉద్యోగములో ప్రవేశించి, స్థలాలుమారటం జరుగుచుండినందున అతనిని కలిసికొన్నట్లు గుర్తులేదు. నే నుద్యోగంలో ప్రవేశించిన కొలది సంవత్సరాలకు ఆర్థికసాయ మాశించాడు. అతని ఉత్తరం వచ్చినప్పుడు నేను కూడా ఆర్థికఇబ్బందులలో నుండినాను. నాది ఎక్కువ ఖర్చుపెట్టే స్వభావం. మొదటినుండి భోజనం, బట్టలు వగైరా పుష్కలంగా లభించే కుటుంబం. పైగా

ఇంగ్లండులో 6½ సంవత్సరాలు ఎక్కువ ఖర్చుతో గడిపిన జీవితం. ఈ అలవాట్లవల్ల అప్పట్లో వచ్చే జీతం చాలీ చాలని యట్లుండేది. మరిన్నీ, మిత్రుడు యెర్నేని లక్ష్మీనారాయణగారి కివ్వవలసిన బాకీ తీర్చుకోవలసివచ్చింది. నిజానికి 1927 జూను, జూలైల్లో (నే నింగ్లండునుండి 1927 ఫిబ్రవరి 27 వ తారీఖున తిరిగి వచ్చాను) మా కుటుంబంనుండి రూ 300 లు మాత్రమే తీసుకొని, మా స్వగ్రామం బొమ్ములూరుకు 2 మైళ్లలోనున్న గుడివాడ పట్టణంలో, వేరే వంటరిగా నివసిస్తూ కొంతకాలం గడపి తరువాత మద్రాసు చేరుకుని ఒక రిద్దరు మిత్రులసాయంతో కాలక్షేపంచేస్తూ, 1929 ఏప్రిల్ లో ఉద్యోగంలో చేరాను. అప్పటినుండి 1936 వరకు అప్పుతీర్చటంలో కొద్ది జీతంతో కాలం గడపవలసి వచ్చింది. 1936 లో నేను సెకండ్ హాండు మోటారుకారు రు. 2000 లకు మాత్రమే కొన్నప్పుడు గవర్నమెంటువద్దనుండి అప్పు తీసుకొని కొన్నాను. ఈ స్థితిలో ప్రేమపాత్రుడైన మిత్రునకు ఒక్క వేయిరూపాయలైనా సాయముచేయలేకపోయాను. తర్వాత, అతని సంగతులు బాగా తెలుస్తూ ఉండేవికావు. అటుపిమ్మట కొలది సంవత్సరాలకే అతడు అకాలంగా చనిపోయాడని తెలిసి ఎంతో దుఃఖించాను. ఈ మధ్య 1970 లో అతనిని గురించి నా మొదటి గ్రంథం "తాంబూలం-నైవేద్యం"లో విపులంగా వ్రాసి, నా మనస్సుకు కొంత తృప్తిని కల్గించుకొన్నాను. వ్రాయక ముందు అతని బంధువు, అతని చెల్లెలుభర్త రామయ్యగారి బావమరది, శ్రీ యమ్. నరసింహంగారికి వారు కాకినాడలో బరోడా బ్యాంకు ఏజెంటుగా నుండగా వ్రాసి ఆయన కుమారుడు మల్లికార్జున్ అను పేరుగలవాడు తిరువనంతపురంలో నేషనల్ సర్వేలో సెక్షన్ సూపరింటెండెంటుగా నున్నారని తెలిసి, వారికి వ్రాశాను. ఆ ఉత్తరానికి జవాబు రాలేదుగాని తర్వాత ఆయన తమ్ముడు గారీశంకర్ కు తిరుచానూరులో వివాహం జరుగు సందర్భంలో ఆహ్వాన శుభలేఖ పంపాడు. నేను వెళ్ళలేకపోయాను గాని స్వల్ప బహుమతి పంపుచు ఆశీస్సులు పంపాను. నా పుస్తకం బంపాను. తర్వాత కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు

జరిగాయి. గౌరీశంకర్ ఇప్పుడు రాజస్థానంలో ఉద్యోగంలో ఉన్నాడు. మల్లికార్జున్ తిరువనంతపురంలోనే ఉన్నాడు.

1916 మార్చిలో జరిగిన ఇంకొక సంఘటన బాగుగా గుర్తున్నది. నేను బందరులో చదువుకొనుచున్న రోజులలో పింగళి లక్ష్మీకాంతం, విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు గార్లు చదువుకొనుచుండేవారు. వారల సాటి కవి యగు కాటూరి వేంకటేశ్వరరావుగారు కూడా ఉండి ఉంటారు గాని నాకు బాగా గుర్తులేదు. వీరి నలుగురిలో విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు గార్లు సన్నిహితంగా ఉండేవారు. కొంతకాలం జంటకవులుగా కలిసి కవిత్వం చెప్పారు కూడాను. పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు గార్లు తర్వాతైనా కలిసిమెలసి ఉండే వా రనుకొందును. వారు యువకులలో పేరుపొందిన జంటకవులు. అమృతోపమానమైన 'సౌందరనందం'అను కావ్యాన్ని జంటగా రచించి పేరు ప్రఖ్యాతులు పొందారు. వీరిలో కొడాలి ఆంజనేయులుగారి సంగతి గుర్తులేదు గాని తతిమ్మా ముగ్గురు శతావధానులు, మహాకవులు, కిం కవీంద్ర ఘంటాపంచాననులు (శ్రీ) తిరుపతి వేంకటకవులలో నొకరగు (శ్రీ) చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి వద్ద చదువుకొన్నారు. ఆ రోజుల్లో కవులు, పండితులమధ్య కూడ వైదిక, నియోగి శాఖలువారు ఒకరిమీద నింకొకరు కక్షలు పెంచుకొనేవారు. నిజానికి కవులలో మేము గొప్ప అంటే మేము గొప్ప అని స్పర్థలు, ఈర్ష్యలు పెరిగి శాఖా వైరాన్ని పెంచినవి. తిరుపతి వేంకట కవులు వైదికులు, కొప్పరపువారు నియోగులు. ఈ శాఖా భేదము కవులుగా గణన విషయంలో ద్వేషానికి దారితీసింది. ఈ శాఖా స్పర్థ, వైదికులైన విశ్వనాథ సత్యనారాయణగారు, నియోగులైన కొడాలి ఆంజనేయులు గా రొక జంటగాను, నియోగు లైన పింగళి లక్ష్మీకాంతంగారు, కాటూరి వేంకటేశ్వరరావు గారు మరొక జంటగాను వ్యవహరించుటకు ప్రోత్సహించినదేమో. ఏదైనను సత్యనారాయణ, ఆంజనేయులుగార్లు ఒకనాడు

బచ్చుపేటలోని హిందూ హైస్కూలు కెదురుగానున్న చిన్న చెరువుగట్టుమీద దంతధావనం చేస్తూఉండగా, సమీపములోనే నివసించుచున్న నేను వారితో కయ్యం పెట్టుకొన్నాను. కారణం, వా రిద్దరు కలిసి శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు అంతకుపూర్వం రచించి యుండిన "కురుక్షేత్ర సంగ్రామం" అనే నాటకంమీద తీవ్రమైన విమర్శ వ్రాశారు. శ్రీ రామస్వామి చౌదరిగా రప్పుడు ఐర్లండుదేశం డబ్లిన్ నగరంలో బారిష్టరు పట్టాకు చదువుచుండినారు. వారి స్వగ్రామం అంగలూరు నుండి ఎవరో వారి కీ విమర్శ విషయం వ్రాసియుండిరి. బందరులో నేను చదువుచున్నసంగతి వారికి తెలియును. నేను వారికి పినతండ్రి మనుమడను (కూతురు కొడుకును). అందు వలన నాకు వారు డబ్లిన్‌నుండి 7-1-1916 తారీఖున ఉత్తరం వ్రాశారు. అది నా చేతి కేకారణంవల్లనో 7-3-1916 తారీఖున అందింది. వారు వ్రాసినది, "నా కురుక్షేత్ర సంగ్రామముపై నెవ్వారో యిద్దఱు విద్యార్థులు విమర్శనము వ్రాసిరట. వ్రాయుట యుక్తమే. విమర్శనమువలనగాని సత్యాసత్యములు బయట పడజాలవు. నేను విదేశమునందున్న యప్పుడు మాత్రము వ్రాయుటచే విమర్శకులు సద్బుద్ధితో వ్రాసిరని యెంచుటకు వీలుండదు. ఎవ్వారీ విద్యార్థులు ? ఏ స్కూలులో చదువుచున్న వారు ? తమంతటతామే వ్రాసిరో, యెవ్వరి ప్రోద్బలముచేతనైన వ్రాసిరో కనుగొని నాకు తెలియజేయవలయును. తెరచాటున బొమ్మ యొకటి యుండి యాడించుచుండునని యనుమానము పడుచుంటిని. ఇది యెంతవరకునిజమో రూఢి కనుగొని సత్యమును తెలుపుదువని నమ్ముచున్నాడను. తెరచాటున నెవ్వరున్నను భయపడను, శంకింపను. కాని నిజము మాత్రము కావలయును." పైన వారు వెలువరించిన యభిప్రాయాలు వారి న్యాయబుద్ధిని, వివేచనమును, నిర్భీకతను తెలియజేయుచున్నవి. త్రిపురనేని రామస్వామిచౌదరిగారుకూడ సత్యనారాయణ, ఆంజనేయులు గార్ల వలె శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి శిష్యులే. బందరులో ఏమాత్రం సాహిత్యోపాసకులైనా వేంకటశాస్త్రిగారి శిష్యరికం చేయనివా రుండేవారుకాదు. ఏ రూపేణనైనా వారిని గురువుగా

నెంచనివా రుండేవారుకాదు. చివరకు తెలుగుసాహిత్య మందు అతి సామాన్యమైన ప్రవేశం, అభిరుచిగల నేనుకూడా వారిని గురువుగా భావించేవాడను. వారితో ముఖాముఖిని మాట్లాడిం దొకరాత్రి. వారిని దారిలో కలిసికొని వారితో భాషించుచు కొంతదూరము సాగనంపాను. ఇంకొకసారి వారింటికి వెళ్లి వారిని దర్శించియుంటినేమో అని ఇప్పుడు తోచుచున్నది. శ్రీ శాస్త్రిగారు కులవివక్షత లేకుండా శిష్యరికం చేయించుకొనేవారు. ఇప్పటివలె హరిజనులలో ప్రముఖులైన కవులు, పండితులు ఆ రోజుల్లో లేరేమో అనుకొందును. అందువలన ఏ హరిజనుడూ వారి శిష్యత్వానికి తలపెట్టియుండడు. కాని, శూద్రకులస్థులని వాడుకలో ఉండే కమ్మ, రెడ్డి, కాపు వగైరా కులాలవారిని వారు దగ్గరకు చేర్చుకొనేవారు. శాస్త్రిగారి శిష్యరికంచేత శ్రీ రామస్వామిచౌధరిగారు, సత్యనారాయణ, ఆంజనేయులు గార్లు సహాధ్యాయులే. రామస్వామిగారు వీ రిరువురు కంటె పెద్దవారు కాబట్టి ఒకే కాలంలో శాస్త్రిగారి శిష్యరికం చేసియుండకపోవచ్చును. మరిన్ని తన విమర్శకులపేర్లు వారికి సమాచారంఅందజేసినవారు తెలిపినట్లులేదు. ఫలానావారని తెలియకపోవుటచేతనే శ్రీ చౌదరిగారావిధముగా ఎవ్వరీ విద్యార్థులు, ఏ స్కూలులో చదువుచున్నారు? అని ప్రశ్నించారు. వీరిద్దరు సత్కవులనియు, వారిలో విశ్వనాథ సత్యనారాయణగారు కవిసామ్రాట్టు, కళాప్రపూర్ణులై మహాకవిగా ఎంచబడుతారనియు వారూహించియుండరు. నేను పైన చెప్పినట్లు శ్రీ సత్యనారాయణ, శ్రీ ఆంజనేయులు గార్లతో ఆ ఉదయం ఆ చెరువుగట్టుమీద వివాదపడి, వారి విషయం శ్రీ చౌదరిగారికి తెలియజేశాను. సరాసరి వారి కింగ్స్ ఇన్స్, డబ్లిన్, ఐర్లండు, యడ్రస్సుకు వ్రాసానో, లేక నేను ఉత్తరంవ్రాసి అంగలూరివారిద్వారా పంపినానో నా కిప్పుడు గుర్తులేదు. వారి ఉత్తరంకూడా అంగలూరివారిద్వారానే నా కందియుండును.

1915 ఆగస్టు, సెప్టెంబరు లలో నోబుల్ కాలేజి హాస్టలులో బలవంతంమీద నివసించినా 3, 4 మాసాలకంటె అక్కడున్నట్లు

లేదు. 1916 జనవరికే బచ్చుపేటకు తిరిగివచ్చినట్లున్నది. 1916 మార్చిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, కోడాలి ఆంజనేయులు గార్లతో బచ్చుపేట చెరువుగట్టుమీద ఉదయం దంతధావనసమయంలో తగాదాపడినప్పుడు, నే నుదయమే బచ్చుపేటలోని నా గదినుండి వెళ్ళినట్లు బాగుగాగుర్తు. హాస్టల్ లోనుంటే, చీకటితోనే అక్కడినుండి బచ్చుపేటకు వెళ్ళియుండేవాడిని కాదు.

ఈ కాలంలో బందరు జాతీయ కళాశాల వార్షికోత్సవం బ్రహ్మోత్సవంగా జరిగింది. ఆ ఉత్సవానికి శ్రీమతి ఆనిబిసెంటు గారు అధ్యక్షతవహించారు. శ్రీ సి. పి. రామస్వామిఅయ్యరు ముఖ్య వక్తలలో నొకరు. శ్రీమతి సరోజినిదేవికూడా వచ్చినట్లు గుర్తు. జనసమ్మర్దంతో కోలాహలంగా, అత్యుత్సాహంతో మిక్కిలి వేడుకగా సభలు, ఉపన్యాసాలు, విలాసాలు జోరుగా సాగినవి. ఆనిబిసెంటమ్మగారు ప్రబోధాత్మకమైన, వేసవిజల్లువలె ఆహ్లాదకరమైన, శరదృతువునందలి ప్రపూర్ణ ప్రశాంత ప్రవాహంవలె వైదుష్యంతో, వైదగ్ధ్యంతో ఉపన్యసించారు. ఆమె వాగ్ధాటి, వచనా విచిత్రత, మాటల పొందిక, మాధుర్యం, ఎడతెగని ధార, సభ్యుల నందరిని ముగ్ధులను, సమ్మోహితులను జేసింది. రామస్వామిఅయ్యరుగారు ఏకబిగువున ఆ ఉదయం అధమం 2½ గంటలైనా ఉపన్యసించియుందురు. ఏకధార— మాటలకు తడుముకోవటంలేదు. చెప్పినదే చెప్పటంలేదు. ఏ వేవో రంగుల అల్లిక. ఉపన్యసించినపద్ధతి మిక్కిలి సంతోషదాయకముగా నుండినది. వారు స్ఫురద్రూపియే గాకుండ, మిక్కిలి అందమైన వ్యక్తిత్వంకలవారు. వారి రాజసంతోపించే చక్కని వంపుగల నాసిక, ప్రముఖమై కాంతివంతమైన నేత్రములు, సుస్నిగ్ధమై సమున్నతమైన ఫాలం, తేజోవంతమైన వర్చస్సుకలిగి మిక్కిలి ఆకర్షణీయమైన విగ్రహంతో తెల్లని తలపాగ, తెల్లని జరీకండువా, పొడుగుపాటి ఎదురునిండా గుండీల కోటు, తెల్లని జరీకట్టుబట్ట వారిని సౌందర్యమూర్తినిగా చేసినవి. వారు ఏకధారగా హావభావములతో మాట్లాడుచుంటే అక్కడి నుండి కదలా లనిపించలేదు. ఆ ఉత్సవాలు రెండు, మూడు

రోజులు జరిగినవి. అప్పుడు చిత్రకళాప్రదర్శనం, చేతిపనుల ప్రదర్శనం, పుస్తకాల ప్రదర్శనం వగైరా జరిగినవి. (పింగళి ?) వెంకయ్యగార నేవారు చిత్రకళాప్రదర్శనానికి బాధ్యతవహించారు. వారక్కడ చిత్రకళాధ్యాపకులని గుర్తు. వారు చక్కని మీసాలతో, శివి ఉట్టిపడే తలగుడ్డతో ప్రకాశించేవారు. సరోజిని దేవిగారి సంగతి చెప్పనక్కరలేదు. ఆమె భారత కవి కోకిలకదా. అనిబిసెంటమ్మగారిది కంచు కంఠం అయితే, సరోజిని దేవిగారిది వీణకంఠం. ఆమెది గంగాప్రవాహం అయితే, ఈమెది యమునా ప్రవాహం. ఆమె ఉపన్యాసధోరణి ప్రబోధితం, ఆవేశ కారకమైతే ఈమెది మంజులం, ఉత్సాహ ప్రేరకం. ఇద్దరి సంబోధనలు దేశభక్తి పూరితములు, సంస్కార ప్రేరితములు. మానవత, విజ్ఞత, సేవాతత్పరతలో ఒకరు సింహమువలె ముందుకు దుమకటం, ఇంకొకరు మయూరంవలె నృత్యం చేయటం. ఇద్దరిని ఒక వేదికమీదజూచి, వారి ఉజ్వల ప్రబోధన లాలకించి, వారి ఉపన్యాసప్రవాహంలో మునిగి తేలిన వారెన్నడు ఆ దృశ్యాన్ని, ఆ అనుభవాన్ని మరువలేరు.

ఈ కాలంలోనే బిపిన్. చంద్రపాల్ గారి ఉపన్యాసం వినుట తటస్థించింది. వారప్పు డేకారణంవల్లనో ఉపన్యాస పర్యటనలో నుండి, బందరు వచ్చారు. ఏదో యొక ఆవరణలోని బహిరంగప్రదేశంలో ఉపన్యసించారు. వేలాదిజనులు గుమిగూడారు. వారిది నిజమైన కంచు కంఠం, బంగారు కంఠం అని చెప్పలేమో. వారి వాగ్ధాటి అమెరికాలోని నయాగరా జలపాతం వలె విజృంభణతో, పరిపూర్ణతతో, మెత్తని శీతల జల్లులతో ఆ అశేషజనాన్ని ముంచి లేవనెత్తి తబ్బిబ్బును జేసింది. దేశభక్తి పూరితములై పద గుంభనలతో, సంపంగి గుబాళింపులతో ఉత్తేజ జనకములైన వారి మాటలు శ్రోతలను ఆకాశమున కెత్తినవి. ఎంతటి క్లిష్ట విషయాన్నైనా చక్కగా పండిన అరటిపండునువలె ఒలిచి అరచేతిలో పెట్టినట్లు విస్పష్టంగా అర్థమయ్యే వాక్యధోరణి వారిది. చిక్కని, శర్కరయుతపాలవలె పద సంయోగము మాధుర్యమును ఆస్వాదింపజేసి, ఆహ్లాదమును కల్గించింది.

1915 డిశెంబరులో ననుకుంటాను కాకినాడలో చతుర్థ లేక పంచమ ఆంధ్ర మహాసభ జరిగింది. దానికి ఆంధ్రపెద్దలు చాలామంది హాజరైనారు. వేదికమీద ప్రముఖ నాయకులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, కొండా వెంకటప్పయ్య పంతులుగారు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు, పరశురామపాత్రోగారు వగైరా పెద్దలు ఆసీనులైనారు. టంగుటూరి ప్రకాశంపంతులుగారా సభకు హాజరైనది లేనిది నాకు గుర్తులేదు. పిఠాపురం మహారాజుగారొకనాడువచ్చి ఒకపూట గడపి వెళ్ళిపోయారు. అక్కడ మొదటిసారి కౌతా శ్రీరామశాస్త్రిగారిని చూచాను. అదివరకు బందరులో వారిని చూచివున్నానేమోగాని గుర్తులేదు. వారు ప్రారంభగీతంగా వందేమాతరం పాడారు. చాలా మనోహరంగా భావోద్రేకంగా నుండినది. శ్రీ రామశాస్త్రిగారు బెంగాలీ భాషను బాగా అభ్యసించినవారు. సారస్వతసేవ జేస్తూ బందరులో కాపురముండేవారు. వారు నిండు హృదయంతో దేశారాధనచేస్తూ, రాజకీయసభలలో పాల్గొంటూ, సంఘ సంస్కరణ విషయాల్లో ముందంజవేస్తూ రెండవతరగతికి చెందిన ప్రముఖులలో నొకరుగా ఉండేవారు.

బందరునుండి వారపత్రిక కృష్ణాపత్రికను నడుపుచుండిన ముట్నూరి కృష్ణారావుగారి నదివరకు బందరులో చూచియే యుందునుగాని, వారాసభలో నుపన్యసిస్తుండగా చూచిన దృశ్యం ఇప్పటికిని, 55 సంవత్సరాలు దాటినతర్వాతకూడ, నా మనః ఫలకమున గాఢముగా ముద్రింపబడి చెక్కుచెదరకుండ నున్నది. వారి స్ఫురద్రూపం, అందమైన గుండ్రని ముఖం, తేజోవంతమైన పెద్ద కళ్లు, ఆ తలపాగ సొంపు, ఆ ఠీవి, ఆ మాటల పటుత్వం, ఆ భావముల లోతు, తూచి తూచి విసరిన బాణములవంటి జాజ్వల్యమానమైన ఉచ్చారణ, ఉపన్యాస పద్ధతి అహో! మరపురాని దృశ్యం. ఆధ్యాత్మికత రూపొందినదా యనునట్లు మూర్తీభవించిన రాజసంవలె, దేహధారణ మొనరించిన శౌర్యంలాగు, చిరకాల యోగాభ్యాసమువలన పరిణతచెందిన యోగిపుంగవుని మాదిరి, ప్రజలను ప్రబోధించే విద్యారణ్యులపోలిక నా కంటికి

తోచారు. వారి తలగుడ్డ తీరు, ఆ లాల్చీ, ఆ ధోవతికట్టు అచ్చముగా వివేకానందుడు సాక్షాత్కరించినాడా అని అనిపించింది. సరిపడిన ఎత్తు, లావు, నిమ్మపండు దేహచ్ఛాయ వారి ఉత్తమ వ్యక్తిత్వానికి తోడుపడినవి. అప్పటినుండి వారియందు నా కపార మైన గౌరవం కల్గింది. ఈ గౌరవమును, భక్తిని వారి కృష్ణా పత్రిక సంపాదకీయాలు పెంచినవి. ఆ రచనలు మిక్కిలి విస్పష్ట ముగా, పుష్టిగా, ఘాటుగా, సూటిగా, విషయపూర్ణములై, ప్రబోధాత్మకములై, దేశభక్తిపూరితములై, నిర్భోగమాటములై తేజరిల్లేవి. ఆ మాటల కూర్పు, పొందిక, ఆ భావ గంభీరమైన శైలి, ఇతర తెలుగువార్తాపత్రికలలో కన్పడేదికాదు. వారి తర్వాత అంత సూటిగా, ధాటిగా, ప్రతిభావంతంగా వ్రాసే వా రొక్క నార్ల వెంకటేశ్వరరావుగారు ప్రస్తుతం కన్పిస్తున్నారు.

ఆ బచ్చుపేటలో ఆ రోజుల్లో బాగా పరిచయమైనవారిలో ఐనాల బాబూరావు అనే యువకు డుండేవాడు. అతని మాతా మహుడు కొంత పేరుగడించిన వకీలు ఐనాల వెంకయ్యానాయుడు గారు. ఈ యువకుడు విలాసపురుషుడు, చదువుయందు శ్రద్ధ తక్కువగలవాడు. సరిగా చదువుట లేదని డబ్బు దుర్వ్యయం చేస్తాడని అతని తాతగారి కతనియందు కోప ముండేది. మరిన్ని ఈ యువకు డొక ప్రేమకలాపంలో చిక్కుకొని ఆ పిల్లకు మనోవ్యథ కలిగించి తాను బాధ నొందాడు. పెండ్లిచేసుకుంటానని మాట ఆ పిల్ల కిచ్చి కొంత చనువు తీసికొన్నాడట. కాని అతని తాతగారు, పిల్లతండ్రి తన హోదాకు, ఆస్తి పాస్తులకు తగదని అనుమతి నివ్వలేదట. ఆ సరససల్లాపా లంతటితో ఆగిపోయాయి. తర్వాత ఇంకొక యువతిని వివాహమాడి సంతానవంతుడై, లోకల్ ఫండు డిపార్ట్‌మెంటులో చాలాకాలం ఉద్యోగంచేసి గౌరవంగా రిటైరయ్యాడు. నా కప్పుడప్పుడు తగులుతూ, పాతకబుర్లను నెమరువేస్తుండేవాడు. 1936 లో చల్లపల్లిరాజావారు శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ వారీయూరు (పెడసనగల్లు) బోర్డు ఉన్నత ప్రాథమిక పాఠశాల భవనానికి శంకుస్థాపనకు వచ్చినప్పుడు ఓవర్‌సీరుగా అతడుకూడా వచ్చి మా పాతస్నేహాన్ని పునరుద్ధరించుకొన్నాడు.

నా మనుగుడుపు జరిగి (1915) జూన్ 3-వ తారీకు అవటం వల్ల, మా హైస్కూల్ జూన్ ఆఖరువారంలోనో, అంతకంటె కొంచం ముందుగనో ఆరంభించినందున, 15, 20 రోజులు మాత్రమే పెడసనగల్లులో నుంటిని. తర్వాత అప్పుడప్పుడు బందరునుండి పెడసనగల్లు వెళ్లుచుండేవాడను. ఆ రోజుల్లో బస్సులు లేవు. బందరునుండి జట్కాబండిలో చినముత్తేవివరకు 13, 14 మైళ్లు వచ్చి, అక్కడనుండి 2, 3 మైళ్లు నడచి పెడసనగల్లు చేరుకొనేవాడను. క్రొత్తగా కాపురానికివచ్చిన భార్యను కలిసికోటానికి వెళ్లుచున్నందున, మిఠాయి, పండ్లు తీసికొని వెళ్లుచుండే వాడను. నా భార్య ఒకవిధంగా అమాయకురాలు. మొదటి నుండి నాతో కలిసిగట్టుతనం తక్కువ. స్వంతంగా యోచించుకొనే శక్తి, స్వతంత్రంగా వర్తించే ధైర్యం లేదు. ఇంట్లోవా రెటు సూచిస్తే అటే. పైగా ఎక్కువ బిడియం. ఎవరైన చూచిపోతారేమో, ఏమైనా అనుకొంటారేమో అనే జంకు. మరిన్ని, సహజంగా వయస్సులోనున్న స్త్రీకుండే వాంఛ తక్కువ. ఈ కారణాలవల్ల నా రాకకు ఎదురుచూచుచుండకపోగా, ఎందుకు వచ్చాడా అన్నట్లు ఆందోళనపడేది, వర్తించేది. రావటంతోనే సంతోషంగా ఎదురువచ్చి పలుకరించి, తెచ్చినవి తీసికొని ఆహ్వానించటం ఆదిలోనే కాక, పిల్లలు పుట్టిన తర్వాత కూడా ఉండేదికాదు. అయితే, కమ్మకుటుంబాలలో తల్లి, తండ్రి చాటు పడుచులు చప్పున భర్తలముందుకు వచ్చేవారుకాదు. ఆదిలో ఏ మూలలనో పొంచి తొంగి తొంగి చూచి తృప్తిపడేవారు. కొంత కాలం గడచినతర్వాత తలుపు చాటునుండి చిరునవ్వుతో ఆహ్వానించేవారు. కొంత ప్రాతపడినతర్వాత గాని ఎదురుగావచ్చి పలుకరించేవారుకాదు. కాని, నా భార్య నడవడి, కమ్మ యువతుల మామూలు ఆచారపద్ధతికంటె చాలా హెచ్చు. నే నింగ్లండునుండి తిరిగివచ్చిన కొంతకాలానికి గాని ఆమె ఎదురుగావచ్చి పలుకరించే చొరవ కలుగజేసుకొనలేదు. దానికి కొంత కారణంకూడా లేకపోలేదు. తల్లి దండ్రుల చాటు బిడ్డయే గాక, తెలివితేటలు, ముందుచూపుగల తన అక్కచాటు కూడా ఈమె కుండేది. ఆమె ఏమి అపహాస్యుందో అని బిడియపడేది.

సాధారణంగా వదినెలు మరదులను పరిహాసంచేయుట కద్దు. కాని ఆమె పనిగట్టుకొని నన్ను కించపరచి తన సోదరిదృష్టిలో నన్ను తక్కువరకంవానిగా తోపించాలని చేస్తున్నదేమో అనిపించేది. కార్యమయిన మరు ఉదయమే ఆమె వేళాకోళ మాడటం నా చెవులలో పడ్డది. నా భార్య కొన్ని సంవత్సరాల తర్వాత నాతో అన్నట్లు ఆ తొలిరాత్రి మా కలయిక, ఇద్దరకు చేత గాని తనంచేత కాబోలు అసంపూర్తిగానే ఉండినది. ఈ విషయం నేర్పుతో చెల్లెలు హావభావములనుండి ఆమె గ్రహించియుండ వచ్చును. దాని నాధారంగాచేసికొని నేను వినిన అవహేళన చేసియుండవచ్చును. నాభార్య అసలే బెదురుబోతు. ఇంకా బిడియపడి యుండవచ్చును. అమాయకురాలు, అక్కమాటలను దైవ వాక్కులుగా ఎంచుకొనే నా భార్య, భర్తతో కలిసిమెలసి యుండుటకు అక్క ఎగతాళి, సూటిపోటి మాటలు కొంతకు గొంత మైన కారణమైయుండును. మా మామగారు నాయందు నిండు అభి మానంతో ఉండేవాడుకాని, మా అత్త మొదటనే నా సంబంధాని కొప్పుకోలేదుకదా —పైగా, అంత తెలివి తేటలు కలదికాదు. గొప్ప దేహదార్ఢ్యము కలిగి, ఇంటిపనులయందు దక్షతగలిగి ఉండేదికాని మంచి చెడు విచక్షణజ్ఞానంలేనిది. అందులోను యువతీ యువకుల సాంగత్య విషయాలు, వారి మధ్య నుండవలసిన స్నేహ, ప్రేమల విషయం ఆమె కర్థమయ్యేవికావు. చురుకు దనం, కార్యదీక్ష, కార్యసాధనశక్తి గల తన పెద్దకూతురు మాట ఆమెకు మిక్కిలి గురి. అందువల్ల సామాన్యంగా కూతురుకు తల్లి యిచ్చే సలహా భర్తతో కలిసిమెలసిఉండి, అతనిని సంతోషపెట్టి, కూడగట్టుకోవాలని అనునయంతో చెప్పే తెలివితేటలుగాని, దృక్పథంగాని ఆమె కేమాత్రంలేవు. మరిన్ని వివాహాదికములై నిస్సంతుగా చనిపోయిన ఆమె కుమారుని మృతివలన ఒక విధమైన విరక్తితో కూతురు సౌఖ్యం విషయం పట్టించుకొనకపోవచ్చును. ఈ దురదృష్టంకూడా మావిషయంలో మధ్య తెరను మరింత బిగించియుండవచ్చును. అన్న చనిపోవటంతో, తండ్రి మంచానపడటంతో, తల్లి పట్టించు

కొనకపోవటంతో ఇంటిపెత్తనం, వ్యవహారాలు దిద్దటం పెద్ద కూతురుమీద పడ్డవి. పెదతల్లికొడుకు వీరరాఘవయ్యగారు కొంత పూనుకొన్నా అది కోర్టు వ్యవహారాల సంబంధమైనది మాత్రమే. వేయి కన్నులతో జాగ్రత్తపడే పెద్దకూతురు అభిప్రాయమే తుది నిర్ణయం. అన్నపోయిన మరుక్షణంలో బొమ్మలూరుతో (అత్త మామల ఊరు) నాకు సంబంధం తెగిపోయిందో వగైరాలు దుఃఖం నెపమున బహిరంగపరచటం ఆమె మనస్తత్వాన్ని, అధికారం తనకు సంక్రమించిందనే ధోరణిని తెల్పుచున్నవి. అన్న పోగా, ఆస్తి పాస్తులకు తాను, తన చెల్లెలు హక్కుదారు లైనారు. తన చెల్లెలు అమాయకురాలు, తన చెప్పుచేతల్లో ఉండేది. తన భర్త తనకు పూర్తిగా అనుకూలుడు, చాక చక్యం కలవాడు. మరది అసమర్థుడు. తనమామ తిమ్మిని బమ్మి చేయగల దక్షుడు, చెల్లెలుమామ చేతకానివాడు. ఇక తన ఆధిక్యాన్ని, అధికారాన్ని కాదనగలవారెవ్వరు ? ఈ వాతావరణంలో నా భార్య అణగి మణగి తన అక్క బావల అభిప్రాయాలకు, ఆలోచనలకు లోబడిపోయిందని నా కనేకసార్లు గట్టిగా తట్టింది. యౌవనావేశంలో అర్ధాంగి, ధర్మపత్ని అనుకొని ఆశపడిన నాకు తగిన సహకారం, సహవాసం, మమత వగైరా లేకపోవటంవల్ల కలిగిన దురభిప్రాయమేమోగాని నా మనస్సు విచారపూరితమై అసూయకు తావు కల్పించుకొని బాధపడేది. పెండ్లయినప్పుడు నా భార్య మిక్కిలి చిన్నదని పైన వ్రాశానుకదా— చిన్నతనంలో కలిగిన అభిప్రాయాలు మనస్సులో నాటుకొనిపోతవి. నేను అనాకారినని పెండ్లికి ముందు నన్నుచూచిన మా బావ చెప్పగా మా అత్త ఈ సంబంధం వద్దని చాలా తగాదా పెట్టిందని పైనచెప్పాను. ఇంత వివాదంలో పడిన భర్తయందు భార్యకు సదభిప్రాయం, పునాది యుండదు. పూర్తిగా అర్థంకాకపోయినా ఆ చిన్నపిల్ల మనస్సులో భర్త వ్యక్తిత్వము, మేఘ ఛాయావృతమువలె అస్పష్టతను, కాంతి విహీనతను పొందదా. నేనుకూడా మిక్కిలి బిడియం కలవాడను. చొరవజేసి స్నేహం చేసికొనే స్వభావం, ధైర్యం ఉండేవికావు. పిల్ల సహజంగా చలాకి అయినదేగాని, భర్తయందుఉండే సిగ్గే

కాకుండా సహజ భీరుత్వం, బిడియం కలమనిషి. పైగా పై జెప్పిన నా వివాహసందర్భకించన, ఆమె అక్క చమత్కార చాతుర్యములు, బావ ఆధిక్యం నా వ్యక్తిత్వాన్ని ఇంకా కించబరచినవి. ఆమెముందు తగ్గించబడ్డ నా వ్యక్తిత్వ చిత్రం నా భార్య కంటికి కాకర్షణీయముగా, ఆమె హృదయాని కపేక్షాదాయకంగా తోచియుండలేదనుకొందును. ఈ కారణాల వల్లనే ఆమె నా యందు ప్రియమిత్రునివలె స్నేహము చూప లేకపోయిం దనుకోవాలి.

మా మామగారు పుత్రహీనంగా 1916 ఫిబ్రవరి రెండవ వారంలో చనిపోయారు. చనిపోవకముందు తన అన్న వెంకటాద్రి గారి కుమారుడు లక్ష్మీనారాయణను తన కర్మ కుపయోగపడ్తాడని దగ్గరకు చేరదీసి కొంత ఆర్థికసాయం చేశారు. మన హిందూ మతాచారంలో శ్రాద్ధకర్మకు ఎక్కువ ప్రాముఖ్య మున్నదికదా. అందులో 50 ఏళ్లకు ముందు చనిపోయినప్పుడు చిన్నకర్మ, దినకర్మ, పెద్దకర్మ అని చేయటం, మాసికాలు పెట్టటం మామూలు ధర్మం. అదివరకు ముభావంతోనున్న అన్నకొడుకు లక్ష్మీ నారాయణను చేరదీసి అనునయించవలసివచ్చింది. కర్మ యథాప్రకారం జరిగింది. కాని కొన్ని మాసాలకే, ఏడుగురు రాకముందే లక్ష్మీనారాయణకు దుర్బుద్ధిపుట్టి, దుస్సలహాలను విని, తన కొడుకును తన పినతండ్రి పెంచుకొన్నట్లు, తన ఆస్తిని యావత్తు ఆ కుర్రవానికి సంక్రమింపజేసినట్లు ఒక వీలునామా సృష్టించాడు. నా భార్య మేనమామలు చెరుకూరి వెంకటరత్నం, లక్ష్మీపతిగార్లు గ్రామకంఠం ఆక్రమించుకొన్నారని, దౌర్జన్యం చేస్తారని, ఇతర చిల్లర మల్లర తగాదాలవల్ల గ్రామంలోని మూడుపాళ్లు పైచిల్కు కుటుంబాలవారు చెరుకూరివారికి విరోధు లైనారు. సమర్థుడైన మామగారు చనిపోవుటచేత చెరుకూరి వారితో వారిసోదరి కుటుంబం సహజంగాను తప్పనిసరికి కలిసి యుండటంవల్లను, మా వాళ్లతోకూడా గ్రామస్థులు విరోధులై వారిలో కొందరు ఆ ఫోర్జరీవీలునామాకు మద్దతివ్వదలచారు గాని, న్యాయబుద్ధిగల ఊరి మణేదారు సూరపనేని వీరరాఘ వయ్య, వారి తమ్ముడు మిక్కిలి సమర్థుడు, వెంకట సుబ్బయ్యగార్లు

సాక్షి సంతకాలు చేయటానికి నిరాకరించటంతో ఆ విల్లును చింపి తగులపెట్టవలసివచ్చింది. తర్వాత సదరు లక్ష్మీనారాయణను మా మామగారిపేర వ్రాసిన ప్రోనోటు బాకీ నివ్వమని కోరగా, ఇవ్వ తిరస్కరించినందున మా అత్తగారు దావావేశారు. తన కొడుకును దత్తత చేసుకొన్నట్లు, ఆస్తి తన కొడుకుదైనట్లు ఆయన వాదన లేవదీశాడు. కోర్టువారు ఆయన వాదనను తిరస్కరించి డిక్రీ యిచ్చారు కాబట్టి సరిపోయింది. సమర్థుడు, ఉపాయశాలి అయిన మా మామగారు కొడుకుపోయిన దిగులుచే మరణించగా ఆ అవకాశం తీసికొని లాభం పొందాలని చేసిన ప్రయత్నాలలో ఇంకొకటి బాగా గుర్తున్నది. ఈ ఊరివాడే ఒక ఆసామి ధాన్యం వర్తకం కమీషన్‌కు చేస్తూ ఉండేవాడు. అతడు 200 బస్తాల ధాన్యం మా అత్తగారి నుండి కొని డబ్బు ఇవ్వక ఎగవేశాడు. ముఖ్యంగా పల్లెటూళ్లలో ఇప్పటికిని ధాన్యం, అపరాల అమ్మకం కమీషన్ వ్యాపారస్తుల నమ్మకంమీద జరుగుతుంది. ధాన్యం వగైరా పట్టుబడి చేయించి, బెజవాడకో, బందరుకో అమ్మకానికి తీసుకువెళ్ళినప్పుడు కమీషన్‌వర్తకుడు చీటీగాని, రసీదుగాని ఇవ్వడు. కొనిన రైస్‌మిల్లో, వర్తకుడో యిచ్చిన వెంటనే డబ్బు తీసికొనివచ్చి అమ్మిన ఆసామి కిస్తాడు. కమీషన్ వగైరా కొన్నవారే పెట్టుకుంటారు. అమ్మిన ఆసామి వద్ద లెఖ్ఖ డొక్క యుండదు. కాబట్టి డబ్బురావాలని మాజు వాణి దావా మా వాళ్ళు వేశారు. ధాన్యం అమ్మలేదనో, డబ్బిచ్చివేశాననో కొన్నవాని వాదన. గ్రామస్థులు వ్యతిరేకులు కాబట్టి ఋజువుకాక కేసును కొట్టివేశారు. పైగా ఈ ప్రబుద్ధుడు తర్వాత తన కొడుకును చనిపోయిన మా బావమరదిభార్య దత్తత చేసికున్నదని మా మీద దావా తెచ్చి, చాలా కష్టనష్టములకు మమ్ములను లోనుచేశాడు.

పల్లెటూళ్ళలో ముఖ్యంగా అంగబలం అవసరం. అర్థబలం చాలదు. బీదవాడైనా బంధుత్వంతో, కుటుంబ సంఖ్యతో పదిమందిని ప్రోగుచేయగలవాడు తగాదావచ్చినప్పు డూరిలోని పెద్ద భూస్వామినైనా, షావుకారునైనా ధిక్కరించగలడు. మా మామగారు పోవటం, అంతకు ముందే వయస్సువచ్చిన ఏకైక

పుత్రుడు పోవటం, ఊరిలో విరోధంవల్ల మా మామ బావమరదుల బలం సన్నగిల్లటం, అదను చూచుకొని ఆడపిల్లలు, వయస్సు మళ్లిన తల్లి మనల నేమిచేయగలరని ఒక దుష్టుడు ఏదో నెపము మీాద ఇంటిమీాదకువచ్చి నానా దుర్భాషలు మాట్లాడినాడట. మా అత్తగారు నూరేళ్ళుబ్రతికి ఈ మధ్యనే ( 1966 డిశెంబరు ) చనిపోయారు. ఆమె తన అన్నలవలె భారీమనిషి. ఒడ్డు పొడుగులతో మిక్కిలి దార్ఢ్యముగల మనిషి. నదురు బెదురు లేనిది. ఆమె ఎదుర్కొని చీవాట్లు పెట్టిందట. అంతలో ఆమె అన్నలు వచ్చారట. దానితో ఆ దుష్టుడు తోకముడుచుకొని తన ఇంటిలో దూరాడట. అల్లుళ్ళము మే మిద్దరం చదువుకొంటూ ఊరిలో లేము. ఉన్నా స్థానబలంలేని పిన్నవయస్కులం కదా.

మాకు ఫిఫ్తుఫారం పరీక్షలు వచ్చినవి. ఆదరా బాదరా చదవటం ప్రారంభించాను. మా క్లాసు టీచరు సాంబశివరావు గారు చరిత్ర బోధకులు. సాత్త్విక స్వభావం కలవారు. నెమ్మదిగా, మంచిగా పాఠంచెప్పేవారు. ఇతర టీచర్లకంటె క్లాసు టీచరెక్కువ కదా. వారియందు గౌరవంచూపించవలెను కదా. అనగా వారి సబ్జక్టులో మంచిమార్కులు తెచ్చుకోవాలి. కాని చరిత్రపాఠం అశ్రద్ధచేశాను. మరునా డుదయం పది గంటలకు చరిత్రలో పరీక్ష. ఆ రాత్రి తెల్లవార్లు చరిత్ర పుస్తకం తిరగవెయ్యాలని నిశ్చయించుకొన్నాను. నావంటి విద్యార్థులు కొందరు నా క్లాసు, ఇతర క్లాసులవాళ్లుకూడా ఆ రాత్రి యంతయు తమ తమ సబ్జెక్టులను చదవా లనుకొన్నారు. మేము నలుగు రైదుగురం ఒక గదిలో చేరి, తేనీటి సాయంతో చదువు టారంభించాము. చాలా ప్రొద్దుపోయేటప్పటికి టీ త్రాగుతున్నా, నిద్ర ముంచుకువచ్చింది. నాకు తెలియకుండానే స్పృహతప్పి గాఢనిద్రలోపడ్డాను. అప్పు డే రెండుగంటలవుతుందో, తతిమ్మావాళ్ళుకూడా నిద్రమైకంలో చదివీ చదువనట్లు ఊగిసలాడుతూఉండి నావలె పూర్తిగా నిద్రదేవతకు లోబడలేదట. వాళ్ళు నన్ను పిలిచి, కదిలించి చూచారటగాని, నేను " ఊ " కూడా అనలేదట. నా కర్మానికి నన్ను విడిచిపెట్టి వాళ్ళతిప్పలు వాళ్ళు పడ్డారు. నాకు చటుక్కున మెలుకువ

వచ్చి చూచేటప్పటికి గడియారం 5 గంటలు చూపించింది. గాబరాగా ఒక గంటసేపు బట్టీపెట్టి, కాలకృత్యాలైనతర్వాత మరి కొంత చదివి, అటు తర్వాత తొందరగా నాలుగు మెతుకులు నోటిలో వేసుకొని స్కూలుకు పరుగెత్తాను. ప్రశ్నపేప రంత కఠినంగాలేదు. ఒక మాదిరిగా జవాబులువ్రాసి సరిపడ్డ మార్కులతోనైనా ప్యాసౌతానని ధైర్యం తెచ్చుకొన్నాను. అలాగే 35% లేక 40% ప్యాసుమార్కులతో చరిత్రాంశంలో నెగ్గాను. ఇతర అంశాలలోకూడా ప్యాస్ మార్కులు, అంతకంటె కొంచెం ఎక్కువో తెచ్చుకొని మొత్తంమీద ఆ ఫిఫ్తుఫారం ప్యాసయ్యాననిపించాను. ఇప్పటి యంత చదువునం దశ్రద్ధ, నిర్లక్ష్యం, ఏదో నెపంతో సమ్మె పేరుమీదుగా రోజుల తరబడి బడి ఎగగొట్టటం మా కాలంలో లేకపోయినా, కొందరు విద్యార్థులు, ముఖ్యంగా ఆస్తిపరులకుటుంబాలనుండి వచ్చిన కమ్మ విద్యార్థులవంటివాళ్లు, అంత శ్రద్ధగా నిత్యకృత్యంగా చదివే వాళ్లు కాదు. మాటల సరదాతోనో, భోజనప్రియత్వంవల్ల కలిగే ఆయాసంవల్లనో, చదువవలసినంతశ్రద్ధతో, కాలాన్ని వృథా చేయకుండా చదివేవాళ్లుకాదు. నావంటి విద్యార్థికి పట్టణంలో ఇంగ్లీషు చదువు మొదటితరం కృషి. మేము వంశపారంపర్యంగా విద్యార్జనపరులంకాదు. కాబట్టి, ఎడతెగకుండా చదవలేక పోవటం, కొంత బద్ధకించటం, క్షమింపరాని లోటుకాదు. మరిన్ని, ఇప్పటి విద్యార్థులవలె గురువులయందు నిర్లక్ష్యభావంతో మెలగటం, సమ్మెలుచేయటం, కాపీలు కొట్టటం, కూడదన్న పర్యవేక్షకులను బెదిరించి అపసవ్యంగా వర్తించటం మా ఊహలోకూడా ఉండేదికాదు. ఎర్రశాస్త్రులుగారివంటి అమాయకుడైన వృశ్రోత్రియ తెలుగుపండితుడినో అక్కడక్కడ, అప్పుడప్పుడు, విద్యార్థులు గల్లంతుచేసినా, వారివిషయంలోకూడా అగౌరవంగా వర్తించటం ఊహించరాని విషయం. నిజానికి మా హెడ్ మాస్టరు రాస్‌పిళ్లెగారి చేతిబెత్తాన్ని, గడ్డాలు, మీసాలువచ్చి విర్రవీగే మాలో చాలామంది కిక్కురుమనకుండా రుచిచూచాం. కాపీ కొట్టటం మా ఆలోచనలోకే వచ్చేదికాదు. బుద్ధితక్కువచేత ఏ బుద్ధితక్కువ సాహసుడైనా ఆ తప్పుడుపనిచేస్తే వెంటనే

పట్టుబడేవాడు. విధించిన శిక్షను కిక్కురుమనకుండా అనుభవించేవాడు. అప్పటివారం గురుకులశిష్య ప్రవర్తకులం కాకపోయినా, గురువులయందు భయము, భక్తి, గౌరవం కలిగిఉండేవారం. ఒకవేళ, ఏ టీచరుమీదనైనా తాత్కాలికాగ్రహాన్ని పొందినా, అది మనస్సులోనే అణగిపోయేది.

మాకు ఫిఫ్తుఫారంలో భిన్న భిన్న అంశాలను చదువు చెప్పే గురువులలో కళ్యాణరామయ్య, బుడ్డదొర అనే దేశీయ క్రైస్తవులు, బుడ్డిచెంబుశాస్త్రి అనే కోరాడ నాగేశ్వరశాస్త్రులుగారుండేవారు. బుడ్డిచెంబు శాస్త్రులుగారు గొప్ప పండితులేకాక మంచి చమత్కారులు కూడాను. ఏ విద్యార్థియైనా కొంచెం తోకఝాడించటానికి ప్రయత్నిస్తే, చురకకత్తివంటి వారి ఎదురుదెబ్బతో (రిటార్ట్) చటుక్కున వాని తోక కోసేశేవారు. అందువలన వారికి భయపడి కిమ్మనకుండా శ్రద్ధగా పాఠాలు వినేవారు. బుడ్డదొరగారు ఎర్రగా, లావుగా, పొట్టిగా, అందంగా, ఠీవిగా ఉండేవారు. ఎల్లప్పుడు టై కట్టుకొని సూటుతో, బూటుతో ఎదురొమ్ముకు వేసుకొనే (వెయిస్ట్) కోటుతోసహా, దానికి తగిలించిన బంగారుగొలుసు జేబుగడియారంతో ఉండేవారు. ఎప్పుడుచూచినా కుతికవరకు మాంసాదులు మెక్కినట్లు, దాని వలన గొంతు తెమలనట్లు, ఊపిరాడనట్లుండేవారు. మధ్య మధ్య, బిగబెట్టుకొన్నా ఆగని త్రేపులు వారి ముఖద్వారము నుండి బైలుదేరేవి. ఆయనగారికి చిన్న గుంటకాయంత బుడ్డ పొడుచుకువచ్చి అప్రయత్నంగానే చూపరులకు కన్పడేది. అందువల్ల "బుడ్డ" దొర అని నామాంతరం. అసలుపేరు నేను విన్నట్లు గుర్తులేదు. బుడ్డవల్ల బుడ్డ అయి, వేషధారణవల్ల దొర అయి వెరసి "బుడ్డదొర" అయినాడు. కళ్యాణరామయ్యగారు సరదామనిషి, హుషారుగా పాఠంచెప్పేవారు. బుడ్డదొరగారు గోంగ్రించితే, ఈయనగారు ఉల్లసించేవారు. ఆయనగారు సీరియస్‌గా, ముక్తసరిగా చెప్పితే ఈయనగారు సావకాశంగా, కబుర్లుచెప్పినట్లు చెప్పేవారు. ఇద్దరూ తెలుగువారే. మంచి మనస్సు కలవారే విద్యార్థులను హింసించాలనిగాని, తప్పించాలనిగాని, ఎన్నడూ తలంచియుండేవారుకారు. ఈ విధంగా

నా ఫిఫ్తుఫారం పూర్తిఅయి వేసవిసెలవుల కింటికి జేరుకొన్నాను. వేసవిలో నా భార్యవద్దకువెళ్లి ఉందును. అప్పుడామెకు నాలుగవ మాసం గర్భిణి. అంటీ అంటనట్లుగా మా సంపర్కం ఉండి ఉండవచ్చును. ఇప్పుడు జ్ఞాపకంలేదు.

## 1916-17 విద్యాసంవత్సరం ఆరవ ఫారం

(స్కూల్ ఫైనల్ క్లాసు)

ఈ సంవత్సరం వంటవానిని పెట్టుకొని స్వంతభోజనం చేయాలనుకొని ఇదివరలో కొంతకాలం నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రుల్లుగారివద్ద, తర్వాత డోకిపర్రు వీరమాచనేని నారాయణ మూర్తివద్ద, అటుపిమ్మట చిరుచింతల రామచంద్రరావుగారివద్ద పనిచేసిన గుడివాడ వాస్తవ్యుడు యడ్లపల్లి రామన్న అనే వయస్సు మళ్లినవానిని వంటవానిగా కుదుర్చుకొని, బచ్చుపేటలోనే మాదిరెడ్డి రాఘవయ్యగారింట్లో ముందుండే ముఖ్యభాగాన్ని అద్దెకు తీసుకొని బస ప్రారంభించాము. నేను, నాపెదతండ్రి వెంకటసుబ్బయ్యగారి నాలుగో కుమారుడు వెంకట కృష్ణయ్య, అతని చెల్లెలుభర్త పర్వతనేని వెంకటరత్నం, నా పెదతండ్రి మనుమడు, మేనల్లుడు త్రిపురనేని శివప్రసాదరావు, నా షడ్డకుడు సత్యనారాయణ, నా పినతల్లి భర్త దుగ్గిరాల చంద్రయ్యగారి తమ్ముడు రామకృష్ణయ్య (ఇంకొకరున్నారేమో గుర్తులేదు) కలసి ఉండేవాళ్లం. కొద్దిరోజులకు మే మద్దెకు తీసుకొన్న భాగం వెనుకవరండా గదిలో శ్రీ వెల్లంకి అక్కయ్యచౌదరి మా సమ్మతితో ప్రవేశించాడు. వెనుకనుండి బైటకు వేరే త్రోవ యున్నందున ఆయన ఆ దారినే నడచి, వేరే భోజనం చేసేవాడు. ఆ యింటి వెనుకభాగంలో తాడంకి గ్రామ కాపురస్తులు శ్రీ యలమంచిలి వెంకటసుబ్బయ్య, వారి తమ్ముడు వెంకయ్యగార్లద్దెకుండేవారు. వారు స్వంత భోజనవసతి ఏర్పాటు చేసుకొన్నట్లులేదు.

వంటరామన్న మాంచి మాటకారి. లౌకికుడు. సమయాన్ని బట్టి, యజమాని మనస్తత్వాన్నిబట్టి నడుచుకొనేవాడు. నేర్పుగా

అనునయంగా ఒప్పించటానికి ప్రయత్నించేవాడు. దృఢగాత్రుడు. మోటుతరహాకాని ఆడంగి చేష్టలు, అనగా హావభావాలు సమయాన్నిబట్టి వర్షించేవాడు. నవ్వుతూ చేతులు త్రిప్పుకొంటూ మాటలుచెప్పేవాడు. లోవంపు వీపు, ఎడమప్రక్కకు కొంచెం ప్రాలి నిల్చోవటం, నడవటం అతని రీతి. వాని ప్రార్థనవల్లనే మా కిబ్బందికలుగుతుం దనే అభిప్రాయంతో మొదట ఒప్పుకోక పోయినా, అక్కయ్య చౌదరి కా యింటి వెనుకవసారాలోని గది అద్దె కివ్వటం. ప్రాతపద్ధతిప్రకారం వంటచేసేవాడుకాని, బాగానే చేసేవాడు. మా చిన్నతనంలో ఆ వంటలే మాకు బాగా నచ్చేవి. ఆ రోజుల్లో వంటపాత్రలు మట్టికుండలు, చట్లు. తరువాత జర్మన్ సిల్వర్ అనే అల్యూమినియమ్, ఇత్తడి కుండలు, చట్లు వచ్చినవి గాని మొత్తంమీద మట్టిపాత్రలే ఎక్కువగా ఉపయోగించేవారు. మా తల్లి కూరలన్నీ మట్టివానితోనే వండేది. ఆమె బెండకాయ ఇగురు వేసినా, మాంసం ఇగురు గాని పులుసుగాని వండినా, కందిపప్పు వండినా, ఇంకా ఏ కూర వండినా మంచి రుచిగా ఉండేవి. మట్టిపాత్రలలో నెమ్మదిగా పిడకలపొయ్యిమీద వండిన కూరలు ఇప్పటివలె తొందరగా పుల్లలసెగతోనో, గ్యాస్‌తోనో వండే వంటకాలకంటె, రుచిగాఉంటవని నా అభిప్రాయం. పాలుకాచటానికి మట్టికుండే శ్రేష్ఠ మనుకుంటాను. చిన్న మట్టిపిడతలో సరిపడ్డ నీళ్ళుపోసి కుంపటిలో పిడకల సన్ననిప్పుమీద నెమ్మదిగా పైన పొక్కుకట్టేటట్లు చక్కగా వేయించి కందిపప్పు సుద్దపప్పుగా పచనంచేస్తే అది ముట్టుకొంటే పొడిపొడిగా అయ్యేటట్లు తయారవుతుంది. దానిని వేడి అన్నములో చక్కగా కలవటానికి చేరెడు అప్పుడేకాచిన నేయి వేసుకొని కలిపి భుజిస్తే అంత రుచి, తృప్తి, ఆహ్లాదము ఇంకొక పదార్థంవల్ల రాదేమో అనిపిస్తుంది. ఈవిధంగా ప్రాత కాలం గృహిణులు ముఖ్యంగా క్రొత్త అల్లుళ్ళకొరకు తయారు చేసేవారు. 1916 లో రామన్న వంటకు ముఖ్యంగా అల్యూమినియమ్ పాత్రలే ఉపయోగించేవాడు. అప్పటికే మార్పులు వచ్చాయి. పైగా మగవంటవాడు మట్టిపాత్రలను జాగ్రత్తగా

కాపాడలేదు. అదిగాక చేప, రొయ్య, మాంసం వండటంలో తెలగకులస్థుడైన రామన్నది చేయితిరిగినవంట. పైన చెప్పాను, బందరు గాజురొయ్యకు, పండుగప్ప, మేవ, మాగ వంటి సముద్ర చేపలకు చాలా ప్రసిద్ధిపొందిందని. రామన్న మత్స్య మాంసాదుల వంటలో గట్టివాడు. మాకు భోజనం తృప్తిగానే జరిగిపోయింది. చదువాయింటిలోని రెండు భాగాలలో నుండినవా రందరిలోను వెల్లంకి అక్కయ్యచౌదరి శ్రద్ధగా, ఏ జోక్యం లేకుండా చదివేవాడు. రెండోపక్షం వెనుకభాగంలో నుండే యలమంచిలి వెంకటసుబ్బయ్యగారు చదివేవారు. వారి తమ్ముడు వెంకయ్యగారి చదువు సామాన్యం. వెంకటసుబ్బయ్యగారు బి.ఎ. ప్యాసైనతర్వాత రెవెన్యూ డిపార్ట్మెంటులో జేరి, తహసిల్దార్ ఉద్యోగంవరకు చేశారు. డిప్యూటికలెక్టరు కాకముందే ఇంకా కొంత సర్వీసుండగానే చనిపోయారు. వెంకయ్యగారి అత్తవారు నాగపూర్ వాస్తవ్యులు. అక్కడికి వారువెళ్లి జీవితం గడిపారు. తరువాత వారిని చూచిన గుర్తులేదు. మా సువారంలోని ఆరుగురులో శ్రీ పర్వతనేని వెంకటరత్నం ఎక్కువ శ్రద్ధతోచదివేవాడు. నా షడ్డకుడు సత్యనారాయణ మధ్యలోవచ్చాడు. ఆయనగారదివరలో చిన్నతరగతులనుండి బందరులోని వల్లూరు జమీందారుగారి పెద్దమేడకు అవతలగాఉండే నరసింహులునాయుడుగారింట్లో వారి కుమారులతోబాటు ఉంటూ చదువుకొనేవాడు. ఏ కారణం వల్లనో, ఆ బసమార్చి మా వసతిలో ప్రవేశించాడు. నరసింహులు నాయుడుగారు బందరు పట్టణంలో కొంత పలుకుబడిగలవారు. వారికి పోలీసు ఉద్యోగస్థులతో స్నేహం ఎక్కువ. వారి కుమారుడు పల్చగా, పచ్చగా, నాజూకుగా, అందంగా, జులపాలతో నెమ్మదిగా నడచి కాలేజికి పోతూఉండేవారు. ఆ దృశ్యము నా కింకా జ్ఞాపకమున్నది. సత్యనారాయణ, తతిమ్మా మేము ముగ్గురం సామాన్యంగా చదివేవాళ్లం. సత్యనారాయణ కుండిన స్నేహితులలో శ్రీ పిళ్లారిశెట్టి పార్థసారథి, ఆయన తమ్ముడు శ్రీ చిన్ని బాడ్మింటన్ ఆటగాళ్లు. సత్యనారాయణ వాళ్లతో కలసి బాడ్మింటన్ ఆడుచుండేవాడు. శ్రీ పర్వతనేని వెంకట

రత్నం ఫుట్‌బాల్ ఆటలో దిట్ట. నేనుగాని, వెంకటకృష్ణయ్యగాని, శివప్రసాదరావుగాని, రామకృష్ణయ్యగాని ఆటలజోలికి పోయే వాళ్లంకాదు. మామూలు స్కూల్ డ్రిల్లులుకూడా చాలావరకు ఎగగొట్టేవాళ్లం. ఏమిచిత్రమోగాని ఎంత ప్రయత్నించినా నాకు సైకిల్ త్రొక్కటం, టెన్నిసు ఆడటం అలవడలేదు. దీనికి శరీర తత్త్వంకంటె మనస్తత్వం అడ్డువచ్చిందని నేను ఆక్స్‌ఫర్డులో ప్రయత్నించి వ్యర్థుడనైన తర్వాత కొంతకు గొంత గ్రహించాను.

ఈ మకాంలో జరిగిన చిన్న సంఘటన ఒకటి బాగా గుర్తులో నున్నది. అది మా ఇద్దరు తోడిఅల్లుళ్ళకు సంబంధించినదిమాత్రమే. కొంతకాలం గడచినతర్వాత గాని నా షడ్డకుడు మాలో చేరలేదు. అతడు, సత్యనారాయణ, నేను స్కూల్‌ఫైనల్ చదువుచుండగా, ఇంటర్‌సీనియర్ తప్పి తిరిగి చదువుచున్నాడనుకొందును. 1916 ఫిబ్రవరిలో చనిపోవక ముందు సత్యనారాయణ తండ్రి బుల్లిసుబ్బయ్యగారి సలహా ననుసరించి మా మామగారు, మా అత్తగారిపేర సర్వ ఆస్తిని విల్లువ్రాశారుకదా. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని సత్యనారాయణ తల్లి, నా కోడలిదే ఆస్తంతా, రెండో పిల్ల కేదో కొంత ముట్టజెప్పారని తన వద్దన్నదని నా పినతల్లి (తల్లి చెల్లెలు) నాకు చెప్పగా, నేను సత్యనారాయణను మేమందరం భోజనంచేస్తుండగా అడిగాను. అతనికి చిరాకు వేసి ఆ రోజున బందరులోనున్న తండ్రిగారిని అడిగాడు. తండ్రిగారు మా బసకువచ్చి నాతో అట్లా ఎందుకు జరుగుతుంది, తల్లి రెండో కూతురుకు అన్యాయం చేస్తుందా, నా భార్య తెలివితక్కువగా మాట్లాడి ఉంటుంది వగైరా చెప్పి సమాధానపరచారు.

మా క్లాసుటీచరు హెడ్‌మాస్టరు రాస్‌పిళ్లెగారు. నిత్యానందశాస్త్రిగారనే క్రైస్తవమతంపుచ్చుకొన్న వైదిక బ్రాహ్మణుడు చరిత్ర కధ్యాపకులు. కళ్యాణరామయ్యగారు, సాంబశివరావుగారు కూడా మా అధ్యాపకులుగా నుండినారు. లెక్కలకు మణిఅయ్యరు అనే వారుండేవారు. వారు పిన్న

వయస్కులు. నలుపురంగుగలవారైనను చక్కని ముఖవర్చస్సు కలిగియుండేవారు. ఓపికతో స్ఫుటంగా బోధించేవారు. వారు "మని" (డబ్బు) మాటను "మణి" అని ఉచ్చరించేవారు. మళయాళానికిచెందిన అరవ బ్రాహ్మణు లనుకుంటాను. కోరాడ నాగేశ్వరశాస్త్రిగారు, తరువాత మౌనీంద్రస్వాములవారి పీఠాన్నలంకరించి పేరు కీర్తులు సంపాదించుకొనిన కె. త్రివిక్రమ రామారావుగారు తెలుగుచెప్పేవారు. త్రివిక్రమరామారావు గారు కుశాగ్రబుద్ధి. తార్కికులు. విమర్శనాశక్తి ఎక్కువగా కల్గిన వారు. పారమార్థికదృష్టి గలవారు. వారేదిచెప్పినా, మాట్లాడినా మిగుల స్పష్టముగాను, చక్కగా విడదీసి సూటిగా, క్లుప్తముగా చెప్పేవారు. మితభాషిగా లెక్క. మెలికలు దిరిగిన దట్టమైన మీసములు, తీవియైన తలపాగ, నిండైన భారీవిగ్రహం, తేజస్సు గల ముఖం, నిశితమైన దృక్కులు. వారిని చూస్తే ప్రతి విద్యార్థికి పూజ్యత, భయం మెండుగా కలుగుచుండేవి. పైకి కటువుగాను, గాంభీర్యముగాను కన్పడ్డా, మిక్కిలి సున్నితమైన హృదయము గలవారు. సమయము వచ్చినప్పుడు ఆప్యాయత, కరుణ, సానుభూతి చూపగల శక్తిగలవారు. ఒకప్పుడు నేనున్నూ, నా చిరకాల మిత్రుడు శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారున్నూ వారింటికి వెళ్ళి అక్కడే భోజనముచేశాము. లక్ష్మీనారాయణగారప్పుడు తనకున్న సంసార సంబంధమైన బాధను వారికి విన్నవించి వారి సలహా తీసికొనవలెనని వెళ్లుచు, నన్నుకూడ వెంటబెట్టుకొని వెళ్ళారు. అప్పుడు శ్రీ త్రివిక్రమరామారావుగారు చూపిన ఆదరణ, సానుభూతి నన్ను ఆశ్చర్యవంతుని జేసినవి. క్లాసులో మాకు హడలు పుట్టిస్తూ, అంటీ అంటనట్లు, తనకు సంబంధము లేనట్లు పాఠములుచెప్పి వెళ్లిపోయే మాస్టరుగారేనా ఈ త్రివిక్రమరామారావుగారనిపించింది. వేషము, పోకడ, మాట తీరు రాజసమైనా, వారిమనస్సు సాత్వికము, ఆచరణ ధార్మికము, ఆధ్యాత్మికము. అందువల్లనే కొన్ని సంవత్సరాలతర్వాత, తిరునల్వేలిజిల్లా కుర్తాళంలో ప్రసిద్ధినొందిన సిద్ధేంద్రమఠం శ్రీ రాజరాజేశ్వరి పీఠం అధిపతులై దానిని మిక్కిలి జయప్రదంగా నిర్వర్తించారు. ఈ పీఠాన్ని తెలుగు వారొకరు స్థాపించారు.

వారు మౌనముద్రతో నుండేవారట. అందువల్ల వారిని మౌనస్వామనేవారు. శ్రీ విమలానందభారతి స్వామిగల్ అనే పేరుతో వ్యవహరించిన ఈ స్వాములవారిని చివరదశలో వారు విజయవాడలోవున్నప్పుడు చూడ నోచుకోనలేకపోతిని.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారితో నా పరిచయ మించుమించుగా పూజ్యమని పైన చెప్పియున్నాను. అయినా వారిని నా బందరు విద్యార్థిజీవితములో అనేకసార్లు చూడటం, సభావేదిక పైన వారి చతుర సంభాషణలు, సంగీతాలాపనలు, పద్య పఠనములు, ఉపన్యాసాలు తరచు విసే భాగ్యం కలిగింది. వారి అంతటి మనోహరమైన కంఠ స్వరం, దాని బంగారు జిలుగు, అసాధారణ నాణ్యం లోతు, వారు చదువు పద్ధతి ఇంకొకరిలో విన లేదు. శాస్త్రి గారి సభావేదికపోకడలు, అత్యుత్తమమైన నాట్య, నటన, సంగీతం వగైరా ప్రదర్శనలకంటె ఎంతో ఆకర్షణీయములుగా నుండేవి. వా రుపన్యసిస్తారని తెలిసిన ఏ విద్యార్థి, యువకుడు, పెద్ద, అచటకు వెళ్లకుండా ఉండలేకపోయేవాడు. పంచభక్ష్య పరమాన్నముకంటె ఎక్కుడుగా వారి ఉపన్యాసం రంజింపజేసేది.

ఆ సంవత్సరం (1916 - 17) చదువుకు మధ్యనే అంతరాయము కలిగినది. 1916 నవంబరులో కృష్ణకు వరదలు వచ్చినవి. అవి చూడవలెనని ఉబలాటపడి మే మైదారుగురం మా లాడ్జినుండి బైలుదేరి బెజవాడకు వెళ్లాము. అప్పటికే వరదలు తగ్గిపోవుటచేత తృప్తిలేక కొండపల్లి ఖిల్లా నైనా చూడాలని బైలుదేరాము. తెలికగానే కొండనెక్కాము. అక్కడ ఖిల్లా శిథిలావస్థలోనుండినను కొండ పైభాగము కొన్నిచోట్ల పెద్ద రచ్చబండలతో, చప్టావేసినట్లు విశాలముగా నుండి మిక్కిలి ఆకర్షణీయముగా నుండింది. పల్లముగానున్న ఒకచోట వర్షమునీరు నిలిచి ఒక చిన్న సరస్సుగా తయారైంది. బహుశా దానిని కొండచరియల జలముతో నింపి అప్పటి ఖిల్లా ప్రజలు వాడుకొని యుండవచ్చును. వర్షముకురిసియుండుట చేతను, మేము మధ్యాహ్నామునకుగాని కొండపైకి వెళ్ళి యుండకపోవుటచేతను ఆ ప్రదేశము నిర్మలముగాను, ప్రశాంతము

గాను, మనోహరముగాను, పచ్చని చెట్లతో, గుల్మములతో, లతలతో, శృంగారముగా నుండింది. మే మక్కడ కొన్నిగంటల కాలము గడపి యువ సహజమైన ఉత్తేజపూరితులమైతిమి. ఆనందపూరిత ఉద్రేకులమైతిమి. మా మనస్సులు పరి పరి విధముల నలుప్రక్కలకు పరుగెత్తసాగినవి. ఆ మైమరుపులో, మా కిక్కడ చదువు రుచించిందికాదు. పాశ్చాత్యదేశములలో చదువు సులభము, సౌఖ్యప్రదము, విజ్ఞానపూరితము, పైగా ప్రతిష్ఠాకరము. కాబట్టి వెంటనే అమెరికాకు (యు. యస్. ఎ.) చదువుకొనుటకు బయలుదేరవలె నని మాలో కొంతమంది నిశ్చయించుకొన్నాము. వసతికి తిరిగివచ్చినవెంటనే మూట ముల్లె గట్టి మా వంటవానిని యడ్లపల్లి రామన్నను మా వూరు బొమ్ములూరుకు ముందుగా పంపాము. సావకాశంగా ఆ సాయంత్రం బైలుదేరి చీకటిపడుచుండగా ఎవ రిండ్లకు వారు చేరుకున్నాము. నేను, మా పెదతండ్రి కొడుకు వెంకట కృష్ణయ్య మా బొమ్ములూరు చేరుకొనగా వెంకట కృష్ణయ్య మాట గుర్తు లేదుగాని, నా విషయమై మా తండ్రిగారు మిక్కిలి క్షోభించి గట్టి చీవాట్లుపెట్టారు. మేము ఊరుచేరగానే కనపడి మా పెద్దలు చాలా కోప్పడి "ఇంటికి రానీ, వాళ్ళ భరతం పట్టాం. వాళ్ళచేత గొడ్లను కాయిస్తా" మని పరవళ్లు ద్రొక్కినారని రామన్న చెప్పాడు. నేను మిక్కిలి భయపడి చాటు చాటుగా వుండి మొగము తప్పించ ప్రయత్నించినా మొగమువాచే చివాట్లు తప్పలేదు. కాని వయస్సువచ్చి అప్పటికే ఒక బిడ్డకు తండ్రి నైనందున కాబోలు మా తండ్రి చేయి మాత్రం చేసుకోలేదు. నాగభూషణం, వెంకట కృష్ణయ్యలు నాకంటె చిన్నవాళ్ళు. వాళ్ళ తండ్రి మా చిన్నతనంలోనే తన 37-వ ఏటనే చనిపోయాడు. వారు నాకు కూడ సరిగా గుర్తులేదు. ఆ ఇంటి వ్యవహారాలు వాళ్ల పెద మేనమామ (శ్రీ) దుగ్గిరాల బ్రహ్మయ్య గారు, వాళ్ల మూడో మేనమామ రామశాస్త్రులుగారు చూస్తూ ఉండేవారు. పెద్దాయన లెక్కా డొక్కా ఇంటివ్యవహారాలు చూస్తూ ఉంటే, మూడో ఆయన వ్యవసాయం చూస్తూ ఉండే

వాడు. మూడోవారు రామశాస్త్రులుకు, నాకంటె పెద్దదైన తోడబుట్టువు శేషారత్నమ్మ నిచ్చి మా వాళ్ళు ఆమె 7-వ ఏటనే పెండ్లిచేశారు. ఆమె తన 20-వ ఏట సంతానహీనంగా చనిపోయింది. మేనమామలు తండ్రిలేని మేనల్లుడు వెంకట కృష్ణయ్య తమకంటె ధనవంతుడైనందువల్లనేమో మా నాన్న గారివలె ధూం ధాం లు చేయలేదు. అయితే నే నా సంవత్సరానికి చదువు మానాను గాని వెంకట కృష్ణయ్య తిరిగి స్కూల్లో చేరి యుంటాడు. ఈ మధ్య తెలిసికొన్న సమాచారాన్నిబట్టి మేము వెళ్లిపోయినతర్వాత, ఆ విడిదిని శ్రీ హానుమోర అప్పయ్య, శ్రీ కాజ ఉమామహేశ్వరరావు వగైరా తీసుకొని ఆ యింటిలో చదువుసాగించారట. వంట రామన్నను తీసుకొనివెళ్ళిఉంటారు. ఈ విధంగా చదువుకు భంగం ఏర్పడి ఆ సంవత్సరం (1916-17) వృథా అయింది.

1916 అక్టోబరు రెండో తారీఖున నా ప్రథమ సంతానం, ఆడపిల్లపుట్టింది పెడసనగల్లులో. ఆ సమాచారం నే నింకా బందరులోనుండగానే తెలిసింది. ప్రసవించగానే తల్లికి చాలా జబ్బు చేసింది. మా తండ్రిగారు ఏ వైద్యుణ్ణో తీసుకొనివెళ్ళి చూచారు. క్రమేపి జబ్బు నెమ్మదించిందిగాని ఆ జ్వర తీవ్రతకు తలవెంట్రుకలు చాలాభాగం ఊడిపోయాయి. మనిషి రోతగా తయారైంది. ఈ విషయాలు బందరులో నుండిన నాకు తెలియవు. ఏ కబురు రాలేదు. ప్రసవమైనతర్వాత బందరులో నెలపైన ఉన్నాను. కాని ఆమెను, బిడ్డను అక్కడినుండి వెళ్ళి చూచినట్లు గుర్తులేదు. చూడలేదనే అనుకొంటున్నాను. నేను బందరు విడిచిపెట్టి బొమ్మలూరుకు చేరుకొన్న తర్వాత వెళ్ళినట్లు గుర్తు. మొదటి దఫా వెళ్ళినప్పుడు బిడ్డనుచూపించియుండ వచ్చునుగాని, తల్లి దర్శనం కాలేదు. మూడుమాసాలవరకు ఆరోగ్యం చక్కబడదని వగైరా చెప్పారు. తలవెంట్రుకలు ఊడిపోయినందున వికారముగా నున్నాననని తలంచి కాబోలు నా ఎదుటబడుటకు ఒప్పుకోక పోవచ్చును. చదువు, సంధ్య, సంస్కారం ఉన్న ఏ స్త్రీయైనా తనకు జబ్బుచేసి

నప్పుడు, భర్త సాన్నిధ్యం కోరుతుంది. కష్టసుఖాలు చెప్పుకోని అతని సానుభూతి, ఆప్యాయత కోరుతుంది. నా భార్యకు చదువు లేదు, సంస్కారం లేదు. పైగా పైనఉండి, హేళన చేసి నాకు దగ్గర కాకుండా ఎత్తులువేసే అక్క ఉండనేఉన్నది. సహజంగా బిడియం, మూర్ఖత ఆమెకుఉండనే ఉన్నవి. భర్త ఎంత హృదయావేదన పొందుతాడో అనే జ్ఞానం లేనందున, నాకప్పుడు దర్శనంకూడా ఆమె ఇవ్వలేదు. అప్పుడే అనుకొందును, నేను చాలా వ్యథపొంది, దుఃఖించి, ఉసూరుమంటూ బొమ్ములూరుకు తిరిగివచ్చి, ఒకవిధమైన వైరాగ్యంతో మంగలిని పిలిపించి బుర్ర నున్నగా గొరిగించుకొన్నాను. తర్వాత పెడసనగల్లు వెళ్లాననుకోండి, ఆమెను కలుసుకొన్నాననుకోండి. కాని ఆప్యాయత లేని కలయిక, మాధుర్యంలేని సాంగత్యం, అచ్చట ముచ్చట లేని మాటలు, చేష్టలు, ప్రీతితోలేని భోజన మజ్జనాదులు, ఆదరణలేని ఆ యింటి నివాసం ఏమంత ఇంపుగా ఉంటవి? ఎట్లాగో కాలం గడిచింది. ఏడోమాసంలో ననుకుంటాను, లాంఛనానికి తల్లి పిల్ల బొమ్ములూరు మా స్వగృహానికివచ్చారు. ఒక నెలరోజులుండి తిరిగి పెడసనగల్లు చేరుకొన్నారు. అప్పటికో లేక తర్వాతనో బిడ్డపేరు వజ్రాంబ అని పెట్టారు. నేను గాని నా తండ్రిగాని వెళ్లినట్లు గుర్తులేదు. వాళ్లే పెట్టి ఉండవచ్చును. దేహచ్ఛాయనుబట్టి తెల్లనైన వజ్రం కంటె, నల్లనైన నీలంపేరు బిడ్డకు సరిపోయేది.

డిశెంబరులో కోతలు, జనవరిలో నూర్పుడు. నేను నవంబరు మధ్యో, చివరో ఇంటికి చేరుకొన్నందున కోతలు వగైరాలకు పొలం పోవలసివచ్చింది. కుప్ప నూర్పుడులో పట్టిన ధాన్యం బస్తాలు ఎత్తుటకు నేను కూడా తోడుపడవలసివచ్చేది. ఆ రోజుల్లో వ్యవసాయంపనులు ఇప్పటివలె సులువుగా చేసేవారుకాదు. కట్టి వేతకు త్రాళ్లుపేని, తాడుతో కట్టిన మోపును కుప్పమీద ఊడదీసి పనలు పనలుగా, ఇప్పుడు పైభాగంలో వేసినట్లుగా మొదటినుండి పేర్చేవారు. ఇది ఎక్కువకాలం తీసుకొంటుంది. ఈ రోజుల్లో కోసిన వరిని ముడి వేసి, ముడి వేసిన దానితో కోసిన పనలను మోపుకట్టి, మోపులపాటినే ప్రోగు పెట్టుచున్నారు. అదివరకు

గుండ్రని కుప్పగా వేసేవారు. ఇప్పుడు చాలాభాగం వామిగా వేస్తారు. ఇట్లు వేయుటవలన వామి మధ్యభాగం త్రోవగా ఉపయోగించి మోపులను సులువుగా పైకి ఎత్తుకొనివెళ్ళి ప్రోగుమీద వేయవచ్చును. ఇదివరలోవలె నడుము ఎత్తు లేవగానే నిచ్చెన ఉపయోగించవలసిన అవసరంలేదు. కుప్పగా వేసినప్పటికైనా, ఈ రోజుల్లో మోపులుగానే అమర్చుచున్నారు గాని పూర్వంవలె మోపులు ఊడదీసిన పనలు పేర్చటంలేదు. కుప్పనూర్చుడు పూర్వం కుప్పచుట్టూ కల్లంచేసి, ధాన్యం పనలను క్రింద చుట్టూ వేసి గొడ్లతో త్రొక్కించేవారు. కుప్ప సాంతం అయినతర్వాత ధాన్యం ప్రోగుచేసి, ఒక్కసారే తూర్పేతపట్టి, ధాన్యం రాసిచేసి అప్పుడు ఇంటికి తోలుకొనే వారు. అందువలన నూర్చినదంతా ఒకరోజున గాలి తక్కువ వల్లనో, మరేకారణంచేతనైనా తూర్పేత పూర్తికాకపోతే శుభ్రపరచని రాసితోబాటు, తూర్పేతపట్టిన ధాన్యంరాసి మిగిలిపోయేది. వీటిని యజమాని స్వయంగా రాత్రి, పగలు కాపలాకాయవలసివచ్చేది. నూర్చిన ధాన్యం అంతా తూర్పేతపట్టినా ధాన్యం అంతా ఇంటికి చేరకపోతే ఎట్లూ యజమాని కాపలా తప్పేదికాదు. ఈ రోజుల్లో ధాన్యం నిలబెట్టి నూర్పటం చాలా తక్కువ. ధాన్యంపనలను బల్లమీద కొట్టి, ధాన్యంగింజలను రాలగొట్టి, దానిని తూర్పేతపట్టో, శుభ్రముగాఉంటే పట్టకో, ఏ రోజు కొట్టిన ధాన్యం ఆ రోజు ఇంటికి చేర్చుతారు. కొట్టిన పనను ఎప్పటికప్పుడు కల్లంమీదవేసి తిరుగుచున్న పశువులతో, ఆ వామి లేక కుప్ప అయిపోయేవరకు త్రొక్కించుదురు. దానిలో మిక్కిలి తక్కువధాన్యం ఉంటుంది గనుక యజమాని ప్రత్యేకించి రాత్రి కాపలాకాయవలసిన పనిలేదు. కుప్ప పూర్తిఅయినతర్వాత త్రొక్కించిన గడ్డి నుండితీసిన ధాన్యాన్ని పోతపోసి ఆ రోజు కొట్టిన ధాన్యంతో సహా ఇంటికి తీసుకొనిపోతారు. ఈ పద్ధతివలన పన మిగిలి పోతే నౌకరుని రాత్రి కాపలాపెట్టినా యజమాని కాపలా తప్పుతుంది, ధాన్యం దొంగిలిస్తారనేభయం తక్కువౌతుంది.

నేను 1953 ఉద్యోగవిరమణ తర్వాత పెదసనగల్లు వ్యవసాయం చూచుకొనుటకు వచ్చిన మొదటి సంవత్సరాలలో నూరుస్తున్న కుప్పకు రాత్రి కాపలా నౌకరుచేతనైనా అక్కరలేదని, ఎవరూ ఏదీ దొంగిలించరని నమ్మకంచెప్పారు. నిజానికి ఆ నమ్మకం సరియైనదే. తరువాత నూర్పుడు మొదలుపెట్టని కుప్పలకుకూడా కాపలా అవసరమైంది కాని మొదటి 4, 5 ఏళ్ళలో బొత్తిపెట్టిన కుప్పలుకూడా, చేతికందే కట్టిన మోపులున్నా భద్రంగానే ఉండేవి. ఇప్పుడు దొంగతనాలు పట్టపగలుకూడా జరుగుచున్నవి. నైతికజీవితం అంత హీనంగా తగ్గిపోయిందిప్పుడు. ఒక్కొక్కప్పుడు మా నాయన సాయంత్రం ఇంటికివెళ్ళి భోజనంచేసివచ్చేవరకు నేను కల్లంలో ఉండవలసివచ్చేది. మా నాన్నగా రవసరంమీద బైటవూరికి వెళ్ళగా, ఒకటి రెండుసార్లు నేను గడ్డికడియంలోదూరి పడుకోవలసివచ్చింది. త్రొక్కించిన పనను దులిపి తీసివేసి గడ్డిని వలయంగా పెడ్తారు. అందుకని దానిని కడియం అంటారు. అదొకవిధమైన అనుభవం. గడ్డి పడని క్రొత్తవాళ్లకు గడ్డిలోదూరి పడుకుంటే పైత్యించి దోకులు రావటం కద్దు. ధాన్యంనింపిన బస్తాలను సామాన్యంగా ఎత్తుకొనేవానితోసహా నాలుగుమూలలకాచి నలుగురు ఎత్తుతారు. అవసరమయినప్పుడు ముగ్గురుకూడా ఎత్తవచ్చును. మా నాన్నగారు పెద్ద బలశాలికాకపోయినా, సరిపడిన లావుతో 5 అ. 8 అంగుళాలకు తక్కువకాని ఎత్తుతో ఉండేవారు. వారొక ప్రక్క, నేను, నౌకరింకొక ప్రక్కనుండి ఎత్తేవాళ్లం. నా కంత కష్టం అనిపించేదికాదు. పూర్వం కడియాలగడ్డిని పెద్ద బొద్దులుగాకట్టి బండ్లమీద ఎక్కించేవారు. ఆ బొద్దులను 5, 6 గురైనా క్రిందనుంచి తోసుకొని పైకి గడ్డివామిమీద ఎక్కించేవారు. ఇది చాలా ప్రయాసతో కూడినపని. ఇప్పుడు చిన్న మోపులుకట్టి బండికి సామాన్యంగా 24 చొ.న వేసి, ఆ మోపులను సులువుగా వామిగా పేరుస్తున్నారు. ఇప్పుడిద్దరు బండి నింపుకొని ఇంటికి తోలుకొని వచ్చుటకు చాలును. ఆరంభంలో ఆ యిద్దరైనా వామివేయుటకు సరిపోతుంది. చివరవరకు ఆ యిద్దరే వామి తయారుచేయగలరు. కాని వామి ఎత్తు పెరుగు

చున్నకొలది, మోపులను నిచ్చెనమీదుగా పైకి మోసుకొని పోవుటకు 5, 6 గురుంటేగాని పనిసాగదు.

నా చిన్నతనంవరకు కమ్మరికంలో, కలిగినకుటుంబాల్లో మామూలుగా అప్పుడప్పుడు అత్తవారింటికి ఆడపిల్ల వెళ్లినా' ఒక రిద్దరు బిడ్డలుకల్గేవరకు కన్నవా రింటివద్దనేఉండి, తరువాత తలిదండ్రులిచ్చిన గృహోపకరణాలతో, మంచాలు, పెట్టెలు వగైరాతో స్థిరనివాసానికి ( కాపురానికి ) భర్తయింటికి వెళ్లేది. ఇప్పటివలె పెండ్లిలోనే శోభనం జరిగిన తరువాత వారం రోజులలోనే భర్తతో కాపురానికివెళ్ళటం ఉండేదికాదు. అందువలన కొంత, నా భార్య తన తొలిసంతానంతో కొద్ది రోజులుమాత్రమే మాయింట్లో ఉండింది. పైగా మా మామ గారు, బావమరది చనిపోవటం, తాను, తనఅక్క ఆస్తికి వారసులవటం మామూలుగా అత్తవారింటికి వచ్చిపోయే లాంఛనాలుకూడా చాలా అరుదైపోయాయి. పై నెపంతో అక్కచెల్లెల్లిద్దరు అత్తింటికాపురం ఎరుగరు. మరిన్ని మేము చదువుకొంటూ ఇంటివద్ద ఉండేవాళ్లముకాము. తర్వాత చదువు మానివేసిన షడ్డకుడు పెడసనగల్లులోనే మకాంపెట్టాడు. నే నింగ్లండుకు వెళ్ళాను. ఈ కారణాలవల్ల అక్కచెల్లెళ్లు తల్లితో బాటు పెడసనగల్లులోనే ఉండిపోయారు. క్రమేపి మా రెండు కుటుంబాలు బొమ్మలూరును విడిచిపెట్టి పెడసనగల్లులోనే స్థిరపడి పోయినవి.

## 1917 - 18 విద్యాసంవత్సరం

బందరులో చదువు విఘ్నమైంది. ఇక అక్కడ చదువ గూడదని, మద్రాసు క్రిస్టియన్ కాలేజి హైస్కూలులో చదువా లని ఉబలాటపడ్డాను. ఎవరి ప్రోత్సాహమో గుర్తులేదు. నా తోడల్లుడు సత్యనారాయణ, నా పినతల్లిభర్త శ్రీ దుగ్గిరాల రాఘువచంద్రయ్య కూడా ఆ సంవత్సరం మద్రాసులో చదవటానికి వెళ్ళారు. వారి ప్రోత్సాహమేమో, వెళ్ళినప్పుడు ఎక్కడ

దిగానో, ఆరంభంలో ఎక్కడెక్కడికి వెళ్ళానో, ఎవరెవరిని చూచి సాయమడిగానో జ్ఞాపకం లేదు. నేను కొంత ఆలస్యంగా మద్రాసు చేరుకొని ఉండవచ్చును. అక్కడి క్రిస్టియన్ కాలేజి హైస్కూలులో స్కూల్ ఫైనల్ లో సీటు లేదన్నారు. దేవుడా అంటూ ఇతర హైస్కూళ్లలో ప్రయత్నించవలసివచ్చింది. చిట్ట చివరకు మింటువీధిలోనున్న హిందూ థియలాజికల్ హైస్కూలులో ప్రవేశం దొరికింది. అక్కడ చదవటం ఆరంభించాను. నా ప్రత్యేకఅంశాలు (ఆప్షనల్ సబ్ జెక్ట్సు) చరిత్ర, తెలుగు. ఈ స్కూలు ఒక మేడలో ఉండేది. ఆ మేడకు ముందు కాంపౌండు లేదు. సరిగ్గా రోడ్డుమీద ఉండేది. రోడ్డునుండి సరాసరి మేడమెట్లు ఎక్కవలసివచ్చేది. ఎందువల్లనో ఆ హైస్కూల్ చదువు నాకు వంటబట్టలేదు. అచ్చటి ఉపాధ్యాయులు, ముఖ్యంగా చరిత్ర అధ్యాపకులు, నన్ను వట్టి చవట క్రింద జమకట్టారు. ఎట్లో అర్ధసంవత్సరం డిశెంబరు 1917 వరకు గడపి, తిరిగి బందరు నోబుల్ హైస్కూలుకు వచ్చేశాను.

అప్పుడు ఆర్మీనియన్ వీధిలో 61 నంబరు మేడను అద్దెకు తీసికొని, కమ్మహాస్టల్ అను పేరుతో వసతిగృహం ఏర్పాటైంది. దాని అజమాయిషి సంఘాభిమానంతో, ఉచితంగా శ్రీ పల్లెంపాటి రామకృష్ణయ్యగారు చేసేవారు. వారి బావమరది క్రిస్టియన్ కాలేజిలో బి. ఎ. ఆనర్సు చదువుచుండిన శ్రీ కాట్రగడ్డ శేషాచలంగారు అప్పుడప్పుడు అజ కనుగొనుచుండేవారు. ఆ హాస్టలులో నేను, సత్యనారాయణ, దుగ్గిరాల రాఘవచంద్రయ్య, వెనిగళ్ల హనుమంతరావు, దుగ్గిరాలగ్రామం జంపాల రామస్వామి, కోటయ్య, తర్వాత హైకోర్టుజడ్జి అయిన డి. ముని కన్నయ్య, శ్రీ రామకృష్ణయ్యగారి అన్నలు వెంకట్రామయ్య, లక్ష్మీనారాయణ గార్ల పుత్రులు రాజగోపాలం, గోపాలకృష్ణయ్య వగైరా 10, 15 మందివరకుండేవారం. భోజనం, పడక, చదువుకు అనుకూలమైన వసతిగృహం. ఒక్క కక్కుసుదొడ్డిమాత్రం చీదరగా ఉండేది. ఆ రోజుల్లో ఫ్లష్ అవుట్సు విరివిగా అమలులోనికి రాలేదు. ఒకటి రెండు దొడ్లు 10, 15 మంది ఉపయోగించటం వల్ల ఆలస్యంగా వెళ్లిన వాళ్లకు చీదరగా ఉండేవి. శ్రీ రామ

కృష్ణయ్యగారు మిక్కిలి శ్రద్ధతీసికొని, మాకు కావలసిన సదుపాయాలన్నియు ఏర్పాటుచేసి ఉదయం, సాయంత్రం రెండుపూటలూ వచ్చి అజ కనుక్కొనేవారు. నేను వసతిగృహాన్నుండి అనతి దూరంలోఉన్న మింటువీధికి నడచిపోతూ ఉండేవాడను. అప్పటి సంఘటనలు చాలావరకు ఇప్పుడు గుర్తులేదు. ఆర్మీనియన్ వీధి చివర మన్నడి అను వీధి ఉన్నదికదా, దాని కెగువను పగడాల వీధిఉన్నది. ఆ వీధిలో ప్రసిద్ధులైన గడ్డిపాటి వీరయ్యగారుండేవారు. వారి పెద్ద కుమార్తెను చల్లపల్లి కుమారరాజా శ్రీ అంకినీడు ప్రసాద్ బహద్దర్ గారు (ఇప్పటి రాజాగారి తండ్రి) మొదటి భార్య చనిపోగా, రెండో భార్యగా స్వీకరించారు. ఇంకొక కుమార్తెను శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారికిని, మూడో కుమార్తెను శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారికిచ్చి వివాహం చేశారు. వారి పెదతండ్రి కుమార్తె అనుకొందును, శ్రీమతి తాయారమ్మగారి కుమారుడే శ్రీ కాట్రగడ్డ శేషాచలం గారు. శ్రీ శేషాచలంగారి సోదరి జ్ఞానాంబగారు శ్రీ పల్లెంపాటి రామకృష్ణయ్యగారి భార్య. పల్లెంపాటి రామకృష్ణయ్యగారు నల్గురు సోదరులలో మూడవవారు. వీరి సోదరి శ్రీమతి వియ్యమ్మ గారు నా భార్య మూడో మేనమామ చెరుకూరి లక్ష్మీపతిగారి భార్య. పల్లెంపాటివారిది మొదటిలో కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా కాటూరు. వీరి తండ్రి పకీరయ్యగారు సికిందరాబాద్ వలసవెళ్లారు. అక్కడ కంటోన్ మెంటుకు (సైన్యస్థావరం) అవి ఇవి సరఫరాచేసే కంట్రాక్టులుచేయుచు, సమీపములోనున్న పికెట్ అనే కుగ్రామంలో కాపురంఉండేవారు. అక్కడ ఇళ్ళు కట్టుకొన్నారు. కొడుకులు శ్రీయుతులు వెంకట్రామయ్య, లక్ష్మీనారాయణ, రామకృష్ణయ్య, నరసయ్య గార్లు పెద్దవాళ్లైన తర్వాత ఆ యువకులుకూడా కంట్రాక్టుపనిలో తండ్రికి చేదోడు వాదోడుగా ఉండేవాళ్లు. కొంతకాలానికి చివరాయన నరసయ్య గారు కుటుంబంనుండి విడిపోయి భార్య కన్నవారింటికి చేరాడు. రామకృష్ణయ్యగారు కంట్రాక్టుపని వదలి, ఇన్సూరెన్సు వగైరా చూచుకొంటూ మద్రాసులోనే ఉండేవారు. తండ్రి గతించిన తర్వాత స్వంతకంట్రాక్టుపనులు చేసుకొనుచు పెద్దవా రిద్దరు

పికెట్‌లో మిగిలిపోయారు. వారిద్దరి కుమారులు అమెరికావెళ్లి చదువుకొన్నారు. పెద్దవారి కుమారుడు (శ్రీ) రాజగోపాలం బోదన పంచదారఫ్యాక్టరీలో పనిచేయుచు ఈ మధ్యనే చనిపోయాడు. రెండోవారి కుమారుడు (శ్రీ) గోపాలకృష్ణయ్య ప్రముఖ వ్యవసాయ శాస్త్రజ్ఞుడై నైజామ్ ప్రభుత్వంలో ఉన్నత వ్యవసాయాధికారిగ పనిచేస్తూ పిన్నవయస్సులోనే మరణించారు. కాట్రగడ్డ శేషాచలంగారు కూడా తల్లితోకలసి వారి స్వగృహం పగడాల వీథిలో నివసించేవారు. వారు బందరు కాపురస్థులు ఉన్నవ సుబ్బయ్యగారి రెండవ కుమార్తె స్ఫురద్రూపి, సౌందర్యవతిని వివాహంచేసికొన్నారు. వారి పుత్రుడు (శ్రీ)రామకృష్ణ మేధావి. పాశ్చాత్యదేశాల్లో చదువుకొనివచ్చి బొంబాయిలో కొంతకాలం ఉద్యోగంచేసి, ప్రస్తుతం హైదరాబాదులో విద్యుత్ సంబంధమైన వస్తువులను తయారుచేయుచున్నారు. ఆయనగారి సోదరి స్వర్ణ కుమారిని మధురజిల్లాలోని నయకారపట్టి జమీందారుగారి కుమారుడు (శ్రీ) దొరై పాండ్యగారికిచ్చి వివాహంచేశారు. ఇవి తరువాత జరిగినవి.

1914 సంవత్సరంలో ఆరంభమైన మొదటి ప్రపంచయుద్ధం 1917 సంవత్సరంలోకూడా కొనసాగుచుండింది. కాని యుద్ధ ఘర్షణ మాకు తగలలేదు. కాని ఒక సంగతి బాగా గుర్తున్నది. తర్వాతకాలంలో కాటూరు జమిందారై, కేంద్ర స్టేటు కౌన్సిల్ మెంబరై, మద్రాసు కాస్మాపాలిటన్ క్లబ్బులో తన ఆజాను బాహు వ్యక్తిత్వం వల్లను, జరీ ధోవతి, మోకాళ్ళవరకు జారే ఖరీదైన బారుకోటు, జరీ బుట్ట తలపాగ, జరీ పై పంచె, ప్రస్ఫుటమైన నిలువుబొట్టు, మంచి వెండి పొన్నుకర్రతో దర్జాగా పదిమందిని ఆకర్షిస్తూ, పదిమందిని పలుకరిస్తూ, పలుకరించబడుతూ హడా వుడిగా ఇక్కడనుండి అక్కడకు, అక్కడనుండి ఇక్కడకు సరదాగా తిరిగే శ్రీ యార్లగడ్డ రంగనాయకులుగారు ఆ రోజుల్లో సామాన్య దుస్తులతో, కోటు జరీదుస్తులు లేకుండా చిన్నతరగతి వర్తకునివలె ఉండేవారు. వారుకూడా పగడాలవీథిలోనే కాపురముండేవారు. అప్పుడప్పుడు వీథిఅరుగుమీదకూర్చుని పుగాకు ఈనెలుతీసి చుట్టలు చుట్టుకొనుచూ కనపడేవారు. బహుశా వారి కప్పుడు

పుగాకువ్యాపారంకూడా ఉన్నదనుకొంటాను. ఒకనాడు నేను చైనాబజారుగుండా వెళ్ళుచుండగా దారిలో గడ్డం బట్టలు మాసి, కోటులేకుండా తలగుడ్డలేకుండా వెళ్ళుచు కన్పడ్డారు. వారు పడవలతో ఎగుమతి దిగుమతి వ్యాపారం చేస్తూ ఉండేవారు. మొదటి ప్రపంచయుద్ధానికిముందు ఏ వ్యాపారంలోనో బాగా దెబ్బతిన్నారట. కాని యుద్ధములో విస్తారంగా సంపాదించారు. 1917 నాటికే వారు లక్షాధికారి అయియున్నారని వినియుండుటచేత వారి మాసిన దుస్తులను, అతి సామాన్యవేషాన్ని చూచి చకితుడ నయ్యాను. ఆ సంఘటన నాకు బాగా గుర్తుఉండటానికి కారణం, తర్వాత వారి యున్నతస్థితిని, దర్జాను, కాస్మాపాలిటన్ క్లబ్బులోని వారి ప్రాముఖ్యతను చూచుటవల్ల అయియుండవచ్చును. మొదటి ప్రపంచయుద్ధం పూర్తిఅయ్యేటప్పటికి వారు మిక్కిలి ధనవంతులైనారు. వారు మంచి వ్యవహారదక్షులైనా చాలాపెద్దమనిషి, నిజాయితీపరులు. కులాభిమానం, బంధుప్రీతి, స్నేహభావం ఎక్కువగా కలవారు. వ్యవహారదక్షుడేగాక గొప్ప జ్ఞాపకశక్తి కలవారు. నోటిలెక్కలలో అఖండుడు. ఎంత పెద్ద లెక్కఅయినా, క్లిష్టమైనదైనా మిక్కిలి సులువుగా విడదీసేవారు, పూర్తిచేసేవారు. కాని వ్రాతలో అంత దిట్టకాదు. ఒకప్పుడు వారు తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా ఉండేవారు. ఏదైనా కాగితం సంతకం చేయవలసివచ్చినప్పుడు గుమాస్తాను పొడుగు సంతకమా, పొట్టి సంతకమా అని అడిగేవారని వరసైన వారి బంధువులు చెప్పి నవ్వేవారు. లోకజ్ఞానం, ఇంగితజ్ఞానం గొప్పగా ఉన్నవారు కాబట్టి, కాగితాలు చదువకపోయినా సమర్థవంతంగా కార్యనిర్వహణ చేసేవారు. వ్యక్తిగతంగా నాయందు మిక్కిలి ఆదరణతో ఉండేవారు. నన్ను "మామా" అని పిలిచేవారు. నాకంటె చాలా పెద్దవారు కాబట్టి "అదేమిటండి, నేను మామా అని మిమ్ములను పిలవవలసియుండగా మీరే మామా అని నన్ను పిలుస్తా ?" రేమి అనేవాణ్ణి. ఇది నేనింగ్లండునుండి 1927 ఫిబ్రవరిలో తిరిగివచ్చిన తర్వాత. అప్పుడు నా పెద్దకుమార్తెకు పెండ్లియీడు వచ్చియుండినది. అందువలన ఆయన చమత్కారంగా " నన్ను

మామా అంటే నీకేమి లాభిస్తుంది. నిన్ను మామా అంటే నాకు లాభం కదా ?'' అని నవ్వేవారు.

ఆర్మీనియన్ వీధి కమ్మ వసతిగృహంలో జరిగిన ఒకటి రెండు సంఘటనలు గుర్తున్నవి. జంపాల గోపాలరావుగారనే వారు మా వసతిగృహానికి ఒక రాత్రి 8. 8-30 గంటలకు వచ్చారు. అప్పుడు మేము చదువుకోకుండా మాటలు చెప్పుకొంటూ కూర్చునిఉన్నాము. వారికి చాలాకోపంవచ్చి మమ్ములను గట్టిగా మందలించారు. ''మీరు దూరములోనున్న మీ గృహాలను, తలిదండ్రులను విడిచిపెట్టి వచ్చి బోలెడంత డబ్బు ఖర్చుపెట్టటం ఉబుసులాడుకొంటానికేనా, చదువకుండా కాలం వృథాచేయటానికేనా ?'' అని చాలా కోప్పడ్డారు. మేము కిక్కురు మనకుండా ఊరకుండిపోయాము. నవలారచయితగా పేరు తెచ్చుకొన్న దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు కూడా ఉన్నారు. పిన్నవయస్కులుగాని శ్రీమంతులు వెనిగళ్ల హనుమంతరావుగారు కూడా ఉన్నారు. 22 ఏళ్లకు మించిన వయస్సుగల, ఇంటర్ సీనియర్‌లో కొన్ని అంశాలు పూర్తిచేయటానికివచ్చిన నా షడ్డకుడు సత్యనారాయణ ఉన్నాడు. అప్పటికే గడ్డాలు, మీసాలు బాగావచ్చి ముదురు మనుష్యులవలె కన్పడే నావంటివారున్నారు. కాని గోపాలరావుగారికి వయస్సుగాని, ఇతరత్రా పేరుప్రతిష్ఠలు గాని అడ్డంరాలేదు. వారి దృష్ఠ, తోటి కమ్మ యువకులు సరిగా చదువుకొనుటలేదనే. వా రెందు కక్కడకు వచ్చారో, ఎక్కడనుండి వచ్చారో మాకు తెలియదు.

అకస్మాత్తుగా గాలిదుమారంవలె వచ్చి మా నెత్తిని ఇంత దుమ్ముపోసి చటుక్కున నిష్క్రమించారు. శ్రీ జంపాల గోపాలరావుగారిది తెనాలితాలూకా దుగ్గిరాల. మంచి గౌరవకుటుంబంలోనివారు. మిక్కిలి పట్టుదల, నిష్కర్ష, తదేకధ్యానం, నిజాయితీ గలవ్యక్తి. వారు చదువులో అనేక దండయాత్రలుచేసిన యోధుడు. మెట్రిక్యులేషన్ ఐదారుసారులుతప్పిన దిట్ట. ఇంటర్‌మీడియేట్‌లోకూడా శకాకముక్కలు తిన్నారు. అప్పుడు వారు బి. ఎ. ఆనర్సు లేక యమ్. ఎ. పూర్తిచేశారో లేదో గుర్తులేదు. వారు మద్రాసు క్రిస్టియన్ కాలేజిలో చదివి

నట్లు, వారి యభిమాన సబ్జెక్టు ఫిలాసఫి అయినట్లు బాగుగాగుర్తు. నిరంతరం తదేకధ్యానంతో చదివేవారు. వారి చదువుకు విరామం ఉండేదికాదు. ఎన్నిసార్లు తప్పినా సాధించాలను దీక్షతో ఇంకా ఎక్కువగా చదువుసాగించేవారు. అటువంటి దృఢసంకల్పులు, దీక్షాపరులు, తదేకధ్యానంకలవారు ఎందు కన్నిసార్లు తప్పేవారో మా కర్థమయ్యేదికాదు. కాని వారి భీష్మునివంటి దీక్ష, ద్రోణునివంటి దృఢసంకల్పం, భీమునివంటి దక్షత, యుధిష్ఠిరునివంటి గాంభీర్యము మా కాయనయందు భయభక్తులు ప్రేరేపించేవి. అందువల్లను ఆయన చివాట్లు, కఠినభాషణలు మమ్ములను కోపోద్రిక్తులను చేయలేదు. కిమ్మన కుండా ఉండునట్లు చేసినవి.

ఒక రోజు ఉదయం మా పెద్దత్త కుమారుడు, అప్పుడు మా అత్తవారింటి వ్యవహారాలు చూస్తున్నవారు, శ్రీ సూరపనేని వీరరాఘవయ్యగారు మా హాస్టలులో ప్రత్యక్షమయ్యారు. మా వ్యవహారమో లేక తన మేనమామలు చెరుకూరివారి వ్యవహారమో ఉండి మద్రాసుకు ఆ క్రిందటిరోజున వచ్చారట. భర్త్రయం దనురాగంగల నా వదినో, లేక మా అత్తగారో వెళ్లి చూచిరమ్మని చెప్పారట. ఆయనగారు మా యిరువురిని చూచి క్షేమ సమాచారం తెలిసికొని, చెరి యొకరికి 20 వెండిరూపాయలు మా చేతుల్లోబెట్టి చక్కా వెళ్ళిపోయారు. ఆ రోజుల్లో వెండి రూపాయలే చలామణి. రూపాయికాగితాలు లేవనుకొందును. సంపన్నగృహస్థులందరికి వెయ్యిరూపాయలు పట్టే వలవంటి చిన్న బెజ్జాలుకల నూలుసంచులుండేవి. ఆ సంచుల్లో రూపాయలు నింపి భుజానపెట్టుకొని తీసికొనివెళ్ళేవారు. మామూలుగా ఒక సంచికంటె ఎక్కువ భుజంమీద మోసుకొని వెళ్ళేవారుకాదు. ఆసామియే మోసుకొనివెళ్ళేవాడు. ఒకటి దాటితే నౌకరుచేత కావడిలో మోయించుకొనివెళ్ళేవారు. ఈ సందర్భంలో ఏలూరు తాలూకా పోతునూరులో జరిగినట్లు నాకు చెప్పిన విషయం జ్ఞాపకానికి వస్తున్నది. ఒక జమిందారు అప్పు అడిగాడట. మిక్కిలి ధనవంతుడైన ఆ ఊరు భూస్వామి

బండిమీద కొన్ని రూపాయలసంచులు వేసుకొని బైలుదేరాడట. వర్షంవల్ల రోడ్డు తెగి, పైగా వాగు పొంగి బండివెళ్ళుటకు వీలులేకపోయిందట. బండిని త్రిప్పుకొనివచ్చి ఆ డబ్బును ఇంటి లోకి చేర్చుకొన్నాడట. కాని ఆ డబ్బు ఆయనకు దక్కలేదు. భాగంకోరినవారితో తగాదావచ్చి, ఇద్దరు కోర్టుకెక్కి చాలా వరకు ఆ రొక్కాన్ని ఖర్చుపెట్టేశారట. ఆ రోజుల్లో వెండి రూపాయల చలామణీ, వానిని ఇంకొకచోటికి చేర్చుటెంత కష్టమో తెల్పుటకే ఈ ఉదంతంచెప్పాను. ఈరోజుల్లో ఒకటి మొదలుకొని వంద, వేయి రూపాయలవరకు కరెన్సీనోట్లే గాక బ్యాంకి చెక్కుల మూలంగా ఎంత డబ్బునైనా సులువుగా ఎంత దూరమైనా తీసికొనివెళ్ళవచ్చును. ఆ రోజుల్లో రూపాయ విలువ ఇప్పటికంటె ఏ పది పదిహేనురెట్లో ఉండేదికాబట్టి మా బావగారిచ్చిన రూ. 20-00 ల బహుమతి మా కంత చులకనగా తోచలేదు. పైగా అత్తవారింటిసొమ్ము ఎంత ముట్టినా ముట్టినట్లేకదా!

1917 లో పచ్చయ్యప్ప కళాశాల చైనా బజారు సాహుకారుపేటలో వెండి బంగారు దుకాణాలవైపు, పూల బజారు పోలీసుస్టేషనుకు అనతిదూరములో వీథిమీద కుండేది. ఇప్పటికిని ఆ బిల్డింగున్నది కాని దానిముందు రకరకాల వస్తువులనమ్మే దుకాణాలు వెలసినవి. చిన్నతరగతులకు మాత్రమే ఆ బిల్డింగును ఇప్పుడుపయోగించుచున్నారు. కళాశాలకు క్రొత్తభవంతులను పూనమల్లి హైరోడ్డులో అమింజికర్ సమీపాన విస్తృతమైన ఆవరణలో ప్రాతబిల్డింగుకు రెండున్నర మైళ్ళకుమించిన దూరములో కట్టారు. పచ్చికబయళ్ళతో, పూలచెట్లతో, ఆటలాడుకొను స్థలాలతో ప్రవర్ధమానంగా ఉన్నది. 1917 లో అక్కడొక హాస్టలుమాత్రము పూర్తి అయింది. కొలదిమంది విద్యార్థులు అప్పుడప్పుడే చేరుచుండి నారు. పూనమల్లి గ్రామానికిపోయే ఇప్పటి పూనమల్లి హైరోడ్డు ఆరోజుల్లో చెట్లతోను, పుట్లతోను, అక్కడక్కడ గుడిసెలతోను నిండి పల్లెటూరిరస్తాలాగా ఉండేది. అక్కడకు పోవాలంటే ఏదో దూరంలోఉన్న పల్లెటూరుకు పోయినట్లుండేది.

పూనమల్లికిపోయే బస్సులుండేవికాని ఇప్పటివలె 5, 10 నిమిషాలకుగాక ఏ గంటకో ఇంకా ఎక్కువ వ్యవధిలోనో ఉండేవి. పూర్తికాని హాస్టలులో నివసించే కొద్దిమంది విద్యార్థులకు టౌను అనగా చైనాబజారునకు రావాలంటే మిక్కిలి ఇబ్బందిగా ఉండేది. అమింజికరే ఇప్పటికిని వెనుకబడినభాగమే. లోపల యిప్పటికి కూడా పల్లెటూరి పరిస్థితులే. ఆ రోజుల్లో ముందు, వెనుక, లోపల అంతా పశువుల పేడతో, రొచ్చుతో, ఉంటవా ఊడతవా అనిపించే గుడిసెలతో, చిన్న పెంకుటిళ్ళతో ఉండేది. పాల నమ్ముకొని బ్రతికేవారి నివాసస్థానం అది. అమింజికర్ దాటితే ఇక 8 మైళ్ళదూరంలోనున్న పూనమల్లిగ్రామం చేరుకొనే వరకు ఇళ్ళే ఉండేవికావు.

చాలా దుకాణాలుండి మిక్కిలి జనసమ్మర్దంగల ఈవినింగ్ బజారు, రతన్‌బజారు, షాహుకారుపేట, చైనాబజారులలో ఉన్న కట్టడాలలో చెప్పుకోనేటంతమార్పు ఈ కాలానికికూడా రాలేదు. పెద్ద కట్టడాలు లేకపోయినా ఈవినింగ్ బజారు, రతన్ బజారు వర్తకరీత్యా పూర్వంలోకూడా ప్రాముఖ్యంగా ఉండేవని, ఆ రోజుల్లో సాయంత్రాలు తెల్లవారు ఆ బజారుగుండా షికారుకువెళ్ళుచుండుటచేతనే ఈవినింగ్ బజారని పేరు వచ్చిందని, మలేకాచువ్వతో రకరకాల కుర్చీలు, టేబుల్సు, మంచాలు వగైరా వస్తువులుచేసే ప్రదేశాన్ని రతన్‌బజారు అని పిలిచేవారని విన్నాను. నేనక్కడున్నప్పుడు (1917) చైనాబజార్ ఎక్కువ ప్రాముఖ్యంగా ఉండేది. షాహుకారుపేట, చైనాబజారు మధ్య సందులోఉన్న గోడౌన్‌స్ట్రీటు, బందరుస్ట్రీటు మిక్కిలి ప్రముఖపాత్రవహించివుండేవి. ఈ రెండువీథులలో టోకు వ్యాపారం హెచ్చు. బందరువీథికి, బందరు కలంకారీవర్తకులు అక్కడ వ్యాపారంచేస్తూ ఉండటంవల్ల ఆ పేరు వచ్చింది. టోకు వర్తకులు సామానులను నిల్వచేసుకొనేకొట్లు (గోడౌన్సు) ఉండటంవల్ల గోడౌన్‌వీథి అని దానికి పేరువచ్చింది.

ఆ రోజుల్లో ఆర్మీనియన్‌వీథి సర్వసామాన్యంగా ఉండేది. మధ్యరకం పాత ఇళ్లు. అన్నిటికంటె ఆ రోజుల్లో ఎక్కువగా నా మనస్సుకు తట్టింది మన్నారువీథి. ఇది క్రిక్కిరిసిన రకరకాల

దుకాణాలతో (మిఠాయి దుకాణాలు జాస్తిగా ఉండేవని గుర్తు) ఇరుకైన బాటతో, వచ్చేపోయే జనసమ్మర్దంతో, పారవేసిన ఆకులు అలములు వగైరాతో గలీజుగా ఉండేది. మురికిబట్టలు వేసుకొని చమురుకారుతూ ఉన్నట్లుండే మార్వాడీ మిఠాయి దుకాణదార్లు, నల్లని ముఖాలపైన పచ్చని పసుపు పూసుకొని తమలంవేయుటవలన గారపట్టిన వెకిలిపండ్లతో తిరిగే స్త్రీ జనం, పిర్రలు కనబడేటట్లు చిన్న పంచె ఎగగట్టుకొని చమటకారే కారునలుపు శరీరాలతో తోపుడుబండ్లను తోసుకొనిపోయే కూలిజనం, పాత అర్ధణాఅంత కుంకుమబొట్టు పెట్టుకొని పొగాకు ముక్కల తమలం నములుతూ తుపుక్కున ఊస్తూ, పండ్లు వగైరా గంపలు నెత్తినో, చంకనో పెట్టుకొని పెద్దగా అరుస్తూ అమ్ముకొనే స్త్రీలు, అడుగడున ప్రత్యక్షమై జగుప్స కలిగిస్తూ ఉండేవారు. ఆ దృశ్యం ఇప్పటికిని నా మనఃఫలకం నుండి చెరగిపోలేదు.

ఇక సముద్రం విషయం. నాకు ట్రిప్లికేను బీచి ఒకటే గుర్తు. అదికూడ ఆ రోజుల్లో అంచులేని చీరవలె బోసిగా ఉండేది. బస్సుసౌకర్యం ఉండేదికాదు. ఇప్పటివలె కాలినడకబాటలు, చెట్లు, పూలమొక్కలు, రేడియో మొదలైన వేడుకలు ఉండేవికావు. బస్సుసౌకర్యం లేనందున కార్లుఉండే ఏ కొద్ది మంది ఇతరప్రాంతాలవారు తప్ప, ట్రిప్లికేన్‌వాస్తవ్యులే దాని నుపయోగించుకొనేవారు. మైలాపూర్ కూడా ఒక కుగ్రామంవలె ఉండేది. ఇప్పటివలె దారిపొడుగునా మంచి భవంతులు, దుకాణాలు, సినిమాలు ఉండేవికావు. సినిమాలుకూడా చాలా తక్కువ. ఎలిఫింటన్ సినిమాహాలువంటి హాలులే కొద్దిగా ఉండేవి. అప్పటికి తెలుగు, అరవ సినిమాచిత్రాలు ఇంచు మించుగా లేవనేచెప్పాలి. మైలాపూరుకు వెళ్లాలంటె మధ్య మధ్య పెద్దపెద్ద ఖాళీలను దాటి పల్లెటూరు రోడ్డువెంట వెళ్లినట్లుండేది.

ఈ కాలంలోని ఇంకొకవిశేషం గుర్తున్నది. ఆంధ్ర రాష్ట్రంకొరకు ప్రయత్నాలలో ఖర్చులకొరకు చందాలు

వసూలుచేయుట యొకటి. దీపావళి, చందాలువసూలుచేయుట కనువైన కాలమని పెద్దలు తలంచారు. మద్రాసులో దీపావళి అధిక ప్రాధాన్యంకలది. అందువల్ల 1917 దీపావళికి మద్రాసులో చందాలువసూలుచేయటానికి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ కాతా శ్రీరామశాస్త్రి వగైరా పెద్దలు నావంటి విద్యార్థులను కొంతమందిని వెంటతీసుకొని వసూళ్లకు బైలుదేరారు. జార్జిటౌన్ ఆంధ్రుల పుట్ట. అయితే చాలావరకు చిల్లర వర్తకులు. అందువలన కొన్ని ముఖ్యప్రదేశాలలోతప్ప అక్కడ వసూళ్లు చేయలేదు.

రాయపురం వెళ్లాము. అక్కడ పెద్ద పెద్ద కలప అడితీలుండేవి. ఆ వర్తకులు చాలావరకు అరవలే. ఒక పెద్ద డిపో యజమానులు అయ్యంగారలు. అక్కడ అర్థించుట నాకు స్ఫుటంగా జ్ఞాపకమున్నది. ప్రొప్రైటర్లు అన్నదమ్ము లిద్దరు, ముగ్గురు. మేము ఉదయం 8½ గంటలకల్లా ఆ అడితీకిచేరుకొన్నాము. శ్రీ అయ్యదేవరవారు వారి నుద్దేశించి ఎందుకు ఆంధ్రరాష్ట్ర మవసరమో చెప్పసాగారు. "మన హిందూసంఘం వైవిధ్యం కలది. వివిధజాతులే కాకుండా వివిధభాషలున్నవి. వివిధప్రజలు యించుమించు విడగొట్టబడినట్లుండిన ప్రత్యేక దేశభాగాల్లో ఉన్నారు. అన్నిభాగాలు కలసి ఒక దేశమైనా అన్నిభాగాలు సమవృద్ధిలో లేవు. దేహంలో ఏ అవయవం పూర్ణవికాసంపొందకపోయినా దేహమంతటికి లోటే. కాబట్టి అన్ని అవయవాలు సమానంగా వృద్ధిపొందాలి. ఇవి వృద్ధిపొందాలంటే వాని కన్నిటికి సమాన పరిశ్రమ, శ్రద్ధ అవసరం. ఈ పరిశ్రమను, శ్రద్ధను అమలుపర్చుటకు ఏ భాషాసంఘానికి ఆ భాషాసంఘం తన పనులు తాను చేసికొనుటకు, తన విజ్ఞతను తాను పెంచుకొనుటకు, తన వ్యక్తిత్వాన్ని తాను వృద్ధిచేసికొనుటకు, తన సంస్కారాన్ని తాను తీర్చిదిద్దుకొనుటకు స్వతంత్రప్రతిపత్తి, స్వేచ్ఛ, అవకాశం కలిగిఉండాలి. వివిధ భాషలుగల ప్రజాకూటమిలో మిశ్రమవిజ్ఞత కొంత పెరగవచ్చును. కాని జాతిలోని వైవిధ్యం తరుగుతుంది. దాని వలన పలువిధరంగులుగల ఇంద్రధనుస్సువంటి మనజాతి

ప్రత్యేకత దెబ్బతింటుంది" అని నచ్చజెప్పటానికి శ్రమపడ్డారు. కొత్తా శ్రీరామశాస్త్రిగారు ఒక ఉపమానం చెప్పినట్లు బాగా గుర్తు. ఒకరాశిలో ఒకే రకమైన వస్తువులు పేర్చితే అవి మొదటిరకం వజ్రాలైనా, ఆ దృశ్యం తేజోవంతంగా ఉండినా, పలువిధములైన వస్తువులు పేర్చిన ప్రోగువలె అనగా వజ్రాలతో పాటు వైడూర్యాలు, పుష్యరాగాలు, మరకతాలు, మాణిక్యాలు కెంపులు, గోమేధికాలు, నీలాలు, గారుడపచ్చలు కలిపిన ప్రోగువలె వివిధరంగులతో ప్రకాశిస్తూ అతి మనోహరంగా ఉండదు. అందువలన దేశములోని నానావిధప్రజలు పూర్ణతేజస్కులై, ప్రతిభావంతులై వర్ధిల్లితేగాని మనదేశం తన సహజ వైవిధ్య, శేముషీ, సంస్కృతులతో ప్రజ్వరిల్లదు. వారింకొకవిషయం పదే పదే అరవదాతలకు నొక్కి చెప్పేవారు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలనటం అరవలమీద ద్వేషంవల్లకాదు. వారి ఔన్నత్యాన్ని కించపరుచుటకుకాదు. ఆంధ్రులనే అంగం దేశసౌభాగ్యంకొరకు తన పూర్తిరూపాన్ని, సత్తాన్ని పొందుట కొరకే. చెన్నపట్టణంలో ఆంధ్రులకంటె అరవలే సంఖ్యలోనేగాక చదువుసంధ్యలలోను, వ్యాపారరీత్యా, సంపత్తు విషయంలో మిక్కిలి అధికం. అందువల్ల నాలుగుడబ్బులు పోగుకావాలంటె వారి వదాన్యత అవసరం. ఈ విధంగా వారు చెప్పుకు పోయేవారు. శ్రీ కాళేశ్వరరావుగారు తెలుగువారిని యాచించినా, యాచించకపోయినా తప్పకుండా అరవప్రముఖులను యాచించారు. కొత్తా శ్రీరామశాస్త్రిగారు కాళేశ్వరరావు గారికి తగిన జంట. వారిద్దరు ఆంధ్రరాష్ట్రం కావాలని ఎందుకు కోరుచున్నది చక్కగా, విపులంగా చెప్పేవారు. వెళ్ళినచోట కొద్దిగనో, గొప్పగానో చందా వసూలు అయ్యేది. నేను పైన చెప్పిన అయ్యంగారు కలప వర్తకులు, చాలా సరసులు. అవసరాన్ని ప్రశ్నించినా, వారికి తోచినది డబ్బాలోవేసి మర్యాదగా సాగనంపారు. సంఖ్యాబలానికి, ముష్టిడబ్బాను జోరుగా కుదపటానికి విద్యార్థులు వంతులువారిగా వెళ్ళినట్లు గుర్తు.

ఆర్మీనియన్ వీథిలో మా ఎగువను రెండో ఇంటిలో రెడ్డి హాస్టలు పేరుతో రెడ్డివిద్యార్థు లుండేవారు. వారికి మాకు రాకపోకలుకాని, ఆంతర్యంగాని చెప్పుకోతగినంత దేమీ ఉండేవికావు. దాని కొక కారణం మా వసతిలోని విద్యార్థు లందరు సర్కార్ జిల్లాలవారు. రెడ్డి హాస్టలులోని విద్యార్థులందరు ఇంచుమించుగా దత్తమండలం జిల్లాలవారు. 1917 లో దత్త మండలాలు వెనుకబడినప్రాంతంక్రింద లెక్క. సర్కార్సుతో రాకపోకలు, సంబంధాలు చాలా తక్కువ. ఇప్పటివలె కులతత్వం విషమించలేదు. సర్కారు జిల్లాలలోని రెండు కులస్థులు అన్యోన్యంగా ఉండేవారు. కృష్ణా గుంటూరు జిల్లాలలో రెడ్లు తక్కువ. గోదావరి జిల్లాలో కూడ మొత్తంసంఖ్యలో రెడ్ల కంటె కమ్మవారే ఎక్కువ. ఒకకులం జనాభా ఎక్కువగానున్న గ్రామాల్లో రెండవ కులంవారిని తక్కువగా చూచినా మొత్తం మీద రెడ్డి, కమ్మ అనే కులతత్వం ప్రబలిఉండేదికాదు. నెల్లూరు జిల్లాలో రెడ్లు మిక్కిలి బలవంతులు. కమ్మకులస్థులు సంఖ్యలోనేగాక ఐశ్వర్యములో చాలా వెనుకబడిఉండేవారు. కాని కుల భేషజం, మే మెక్కువకులం అనే అహంభావ ముండేది కాదు. కాబట్టి రెడ్డి హాస్టలు విద్యార్థులకు కమ్మ హాస్టలు విద్యార్థులకు రాకపోకల సన్నిహిత్వం లేకపోవుటకు కారణం ఒకరి నొకరు ఎరిగియుండకపోవటం, భిన్నప్రాంతాలకుచెంది యుండటం వల్లనే.

నిజానికి దక్షిణాదిని నివసించే కమ్మవారికిని, సర్కార్సు లోని కమ్మవారికిని ఆ రోజుల్లో భాషలోను, ఆచారాల్లోను చాలా వ్యత్యాసం ఉండేది. ఒకప్పుడు ఏ కారణాన్ని పురస్క రించుకొనో దక్షిణాది అనగా మధుర, తిరునల్వేలి జిల్లాల కమ్మ నాయకులను కమ్మహాస్టలుకు ఆహ్వానించటం జరిగింది. ఆ వచ్చిన వారికి, విద్యార్థులకు సంభాషణ జరగటం అతికష్టమైపోయింది. వారి తెలుగుభాష వీరికి అర్థంకాలేదు. వీరి మాతృభాష వారికి అర్థంకాలేదు. ఇప్పటికిని తిరునల్వేలి కమ్మవారి తెలుగుభాష అధమం సగానికైనా అరవ సంకరం. ఒకపాలు భాష సంకరం, మిగిలినపాలు ఉచ్చారణ సంకరం. ఇప్పుడు రాకపోక లెక్కువై

కొన్ని సంబంధాలుకూడాజరిగి, పరిస్థితులు చాలా మెరుగైనవి. ఆ రోజుల్లో దక్షిణాపథం చివరలోనున్న తిరునల్వేలిజిల్లా సంగ తెందుకు, చివరకు చిత్తూరుజిల్లాతోకూడ సంబంధాలు ఇంచుమించుగా పూజ్యం. ఇప్పుడు చిత్తూరు అనంతపూరు వగైరాయేకాదు, దూరముగానున్న కోయంబత్తూరుజిల్లాతో గూడ సంబంధాలు తరుచు జరుగుచున్నవి. ఆ మాటకువస్తే ఈ మధ్యవరకు, కృష్ణాజిల్లా నడిబొడ్డువంటి గుడివాడకు పది పండ్రెండు మైళ్లలోనే ఉన్న ఉప్పుటేరు అవతలి పశ్చిమగోదావరిజిల్లా గ్రామాలతో కృష్ణాజిల్లావారికే సంబంధాలుండేవికావు. తణుకు ప్రక్క, ముదునేపల్లి ఇవతలివారికి నిషేధం. కొంత దక్షిణాది వాసనయున్న చిత్తూరుజిల్లా షోలింగర్ తాలూకావారితో, గుడివాడ తాలూకావారు మొదటి సంబంధం 1915 ప్రాంతంలో ఏర్పరచుకొన్నప్పుడు ప్రారంభమై సంబంధాలు అడపాదడపా కొనసాగుతూవస్తున్నవి. ఇప్పుడు వీలునుబట్టి చిత్తూరుజిల్లావంటి శుద్ధ తెలుగుప్రాంతాలలోని వారితోనేకాకుండా, తిరునల్వేలిజిల్లా వంటి అరవసంప్రదాయసిద్ధులతోకూడా ఇచ్చిపుచ్చుకోవటానికి సిద్ధంగాఉన్నారు.

1917 డిశెంబరులో మద్రాసులో జరిగిన మరొకవిషయం గుర్తున్నది. అది రెడ్డిహాస్టలులో జరిగింది, బహుశా దాని వార్షి కోత్సవం కాబోలు. జరిగిన సభకు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగా రధ్యక్షతవహించారు. కొలదిరోజులక్రితమే ఇంగ్లండునుండి తిరిగివచ్చిన శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు ఉపన్య సించారు. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, శ్రీ రామ స్వామిచౌదరిగారు డబ్లిన్‌లో బారిస్టర్‌చదువులో సహా ధ్యాయులు, మిత్రులు. వారిద్దరు విశిష్ట వ్యక్తులు, మేధావులు, పండితులు, సృజనాత్మకులు. కాని భిన్న భిన్న దృష్టికలవారు. పంతులుగారిది ఆధ్యాత్మిక దృష్టి, చౌదరిగారిది హేతువాద మానవతావాద దృష్టి. అయితే ఇద్దరూ ఆర్ద్రహృదయులు, బీదసాదలయందు కనికరముకలవారు. జాతీయభావం, దేశభక్తి, ప్రజాసేవాసక్తి కలవారు. ఒకరి పద్ధతి బోధ, రెండవవారిది సంస్కరణ. ఇద్దరు తేజోమూర్తులే. ఒకరిది నిమ్మపండు ఛాయ,

సుందరమైన కోలముఖం. రెండవవారిది చామనచాయ, విశాలమైన నెన్నుదురుతో గంభీరమైన గుండ్రని ముఖం. ఇద్దరు ప్రాముఖ్యమైన మీసాలు కలవారే. ఒకరు సన్నం, రెండోవారు లావు. పొడుగు ఇరువురు సమానమే. శ్రీ కడప కోటిరెడ్డిగారు హాజరైనట్లు గుర్తు. వారుకూడా అంతకుపూర్వం బారిస్టరు పట్టాను పొందియుండిరి. వారిని మొదటిసారి క్రిస్టియన్ కాలేజి హాలులో చూచాను. ఏదో సందర్భంగా అక్కడ పెద్ద సమావేశం జరిగింది. దానికి కాలేజి ప్రిన్సిపాల్ డా. స్కిన్నర్ అధ్యక్షత వహించారు. ప్రొఫెసరు కార్లైల్ వగైరా ప్రొఫెసర్లు, ఇతర అధ్యాపకులు, నగరంలోని పెద్దలు హాజరైనారు. మాట్లాడిన పెద్దలలో కోటిరెడ్డిగారొకరు. వా రప్పుడు సిల్కు-సూటులో ఉండినారు. మనిషి పొడగరి, సన్నం, పసుపుఛాయ దేహావర్ణం, దట్టమైన పొడుగు మీసాలు, ఆకర్షణీయమైన ముఖం. వారు ధారాళంగా, స్ఫుటంగా ఇంగ్లీషులో మాట్లాడారు. ఆ దృశ్యం నాకు మనస్సునకు పట్టి చెరగిపోలేదు. వారిని తరువాత చూచాను, కలసికొన్నాను కాని, వారు గుర్తుకువచ్చినప్పుడల్లా ఆ 1917 డిశెంబరులోచూచిన మూర్తే జ్ఞప్తికి వస్తూంటుంది.

క్రిస్‌మస్ సెలవులకు ఇంటికివచ్చి తరువాత పెడసనగల్లుకు వెళ్లాను. 1918 జనవరి 1-వ తారీఖున పెడసనగల్లులోనే ఉంటిని. ఆ ఉదయం లేవటంతోనే భగవంతు నీవిధముగా ప్రార్థించినట్లు దినచర్యలో వ్రాసుకొంటిని. "పడకనుండియే కొంచముసేపు మహాశక్తిస్వరూపుడగు భగవంతుని ప్రార్థించితిని. నిర్మలాంతఃకరణమును, తరుగని కార్యోత్సాహమును, ఎడతెగని కార్యదీక్షను, పరోపకారబుద్ధిని, దేశానురక్తిని ప్రసాదింపుమని ప్రకృతి మహాశక్తియే తానై యొప్పెడు దేవదేవుని వేడితిని." అక్కడ 3-వ తారీఖువరకు గడపి తరువాత బందరు, బొమ్మలూరు వెళ్ళి 6-వ తారీఖున మద్రాసుచేరుకొని అంతవరకు చదువుచున్న హిందూ థియలాజికల్ హైస్కూలు నుండి లీవింగు సర్టిఫికేట్ (ట్రాన్స్‌ఫర్ సర్టిఫికేటు) తీసుకొని, కమ్మహాస్టలులో కట్టవలసిన

డబ్బు కట్టి, 9-వ తారీఖు రాత్రి బైలుదేరి 10-వ తారీఖున బందరు చేరి, నోబుల్ కళాశాల హైస్కూల్ హెడ్‌మాస్టర్ రాస్‌పిల్లై గారిని కలసికొని స్కూలులో (స్కూలు పైనల్ క్లాసు) మధ్యాహ్నం 2 గంటలకు చేరాను. ఉండుటకు బచ్చుపేటలో రాజ ఈశ్వరుడు గారి (పసుమర్రు) గది ప్రక్కగదిని అద్దెకు తీసికొని, బచ్చుపేటదాటి రోడ్డుకవతల ఆనుకొనియున్న నరసమ్మ గారి ఇంటిలో నెల రుసుముకు భోజనం ఏర్పాటుచేసికొన్నాను. ఆ విధంగా నేను 1913లో ప్రారంభించిన బందరు చదువు మధ్య ఆగిపోయినా, తిరిగి కొనసాగింది.

నేను మద్రాసు విడిచిపెట్టేముందు నా ప్రియమిత్రుడు పాణ్యాం కృష్ణమూర్తిని కలసికొన్నాను. (6-వ తారీఖున అతనిని గూడూరు రైల్వేస్టేషన్ లో చూచి, మేమిద్దరము కలసి మద్రాసుకు ప్రయాణం చేశాము) నాయందు సదభిప్రాయంలేని ఇంగ్లీషు, హిస్టరీ టీచర్లు నేను స్కూలు విడిచిపెట్టుచున్నందుకు నిష్ఠురంగా మాట్లాడారు. హెడ్‌మాస్టరుగారుకూడా సుముఖులుగా లేరు. నేను శ్రీ రాఘవచంద్రయ్యగారి సాయంతో అర్థించి, ఎట్లో స్కూల్ లీవింగ్ సర్టిఫికేట్‌ను పొందగలిగాను.

నా వ్రేలువిడిచిన మేనమామ శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు రప్పటికి బందరులో బారిస్టరు ప్రాక్టీసు పెట్టారు. మూడవ నాల్గవ ఫారాల్లో మా క్లాసు టీచరు, మాకు ట్యూషన్ చెప్పినవారు శ్రీ చోడవరపు జగన్నాధరావుగారు మా హైస్కూలు టీచరుగా బందరులోనే ఉన్నారు. వారిరువురను అప్పుడప్పుడు వారింటికి వెళ్లి కలుసుకొనేవాడిని. శ్రీ రామస్వామిచౌదరిగారు సహజంగా ముభావంగా (రిజర్వుడ్) ఉండే స్వభావంకలవారు. క్రొత్తవారితో మాట్లాడటం మిక్కిలి తక్కువ. ఇంటికి వచ్చిన బంధువులనుకూడా ఆప్యాయంగా పలకరించి మర్యాదచేసే పద్ధతి స్వల్పం. చివరకు క్లయింట్సునుకూడా చప్పున పలకరించటం, ప్రశ్నించటం అరుదు. గుమాస్తాచెప్పగా విని ఏదో టూకీగా సలహాచెప్పటం వారి పద్ధతి. కోర్టుకుకూడా అంత శ్రద్ధగా వెళ్లేవారు కాదు. కేసేదైనాఉంటే వెళ్లి నాలుగు ముక్కలుచెప్పి చప్పున

ఇంటికి వచ్చివేయటమే వారి పద్ధతి. పని ఉన్నా లేకపోయినా అదొక అలవాటుగా ప్రతిరోజు కోర్టుకు వెళ్లటం, బార్‌రూములో ఇతర న్యాయవాదులను కలసికోవటం పూజ్యం. ఇంటివద్దకూడ చేతనున్న కేసులవిషయమై లా పుస్తకాలు చూచేవారుగాని తీర్పిచ్చిన కేసులు, డైజెస్టులు, లా రిపోర్ట్సు వగైరా మామూలుగా చదివే ఆసక్తి ఉండేదికాదని అనుకొంటిని. అవకాశమున్నప్పుడల్లా సారస్వతపు పుస్తకాలు, ధర్మశాస్త్రాలు, పురాణాలు వగైరా చదవటమో, ఏదైన వ్రాయటమో వారి నిత్య దినచర్య. అందువల్ల కక్షిదారులు రావటం, ప్రాక్టీసు వృద్ధిపొందటం జరుగలేదు. వారు గ్రంథరచనలోనేకాకుండా సంఘసంస్కరణలో మిక్కిలి శ్రద్ధతీసుకొని స్వసంఘపౌరోహిత్యం ప్రచారంచేసేవారు. విశ్వబ్రాహ్మణకులంలో జన్మించి, వేదాలు, ఉపనిషత్తులు వగైరాలో పండితులై సన్యసించి, సంఘ సంస్కరణలో మిక్కిలి ఆసక్తిచూపుచు, శూద్రులనబడే కమ్మ వగైరా కులాలవారికి జంధ్యాలు ధరించేహక్కు, కర్మచేయించేహక్కున్నదని చాటుచు, స్వసంఘపౌరోహిత్యాన్ని ప్రోత్సహించిన శ్రీ బాలసరస్వతీ స్వాములవారిమద్దతు రామస్వామిచౌదరిగారికుండేది. చౌదరిగారు స్వయంగా కొన్ని వివాహాలుజరిపారు. వారి ప్రోత్సాహంవల్లనే మావంటి యువకులు కర్మకాండల్లో వారి పేరుకు చివర 'దాస' శబ్ద వాడకాన్ని తీసివేయించి ఏ తోకలేకుండానో లేక వర్మ అనో లేక చౌదరి అనో మార్పుతెప్పించటం మొదలు పెట్టాము. మా తల్లిగారి తద్దినానికి మా పురోహితుడు దాస అనే మాట విడిచిపెట్టితేనే ఆ కర్మచేస్తాను లేకపోతే చేయను అని భీష్మించుకూర్చుంటే, మా నాన్నగారుకూడా మందలించినా వినకపోతే, తప్పనిసరికి వచ్చే డబ్బు, బియ్యం వగైరా పోతాయను భీతిచే పురోహితుడు వీరభద్రయ్య దాసానాం కు బదులు వీరభద్రయ్యనామ్నాం అని కర్మ పూర్తిచేయవలసివచ్చింది. ఈ సంఘసంస్కరణావేశం వారికి చివరవరకుండినది. కొంతకాలానికి వివాహంజరుపు విధికూడా సవ్యంగాలేదని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణపద్ధతిని మంత్ర తంత్రములు జరిపే స్వకుల పురోహితులుగాని, వధూవరులకు తెలియని సంస్కృతభాషలో వివాహం

జరపటం అనౌచిత్యమని తలంచి, తెలుగుమాటలతో "వివాహ విధి" ని వ్రాసి, తాము జరిపిన పెళ్లిళ్లలో దానిప్రకారం కార్యక్రమం నడిపేవారు. బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని, అహంభావత్వాన్ని, బ్రాహ్మణేతరులను తక్కువగాచూచే అలవాటును మార్చాలని స్వకుల పౌరోహిత్యం ప్రోత్సహించారు. అయితే స్వకులపురోహితులు అచ్చంగా వైదికబ్రాహ్మణులవలె వేష భాషలలో తయారై, తమ నడవడితో ప్రత్యేక వ్యక్తులుగా తయారైనారు. ఆరంభంలో ఉత్సాహంగాఉన్నా, చాలా మందికి వీరు ఇంకొక క్రొత్త కమ్మకులంగా తయారైనారనిపించేది. ఈ పరిణామానికి శ్రీ రామస్వామిచౌదరిగారు నిరుత్సాహపడి ఉందురు. అందువల్లనే తెలుగులో వివాహ విధిని జరిపించటం మొదలుపెట్టారు. అప్పుడు పురోహితులుగా తయారైనవారి చేతనేగాక ఏ కులపెద్దతోనో తంతుజరిపించటానికి అవకాశంకల్గింది. బ్రాహ్మణులు సంస్కృతభాషలో పూర్వపద్ధతిని వివాహం జరుపుట కొప్పుకొనేవారుగాని తెలుగులో, అందులో ముఖ్యంగా రామస్వామిచౌదరిగారి రచనాధోరణిలో జరుపుట కెంతమాత్రం ఒప్పుకొనేవారుకాదు. ఇప్పటికిని ఒప్పుకోరు. కాని స్వకుల పౌరోహిత్యానికి అభ్యంతరంచెప్పని నావంటివారికి కూడా తెలుగులో చెప్పితే చప్పచప్పగా, శోభావిహీనంగా, వివాహచర్య కానట్లు తోస్తుంది.

ఈ రోజుల్లో మంత్ర తంత్రాలమీద శ్రద్ధ తగ్గి, వివాహచర్య చాలావరకు కుదించబడి, తద్దినాలు మానివేయబడి, సంభావనలు తగ్గిపోయి, బహుమతులు స్వల్పమై, విశేషించి గౌరవ మర్యాదలు జారిపోయినందున పౌరోహిత్యంచేసే బ్రాహ్మణులు తమ పిల్లలకు వంశపారంపర్యంగావచ్చిన కులవృత్తిని మాన్పించి ఇంగ్లీషో, హిందీయో, తెలుగో చదివించి స్కూలు టీచరుగానో, గుమాస్తాగానో లేక చిన్న దుకాణదారునిగానో తయారుచేయుచున్నారు. సంభావనకు బ్రాహ్మణులు రావటం చాలా తగ్గిపోయారు. ఇదివరకు సంపన్నగృహస్థుల పెండ్లికి వందలకొలది బ్రాహ్మణులు వచ్చేవారు. వారిని ఒక దొడ్లోపెట్టి మనిషి 1కి రూపాయో, అర్ధో, పావలో సంభావన ఇచ్చి బైటకు పంపేవారు. దీనిని

'దొడ్డి సంభావన' అనేవారు. పేరుబడ్డ శాస్త్రజ్ఞులకు, పండితులు వంటి వారికి ప్రత్యేక బహుమతులిచ్చి పూజలు జరిపేవారు. ప్రత్యేకించి బ్రాహ్మణ సమారాధన అనగా భోజనాలు ఏర్పాటు చేసేవారు. ఇప్పుడు వచ్చిన ఏ కొద్దిమంది బ్రాహ్మణ స్నేహితులో ఇతరులతో సహపంక్తిభోజనం చేస్తారు. లేక స్వయంపాకం చేసుకొంటారు.

స్వసంఘపౌరోహిత్యం రామస్వామిచౌదరిగారు ఇంగ్లండు నుండి తిరిగి రాకపూర్వమే ఆరంభమైందనుకొంటాను. సరస్వతీ స్వాములవారు అంతకుముందే తెనాలిప్రాంతానికివచ్చి తెనాలి తాలూకా కొల్లూరులోని కొంతమంది కమ్మయువకులకు సంస్కృతం, మతగ్రంథాలు పాఠంచెప్పి, వివాహ, శ్రాద్ధ వగైరా కర్మ కాండలలో తరిఫీ దిచ్చారు. కమ్మయువకులేగాక రెడ్డి యువకులను గూడ తయారుచేసినట్లున్నది. 1917 వేసవిలో శ్రీ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు ఏలూరులో జరిపిన వారి వదినె కుమార్తె వివాహానికి కోవెలమూడి గోపాలకృష్ణయ్య, మాగంటి సీతయ్య గార్లతో నేను వెళ్లాను. అప్పుడు వివాహవిధి జరిపింది ఒక కమ్మ, ఒక రెడ్డి. అదే మొదటిదో, లేక ప్రథమంలో జరిగిన వానిలో ఒకటో నాకు తెలియదు. శ్రీ రెడ్డినాయుడుగారు కాపులు (తెలగ) కాబట్టి వారికి కమ్మ, రెడ్డి స్వకులస్థులుకాదు గాని, మద్రాసులో పుట్టి పెరిగిన బ్రాహ్మణేతరోద్యమం ప్రభావంగా వెలమ, రెడ్డి, కమ్మ, కాపు కులస్థులు సమాన ఫాయగలవారని, ఒకే కులంక్రింద ఎంచవచ్చును అనే భావం ఆ రోజుల్లో గట్టిగా ఉండేది.

రామస్వామిచౌదరిగారు తెనాలికివెళ్లి అక్కడ బారిస్టరుగా బోర్డుకట్టినారేగాని చెప్పుకోతగ్గంత ప్రాక్టీసుఉండేదికాదు. క్రమేపి తెనాలి మ్యునిసిపల్ వ్యవహారాలలో జోక్యంకల్గించుకొని, ఆ మ్యునిసిపాలిటీకి అధ్యక్షులై చాలా సంవత్సరాలుండినారు. 'సూతాశ్రమం' అని తమ స్వంత నివాసగృహానికి పేరుపెట్టి, 'సూతపురాణం' అనే ఉద్గ్రంథాన్ని, భగవద్గీత అనే వ్యంగ్య కావ్యాన్ని, సూతాశ్రమ గీతాలను, కురుక్షేత్రసంగ్రామము

శంబుకవధ, ఖూనీ వగైరా నాటకాలను; కుప్పుసామి శతకం, ధూర్త మానవ శతకాలను వ్రాసి 1943 జనవరి 16-వ తారీఖున దేహయాత్ర చాలించారు.

శ్రీ చోడవరపు జగన్నాథరావుగారు బ్రహ్మసమాజం మెంబరుగా ఉండేవారు. బందరులో బ్రహ్మసమాజం చెప్పుకో తగినంత సభ్యులతో ప్రముఖంగా ఉండేది. కొంతకాలం బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు బందరు నోబుల్ కళాశాలలో అధ్యాపకులుగా, ప్రిన్సిపాల్‌గా నున్నప్పుడు వారివల్ల స్థాపించ బడిందో లేక వృద్ధిపొందించబడిందో నాకు తెలియదుగాని, అది విద్యావంతులను ఆకర్షించింది. జగన్నాథరావుగా రందులో సభ్యులే గాక, ఆ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టినవారు. పైన వారు విధవావివాహం చేసికొన్నారని వ్రాశాను. వారి భార్య సౌందర్యవతియేగాక సుగుణవతి, సౌజన్య శీల, ధర్మపత్ని, సహచారిణి. ప్రేమనిచ్చి భర్త ఆదరణను, ఆప్యాయతను, గౌరవమును పొందిన గృహిణి. ఆమె కిద్దరు కొడుకులు, ఒక కుమార్తె. శ్రీ జగన్నాథరావు మా మూడు నాలుగు ఫారాలకు క్లాసు టీచరేగాక, మూడవ ఫారంలో మాకు ప్రత్యేకంగా చదువు (ట్యూషన్) చెప్పినవారు. కాబట్టి వారియందు, వారి కుటుంబమునందు గౌరవంతోపాటు, చనువు ఏర్పడింది. ఆ చనువువలన వారింటికి తరుచు వెళ్లటం, ఏవైన వస్తువులు, పుస్తకాలు వారింట్లోపెట్టి తరువాత తీసికొనివెళ్లటం చేస్తూ ఉండేవాడను. నేను చిన్నవాడనైనా వారి భార్యగారు నాకు బహు అరుదుగా కనపడేవారు. మాట్లాడటం చాలా తక్కువ. జగన్నాథరావుగారు లేని సమయంలో వారి పిల్లలద్వారా కబురు చెప్పటం, తెలిసికోవటం. వయస్సుకు పెద్దవారు, అప్పటికి ముగ్గురు పిల్లల తల్లి, పైగా గురుపత్ని, అయినా, నాతో ముఖాముఖిని మాట్లాడటం ఇంచుమించుగా లేదనే చెప్పాలి. కారణం బహుశా ఆమె బాల విధవగాఉండి పునర్వివాహం చేసికోవటం కావచ్చును. ఈరోజుల్లో పరిస్థితులు మారినా, ఆ రోజుల్లో అనగా 60 సంవత్స రాలనాడు విధవా వివాహం గొప్పతప్పుగా ఎంచబడేది. లజ్జాకరవిషయంగా ఉండేది. మగవిధవలు ఎప్పటికిని పూజ

నీయులే! ఆడ విధవలు గర్హింపబడేవారు. మగవాడు రెండో వివాహం చేసికొంటే మామూలు ధర్మం. భార్య ఉండగా ఇంకొకరినో, ఇద్దరినో చేసికొంటే దక్షిణ నాయకత్వం. భార్య చనిపోగా మూడో భార్యనో, నాల్గో భార్యనో కట్టుకుంటే గృహ ధర్మం. ఇల్లు గడవక, పురుషుడు విధవతో సాంగత్యం చేసినా పెండ్లాడినా సంఘ మర్యాద నతిక్రమించినట్లు. మరిన్ని విధవస్త్రీ తిరిగి పెండ్లిచేసికొంటే స్త్రీజాతినే హీనపరచినదిగా భావించ బడుచుండేది. అందువలన బ్రాహ్మణస్త్రీలకు సహజంగా ఇతరులతో మాట్లాడే చొరవ, ముఖ్యంగా బ్రాహ్మణేతరులతోను, పిన్నలతోను సంభాషించి పనులు బతాయించే చొరవ, నిర్భీకత, బ్రాహ్మణస్త్రీలైనను తిరిగి వివాహంచేసికొన్న విధవలు చూపలే కుండేవారేమో అని తలంతును. అందులోను అభిమానవతి, లోకంపోకడ ఎరిగిన సచ్ఛీల కాబట్టి, మా గురువు జగన్నాధరావు గారి పత్ని ముఖాముఖిని మాట్లాడటానికి సందేహించేవారు.

1913 లో మేము థర్డు ఫారంలో ప్రవేశించినప్పటికి వారి రెండో అబ్బాయి పుట్టాడో లేదో జ్ఞాపకంలేదు. ఆడపిల్ల సరసవాణికి 7, 8 ఏండ్లుండవచ్చును. ఆబిడ్డకొరకు ఒకసారి మాత్రం మా గురుపత్ని, జరీ అంచు పరికిణి గుడ్డలు బజారులో దొరుకుతవేమో తెలిసికొమ్మని నాకు ప్రక్కనుండి చెప్పారు. రెండు మూడు రోజుల తర్వాత దానినిగురించి అడుగగా, ఇంకా బజారుకు వెళ్ళలేదని సమాధానం చెప్పాను. తిరిగి అశ్రద్ధచేసి, కొన్ని రోజులైన తర్వాత వారితో తెస్తానని చెప్పగా, నిర్లక్ష్యం చేశానని కాబోలు అవసరంలేదని జవాబు వచ్చింది. అప్పుడు నా మనస్సెలా అయిందో ఇప్పుడు గుర్తులేదు. కాని ఇప్పుడు చాలా సిగ్గుపడుచున్నాను. లేక లేక ఎప్పుడో ఒకప్పుడు ఆమె నోరుతెరచి చెప్పితే ఆమాత్రం చిన్నపని చేయకపోతినే అని బాధపడుచున్నాను. నాకు తోస్తుందేమిటంటే సిరి సంపద లుండినా, ఆ రోజుల్లోని పల్లెటూరి కుర్రవాళ్ళకు సున్నితం, గురువులయెడల జరుపవలసిన మర్యాదలు సరిగా తెలియవని,

రైతుల మగు మాకు పాడిపంటలు పుష్కలంగావున్నా గురువని నెయ్యి, అపరాలు (బియ్యం మా టటుంచి) తీసికొనివెళ్ళి ఇచ్చిన పాపాన పోలేదు. ఈ రోజుల్లో వచ్చిన గురువులకు విద్యార్థులు బహుమతులివ్వటం విశేషం కాదు. కాలేజిలో పదిమందిలో నొకరై, మామూలు అధ్యాపకుడుగా నున్నవారి వద్ద చనువుండదు, ప్రత్యేకాభిమాన ముండదు. కాని చోడవరపు జగన్నాథరావుగారివంటి చిన్నతనంలో చదువు చెప్పిన గురువుకు ప్రైవేట్ ట్యూషనుకూడా చెప్పినవారికి, వా రింటికి తరుచు వెళ్తూ, వారి యింటివద్ద సామానులు వగైరా పెట్టుకొనే చనువున్న విద్యార్థి ఆమాత్రం చిన్నపని చేసిపెట్టకపోవటం అవివేక మనిపించుచున్నది.

నేను 1918 జనవరిలో తిరిగి నోబుల్ హైస్కూల్లో స్కూల్ ఫైనల్ క్లాసు చదువుట కారంభించానని పైన చెప్పి నానుకదా. చదువుకంటె ఆవూరు ఈవూరు వెళ్ళిరావటం, బందరులో స్నేహితులతో ఇష్టాగోష్ఠి జరపటం, నిద్రపోవటం, జాస్తిగా చేసేవాణ్ణి. బందరులో సెకండు గ్రేడ్ ప్లీడరయినా, ఉన్నవ సుబ్బయ్యగా రనేవారు కొంత ప్రాక్టీసు కల్గి నాలుగు డబ్బులు సంపాదించేవారు. వారు జుల్పాలతో, కోటు, తలపాగతో, మీసకట్టుతో, ముఖవర్చస్సు కలిగి సాత్విక మూర్తిగా ఉండేవారు. వారి ఇద్దరు కుమారులు రామయ్య, కృష్ణయ్యలు తర్వాత 'లా' చదివి న్యాయశాస్త్ర పట్టభద్రులైనారు. వా రిద్దరు కుమార్తెలలో రెండో ఆమెను మద్రాసు గడ్డిపాటి వీరయ్యగారి అన్నకూతురు బిడ్డ కాట్రగడ్డ శేషాచలం గారికిచ్చి వివాహం చేశారని శ్రీ శేషాచలంగారు మద్రాసు కమ్మ హాస్టలు మానేజ్ మెంటులో పాల్గొనేవారని పైన చెప్పాను. ఆ పరిచయాన్ని పురస్కరించుకొని శేషాచలంగారు అత్తవా రింటికి వచ్చినప్పుడు నేను వెళ్ళి చూడటం, వారి సలహాలు తీసికోవటం చేస్తూ ఉండేవాడను. సమవయస్కులు, తెనాలి, రేపల్లె కమ్మవిద్యార్థులు గోగినేని గోపాలరావు, గోగినేని రామనాథం, గోగినేని రంగనాయకులు అనే వారితో కాలక్షేపం

చేసేవాడను. వా రప్పుడు మా వసతికి దగ్గరగా బచ్చుపేటలో ఉండేవారు. గోపాలరావుగారు భారీ మనిషి. ఒడ్డు పొడుగుతో బలంగా వున్నా సాత్వీక స్వభావం, మంచితనం జాస్తిగా కలవారు. కాని చదువులో మందం. రామనాథంగారు బక్కపలచన, మధ్యరకం ఎత్తు. పాఠాలు చదువుటలో అశ్రద్ధ చేసినా మిక్కిలి చురుకైన బుర్ర, హుషారైన స్వభావం కల్గియుండినారు. రంగనాయకులుగారు పొట్టి, దృఢకాయులు. వారు మిక్కిలి కష్టపడి చదివేవారు. కాలాన్ని వృథాచేయటం, అటూ ఇటూ తిరగటం గిట్టేదికాదు. అందువలన పైవారికంటె మితభాషిగా ఉండేవారు. ఈ ముగ్గురు న్యాయవాదులై బల్లకట్టినా, రంగనాయకులుగారు ఎక్కువ ప్రాక్టీసును పొంది, పేరుప్రతిష్ఠలలో ఇప్పటికిని తెనాలి ప్రముఖులలో నొకరుగా నున్నారు. వీరుగాక, చిల్లరమల్లర పరిచయులుగాక, గుడివాడ తాలూకా పసుమర్రు గ్రామ కాపురస్థులు కాజ వెంకట్రామయ్య, ఈశ్వరుడు అనే అన్నదమ్ముల బిడ్డలు స్నేహితులైనారు. అందులో ఈశ్వరుడు మిక్కిలి సన్నిహితుడై, నా స్కూల్‌ఫైనల్ చివరిదశలో మేము కలసిమెలసి ఉండేవారము. ఆయనకూడా స్కూల్‌ఫైనల్ హిందూ హైస్కూలులో చదువుచుండేవాడు. పైగా వారిగది ప్రక్కనే నేను గదిని అద్దెకు తీసకొనిఉండటంవల్ల తరచు కలసికోవటం, ఏవో కబుర్లు చెప్పుకోవటం, చీట్లపేక ఆడుకోవటం, షికార్లకు వెళ్లటంలో మా కాలం చాలావరకు గడపేవాళ్లం. అదివరకే వారి నెరిగి యున్నందువల్ల నేను మద్రాసునుండి తిరిగివచ్చిన మొదటిరోజుల్లో ఆయన గదిలోనే మకాంపెట్టాను. ఆరోజుల్లో పసుమర్రు కాపురస్థులు కాజరంగయ్య అనేవారు తాము చదువుకొన్నది కొద్ది అయినా విద్యార్జనయందు, విద్యార్థులయందు విపరీతమైన అభిమానంతో ఉండేవారు. వా రప్పుడప్పుడు తనవంశస్థుడైన ఈశ్వరుడు గదికి వచ్చుటవలన వారితో నాకు పరిచయమై అది క్రమేపి స్నేహంగా మారింది. వయస్సులో తేడాఉన్నా ఆయన చదివినదానికంటె ఎక్కువ తరగతిచదువుచున్నందువల్లనో, అప్పటికే నాకు పెద్దమీసాలు పెరిగి

వయస్సుకంటె ముదురుగా కన్పడటంచేతనో నడవడి, సంభాషణ తీరులో సమవయస్కులవలెనే వర్తించేవారం. అయితే ఆయన మా క్షేమంకోరి మాకు సహాయంచేయటానికి సంసిద్ధుడుగా నుండినందున వారియందు పెద్దన్నగారియందుండే పూజ్యభావం ఉండేది. కాక పసుమర్రు వాస్తవ్యులు, అన్నదమ్ములు దావులూరి నాగయ్య, సూర్యప్రకాశరావుగార్లు అంగలూరులోని మా పినతాతకుమారుడు లింగం వెంకట సుబ్బయ్యగారి దగ్గర బంధువులైన దుగ్గిరాల అమరయ్యగారి ద్వారా నాకు బంధువులు. వారిలో సూర్యప్రకాశరావుగారు ఎక్కువస్నేహంతో ఉండేవారు. ఈ దావులూరివారు కాజవారికి దగ్గరబంధువులు. అందువలన కాజ ఈశ్వరుడే గాక కాజ రంగయ్యగారు కూడా నాకు సన్నిహితులైనారు.

కాజ ఈశ్వరుడుగారి తండ్రి అన్నదమ్ములు ముగ్గురు. వీరిలో పెద పిచ్చయ్యగారనేవారు వ్యవహారదక్షుడు, కమ్మకుల మర్యాదలు, ఆచారవ్యవహారాలు బాగుగా తెలిసినవారు. అయితే కమ్మసంఘాచారం, మేనకోడల్ని వివాహమాడటం వారికి నచ్చేదికాదు. వారు పెద్ద తలపాగ, కోటు లేక చొక్కా, మెడనుండి జారవిడిచిన పై ఉత్తరీయం, పొన్నుకర్రతో ఠీవిగా ఉండేవారు. మంచి మాటకారి. ముగ్గురన్నదమ్ములు మంచివారు, బంధుప్రీతి కలవారు. వారిలో ఈశ్వరుడు తండ్రిగారు బుల్లి పిచ్చయ్యగారనిగుర్తు, చాలా అమాయకులు. పసుపు శరీర ఛాయతో, కపటంలేని నవ్వుతో, భారీ విగ్రహంతో, శుద్ధమైన పల్లెటూరి రైతుగా, పెద్దమనిషిగా చూచినవారికి వెంటనే తోచేవారు. ఆప్యాయతతో ఆహ్వానించేవారు.

నాకు, రంగయ్యగారి ద్వారా పసుమర్రులో కొందరు స్నేహితులైనారు. వారిలో మందలపు పూర్ణయ్యగారొకరు. పూర్ణయ్యగారు ఎరుపు శరీరంతో, బొద్దు మీసాలతో, ఠీవిగల ముఖముతో, శుభ్రమైన వస్త్రధారణతో దర్జాగా ఉండేవారు. చురుకైన బుర్ర, నచ్చజెప్పే మాటల ధోరణి. కాని అంటీ అంటని తత్వమేమో అనిపించే స్వభావం. అయితే ఆర్ద్రత, స్నేహశీలత తోణకాడుచుండేవి. వీరందరి స్నేహరీత్యా ఈశ్వరుడుగారితో

మరింత సన్నిహితత్వం కల్గింది. చదువెట్లున్నా రోజులు సంతోషంగా గడిస్తే చాలుననే భావంవల్ల కాబోలు నేను తరచు పసుమర్రు వెళ్లుచుండేవాడను. ఈ తిరుగుళ్లుకాక మా స్వగ్రామం బొమ్ములూరుకు, మేనమామల ఊరు అంగలూరుకు ఎక్కువగానే వెళ్లుచుండేవాడను. మా బంధుత్వం చాలా పెద్దది. మా లింగం కుటుంబమే కాక మా నాయనమ్మ ముగ్గురు అప్పచెల్లెళ్ల కుటుంబాలు పెద్దవి. మా ప్రపితామహుడు పాపినీడుగారికి ఏడుగురు కూతుళ్లు. మా తల్లిగారి జనక కుటుంబం త్రిపురనేనివారిది పెద్ద కుటుంబమే. మా తండ్రి మొదటి భార్యది పెయ్యేరుగ్రామం. ఆమెను కన్న దుక్కిపాటివారి కుటుంబంకూడా పెద్దది. ఈ విస్తారమైన బంధుత్వంవల్ల నేను బొమ్ములూరు వెళ్లుటకు నూజెళ్ల స్టేషనులో దిగినప్పుడో, పసుమర్రు వెళ్లుటకు కౌతరం స్టేషనులో దిగినప్పుడో ఎవరో ఒక బంధువు కన్పడేవాడు. వారిలో గుడివాడ తాలూకా అన్నవరం గ్రామ కాపురస్థులు మా పిన తాత కుమారుడు నాగభూషణంగారి పినతల్లి కుమారులు కొత్తూరి శ్రీరాములు, సుబ్బయ్యగార్లుండేవారు. శ్రీరాములుగారు స్ఫురద్రూపి, లావు పొడవు గలవారు. వ్యవహారదక్షుడు. నేర్పుగా, అనునయంగా మాట్లాడే స్వభావం కలవారు. నాగభూషణంగారు మా పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి కుమాళ్లు వీరభద్రయ్య సోదరులు క్రయంచేసిన, అంగలూరు సరిహద్దులో నూజెళ్ల స్టేషన్‌కు సమీపంగా ఉండిన, రైస్ మిల్లును మానేజ్‌మెంటు బాధ్యత వహించి ఉండేవారు. వారి తమ్ముడు సుబ్బయ్యగారు పెయ్యేరులో ఒక చక్కని చుక్కని వివాహమాడి అత్తవారికి మగసంతతి లేనందున ఇల్లరకం ఉండేవారు. కౌతరం సమీపములోనున్న డోకిపర్రు నివాసులు వీరమాచనేని బ్రహ్మయ్యగారి కుమార్తె శ్రీమతి రుక్మిణమ్మగారిని, పినతండ్రి నాగభూషణంగారు ద్వితీయం చేసికొన్నారు. డోకిపర్రువారు రైలెక్కుటకు కౌతరం రైల్వే స్టేషనుకు రావలసిందే. సర్వసాధారణంగా బొమ్ములూరు వారు కూడా రైలుప్రయాణం నూజెళ్ల స్టేషను నుండే చేసేవారు. మేనమామలు, ఇతర దగ్గర బంధువులున్న అంగలూరు నూజెళ్ల స్టేషనుకు సమీపం. పైగా నూజెళ్లలో కూడా దగ్గరబంధువు

లున్నారు. ఈ కారణాలవల్ల బంధువులు, మిత్రులు, ఎరిగియున్న ఇతరులు నూజెళ్ళ, కొతరం రైల్వే స్టేషన్లలో తగిలేవారు. అంగలూరులో బంధువులతో బాటు స్నేహితు లుండేవారు. వారిలో ముఖ్యులు కంచర్ల బసవకోటి లింగంగారు, తర్వాత చంద్రశేఖరం గారు. వీ రిద్దరు జంగం కులస్థులు. బసవ కోటి లింగంగారు ఆంధ్ర సాహిత్యంలో దిట్ట, మరిన్ని కవి. సంస్కృతంకూడా కొంతవరకు చదివినారు. వారు కాకలు తీరిన పండితులని చెప్పవలనుకాదు గాని ఉభయభాషాప్రవీణులు. మహాకవి కాకపోయినా, కావ్యాలు వ్రాయకపోయినా, చక్కగా కవిత్వ మల్ల శక్తిగలవారు. చంద్ర శేఖరంగారు ఇంగ్లీషు ఏ ఐదవ ఫారం వరకో చదివి మానివేశారు. సారస్వతంలో చెప్పుకోవలసిన ప్రవేశంగాని, అభిరుచిగాని ఉన్న వారు కాదు. అయితే విషయజ్ఞానం కొంతవరకు కలిగియుండి స్నేహపూరితులుగా ఉండేవారు.

బసవ కోటి లింగంగారు ఒకవిధంగా నాకు గురువులు. వారు పాఠం అంటూ చెప్పకపోయినా, వారి శిష్యునిగా నేను వారివద్ద అభ్యసించకపోయినా, తరచు మేము కలసికోవటం వల్లను, సాహిత్య చర్చల వల్లను, వారి పద్యపఠనల వల్లను, ప్రబోధం వల్లను, నా సారస్వతాభిమానం, అభిరుచి పెరిగింది. ఎప్పటికిని నేను గట్టిగా ఒక గురువువద్ద తెలుగు చదువుకున్న వాణ్ణి కాదు. నేను హైస్కూలులో నేర్చుకొన్న కొద్ది తెలుగు వ్యాకరణం ఎప్పుడో మరచిపోయాను. నిజానికి ఇంగ్లీషు వ్యాకరణంకూడా అంతే. ఛందస్సు ఆనాటికి ఈనాటికి నాకు తెలియదు. ఒకప్పుడు కొన్ని ముఖ్య ఛంద సూత్రాలు వ్రాసు కొన్నానుగాని వాని నాచరణలో పెట్టలేదు. అయినా తెలుగులోకూడా కొంత డొక్కశుద్ధి అయింది అని చెప్పుకోటానికి అవకాశం, ప్రోత్సాహం కల్గించిన ముఖ్యులలో శ్రీ బసవ కోటి లింగంగారి స్థానం హెచ్చు.

అష్టావధాని, ఆంధ్ర గీర్వాణాలలో సరిపడ్డ పాండిత్యం కలవారు, శుద్ధమైన, సరళమైన, కొంత తీపిగల కవిత్వం చెప్పేవారు శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు నా పినతల్లి భర్త. కుశాగ్రబుద్ధి, ఆంధ్ర గీర్వాణాలలో పండితుడు, మహా

మధురంగా ద్రాక్షాపాకాన కవిత్వం విజృంభణంగా చెప్పేవారు. సారస్వతంలో శాశ్వతంగా నిలిచిపోయే సూతపురాణం వంటి మహాకావ్యాలను రచించినవారు, శతావధాని, సిసలైన కవిరాజు, బారిస్టరు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు ప్రేలువిడిచిన మేనమామ. బందరులో నేను చదువుకుంటూ ఉన్నప్పుడు అనన్య సామాన్య కవితావేశపరులు, అమృతాన్ని కురిసే లలిత కవిత్వ సంపన్నులు, బహుళగ్రంథకర్త, నారదుడో, తుంబురుడో స్వర్గమునుండి దిగివచ్చినట్లు కవితాగానం చేసేవారు, అప్రతిహత శతావధానులు, కింకవీంద్ర ఘుంటా పంచాననులు, అశేష శేముషీ ధురంధరులైన శిష్యకోటి కలవారు, సామాన్య సారస్వతాభిమానులందరకు ప్రచ్ఛన్నగురువులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఆంధ్ర సాహిత్య సామ్రాజ్యాన్ని అప్రతిహతంగా ఏలుచు బందరులో ఉండిరికదా. ఇక నాకు భాషాభిమానం పెరుగుటలోను, నేను కూడా సారస్వతాన్ని కొంతకు గొంతమైన గడించాలని ఉబలాటపడటంలోను వింత ఏమున్నది!

మా లింగంవారిలో చదువు సంధ్యలు తక్కువ. మా పెదతండ్రి రామశేషయ్యగారు కొంత తెలుగు, సంస్కృతం చదువుకొని సామాన్యంగా పురాణాదులు చదువుకొని, వాని కర్థం చెప్పే శక్తి గలిగి, శుభాశుభ కార్యాల్లో చదివే మంత్రాలలో తప్పులుంటే చప్పున సరిదిద్దే జ్ఞానం కలిగినవారైనా, నావంటి కొద్దిమంది ఇంగ్లీషు విద్య నభ్యసించినా మొత్తంమీద మా కుటుంబం విద్వత్తుగల కుటుంబంలో లెక్కకాదు. దానికి ప్రతిగా, నా మేనమామలు త్రిపురనేని కుటుంబంలో పై జెప్పిన రామస్వామి చౌదరిగారే కాక, వారన్నదమ్ము లైదుగురిలో ఒక్కరు తప్ప తతిమ్మావారు ఆంధ్ర సంస్కృతాలను చదివినవారే. రామస్వామి చౌదరిగారి రెండో అన్న నరసయ్యగారు మంచి పండితులు. కాని కవిత్వం అలవాటుగా చెప్పినట్లు గుర్తులేదు. అయితే వారి పెద్ద అన్న గోపాలకృష్ణయ్యగారు, నాలుగో అన్న సుబ్రహ్మణ్యంగారు చక్కగా, లలితంగా కవిత్వం చెప్పేవారు. అందులో గోపాల కృష్ణయ్యగాగు పేరెన్నిక గన్నవారు. వారి నప్పటి మద్రాసు ప్రభుత్వం శాలువా వగైరా పండిత పారితోషికం ఇచ్చి సత్క-

రించింది. ఆ త్రిపురనేని రక్తం నాలో ఉండబట్టి కాబోలు అంత ఆంధ్రసారస్వతాభిమానం నాకుండటం.

అంగలూరులో "బాలసరస్వతి గ్రంథాలయం" అనే పేరుతో నా చిన్నతనంలోనే ఒక గ్రంథాలయాన్ని ఏర్పరచి, కొంతకాలానికి దానికి విశాలమైన స్థలములో స్వంతగృహం నిర్మించి వృద్ధిచేశారు, ఉత్సాహవంతులైన యువకులు కొందరు. ఆరెకపూడి రామశాస్త్రులుగారు, బౌద్ధవాఙ్మయబ్రహ్మ అనే బిరుదును పొందిన దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి అన్న వెంకట సుబ్బయ్యగారు, ఆరెకపూడి మల్లయ్యగారు వగైరా కార్యోత్సాహులు, దుగ్గిరాల పూర్ణయ్యగారివంటి మధ్యవయస్కులు దానిని పెంచి పెద్దది చేశారు. ఈ గ్రంథాలయం గుడివాడ సీమలో మొట్టమొదట ఆరంభించిన కొద్ది గ్రంథాలయాలలో నొకటి. అన్నిటికంటె మిన్న అయినది. దీని ప్రభావం కూడా నామీద పడింది, నన్ను ఆసక్తిపరునిగా చేసింది.

నేను బొమ్మలూరు వెళ్లినప్పుడు పెదతండ్రి రామశేషయ్యగారిని కలసికొనటం, వారితో సంభాషించటం ఉండేది. వారి పెద తల్లి పెదబాపమ్మగారి ప్రథమపుత్రుడు లావు బాపయ్యగారు నిజంగా ఆజానుబాహువు. బంగినపల్లి మామిడిపండువంటి దేహచ్ఛాయ. 6 అడుగులను మించిన ఎత్తు. ఎత్తుకు తగిన లావు. సోగదేలిన కోలముఖంతో, అచ్చమైన కమ్మపెద్దగా చూడటంతోనే తోచేవారు. వారు చొక్కా వేసుకొనేవారు కాదు. బొడ్డుక్రింద ఆరంభించి చీలమండలకు అథమం 4 అంగుళాలైనా పైన ముగిసే ధోవతి కట్టుతో, పెద్ద తెల్లనైన జరీ తలగుడ్డతో, మెడనుండి రెండువైపుల జారవిడిచిన తెల్లరంగు జరీపైపంచెతో వెండిబిళ్లల మొలత్రాడుతో, ఎడమ ముంజేతి బంగారు కంకణంతో, వెండిపొన్ను చేతికర్రతో, పెండ్లి మొదలైన శుభకార్యాలలో ఎదురొమ్ముకు చేతులకు పూసుకొన్న మంచి గంధంతో, సిసలైన కమ్మకులపెద్దగా, గ్రామపెత్తందారుగా కన్పడేవారు. వారు పెళ్లిళ్లకు పేరంటాలకే గాక చూచిపోవటాని కప్పుడప్పుడు బొమ్మలూరుకు వస్తూ ఉండేవారు. వీ రిద్దరు పెద్దలైనా,

పూజ్యులైనా వారితో తర్కించటానికి వెనుకాడేవాడను కాను. కొంచెం పెంకితత్వం, స్వోత్కర్ష, నాకు తెలిసిందే నిజం, నేను చెప్పిందే వేదం, నాకు చాలా విషయాలు తెలుసును, నావాదనలో పటుత్వ మున్న దనుకొనే స్వభావం ఆదిలో నాకు జాస్తి. విద్యాభివృద్ధి, లోకజ్ఞానంవల్ల, అనుభవంవల్ల క్రమేపి ఆ దురహంకారం చాలావరకు చచ్చిపోయినా ఇప్పటికిన్నీ ఇంకా ఏ పిసరో మిగిలిఉన్నదేమో అని నా అనుమానం. నే నింగ్లండు నుండి తిరిగివచ్చిన క్రొత్తలో 1928 సంవత్సరాన "త్రివేణి" ఇంగ్లీషు మాసపత్రిక కేదో వ్రాసి పంపగా, జర్నల్‌ను స్థాపించి నడిపించే శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు దానిని ఆ జర్నల్‌లో ప్రచురించారు. దానిని చదివి నేను వ్రాసినదానిని సవరించినట్లు తోచి, వారు ఎందుకో నావద్దకు రాగా, వారితో "నారచనను సవరణ చేయకూడదని, అది తమకు నచ్చకపోతే ప్రచురించకుండా ఉండవలసిం"దని కొంచెం దురుసుగా మాట్లాడాను. సజ్జనులు, సహృదయులు వారు రెండు మూడు రోజులకు నావ్రాతప్రతిని చూపించి దిద్దలేదని రుజువుచేశారు. ఇంకొకసారి ఇంగ్లీషు దినపత్రిక "జస్టిస్" సాంవత్సరిక సంచికకు ఏదో వ్యాసం పంపాను. దానిని సవరణ చేయవలసియుండునని అప్పుడా పత్రికను సంపాదకులుగా నడుపుచున్న శ్రీ ఆర్కాటు రామస్వామి మొదలియారుగారు వ్రాయగా "ఏమాత్రం సవరణ చేయకూడదు, వ్రాత ప్రతిని తిరిగిపంపు" డని వ్రాసియుంటిని. ఇంగ్లండుకు వెళ్లి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడనైనా మేధావులు, నాకంటె ఎన్నిరెట్లో బాగుగా ఇంగ్లీషులో వ్రాయ శక్తిగల రామస్వామి మొదలియార్ గారివంటి ప్రతిభుణ్ణి, భాషావిషయంలో వారిని మించిన రామకోటీశ్వరరావుగారి వైదుష్యాన్ని శంకించిన నా మనస్తత్వం కొంత అహంభావపూరితంగానే ఉండేది. ఈ స్వాతిశయం ఇంగ్లీషు రానివారితోనేగాక, నాతోబాటు చదువుకొనేవారితోనూ ఉండేది.

ఎంత పెద్దలైనా, తెలుగు సంస్కృతాలలో ఎంత పండితులైనా, ఇంగ్లీషు రానివారిని ఇంగ్లీషు చదువుకొన్నవారు

నిరసనగా చూచేకాలం అది. ఆ భాష రాని తండ్రులు తా మెట్లును చేతగాని వారమే కదా, తమ బిడ్డ లుద్యోగాలు చేయక పోయినా వాళ్ళ కధికారులతో బరాబరి మాట్లాడేశక్తి కల్గాలని తలంచి, ఇంగ్లీషు చెప్పించటం మొదలుపెట్టారు. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం తెల్ల తలలేగాక, నల్ల పాదాలు కూడా అధికార గర్వంతో మిడిసిపోయేవారు. జీవనోపాధికొరకు స్వల్ప వేతనానికి ఉద్యోగంలో చేరిన తాలూకా కచ్చేరి చిన్న గుమాస్తా కూడా, నేను పాలకవర్గంలోనివాడను, ఈ పల్లెటూరు రైతులు నాకు అణగిమణగి పాదా లొత్తవలసిందే, జోహారు లర్పించవలసిందే అనే అహంభావంతో ఉండేవాడు. ఎంత మోతుబరి రైతునైనా చులకనగా చూస్తూ, గంటలకొద్ది పడిగాపులు పడియున్నా, ప్రసన్నముఖంతోగాక చిరాకుగా, ఎక్కడ నోటిముత్యాలు రాలిపోతవో అన్నట్లుగా, మాటలు ముక్కి ముక్కి, పట్టి పట్టి చెప్పటమేగాని సాఫీగా మాట్లాడేవాడు కాదు. ఉద్యోగస్థులే గాక చివరకు ప్లీడరుగుమాస్తా కూడా తేలికగాచూచి, ప్లీడరుగారి గొప్పదనాన్ని హోదాను కాపాడుచున్నట్లు, వా రిప్పుడు స్నానానికి వెళ్ళారనో, కాఫీ తీసుకొంటున్నారనో ఏదో సాకు చెప్పి, గంటలు కొలది పడవేసి ఉంచేవాడు. ఈ బాధలు, న్యూనతలు తమ కొడుకులకైనా తప్పుతవని రైతులు తమ బిడ్డలకు ఇంగ్లీషు చదువు చెప్పించట మారంభించారు. క్రొత్తగా ఇంగ్లీషు నేర్చుకోవటంవల్ల కొందరు యువకులకైనా తల తిరిగింది. మాకు తెలుసును, వారికి తెలియదు అను దురహంకారం పొడసూపింది. లేకపోతే పిన్నవయస్కుడను పూజ్యులైన మా పెదతండ్రి రామశేషయ్యగారితో, పెద్దలు లావు బాపయ్యగారితో వాదనకు దిగేవాడను కాను.

స్కూల్ ఫైనల్ చివర టరమయినా, ఆ క్లాసు చదువు చున్నది రెండో సంవత్సరమయినా, నేను క్రమంగా బడికివెళ్లటం గాని, శ్రద్ధగా నిత్యం చదవటంగాని ఉండేదికాదని పైనచెప్పాను. ఈ అశ్రద్ధ మాకు చరిత్ర చెప్పుచున్న నిత్యానందశాస్త్రిగారు, ఇంగ్లీషు చెప్పుచున్న కళ్యాణ రామయ్యగారు గమనించారు.

'కూబి' మన స్తత్వంగల నిత్యానందశాస్త్రిగారు బైటపడలేదు గాని, కళ్యాణరామయ్యగారప్పుడప్పుడు చివాట్లు పెట్టుచుండే వారు. హెడ్ మాస్టర్ రాస్‌పిళ్లెగారు అరుదుగా చదువు చెప్పే వారు. వారు ఇంగ్లీషు పొయిట్రిమాత్రం చెప్పేవారు. స్కూల్ కు వచ్చిన విద్యార్థుల క్రమశిక్షణ విషయంలో శ్రద్ధవహించేవారు కాని, వాళ్ళ హాజరువిషయములో క్లాసుటీచరుదే కదా బాధ్యత. కళ్యాణరామయ్యగారు మా క్లాసుటీచరని గుర్తు. నోబుల్ హైస్కూల్ చిరపరిచితమేకదా. అందువలన స్వేచ్ఛగా ప్రాత బంధువుల ఇంటిలోవలె నోబుల్ హైస్కూలులో జీవితం సాగింది. నేను 1918 జనవరిలో తిరిగి స్కూల్ ఫైనల్ క్లాసులో చేరేటప్పటికి నాకు క్రింది క్లాసుల్లో చదువుచెప్పిన టీచర్లు ఒక్క చోడవరపు జదన్నాధరావుగారు తప్ప, తక్కినవారందరు పరాయివారైపోయారు. విద్యార్థులుకూడా కొంతమందిచదువు చాలించుకొని వెళ్ళిపోయారు. కొంతమంది కాలేజి ఇంటర్ మీడియెట్ కోర్సుకు ప్రమోషనయ్యారు. నేను మూడవ ఫారంలో 1913 సంవత్సరములో పవేశించినప్పుడున్న కమ్మ విద్యార్థులు 1918 లో కనబడలేదు. క్రొత్త విద్యార్థులు ఈనాక్, వెంకట రత్నం వంటి క్రైస్తవ విద్యార్థులపే ర్లిప్పుడు గుర్తులో నున్నవి. నేను 1914 లో బచ్చుపేటలో ప్రవేశించినప్పుడు అక్కడ అధమం 10, 12 మందైనా కమ్మ విద్యార్థు లుండేవారు. 1918 నాటికి ఏ ముగ్గురో, నలుగురో ఉండేవాళ్లం. అందువలన ఉన్నవాళ్లలో మాకు ఆదర్శప్రాయంగా వర్తించేవారు లేకపోవటంచేత నేను, కాజ ఈశ్వరుడు విచ్చలవిడిగా వర్తించాము. స్కూలుకు హాజరుకాకపోవటం, ఆలస్యంగా వెళ్లటం, ప్రొద్దున టిఫిన్లెక్కువ, కబుర్లు జాస్తి, భోజనాలు ఆలస్యం, ఇంకా చదువు ఎట్లు సాగు తుంది ? ఈ స్థితిలో ఇంకొక బెడద వచ్చిపడింది. నా స్వగ్రామం బొమ్మలూరు మిత్రుడు మల్లాప్రగడ చంద్రశేఖరరావు ఫిబ్రవరి 15-వ తారీఖున అకస్మాత్తుగా మా గదికి వచ్చాడు. అతనికి స్కూల్ ఫైనల్ పరీక్ష పత్రాలనుగురించి సమాచార మందినదట. సమాచారాన్నిగురించి నిజం తెలిసికొంటాననిన్ని, అది నిజ

మయితే పరీక్షలో లాభం పొందవచ్చునని చెప్పాడు. తర్జన భర్జనలైన తర్వాత ఈశ్వరుడు, నేను, అతడు నిజం తెలుసుకోవటానికి ఒప్పుకొన్నాము. ఈశ్వరుడు నాకంటె ఎక్కువ బద్ధకస్తుడు. హాకీ మొదలైన ఆటలమీద సరదా. చదువుమీద శ్రద్ధ అతి తక్కువ. వాళ్లది సామాన్య రైతుకుటుంబం. ఇంగ్లీషు చదువు ఖర్చుతో కూడినది. పైగా పైలాపచ్చీసుగా కాలం గడిపేవారికి ఖర్చు మరింత ఎక్కువ. అతడు పరీక్షలో నెగ్గటం అవసరం. ఆందోళనను అవతలకు నెట్టి తల ఒగ్గాము. చంద్రశేఖరరావు రెండు మూడుసార్లు వచ్చి ఏవేవో కబుర్లు చెప్పి చివరకు మొండి చేయి చూపించాడు. ఈశ్వరుడు సంగతి ఎట్లున్నా నాకుమట్టుకు గుండె తేలికపడింది. అయినా చంద్రుడు చూపిన ఆశవల్ల శాబోలు నేను చివరరోజులవరకు చాలా అజాగ్రత్తగా చదివాను. ఆ ఆశ అంతమొందటంవలన పరీక్షలకు ముందు అతిశ్రద్ధతో రాత్రిప్రొద్దుపోయేవరకు, తెల్లవారగట్ట లేచి అలసట అనుకోకుండా చదివాను. అందువల్ల పబ్లిక్ పరీక్షలు 23-3-1918 తారీఖున ఆరంభమైనప్పుడు నేను పరీక్షలు వ్రాయటానికి తయారై యుంటిని. 23, 25, 26 తారీఖులందు జరిగిన పరీక్షలలో బాగుగానేవ్రాశాను. మా లెక్కలు టీచరు అమృతలింగ మొదలియార్ అనే అరవవారు చాలా మంచివారు. వారింటికి లెక్కలపరీక్ష రోజు 25-వ తారీఖు ఉదయం వెళ్లి వారిచేత కొన్నిలెక్కలను చేయించుకొన్నాను. లెక్కలు తర్వాత పేపరు, చరిత్ర, బాగానే వ్రాసినట్లు తలంచాను.

ఈప్రస్తావన ముగించేముందు ఒకవిషయం చెప్పవలసియున్నది. పరీక్షరోజు 23-వ ఉదయం అరగంట లేక 40 నిమిషాలకు ముందుగా కాలేజి బిల్డింగుకు వెళ్లాను. నేను ఆవరణలో నుండగా, ఇంచుమించు కాలేజి ఆవరణ నానుకొని ఉన్న రైల్వే స్టేషను నుండి బుడ్డనారాయణ అనే కమ్మయువకుడు చేతిలో ఏవో కాగితాలు పట్టుకొని పరుగెత్తుకొనివస్తూ నన్నుచూచి కేకవేసి నిలిపాడు. "గుంటూరులో ప్రశ్నపత్రాలు

బహిరంగమైనాయ్, ప్రశ్నలు పట్టుకువచ్చా" నని కేక వేస్తూ దగ్గరకు వచ్చాడు. నేను ఆ ప్రశ్నలు చూడనని నిరాకరించి లోపలికి వెళ్ళిపోయాను. ఒకవేళ ఆశపడి ప్రశ్నపత్రాలు తీసికొని ఆదరా బాదరాగా సమాధానాలు వెతుక్కుంటూ కూర్చుంటే సరిగ్గా 10 గంటలకు మొదలుపెట్టే పరీక్షకు సకాలములో అందుకోలేకపోయేవాడనో, ఆందోళనతో మనస్సు చెదరి తీరా పరీక్షను వ్రాయ మొదలుపెట్టినప్పుడు అవకతవకగా వ్రాసేవాడనో. ఆ దుష్టప్రేరణకు లోనుగాకపోవటం అదృష్టం.

నే నెన్నడూ పరీక్షల్లో కాపీ జేసి ఎరుగను. చివరకు క్లాసు పరీక్షల్లోకూడా నాకు వచ్చినట్లు వ్రాసేవాడనుకాని, ఇతర విద్యార్థులసాయం కోరేవాడను కాదు. అయినా చంద్రశేఖరరావు ప్రేరణకు లోనుగావటం కొంత మెతకబుద్ధిని సూచిస్తుంది. ఇది ముఖ్యంగా సహవాసదోషంవల్ల అయి యుంటుందని అనుకొనుచున్నాను. స్వశక్తివలన స్కూల్ ఫైనల్ పరీక్ష ప్యాసైనా, తప్పిపోయిన కాజ ఈశ్వరుడు, అతని పెదతండ్రి కొడుకు వెంకట్రామయ్య నామీద ఒక అభాండం వేశారు. "చంద్రశేఖరరావు బొమ్మలూరువాడు, స్నేహితుడైనందున రహస్యంగా నాకు పరీక్ష పేపర్లు తెచ్చియిచ్చాడని, స్వార్థబుద్ధితో నే నొక్కడనే వానినుపయోగించుకొని పరీక్షలో గెలిచా" నని ప్రచారంచేశారు. ఈశ్వరుడు తన అపజయాన్ని సమర్థించుకొనటానికీ ఎత్తువేసినా, విద్యార్థిగాని అతని పెదతండ్రి కొడుకు వెంకట్రామయ్య నమ్మాడో లేదో కాని దీక్షతో ఈ తప్పుడు ప్రచారం చేశాడు. ఈ ప్రచారం అప్పుడు బెజవాడలో అల్లోపతివైద్యుడుగా వృత్తి నడుపుకొనుచున్న అంగలూరు వాస్తవ్యుడు, నన్ను బాగా ఎరిగినవాడు, డా. తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారివరకు పోయింది. కొలది దినాలకు వారు, నేను, ఎక్కడనో కలసికోవటం తటస్థించగా వారు నన్ను నిలదీసి అడిగారు, పదిమందికి చెప్పారు.

నేను చవటనని, స్కూల్ ఫైనల్ పరీక్ష ప్యాస్ కాలేనని మా టీచర్లలో కొంతమందికి అభిప్రాయముండేది,

మాకు చరిత్ర బోధించే నిత్యానందశాస్త్రిగారికి ముఖ్యంగా. దానికి కారణం లేకపోలేదు. వా రడిగిన ప్రశ్నలకు జవాబు సరిగా ఇవ్వలేకపోవటమేగాక, తరచు వారి కంట బడకుండా తప్పించుకు తిరిగేవాడను. పైగా వారు పరీక్షలకు ముందు ప్రత్యేకంగా పెట్టిన క్లాసులు ఎగగొట్టాను. అందువలన పరీక్షా ఫలితములు వచ్చినప్పుడు హెడ్ మాస్టర్ గారి గదిలో కూర్చుని యుండి, నన్ను జూచి, తప్పినా నసే భావముతో హేళనగా మాట్లాడారు. హెడ్ మాస్టర్ గారు గెలిచాడని చెప్పగా చకితు లైనారు. నిత్యానందశాస్త్రిగారి అంచనా అంత తప్పుదికాదు. నేను ప్యాసైనా, నాకు వచ్చినవి బొటాబొటి మార్కులు. ఏదైనా నేను 1913 లో ప్రారంభించిన నోబుల్ హైస్కూల్ చదువు ఆ హైస్కూల్‌లోనే పూర్తికావటం సంతోషమైన విషయం.

నిత్యానందశాస్త్రిగారితండ్రి రామశాస్త్రిగారు శుద్ధ వైదిక కుటుంబంలోనివారని, క్రైస్తవమతం పుచ్చుకొన్నా, వైదిక ఆచారాలన్నిటిని గడుపుకొనేవారని పైన చెప్పాను. వారి వైదిక చిత్తవృత్తి చివరకు స్నానంచేసిన బట్టలు వారే స్వయముగా ఉదుకుకొని ఆరవేసుకొనేవారు. వారిస్త్రీలు కట్టుచీరెతో తలార చన్నీళ్ళ స్నానంజేసి చీరె నుదికి దండెంమీద ఆరవేసుకొనేవారు. క్రిస్టియన్ అయిన బ్రాహ్మణపిల్లను తప్పితే, ఇంకొకరిని చేసుకోనని నిత్యానందశాస్త్రిగారు ఆజన్మబ్రహ్మచారిగా ఉండిపోయారు. ఆయన దీక్షాపరుడు, చిత్తశుద్ధి కలవాడు. బోధనాతత్పరుడేగాని కుంచిత హృదయుడు, హ్రస్వదృష్టి కలవాడు.

ఈ నా హైస్కూలు విద్యార్థిజీవితాన్ని గురించి చెప్పటం ముగించేముందు నాకు గుర్తున్న హైస్కూలు అధ్యాపకుల విషయమై జ్ఞాపకమున్నంతవరకు ఇదివరకు పైనచెప్పింది గాక చెప్పటం అసమంజసం కాదు. మా హెడ్ మాస్టర్ రాస్‌పిళ్లె గారు ఉత్తములు, పటాటోపం లేనివారు. నెమ్మదిగా చిరునవ్వుతో వర్తించేవారు. కాని గంభీరముద్ర ఆయన సొత్తు. చిరునవ్వు తోనే భయభక్తులు కల్గించే శక్తి గలవారు. గొప్ప క్రమశిక్షణా

దక్షులు. మనిషి కురచ, మధ్యరకం లావు, చామనచాయ. అప్పటికే వయస్సుమళ్లినవా రయినా సన్నజరీ తెల్ల తలపాగతో, శుభ్రమైన కోటుతో, మల్లెపూవువంటి ధోవతి, ఆకుచెప్పులతో, మంచి ఠీవిగా ఉండేవారు. గంభీరంగా చేత పేముబెత్తం పుచ్చుకొని, సావకాశంగా వరండాలచుట్టూ తిరుగుచూ ఉంటే పిల్లలందరు గప్‌చిప్‌గా, కుక్కిన పేలులాగా క్లాసులో ఉండేవారు. అల్పాచమానం వగైరాకు వదలబడే పది నిమిషాల కాలంలో (రీసెస్) పిల్లలు సకాలానికి క్లాసుకు చేరుకొంటున్నారో లేదో అని అజమాయిషీకి బైలుదేరేవారు. ఏ విద్యార్థియైనా ఎంత ఒడ్డు పొడుగ్గా ఉన్నా, మీసాలు గడ్డాలు వచ్చినా, పిల్లల తండ్రియైనా ఆలస్యంగా వస్తే చేయి చాపవలసిందే, రెండు చురకలు అంటించుకొనవలసిందే. నా కా అనుభవం రెండు మూడు సార్లైనా కలిగియుంటుంది. వారి క్రమశిక్షణాపద్ధతి కొంచెం కఠినమైనా వారి హృదయం మెత్తనిది. ఏ విద్యార్థిని కష్ట నష్టపెట్టినవారు కాదు. ప్రతి విద్యార్థి వారియందు అభిమానంతో ఉండేవారు. ఒకసారి నేను వా రింటికి వెళ్ళగా ఎంతో దయగా, ఆప్యాయంగా మాట్లాడి నేను వెళ్ళిన పనిని నెరవేర్చారు. వారు చదువుచెప్పేది తక్కువగా ఉండేది కాని, చెప్పిన నాలుగు ముక్కలు బుద్ధిలో ఇముడునట్లు చెప్పేవారు. మొత్తంమీద వారు గొప్ప ఆదర్శ ప్రధానోపాధ్యాయులు. వా రిప్పటికిని నా భయభక్తులకు ఆకరమగుచున్నారు.

చరిత్రాధ్యాపకులు నిత్యానందశాస్త్రిగారి ప్రస్తావన పైన వచ్చింది. వారు తూణ్ణీంగా చదువుకొనివచ్చి శ్రద్ధగా, విస్పష్టంగా, వివరంగా బోధించేవారు. పచ్చగా, గంభీరంగా ఉండేవారు. తెల్ల సాదా తలపాగ, కోటు, తెల్లపంచె, చెప్పులు. మధ్యరకం ఎత్తు, లావు. చెప్పుకోతగ్గ వ్యక్తిత్వం. విద్యార్థులను భయ పెట్టటమే తెలుసు, దగ్గరకుతీసే స్వభావం లేదు. కళ్యాణ రామయ్యగారు హుషారు మనిషి. గలగల మాట్లాడేవారు. స్నేహ శీలి. నిష్కపటి. కొంత అంటీ అంట నట్లున్నా, విద్యార్థులను దగ్గరకుతీసే స్వభావం కలవారు. విద్యాబోధన సామాన్యం

గాని, విద్యార్థులు శ్రద్ధగానే వినేవారు. మధ్యరకం ఎత్తు, ఎత్తుకు సరిపడినదానికంటె కొంచెం లావు. చామనచాయ రంగు. నవ్వుచుండే మొగం. మొత్తం మీద మంచి అధ్యాపకుడు. పాపం వారి కక్కరకువచ్చే ఎదిగిన కొడుకు హెన్రి ఒకనాడు ఒక కమ్మ యువకుడు తుమ్మల బాపయ్యతో కృష్ణాస్నానానికి వెళ్ళి, తోడున్నవానితోబాటు మునిగిపోయాడు.

బుడ్డ దొరకూడా క్రైస్తవమతం పుచ్చుకొన్న బ్రాహ్మణుడే. ఆయనను గురించి పైన చెప్పాను. పైనజెప్పిన శాకాహారులు రామ శాస్త్రి, నిత్యానంద శాస్త్రిగార్లవలె గాక, నిత్యం మాంసాదులు మెక్కేవారు. వారు బొంగురుగొంతుతో చెప్పింది సరిగా వినేవాడనుకాదు. క్లాసంతా ఇంచుమించుగా అంతే. వెంపటి (అని గుర్తు) సాంబశివరావుగారు బ్రాహ్మణులు. పైన వ్రాసినట్లు సజ్జనులు, సరసులు. వీరు కూడా చరిత్ర చెప్పేవారు. వారు కోపపడటం నాకు గుర్తులేదు. వారు కొంతకాలానికి బందరు నుండి వెళ్లిపోయి, జయపూరు గుణుపూరు హైస్కూలులో హెడ్ మాస్టరుగా ఉండినారు. నేను 1932-36 మధ్య గంజాం బరంపురంలో ఇన్ కమ్‌టాక్సు ఆఫీసరుగా నుండినప్పు డొకసారి నామిత్రుడు, బంధువు శ్రీ నూతక్కి రామశేషయ్యగారిని గుణుపూరులో వారింట కలసికొనుటకు వెళ్లిన సందర్భాన, వారి నింకొకసారి చూచి, మాట్లాడాను. రామశేషయ్యగా రప్పుడు ఒరిస్సా జైపూరు సంస్థానం అసిస్టెంటు దివానుగా ఉండేవారు.

మా లెక్కల టీచరు అమృతలింగం మొదలియారుగారిని గురించి ఇదివరకే చెప్పియున్నాను. వారి వర్చస్సు, చిరునగవు, వారి ఉచ్చారణ ఆకర్షణీయంగా ఉండేవి. విద్యార్థుల సందేహాలను తీర్చటంలో, క్లిష్టమైన ప్రశ్నలకు ఓపికతో సమాధానము చెప్పటంలో ముందంజవేసేవారు. తెలుగు అధ్యాపకులు శ్రీ కానుకొల్లు త్రివిక్రమ రామారావుగారిని గురించి విపులంగా ఇదివరకే చెప్పియున్నాను. శ్రీ కోరాడ నాగేశ్వరశాస్త్రి (బుడ్డిచెంబుశాస్త్రి)గారిని గురించికూడా పైన చెప్పియున్నాను.

వీరు పండితులే గాక మిక్కిలి చమత్కారప్రియులు. ఎదురుచెప్పితే మాడ్చి చంపేవారు. విద్యార్థులకు వీరియందు భయం, గౌరవం హెచ్చుగానే ఉండేవి.

పరీక్షలు పూర్తిఅయిన మర్నాడు, 27-వ తారీఖు 1918 మార్చి ఉదయం చీట్లపేక వగైరా జల్సాలతో గల్లంతుగా కాలంగడపి ఆ సాయంత్రం రైల్లో బైలుదేరి అంగలూరు వెళ్లి నా మేనమామగారింట్లో భోజనంచేసి, ఆ రాత్రి నా పినతల్లి రాజరత్నమ్మగారింట్లో పడుకొన్నాను. నా తాతగారు త్రిపురనేని వెంకటాద్రిగారికి కల్గిన ఆరుగురు కూతుళ్లలో మా తల్లి అందరి కంటె పెద్దది. ఐదవ ఆమె శ్రీమతి రాజరత్నమ్మ. నా అమ్మమ్మ శ్రీమతి లక్ష్మమ్మ సోదరుడు అక్కినేని సుబ్బన్నగారి కుమారుడు శేషయ్యగారికిచ్చి ఆమెను వివాహంచేశారు. అక్కచెల్లెళ్లలో రాజరత్నమ్మ మిక్కిలి తెలివితేటలుగలది, దక్షురాలు. ఆమె యెడల నాకు మిక్కిలి చనువు. ఆమె అత్తగారు శ్రీమతి బుల్లెమ్మ గారు చాలా యోగ్యురాలు, కష్ట సుఖములు తెలిసిన మనిషి. లాలన పాలన ఎరుగును. మిక్కిలి ఆప్యాయతతో పలుకరించి, మాట కలుపుకొని ఆదరించేది. బంధువులన్న మిక్కిలి శ్రద్ధ, ప్రేమ చూపేది. అత్త కోడళ్లు, తల్లి కూతుళ్ళకంటె ఎక్కువ స్నేహంగా, ప్రేమగా ఉండేవాళ్లు. వాళ్ళమధ్య ఎన్నడు పొరుపు వచ్చినట్లు గుర్తులేదు. ఎంతో కలసిమెలసి ఉండేవారు. కోడలు తెలివితేటలు, కలుపుగోలు స్వభావం, అత్త మంచితనం, ఆప్యాయత ఈ సుఖస్థితికి కారణమైయుండును. ఇద్దరు మంచి మాటకారులు. అయితే కోడలిది లౌకికము, అత్తది బేలతనము. వీ రిద్దరు నన్ను అతిప్రేమతో, ఆదరణతో చూచేవారు. అంగలూరులోనే ఇంకా ముగ్గురు పినతల్లు లుండేవారు కాని, నేను ఆవూరు వెళ్ళినప్పుడు సరాసరి నామేనమామ శ్రీ త్రిపురనేని రామశాస్త్రులుగారింటికి వెళ్ళటం, తరువాత రాజమ్మపిన్నిగా రింటికి వెళ్ళటం పరిపాటి. ఎక్కువకాలం ఆమె యింట్లోనే గడిపేవాణ్ణి. ఈసందర్భంలో ఒక చిన్న యౌవనచేష్ట గుర్తుకువచ్చుచున్నది. వారి దూరపుబంధువు ఒకయువతి వారిని చూడటానికి వచ్చింది. నే నక్కడకు వెళ్ళినప్పుడు ఆమెను చూచి ముచ్చటపడ్డాను. ఇంకా

చూడాలని తహతహ మొదలుపెట్టి ఒకటి రెండుసార్లు పని బెట్టుకొని ఆమె ఉన్నచోటికి వెళ్లాను. అది గమనించి మా పినతల్లి నన్ను మందలించి మరునా డుదయమే ఆ యువతిని పంపివేసింది. చిన్నతనమునుండి మనుష్యులేగాక సుందరమైన వస్తువులు, పశు పక్షులుకూడా నన్నుఆకర్షిస్తవి. అందులో స్త్రీలు నా దృష్టిని చూరగొంటారు. నాకు వేరే దురుద్దేశం ఉండక పోవచ్చును. అక్రమముగానైనా వానిని పొందాలని కాంక్ష యుండకపోవచ్చును. కాని, వారిని లేక వారి సౌందర్యాన్ని చూచి ఆనందించాలని తహతహ పడతాను. మొదటినుండి నా కట్టి సౌందర్యపిపాస, ఆరాధన కలదు. అది పై సందర్భంలో అనుమానానికి కారణమైనది. ఈ సంఘటన నా నూత్న యౌవన దశలో మానవస్వభావ సరణిలో క్షంతవ్యుడను.

అయితే పై విషయంలో ఎట్లున్నా నా యౌవనోద్రేకం లేక నా మగసిరి, అప్పుడప్పుడు నన్ను పెడత్రోవకు తీయక పోలేదు. 1916 - 1917 లో స్కూల్ ఫైనల్ క్లాసుకు చేరు కొన్నప్పుడు కొంతమందిమి కలసి వంటరామన్నచేత వంట చేయించుకొనుచుండేవాళ్ళమని పైన వ్రాశాను. ఒకప్పుడు ఏకారణంవల్లనో తతిమ్మావారు లేరు. రామన్న, నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రిగారి కదివరలో గుడివాడలో వంట జేసి పెట్టాడు. రామశాస్త్రిగారు మిక్కిలి రసికుడు. వారి స్వగ్రామం అంగలూరులో కూడా కొన్ని వేశ్య కుటుంబాలుండేవి. నిజానికి అంగలూరు వేశ్య కుటుంబానికి చెందిన రామాయమ్మయే మా పెదతండ్రి కుమారుడు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి ఉపపత్ని. ఆమె కుమారుడే నాటకాలలో, సినిమాలలో పేరుపొందిన పువ్వుల సూరిబాబు. ఇతర వేశ్యలనుకూడ రామశాస్త్రిగారు ఎరిగుండినారు కాని, బాహాటంగా, ఎక్కువకాలం ఉంచుకోవటం గుడివాడకాపురం వజ్రం అనే యువతిని. ఆమె ముత్తవతల్లి తల్లి నాగుమణి. ముత్తవతల్లి అప్పాయమ్మ, తల్లి హనుమాయమ్మ. నేను హనుమాయమ్మను వజ్రాంబను పెళ్ళిళ్లలో చూచియుంటిని.

హనుమాయమ్మ తెలుపు పచ్చని శరీరంతో, మంచి అవయవ పొందికలతో, సుందరమైన ముఖముతో, భారీగా, బొద్దుగా, మిక్కిలి అందంగా ఉండేది. ఆమె భామకలాపం చూడలేదు గాని గీతగోవిందం, కృష్ణ కర్ణామృతం బహు చక్కగా అభినయించేది. ఆశ్చర్యమేమిటంటే లావుపాటిదైనా ఆమె బోర్లగా వంగి నేలమీద చిన్నపళ్లెంలో ఉంచబడిన వెండి రూపాయినాణాన్ని నొసటకు కరిపించుకొని, అది క్రిందపడిపోకుండా లేచి, నిల్చొని, నొసటినుండి ఆ నాణాన్ని చేతితో తీసివేసేది. ఆ రూపాయి ఆమెకు చెందేది. పైపెచ్చు రసికు లొకరిద్దరైనా రూపాయో, రెండో ఆమెకు విసరివేసేవారు. ఆ కాలంలో భోగంమేజువాణి పెళ్ళిళ్లలో తప్పనిసరి. పైవిధముగా పరిచయాలు, స్నేహాలు పొడసూపుతవి. ఇటువంటి మేజువాణీలలో రామశాస్త్రిగారు వజ్రాంబను చూచి యుంటారు. వజ్రాంబ కొట్టవచ్చినట్లున్న వయస్సుతో, మిక్కిలి ఆకర్షణీయమైన విగ్రహంతో, కళ్లకానందపరచే, మనస్సును ఉరకలువేయించే సౌందర్యవతి. నిగనిగలాడే పచ్చని శరీరం, లావణ్యవంతమైన ముఖం, తీర్చిదిద్దినట్లున్న కనుబొమలు, అందమైన కళ్ళు, పొంకమైన నాసిక, తగిన లావుతో నాజూకుగా ఉండేది. చూపరులలో మోహం రేకెత్తించేది. ఇంకా పిన్నవయస్కుడనైనా నేనామెను ఇంకా ఇంకా చూడాలనిపించేది. ప్రాత గుడివాడలో మునిసేపల్లి రోడ్డుకు ఎడమప్రక్కగా వేశ్యలపేట. ఆ పేటలో పైనచెప్పిన నాగుమణి కుటుంబమేగాక, వరలక్ష్మి కుటుంబంవంటి కుటుంబాలు కొన్ని యుండేవి. సీతారత్నమ్మ అనే ఆమె యొక ర్తుండేది. ఈ వేశ్యపేటలో కొన్ని కాపు కుటుంబాలు కూడా కాపురముండేవి. యడ్లపల్లి రామన్న కాపురం ఈపేటలోనే. అందువల్ల ఈవేశ్య కుటుంబాలతో అతనికి చాలా పరిచయం. నా మేనమామగారిద్వారా అతనికి వాళ్ళు మరింతసన్నిహితమై యుండవచ్చును. పైగా నావంటి ఉన్నవాళ్ళ అబ్బాయివల్ల ఆవేశ్యలకే గాక, తనకు కూడా కొంత లాభించవచ్చును. ఏ ఉద్దేశంతో నైతే నేమి నా మేనమామగారి ఊసులమీదుగా, గుడివాడ వేశ్యల ప్రస్తావన రావటం, రామన్న చిలవలు పలవలుగా వర్ణించి

చెప్పటం, వాని ముసిముసి నగవుల చాతుర్యప్రోత్సాహం నన్ను ఉద్రేకింపజేసి భోగకాంతా సాంగత్యానికి ప్రేరేపించింది.

ఒక సాయంత్రం మేమిద్దరం రైల్లో గుడివాడకు చేరుకొన్నాం. రామన్న దారి తీయగా ఆ యింటికి వెళ్లాం. ప్రక్క యింటినుండి పైన చెప్పిన నాగుమణి, అప్పాయమ్మ వచ్చారు. వారు వృద్ధులు, కులపెద్దలు. ఆ రీత్యా నాకు వారుకూడా స్వాగతం చెప్పారు. నే నారాత్రి ఎట్లో గడిపాను. నామట్టుకు నాకు మిక్కిలి అసంతృప్తే కలిగింది. ఉదయమే రైలెక్కి బందరు రామన్నతో చేరుకొన్నాను. తిరిగివచ్చి చూచుకోగా ధ్వోవతి మీద ఆకుపచ్చ మరకలు కన్పడ్డవి. గనేరియా యేమో అని భయపడి శేషగిరిరావుగారి మందులషాపుకు వెళ్లాను. వారు చూచి ఇవి ఏ నారింజతోలురసం మరకలోగాని గనేరియా మరకలు కావని నాకు నమ్మకం చెప్పారు. ప్రాణం కుదుటబడింది. అంతటితో నా వేశ్యాసాంగత్యం ఆఖరు.

శేషగిరిరావుగారు వైద్యం తెలిసినవారు. వారు బల్లకట్టి ప్రాక్టీసుపెట్టినట్లు లేదు. కాని చాలామంది రోగులు వారి సలహా తీసుకోవటం, వారి షాపులో మందులు కొనటం ఉండేది. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి శేషగిరిరావుగారు సన్నిహితంగా ఉండేవారు. వేంకటశాస్త్రిగారికి లేక లేక కల్గిన సంతానం మగబిడ్డకు, అతిసారం వగైరా జబ్బుచేస్తే శ్రీ శేషగిరిరావు రాత్రింబవళ్ళనక ఆ బిడ్డను కనిపెట్టుకొనియుండి చికిత్స చేసినారట.

తగిన జాగ్రత్త తీసుకొనకపోతే, నౌకరులు యజమానులను, అందులోను రక్తం పెల్లుబుకుచున్న యువకులను, భ్రమింపజేసి తప్పుత్రోవలను పట్టిస్తారని చెప్పుటకు నా పై అనుభవమే తార్కాణం.

నేను మద్రాసునుండి తిరిగివచ్చి 1918 జనవరి రెండో వారారంభంలో మరల నోబుల్ హైస్కూలులో చేరిన తర్వాత అప్పుడప్పుడు రామస్వామి చౌదరిగారింటికి వెళ్ళుచుండే

వాడ నని పైన వ్రాశానుకదా. ఆ మేనెలలో శ్రీ చౌదరి గారు వారి స్వగ్రామమగు అంగలూరుకు వెళ్ళి, నా ప్రార్థన మీద నాతో కలసి బొమ్మలూరులోని మా యింటికి వచ్చారు. అప్పు డింట్లో మా నాన్నగారు లేరు. వారు పెందలకడనే భోజనంచేసి పొలమో, గుడివాడో వెళ్ళియున్నారు. చౌదరిగారికి తగిన మర్యాద చేయాలని నేను ఆతురతతో మా సవతితల్లిగారిచేత అప్పటికప్పుడు అవి ఇవి వంటచేయించి, భోజనం వడ్డింపించి దగ్గర నిలబడి భోజనంచేయించాను. మా పిన్నిగారి వంట సామాన్యం. అందులోను వారు వస్తారని ముందుగా ఆమెకు తెలియదు. నిజానికి నాకు కూడా తెలియదు. నేను నా మేనమామగారింటికి అంగలూరు వెళ్ళగా శ్రీ చౌదరిగారి దర్శనం అక్కడ లభించింది. వారక్కడనుండి పనిమీద బెజవాడ వెళ్ళే ప్రయత్నంలో నుండగా నే నర్థించి ప్రొద్దెక్కిన తర్వాత మాయింటికి తీసుకొనివెళ్లాను. వేసవి కాబట్టి ఇంట్లో కూరగాయలు నేను ఆశించినంతగా లేవు. మామూలుగా బంధువులు వస్తే వెంటనే కోడిగ్రుడ్లు వండుతారు. పెందలకడ వస్తే, ముఖ్య బంధువులైతే కోడిని పచనంచేస్తారు. కాని శ్రీ చౌదరిగారు పూర్తి శాకాహారులు. ఐర్లెండులోకూడా వారు కోడిగ్రుడ్డైనా వాడలేదట. అందువలన ఉండిన కాయకూరలతోనే వారిని భోజనం చేయించవలసివచ్చింది. నాకు తృప్తి లేకపోయింది కాని వారు భోజనప్రియులు కాదు. పెట్టినదానితోనే సంతృప్తి చెందే పెద్దమనిషి. అందుచేత నా స్వల్ప మర్యాదతోనే సంతృప్తి పడ్డారు. ఆకాలం మామిడిపండ్లు వచ్చే ఋతువు. కాని మా యింట్లో ఒక్కమామిడిపండు మాత్రమే మిగిలి ఉండింది. అది అంత మంచిరకంది కాదు కూడా. భక్తితో వారి నా పండు నారగింప జేశాను. ఇంకొక విషయం, అప్పటికే పాతిక, ముప్పై సంవత్సరాలక్రితమో కట్టిన మా మండువాలోగిలి ఆనాటి లెక్క ప్రకారం బాగా కట్టిందే. మంచి రంగూను టేకుకర్ర దూలాలు, కడ్డీలు, బల్లకూర్పు వగైరాతో గట్టిగా కట్టిందే. అయితే పడమటిల్లు అనే చిన్నహాలువంటి పొడుగుపాటి గదికి వెల్తురు ప్రసారం తక్కువ. మా ఆరో పెదనాన్నగా రిల్లు మా చూరు నానుకొని యుండటంవల్ల ఆ మధ్యగది కొంచెం మసకగా ఉండేది.

రాత్రిపూటయితే ఏ ఆముదంప్రమిద దీపమో, ఏ కిరసనాయిల్ గాజుబుడ్డి దీపమో, లేక ఏ హరికేన్ లాంతరో ఉపయోగించేవాళ్లం. కాని వెల్తురు కని పగలు దీపం పెట్టటం ఆచారం కాదు గదా. అందు వల్ల మసక మసకగా నున్న ఆ మధ్యలోనే వారికి వడ్డన చేశాము. సామాన్యంగా మేము వెనుకవరండా గదిలో భోజనం చేసేవాళ్ళం. మానాన్నగారు ఆ నడిమి గది ముందుభాగంలో వెనుక వరండా కిటికీ వెల్తురువచ్చేచోట భోజనంచేసేవారు. వచ్చిన బంధువులకు మధ్యభాగంలో పీటలువేసి భోజనంపెట్టేవాళ్ళం. కాని రామస్వామి చౌదరిగారికి మామూలుమర్యాద చాలదనే ఉద్దేశంతో ఉంటిని కాబట్టి, వారు భోజనంచేసిన ప్రదేశం అంత కాంతివంతంగా లేదుగదా అని విచారించాను. ఎట్లో భోజనం ముగించినతర్వాత అప్పటికి 12 గంటలు దాటింది కనుక, కొంచెం విశ్రమించండని కోరాను. వారు పందిరిమంచంమీద విశ్రమిస్తుండగా మా నాన్న గారు తిరిగి వచ్చారు. ఫలానా వారు వచ్చారని చెప్పగా వెళ్ళి పలకరించి క్షేమ సమాచారాలు అడిగారు. ముక్తసరిగా చౌదరిగారు జవాబుచెప్పారు. తర్వాత ఫలహారంచేసి బెజవాడకు వెళ్లుటకు గుడివాడకు వెళ్ళిపోయారు.

ఫలహారం అనే వాడుక పండ్లుమాత్రమే ఉపాహారంగా ఉపయోగించే పూర్వకాలంలో వచ్చిఉంటుంది. పండ్లుకూడ లభ్యమైనా, ఫలహారం అంటే ఇంగ్లీషులో టిఫిన్ అంటామే దానిలాగా బిస్కట్లు, కేకుౕ మొదలుకొని అన్నివిధములైన వండిన కారం, తీపి, పదార్థాలు ఉపయోగిస్తున్నాము. పల్లెటూళ్ళలో సర్వసాధారణంగా బంధువులు వచ్చినప్పుడు గారెలు చేస్తాము. పండుగ పబ్బాలలో పూర్ణాలు కూడా చేయటం పరిపాటి. ఇప్పుడిప్పుడు పకోడీ, కారం బూంది, ఉపమా, మైసూరు పాకం వగైరా చేస్తున్నారు. గారెలు బాగుగా ఉండాలంటే మినప పప్పు బాగుగా నానాలి. అందువలన తెల్లవారుఝామునో అథమం మసకతోనో పప్పు నానవేస్తేనేగాని మధ్యాహ్న ఉపాహారానికి గారెలు బాగుండవు. పెసర పప్పుతోకూడా గారెలు

చేస్తారుగాని, అవి రుచిగా ఉంటవిగాని, గారెలంటే మినపగారెలనే అర్థం. పల్లెటూళ్ళ ఆంధ్ర బ్రాహ్మణేతరులలో గారెలు, పూర్ణాలే ముఖ్యం. సంక్రాంతి సమయంలో బియ్యంపిండితో అరిసెలు వండుకోవటం అలవాటు. మొదటిలో క్రొత్తగా వచ్చిన వడ్లు దంపి క్రొత్త బియ్యంపిండితో వండేవారు. కాని ఇప్పుడు ప్రాత బియ్యంతోనే వండుచున్నారు. అయితే ప్రాత పిండితో చేసినవానికంటె క్రొత్తపిండితో వండిన అరిసెలే ఎక్కువ రుచి. పకోడీలు, కారంబూంది, బజ్జీలు, వేయించిన అటుకులు, మైసూర్ పాక్, కేసరి, ఉపమా ఉపాహారాలు వెలిసినా, నా చిన్నతనంలో గారెలు, పూర్ణాలు, అరిసెలు, మినపసున్ని ఉండలు, తప్పితే చేగోడీలు, చక్కిడాలు మాత్రమే వాడుకలో ఉండేవి. పెండ్లిపేరంటాలలో శ్రీరాన్నం, పులిహోర చేసుకొనేవాళ్ళు. అసలు ఎంత సంపన్నకుటుంబంలోనైనా ఉదయం ఉపాహారం ఉండేదికాదు. ఆమాటకు వస్తే కాఫీ, టీ లుండేవికావు. రైతులు పెందలకడనే అనగా ఉదయం 8-30 గంటలకే భోజనంచేసేవారు. ఎంత వయస్సువచ్చినా మధ్యాహ్నం రెండోసారి ఏ రెండుగంటలకో భోజనంచేసేవారు. బంధువులకు రెండోసారి భోజనమేగాక, ఏ 4 గంటలకో ఏ గారెలో ఉండేవి. మా స్వగ్రామమగు బొమ్మలూరులో ఉదయభోజనం కొంచెం మాలస్యమయినా, పెడసనగల్లులో నాకు పెళ్ళయిన క్రొత్తలో ఉదయం 7½, 8 గంటలకే భోజనంచేసి రైతులు పనిమీద పొలం వెళ్లేవారు. నావంటి క్రొత్త అల్లుళ్ళను ఆబోతును తయారుచేయునట్లు మేపినా, ఉదయం ఉపాహారం ఉండేదికాదు. కాఫీ, టీ అసలే ఉండేవికావు. ఉపాహారమంతా మధ్యాహ్న భోజనానంతరమే. ఎండురోగం వగైరా ఉండేవాళ్లు వైద్యానికని ఉదయం మినపకుడుము తినేవాళ్లు. అంతే. అందుచేత రామస్వామి చౌదరిగారికి సరిగా పప్పు నానక పోయినా ఆలస్యంగా గారెలే వండి ఉపాహారమిచ్చినామేమో. పండ్లు వాడకం పల్లెటూళ్లలో ఆరోజుల్లో ఇంచుమించు పూజ్యం.

నా బందరు హైస్కూలు చదువు విషయం ముగించేముందు, బందరు సంబంధం ఒకటి రెండు సంగతులు చెప్పాలనివుంది. మే ముండే గదులకు ఒక వయస్సుమళ్ళిన వైశ్యుడు పుణుకులు,

పెసరట్లు గంపలో పెట్టుకొని తీసుకొని వచ్చేవాడు. పుణుకులు మినపవి, పెసరవి ఉండే వనుకొందును. చిన్నసైజుగా ఉండేవి. నానెవాసన. పెసరట్లు కూడా చిన్నసైజువే. మిక్కిలి పల్చగా, నెయ్యితో వండినట్లుగా ఉండేవి. వానిలో దండిగా పచ్చిమిరప, అల్లం పడేవి. లేకపోతే చప్పగా ఉండేవనటానికి సందేహంలేదు. వానినే మేము తప్పక కొంటూ తృప్తిపడేవాళ్ళం. ఎప్పు డారంభించారోకాని కమ్మ విద్యార్థి వసతిగృహ మొకటి 1918 సంవత్సరారంభములో నేను మద్రాసునుండి తిరిగివచ్చినప్పుడు, తర్వాత కొంతకాలం బచ్చుపేటలోనే అని జ్ఞాపకం ఉండింది. 1918 లో దాని కార్యదర్శి గద్దె వీర రాఘవయ్యగారు. వారు తర్వాత బి.యల్. పట్టా పుచ్చుకొని వకీలుగా బందరులోనే స్థిరపడిపోయారు. వసతికి బెజవాడ, గుంటూరులలో నున్నట్లు బందరులో స్వంతగృహం లేదు. అద్దె ఇంట్లో దానిని నడపేవారు. తదనంతరం సంగతి గుర్తు లేదు కాని, మొదటి సంవత్సరాలలో చల్లపల్లి ప్రస్తుత జమీందారుగారి మేనత్త శ్రీమతి నీలకంఠేశ్వరమ్మగారి భర్త శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగా రప్పుడప్పుడు వచ్చి కుశలప్రశ్న లడుగుచుండేవారు. నేను వసతిగృహంలో ఎప్పుడూ చేరలేదు. కాని ఎందుకోగాని అన్నమిల్లి వెంకట సుబ్బారావనే విద్యార్థి వసతి గృహానికి కొంత బాకీ ఉండగా ఆ బాకీని నేను చెల్లించాను.

నా స్వగ్రామం బొమ్ములూరులో, పైజెప్పిన సూర్యనారా యణ, చంద్రశేఖరరావు కుటుంబమేగాక, మల్లాప్రగడవారి కుటుంబములు మరొకటి రెండుండేవి, అందులో నొకటి కరణంగారి కుటుంబం. కరణం మల్లాప్రగడ శేషగిరిరావుగారి తండ్రి నా చిన్నతనంలోనే మరణించారు. అందువలన నే నెరిగినది శేషగిరిరావుగారిని, వారి తమ్ములనే. శేషగిరిరావుగారు పెద్దవారు. వారు మా ఊరు కరణంగా నుండేవారు. రెండోవారు సుబ్బారావు గారు. మూడవవారు రామచంద్రరావుగారు. వారి మేనమామ ప్రఖ్యాత రెంటాల వెంకట సుబ్బారావుగారు. వారు మద్రాసులో న్యాయవాదవృత్తి చేస్తూ దానిలో అంతగా లాభించకనో, లేక మేధా వైవిధ్యంవల్లనో మామిడి వగైరా ఊరగాయ పచ్చళ్ళు, మసాలాపొడి వగైరా తయారుచేయించి విక్టోరియా డిపో అనే

పేరుతో విదేశాలకు ఎగుమతిచేసేవారు. ఆ రోజులకు మించిన ప్రచారం చేసి, తమ సరుకులకు గిరాకి కల్పించేవారు. వారిని గురించి ఒక చిత్రమైన కథ విన్నాను. ఆ రోజుల్లో ఉన్నవారైనా, నులకమంచాలు, నవారుమంచాలే ఎక్కువగా వాడేవారు. వానిలో నల్లులబాధ హెచ్చుగా ఉండేది. ఒకటో నంబరు నల్లులమందు ఉన్నదని పేపర్లలో ప్రకటనలు చేశారట. కావాలని వ్రాసినవారికి వి. పి. పి. ద్వారా పంపేవారట. తీరా బంగీ విప్పిచూస్తే రెండు చిన్నరాళ్లు ఉండేవట. నల్లిని పట్టుకొని ఒక రాతిముక్కమీద పెట్టి రెండో రాతిముక్కతో కొడితే చప్పున చచ్చిఊరుకుంటుందని సలహా వ్రాసిన ముక్క ఉండేదట. ఇది అబద్ధమై వుంటుంది. కాని ఆయన మేధాస్రవంతి ఆ రీతులలో ప్రవహించేదని వాడుక. శేషగిరిరావుగారి సోదరి, వెంకట సుబ్బారావుగారి మేనకోడలు, మేనమామగారింట్లో పెరుగుచుండేవారు. మేనమామగారు తగు ప్రయత్నంచేసి అభివృద్ధిలోకివస్తున్న ఆరాధ్యశాఖకు చెందిన యువకుడు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారికిచ్చి వివాహంచేశారు. 'దేశోద్ధారక', 'విశ్వదాత' అని ప్రఖ్యాతివహించిన ఉత్తమ జాతీయ నాయకులు, ఆంధ్రపత్రిక, భారతి పత్రికలను స్థాపించి దేశసేవ, భాషాసేవ, ప్రజాసేవచేసిన మహనీయుడు, నిత్య శివార్చనపరుడు, స్వార్థత్యాగి ఈ నాగేశ్వరరావు పంతులుగారే. శేషగిరి రావుగారి మొదటి తమ్ముడు సుబ్బారావుగారు కొంతకాలం మద్రాసు సెక్రటేరియట్‌లో ఉద్యోగంచేసి పిన్నవయస్సులోనే మరణించారు. మూడవవారు రామచంద్రరావుగారు వకీలుపరీక్ష ప్యాసైనా, ఆట్టే న్యాయవాదివృత్తిని అవలంబించినట్లు లేదు. మద్రాసులో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారింట నుంటూ, వారి అమృతాంజనం వగైరా వ్యాపారాల అజమాయిషి చేస్తూ ఉండేవారు. వారు నే నింగ్లండునుండి తిరిగివచ్చినతర్వాత భారతి మాసపత్రికలో ప్రచురించిన నా మొదటి తెలుగువ్యాసం "అర్ధాంగి" చూచి బాగున్నదని సంతోషించారు. మీ రింగ్లండులో చాలా సంవత్సరాలున్నా తెలుగు మరచిపోక బాగావ్రాశారని మెచ్చుకొన్నారు. వారిని చూచుట తటస్థించినప్పుడు వారి యూరివాడనని అభిమానించేవారు. వీరి తల్లిగారి స్వగ్రామాభిమానం మిక్కిలి హెచ్చు.

భర్త పోయినతర్వాత ఆమె కూతురువద్ద మద్రాసులోనే ఉంటూ వచ్చారు. మా పినతండ్రి నాగభూషణంగారు ఏదో పనియుండి మద్రాసు వెళ్లి వా రింటికి వెళ్ళగా బ్రహ్మాండంగా మర్యాదచేసి, స్వయంగా పుష్కలంగా వడ్డించి, తృప్తిగా భోజనం చేయించారట. శ్రీ పంతులుగారు ప్రఖ్యాత లాయరు సుందరమయ్యర్ గారి "శ్రీబాగ్" అనే గొప్ప మేడభవంతిని కొని అందులో ఉండు చుండేవారు. దానిలో రాజప్రాసాదంవలె రకరకాలగదు లెన్నో ఉండేవి. ఆ భవనా న్నంతటినీ, ఆమెగారు గది గదికి తీసికొని వెళ్లి నాగభూషణంగారికి చూపించారట. ఒకప్పు డామర్యాద నాకు కూడా శ్రీ రామచంద్రరావుగారు చేశారు. ఈ "శ్రీబాగ్" భవనంలో, జాతీయ కాంగ్రెసు ఆంధ్రనాయకులు, ఆంధ్ర కోస్తాజిల్లాలకు, రాయలసీమ జిల్లాలకు ఒడంబడిక కుదిర్చినందున ఆ ఒడంబడికకు "శ్రీబాగ్ పాక్టు" అని పేరు వచ్చింది.

నా స్వగ్రామం బొమ్ములూరు మల్లాప్రగడవారిని గురించిన ప్రస్తావనలో ఇంకొకటి చెప్పితే బాగుంటుందని తలంపు వచ్చింది. సూర్యనారాయణ, చంద్రశేఖరరావులను గురించి టూకీగా పైన చెప్పియున్నాను. సూర్యనారాయణ ఏ కొద్దిగానో చదివి చదువు మానివేశాడు. చంద్రశేఖరరావు ఇంగ్లీషు చదివాడు, చదువు చుండినాడు. ఇతడు నాకు సన్నిహితంగా ఉండేవాడు. తరచు మా ఇంటికి వస్తూ, నా పడకమీద నా ప్రక్కన పడుకొని ధారాళంగా కబుర్లు చెప్పుచుండేవాడు. అతడు నవ్వు ముఖంతో, తేలిక హృదయంతో, స్నేహపూర్వక దృక్కులతో వర్తించేవాడు. ఒక విధంగా అలౌకికుడు. ఆధ్యాత్మికతత్వం అలవర్చుకొన్నాడు. ఒకవిధమైన మిస్టిక్ గా తయారైనాడు. నిగూఢ సంబంధమైన ఇంగ్లీషు పద్యాలు చదువుచుండేవాడు. దేహాంతరప్రాప్తి సంబంధం, ఆత్మప్రయాణం వగైరా విషయాలు ఉత్సాహంగా చదివేవాడు. సూర్యనారాయణ అట్లు కాదు. కరణీకం లెక్కలు, ఎత్తులు నడవడి. గుడివాడకు మకాం మార్చి అక్కడే ఉండిపోయాడు. పాపం చంద్రశేఖరరావు పిన్నవయస్సులోనే అవివాహితుడుగా మరణించాడు. వీ ళ్లిద్దరు మా యింటికి

రావటంచూచి మా వాళ్ళిల్లదుగో వీరభద్రయ్య సూర్యచంద్రు లంటుండేవాళ్లు.

మా స్కూల్ ఫైనల్ పరీక్షలు 1918 మార్చి 23-వ తారీఖున ప్రారంభం కావటానికి నాలుగురోజులు ముందుగా కాజ రంగయ్యగారు బందరు వచ్చి ఒకపని చేసిపెట్టుమని అడిగారు. పరీక్షలతొందరలో వుండటంవల్ల తర్వాత దానిని గురించి చర్చించుదా మన్నాను. పరీక్షలైనపిమ్మట వారు తిరిగి కలసికొని, "నాస్నేహితుడు మెర్నేని లక్ష్మీనారాయణగారి భార్య, సంసారం విడిచిపెట్టి ఎవనితోనో లేచిపోయింది. వా రింకను వయస్సులోనే ఉన్నారు. వారికి రెండవపెళ్లి చేయాలి. మీ బంధువు పల్లెంపాటి రామకృష్ణయ్యగారి అన్న లక్ష్మీనారాయణగారి కూతురు సికిందరాబాదుదగ్గర పికెట్ గ్రామములో ఉన్నదట, ఆ పిల్లను లక్ష్మీనారాయణగారికి మాట్లాడవలసిం" దని కోరారు. సరే అన్నాను. నా భార్య రెండో మేనమామ చెరుకూరి లక్ష్మీపతిగారి భార్య వియ్యమ్మగారి సోదరుడే పల్లెంపాటి లక్ష్మీనారాయణగారని పైన చెప్పియున్నాను. పైగా ఆమె ఇంకొక అన్న రామకృష్ణయ్య గారు మద్రాసు కమ్మ హాస్టలు అజమాయిషీ చేస్తూ నాకు మరింత పరిచయులై యుండినారు. అందువల్ల వారికి ఉత్తరం వ్రాశాను. మరిన్ని పెడసనగల్లు వెళ్లి మా పిన్ని వియ్యమ్మగారికి చెప్పి, వారి చేత పిల్లతండ్రి లక్ష్మీనారాయణగారికి జాబు వ్రాయించాను. ఉత్తరప్రత్యుత్తరాలు ఆలస్యంగా జరిగినవి. చివరకు ఆ డిశెంబరు ఆరంభంలో పిల్ల నిస్తామని రామకృష్ణయ్యగారు, లక్ష్మీనారాయణ గారు వ్రాశారు. కాని కాలం గడుస్తున్నా, వారినుండి తిరిగి సమాధానము రాలేదు. పైగా, పిల్లతల్లి రెండో పెళ్లివాని కివ్వనని, భార్య బ్రతికియుండగా రెండోభార్యగా ఇవ్వనని అభ్యంతరం చెప్పుచున్నదటని తెలిసింది. అందుమీదట రంగయ్య, లక్ష్మీనారాయణగార్ల బలవంతంమీద నేను సికిందరాబాదుకు వెళ్లాను. నేను వస్తున్నానని ముందుగా లక్ష్మీనారాయణగారికి

ఉత్తరం వ్రాయటంవల్ల, వారి తాలూకు మనిషి వచ్చి నన్ను పికెట్ లోని వారింటికి తీసుకొనివెళ్లారు. వారు నాకెంతో మర్యాద చేశారు. కాని లక్ష్మీనారాయణగారిభార్య పట్టుదలవల్ల పిల్ల నిచ్చుటకు నిరాకరించారు. నేను వెళ్లినపని నెరవేర్చకపోయినా భోజన, మజ్జనాదులలో వారు చూపిన ఆప్యాయత నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నన్ను అక్కడ 2, 3 రోజులుంచుకొని పెద్దగుర్రపుబండిలో సికిందరాబాదు, హైదరాబాదును చూపించారు. ప్రాత హైదరాబాదులోని చార్మినార్‌కు తీసుకొనివెళ్లి దాని ఉన్నత రూపాన్ని, అందచందాలను మెచ్చుకొనుటకవకాశం కల్పించారు. హైదరాబాదు మిఠాయి చాలా సుప్రసిద్ధము. మంచి మిఠాయిని అమ్మే దుకాణాలు చార్మినార్ సమీపంలో ఉండేవి. రకరకాల మిఠాయి రెండు మూడు పొట్లాలు కట్టించి నాకు బహుమతి చేశారు. సికిందరాబాదులో రైలెక్కించి మర్యాదగా నన్ను సాగనంపారు.

పల్లంపాటివారి సంబంధం తప్పిపోగా, ఏలూరు దగ్గర జాలిపూడి గ్రామంనుండి జాస్తివారి పిల్లను లక్ష్మీనారాయణగారు వివాహమాడారు. నేను ఇతర బంధుమిత్రులు హాజరై వివాహములో పాల్గొన్నాము. ఆ సందర్భములో "శబ్దరత్నాకరము" వగైరా రెండు మూడు పుస్తకాలను నేను లక్ష్మీనారాయణగారికి బహుకరించాను. వీరి వివాహము 1919 ఏప్రిల్ లోనో, మే లోనో జరిగింది.

1918 ఏప్రిల్ 8-వ తారీఖున కృష్ణాజిల్లా ఘంటసాలకు వెళ్లాను. నా మూడవ, నాలుగవ ఫారంలలో సహాధ్యాయులు గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, వేమూరి సీతారామయ్య, అయినంపూడి గోపాలకృష్ణయ్యగార్ల స్వగ్రామ మది. మరిన్ని శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి స్వంత ఊరు. నేనక్కడ రెండురోజు లుంటిని. ఈ నల్గురు నన్నెంతో ఆదరించి ఎవరికివారు భోజన సత్కారము చేశారు. ఒకప్పుడు బౌద్ధవిహారంగాను, పడవలు లేక చిన్నఓడలమీద ఎగుమతి దిగుమతుల వ్యాపారంచేస్తూఉండే

కృష్ణానది రేవుగాను, ప్రసిద్ధిచెందిన ఈ గ్రామాన్నంతా శ్రీ వెంకట సుబ్బయ్య వగైరా చూపించారు. బౌద్ధ స్థూపముండిన ప్రదేశాన్ని దర్శించాను. ఆ ఊరు ఆడ మగపిల్లల పాఠశాలకు వెళ్ళాను. పిల్లలకు తెలుగు చెప్పి (డిక్టేషన్) వ్రాయించాను. ఆడపిల్లలే మగపిల్లలకంటె బాగుగా వ్రాశారు. ఆడపిల్లలు పాడుచూ కోలాటం వేశారు. పుస్తక భాండాగారానికి వెళ్లాను. దేవాలయాలను చూచి సంతోషించాను. వెంకట సుబ్బయ్యగారు ఫోర్తు ఫారం అయినతర్వాత కలకత్తాకు వెళ్లి బెంగాలీభాష నేర్చుకొన్నారట. తరువాత బందరులో కౌతా శ్రీరామశాస్త్రిగారివద్ద దానిని అభివృద్ధిపరచుకొన్నారట. నేను వెంకట సుబ్బయ్యగా రింటికి వెళ్ళినప్పుడు వారు బెంగాలీనుండి తెలుగులోనికి తర్జుమాచేస్తున్నది చూచాను. 1918 నాటికే వెంకట సుబ్బయ్యగారికి బెంగాలీభాష బాగా వచ్చిం దన్నమాట.

తతిమ్మావారి సంగతి గుర్తులేదుగాని 1914 ఏప్రిల్‌లో మూడవ ఫారం పరీక్షలు పూర్తి అయినతర్వాత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు నన్ను వా రింటికి ఘంటసాలకు తీసుకొని వెళ్లారు. అప్పటికే వయస్సుమళ్ళిన వారి తల్లి నన్నెంతో ఆదరించి ప్రసిద్ధికెక్కిన దేవరకోటసీమ కొరవిపచ్చడి వగైరా రుచిచూపించి మిక్కిలి సంతృప్తిపరచారు. మండకంచంలో భోజనం వడ్డించారు. నాకు మండకంచం క్రొత్త. మండకంచం కంచుకంచమే. గుడివాడ తాలుకావారమైన మేమున్ను కంచుపళ్లాలలోనే భోజనంచేసేవాళ్లము. మా నాయనగారు కంచుపళ్లెంతోబాటు, మంచినీళ్ళకు కంచుపాత్రను ఉపయోగించేవారు. ఈ మంచినీళ్ళ పాత్ర మిక్కిలి సొంపైనది. నా తమ్ముడు సత్యనారాయణ, నేను 1927 లో వస్తువులు పంచుకొన్నప్పుడు ఈ పాత్రను ప్రత్యేకించి నేను తీసికొన్నాను. మే ముపయోగించిన కంచుపళ్ళెం సన్నమైన స్వల్పపు టంచుతో లోతుతక్కువగా ఉండేది. మండకంచము వెడల్పుగల ఎక్కువ మందమైన అంచుతో లోతుగా మెరకైన గిన్నెవలె నుండేది. దాని ప్రస్తావన ఇప్పటికిని నేను వెంకట సుబ్బయ్యగారివద్ద తెస్తూఉంటాను. ఈమధ్య కొన్నిసార్లు

ఘంటసాలకు వెళ్లియున్నాను. ఇప్పుడా మండకంచాలు లేవుకదా, చివరకు కంచుపళ్లాలుకూడా లేవు. ఇప్పుడుపయోగించే దంతా మరకలుకాని స్టీలుపళ్లాలే. కంచుపళ్లాలు పోయినపిమ్మట అల్యూమినియమ్ పాత్రలను కొంతకాల ముపయోగించారు. ఇప్పటికిని బీదసాదలు వాని నుపయోగిస్తున్నారు.

ఘంటసాల స్నేహితులను గురించి రెండు ముక్కలు చెప్పటం సమంజసం. పై జెప్పిన నల్గురులో వెంకట సుబ్బయ్యగారు మొదటి నుండియు నాకు సన్నిహితులు. ఇప్పటికిని ప్రియమిత్రులుగా, ఆత్మీయులుగా, నా క్షేమాన్ని తరచు విచారించి తెలుసుకొనే వారుగా, అప్పుడప్పుడు వా రింటికి నన్నాహ్వానించి, మాయింటికి వచ్చిపోతూ, నా భార్య, నా కోడలుతో మిక్కిలి చనువుగా, ఆప్యాయతతో వర్తించువారు. నా భార్య ఈమధ్య మృతిచెందగా ఎంతో సానుభూతిచూపించి రెండు మూడుసార్లు వచ్చి వెళ్లారు. వారి కుమార్తె శ్రీమతి శకుంతలాదేవిని కూడా తీసుకొనివచ్చారు. ఆమెకూడా మాయింటికి నాల్గైదుసార్లైనా వచ్చింది. ఇంటి బిడ్డవలె చనువుగా వర్తిస్తుంది. శకుంతలాదేవి పెద్దకుమారుడు శివాజిరావు నా మొదటి రెండు పుస్తకాలు "తాంబూలం-నైవేద్యం", "మారినకాలం" ముద్రించటంలో సాయపడ్డాడు. అసలు శివాజితండ్రి బొందలపాటి శివరామకృష్ణయ్యగారు అకాల మరణం పొందకపోతే 'దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్సు' అను పేరుతో శరచ్చంద్రుని బెంగాలీ నవలలను ఆంధ్రీకరించి తన స్వంత ముద్రణాలయంలో ముద్రింపించి, వానిని మిక్కిలి ప్రచారంలోకి తెచ్చి ప్రఖ్యాతినొందిన గ్రంథప్రచురణకర్త సహాయసంపద, నావంటివాని కుండేది.

వెంకట సుబ్బయ్యగారు స్ఫురద్రూపి. చూచినతోడనే సాత్వికసంపన్నుడని తోస్తుంది. అందమైన, వికాసంగల కోల ముఖం, పల్చని చెక్కిళ్లు, తగినట్లున్న నాసిక, పెదవులు, తరచు వెలికివచ్చే చిరునవ్వు, కాంతులీనే కళ్లు వారి నాకర్షణీయునిగా రూపొందించినవి. మనిషి అంత ఎత్తు లావు కాదుకాని

కొంతహుందాతనం లేకపోలేదు. మే మిరువురం ఒకరినొకరు ఆబాల్యమిత్రులమని తరచు జ్ఞాపకంచేసుకొంటాం. వా రింతవరకు 30 గ్రంథాలు వ్రాసి ప్రచురించారు. 'పండిత' బిరుదు నొందారు. జీవితాలు వ్రాయుటలో సిద్ధహస్తులు. అనేక పెద్దల జీవితచరిత్రలు వ్రాశారు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి జీవితచరిత్రకు వారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి రెండువేలరూపాయలు బహుమతినిచ్చింది. నా మొదటిగ్రంథం''తాంబూలం-నైవేద్యం''కు పరిచయం విపులంగా వ్రాసి నామన్నన లందుకొన్నారు. అంతే గాదు శ్రీ సంజీవదేవ్ గారి లేఖలను ప్రచురించి నా కా పుస్తకాన్ని 1964-1965 లో అంకితమిచ్చి నా కొకింత ఆధిక్యాన్ని చేకూర్చారు.

వేమూరి సీతారామయ్యగారు స్నేహశీలియే. నాయందు గౌరవంతోబాటు ఆప్యాయత బాగుగా చూపించువారు. కాని స్నేహాన్ని వృద్ధిపొందించాలనేదృష్టి తక్కువ. సహజంగా ఇతర విషయా లంతగా పట్టించుకొనే స్వభావం కలవారు కారు. కొంత భయస్థుడేమో అని నాసందేహం. వారు చామన చాయగా చక్కగా, పొడుగ్గా ఉంటారు. మా సహాధ్యాయిత్వం మరుగుపడక చక్కగా నిల్చియే యున్నది. స్నేహభావం కొనసాగుచునే ఉన్నది.

అయినంపూడి గోపాలకృష్ణయ్యను 1914 లో కలసికొన్నానేమో గాని 1918 లో కలసికొనియుండను. వా రస లప్పటికే ఘంటసాల విడచి బెజవాడ చేరుకొన్నట్లున్నది. ఇంకను వయస్సుండగనే కొన్నిసంత్సరాలక్రితం దేహం చాలించారట.

ఇక మిగిలింది రైతు పెద్ద, చాలావర కందరం అన్నగారని పిలిచే శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. నేను 1913 లో థర్డు ఫారంలో చేరినప్పుడు వీరు మా నోబుల్ హైస్కూల్ లోనే ఫోర్తు ఫారంలోకి వచ్చారు. అప్పటినుండి నేను వారి నెరుగుదును. వారితో మొదటుండిన పరిచయం స్నేహంగా మారి నా కత్యానందకరమైంది. వారియందు గౌరవమేగాక ఒకవిధమైన పూజ్యభావం క్రమేపి నాయం దభివృద్ధిచెందింది. ఇప్పు డొకరి నొకరు అన్నా అని పిలుచుకొనుచు, కనబడినప్పుడు ఒకరి నొకరు

కౌగలించుకొంటాము. అంతవరకు మా ఆప్యాయత పెరిగింది. మాయింటికి కొన్నిసార్లు వచ్చారు. నేను ఘంటసాల వెళ్లినప్పుడల్లా వారిని దర్శించకుండా ఉండలేను. వారికి సుస్తీచేసి ఘంటసాలలో కోలుకొనుచున్నప్పుడు నేను వెళ్లి చూడటం, మా యింట్లో జరిగే శుభాశుభ కార్యాలకు వారు వచ్చి సంతోషించటం, సానుభూతి తెల్పటం జరుగుతుంది.

వారు రాజకీయాలలో ప్రసిద్ధి చెందిన ఆంధ్రులలో నొకరు. స్వాతంత్ర్యం రాకముందు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంస్థకు జనరల్ సెక్రటరిగా పేరుప్రతిష్ఠలు సంపాదించారు. కారణాంతరాలవల్ల కొంత వెనుకబడవలసివచ్చినా, ఈమధ్య కొంతకాలం, శాసనమండలి అధ్యక్షులుగా చక్కగా తమ విధ్యుక్తధర్మాలను నిర్వహించి పెద్దగా రాణించారు. వారికిప్పుడు 74 సంవత్సరాలు నిండవచ్చుచున్నవి. కొంత అనారోగ్యంకూడా ప్రవేశించింది. కార్యకలాపాలను విరమించుకొన్నారు.

వారీమధ్య కొన్ని ఆసక్తికరమైన స్వంతగ్రంథాలను ప్రచురించారు. 'జీవితనౌక' అను పేరుతో చక్కని తెలుగులో, మిక్కిలి సులభమైన శైలిలో, రుచికరంగా వివిధ ఘట్టాలను విశదీకరించుచు వ్రాశారు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో వారం వారం దానిని పత్రికవారు ప్రచురించారు. త్వరలో దానిని బ్రహ్మయ్య అన్నగారు పుస్తకరూపంగా వెలువరిస్తారని ఆశిద్దాం. నా రెండో పుస్తకం 'మారినకాలం' కు పరిచయం అభిమాన పూర్వకంగా వ్రాసి నా కృతజ్ఞతకు పాత్రులైనారు.

కొన్ని సంవత్సరాలక్రితం కిసాన్ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు పరిచయులై మిత్రులైనారు. వారు రాజకీయాలలో మిక్కిలి శ్రమించి, ధనమునేగాక, ఆరోగ్యాన్ని క్షీణింప జేసుకొన్నారు. శ్రీ ఆచార్య రంగాగారికి కుడిభుజమై కొంతకాలం ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీకి అధ్యక్షులుగా పనిజేశారు. అప్పుడప్పుడు వచ్చుచు సంగతి సందర్భాలను చెప్పేవారు. వారిది భారీ విగ్రహం. ధైర్యసాహసాలు, పట్టుదల, స్వార్థరాహిత్యం, దేశంకొరకు చేసిన త్యాగం, మెప్పును గొప్పగా పొందునట్టివి.

వారికి వ్యాధి సంభవించి గుంటూరులో చికిత్స నొందుచుండగా వెళ్లి చూచాను. అనతికాలంలోనే, 60 ఏండ్ల వయస్సులోనే పరలోకప్రాప్తి చెంది నావంటి మిత్రులను, అభిమానులను దుఃఖంలో ముంచారు.

శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు, శ్రీ గొర్రెపాటి బాపనయ్యగారివంటి పెద్దబుద్ధి, స్నేహశీలత కలవారు, ఇటీవల మిత్రులైనారు. శ్రీ బాపనయ్యగారి సతీమణి శ్రీమతి మహాలక్ష్మమ్మ విదుషీగారు మా కుటుంబంనందు అభిమానంతో ఉంటారు. వారిని ఘంటసాలలో కలసికొన్నప్పుడు ఎంతో ఆదరణ చూపిస్తారు. వారీమధ్య ప్రచురించిన 'ఉభయభారతి' యను పుస్తకాన్ని బహూకరించి వారికి నాయందుగల అభిమానం వ్యక్తపరిచారు. వారి కుమారుడు చిరంజీవి చంద్రశేఖరరావు వారింటిలో ఒకటి రెండునాళ్లు రాత్రి విశ్రమించినప్పుడు శ్రద్ధగా నా అవసరాలకు తోడ్పడ్డారు.

1918 వేసవిలో కొన్ని పెళ్లిళ్లకు హాజరైనాను. రాష్ట్ర ప్రభుత్వంలో ఐ. ఎ. యస్. ఆఫీసరుగా, ట్రాన్స్‌పోర్టు కమిషనర్ వగైరా పెద్ద ఉద్యోగాలు చేసిన వెనిగళ్ల హనుమంతరావుగారి వివాహము 16-5-1918 తారీఖున విజయవాడ తాలూకా పునాదిపాడుగ్రామంలో మద్దాల రామకృష్ణయ్య చౌదరిగారి కుమార్తెతో జరిగింది. హనుమంతరావుగారి స్వగ్రామం తెనాలి తాలూకా దుగ్గిరాల. వారి గ్రామస్థులు, బంధువులు, జంపాల కుటుంబమువారు వచ్చారు. నాకు మద్రాసు కమ్మ హాస్టలులో బాగా పరిచితులైన జంపాల రామస్వామిగారు, వారి తండ్రి, పిన తండ్రులు వచ్చారు. రామస్వామి తండ్రిగారు (పేరు గుర్తులేదు) దుగ్గిరాల గ్రామమున్సిఫ్. వా ప్రాంతంలో పేరుప్రతిష్ఠలుగలవారు. వేషధారణలో, మాటలతీరులో, నడవడిలో మిక్కిలి దర్జా కలవారు. కొంత ఆడంబరముకూడా కలదు. వారి పెద్ద జరీతలపాగ, పొడుగాటి కోటు, జరీ పైపంచె, జరీ ధోవతి, మంచి వాటమైన వెండిపొన్నుకర్ర వారిని ఘరానామనిషిగా తోపించేవి. రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగముచేసిన శ్రీ పరుచూరి రామలింగయ్య, హైస్కూలు తెలుగు పండితులుగా ప్రసిద్ధిచెందిన శ్రీ జంపాల

నరసింహంగారు, ఇప్పుడు శాసనసభ్యులుగా నున్న శ్రీ చింతమనేని భావయ్యా చౌదరిగారు, శ్రీ దుగ్గిరాల రాఘవయ్యా చౌదరి వగైరా పెద్దలు వచ్చారుగాని, దర్జాలో ప్రాత పద్ధతులను అమలుపరచు కొనటంలో దుగ్గిరాల మున్సిఫ్‌గారిదే పైచేయి. ఆ రోజులలో సంపన్నకుటుంబీకులు బైటవూరికి వెళ్లినప్పుడు ఇంటి చాకలిని వెంటబెట్టుకొని వెళ్లటం కలదు. కాని మున్సిఫ్‌గారు చాకలిని తెచ్చుకొనటమేగాక, వానిచేత కాళ్లు పిసికించుకొన్నారు. రావటంతోనే కాళ్లు చేతులు కడుక్కొని, చక్కగా పక్క వేసిన మంచముమీద పడుకొన్నారు. చాకలివచ్చి మోకాలునుంచి పాదములవరకు పిసకటం, పాదాలను రుద్దటం, సవరించటం మొదలుపెట్టాడు. నా కట్టి పనిని చూడటం అదే మొదటిసారి. వింతపడటంలో ఆశ్చర్యమేముంది! వా రట్లు చేయించుకొన్నది కాళ్లనొప్పులు పోగొట్టుకొనుటకు కాదు, దర్జాకొరకు. కొంత సుఖప్రాణి చాలాదూరం నడచివస్తే, కాళ్లతీతకు పరిహారం వత్తటం, సవరించటం కావచ్చు. కాని మున్సిఫ్‌గారు దుగ్గిరాల నుండి బెజవాడకు రైలులోవచ్చి, అక్కడనుండి 2, 3 మైళ్లు దూరములోవున్న పునాదిపాడుకు ఏ గుర్రపుబండిలోనో వచ్చి యుంటారు. నేను అడిగి తెలుసుకోగా, సంపన్నకమ్మ కుటుంబాలలో ఇట్టి జంభాలు ఉండేవట. గౌరవప్రదంగా ఎంచబడేవట. తాను వెంట చాకలిని తీసుకొనిరాకపోతే, వెళ్లినవా రింటి చాకలి ఈ మర్యాద జరిపేవాడట.

నా పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి ఏకైక పుత్రిక లక్ష్మీశ్వరమ్మ, వాగి నాలుగవ కుమారుడు వెంకట కృష్ణయ్య (ఇతడు బందరు మా స్వంత భోజన వసతిలో సభ్యుడు) వివాహాలు 1918 మే 17 నుండి 21-వ తారీఖువరకు జరిగినవి. లక్ష్మీశ్వరమ్మను గుడివాడ తాలూకా నూజెళ్ళ గ్రామం పర్వతనేని మల్లికార్జునుడు గారి కుమారుడు వెంకటరత్నంకు, (ఈయన బందరు మా భోజన వసతిలో ఉండేవారు) వెంకటరత్నం చెల్లెలను వెంకట కృష్ణయ్యకు ఇచ్చి వివాహాలు జరిపారు. ఈ వివాహాలలో విశేష మేమనగా తెనాలి తాలూకా బ్రాహ్మణకోడూరుకు చెందిన కామినేని వీరయ్యచౌదరిగారి గాత్రసంగీతము. గుడివాడ తాలూకా

దింటకుర్రుకు చెందిన పొట్లూరి వీరరాఘవయ్యా చౌదరిగారి మృదంగము. పొట్లూరి వీరరాఘవయ్యా చౌదరిగారు ఆంధ్ర దేశములో మృదంగవాద్యగాండ్రలో మిక్కిలి ఘనతవహించారు. గొప్పగా వాయించేవారిలో ఒకరని పేరు తెచ్చుకొన్నారు. వారు మొదటిలో నేర్చుకొన్నది బందరు వాస్తవ్యులు సుప్రసిద్ధులైన అశ్వథాటి రామమూర్తిగారివద్ద. రామమూర్తిగారి వాద్యం మిక్కిలి మృదువైనదని, హాయిగొల్పేదని ప్రసిద్ధి. వీరరాఘవయ్యా గారు తర్వాత దక్షిణాదికి వెళ్లి శ్రీ దక్షిణామూర్తిపిళ్లై మొదలైన మొదటిరకం మార్దంగికులవద్ద ప్రాత సంప్రదాయప్రకారం శిష్యరికంచేసి నేర్చుకొన్నారు. రామమూర్తిగారి మార్దవం కలుగలేదుగాని వారి నైపుణ్యంతోపాటు దక్షిణాదివారి ఉద్దండ పాండిత్యం కలిగింది. ఇక కామినేని వీరయ్యాచౌదరిగారి సంగీత విషయం. వీరు మహా గంభీరంగా ఇంటికప్పు ఎగిరిపోయేటట్లు ఎలుగెత్తి పాడేవారు. వారి గానప్రవాహం ఉద్ధృత వర్షపాతంవల్ల పెల్లుబికివచ్చే ఏటిప్రవాహంవలె ఉండేది. గొప్పగా, ప్రగాఢంగా మనోజ్ఞంగా మాకు తట్టింది. ఈ గానసభకు హాజరైన అంగలూరు గ్రామస్థులు చిట్టా భూషయ్యశాస్త్రిగారివంటివారు బహిరంగంగా నిరసించలేకపోయినారుగాని ముఖం ముడుచుకొని కూర్చుండినారు. దానికొక కారణము వీరయ్యా చౌదరిగారి సంగీతములో అవక తవక లుండినవట, శాస్త్రీయ పద్ధతికాదట. శాస్త్రమో, గీస్త్రమో, మా మట్టుకు మాకు భలే బాగుందనిపించింది. కులాభిమానం రేకెత్తించి ఉత్సాహవంతుల్ని చేసింది. ఇతర కులాలవారి వైదుష్యం, కళాపారీణత బ్రాహ్మణులకు చుప్పనాతి తనంచేత గిట్టవని మేము తలంచాము. వారిమీద మాకు క్రోధముకూడా జనించింది.

సంగీతవిషయం వచ్చిందికనుక, బందరులో జంగం కోటయ్యా గారనేవా రుండేవారు. వారు ఫిడేలు వాయిద్యంలో మిక్కిలి నైపుణ్యంగలవా రని పేరు సంపాదించుకొన్నారు. చాలా మంది శిష్యులను తయారుచేశారు. వారింటికి ఒకటి రెండుసార్లు వినటానికి వెళ్లాను. మరిన్ని హరి నాగభూషణంగారనేవారు

కొంతకాలం మా నోబుల్ హైస్కూలులో అధ్యాపకులుగా నుండి తదనంతరం వకీలుపట్టాను పొందారు. కాని వారు న్యాయవాదిగా చెప్పుకోదగ్గ ప్రాక్టీసు చేసియుండలేదు. ఫిడేలు వాయించటంలో మిక్కిలి ప్రసిద్ధికెక్కారు. వా రితరులకు నేర్పే వారేమో గుర్తులేదు. కాని వారి వాయిద్యంలో ఆవేశమే గాకుండా తలను ముందుకు త్రిప్పటం, ముందుకు జరగటం, మూతికి వివిధభంగిమలను కల్గించటం పరిపాటి. ఈ సందర్భంలో నా చిన్నతనంలో చల్లపల్లి సుబ్బయ్య, సీతారామయ్యగార్ల సంగీత కచ్చేరి జ్ఞాపకంవస్తున్నది. సుబ్బయ్యగారు ఆంధ్రలోనైనా మొదటితరగతికి చెందిన గాయకులు. వారి గాత్రం కంచువలె మ్రోగేది. వట్టి మ్రోతేకాదు, మిక్కిలి హాయిని, ఉత్తేజాన్ని కల్గించేది. ఎంతసేపువిన్నా ఇంకా వినాలనిపించేది. సీతారామయ్యగారు ఫిడేలు వాయించేవారు. సున్నితంగా ఉండి నట్లు గుర్తు. వారి వాయిద్యం సుబ్బయ్యగారి గానానికి అనుకూలంగా తగినట్లుండేది. వా రిద్దరన్నదమ్ములని గుర్తు. వారి కచ్చేరి వినట మొక భాగ్యంగా తలంచేవారం.

పై జెప్పిన నూజెళ్లలోజరిగిన పెళ్లిలోను, పునాదిపాడులో జరిగిన వెనిగళ్ల హనుమంతరావుగారి వివాహమందును ఈ రెండు పెళ్లిళ్లలోను "దాసానాం" కు బదులు "చౌదరినాం" ఉపయోగించ బడింది. సంఘసంస్కారములో ఇది మొదటి మైలురాయి. నూజెళ్ల పెళ్లికి త్రిపురనేని రామస్వామి చౌదరిగారు హాజరయినట్లు గుర్తు. హాజరుకాకపోయినా వారి ప్రభావ మక్కడ కన్పడింది.

ఆ రోజులలో పెండ్లి ఐదు రోజులపాటు. మొదటి రోజున ఉదయం ఏ ఐదు గంటలకో వెంకటేశ్వరపూజ, దీపారాధన ప్రారంభం. ఐదవ రోజు సాయంత్రం కంకణ విసర్జన. కమ్మవారిలో వివాహం పెండ్లికూతురువా రింట జరుగుతుంది. ఎప్పుడో ఒకప్పుడు తప్ప పగలుపెళ్లిళ్లు ఉండేవి కావు. పెళ్లి సంజకాడనో, నడి రాత్రో, తెల్లవారుఝామునో. మగపెండ్లివారు క్రిందటిరోజు సూర్యుడస్తమించకముందే పెండ్లికూతురువారి ఊరు చేరుకొని పెళ్లయిన మూడవనాడు తెల్లవారగట్ట అంపకాలుచేసుకొని పెళ్లికూతురును

తీసుకొని వెళ్ళిపోయేవారు. పెళ్ళికూతురువెంట కొలదిమంది ఆడ, మగ బంధువులు వెళ్ళేవారు. అంతటితో పెళ్ళికూతురు వారి యింట పెళ్లి సమాప్తి. పెండ్లికొడుకు వారింటికి తిరిగివచ్చిన రోజంతా మరునాటి ఉదయంవరకు ఊరేగింపు వగైరా జరుపుకొనే వారు. ఊరివారికి భోజనా లుండేవి. నాలుగవనాడు అక్కడక్కడ బ్రాహ్మణ పెళ్ళిళ్లలోవలె పెళ్లికొడుకు నౌకరు, పెళ్లికూతురు నౌకరు ఎత్తుకొని ఒకరిమీద నొకరు బుక్కా చల్లుకోవటం, వసంతం జిమ్ముకోవటం చేయించేవారు. ఎత్తుకొన్న వారు నాట్య భంగిమలో పెండ్లిపందిరిచుట్టూ తిరిగేవారు. మేళతాళాలుకూడా ఉండేవి. మా నాల్గవ పెదతండ్రి కుమారుడు సీతారామాంజనేయులు పెళ్లి కీ తంతు జరిపారు. ఆరోజుల్లో చిన్నపిల్లలకు వివాహము జరిపేవారు. చిన్నపిల్లలను ఎత్తుకొని ఆడించటం కుదురుతుందికదా. పిన్నవయస్సుగల నూత్నదంపతులు సిగ్గు బిడియం లేక ఒకరిమీద మరొకరు బుక్కా చల్లుకొనేవారు. గొట్టాలతో వసంతం జిమ్ముకొనేవారు. కాని సర్వసామాన్యంగా ఆ రోజంతా ఏ ఆర్భాటం లేకుండా జరిగిపోయేది. ఐదవనాడు సాయంత్రం కంకణ విసర్జన. అంతటితో పెళ్లికొడుకువారింట పెళ్లి ముగింపు. కాని మా లింగం కుటుంబంవంటి కుటుంబాలవారు ఆరాత్రి వీరభద్రస్వామిపూజ అనగా వీరభద్రపళ్లెం పట్టేవారు. ఆరాత్రితో ఆ తంతు కూడా పూర్తయిపోయి, ఆరవనాడు ఉదయం పెళ్లికొడుకు, పెళ్లికూతురు, పెళ్లికూతురువారింటికి వెళ్లేవారు. వచ్చిన బంధువులు తలొకత్రోవ పట్టేవారు.

ఆ రోజులలో బంధువులుమాత్రమే పెళ్లికి, ఇతర శుభకార్యాలకు వచ్చేవారు. తెల్లవారుఝామున వెంకటేశ్వర దీపారాధన జరుగబోతుందనగా ఆ క్రిందటి సాయంత్రమే వచ్చి, కంకణ విసర్జనానంతరం ఆరవ రోజున వెళ్లేవారు. ఈ రోజులలో జరిగే పెండ్లితంతు ఒకపూటతోనే సమాప్తి. బంధువులేగాక ఎక్కడెక్కడి స్నేహితులు, తెలిసినవారు వస్తున్నారు. కొంతమంది సరిగ్గా జీలకర్ర బెల్లం ప్రమాణానికి వచ్చి, తాళిబొట్టు కట్టే కట్టటంతోనే వెళ్లిపోవుచున్నారు.

పూర్వంకంటె పెళ్లిపందిరి, వివాహవేదిక వగైరా మిక్కిలి శోభాయమానంగా వుంటున్నవి. సత్యనారాయణవ్రతం ఉభయత్రా, లేక పెండ్లికొడుకువారి యింట తప్పనిసరిగా నోచబడుచున్నది. పూర్వం ఐదు రోజుల పెండ్లికి అయ్యే ఖర్చుకంటె ఇప్పుడు ఒక్కపూట పెళ్లికి ఎక్కువ ఖర్చగుచున్నది. భోజనపదార్థాలు కూడా ఇప్పుడు చాలా హెచ్చే. రకరకాలైన పిండివంటలు వడ్డిస్తున్నారు. బిరంజివంటి మసాలాతో కూడిన వేపుడు అన్నము తప్పనిసరి అగుచున్నది. భోగంమేళాల, మేజువాణీల శృంగారం లేదుగాని, బ్యాండువాయిద్యాల మోత హెచ్చు.

నా హైస్కూలు చదువు ముగిసింది. ఇక కాలేజిచదువు ప్రారంభించాలి. కాలేజి చదువును గురించి చెప్పటకుముందు నా చెల్లెలు ద్రౌపదమ్మ విషయం కొంత చెప్తాను. మా తల్లి 1911 డిశెంబరులో చనిపోయిన కొలదిరోజులకు మా రెండో పిన్ని కోగంటి నరసమ్మగారు ఆ ఐదు ఏండ్ల బిడ్డను తనతో తనింటికి పెంపకానికి అంగలూరుకు తీసుకొనివెళ్లారు. అక్కడా బిడ్డ పెరిగి పెద్దదై 1920 లో పెండ్లయ్యేవరకంగలూరులోనే పిన్నివద్ద ఉండిపోయింది. మా తండ్రిగారు 1924 వరకు జీవించియున్నా, వారు తిరిగి వివాహంచేసుకొన్న భేదం కన్పరచకపోయినా, ద్రౌపదమ్మ విషయంలో నేను ప్రత్యేకశ్రద్ధ తీసుకొనేవాడను. పిల్లకు చదువుతోబాటు సంగీతంకూడా నేర్పించాలని సంకల్పం కల్గింది. అంగలూరు వాస్తవ్యులు సంగీతవిద్వాంసులు చిట్టా భూషయ్యగారిచేత ఆమెకు సంగీతం నేర్పునట్టు ఏర్పాటుచేశాను. ఏదో పెండ్లిచదువన్నట్లు నేర్చుకొన్నది. విద్యకూడా సామాన్యంగానే అబ్బింది.

పెండ్లయినతర్వాత కొంతకాలానికి అంగలూరుకు వెళ్ళి, పిమ్మట సమీపంలోనే సిద్ధాంతానికి కాపురానికి వెళ్ళిపోయింది. ఆమెకు మొదట వరుసగా నల్గురు కుమార్తెలు, తర్వాత నల్గురు కొడుకులు కలిగారు. ఆడపిల్లలు పున్నమ్మ, పిచ్చమ్మ, వెంకట నరసమ్మ, భాస్కరమ్మ అను పేర్లుకలవారు. కొడుకుల పేర్లు వరుసగా లక్ష్మీప్రసాద్, పూర్ణచంద్రరావు, శివరామకృష్ణారావు, రామ

చంద్రరావు. వారందరు భర్తలతో, భార్యలతో, బిడ్డలతో సుఖంగా వున్నారు. పున్నమ్మను మాతండ్రి మొదటిభార్య పెద్దచెల్లెలు చంద్రమ్మగారి ఐదవ కొడుకు (చివరివాడు) పోలవరపు వెంకటేశ్వరరావుకు, నాల్గో పిల్ల భాస్కరమ్మను నా పినతల్లి రాజరత్నమ్మ కొడుకు, బి. యస్‌సి. (అగ్రికల్చర్) అక్కినేని వెంకటేశ్వరరావుకు ఇచ్చి వివాహాలు చేశారు. నాల్గవ వాడు రామచంద్రరావుకు కొలది కాలంక్రితం వివాహమైంది. అతనిభార్య విజయనగరంలో ప్రసిద్ధిపొందిన కమ్మ కుటుంబాలలో నొక కుటుంబానికి చెందింది. మా బావమరది నిమ్మగడ్డ దుర్గానాగేశ్వర రావుగారు చాలాసమర్థుడు, దర్జాగల మనిషి. కాని అదృష్టవంతుడు కాదు. గుడ్లవల్లేరులో బియ్యంమిల్లు నడిపి చాలా నష్టపడి భూములను తెగనమ్ముకోవలసివచ్చింది. ఆయన ఇంకా బ్రతకవలసినరోజులుండగానే వ్యాధిగ్రస్తుడై పరలోకగతుడైనాడు. క్రమేపి భూవసతి తగ్గిపోగా ఉన్నదాని నెంతోకొంత కమ్ముకొని, మగపిల్లలు గుంటూరుజిల్లా మాచెర్లకు వెళ్ళిపోయారు. అక్కడ మా బావమరది మేనకోడలు శ్రీమతి దుర్గాంబ భర్త శ్రీ వెలగపూడి రామకృష్ణ స్థాపించి నడుపుచుండిన సిమెంటు ఫ్యాక్టరీ ఉన్నదికదా. పెద్దవాడు ముందు ఆ మిల్లులో ఉద్యోగిగా చేరాడు. తర్వాత కడపరాళ్లు నునుపుచేసే కర్మాగారాన్ని పెట్టుకొని, కొన్ని లారీలను నడపుచు, ఒక డ్రింకు షాపును పెట్టుకొని అభివృద్ధిలోనే ఉంటున్నారు.

నా అక్క శేషారత్నం తన 20-వ ఏటనే నిస్సంతుగా 1916 లో ననుకొందును చనిపోయిందని. ఆమె భర్త అంగలూరు వారు (శ్రీ)దుగ్గిరాల రామశాస్త్రుల్లగారని పైన చెప్పాను. శ్రీ రామ శాస్త్రుల్లగారు సాత్వికులు. ఎట్టి తగాదా పెట్టుకొనకుండా తనపనిని తాను చూచుకొనే పెద్దమనిషి.

## కాలేజి చదువు

నా కాలేజిచదువు ఇంటర్‌మీడియెట్ ఒడుదుడుకులుగా సాగింది. స్నేహితులమాటలు విని, స్కూలు ఫైనల్ అయిన తర్వాత ఇంటర్ జూనియర్ చదువుటకు నేను గుంటూరులోని ఎ. ఇ. ఎల్. ఎమ్. కాలేజిలో 1918 జూలై 2-వ తారీఖున చేరాను. అప్పుడు కాలేజి ప్రిన్సిపాల్ రూపర్ట్ అనేవారు. అంతకుముందు ప్రిన్సిపాల్‌గాఉండి, రిటైరయి, గుంటూరులోనే ఉంటూఉన్న వూల్‌గారు గౌరవ ప్రొఫెసరుగా ఉండేవారు. బైబిల్‌పాఠం చెప్పుతుండేవారు. వూల్‌గారు చాలా మంచివారు, మతప్రచార నిమగ్నులు. వారు చాలా పొడవరి. 6 అడుగుల 3 అంగుళముల పైన ఎత్తువుండి బక్కపలచగా ఉండేవారు. రూపర్ట్‌గారు మధ్య రకం ఎత్తు, లావుగా ఉండేవారు. వూల్‌గారు వృద్ధులుకాగా రూపర్టుగారు మధ్యవయస్సువారు. పాల్ అనే దేశీయక్రైస్తవుడు కారునలుపుతో, ఎత్తుగా, లావుగా ఉండేవారు. ఇంగ్లీషు, చరిత్ర చెప్పేవారని గుర్తు. తరువాత వీరు పౌలస్ అనుపేరుతో ప్రిన్సిపాల్ అయినారనుకొంటాను. ఇంకొకరు జయంతి సత్యనారాయణమూర్తి గారు. వీరు లాజిక్ మొదలగునవి బోధించేవారు. చాలా ఠీవిగా, గంభీరంగా ఉండేవారు. వారిని చూస్తే విద్యార్థులకు హడల్‌గా ఉండేది. నామట్టుకు నాకు ఆయన క్లాసులో భయంగాఉండేది. వారు చాలా లోతైన మనస్సు గలవారని, మేధావి అని అనుకొనేవారు. ఆయన, తర్వాత జిల్లావిద్యాధికారిగా వెళ్లి నట్లున్నది. ఇంకో యిద్దరు గుర్తుకువస్తున్నారు. ఒకరు జోగంటి రామసోమయాజులుగారు. వారు తెలుగులో ప్రవీణులు. సౌమ్య మూర్తులు, సరళస్వభావులు. వీరు నవీనదృష్టితో కర్ణచరిత్ర వ్రాశారు. మరొక తెలుగుభాషా బోధకులు నల్లగా, బొద్దుగా, మీసాలతో, మధ్యరకం పొడవుగల్గినవా రుండేవారు. పేరు గుర్తుకురావటంలేదు వారు నా జూనియర్ ఇంటర్‌మీడియెట్ అర్ధసంవత్సరం పరీక్షలో తెలుగువ్యాసం దిద్దారు. 75% పైగా మార్కులు వేశారు. నాకు కబురంపి బాగావ్రాశావని ప్రశం సించారు.

నా సహాధ్యాయులలో కొత్త వెంకయ్య చౌదరిగారొకరు. నే నక్కడచేరిన కొద్దికాలానికే వారు ఇంజనిరింగు చదువుటకు స్కాట్లాండులోని ఎడింబరో విశ్వవిద్యాలయానికి బైలుదేరి వెళ్ళిపోయారు. ముమ్మానేని వెంకట్రామయ్య, ముప్పాళ వెంకట్రామయ్య, మరిద్దరు కమ్మ విద్యార్థు లుండేవారు. రెండో వారు మిక్కిలి చురుకు, చాతుర్యము గలవారు. అకాలంగా చిన్న వయస్సులోనే మరణించినట్లు తర్వాత విన్నాను. మొదట వారిని చాలా సంవత్సరాల తర్వాత తిరిగి కలసికొన్నాను. వారు వకీలువృత్తిలో నుండినారు. తిరిగి కలసికొన లేదు. సజీవులుగానే ఉన్నారేమో చెప్ప లేను. నా చదువు చాలామధ్యరకంగా ఉండేది.

సరిగా క్లాసులకు వెళ్లేవాడిని కాను. చీట్లపేక ఆడటం సరదా. భోజనప్రియత్వం జాస్తి. ఇవి చేతులార తెచ్చుకొన్నవే అయినా చదువు సాగటం లేదని దుఃఖ పడేవాణ్ణి. ఆయాకారణాల వల్ల గుంటూరులో ఇక ఉండుట కిష్టం లేకపోయింది. అందువల్ల పార్టు టరమ్ ఆరంభంలో అనగా జనవరిలో (1919) తిరిగి మా నోబుల్ కళాశాలకు వెళ్ళి, ప్రిన్సిపాల్ విలియమ్ పెన్ గారిని ఆశ్రయించి కాలేజిలో చేరాను.

ఆ రోజుల్లో గుంటూరులో ఒకటే కాలేజి ఉండేది. ఇప్పుడున్న హిందూకాలేజి అప్పుడు హైస్కూలు మాత్రమే. హిందూ హైస్కూలులోను, కాలేజిలోను కమ్మ విద్యార్థులు చాలామంది ఉండేవారు. విద్యార్థి తలమానిక మగు జంపాల సాంబయ్యగారి ప్రయత్నంవల్ల ఒక పెద్ద హాస్టల్ కమ్మ విద్యార్థులకొరకు ప్రారంభించారు. అక్కడ చోటుచాలకను, భోజన సదుపాయాలు ఇంకా బాగావుండాలని తలంపుతోను వేరే రెండో వసతి శ్రీ జంపాల సాంబయ్యగారు ఏర్పాటుచేశారు. అందులో ఎనమండుగురుమాత్రమే ఉండేవారము. నేను, నా పెదతండ్రి కుమారుడు వెంకట కృష్ణయ్య, నాదెళ్ల వెంకటదాసు, శ్రీసాంబయ్య. పొట్లూరి రాజయ్య, వాసిరెడ్డి శ్రీకృష్ణ, అవనిగడ్డకు చెందిన నల్ల శ్రీకృష్ణ ఇంకొకరు ఉండేవారం. భోజనం మిక్కిలి ఖర్చుతో చాలా బాగుండేది. మా అందరిలో వాసిరెడ్డి శ్రీకృష్ణ చిన్నవాడు. ఆయన, అప్పుడు, 5–వ ఫారం చదువు

చుండేవాడు. సాదాక్రాపు, పిలకజుట్టు. పల్చగా, పచ్చగా, అచ్చమైన పల్లెటూరి అబ్బాయిగా ఉండేవాడు. అప్పు డా అబ్బాయిని చూచినవారు, తరువాతకాలంలో వారు ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ పదవిని నిర్వహించి, యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ అధ్యక్షపదవి వహిస్తారని అనుకొనియుండరు. అయితే అప్పుడే ఆ అబ్బాయి మితభాషిగా, ముభావంగా, ఏదో ఆలోచిస్తున్న ట్లుండేవాడు. మా ఎనమండుగురు కలసిమెలసి ఉండేవారంకాని, చివరరోజుల్లో నాకున్ను ఒక రిద్దరు విద్యార్థులకున్ను భేదాభిప్రాయాలువచ్చి, మనస్సు కొంత కలతచెంది, నేను గుంటూరునుండి లాంగ్ టరమ్ తర్వాత, బందరు నోబుల్ కాలేజికి వెళ్లిపోవటానికి మిక్కిలి తోడ్పడింది.

ఆ రోజుల్లో కమ్మపాలెం (కొరటిపాడు) గుంటూరు కును ఎడమగా ఉండేది. నిజానికి ఆనాడు అరండల్ పేట, బ్రాడీపేట వగైరా లేవనియే చెప్పాలి. కొరటిపాడు కమ్మకులస్థులు ఇంచుమించుగా అందరు పాలు, పెరుగు, నేయి అమ్ముకొని జీవించే వారు. మా వసతికి సరిపడిన లావు, పొడుగు గల్గి అంగసౌష్ఠవము గల 18, 19 సంవత్సరాల ఒక యువతివచ్చి పెరుగు, నేయి ఇస్తూ ఉండేది. ఆమెకు ముతకచీరతప్ప రవిక ఉండేదికాదు. పెరుగు కుండ నెత్తినిపెట్టుకొని వచ్చేది. అదివరకున్న అనుభవంవల్ల గొల్లయువతి అనుకునేవాడను. ఎందుకో ఒకనాడు, సాంబయ్య గారిని అడుగగా కమ్మ అమ్మాయి అని చెప్పాడు. నాకు చాలా ఆశ్చర్యంవేసింది.

ఒక విచారకరమైన అనుభవం. 1918 లో ప్రపంచ మంతా క్రొత్త జాడ్యం వ్యాపించి, కొన్నిలక్షలమందిని పొట్టబెట్టు కొన్నది. ఇండియాలో ఆరులక్షలు చనిపోయినట్లు విన్నాను. అది ఇన్ఫ్లూయెంజా. మన దేశంలో వ్యాపించటం అదే క్రొత్త. పెద్ద కమ్మ వసతి గృహాలలో ఉండే యువకులలో ఒక వినుకొండ తాలూకా విద్యార్థి కోటయ్య అనేవా డుండేవాడు. అతడు పాపం, ఈ క్రొత్తజాడ్యం ఆరంభంలో చనిపోయిన మొదటి వాళ్లలో ఒకడు. అతనికి 11-7-1918 తారీఖు ఉదయం జ్వరం

వచ్చిందట. మధ్యాహ్నానికి ముంచుకొనివచ్చి ఆ సాయంత్రం లోగానే చనిపోయాడు. వెంటనే తల్లిదండ్రులకు కబురువెళ్ళింది కాని దూరమగుటచేతను, బస్సుల సౌకర్యం లేకపోవుటచేతను, మరేకారణాలవల్ల నైతేనేమి సకాలములో తల్లిదండ్రులు రాలేదు. మరునాడు ఉదయంవరకు శవమును ఉంచాము. రాత్రి తెల్లవార్లూ శవజాగరణ చేశాము. డాక్టరు అంటుజాడ్యము, శవాన్ని ఉంచటానికి వీల్లేదన్నాడు. అందుచేత కొంతమంది విద్యార్థులం పూనుకొని శవవాహనం తయారుచేసి, శవాన్ని శ్మశానానికి తీసికొనివెళ్లాము. తలకొరివి ఎవరు పెట్టాలి అని ప్రశ్నవచ్చేటప్పటికి, అక్కడున్న వారిలో ఎవరు ముందుకురాకపోవటాన్ని చూచి, నేను ముందుకువచ్చి తలార స్నానంచేసి, అగ్ని సంస్కారం చేశాను. 18—20 సంవత్సరాల యువకునికి, 20 సంవత్సరాల వయస్సుగల నేను దహనసంస్కారం చేయవలసి వచ్చింది. తర్వాత 20 సంవత్సరాలకు 1938 నవంబరు 13-వ తారీఖున, 20-వ సంవత్సరము జరుగుచున్న నా పెద్దకొడుకు పూర్ణచంద్రరావు బెజవాడ కమ్మ హాస్టలులో అకాలమరణం చెందగా, శవాన్ని ఇంటికి పెడసనగల్లు తీసుకొనివెళ్లి నా చేతులారా దహనంచేస్తిని. ఇది నా మూడో అనుభవం. నా మొదటి అనుభవం 1911 డిశెంబరులో నా తల్లి తన 33-వ ఏటనే చనిపోయినప్పుడు. ఈశ్వరుడు నా కిట్టి అకాలమరణానికి పాలైన పిన్నవయస్సువారికి దహనసంస్కారంచేసే వ్రాత వ్రాసి పెట్టాడు కాబోలు!

మేము శ్మశానంనుండి తిరిగివచ్చిన కొద్దిసేపటికి, మృతుని తల్లిదండ్రులు వచ్చారని తెలిసినది. నేను హాస్టలు మేడమెట్లు ఎక్కుచుండగా ముతకబట్టలతో చొక్కాలేకుండా వెండి మురుగులు గల ఒకవ్యక్తి మెట్లమీద చతికిలపడివుండటం చూచాను. యువకుని తండ్రి వగైరా వారితో వచ్చిన చాకలి అనుకొంటిని. తీరా ఆవ్యక్తి మరణించినవాని తండ్రి అని తెలిసింది. ఆ రోజుల్లో కొన్నిప్రాంతాల్లో ముఖ్యంగా గుంటూరు మెట్ట

ప్రాంతాల్లో కమ్మవారు చాలా మోటుగా ఉండేవారు. స్త్రీలు కూడా పొలంవెళ్ళి వ్యవసాయంపనులు చేస్తుండేవారు. వెండి వస్తువులే వారికి ఎన్నదగిన ఆభరణాలు. ఆ యువకుని తండ్రి చాలా ఘోషించి "మనకు ఇంగ్లీషు చదువెందుకురా, మన వ్యవసాయం మనం పోషించుకొంటే చాలదా అని ఎన్ని చెప్పినను వినక, చదువు అని వచ్చి ఈ విధముగా బుగ్గిపాలైనా" డని రోదించాడు. మా అందరి గుండెలు నీరుకారిపోయినవి. ఈ దుర్మరణాన్ని తెలిసిన నూతక్కి రామశేషయ్యగారివంటి సహృదయులు ఎంతయో సంతప్తహృదయులైనారు. శ్రీ రామశేషయ్య మద్రాసునుండి 3-8-1918 తారీఖున నాకు వ్రాసిన పోస్టుకార్డు వారి మనోవేదనను తెల్పుచున్నది. ఎవరెంత దుఃఖించినా, విధి నెవరు తప్పించగలరు? ఆ యువకునిది సత్తెనపల్లి తాలూకాలోని ఒక కుగ్రామం.

గుంటూరు కాలేజి విద్యార్థిగా, ఒకటి రెండు జ్ఞాపకాలు చెప్పదలచాను. ఒకనాడు వూల్ గారు పాఠం చెప్పుచుండగా నేను బ్రేవ్ మని బిగ్గరగా త్రేపాను. వూల్ గారు విని పాఠాన్ని ఆపి, చాలా కోపంతో ఏవగించుకొని, త్రేపటాన్ని తీవ్రంగా నిరసించారు. నేనని తెలియదు కాబట్టి ప్రత్యేకించి నన్ను తిట్టలేదు కాని క్లాసుమొత్తాన్ని చివాట్లుపెట్టారు.

మా కాలేజి హైస్కూలు భాగానికి జాన్ అనే భారతీయ క్రైస్తవుడు హెడ్ మాస్టర్ గానో, ఫస్టు అసిస్టెంటు గానో ఉండేవాడు. అతడుగాని, అతని తండ్రిగాని హరిజనకులం నుండి క్రైస్తవమతం పుచ్చుకొన్నారు. ఆయనొక బ్రాహ్మణస్త్రీని వివాహమాడారు. ఆ స్త్రీ బహుశా పెళ్లికాకముందే క్రైస్తవ అయియుండును. నేను నోబుల్ హైస్కూలు అధ్యాపకులు రామశాస్త్రి, నిత్యానంద శాస్త్రిగార్ల విషయంలో చెప్పినట్లు ఈ వనితకూడా, బ్రాహ్మణ పద్ధతులను విడిచిపెట్టక యుండవచ్చును. జాన్ గారు బ్రేవున త్రేపుచు, తన భార్య కందిపచ్చడి ఎంత రుచికరంగా చేసింది, తా నెంత యిష్టంగా తిన్నది చెప్పుచుండేవారు. ఇది డాంబికంగా

తన భార్య బ్రాహ్మణస్త్రీ అని తెలియజేయుటకో అన్నట్లు చెప్పుచుండేవారు. బ్రాహ్మణులు తరచు కందిపచ్చడి చేసుకొంటారని, ఇష్టంగా తింటారని వాడుక.

నేను కాలేజిలో చేరుటకు గుంటూరు 29-6-1918 తారీఖున చేరుకొన్నప్పుడు నూతక్కి రామశేషయ్యగారిని కలసికొని వారి అన్న, చిలువూరు గ్రామ మున్సిఫ్‌గారు శ్రీ నూతక్కి వీరరాఘవయ్యగారింటికి వెళ్లాను. వారప్పుడు గుంటూరులో మకాంపెట్టి పొగాకువ్యాపారం చేస్తూ ఉండేవారు. వారు మిక్కిలి సరసులు, కులాభిమానులు. వారితో నాకదివరకు పరిచయం లేకపోయినా వారి తమ్ముడు రామశేషయ్యగారితో అదివరకు బాగా పరిచయం. పైగా శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారు (నా పినతల్లి భర్త) వారికి స్నేహితులు. నేను వారింటిలో 2, 3 రోజు లుంటిని. వారి ఆతిధ్యాన్ని, ఆప్యాయతను చూరగొంటిని. వీరరాఘవయ్యగారు హుందాతనం, పెద్దమనిషి తరహా ప్రస్ఫుటంగా కలవారు. ఎరుపైన శరీరవర్ణంతో, చిరునవ్వు చుండే ముఖంతో, తెల్లని పలువరసతో, మెచ్చులైన మీసాలతో అందంగా ఉండేవారు. కంఠధ్వని జిలుగు, మాటల సొంపు. తెల్లని ధోవతి, నలుపురంగు కోటు, ఠీవిగా చుట్టుకొన్న తలపాగ, కొట్టవచ్చినట్లు కమ్మరికం తెలిపేది. వారు వయస్సు బాగా మళ్ళకపూర్వమే వెళ్లిపోయారు. వారి కుమారుడు చంద్రమౌళి ఇండియా సిమెంటు కంపెనీలో పెద్ద ఉద్యోగం పేరు ప్రతిష్ఠలతో నిర్వహిస్తు, పిన్నవయస్సులోనే మరణించారు.

గుంటూరులో నే నెరిగిన విద్యార్థుల విషయం. శ్రీ జంపాల సాంబయ్యగారు కమ్మ విద్యార్థి నేత. వారి కులాభిమానం, విద్యాభిమానం, సాయంచేయాలనే తహతహ, కష్టమనక, నిష్ఠురమనక, నష్టమనక, ఎల్లప్పుడు కమ్మ విద్యార్థుల కుపయోగపడాలని, వారి అవసరాలను తీర్చాలనే వారి ఆతురత నిరుపమానం. అట్టి స్వార్థత్యాగి, సేవాతత్పరుడు, కార్యదక్షుడు ఏ సంఘంలోనైనా కోటికొకడుకూడా ఉండడని నా అభిప్రాయం. వారేకారణం వల్లనో (బహుశా, తనకాలంలో చాలాభాగం ఇతరుల కుపయో

గించటంవల్ల కాబోలు) కాలేజి చదువు పూర్తి చేయలేదు. లోకల్ గవర్నమెంటు సర్వీసులో ప్రవేశించి, నేను 1939 ఆఖరులో అనంతపూరునుండి కర్నూలుమీదుగా ఇంటికి వచ్చుచున్నప్పుడు, దారిలో ఒంగోలు మ్యునిసిపాలిటి పరిపాలన ఉద్యోగిగా (ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు) ఉండినారు. వీరి అన్నయే మా మద్రాసు కమ్మ వసతికి వచ్చి మమ్ము మందలించిన శ్రీ జంపాల గోపాలరావుగారు. ఇంకొక అన్న నారాయణరావుగారు కేంద్ర మంత్రి శ్రీ కొత్త రఘురామయ్యగారి సోదరి భర్త అని గుర్తు.

శ్రీ కొత్త వెంకయ్య చౌదరిగారు శ్రీ రఘురామయ్యగారి అన్న. వారు పైజెప్పినట్లు లాంగ్ టరమ్ మధ్యలోనే ఇంజనీరింగు చదువుటకు ఇంగ్లండుకు వెళ్లారు. వారు చాలా స్నేహశీలురు, యోచనాపరులు, మాటకారి. వారు స్కాట్లెండు ముఖ్యపట్టణం ఎడింబరో యూనివర్సిటీలో ఇంజనీరింగు బి. యస్ సి. పట్టాను పొంది, తిరిగివచ్చి సివిల్ ఇంజనీయర్ గా గవర్నమెంటు ఉద్యోగం చేశారు. హైవేస్ సూపరింటెండింగ్ ఇంజనీయర్ గా కాకినాడలో పనిచేస్తూ అకాలంగానే మరణించారు. వారికి సంతానంలేదు. వారింగ్లండు బైలుదేరేముందు, నేను తెనాలి తాలూకా సంగం జాగర్లమూడిలోని వారింటికి వెళ్ళాను. అప్పుడు వారి తండ్రి శ్రీ జగన్నాథంగారిని చూచాను. వారు లావుగా, పొట్టిగా గోధుమరంగు ఛాయతో ఉండేవారు. మంచి మాటకారి. వ్యవహారదక్షుడు. వారిని తరువాత నేను గుంటూరులో చూచినప్పుడు పెద్ద తలపాగతో, నల్లని పొడుగు కోటుతో, ప్రముఖ న్యాయవాదిగా తోచారు.

శ్రీ వాసిరెడ్డి కృష్ణగారు మా అందరిలో చిన్నవారని, మితభాషిగా, ముభావంగా ఉండేవారని, ఆలోచిస్తూ కూర్చొని ఉండేవారని పైన చెప్పాను. వారితో దగ్గరకు రావాలని ప్రయత్నించినా దూరదూరంగా ఉండేవారు. వారు తెనాలి తాలూకా పెదపాలెం వాస్తవ్యులు. వారిది ఘరానాకుటుంబం. వారు ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయంలో శ్రీ ఆచార్య రంగాగారితో బాటు నా సహాధ్యాయి. ఆ విషయం తరువాత.

శ్రీ నాదెళ్ల వెంకటదాసుగారు గుడివాడ తాలూకా కౌతరంకు చెందినవారు. పచ్చగా, లావుగా, పొట్టిగా ఉండేవారు. వారి నెప్పుడు చూచినా అలాగే ఉండేవారు. మాట గడుసు, కరుకు. వాదన ప్రియులు. వసతి గృహంలో నాతో తగాదా పెట్టుకొన్న ఇద్దరు ముగ్గురులో వారు ముఖ్యు లనుకొందును. దేహం బరువైనదైనా చురుకుగా ఉండేవారు. వారు స్కాట్లెండు లోని యాబర్డీన్ విశ్వవిద్యాలయంలో వ్యవసాయశాస్త్రంలో పట్టభద్రులైనారు. చాలాకాలం మధ్యప్రదేశ్ లోని బిలాస్ పూరులో నివసించారు. తరువాత శ్రీ వెలగపూడి రామకృష్ణ గారి ఆధ్వర్యమున నున్న చెన్నూరు పంచదార మిల్లులో పని చేస్తూ ఇటీవలనే మరణించారు.

నా పెదతండ్రి కుమారుడు లింగం వెంకట కృష్ణయ్య మిక్కిలి చురుకైన వర్తన కలవాడు. విశేషాలను సేకరించి ప్రచారం చేసే స్వభావం కలవాడు. కలుపుగోట్టు మనిషి. అవసరానికి ఆదుకొనేబుద్ధి కలవాడు. పరిచయంచేసుకొనటంలో, స్నేహితు లను కూడగట్టుకొనటంలో నిపుణుడు. చదువులో ఆసక్తివున్నా, అంతగా చదువుచుండేవాడుకాదని నాకు తోచేది. మొత్తానికి ఇంటరుమీడియెట్ పూర్తిచేయకుండానే చదువు చాలించాడు. గుంటూరులో ఆ సంవత్సరాంతంవరకైనా ఉండినా డనుకొందును.

గుడివాడ తాలూకా గుడ్లవల్లేరు శ్రీ పొట్లూరి రాజయ్య (రాజేశ్వరరావు ?) నెమ్మదిగా ఉండేవారు. తనపనేదో తాను చూచుకొనేవారని జ్ఞాపకం. పెద్దమనిషి. సామాన్యమైన పొడవుతో, నల్లగా ఉండేవారు.

దివి తాలూకా అవనిగడ్డ వాస్తవ్యుడు శ్రీకృష్ణగారు నల్లగా, పొడవుగా, లావుగా ఉండేవారు. చదువుసంధ్యలు మధ్యరకం. కొంత బండభాయితన ముండేదేమో అని స్ఫురించుచున్నది. కాని మొత్తంమీద సుస్వభావం, కలుపుగోలుతనం ఉండినవారే.

నా విషయం. నేనప్పటికిని లావుగా, పొట్టతో, పెద్దమీసా లతో, కొంత లావు దవళ్ళతో ఉండేవాడను. తుస్సు, తప్పుపట్టటం, చీటికిమాటికి కోపం తెచ్చుకోవటం నన్ను వెంటాడుచునే

ఉండినవి. భోజనప్రియత్వం పెరిగిందే కాని తగ్గలేదు. బాగా చదవాలని, గొప్పగా వ్యాసవ్రాయాలని కోర్కెయున్నా సోమరితనం, చీట్లపేకాట, వంటవానితో కాలక్షేపం చేయటం తప్పలేదు.

ఈ ఘట్టం ముగించేముందు జ్ఞాపకానికివచ్చిన ఒక విషయాన్ని చెప్పాలి. ఆగష్టులోనో, సెప్టెంబరులోనో నా వ్రేలు విడిచిన మేనమామ శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అధ్యక్షతన, నిడుబ్రోలు గ్రామ గ్రంథాలయ వార్షికోత్సవానికి నేను వెళ్ళాను. ఆ సభ కార్యకలాపాలను నిర్వర్తించినవారిలో ప్రముఖులు శ్రీ గోగినేని రంగనాయకులుగారు, ఇప్పటి ఆచార్య యన్. జి. రంగాగారు. వారప్పుడు గొరిగిన తలతో, పిలకజుట్టుతో, శుద్ధ వైదికిగా ఉండేవారు. అప్పుడు వారు ఐదవ ఫారం చదువుచుండేవారనుకొందును. రామస్వామిచౌదరిగారు గంభీరోపన్యాసం చేశారు. కమ్మ యువకులను బాగుగా చదువుకొండని, సంఘసేవ చేయండని, ఆత్మాభిమానాన్ని, గౌరవాన్ని పెంచుకొండని ఉద్బోధించారు. శ్రీ రంగాగారు ధారాళంగా, విషయపూరితంగా, గ్రంథాలయాల ఉపయోగాలను, వాని నుపయోగించుకోవలసిన తీరును ఉపన్యసించారు. శ్రీ రంగాతో అప్పుడు నేను పరిచయం చేసుకొన్నట్లు గుర్తులేదు. శ్రీ రామస్వామి చౌదరిగారిని కలసికొని నా గౌరవపూర్వక నమస్కారాలర్పించాను.

## తిరిగి బందరు చదువు

(జనవరి 1919 నుండి 1920 మార్చివరకు)

పైన చెప్పినట్లు గుంటూరు ఎ. ఇ. యల్. యమ్ (అమెరికన్ ఎవాన్‌జెలికల్ లూథరన్ మిషన్) కాలేజినుండి, 1918 డిసెంబరు పరీక్ష లైనతర్వాత, బందరు నోబుల్ కాలేజిలో జనవరి 1919 నుండి ఇంటరుమీడియెట్ జూనియర్ క్లాసు చదవటాని కారంభించాను. 1919 మార్చి ఆఖరువరకు అనగా ఇంటరు జూనియర్ పరీక్ష పూర్తయి సెలవులకు ఇంటికి వెళ్లేవరకు

హోటలులో భోజన మనుకొందును. 1919 జూలై ఆరంభంలో కాలేజి తెరచి ఇంటరు సీనియర్ క్లాసులు ప్రారంభించినప్పుడు మా ప్రాత వంటవాడు యడ్లపల్లి రామన్న చేత వంటచేయించు కోవటం ఏర్పాటుచేసుకొన్నాం. నేను, నా పెదతండ్రి కుమారుడు వెంకట కృష్ణయ్యా, పర్వతనేని వెంకటరత్నం, త్రిపురనేని శివ ప్రసాదరావు, దుగ్గిరాల రామకృష్ణయ్యా, దుక్కిపాటి నాగభూషణం "చౌదరి లాడ్జి" అను పేరుతో బచ్చుపేటలోని శ్రీ యన్. వెంకయ్యగారింట్లో (మా పాతవసతికి దగ్గరలోనే) వసతి గృహం నడుపుకొన్నాం.

ఇంటరుమీడియెట్‌లో నా అభిమాన అంశాలు తెలుగు, సంస్కృతం, తర్కశాస్త్రం. తర్కం సుందరం పిళ్లై అనేవారు బోధించేవారు. వారు వాగ్ధాటిగలవారు. గట్టిగా, విసురుగా బోంకరించినట్లు చెప్పేవారు. మనిషి నలుపు. మధ్యరకం లావు, పొడవు. పానీయంతో కళ్లు ఎర్రగా ఉండేవి. హృదయం మంచి దనుకొందును. తెలుగు కానుకొల్లు త్రివిక్రమ రామారావుగారు చెప్పేవారు. వారి విశిష్టతను గురించి తర్వాత కుర్తాళం సిద్ధేంద్ర పీఠాధిపతియైన విషయం పైన చెప్పాను. సంస్కృతం మొక్కపాటి సూర్యనారాయణశాస్త్రిగారు చెప్పేవారు. వారు నల్లగా, చామనచాయగా, బక్కగా, మధ్యరకం పొడవుతో ఉండేవారు. సహజంగా గడుసరి. కులతత్వం ప్రస్ఫుటంగా ఉండేది. కాని విద్యావిషయంలో పక్షపాతం ఉండేది కాదు.

సూర్యనారాయణశాస్త్రిగారు మాకు శ్రీహర్షుని రత్నావళి నాటకాన్ని చెప్పేవారు. పైగా మా తెలుగు వ్యాసాలను దిద్దేవారు. వీరుగాక ఐ. వి. యల్. నరసింహాచారిగారనేవారు సంస్కృతం, ఇంగ్లీషులో వ్యాఖ్యానిస్తూ చెప్పేవారు. సూర్య నారాయణశాస్త్రిగారికింగ్లీషు రాదు. తెలుగులో అర్థం చెప్పేవారు. నరసింహాచారిగారు యమ్. ఎ. యల్. టి. ధారాళంగా ఇంగ్లీషులో అర్థంచెప్పగలిగేవారు. వారు స్ఫురద్రూపి, మధ్యరకం పొడవు, కొంచెం లావుగా ఉండేవారు. మంచి హృదయం కలవారు. విద్యార్థులను అభిమానించి ఆదరణచూపేవారు.

ఇంగ్లీషు వేదనాయకం పిళ్లెగారు చెప్పేవారు. వారు షేక్‌స్పియర్ నాటకాలు చెప్పటంలో మిక్కిలి ఘటికులు. మాట మాట, పదం పదం విడదీసి, చర్చించి, అర్థంచేప్పేవారు. సొగసులు చూపించేవారు. వారు మిక్కిలి సన్నగా, బలహీనంగా ఇవ్వాళో రేపో ఊడిపోతారేమో అనేటట్లుండేవారు. అప్పటికి వయస్సుమళ్ళి, తెల్లని మీసాలతో ఉండేవారు. ముదురు గోధుమ రంగు జరీ తలపాగ, కోటు, తెల్ల ధోవతి, చప్పరిస్తూ, గుటకలు మ్రింగుతూ చెప్పినా మిక్కిలి ధాటిగా, స్ఫుటంగా చెప్పేవారు. సుందరం పిళ్లెగారివలెనే త్రాగినమత్తులో ఉన్నట్లుండేవారు. వారి త్రాగుడు నిత్య దినకృత్యం. త్రాగకపోతే పాఠంచెప్పేశక్తి ఉండేది కాదేమో అనుకుంటాను. వారు భోజనప్రియులు. తినేది వెలగకా యంతదైనా, 4, 5 రకరకాల కూర లుండాలట. వారి కుమారుడు అద్బుదనాదం నాల్గవ ఫారంలోనేగాక, ఇంటరుమీడియెట్ లో కూడా నా సహాధ్యాయి. ముద్దు వచ్చే పొట్టి, బక్క కుర్రాడు. చిన్న పిల్లవాడులా గుండేవాడు. మిక్కిలి చురుకైనవాడు. సుందరం పిళ్లెగారుకూడా, ఇంగ్లీషు నాన్ డిటైల్డు పాఠాలు చెప్పేవారు. మా ప్రిన్సిపాల్ పెన్నుగారు కాని, మా వైస్‌ప్రిన్సిపాల్ ఇన్నిస్‌గారు (వీరుకూడా తెల్లవారే)గాని పాఠాలు చెప్పినట్లు గుర్తులేదు.

మా ప్రిన్సిపాల్ విలియమ్ ఛారల్స్ డబ్లియు. సి. పెన్‌గారు పొట్టివారు. లావుగా ఉండేవారు. గుండ్రమైన ముఖం, కత్తిరించిన గడ్డం. మాట పరుషం. హృదయము నవనీతం. కాని మతపిచ్చి చాలా హెచ్చుగా కలవారు. వారు రివరెండు, అనగా మతగురువు. పెళ్ళిళ్లు చేయించుటకు అధికారము పొందియున్నారో లేదో కాని, మతగురువుగా మతబోధచేయుటకు అర్హత వున్నవారు. తన కాలేజి విద్యార్థులు బాగుగా చదువుకొని, కాలేజికి పేరుప్రతిష్ఠలు సంపాదించాలని, ఆవిధముగనే క్రీడాకారులుగాకూడా కాలేజి ప్రఖ్యాతిని కొండ కెక్కించాలని నిరంతర దీక్షతో ఉండేవారు. క్రమశిక్షణ విషయములో కూడా గట్టివారే.

వైస్‌ప్రిన్సిపాల్ ఇన్నిస్‌గారు చాలా పొడవరి. బహుశా 6½ అడుగులు ఎత్తు ఉండేవారేమో. వారితో కాలేజి విద్యార్థు

లకు సంబంధం తక్కువ. అప్పటికి వయస్సు మళ్ళినవారు. అంటీ అంటన ట్లుండేవారు. మంచివారు. బి. ఎ. విద్యార్థులకు బైబిలు పాఠాలు చెప్పుచుండేవా రనుకుంటాను. మొత్తంమీద కాలేజికి ఒక అలంకారంగా ఉండేవారు.

నా కాలంలోనే ఇండియన్ క్రిస్టియన్ జాన్ గారు కాలేజిలో చేరారు. వారు చరిత్ర బోధించేవారు. రత్నయ్య అనేవారు కాలేజి సెంట్రల్ హాలులో బైబిలు బోధించేవారు. నేను ఆలస్యంగా వెళ్లటం చూచి, " బైబిలు క్లాసుకు రావటం ఇష్టంలేదా " అని ఒకటిరెండుసార్లు అడిగారు. ఈనక్ అనేవారు మా కాలేజి పుస్తక భాండాగారాన్ని నడపేవారు. ఈనక్ గారికి డబ్బుకొరత. విద్యార్థులను అప్పు అడుగుచుండేవారు. ఆయన అడిగినవారిలో నే నొకడను.

మా లాన్ గ్వేజి గ్రూపులో కాపు (బలిజ) కులస్థుడు పడాల కోటయ్యగా రుండేవారు. వారు చదువులో నాకంటె మిక్కిలి మిన్న. అప్పటికే చక్కని కవిత్వం వ్రాసేవారు. మా సహాధ్యాయులు విన్నకోట ఉదయ భీమరాజు, పింగళి నాగేశ్వరరావు మొదలైనవారు. కోటయ్యగారు గుంటూరు జిల్లా మంత్రివారిపాలెం గ్రామస్థులు. వారు మొదట తెనాలిలోను, తరువాత గుంటూరులోను న్యాయవాదిగా నుండి, పబ్లిక్ ప్రాసిక్యూటర్ హోదాను కొంతకాలం నిర్వహించి ఈమధ్యనే చనిపోయారు. వారితో నాకు స్నేహమయింది. అప్పుడప్పుడు మా వసతికి వచ్చి కాలక్షేపం చేసేవారు. భోజనంకూడా చేసేవారు. పరీక్షలకుముందు కలసి కొంటూ, విషయాలు చర్చించుకొంటూ ఉండేవాళ్లం. వారు న్యాయవాదిగా గుంటూరులో స్థిరపడిపోవటమేగాక నివాసగృహం వగైరా ఏర్పరచుకొన్నారు. వా రుండే వీధికి పడాలవారి వీధి అనుపేరు పెట్టబడింది. వారికి బహుళ సంతానం. ఆడ, మగపిల్ల లందరు విద్యావంతులు. ఒక కుమార్తె, భర్తతో అమెరికాలో వున్నది. ఈమధ్య వారింటికి అతిథిగా వెళ్లాను. ఎంతో మర్యాదచేశారు. అప్పుడు వారి ఆరోగ్యము అంతబాగుగా

నుండ లేదుగాని కాలం నెట్టుకొనివస్తుండినారు. ఇంటరుమీడియెట్ పరీక్షానంతరం వారు వారి స్వగ్రామమగు గుంటూరు జిల్లా మంత్రివారిపాలెంనుండి, నా ఉత్తరానికి జవాబువ్రాస్తూ 9-5-1920 తారీఖున నాకు చక్కని పద్యాలు వ్రాసి పంపారు. వాని నిక్కడ చేర్చుచున్నాను.

ఉ. తమ్మి యొనర్చినట్టి సుకృతం బదియేమి? పతంగహస్త స్ప
ర్శమ్మున సంతసించగ; తొగచాన తపింపగ; చూడ జూడ లో
కమ్మున రాగవైరములు కల్గును ప్రాగ్భవ కర్మనంచు నే
నమ్మితి నామనంబున, గుణాకర, దైవ మెఱుంగు సత్యమున్.

చం. ఇరువుర మొక్కచోట జనియింపగ లేదు, కళానురక్తి బం
దరు నగరంబు జొచ్చితిమి, తావక దర్శన మబ్బె, మీద ని
ద్దఱి హృదయంబులందు, తలదాలిచె కూరిమి విత్తనంబు, లీ
కరణిని వింతయా కనకగర్భుని వ్రాతలు చేత లన్నిటన్.

ఉ. కూరిమి తీగ యీపయిన కోమలివైఖరి పెంపుగాంచి, వి
స్తార మనః ప్రమోదము నొసంగునొ కమ్మని పూలుపూచి? సం
సార కషాయ గాటునకుఁ జచ్చునొ, వేరులతోడ గూడ? ఎ
వ్వార లెఱుంగనోపుదురు భావి శుభాశుభ లక్షణంబులన్.

ఉ. వచ్చెడు మాసమందు మన వ్రాతఫలంబులు వేగ బైటకు
న్వచ్చు; జయంబుగాంచి హితబాంధవ మన్నన
లందుకొంటయో?
ముచ్చుతనంబుదాల్చి గదిమూలలదాగి ముసుంగు బెట్టుచున్
వెచ్చని తిట్లకున్ దలలు బెట్టుటొ? దైవ మెఱుంగు నయ్యరో!

విన్నకోట ఉదయ భీమరాజుగారు మిక్కిలి చురుకైనవారు. స్నేహశీలురు. నవ్వుచూ, ప్రేలుచూ కలసి మెలసి ఉండేవారు. బాగుగా చదివి, తేలికగా పరీక్షవ్రాసే శక్తిగలవారు. వారు లావు, పొడవులలో మధ్యరకం మనిషి. కాని సన్నగా, కురచగా ఉండేటట్లు కన్పడేవారు. చక్కగా, ఠీవిగా తలపాగ చుట్టుకొనే వారు. కోటు, బూటుతో, ట్రిమ్ముగా ఉండేవారు. వారికి నాటకాల సరదా జాస్తి యనుకొంటాను. వేషాలువేసేవా రేమో

గాని గుర్తులేదు. చిన్నకోటవారు నాయుళ్లలోకూడ వున్నారు గాని, భీమరాజుగారు నియోగిబ్రాహ్మణులు. ఇప్పటికిని బందరులో న్యాయవాదిగా ప్రాక్టీస్ చేయుచున్నారు. ఈమధ్య వారిని చూడాలని వారింటికి వెళ్లానుగాని వారింటివద్ద లేరు. ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొన్నాం.

పింగళి నాగేశ్వరరావుగారు నియోగిబ్రాహ్మణులు. ఆయన మంచి ఎరుపుగా ఉండేవారు. అందమైన వ్యక్తిత్వం. మాట సరళం. కొంత బెట్టుగాఉండే రకం. మధ్యరకం పొడవు, సరిపడిన లావు. మీసము, గడ్డము తక్కువ. సన్నమీస ముండేది. చదువు మధ్యరకం. కాని నాకంటె మెరుగె. ఆయ నిప్పు డెక్కడున్నాడో, ఏమి చేస్తున్నాడో తెలియదు. ఇంకా ఇద్దరుండేవారని గుర్తు. వారిపేర్లు జ్ఞాపకం రావటంలేదు.

మా ఇంటరుమీడియెట్ సహాధ్యాయులలో పెడసన గల్లులో చాలాకాలం పిల్లలకు చదువుచెప్పిన నిడుమోలు నరసింహంగారి తమ్ముడు కనకసుందరం, డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అల్లుడు తల్లాప్రగడ రామారావు. బ్రాహ్మణ యువకులలో వీ రిద్దఱు గుర్తుకువస్తున్నారు. శ్రీ కనకసుందరం చురుకైనవాడు, మంచివాడు. నెమ్మదిగా, మితభాషిగా వర్తించే వాడు. ఆయన రెవిన్యూ డిపార్టుమెంటులో కలెక్టరు హోదా వరకువచ్చి అకాలంగా చనిపోయాడు. ఆయన పెద్దన్న నరసింహారావుగారు పెడసనగల్లు సమీపానవున్న అయ్యంకిలో స్థిర నివాస మేర్పరచుకొన్నారు. రెండవ అన్న వెంకటసుబ్బారావు గారు వకీలు గుమాస్తాగా బందరులో స్థిరపడిపోయారు. వా రిద్ద రిప్పుడు దేహయాత్ర చాలించారు.

తల్లాప్రగడ రామారావుగారు స్ఫురద్రూపి, తెలివితేటలు గలవాడు. ఆయన తన మామ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు స్థాపించిన ఇన్సూరెన్సు కంపెని, హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెని మేనేజరుగా పనిచేస్తూ బందరులోనే ఉండేవారు.

ఈ బ్రాహ్మణ విద్యార్థులుగాక, నాతో స్నేహముగా ఉన్న ఇద్దరు ముగ్గురు క్రిస్టియన్ విద్యార్థులపేర్లు జ్ఞప్తికివచ్చుచున్నవి.

వేదనాయకం పిళ్లెగారి కుమారుడు అద్భుతనాదం, వెంకటరత్నం, ఈనాక్ వంటివారు. అద్భుతనాదం పైన చెప్పినట్లు సన్నగా, పొట్టిగా, పచ్చగా, ముద్దుగా ఉండేవాడు. అతడొకసారి "మేము క్రైస్తవులమైనా వ్యవసాయం చేసుకొనే వెళ్లాలం. మీరుకూడ మావంటి వెళ్లాలె" అన్నాడు. అతని మాతృభాష అరవము. వెంకటరత్నం బందరు కుటుంబంలోనివాడు. చాలా నెమ్మదిగా ఉండేవాడు. కొంత ఆప్యాయత చూపించేవాడు. చదువుసంధ్యలు అంత ఎక్కువకాదు. ఏ జీవనవిధానం అవలంబించాడో, ఎక్కడే ఉద్యోగముచేశాడో నాకు తెలియదు.

ఈనాక్ అంత కలసిమెలసి ఉండే స్వభావంకలవాడు కాదు. కొంత కూబితనం ఉన్నదనుకొన్నాను. చదువులో చురుకే. అతడు బి. ఎ. ప్యాసై, న్యాయశాఖలో చేరాడు. 1932 లోనో, 33 లోనో ఆయన గంజాం బరంపురములో జిల్లాజడ్జి కోర్టు శిరస్తాదారుగా ఉన్నప్పుడు చూచాను. తరువాత జిల్లాజడ్జి పదవిని పొందాడు. ఈ మధ్యకాలంలో మద్రాసు షెనాయ్ నగర్ కాలనీలో ఆయన నివసించుచున్నప్పుడు రెండు, మూడుసార్లు కలసికొన్నాను.

గుంటూరు కమ్మ విద్యార్థులు గోగినేని రామనాథం, గోగినేని రంగనాయకులు, గోగినేని గోపాలరావు గార్లను గురించి ఇదివరలోనే చెప్పియున్నాను. వారు ముగ్గురు నోబుల్ కళాశాల లోనే ఇంటరుమీడియెట్ కొనసాగించారు. వారి నప్పుడప్పుడు కలసికొనుచుండేవాడిని. ఆకాలంలో కాజ ఉమామహేశ్వరరావు, సూరపనేని చంద్రమౌళి వగైరాలు బందరులో చదువుచుండే వారు. కాని నేను ఫోర్తుఫారం, ఫిఫ్తుఫారంలో చదువుకొన్నప్పు డుండిన శ్రీ హనుమోర అప్పయ్యగారు గాని, కొమ్మారెడ్డి సత్యనారాయణ, రామయ్యగార్లు గాని, యలమంచిలి వెంకట సుబ్బయ్య, వెంకయ్యగార్లు గాని ఉన్నట్లు లేరు. యలమంచిలి నాగభూషణంగా రుండిన వుండవచ్చును.

మేము నిర్వహించిన చౌదరి లాడ్జి వసతిలో పైన చెప్పినట్లు పర్వతనేని వెంకటరత్నం, త్రిపురనేని శివప్రసాదరావు, దుగ్గిరాల రామకృష్ణయ్య, లింగం వెంకట కృష్ణయ్య, నేను ఉండేవారం.

దుక్కిపాటి నాగభూషణం ఉండినారేమో గట్టిగా చెప్పలేను. అతడు నా మొదటి స్కూల్ ఫైనల్ సంవత్సరంలో మేము వంట రామన్నతో వసతి గృహం నడుపుకొన్నప్పుడు ఉండినాడని గట్టిగా తెలుసు. వెంకటరత్నం పైన చెప్పినట్లు నా పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి కుమార్తె వెంకట కృష్ణయ్య చెల్లెలు లక్ష్మీశ్వరమ్మ భర్త. ఆయన ఇంటరుమీడియెట్‌లో హిస్టరీస్ అభిమాన అంశంగా తీసుకొన్నాడు. తీరా పబ్లిక్ పరీక్షలు వచ్చేటప్పటికి జ్వరమువచ్చి ఈ అంశాల్లో పరీక్షకు హాజరుకాలేదు. చదవటం మాకంటె మెరుగే. తెలివితేట లున్నవాడే. కాని ఆయన ఫుట్‌బాల్ ఆటలో ప్రవీణుడై, నోబుల్ కాలేజి ఫుట్‌బాల్ టీముకు కాప్టెన్ అయి, కాలేజికి పేరు తెచ్చాడు. బంతి నడుపుచు ప్రత్యర్థిని దాటిపోగల నేర్పులో గట్టివాడని పేరు సంపాదించాడు. అలసట ఎరుగనివానివలె దెబ్బలకు సహించి, మిక్కిలి పట్టుదలతో ఆసాంతం ఆడేవాడు. గెలవాలని పట్టుదలతో కాలు చేతులు విరుగగొట్టుకొనుటకైనా జంకని ధైర్యం, మొండితనం కలవాడు. అట్టి ధైర్యము. ధీమా, పట్టుదల గల వ్యక్తి ప్రశంసనీయుడు కదా! ఇంటరుమీడియెట్‌తోనే చదువు ఆపివేసి కులవృత్తి వ్యవసాయంలో దక్షుడని పేరు సంపాదించాడు. వ్యవసాయమేకాదు, పశుసంవర్ధనలో మిక్కిలి నేర్పరి. పశువుల మంచిచెడులను, జాతి హెచ్చుతగ్గులను తెలిసిన నిపుణుడు. మిశ్రమజాతి పాడిపశువులను ప్రోత్సహించుటలో, అధిక పాలోత్పత్తిని కలుగజేయుటలో శ్రేష్ఠుడు. యునెస్కోవారి సహాయంతో విజయవాడ, హైదరాబాదులలో స్థాపించబడిన సమైక్య పాల పథకం, విజయవాడలో పాలఫ్యాక్టరీని స్థాపించుటకు పనిచేసిన ముఖ్యులలో నొకడు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు ఏర్పరచి యుండిన పాలసంఘం ముగ్గురు సభ్యులలో ఒకడు. 1958 లో కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘం ఏర్పాటైనప్పుడు ఆ సంఘం ప్రథమ కార్యదర్శిగా శ్రమించారు. తర్వాత పాల ఉత్పత్తిదారుల సంఘము ఏర్పడినప్పుడు దానికి కూడా కార్యదర్శిగా వ్యవహరించాడు. అనారోగ్యంతోవున్నా, ఇప్పటికిని మంచి జర్సీ, ఒంగోలు ఆవులను పోషించుచున్నాడు.

త్రిపురనేని శివప్రసాదరావు నాకు మూడు, నాలుగు విధములుగా బంధువు. ఆయన తండ్రి శేషాద్రిగారు మా తల్లి పెదతండ్రి రామయ్యగారి కుమారుడు. రామయ్యగారి అన్న రామస్వామిగారి కుమార్తె కాంతమ్మగారు మా మూడో పెదతండ్రి ఆదినారాయణగారి భార్య. కాంతమ్మగారి పెద్దకుమార్తె శోభనాద్రమ్మగారు శివప్రసాదరావు తల్లి. మరిన్ని ఆమె పెద్దకుమారుడు వీరభద్రయ్యగారి కుమార్తె పమిడమ్మను అతనికి భార్యగా ఇచ్చారు. ఇవిగాక ప్రసాదరావు అక్క తులశమ్మగారు మా ఐదో పెదతండ్రి రామశేషయ్యగారి కుమారుడు నాగభూషణంగారి భార్య. ఈవిధముగా శివప్రసాదరావు నాకు మిక్కిలి దగ్గరవాడై నాడు. మేనమామకొడుకు, అన్న బావమరది వరసను బావమరది అయినా, అక్క శోభనాద్రమ్మ కుమారుడు, అన్న వీరభద్రయ్యగారి అల్లుడు అగుటవలన అతనిని నేను అల్లుడుగానే ఎంచుకొంటున్నాను, ముఖ్యముగా మేనల్లుడుగా ఆదరిస్తాను. అతడు బి. యల్. డిగ్రీని పొంది న్యాయవాదిగా గుడివాడలో స్థిరపడి పోయాడు. తన వృత్తిలో పైకివచ్చి పేరు సంపాదించుకొన్నాడు. చాలాకాలం గుడివాడ కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకుకు అధ్యక్షుడుగా ఉండినాడు. నాటకాలలో అభిరుచి ఎక్కువ. ఒక నాటక సంఘాన్ని వృద్ధిలోకి తెచ్చి మంత్రిగావుండిన శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారి అభిమానాన్ని పొందాడు తన పినతాత చలమయ్యగారి పుత్రుడు, సుప్రసిద్ధ శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి కవిరాజుగారి పేరను, కవిరాజుగారి అన్న సుబ్రహ్మణ్యంగారి కుమారుడు డా. వెంకటేశ్వరరావుతో కలసి కవిరాజు విహారాన్ని, కళామందిరాన్ని నిర్మింపజేశాడు. కళాభిమానం కలవాడు. కొడుకులచేత గుడివాడలో రెండు సినిమాహాల్సును కట్టించి నడిపించుచున్నాడు.

దుగ్గిరాల రామకృష్ణయ్య సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితుడు. శ్రీ దుగ్గిరాల పురుషోత్తంగారి రెండవ కుమారుడు, నా పినతల్లి తులశమ్మగారి భర్త ప్రసిద్ధిగన్న రాఘవచంద్రయ్య చౌదరిగారి అనుజుడు. తండ్రిగారి పాండిత్యము రాలేదు, అన్నగారి కవిత్వము అంటలేదు. స్కూలు పైనలుతోనే ఇంగ్లీషు చదువు

మానివేశాడు. సహృదయుడు, ఋజువర్తనుడు, నిరాడంబరుడు, అల్పసంతోషి, స్నేహశీలుడు, అమాయకుడు. వసతి గృహములో మాతోబాటు వున్నప్పుడు అతనిని చనువుచేతనో, అతని అమాయకత్వమునుబట్టియో అతనిని మాటలతో కొంత న్యూనత పరిచేవాడనని గుర్తు. సహజ సాధుస్వభావంచేత నాతో ఎప్పుడూ విరోధం పెట్టుకోలేదు. ఇప్పటికిని నన్నెంతో అభిమానిస్తూ ఉంటాడు. స్వగ్రామము అంగలూరులో స్థిరపడిపోయాడు, ఉన్న కొద్ది వ్యవసాయం చూచుకొంటూ.

లింగం వెంకట కృష్ణయ్య నా ఆరవ పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి నాల్గవ కుమారుడు. స్ఫురద్రూపి. మా లింగం వారిలో ఎక్కువమంది చామనచాయ లేక నలుపు. మా మూడవ పెదతండ్రి ఆదినారాయణగారు మాత్రం మంచి పసుపు వర్ణం. మా నాల్గవ పెదతండ్రి వెంకట శివుడుగారు కూడా ఎరుపే. వెంకట సుబ్బయ్యగారు నాకు గుర్తువున్నంతవరకు ఎరుపుకాదు. చామనచాయకంటె కొంత మెరుగు. వెంకట కృష్ణయ్య మాతామహుడు దుగ్గిరాల రాఘవయ్యగారు మంచి ఎరుపు. రాఘవయ్యగారి రెండవ కుమారుడు పూర్ణయ్యగారు మంచి నిమ్మపండు ఛాయలో ఉండేవారు. మా పెదతల్లి అంజమ్మగారు ఎరుపుక్రింద లెక్కే. అందువలన కాబోలును పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి సంతానములో వెంకట కృష్ణయ్య, అతని చెల్లెలు లక్ష్మీశ్వరమ్మ మంచి ఎరుపు. వెంకట కృష్ణయ్య మిక్కిలి మాటకారియే గాక ఎక్కడెక్కడి సంగతులు తెలిసికొని వస్తుండేవాడు. అతడు మేము 1916 లో స్వంతవంట పెట్టుకొన్నప్పుడుకూడా మా లాడ్జిలో వుండేవాడు. అప్పుడు మే మందరం కలసి అతనికి ఒక నిక్ నేమ్ పెట్టాము, "లండన్ టైమ్సు" అని. మొదటినుండి చదువులో ధ్యాస తక్కువ. ఇంటరుమీడియెట్ పూర్తిచేయకుండానే మానివేశాడు. కులాభిమానం, వంశాభిమానం ఉన్నవాడు. స్నేహాలు చేసుకొనటంలో దిట్ట. నామీద మొదటినుండి అభిమానం, స్నేహం చూపిస్తూ వస్తున్నాడు. నిజానికి మా

తండ్రుల కుమారులలో వెంకట కృష్ణయ్యకు, నాకే ఎక్కువ స్నేహం. అతడు నాకంటె ఆ రేడేళ్లు చిన్నవాడు. అందువలన చనువుగా పిలుస్తూ ఉంటాను. చదువు మాని వ్యవసాయం మొదలు పెట్టాడు. వ్యవసాయంలో మిక్కిలి దక్షుడు. కుటుంబమునుండి పంచుకొన్న భూములనేగాక ఇతరత్రా చాలా వ్యవసాయ భూములను సంపాదించాడు. బెజవాడలోను, ఇతరచోట్లను ఇళ్లకు పనికివచ్చే స్థలాలను కొన్నాడు. కాని అదృష్టజాతకుడు కాదు. ఏదీ కలసిరాలేదు. అతని పెద్దకొడుకు వెంకట సుబ్బారావు అమెరికాకువెళ్లి కెమికల్ ఇంజినీరింగులో తర్ఫీదుపొంది వచ్చి కొంతకాలం రాజమండ్రి పేపరుమిల్లులో మేనేజరుగా పని చేశాడు. ఇతర కుమాళ్లుకూడా అభివృద్ధిలోనే వున్నారు.

దుక్కిపాటి నాగభూషణం 1919 - 1920 లో చౌదరి లాడ్జిలో లేకపోయినా, 1916 లో మా లాడ్జిలో ఉన్నవాడే. అతడు మా పినతాత వెంకటరత్నంగారి కుమార్తె సుబ్బమ్మగారి కుమారుడు. తండ్రి పున్నయ్యగారు. బంధుప్రీతి, స్నేహభావము కలవాడు. చదువుసంధ్యల్లో చాలా తక్కువ స్థాయివాడు. అతనికి మేనమామ మా పినతండ్రి నాగభూషణంగారి కుమార్తె రత్న మాణిక్యంను ఇచ్చి వివాహంచేశారు. వివాహం అయిన కొలది కాలానికి బొమ్మలూరు వచ్చి అతని పెదతల్లి ఆదెమ్మగారివద్ద స్థిరనివాస మేర్పరచుకొన్నాడు. ఆదెమ్మగారికి సంతానం లేదు. చిన్నతనంలోనే భర్త చనిపోయాడు.

అప్పటి కమ్మ విద్యార్థులలో కృష్ణాజిల్లా పెద్దగొన్నూరుకు చెందిన కాజ ఉమామహేశ్వరరావుగారు నాకు సన్నిహితంగా ఉండేవాడు. ఆయన మంచిహృదయం కలవాడు. స్నేహభావంతో మెలగేవాడు. చురుకుదనము, తెలివితేటలు, మాటలు చక్కగా చెప్పగలిగినశక్తి కలవాడు. కాని క్రొత్తవారి ఎదుట కొంత ముభావంగా ఉండేవాడు. ఆయన అన్న లక్ష్మీనారాయణగారు మంచి వ్యవహారవేత్త. పెద్దరికం, హుందాతనం గల్గినవారు. తగాదా వ్యవహారాలను సరితీర్చటంలో సమర్థుడు. వారు పెద్ద భూస్వాములు.

ఇక నే నెరిగిన బందరు పెద్దలలో బొల్లిని నారాయణస్వామి నాయుడుగారు ముఖ్యులు. వీరు చిత్తూరుజిల్లా తిరుత్తణి తాలూకా వేలంజేరి గ్రామస్థులు. వీరి పెద్దన్న అప్పాస్వామినాయుడుగారు 1915 కు పూర్వమే గుడివాడలో పోలీసు సబ్ యిన్‌స్పెక్టరుగా ఉండేవారు. ఆ రోజుల్లో సబ్ యిన్‌స్పెక్టరుకుకూడా పెద్దహోదా, చెప్పుకోతగిన అధికారము, పలుకుబడి ఉండేవి. అప్పాస్వామినాయుడు గారు ఆజానుబాహువు. వారు పోలీసు దుస్తులలో గొప్ప ఆఫీసరుగా కనపడేవారు. ఆకాలంలో కమ్మవారిలో ఉద్యోగాలుచేసేవారు ఇంచుమించుగా లేరనే చెప్పాలి. అందువలనను, కులాభిమానం చేతను, అప్పాస్వామిగారికి గుడివాడకు మిక్కిలి సమీపానవున్న మా బొమ్ములూరు, నూజెళ్లవంటి గ్రామాలు సుపరిచితమైనవి. ఈ గ్రామాలకు ఆహ్వానంమీద వస్తూ పోతూ ఉండేవారు. నూజెళ్ల పర్వతనేని మల్లికార్జునుడుగారి తమ్ముడు గణయ్యగారితో స్నేహం కలిసింది. అప్పాస్వామిగారికి మాప్రక్క కమ్మవారితో సంబంధాలు చేయాలని బుద్ధిపుట్టింది. గణయ్యగారి పెద్దకూతురిని తన తమ్ముడు నారాయణస్వామినాయుడికి చేసుకోవాలని ఉద్దేశం కలిగింది. తరువాత వారిద్దరకు మాటకలసి సంబంధము ఖాయమై పెళ్లిజరిగింది. చిత్తూరుజిల్లా కమ్మవారు ఈ ప్రాంతాలకు సరిక్రొత్త. అందులో తిరుత్తణి తాలూకా అరవ సంప్రదాయముతో, కృష్ణాజిల్లా కమ్మ పద్ధతులకు భిన్నమైన పద్ధతులు కలిగియుండినది. వేష భాషలలో వ్యత్యాసము కొట్టవచ్చినట్లుండేది. అక్కడి కమ్మవారు సామాన్యముగా ఒంటిపొరతో గూడకట్టు కట్టుకొనేవారు. బహిర్భూమికి చెంబుతో నీళ్లు తీసుకొని వెళ్లేవారు కాదు. విరివిగాఉండే గుంటల నీళ్లతో ప్రక్షాళనం చేసుకొనేవారు. ఈ సందర్భములో ఒక సంగతి జ్ఞప్తికి వస్తున్నది. నారాయణస్వామినాయుడుగారి వివాహానికి నూజెళ్లకు వచ్చిన వారి బంధువులు ఉదయం బహిర్భూమికి వెళ్లి కడుగుకోవటానికి నీళ్లకోసం గుంటలు వెదుకుచూ, నోటిలో చుట్టపెట్టుకొని గూడకట్టుపంచె పైకి ఎత్తి పట్టుకొని వారిలోవారుగాని, దారినపోయే వారితోగాని చుట్టవెలిగించమని

వచ్చారట, మా వాళ్లందరు చకితులైనారట. ఆ వివాహానికి నేను వెళ్లినట్లు లేదు.

నారాయణస్వామినాయుడుగారు సునిశిత మేధాసంపత్తి కలవారు. న్యాయశాస్త్రంలో వైదుష్యమేగాక, కేసును వాదించటంలో, తన వాదనను సమర్థించటంలో మిక్కిలి పేరు పొందినవారు. విస్ఫుటమైన మాటలతో, మధురమైన స్వరముతో, మంచి చాతుర్యముతో న్యాయాధిపతికి నచ్చేటట్లు వాదించేవారట. నేను కోర్టులో వారి వాదనను వినలేదుగాని వారి సంభాషణ చతురతకలదిగాను, ఆహ్లాదకరంగాను ఉండేది. వారు కొన్నిసంవత్సరాలు బందరులో జిల్లా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశారు. వారి పెద్దన్న అప్పాస్వామినాయుడుగారు పిన్న వయస్సులో చనిపోయారు. వారి రెండవఅన్న మునిస్వామి నాయుడుగారు జస్టిస్ పార్టీ రాజకీయాలలో శ్రీ పానుగంటి రామారాయణంగారి సహచరులుగా, కుడిభుజంగా నుండి, కొంత కాలం అవిభక్త మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా నుండినారు.

నారాయణస్వామినాయుడుగారితో నాకు చనువు ఎక్కువగానే ఉండేది. వారింట్లో వారితో అప్పుడప్పుడు భుజించేవాడను. వారికి దక్షిణానికి చెందిన వయస్సుమళ్లిన బలిజకులస్థురాలు వంట చేసిపెట్టేది. ఒకవిధంగా డబ్బుకొరకుగాక అభిమానంతో వంటచేసేదనుకొందును. ఆమె అన్న మునిస్వామిగారు దంత వైద్యుడుగా ఏలూరులో ఉండేవారు. దక్షిణాదివారైనా ఏలూరులో జీవితాంతం ఉన్నారనుకొందును. ఆమె వంట చాలా రుచికరంగా చేసేది. మత్స్య మాంసాదుల పచనలో ఆమెది సిద్ధహస్తం. మాంసం, రొయ్యలుకంటె చేపను వండటంలో ఎక్కువ సమర్థురాలు. అందులో ఆమె వండిన చోరచేప పిట్టు వంటి రుచిని నేనప్పుడుగాని, ఎప్పుడుగాని ఇంకొకచోట అనుభవించ లేదు. నారాయణస్వామినాయుడుగారు జ్ఞాపకమువచ్చినప్పుడల్లా వారింట చోరచేపపిట్టు జ్ఞాపకమువస్తూఉంటుంది. ఏదో ఒక సందర్భంగా తన పెదమామ మల్లికార్జునుడుగారి కుమారుడు మా పర్వతనేని వెంకటరత్నంగారిని భోజనానికి పిలిచి నన్ను

పిలవలేదు. దానికి నేను నొచ్చుకొన్నానని తెలిసి, నన్ను ప్రత్యేకంగా భోజనానికి పిలిచి ఆదరించారు.

నా బందరు చదువులో వారితో చనువు, మైత్రి బాగుగా ఉండేది. కాని నే నింగ్లండునుంచి వచ్చిన తర్వాత ఈ స్నేహభావానికి అడ్డుతగిలింది. ఇంగ్లీషు కౌంటి న్యాయాధికారులను వారి అధికారాలనుగురించి, అటువంటి ఇతర విషయాలనుగురించి, నేను స్వదేశానికి తిరిగివచ్చిన కొలదిరోజులకు వారిని చూచుటకు వెళ్లినప్పుడు వా రడిగిన ప్రశ్నలకు నేను సరిగా సమాధానము ఇవ్వలేకపోయినందులకు కాబోలును, వారికి నాయందు తక్కువ అభిప్రాయమేర్పడిందని అనుకొందును. అందువలనకాబోలును, నేను వారివద్దనుండి సెలవుతీసుకొనుచు కరచాలనానికి నా కుడిహస్తా న్నందివ్వగా వారు దానిని స్వీకరించలేదు. ఇది తిరస్కారసూచకముగా నే నెంచుకొని బాధపడుచు వెళ్లిపోయాను. అప్పటినుండి వారితో సంబంధాలు తెగ్రతెంపు చేసుకొన్నాను. నేను ఇన్‌కమ్‌టాక్సు అసిస్టెంటు కమిషనర్ ఉద్యోగం చేస్తున్నప్పుడు ఒకసారి గుడివాడ స్టేషనులో మే మిరువురం కలసికొనుట తటస్థించింది. వారు నవ్వుతూ, స్నేహపూర్వకంగా మాట్లాడుచు నా కుడిచేతిని తనచేతిలోకి తీసుకో ప్రయత్నించారు. నేను మనస్ఫూర్తిగా చేతి నివ్వలేకపోయాను. నా స్వభావము పాముపగ స్వభావం కాదుగాని నా న్యాయశాస్త్ర విద్యను, నా విశ్వవిఖ్యాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్యను, కించపరిచాడని అహం పెద్దగా దెబ్బతిని, న న్నీవిషయంలో కఠినుణ్ణి చేసింది.

ఇతరులలో కొత్తా శ్రీరామశాస్త్రిగారు నాకు బాగా పరిచయులైనారు. నేను బందరులో ఇంటరుమీడియెట్ చదువుచున్నప్పుడు వారికొరకప్పుడప్పుడు వా రింటికి వెళ్లటం, వారు లేకపోయిన వారి భార్యగారినుండి పుస్తకాలను కొనటం జరిగింది. వారి సతీమణినుండి 9-2-'20 తారీఖున 'విదుషీమణులు' వగైరా పుస్తకాలు కొన్నాను. శ్రీరామశాస్త్రిగారు గొప్ప జాతీయవాది. ఏ కాంగ్రెసు సభ జరిగినా వారి వందేమాతరం ప్రార్థనతోకాని ప్రారంభమయ్యేది కాదని పైన చెప్పాను. వారు

బ్రహ్మసమాజకులు, సంఘ సంస్కర్తలు. వారి భార్య బాలవిధవగా వీరిని పునర్వివాహము చేసుకొన్నది. వీరు కొంతకాలం 'శారద' అనే సాంస్కృతిక మాసపత్రికను బందరునుండి నడిపారు. నేను ఇంగ్లండునుండి 1923 మధ్యలో స్వదేశానికి మొదటిసారి తిరిగి వచ్చినప్పుడు శ్రీరామశాస్త్రిగారి కోరికపై ఇంగ్లండునుండి తెచ్చిన కొన్ని మేగజీన్సును వారి కిచ్చాను. తరువాత 1929 లో నేను ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటులో ప్రవేశించి మద్రాసు రాయపేట పైక్రాఫ్ట్సు మొదటివీధి 35-వ నంబరు ఇంటిలో నివసించుచున్న ప్పుడు నేనప్పుడు 'భారతి' మాసపత్రికలో ప్రచురించిన "గృహ లక్ష్మి" అనే వ్యాసాన్ని చూచి ఆనందించి, నా ఇంటికివచ్చి నన్ను కౌగలించుకొని అభినందించారు. వారి ఇద్దరి కొడుకులలో రామ మోహనశాస్త్రి నాకు బాగుగా పరిచితుడైనాడు. ఆయన ఎన్నదగిన చిత్రలేఖకుడుగా రూపొంది చాలా చిత్రాలను లిఖించారు. ఆయన చిత్రించిన చిత్రాలు 4, 5 నావద్ద నున్నవి. వారి తమ్ముడు ఆనందమోహన్‌కుమార్ గొప్పగా బొమ్మలు చిత్రించేవారట. ఆయన బొంబాయిలో పనిచేయుచు చిన్నతనం లోనే మృతిచెందారు. వారు లిఖించినవి బయటపడనివి 60, 70 చిత్రాలు ఒక పెద్ద ట్రంకుపెట్టెలో భద్రపరచబడి ఇప్పటికిని ఆయన తల్లిగారి వద్ద నున్నవట. శ్రీరామశాస్త్రిగారివద్ద బెంగాలీ భాష నభివృద్ధిపరచుకొని, వారికి మిక్కిలి సన్నిహితంగావుండిన నా మిత్రుడు పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారితో రెండు, మూడుసార్లు ఆనందమోహన్‌కుమార్ తల్లిగారిని ఆ చిత్రాలను బయల్పరచవలసిందిగా ప్రార్థించండని చెప్పాను. ఆ అదృష్టం ఇంతవరకు ఆంధ్ర చిత్రకళాభిమానులకు పట్టలేదు.

పరచూరి రామలింగయ్యగారిపేరు పైన వచ్చింది. వారు దబ్బపండు ఛాయతో, లావుగా, మధ్యరకం ఎత్తుతో ఉండేవారు. గుండ్రని ముఖం, చికిలించినట్లున్న కళ్లు, వెకిలినవ్వు నవ్వు చున్నట్లున్న నోరు, చూడటంతోనే హాస్యప్రియుడుగా కన్పించే వారు. అసలు ఆయనగారికి తెనాలి రామలింగడని చనువు లేక

ఎగతాళి పేరు. చాలా చురుకైన తెలివితేటలు గలవాడేకాని, ఎందువల్లనో తహసిల్ దార్ ఉద్యోగంతోనే ఉద్యోగం పూర్తి చేశాడు. అయితే మధ్యవయస్సులోనే చనిపోయాడు.

అప్పుడు నే నెరిగిన పెద్దలలో ఉన్నవ సుబ్బయ్యగారొకరు. వారు సెకండ్ గ్రేడు ప్లీడరుగా న్యాయవాదవృత్తిని కొనసాగించుచుండేవారని, చాలా సాత్వికులని పైన చెప్పాను. వారింటికి స్వేచ్ఛగా పోయే చనువు నాకు కల్గలేదు.

బందరుపట్టణ ప్రముఖులు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, శ్రీ కోపల్లె హనుమంతరావుగారు, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు, శ్రీ కెడింబి హనుమంతరావుగారు, శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారు, శ్రీ పురాణం వెంకటప్పయ్యగారు వగైరా - వీరిలో కొందరిని గురించి కొంత పైన చెప్పియున్నాను.

డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు నియోగి బ్రాహ్మణుడు. ఆ రోజులలో ఆయన తరచు సిల్కుసూటులో ఉండేవారు. బ్రాహ్మణాభిమానము పూర్తిగావున్నా, జందెము తీసివేసిన సంస్కారి. వైద్యవృత్తి కలవారైనా, రాజకీయాలలో మునిగిపోయారు. ఆయన కపరిమిత పొదుపు. జైల్లో వున్నప్పుడు కూడ తనకు వచ్చిన ఉత్తరాలలోని గుండుసూదులు, వానిలో వ్రాయని భాగాలను చింపి జాగ్రత్తపరచేవారట. వారు వ్యాపార రీత్యాకూడా మంచి బుర్రకలవారు. ఆంధ్రబ్యాంకి నిర్మాతలలో నొకరు. ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీలను స్థాపించినారు. మేధాసంపత్తి గలవారు. మాట పరుషము. బీదకుటుంబములో జన్మించినా మొదటి నుండి దర్జా, ఠీవి జాస్తి. చాలాసంవత్సరాలక్రితం మద్రాసులో మాగంటి బాపినీడుగారి ప్రథమకుమార్తె ఝాన్సీరాణి వివాహము జరుగుచున్నప్పుడు వారు పెండ్లికి వచ్చారు. నేను వారికి నమస్కరించాను. దానిని అందుకోలేదు. రెండు, మూడు క్షణాలాగి వారి వెనుకవరుసలో కూర్చుండిన నేను వారిని సంబోధించి, తిరిగి నమస్కారాలు చెప్పాను. కాని వానినికూడా సరిగా

అందుకోలేదు. "చూచాను, చూచాను" అన్నారు. అంతటి రాజసం వారిది. రాజకీయాలలో తనవారు, ఇతరులు అనే వివక్షత హెచ్చుగా ఉండేదనేవారు. వారు మంచి వక్త. ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడేవారు. కొంతకాలం ఒక ఇంగ్లీషు వారపత్రికను నడిపారు. కాంగ్రెసు చరిత్ర ఉద్గ్రంథంగా వ్రాశారు. ఇంగ్లీషుభాషాపాండిత్య ముండినది కాని, భాష సరళంకాదు.

శ్రీ కోపల్లె హనుమంతరావుగారు ఉత్తమ పురుషుడని వాడుక. విద్యాపారంగతుడేగాక కళారాధకుడు. దేశభక్తుడేగాక త్యాగమూర్తి. జాతీయభావపూరితుడేగాక ఆచరణలో జాతీయతను సార్థకపరచిన కర్మయోగి. ఆలోచనాపరుడేగాక భావోద్రేకపూరితుడుకూడా. వైవిధ్య విద్యావంతుడేగాక నిగ్గుతేరిన మనిషి. మాటలలోను, చేతలలోను గొప్ప సంస్కారి. భారతీయ సంస్కృతికి, తెలుగురీతులకు ప్రతిబింబం. ఇన్ని సుగుణములతో వెలసిల్లిన కోపల్లె హనుమంతరావుగారు బందరులోని జాతీయ కళాశాల స్థాపనకు మూలపురుషుడు, దాని నిర్వహణకు మూలస్తంభము. వారింకను చాలాసంవత్సరాలు జీవించవలసిన వయస్సులో పరలోకప్రాప్తి చెందటం ఆంధ్రుల దురదృష్టం.

శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి విషయం పైని చెప్పియుంటిని. ఆ అపర వివేకానందుడు కృష్ణాపత్రికను తన ధీబలం చేతను, భావోద్రేకపూరిత, విచక్షణాసహిత, గాఢాలోచనా సంయుక్త సంపాదకీయాలచేతను, వారపత్రికలలో అత్యున్నతమైనదానినిగా రూపొందించారు. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారివంటి మేధావులకు, ఆత్మాభిమానము కలవారికి, సలహాలు చెప్పి సరిదిద్దగల దక్షత కలిగినవారు. మాటలలోను, చేతలలోను ఆధ్యాత్మికమూర్తియో అనునట్లు వ్యవహరించెడివారు. వారు వృద్ధాప్యమురాకముందే కీర్తిశేషులగుట జాతీయ పత్రికల దురదృష్టము, ముఖ్యముగా కృష్ణాపత్రిక దురదృష్టము.

శ్రీ శెడింబి హనుమంతరావుగారు పేరుప్రఖ్యాతులు గడించిన న్యాయవాది. న్యాయబుద్ధికలవారు, సరసులు. హుందాగా ఉండే

వారు. అంతా పెద్దమనిషి తరహా. రంగు తక్కువైనా నిండుగా, దర్జాగా ఉండేవారు. జాతీయ కళాశాల స్థాపకులలో నొకరు. కోపల్లె హనుమంతరావుగారికి చేదోడువాదోడుగా నుండేవారని గుర్తు. వారు కొన్ని సభలకు అధ్యక్షతవహించటం నేను చూచాను.

శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారు న్యాయవాదవృత్తిలో పైకివచ్చి, అందరి గౌరవమును చూరగొన్న వారు. న్యాయవాదిగానే గాక సంఘ సంస్కారిగా, సజ్జనుడుగా, నిరాడంబరుడుగా, సానుభూతి పరుడుగా, కలసిమెలసేవ్యక్తిగా పేరుపొందారు. కేసు ఏమైపోతుందో అని దిగులుతో వచ్చిన కక్షిదారుని ఎంతో ఆదరణతో, భయాందోళనలను పోగొట్టే సరసులు. వారు ఎక్కువ కాలమే జీవించారు. చివరికాలములో న్యాయవాద వృత్తినుండి విరమించుకొని బందరునుండి వెళ్లిపోయారు.

శ్రీ పురాణం వెంకటప్పయ్యగారు, వారి కుమారుడు సూరిశాస్త్రిగారు, వారి తమ్ముడు కృష్ణమూర్తిగారు జ్ఞాపకానికి వస్తున్నారు. వెంకటప్పయ్యగారు బందరు టౌనుహాలులో, 1918 లేక 1919 సంవత్సరంలో కవిరాజు రామస్వామిచౌదరిగా రుపన్యసించిన ఒకసభకు అధ్యక్షతవహించారు. ఇతరత్రాకూడా ఒకటి రెండుసార్లు చూచియుండినాను. వారు అధ్యక్షతవహించిన ఒక రాజకీయసభకుకూడా నేను వెళ్లినట్లు జ్ఞాపకం. బందరు న్యాయవాదులలో అగ్రగణ్యుడుగా ఎంచబడేవారు. అయితే 1920 నాటికి న్యాయవాదవృత్తిని చాలించి, వృద్ధాప్యముతో ఇంటివద్దనే ఉండేవారో లేకపోతే, అప్పటికే గతించారో నాకిప్పుడు గుర్తులేదు. వారు బందరు టౌనుహాలుకొరకు పెద్ద విరాళమిచ్చి దానిని కట్టటానికి మిక్కిలి తోడ్పడినారు. టౌనుహాలుకు వారిపేరు పెట్టారో లేదో గుర్తులేదుకాని, వారి పెద్ద తైలవర్ణచిత్రము టౌనుహాలు మధ్యహాలును అలంకరించుచున్నది.

శ్రీ పురాణం వెంకటప్పయ్యగారి కుమారుడు సూరిశాస్త్రి గారు విద్యావంతుడు, కళాభిజ్ఞుడు, సరసుడు. చిత్రరీతులతో జీవిత విధానాన్ని నడపిన రసపిపాసి. బందరు - బెజవాడ రోడ్డుమీద 10 మైళ్ల లోపున ఉన్న మట్టలచెరువుగ్రామంలో, తన తండ్రిగారిచ్చి

పోయిన సేద్యపు భూమిలో, ఆశ్రమంవంటిదాని నేర్పరచుకొని, కొంతమంది స్నేహితులతో కాలక్షేపంచేసేవారట. కాని కొంత అస్థిమితమైన ప్రవర్తనచేత పిత్రార్జితము చాలావరకు నష్టపెట్టుకొని, మధ్యవయస్సులోనే గతించారు.

శ్రీ పురాణం కృష్ణమూర్తిగారు, తన అన్న వెంకటప్పయ్యగారి అంతస్థుకు న్యాయవాదవృత్తిలో చేరుకోలేకపోయినా, మొత్తం మీద జయప్రదంగా ఆ వృత్తిని కొనసాగించి పేరుతెచ్చుకొన్న వారే. పెద్దమనిషి, సరసులు. నేను వారిని 2, 3 సార్లు కలసికొని వారి సలహాను తీసికొనుట సంభవించింది. వారు హిందూ హైస్కూలు, కాలేజిగా రూపొందటానికి ముఖ్యకారకులు. హైస్కూలు అజమాయిషీయే గాకుండా, కాలేజి యాజమాన్యము కూడా వహించారు.

బందరులో జరిగిన కొన్ని విషయాలు జ్ఞాపకానికి వస్తున్నాయి. 1920 జనవరి ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వంలో సహవాసి అనే పేరుతో "సాహిత్యచర్చ" అను వ్యాసం పడింది. అది శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన "కవిత్వతత్త్వ విచారము" మీద కురుగంటి సీతారామయ్యగారు "అలంకార తత్త్వవిచారము" అను పేరుతో వ్రాసిన విమర్శగ్రంథానికి జవాబు, శ్రీ రామలింగారెడ్డిగారే వ్రాసియుందురు.

24-1-1920 తారీఖున హిందూ హైస్కూలు షష్ఠిపూర్తి ఉత్సవం జరిగింది. ఏనుగు అంబారి మీద హైస్కూలుస్థాపకుల, పోషకుల పటాలు ఊరేగించారు. ఉదయం శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు ఆవరణలో మొక్కను పాతి, ఆశుకవిత్వంలో ఆశీర్వదించారు. సాయంత్రం శ్రీ మోచర్ల రామచంద్రరావుగారి అధ్యక్షతన పెద్ద బహిరంగసభ జరిగింది. 25-వ తారీఖు సాయంత్రం రావుబహద్దర్ శ్రీ తిక్కానేని బాలాజీరావునాయుడుగారి అధ్యక్షత క్రింద ప్రాతవిద్యార్థుల సమావేశం జరిగింది. అప్పుడు జాతీయ కళాశాలలో తెలుగు బోధించుచుండిన శ్రీ చెరుకువాడ నరసింహంగా రుపన్యసించారు. అమలులోని విద్యావిధానాన్ని విమర్శించారు. హెడ్ మాస్టరు శ్రీనివాసరావుగారుకూడా మాట్లాడారు. 26-వ

తారీఖున జరిగిన సభలో శ్రీ శేడింబి హనుమంతరావుగారు బహుమతులు పంచిపెట్టారు.

27–వ తారీఖున మా నోబుల్ కళాశాల ప్రిన్సిపాల్ డబ్లుయు. సి. పెన్నుగారిని అభినందించుటకు విద్యార్థులు సమావేశమయ్యారు. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు "ఆధునిక తెలుగు సారస్వతం" అను విషయముపై ఉపన్యసించారు. తరువాత విశ్వనాథ సత్యనారాయణగారు పద్యాలు చదివారు. ఫిడేలు వాయిద్యంలో పేరుగన్న శ్రీ కోటయ్య దేవరగారు ఇంగ్లీషు ట్యూనులతో మురళివాయించారు. బందరులో ఇద్దరు ప్రఖ్యాత వాయులీనాన్ని వాయించేవారుండేవారు. ఎక్కువ పేరుప్రతిష్ఠలు సంపాదించినవారు శ్రీ హరి నాగభూషణంగారు. వీరు మొదట కొంత కాలం టీచరుగాఉండి తరువాత న్యాయవాదిగా ఉండేవారని పైన చెప్పాను. వృత్తికన్న ఈ హాబీయే వారి నెక్కువగా ఆకర్షించింది. రెండోవారు శ్రీ కోటయ్య దేవరగారు. ప్రసిద్ధిగన్న మార్దంగికుడు శ్రీ అశ్వధాటి రామమూర్తిగారివలె విద్యార్థుల కుచితంగా విద్య నేర్పుచుండేవారు.

బందరులో పేరెన్నికగన్న ప్రముఖులలో డాక్టరు అహోబలరావుగారొకరు. వారు అల్లోపతిక్ వైద్యం చేస్తున్నా, నాచురోపతి విధానాన్ని కలిపేవారు. ఆయన నారింజపండ్లను ఎక్కువగా ఉపయోగించండని రోగులను ప్రోత్సహించేవారు. అందువలన ఆ పండ్లకు ప్రజాభిమానం కలిగి, గిరాకి పెరిగింది. పెదవడ్లపూడి తీపినారింజ ప్రసిద్ధి కెక్కింది. మా పెదతండ్రి రామశేషయ్యగారికి పెద్ద వ్రణమేర్పడగా ఆయన కొన్ని వారాలు మిక్కిలి శ్రద్ధగా చికిత్సచేసి, మధుమేహంవల్ల వచ్చిన ఆ వ్రణాన్ని మాన్పారు. వారి స్వరూపం మిక్కిలి గంభీరంగా ఉండేది. మధ్యరకం లావుతో, పొడుగుగా, మెలిదిరిగి పైకిలేచియున్న దట్టమైన మీసాలతో ఠీవిగా, హుందాగా ఉండేవారు. గుర్రపుబగ్గీలో వచ్చి రోగులను చూచేవారు. షికారు వెళ్లేవారు. వారూరుచివర ఈడేపల్లికానుకొన్న పెద్దతోటలో ప్రాత బంగళాలో కాపుర

ముండేవారు. పెండ్లిచేసుకోలేదుగాని బ్రహ్మచారిమాత్రం కాదు. ఎవరో ఇద్దరక్క చెల్లెళ్లు వారికాసటగా ఆ బంగళాలో ఉండేవారట.

బందరుపట్టణం సముద్రతీరాన వున్నందువల్లకాబోలును చవిటిపర్రల మయం. వైశాల్యం హెచ్చు. జనాభా తక్కువ. పేటలు జాస్తి. అంచులనున్న పేటలచుట్టూ బహిఃప్రదేశాల వైశాల్యం పెద్దది. ఈ చవిటిపర్రలలో విద్యార్థుల షికార్లు. అక్కడక్కడ సరుగుడుతోపులుకూడా ఉండేవి. నేనుకూడా అప్పుడప్పుడు ఏ చెట్టునీడనో,పర్రమీదనో కూర్చుండి చదువుకొనేవాడిని. ఇళ్లు చౌడుకారేవి. చాలాచోట్ల నీళ్లు ఉప్పగానో. చప్పగానో ఉంటవి. వ్యాపారం చాలా తక్కువ. గాజురొయ్యలకు, పండుగప్ప వంటి చేపలకు, కూరగాయలకు, ఆకుకూరలకు ప్రసిద్ధి. రోల్డ్ గోల్డ్ షా పొకటి ( ఉమా రోల్డ్ గోల్డ్ ) వృద్ధిలో ఉండేది. దేశవాళీ నేత బట్టలకు, అంగవస్త్రాలవంటివానికి పేరు. రేకు చింతపండుకు,రసం గల కుంకుళ్ళకు, నాణ్యమైన బెల్లానికి, పండుతమలపాకులకు ప్రసిద్ధి. ఫ్రెంచిపేట అని ఒక పేట ఉన్నది. అది తియ్యని నీళ్ళకు పేరు తెచ్చుకొన్నది. మధ్యాహ్నం 3 గంటలు దాటిన తర్వాత చల్లని సముద్రపుగాలి వస్తుంది. అన్నిటికంటె బందరు, కలంకారిబట్టలకు సుప్రసిద్ధం. వీనిని బర్మా, ఇండోచైనా వంటి తూర్పుదేశాలకు ఎగుమతిచేసేవారు. 1867 ప్రాంతంలో బ్రహ్మాండమైన ఉప్పెన వచ్చి ఓడలరేవు మేటవేయకముందు తూర్పుదేశాలతో ఎగుమతి వ్యాపారం జోరుగా ఉండేది. మద్రాసువంటి దక్షిణాది పట్టణాలలో కలంకారి బట్టలకు గిరాకి హెచ్చుగా ఉండేది. కలంకారి బట్టలలో దుప్పట్లు, వాకిళ్ళకు కట్టుకొనే తెరలు, పరుపులకు, కుర్చీలకు, సోఫాల కుపయోగించే గుడ్డలు పేరుచెందినవి. ఫ్రెంచి, డచ్చి, ఇంగ్లీషు వర్తకుల పోటీకి కలంకారి వస్త్రాలు గురైనవి. డచ్చివారి బంగళా నొకదానిని డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టుగా మార్చారు.

ఇప్పుడు మచిలీపట్టణం అనే పేరుతో వ్యవహరించబడే బందరుపట్టణం పురాతనమైనది. ఓడరేవు పూడిపోయి, వ్యాపారం తగ్గిపోవుటవలన పట్టణం అభివృద్ధికాలేదు. రేవు పూడికవలన పడవలవ్యాపారం తగ్గిపోయి గొప్పగా, నిపుణతతో

గట్టిపడవలను నిర్మించే పరిశ్రమ మూలపడ్డది. ఇప్పుడు రేవు పూడికను పూర్తిగా తొలగించి తిరిగి ఓడల రాకపోకలను సాగించాలని ప్రయత్నం. సముద్రతీరంలో మంగినపూడిప్రాంతం బాగుంటుంది. దీని నభివృద్ధిపరచి, వినోదయాత్రాస్థలంగా రూపొందించటానికి ఇప్పుడు ప్రయత్నాలు జరుగుచున్నవి.

పట్టణము సెంటరు రాబర్ట్సన్ స్క్వేరు. నాలుగు ముఖ్య రస్తాలు కలసిన కూడలి. ఇది ఇప్పటికిని దాని గుండెకాయ వంటిది. స్క్వేరు, దాని చుట్టూవుండిన ఇనుపచువ్వలకంచె ఇప్పుడు పోయినా, మా కాలంలో ప్రజల కా ప్రదేశం వివిధ వస్తువులు కొనుక్కొనుటకు, రకరకాల మనుష్యులను చూచుటకు, వివిధ బంధు మిత్రులను కలసికొనుటకు, ఉల్లాసంగా కాలంగడపటానికి, వాహ్యాళికి అనువైనదిగా ఉండేది. రాబర్ట్సన్ స్క్వేరు లేకపోతే, బందరు కానట్లే ఎంచబడుచుండేది. దాని చుట్టూ కూరగాయలు పరచుకొని అమ్మేవారు కనపడకపోతే, బైటనుంచి వచ్చినవారు ఆ పట్టణాన్ని గుర్తుపట్టగలిగేవారు కాదు. రెండో పక్షం చల్లబజారు. బెజవాడవైపునుండి వచ్చేవారు ఈ బజారు గుండా ఇప్పటికిని ఆ కూడలికి చేరుకుంటారు. కాని యిప్పుడు చల్లనమ్మే అమ్మలక్కలు కనపడరు.

మా ఇంటర్ పబ్లిక్ పరీక్ష 22-3-1920 తారీఖున ప్రారంభించి 29-వ తారీఖువరకు జరిగింది. నేను కొన్ని అంశాలలో మధ్యరకంగాను, కొన్ని అంశములలో మిక్కిలి నీరసంగాను వ్రాశాను. పరీక్షలలో నెగ్గుతానని తోచలేదు. 5, 6 రోజులు గడచినతరువాత చౌదరిలాడ్జిని మూసివేసి ఎవరిత్రోవన వారు వెళ్లిపోయాము.

బందరును 1920 ఏప్రిల్‌లో విడిచిపెట్టేముందు జరిగిన కొన్నిసంగతులను గురించి చెప్పటం అభావ్యంకాదు.

ఆ రోజుల్లో కులతత్వం జాస్తిగానే ఉండేది. ఎంత శ్రీమంతులైన, ఎంత విద్యావంతులైన, బ్రాహ్మణులు కానివారిని, బ్రాహ్మణులు ఈసడించటం జరుగుచుండేది. కమ్మకులస్థుడు పరుచూరి రామలింగయ్యగారు బి. ఎ. ప్యాసై, రెవిన్యూ

డిపార్టుమెంటులో చేరారు. వారు బందరుకు బదిలీఅయ్యారు. 1920 ఏప్రిల్ మొదటివారంలో వారి నివాసంకొరకు అద్దింటికోసం వారు, నేను తిరిగాము. ఒక బ్రాహ్మణ గృహంలో ఒక భాగము ఖాళీగాఉండి, వసతికి అనుకూలంగా కనపడగా, దాని సద్దెకివ్వండని అడిగాము. ఆ బ్రాహ్మణస్త్రీకి కోపంవచ్చింది. ఏమిటీ, అని దీర్ఘంతీసి, మీరు కమ్మ కులస్థులా! బ్రాహ్మణుల ఇళ్ళను అద్దెకు అడుగుతారా? అని ఎగిరిపడింది. బ్రాహ్మణత్వభావం ఎంత గట్టిగా ఉండేదనగా క్రైస్తవమతము పుచ్చుకొన్న రామశాస్త్రిగారు, ఆయన కుమారుడు నిత్యానందశాస్త్రిగారు శాకాహారులుగానే వుండి బ్రాహ్మణాచారాలను ఆచరించేవారు. అయితే ఇంటివద్ద ఎట్లున్నా, బ్రాహ్మణ విద్యార్థులు మాతో కలసిమెలసి ఉండేవారు. మనస్సులో, పై కులమువారమని అహంభావమున్నా పైకి కుబక నిచ్చేవారుకాదు. ఒకవేళ పైకి వెళ్ళగ్రక్కితే, బ్రాహ్మణేతర విద్యార్థులు సహించేవారు కాదు. బ్రాహ్మణులేగాక, పట్టణాల లోని వైశ్యులుకూడా తాము అధికులమనే భావముతో నిక్కు చూపించేవారు. పైన చెప్పినట్లు నేను 1913 లో 3-వ ఫారం చదువు చున్నకాలంలో మా కుటుంబానికి అప్పిచ్చే తాడేపల్లివారింటికి మానాన్న పనిమీద వెళ్లి, సమయానికి దాహముకాగా మంచినీళ్లు అడిగారని, ఎవరో ఇత్తడిచెంబుతో మంచినీళ్లు తెచ్చియిచ్చారని, మానాన్న చిరాకుపడి ఆ ఇత్తడిచెంబును అక్కడే విడిచిపెట్టి బజారు వెళ్లిపోయారని పైన చెప్పాను.

ఇంకొక అనుభవము గుర్తుకువస్తున్నది. ఇది 4-2-1920-వ తారీఖున మాఘ పౌర్ణమి (సిద్ధార్థ సంవత్సరం బుధవారం) నాడు వచ్చిన సముద్రస్నానంలో జరిగింది. కమ్మ విద్యార్థులు రాత్రి 2-45 నిమిషాలకే లేచారు. ఆడుతూపాడుతూ, నెమ్మదిగా నడుస్తూ 5 గంటలకు సముద్రం చేరాము. అక్కడ పిచ్చాపాటి మాట్లాడు కొంటూ ఆరుగంటలకు సముద్రంలోనికి దిగాము. నేను స్నానంచేసి అందరికంటె ఆలస్యంగా వచ్చాను. స్నానంచేసేవారు విడిచిపెట్టిన ఆరు దోసకాయలు, నాలుగు నారింజకాయలు, రెండు జామ

కాయలు పట్టుకొన్నాను. లక్ష్మీపతి బాబాయి, వియ్యమ్మ పిన్ని వచ్చారు. వారిని సముద్రమునకు దగ్గరగావున్న దేవునిగుడికి తీసికొని వెళ్లాను. అక్కడ ప్రజలు తండోపతండాలుగా చేరుకొన్నారు. దేవాలయప్రాంగణములోనికి పోయేవారు, బయటికి వచ్చేవారు ఒకరి నొకరు త్రోసుకొనిపోయారు. ఆ త్రోపుడులో మంచి వయస్సులోనున్న ఒక చక్కని యువతి నా కౌగలిలోకి వచ్చింది. "అయ్యో! పాపం" అని నేనగా తెలిసికొని, సిగ్గుపడి నాముఖమువిూదకు వచ్చిన తన ముఖాన్ని చటుక్కున త్రిప్పుకొని, ముందుకు త్రోసుకొనిపోయింది. ఆ అనుభవము నా కిప్పటికిని మిక్కిలి ఆహ్లాదాన్ని కలిగిస్తూంటుంది. ఆమె చక్కనిరూపము, అందమైన ముఖకవళికలు, సిగ్గుతోకూడిన చిరునవ్వు నా హృదయములో మల్లెపూల పరిమళముగా నిలిచిపోయినవి.

విదేశయాత్ర చేయాలనే అభిలాష, 1916 లో అమెరికా సంయుక్తరాష్ట్రాలకు వెళ్లాలనే ఉద్దేశంతో ఆరంభించి, తిరిగి 1920 మార్చిలో జరిగిన పబ్లిక్ పరీక్షలకుముందే పునరుజ్జీవం పొందినట్లున్నది. ఏప్రిల్ మొదటివారంలో (6-4-'20) పర్వతనేని వెంకటరత్నం గుంటూరుకు వెళ్ళివచ్చి "పాస్‌పోర్టు కొరకు, జిల్లా కలెక్టరుకు దరఖాస్తు పెట్టాలట" అని చెప్పాడు. నే నాయనతో "బందరు వెళ్ళి, బొల్లిని నారాయణస్వామినాయుడుగారి సహాయంతో దరఖాస్తు పెట్ట"మని చెప్పాను. అప్పటికి ఒక్క వెంకటరత్నంగారే ఇంగ్లండు చదువుకు వెళ్లాలని ప్రయత్నిస్తున్నట్లు కన్పడుచున్నది. ఆయన బావమరది లింగం వెంకటకృష్ణయ్యకూడ ఆ ఉద్దేశంతోనే ఉండివుండవచ్చును. వా రిద్దరి ప్రయత్నాలు చూచి నా అభిలాష పెరిగింది. క్రమేపి గట్టిపడి, గట్టి కోర్కెగా పరిణమించింది. వారి ప్రోత్సాహంలేనిదే ఆ కోర్కె భీష్మించేదికాదు. కాని ఆ యిరువురు వారి పెద్దల ఒత్తిడికి తట్టుకోలేకపోయారు. విదేశప్రయాణ ప్రయత్నం మానుకొన్నారు. కాని నేనుమట్టుకు నా నిర్ణయాన్ని మార్చుకో దలచుకోలేదు. వెంకటకృష్ణయ్య పెద్దన్న, వెంకటరత్నం బావమరది, వీరభద్రుడుగారు తన తమ్ముడు, బావమరది ప్రోత్సాహం కారణంగా నేను తలపెట్టానని తలంచి

కాబోలు డబ్బు నే నిస్తానన్నారు. నేను ఒకచోట వ్రాసికొని యుండినాను. "నా జ్ఞాపకప్రకారం 3-5-1920-వ తారీఖున నే నింగ్లండు వెళ్ళటానికి కావలసిన డబ్బు యిస్తానని నా పెదతండ్రి పెద సుబ్బయ్యగారికుమార్డు లింగం వీరభద్రుడుగారు, దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరి, నా పెదతండ్రి అల్లుడు వల్లభనేని రామ శాస్త్రులగార్ల సన్నిధానంలో మాటయిచ్చారు. ఆయన వాగ్దత్తం మీద ఆధారపడి నే నింగ్లండు వెళ్ళటానికి సిద్ధమయ్యాను." ఇక్కడ డబ్బు విషయం చెప్పాలి. మా తండ్రిగారికి ఆరోగ్యం చాలా సంవత్సరాలనుండి అంత బాగావుండటంలేదు. పైగా కుటుంబానికి రుణాలున్నవి. అందువల్లను, మా సవతితల్లి కుమారుడు చిన్నవాడైనందువల్లను, నేను తమకు సాయపడగల వయస్సువచ్చిన పెద్దకుమారుడ నగుటచేతను వారికి నా విదేశ ప్రయాణం ఇష్టంలేదు. వారు డబ్బివ్వకపోయినా, వీరభద్రయ్య గారు డబ్బు నే నిస్తానని ధైర్యముచెప్పటంవల్ల కాబోలు, నేను వెళ్ళుటకు నిశ్చయించుకొన్నాను. చివరకు వారు డబ్బివ్వలేదు. మా నాన్నగారికి సర్దక తప్పలేదు.

నా విదేశప్రయాణం స్థిరమైనవెంటనే మాగంటి బాపినీడు గారు కూడా విదేశప్రయాణ ప్రయత్నములో నున్నారని తెలిసి, వారి ఊరు పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకా చాటపర్రు గ్రామం వెళ్లాను. వారు గ్రామంలో లేరు. వారిభార్య అన్నపూర్ణా దేవిగారు సత్కరించి విషయం తెలిసికొని ఏలూరులో వారి బంధువులు చలసాని రామయ్యగారింట్లో జరిగే శుభకార్యమునకు వెళ్ళినారని, ఆ రాత్రి శుభకార్యమని చెప్పిరి. నేను సమీపములో నున్న ఏలూరువెళ్ళి చలసాని రామయ్యగారింట్లో బాపినీడుగారిని కలసికొన్నాను. అక్కడ జరిగే శుభకార్యం రామయ్యగారి మూడవకుమార్తె శోభనం (గర్భాదానం). ఆ రోజుల్లో భార్యా భర్తలకు మాత్రమే వ్యక్తిగతంగా సంబంధించిన ఈ సహజప్రకృతి కార్యాన్ని, వేడుకగా తలంచి బంధువుల నందరి నాహ్వానించి విందుచేసేవారు. కొన్నిచోట్ల గ్రామస్థులందరికి భోజనాలు పెట్టేవారు. పురోహితులు మంత్రాలతో, ఆశీర్వాదాలతో

సావకాశంగా పూజా పునస్కారాలు నడిపేవారు, తొందర పడుచున్న వరుడు, సిగ్గుపడుచున్న వధువుల మనోప్రవృత్తితో వారికి సంబంధము లేదు. గర్భాదాన సుముహూర్తం సమీపించాలి. అది ప్రొద్దుపోయి వస్తే ఫలప్రదానాలని, ఇంకేవేవో అని కాలహరణం చేసేవారు. ఉల్లాసంగా, ఉత్సాహంగా జరపవలసిన మిథునకార్యం యువతీయువకుల అలసటవలన సక్రమంగా జరుగదేమో అను ఆలోచన ఉండదు. ఈ విషయంపైన విపులంగానే ఇంకొక సందర్భంలో వ్రాశాను. ఈ అనాగరిక పద్ధతుల నీ కాలంలో విడిచిపెట్టినందులకు సంతోషించవలసి యున్నది. అమ్మలక్కల రభస అటుంచి, పౌరోహితుల బెడద, పెద్దల ఆర్భాటం తప్పిపోయింది. ఆ సందర్భంలో చూచిన రామయ్య గారి ( రెండవ ) కుమార్తె శ్రీమతి శకుంతలాదేవి నన్ను మిక్కిలి ఆకర్షించింది. ఆమె పచ్చనిరంగు, కోలముఖం, సోయగం, కమ్మవారిలోకూడా ఇంతచక్కని స్త్రీలున్నారుకదా అనేభావం చాలాకాలం నన్ను ఉత్సాహవంతునిచేస్తూ వచ్చింది. శ్రీ బాపినీడుగారు నన్ను మద్రాసులో కలసికొమ్మని చెప్పారు. నేను మద్రాసుకు వెళ్లి వారిని కలసికొని, వారు, నేను శ్రీ కరీం అనే పోలీసు ఉద్యోగస్థునిద్వారా శ్రీ కరీముల్లాచిడా అనే పేరుగల పోలీసు డిప్యూటి కమీషనర్ గారిని సమీపించి వారి సాయంతో ఇంగ్లండుకు నేను, యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికాకు శ్రీ బాపినీడు వెళ్లుటకు అనుమతిపత్రాలను సంపాదించాము. శ్రీ చిడాగారు చాలా స్ఫురద్రూపి. ఫ్రెంచివానివలె ఉండేవారు. మిక్కిలి ఠీవితో, దర్జాగా, సరిపడ్డ ఒడ్డు పొడుగుతో చాలా అందంగా ఉండే వారు. శ్రీ కరీం ఏలూరులో పోలీసు ఉద్యోగం చేసియుండటంవల్ల శ్రీ బాపినీడుకు, వారి కుటుంబానికి బాగా తెలిసినవాడు.

ప్యాస్ పోర్టయితే సంపాదించానుగాని పైన చెప్పినట్లు, ఇంగ్లండుకు వెళ్ళటం మా తాతగారికి సుతరాం ఇష్టంలేదు. పైన పేర్కొన్న కారణాలేగాక, ఆ రోజుల్లో సముద్రప్రయాణం చాలా కష్టనష్టాలకు గురైనదిగా తలంచబడేది. నేను వంటరిగా ప్రయాణంచేయవలసిరావటం వారికి కష్టం కలిగించింది. అయినా తల్లిలేనివాడనని, ఇతరులను డబ్బుకొరకు ఆశ్రయించటం

సుతరాం ఇష్టంలేకను వా రొప్పుకొని డబ్బు సప్లయిచేశారు. నా భార్య వద్దని గోలపెట్టింది. కాని నా భార్య ఉత్తమ ఇల్లాలైనను, భర్తను ఆకర్షించి ఒప్పించేశక్తి కించిత్తు లేనిది. పైగా తండ్రి, ఏకైకసోదరుడు చనిపోవుటచేత, కన్నవారి ఆస్తిని మానేజ్ మెంటుచేస్తూ అధికారం చెలాయించుచుండిన ఆమె అక్క నాయెడల మిక్కిలి సానుభూతిరహితంగా నడుచుచుండింది. అందువల్ల ఆమె ప్రార్థన నా చెవికెక్కలేదు. నా పట్టుదల సడలలేదు. నిజానికి ఎక్కువైంది.

దుస్తులకొరకు తిరిగి మద్రాసు వెళ్ళటానికిముందు శ్రీ మాగంటి బాపినీడుకు చాటపర్రుకు వ్రాశాను. "వారు కొలదికాలం క్రిందటనే ఇంగ్లండులో చదువుకొని వచ్చిన మెటపర్తి సుబ్బయ్య చౌదరిగారితో కలసి వారి సహాయాన దుస్తులను కుట్టించుకొనుటకు మద్రాసు వెళ్లారని, మీరుకూడా వెంటనే బయలుదేరి వెళ్ళవలసిందని, బాపినీడుగారు చింతాద్రిపేట 96, అయ్యామొదలి వీథిలో నున్న ముళ్ళపూడి రంగయ్యగారింట్లో ఉంటా''రని వారి భార్య శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు, 29-6-1920 తారీఖున జాబువ్రాసారు. వారు 'సోదరా' అని నన్ను సంబోధిస్తూ, 'సోదరి' అని సంతకం చేశారు. శ్రీమతి అన్నపూర్ణాదేవి మహాత్మగాంధిగారికి ప్రియమైన బిడ్డవంటివారు. ఆమె తన సర్వాభరణాలను, ఖరీదుగల పట్టుచీరెలను మొదటివానిని గాంధిమహాత్మునకు, రెండవవానిని అగ్నిదేవునకు అర్పించిన దేశభక్తురాలు. ఆంధ్రదేశంలో ఇట్టి త్యాగంచేసినవారిలో ప్రథములు, అగ్రగణ్యులు.

నేను వెంటనే బైలుదేరి మద్రాసుకు చేరుకొని శ్రీ బాపినీడు, శ్రీ కాట్రగడ్డ శేషాచలంగారి సాయంతో ఉన్నిదుస్తులు వగైరా కుట్టించుకొన్నాను. డ్రెస్సింగ్ గౌను, ఉన్ని బనియన్‌లు, క్రింది లాగులు, సముద్రయానానికి అనుకూలమైన పెద్ద పెట్టెలు, టోపీ వగైరా కొన్నాను. ఈరోజులలోనే నేను, పాణ్యాం కృష్ణమూర్తి కలసి అప్పుడు సుప్రసిద్ధ ఫొటోగ్రాఫర్‌గా నుండిన దాస్ అండ్ కంపెని వారిచేత ఫొటోతీయించుకొన్నాం. ఇంటికి తిరిగివచ్చి

ఇంగ్లండు ప్రయాణానికి సిద్ధమైనాను. గుడివాడలో డెప్యూటీ కలెక్టరుగా నుండిన శ్రీ బండి శ్రీహరిరావునాయుడుగారిని సందర్శించి వారి సెలవు పొందాను.

1920 ఆగష్టు 1-వ తారీఖు ప్రయాణదినం. మధ్యాహ్నానికి అంగలూరునుండి, చౌటపల్లినుండి, సిద్ధాంతంనుండి నా పినతల్లులు, వారి భర్తలు, నా మేనమామ, అక్క, చెల్లెలు, బావమరది, యెర్నేని లక్ష్మీనారాయణగారి వంటి స్నేహితులు వచ్చారు. మా లింగం కుటుంబంవారు వచ్చారు. నా షడ్డకుడు, అతని తల్లి, భార్య ఉన్నారు. వచ్చినవారి కందరికి అల్పాహారాలిచ్చి మానాన్న గారవించారు. బంధువులు, మిత్రులు నన్ను స్టేషనులో రైలెక్కించటానికి నా వెంట రెండుమైళ్లదూరంలోఉన్న గుడివాడకు వచ్చారు. ఈ సందర్భంలో ఒక చిన్నసంగతి గుర్తున్నది. నేను మద్రాసులో కొన్న బూటులలో ఒకజత నిగనిగలాడుచు మిక్కిలి స్నిగ్ధంగా ఉన్నది. లావణ్యపిపాసి అయిన నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రిలుగారు వాని నెంతోమెచ్చుకొని, వానిని తన చెంపలకు ఎట్లాఉంటుందో అని రాచుకొని చూచారు. ఆ రోజుల్లో అంత ఆకర్షణీయమైన పాదరక్షలీప్రాంతంలో ఉండేవి కావు. అవి ఇంగ్లీషు కంపెనినుండి కొన్నవి. నేను, మా పినతాత కుమారుడు శ్రీ నాగభూషణం, పెదతండ్రి కుమారుడు శ్రీ వీరభద్రుడు, ఆయన తమ్ముడు నాగభూషణం, పినతాత మనుమడు నాగభూషణం, నా తమ్ముడు సత్యనారాయణ, షడ్డకుడు సత్యనారాయణ, మూడో పెదతండ్రి కొడుకు సత్యనారాయణ, యెర్నేని లక్ష్మీనారాయణగారు వగైరాతో గుడివాడకు చేరుకొన్నాను. అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు ఆహ్వానించగా వారి మేడమీదకు బంధుమిత్రులతో వెళ్లాను. వారు పానీయాలు, ఫలహారాలిచ్చి ఆదరించారు. శ్రీ గోపాలకృష్ణయ్యగారు నాకు చిరపరిచితులేగాక, నా చెల్లెలుభర్త నిమ్మగడ్డ దుర్గానాగేశ్వరుడు గారి సోదరి భర్త. వారి స్వగ్రామం మా ఊరుకు ఒకమైలు దూరంలోవున్న అగ్రహార సిద్ధాంతం.

నాకు వీడ్కోలిచ్చుటకు వచ్చిన శ్రీ సూరపనేని కాకుళయ్యచౌదరిగారు కొన్నిపద్యాలు వ్రాసి చదివారు. అందులో రెంటి నిందులో చేర్చుచున్నాను.

చం. మిగుల నమూల్యయౌవనము మేను గలంపగ, భార్యచింతలన్
దగులగ, బిడ్డ లయ్య యని దారు మనోవ్యథ గల్గారింప, బం
దుగు లెపుడెప్డు జూతుమని తొట్రుపడన్, పరసీమ కేగు నీ
యగణిత కార్యపున్ విలువ నారసి శ్రద్ధజరింపు మిత్రుడా.

ఉ. లింగమువంశజన్ముడ, కులీనుడవున్, గుణవంతుడౌట, నే
భంగము రాదుగాని, శిత భల్లములన్ బరగించి క్రూరుడై,
యంగజుడేప నోర్వగల యట్టి మహాత్ముడు గానరాడు, ని
స్సంగుడవైనగాని, జన సంస్తవనీయుడ వీవు గావుసూ.

కాకుళయ్యచౌదరిగారిది మా ఊరుకు (గుడివాడకు కూడా) దగ్గరగ్రామం చౌటపల్లి. మూడుమైళ్ల లోపు. మా తల్లి ఐదుగురు చెల్లెళ్లలో మూడవ ఆమె శేషమ్మగారి భర్త అట్లూరి వెంకటప్పయ్యగారు ఆ వూరి వారే. ఈ సందర్భంలో నాకు చిన్న తనంలో సకలోపచారాలు చేసిన పినతల్లి శేషమ్మగారిని గురించి కొంచెమైనా చెప్పలేకుండా ఉండలేకున్నాను. ఆ రోజుల్లో భరవసాగల కమ్మ కుటుంబాల్లో అత్తమామలున్నకోడళ్లు, భర్తలతో చనువుగా ఉండేవారుకారు. పగలు మాట్లాడేవారుకారు. వంటచేస్తూ, బిడ్డలను సాకుకుంటూ, ఇంటి లోపలిభాగంలో ఉండి పోయేవారు. శేషమ్మగారు మిక్కిలి సహనం, శాంతస్వభావంకల సాధువు. ఇంటికి పెద్దకోడలుకాబట్టి సమిష్టి రైతుకుటుంబంలోని బాధ్యతలు, చిరాకులు, చివాట్లు ఆమె భరించవలసివచ్చేది. భర్తకు ఆప్యాయత తక్కువ, కఠినంగా మాట్లాడే స్వభావం కలవాడు. పిల్లలు జెల్లలు. మధ్యమధ్య ఎదిగినపిల్లలు చనిపోవటం. ఓపికతో సంసారం గడుపుకొనివస్తుండగా, కలరావ్యాధి వచ్చి ఒక కొడుకును, నల్గురు కూతుళ్లను విడిచి జీవితయాత్రచాలించింది. సౌజన్యవతి, సుగుణవతి, పత్నీధర్మం, గృహిణీధర్మం తు, చ, తప్పకుండా నిర్వహించిన ఇల్లాలు. ఆమె అమృతం కురుస్తూ, దివ్య సుగంధాలతో, దేదీప్యమానప్రశాంతంతో, తేజోవంతమైన

మూర్తులతో విలసిల్లే దివ్యలోకానికి తప్పక వెళ్లియుంటుంది. ఈ సందర్భంలో శేషమ్మగారి తోడికోడలు, ఆమె భర్త వెంకట సుబ్బయ్యగార్లను తలచుకోవాలి. వా రిద్దరు నాయందు మిక్కిలి ఆప్యాయతతో నుండేవారు. నారాక కానందించేవారు. నే నామెను పిన్ని అని, వారిని బాబాయి అని పిలుస్తు మిక్కిలిచనువుతో మెలిగే వాడను. ఆమె తేలికపసుపురంగు ఛాయతో, చక్కని అవయవ పొందికలతో ఎల్లప్పుడూ తాండవించే చిరునవ్వుతో, మిక్కిలి అందంగా ఉండేవారు. అంత లావుకాదు, సన్నంకాదు. నడుము సన్నం. వక్షస్థలం చేతులు మలచినట్లుండేవి. వెంకట సుబ్బయ్యగారి యందు నాకు వారి యన్న వెంకటప్పయ్యగారియందు కంటె ఎక్కువ చనువు, బంధుభావ ముండేది. నిజానికి నా చిన్నతనంలో వెంకటప్పయ్యగారంటె నాకు మిక్కిలి భయముగా నుండేది. వా రింట్లో చిన్నతనంలోనే విధవయైన మాణిక్యం అనే పేరుగల వారిచెల్లె లుండేది. ఆమె సుగుణవతి. మర్యాదస్తురాలు, పూజా పునస్కారాలతో కాలంగడపేది. వారి అక్క రుక్మిణమ్మగారు మిక్కిలి మాటకారి. తమ కొద్ది సంసారాన్ని దక్షతతో నడుపు కొనేది. ఈ యిద్ద రప్పచెల్లెళ్లు నాయందు ప్రీతిగా నుండేవారు.

మా పిన్ని శేషమ్మగారు జీవించిఉండేకాలంలో తరచు ఆ ఊరు వెళ్లుచుండేవాడను. ఆ ఊరు 50, 60 ఏళ్లనాడే విద్యా ప్రబోధంకల్గి చక్కని పుస్తకభాండాగారంతో, పండితులు, కవులతో ఉండేది. ఈ ఉజ్జ్వలత్వానికి మిక్కిలి తోడ్పడినది అక్కడ ప్రథమ భార్యను పొందిన శ్రీ కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు. చౌటపల్లిలో, శ్రీరామస్వామిచౌదరిగారి భక్తులలో ముఖ్యులు, సూరపనేని కాకుళయ్యచౌదరిగారి అన్న దమ్ములు, శ్రీ అట్లూరి రామయ్య వగైరా. శ్రీ కాకుళయ్యా చౌదరిగారు మంచికవులు. వారు, నా కదివరకే స్నేహితులై యుండిన బాపయ్యా, మల్లికార్జునుడు వగైరా మిత్రులు గుడివాడకు వచ్చి నాకు వీడ్కోలిచ్చినారు.

బెజవాడ రైల్వే స్టేషనులో ఆ సాయంత్రం (రాత్రి) దిగి నప్పుడు శ్రీ జంపాల సాంబయ్యా, శ్రీ వి. యస్. కృష్ణ, శ్రీ పి.

బాపయ్య కలసికొన్నారు. పైజెప్పిన నా బంధువులు మిత్రులు కూడ బెజవాడలో మద్రాసుకు వెళ్లే రైలెక్కించారు.

మిత్రుడు యెర్నేని లక్ష్మీనారాయణగారు, తమ్ముడు సత్యనారాయణ, షడ్డకుడు సత్యనారాయణ, పెదతండ్రి ఆది నారాయణగారి కుమారుడు సత్యనారాయణ, నా పినతాత మనుమడు నాగభూషణం నాతో మద్రాసుకు ప్రయాణంచేశారు, నన్ను బొంబాయిలో ఇంగ్లండుకు సాగనంపాలని. 2-8-1920 ఉదయం, మద్రాసు సెంట్రల్ స్టేషనులో నా పెదతండ్రి కుమారుడు లింగం వెంకట కృష్ణయ్య, శ్రీ యమ్. వెంకట్రామయ్య, శ్రీ ఎ. పున్నయ్య స్వాగతమిచ్చారు. మేము 149 నంబరు తంబుచెట్టి వీథిలో దిగాము. తర్వాత నేను, లక్ష్మీనారాయణగారు శ్రీ పల్లెంపాటి రామకృష్ణయ్యగారిని, శ్రీ కాట్రగడ్డ శేషాచలం గారిని రామకృష్ణయ్యగారింట్లో కలసికొన్నాం. వారప్పుడు జార్జిటౌన్, పగడాలవీథిలో ఉండేవారు. శేషాచలంగారి సోదరి, అనగా రామకృష్ణయ్యగారి భార్య జ్ఞానప్రసూనాంబగారు, ప్రీతితో ఆహ్వానించి మా యిద్దరిని భుజింపజేశారు. వారి తల్లి తాయారమ్మగారు ఆదరించారు.

శ్రీ శేషాచలంగారు రసాయనశాస్త్రంలో బి. ఎ. ఆనర్సు పట్టా తీసుకొని, అప్పుడు మంత్రిగావుండిన శ్రీ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారి సాయంతో, ఇంగ్లండులో చర్మపరిశుద్ధి విధానాన్ని నేర్చుకొనుటకు మద్రాసు గవర్నమెంటు స్కాలర్‌షిప్పును సంపాదించియున్నారు. వారు కూడా రామకృష్ణయ్యగారింటిలో అప్పుడున్నారు.

రామకృష్ణయ్యగారు నాకు బంధువులగుటవలన వారింటిలో ఒకటి రెండు రోజు లుండి శేషాచలంగారిసాయం, మద్రాసులో నుండిన మాగంటి బాపినీడుగారిసాయం పొంది, పనులు చక్కదిద్దు కొన్నాను. శేషాచలంగారు, నేను లండన్ వెళ్లుటకు, శ్రీ బాపినీడు యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికాకు వెళ్ళుటకు సిద్ధమైనాము.

నేను, శేషాచలంగారు బొంబాయికి బైలుదేరాము. మాకు వీడ్కోలిచ్చినవారిలో, శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు

ప్రముఖులు. వారు మద్రాసు ఆంధ్రులలో పేరెన్నికగన్నవారు. ఆ నగరం కాంగ్రెసు ముఖ్యనాయకులలో నొకరు, మద్రాసు కార్పొరేషన్‌లో చాలా సంవత్సరాలు సభ్యులుగాఉండి ప్రముఖ పాత్రను వహించారు. ప్రజాభిమానం చూరగొన్న మహావ్యక్తి. ప్రతి కాంగ్రెసు ఉద్యమంలోను పాల్గొన్నారు. ప్రతి కాంగ్రెసు సభలోను గుర్తించగల ప్రముఖపాత్రను వహించిన దిట్ట. స్వార్థత్యాగి, భేషజం ఎరుగని గుణశీలి. బీదసాదలయందు అపార కనికరం. కులాభిమానంకూడా తక్కువకాదు. వారు పెద్ద మీసకట్టుతో, తలపాగాతో మిక్కిలి ఠీవిగా ఉండేవారు. హుందాతనం వారి సొమ్ము. గట్టిగా, నిర్భీతితో మాట్లాడటం వారి రీతి. వారు ఇతరులకు తన యందు గాఢాభిమానం, ఆప్యాయత ప్రేరేపించగల సజ్జనులు. వారు మా కిరువురకు పూలదండలువేసి అభిమానించారు. రామకృష్ణయ్యగారి రెండోకూతురు సరస్వతి మాకు పూలగుచ్ఛాలిచ్చింది. ఏకారణంచేతనో మిత్రుడు పాణ్యాం కృష్ణమూర్తి రాలేదుగాని, అతని తమ్ముడు వచ్చి వీడ్కోలు చెప్పాడు. దండమూడి శ్రీరాములుగారు శ్రీ శేషాచలంగారిని బొంబాయి కనుసరించారు. నాతమ్ముడు, షడ్డకుడు, పెదతండ్రి కుమాళ్లు, మిత్రుడు లక్ష్మినారాయణగారు నన్నునుసరించారు.

బొంబాయి చేరుకొని, విక్టోరియా రైల్వే స్టేషనుకు సమీపంలోవున్న ఎంపైర్ హోటలులో దిగాము. ఆ హోటల్ ఇప్పటివలె ఆధునిక వసతు లంతగా కల్గియుండలేదు. అయినా మాకదే గొప్ప అనిపించింది. ఒకటి, రెండురోజులు స్టీమరు కంపెనీకి వెళ్ళటంలోను, అవి, ఇవి చూడటంలోను, కావలసిన చిల్లర మల్లర కొనటంలోను, కాలం గడచిపోయింది.

స్టీమరెక్కే 1920 ఆగస్టు 7-వ తారీఖు వచ్చింది. మమ్ము సాగనంపుటకు పైజెప్పినవారు హార్బరుకు వచ్చారు. మిత్రుడు యెర్నేని లక్ష్మినారాయణచౌదరిగారు మాకు పూలదండలు వేశారు. బంధువులు, మిత్రులు, కౌగిలింతలతో, కన్నీళ్ళతో సాగనంపారు. మే మెక్కిన యస్. యస్. కాశ్మీర్, మధ్యాహ్నం 1 గంటకు హార్బరును వీడింది. ప్రయాణికులు, సాగనంపవచ్చిన వారికి చేతులూపుచుండగా సాగిపోయింది.

౨

# నా విదేశ విద్యాభ్యాసం

నాకు రెండవతరగతిలో స్థానము దొరకనందున మొదటి తరగతి కాబిన్‌లో చేరవలసివచ్చింది. గవర్నమెంటు స్కాలర్ షిప్పును, సహాయమును పొందియుండిన, కాట్రగడ్డ శేషాచలం గారు రెండవతరగతి కాబిన్‌లో ప్రవేశించారు. నాకు సముద్ర యానం క్రొత్త. పైగా ఆగష్టుమాసం వర్షఋతువయినందున, అరేబియాసముద్రం మిక్కిలి అల్లకల్లోలముగా వుండింది. మరిన్ని, నాది పిత్తతత్త్వ శరీరం. లావుగా, ఉబ్బినట్లుగా ఉండేవాడిని. అందువలన కాబిన్‌లో ప్రవేశించినదిమొదలు ఏడెన్ చేరుకొనే వరకు, తలత్రిప్పటంవల్ల, ఎడతెగని డోకులతో, వికారముతో బాధపడుచు గదిలోనే ఉండిపోయాను. నాగది (కాబిన్) లో రెండుపడకలు (బంక్స్) వున్నవిగాని, ఏరెండో ప్రయాణీకు డందులోకి రాలేదు. నాకు నిద్రనుండి లేవటంతోనే కాఫీగాని టీగాని తీసుకొనే అలవాటులేదు. అది వద్దని చెప్పివేశాను. సముద్రయానజబ్బు (సీ సిక్‌నెస్) వల్ల బాధపడుచుండటం కారణాన, ఆహారముకూడా సహించలేదు. ఇంచుమించుగా ఉపవాసమే. 7-వ రోజు 13-వ తారీఖున, ఏడెన్ చేరినాం. అంతవరకు శేషాచలంగారు, నేను కలసికోలేదు. అరేబియా

సముద్రంలోని అల్లకల్లోలం, తుఫానువాతావరణం, ఎఱ్ఱసముద్రం ముఖద్వారంలోవున్న ఏడెన్ చేరునప్పటికి తగ్గిపోయింది. శేషాచలంగారు నేను ఎట్లున్నానో తెలిసికొనటానికి నాగదికి వచ్చారు. నా దీనస్థితిని చూసి జాలిపడి, తనగదిలోని రెండోబర్తు ఖాళీగా వున్నదని చెప్పి, నా సామానుతో నన్ను అక్కడికి తీసికొనిపోయారు. ఏడెన్ ముఖద్వారమునుండి ఓడ ఎఱ్ఱసముద్రంలోకి ప్రవేశించింది. ఉప్పెనవచ్చిన విధంగా వుండిన వాతావరణం, వేసవికాలం వాతావరణంవలె మారిపోయింది. చుర్రుమని పిచ్చి ఎండ కాచి, శరీరానికి తాపం కలిగించటం మొదలుపెట్టింది. ఏడెన్ నుండి బైటకువచ్చి డెక్ (పైకప్పు) మీాద పచారులు చేయటం, భోజనశాలలోకి వెళ్లటం మొదలుపెట్టాను. మొదటిసారి మధ్యాహ్నభోజనానికి భోజనశాలలో, శేషాచలంగారి ప్రక్కస్థానంలో కూర్చొన్నాను. మొదటిపదార్థం సూప్ (శారువా). రుచికరముగానే ఉండింది. కొంత తీసుకొన్నతర్వాత, ఇది దేనిసూప్ అని శేషాచలంగారిని అడిగాను. ఎదురుగావున్న భోజనవివరణపట్టికను (మెను) చూచి ఎద్దుతోక శారువ (ఆక్స్ టెయిల్ సూప్) అని చెప్పారు. నాకు ఎక్కడలేని ఊోకువచ్చింది. అసహ్యాం పుట్టుకువచ్చింది. మిగిలిన సూపుపళ్లాన్ని ప్రక్కకు నెట్టాను. మొదట తీసుకొనుట కారంభించినప్పుడు, దాని వాసనగాని, రుచిగాని నాకెట్టి అసహ్యామును కలిగించలేదు. పైపెచ్చు, రుచికరముగానే వుండింది. కాని గోమాంసభక్షణను ఏవగించుకొనే దృక్పథముగల హిందూమతములోని వాడినికాబట్టి ఎద్దుతోక సంబంధమనగానే, తనంతటది వికారాన్ని కల్గించింది. తర్వాత తర్వాత, ఇంగ్లండులో విద్యాభ్యాసముచేయుచున్నప్పుడు ఎన్నోసార్లు ఎట్టిఅభ్యంతరం లేకుండగనే, ఎద్దుమాంసం భుజించాను. శేషాచలంగారిని బాబాయి అని పిలిచేవాడను. (వారును నన్నా విధంగానే పిలిచేవారు.) వారి తల్లి, సోదరీలు, ఆప్యాయతతో వారికొరకు కారంబూంది, కారంపూస చేసి డబ్బాలలో నింపి వారి కిచ్చారు. పాశ్చాత్యభోజనాని కింకా అలవాటుపడని నాకు, ఈ

ఉపాహారాలు ఎంతో తృప్తినిచ్చాయి. శేషాచలంగారు మిక్కిలి ఉదారంగా వీటిని నాకు అందజేశారు.

ఆ రోజుల్లో ఇంగ్లండుకు వెళ్లే ఇండియన్లు తక్కువ. మా ఓడలో ప్రయాణంచేసిన ఇండియన్లు చాలాస్వల్పం. పాశ్చాత్యులు, అందు ముఖ్యముగా గ్రేట్ బ్రిటన్ కు చెందినవారే ఎక్కువ. స్త్రీలుకూడా వుండిరి. ఫర్లో (సెలవు) మీద స్వదేశానికి వెళ్తుండిన మిలిటరి, సివిల్ ఉద్యోగులు ఎక్కువమందుండిరి.

స్త్రీలలో, అందచందాలు కలిగి, మంచియౌవనములో వున్న శ్వేతవనిత ఒకామె, పకపకలతో, వికవికలతో, సరస సల్లాపాలతో ప్రయాణీకులను ఆకర్షించుచుండేది. ఉత్సాహంలో మిక్కిలిరంజకంగా, పియానోను (పెద్దహార్మోనియం వంటిది) వాయిస్తూ, పాడుచుండేది. నే నెంతయో ముచ్చటపడి, ప్రక్కప్రక్కన నిలుచుండి, ఆమె వాయిద్యాన్ని, పాటను గలగలనవ్వులను, చిలిపిమాటలను వినేవాడనుకాని, సమీపము నకు పోవుటకు సాహసించేవాడను కాను. 1920 సంవత్సరములో ఇండియా దేశస్థులం, శ్వేతాధికారానికి పూర్తిగా లోబడి యుండినాము. "స్వరాజ్యము నాజన్మహక్కు, నేను దానిని సాధించెదను" అని గర్జించిన లోకమాన్య తిలక్ మహాశయుడు ఆ సంవత్సరము ఆగష్టు 1-వ తారీఖున స్వర్గస్థులైనారు. శ్రీ మోహన్ దాస్ కరంచంద్ గాంధి అప్పటికి పెత్తనానికి రాలేదు. దేశవిముక్తికి తీవ్రాందోళన ప్రారంభం కాలేదు. దేశప్రజల స్వాతంత్ర్యపోరాటానికి ఇంకా 20 సంవత్సరాలు గడవవలసి యున్నవి. అందువలన, ఇండియనులు ఎంత మేకపోతుగాంభీర్యం చూపించినా, వారిని మనోదాస్యం ఆవరించే ఉండింది. పైగా, అప్పటివరకు బందరువంటి మారుమూలపట్టణంలో చదువుకొని, పల్లెటూరివాతావరణంలో పెరిగిన నేను, బుర్రమీసములతో దొందశరీరంతో, అవయవసౌష్ఠవ మంతగాలేని నేను, గోధుమ రంగుకూడా లేని శరీరవర్ణముగల నేను, హిమంవంటి శరీరంకలదై చంద్రబింబంవంటి ముఖంకల్గి, వెన్నెలవంటి నవ్వుతో, పరవళ్లు త్రొక్కుచున్న వయస్సుతో, అప్సరసగా నాకళ్లకు కన్పడిన ఆ యువతిని, ఎట్లు సమీపానికిచేరి, తేరిపారచూడగలను ? ఇదిగాక

ఆమె తన గదినుండి బయటకు వచ్చిందే తరువాయిగా, శ్వేత పురుషులు ఆమెచుట్టూ మూగేవారు. వారిలో ప్రత్యేకించి ఒక మధ్యవయస్కుడు, సుందరాకారుడు, పొడవైన మిలిటరీ ఉద్యోగి ఆమె ననుసరించియుండేవాడు. వారం పదిరోజులకు మేము మార్సెల్సు చేరినప్పుడు కొన్నిగంటలు వ్యవధి యుండినందున, ఆ పట్టణము చూచుటకు బయలుదేరాము. అప్పుడొక గుర్రపు బగ్గీలో ఈ యువతియు, ఆ మధ్యవయస్కుడును సంతోష ఉల్లాసములతో రాజమార్గమువెంట పోవుట చూచి, శేషాచలంగారు నన్ను తాకి ఆ వెళ్ళుచున్నవారిని చూపించి హసించినారు. ఆ యువతి ఒక నటి అని, అవివాహిత అని, పురుషసాంగత్యానికి అడ్డుచెప్పదని మాకు తరువాత తెలిసింది. వారిరువురు స్వేచ్ఛగా కామప్రవృత్తిలో మునిగిపోయారని, ఆ వగలాడిని కాంక్షించిన ఆ పురుషుని పూర్తిగా లోబరచుకొని, అతని ధనమును దోచుకొని, విడిచిపోతుందని మేమిరువురం తలంచాము.

మేము ఎఱ్ఱసముద్రంనుండి సూయజ్ కెనాలులో ప్రవేశించి మందగమనాన్న ప్రయాణం సాగించాము. విశాలమగు సూయజ్ కాలువగుండా ప్రయాణం చేయటం మిక్కిలి ఆనందకరంగా ఉండింది. ఇరుప్రక్కల విస్తరించిన మైదానము. మా కెదురుగా ప్రయాణించుచున్న ఓడలు, అక్కడక్కడ పర్యవేక్షణకై నియమించబడిన ఉద్యోగులు, వారి జలక్రీడలు, మా కన్నుల కానందాన్ని సమకూర్చినవి. సూయజ్ కెనాలు, మధ్యధరా సముద్రాన్ని చేరేముందు, ఆ సముద్రముఖద్వారమో అన్నట్లుండిన పోర్టుసెడ్ అను రేవుపట్టణమును చేరాలి. అక్కడ ఓడలు కొన్నిగంటలు ఆగును. ప్రయాణీకులు ఓడ ప్రధానాధికారి (కాప్టెన్) అనుమతితో పట్టణములోనికిపోయి వింతలు వినోదాలు చూడవచ్చును, బజార్లవెంట తిరిగి వస్తువులు కొనుక్కొనవచ్చును. మధ్యాహ్నభోజనానంతరం సుమారు 3 గంటలకు బయలుదేరాము. పట్టణములోని రాజబాట ననుసరించి ఆయాదుకాణాలను చూస్తూ, మధ్యమధ్య షర్‌బత్ లనబడు మధుర పానీయాలను సేవించుచు,

ఈజిప్షియన్ సిగరెట్ల ధూమపానం చేయుచు సాయంత్రంవరకు గడిపాము. పోర్టుసెడ్ వివిధ దేశాల నావికులు, ప్రయాణీకులు కలసే కూడలి. ఆ రేవుపట్టణంలో ఈజిప్షియన్ లే గాక, ప్రాక్ పశ్చిమ ఆఫ్రికా దేశాలకు చెందిన వివిధజాతులవారు కనపడుదురు. నలుముఖములనుండి రాకపోకలుచేసే ప్రయాణీకులవలన పట్టణము చిన్నదైనను జనసమ్మర్దముతో వుంటుంది. టర్కీ సుల్తాన్ ఆధిపత్యాన చిరకాలం ఈజిప్టుదేశం అణగిమణగి ఉండింది. అందువలన పోర్టుసెడ్ లో ఇప్పటికికూడా తుర్కీ సిగరెట్లని, తుర్కీ షర్బత్ లని ఇతర వస్తువులను అమ్ముతారు. నేను ఒకటి రెండు సిగరెట్లు పెట్టుకొనే పెట్టెలను, పూసలపేర్లను కొంటిని. ఓడకు చేరే వ్యవధి దగ్గరకు రాగా తిరుగుముఖమై ఓడను చేరుకొన్నాము.

రాత్రి భోజనసమయమున ఓడ తిరిగి ప్రయాణం సాగించింది. మధ్యధరాసముద్రముమీద ప్రయాణం మిక్కిలి సంతోషకరంగా ఉండింది. ఈ సముద్రం అంత లోతైనది కాదు. తీరప్రాంతములు చాలా తక్కువలోతు గలవి. నీరు నీలము, స్వచ్ఛము. మర్నాటి ఉదయం ఆ స్వచ్ఛమైన నీల జలాన్ని చూచి ముగ్ధులమైనాము. మెత్తని సూర్యరశ్మివల్ల స్వచ్ఛత ఇనుమడించింది. నీలం మెరుగెక్కింది. మధ్యధరాసముద్రం ఒడ్డున, ఈశాన్యభాగాన వున్న ఫ్రెంచి పట్టణం, మార్సైల్సు చేరుకొన్నాం. ఇది గొప్ప రేవు పట్టణం. అంతర్జాతీయ నౌకలు, రాకపోకల్లో కలుసుకొనే కూడలి రేవు. ఈ రేవులోనే సాధారణంగా ప్రయాణీకులందరు దిగిపోయి రైలులో తమతమ స్థానాలకు చేరుకొంటారు. కాని నేను, శేషాచలంగారు జిబ్రాల్టరు జలసంధి నధిగమించి, బే ఆఫ్ బిస్కే ద్వారా, లండనుపట్టణమునందలి టిల్ బరీ డాక్సు చేరుకొనటానికి టిక్కెట్లు కొనియున్నాము. మా ఓడ గమ్యస్థానం టిల్ బరీ డాక్సు. అందువలన మేము మార్ సైల్సు రేవులో దిగలేదు. పోర్టుసెడ్ లోవలె, ఇక్కడకూడా మా ఓడ కొన్నిగంటలు నిలచింది.

నేను, శేషాచలంగారు పట్టణం చూడటానికి బైలుదేరాము. ఆ పట్టణంలో నామనస్సుకు బాగా తట్టిన విషయాలు రెండు. పోర్టుసెడ్ పట్టణ బజారుల్లో, మాతోటి తెల్లప్రయాణీకులుగాక ఇతర

శ్వేతజాతివారు మాకు తగలలేదు. కాని మేము ప్రాతఃకాలమున మార్సైల్సు పట్టణములోనికి వెళ్లినప్పుడు, మాకు వీధులనిండా చక్కగా నలంకరించుకొని పిండిబొమ్మలవలె తమతమ పనులమీద తిరుగుచున్న శ్వేతస్త్రీలను చూచి మిక్కిలి వింతపడ్డాము. తీర్చిదిద్దినట్లున్న అలంకరణతో, ధవళకాంతులనీను ముఖములతో, ఎఱ్ఱని పెదవులతో, తెల్లని పింగాణిబొమ్మలవలె నుండిన ఆ స్త్రీలను చూచి చకితుడనైనాను. నాకు వీరు దేవతాస్త్రీలా, దేవలోకం ఇట్లే ఉంటుందా, దేవతాస్త్రీలు ఈవిధంగానే ఉంటారా అని తలంపువచ్చింది. రెండోవిషయం, కొన్నిరోడ్లు పెద్దపెద్ద బండ రాళ్ళతో అమర్చబడినవి. వానిమీద ఏనుగులవంటి గుఱ్ఱాలు పెద్ద నాటుబండ్లను లాగుచు, టకటక శబ్దములు కలుగజేయుచు పోవుచుండినవి. రంగులువేసిన బొమ్మలవంటి స్త్రీలు, భారీశరీరములతోవుండిన గుఱ్ఱాలు, ఈ రెండు దృశ్యాలు నన్ను మిక్కిలి ఆకర్షించినవి. తిరిగివచ్చి ప్రయాణము సాగించాము. జిబ్రాల్టర్ సంధిని దాటుచుండినప్పుడు, జిబ్రాల్టర్లో పెంచబడిన ప్రసిద్ధికెక్కిన శ్పానిష్ ద్రాక్షగుత్తులను ఒకటిరెంటిని కొన్నాను. ఈ శ్పానిష్ ద్రాక్షఫలములు మన హైదరాబాదులో పెంచే అనాబ్షాహి ద్రాక్షఫలములవలె రంగులోను, ఆకారములోను వుంటాయి. కాని ఆ పండ్లు ఒకవిధమైన సువాసనకలిగి ఎక్కువ తీపిగాను, రసాన్ని కలిగిఉంటాయి. తొక్క పలచన. నేను స్వదేశానికి తిరిగివచ్చి ఉద్యోగంలో ప్రవేశించిన క్రొత్తలో, విజయవాడలో మెకన్జీ కంపెనీ యజమాని, వాని నప్పుడప్పుడు తెప్పించి అమ్ముచుండిన సంగతి నాకు తెలిసింది. ఆకాలములో మద్రాసువంటి నగరాలకు దిగుమతిచేసుకొనేవారు.

జిబ్రాల్టర్ జలసంధిని దాటి, బే ఆఫ్ బిస్కే చేరాము. సాధారణముగా, బే ఆఫ్ బిస్కే అలజడి కలిగియుంటుంది. కాని, నాఅదృష్టవశాన, అప్పుడది అంతగా అల్లకల్లోలంగాలేదు. మేము సుఖంగా సెప్టెంబరు రెండవతారీఖు ఉదయం టిల్బరీ డాక్సు(ఓడల రేవు) చేరాము. 1919 సంవత్సరములో ఇండియా ప్రభుత్వము వారు ఐ. సి. యస్. ఉద్యోగానికి మద్రాసురాష్ట్రంనుండి

నియమించిన ఐదుగురులో, శ్రీ వెలగపూడి రామకృష్ణగారొకరు. వారప్పుడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో తర్ఫీదు పొందుచుండినారు. వారికిని, శేషాచలంగారికిని సుపరిచితం. అందువలన శేషాచలంగారు, పోర్ట్ సెడ్‌నుండో, మార్సెల్స్ నుండో తనరాకను తెల్పుచు, రామకృష్ణగారికి కేబుల్‌ను పంపించారు. అందువలన మేము టిల్‌బరి డాక్సులో ఓడను దిగినప్పుడు, రామకృష్ణగారికొరకు నిరీక్షించాము. కాని వారి జాడ కనబడలేదు. ప్రయాణీకులను లండన్ నగరమునకు తీసుకొనిపోయే రైలు సిద్ధముగాఉండినందున మేము రైలెక్కి-లండన్ మహానగరం చేరి, వెస్టరన్ కౌంటీలో వున్న, లింకల్‌న్సు అనుపేరుగల హోటలులో చేరాము. నేను అంతంతమాత్రం చదువుకొని, సామాన్య గ్రామీణయువకునివలె జీవితముగడిపియున్నానుగాని, శేషాచలంగారు మద్రాసుపట్టణవాసియై బి. ఎ. ఆనర్స్ పట్టాపొందిన విద్యార్థికుడై ఉండినందువల్ల క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొ-నేశక్తి కలిగినవారై ఉండిరి. మేము రైలుదిగి, టాక్సిని తీసుకొని, రామకృష్ణగారు అదివరకు నిర్దేశించి వుండిన, లింకల్‌న్సు హోటలుకు తీసుకొని వెళ్లుమని చెప్పగా, తొణుకు బెణుకు లేక, అతడు సరాసరి ఆ హోటలుకు తీసుకొని వెళ్లాడు. హోటలు మానేజరు రామకృష్ణగారు కొన్నిగంటలకుముందే వచ్చివెళ్లినారని చెప్పి, మాకు గదుల నిచ్చాడు. కొన్నిగంటల తర్వాత, రామకృష్ణగారు వచ్చి తాను టిల్‌బరి డాక్సుకు చేరుకొనునప్పటికి ప్రయాణీకులతో రైలు వెళ్ళిపోయిందని తెలిసిందని చెప్పారు. భోజనానంతరం మాయిద్దరిని కెఫ్‌లర్స్ వీధిలో నుండిన షేక్‌స్పియర్ హట్‌కు తీసుకొనివెళ్ళారు. 1914–1918 మధ్యలో జరిగిన మొదటి ప్రపంచయుద్ధంలో పాల్గొనటానికి ఇంగ్లండుకు వచ్చిఉండిన ఇండియన్ సిపాయిలకొరకు అప్పటికప్పుడు బ్రిటిషు ప్రభుత్వంవారు తాత్కాలిక షెడ్డులను నిర్మించారు. యుద్ధానంతరం సైనికులు వెళ్ళిపోగా, ఆకట్టడాలను వై. యమ్. సి. ఎ. ఇండియన్ బ్రాంచి హెడ్‌క్వార్టర్సుగా ఇచ్చియుండినారు. అందులో ఇంగ్లండుకు విద్యాభ్యాసంకొరకు వెళ్ళిన

ఇండియన్ యువకులకు ఉపహార, భోజనాలతో వసతి కల్పించ బడింది. అతిథులుగా అప్పుడప్పుడు ఒకరిద్దరు శ్వేతజాతీయులు వచ్చుచుండిరిగాని, ముఖ్యంగా అది ఇండియన్ యువకులకొరకే నిర్దేశింపబడింది. దాని పరిపాలన భారతీయుని వశమునందే యుంచబడింది. ఈ అసోసియేషన్ సంబంధముగల ఒకరో యిద్దరో స్వేతముఖులు, సహాయకారులుగా వుండిరి. ఆరాత్రి, మన దేశీయుడు, ఇండియా ఉపశక్రటరీగా లండన్‌లో నివసించు చుండిన సింహా ప్రభువు, ముఖ్యఉపన్యాసకుడుగా సభజరిగింది. ఆ సభకు శ్రీ రామకృష్ణ, మమ్ములను వెంటబెట్టుకొని షేక్స్పియర్ హాట్‌కు వెళ్లారు. ఆరోజులలో బ్రిటిష్ ప్రభుత్వంలో ఒక ఇండియన్ అండర్ శక్రటరిగా నియమింపబడటం, మహాగౌరవ ప్రదమైంది. మరిన్ని, ఏ భారతీయుడు అంతకుముందు బ్రిటిష్ ప్రభువుల శాసనసభలో చేర్చుకొనబడలేదు. ఆమహాగౌరవము ఒక్క సింహాప్రభువుకే దక్కింది. ఆరాత్రి వారి ప్రసంగము మిక్కిలి ఉక్తియుక్తంగా, చక్కనిధోరణిలో సాగింది. వారి ఉపన్యాసం ముగిసినకొద్దిసేపటికి మేము బైటకువచ్చివేశాము. శేషాచలంగారు చర్మపరిశ్రమలో అధ్యయనం జరుపుకొనటానికి లీడ్స్‌నగరానికి ఆరాత్రే బయలుదేరి వెళ్లిపోయారు. రామకృష్ణ గారు నన్ను తనవెంట 60 మైళ్లదూరంలోవున్న ఆక్స్‌ఫర్డ్ నగరము నకు తీసుకొనివెళ్లారు. రైలుప్రయాణం ఒకగంటమాత్రమే. ఆక్సుఫర్డునగరం చేరుకొనేటప్పటికి, రాత్రి పండ్రెండు గంటలు దాటింది. రామకృష్ణగారివలెనే, 1919 లో ఐ. సి. యస్. కు ఇండియాప్రభుత్వంచే నియమించబడ్డ షహబుడ్డీన్‌గారు, అప్పుడు రో అనేవారింటిలో నివసించుచుండేవారు. నాకాయింటిలో ఆ రాత్రి వసతియివ్వబడింది. నేనక్కడ రెండుమూడురోజు లుండి నాను. తరువాత ఆక్స్‌ఫర్డ్‌నగర శివారు బాన్లైకు నన్ను శ్రీరామ కృష్ణ తీసుకొనివెళ్లి, మిస్ హెమింగ్స్ అనుపేరుగలామె ఇంట్లో నాకు బసకుదిర్చారు. ఆయింటిపేరు "ఎల్‌మ్సులాడ్జి". అంతకు పూర్వమే రామకృష్ణగారును, శ్రీ టి. బాస్కరరావుగారును (ఇం కొక ఐ. సి. యస్. ప్రొబేషనర్) నేను బసచేసినఇంటి కెదురుగా

రోడ్డుకవతలప్రక్క నున్న మిసెస్ హాస్‌గారి యింట్లో బస ఏర్పరచుకొని యుండినారు. ఆయింటిపేరు "ఎల్మ్‌స్ఫారం."

మిస్ హెమింగ్స్‌కు అప్పటికి 40 ఏండ్లకు పైబడిన వయస్సు. ఏకారణముచేతనో పెళ్లిచేసుకోలేదు. పొడవుగా, మధ్యరకము లావుతో, సామాన్య రూపంతో, కొంచెం గూనితో వుండేది. కీచుగొంతుక. పోస్టాఫీసుకూడా ఆయింటి ముందుభాగములో నడిపేది. తినేబిళ్ళలు మొదలైనవి అమ్ముచుండేది. ఆమె అమర్చిన భోజనశయనాదులు అనుకూలముగానే వుండేవి. ఎదురుగా వున్న "ఎల్మ్‌స్ఫారం" లోని మిసెస్ హాస్ బక్కపలచని, కొద్దిపాటి మనిషి. పల్చని ముఖము, పొడుగైన ముక్కు, కంఠధ్వని బాగానేఉండేది. మాటమంచితనం, నడవడికలో కొంత ఆప్యాయత కనపరుస్తూ తనఇంటిలో నివసించుచుండిన రామకృష్ణ, భాస్కరరావుగార్లకు భోజనాదులను బాగుగా అమర్చి జాగ్రత్తగా చూచేది. వాళ్ళది కృషీవలుని సంసారం. మిస్టర్ హాస్ మిక్కిలి లావుగా, ఎత్తుగా ఉండేవాడు. వాళ్ళ కొక కుమారుడు, కుమార్తె. కుమారుడు ముఖపోలికలు అచ్చం తల్లివే. కుమార్తె సామాన్య ఎత్తు, లావులతో తండ్రిముఖమువంటి గుండ్రనిముఖముతో, అందముగా ఉండేది. మిస్టర్ హాస్ భూమిని సేద్యముచేసి, గోధుమ, బంగాళాదుంపలు మొదలైనవానిని పండించటమేగాక, ఆవులను, పందులను పెంచేవాడు. పాలను క్రీముగాను, వెన్నగాను తయారుచేసేవాడు. ఆసంసారం సుఖముగా జీవించుటకు అవకాశము కలిగినప్పటికి, అదనపు ఆదాయంకొరకు ఈఇద్దఱు ఇండియన్ యువకులకు వసతిచ్చారు. మిస్ హెమింగ్స్ ఇంచుమించుగా బీదస్థితిలోనిది. బోర్డర్స్‌ను తీసుకొనకపోతే ఆమె జీవనం గడపటం కష్టం. మిస్ హెమింగ్స్ ఒంటరిగానే ఉండేది. కొంతకాలానికి ఆమెచెల్లె లొకటిరెండేళ్ల కుమారుని తీసుకొని వచ్చి చేరింది. యుద్ధసమయంలో, తన నెవరో వివాహము చేసుకొన్నట్లు, అతనివలన ఈ పుత్రుడు కలిగినట్లు చెప్పింది. ఎంతవరకు నిజమో. నేను తరువాత విన్నది, మిస్టర్ హాస్ కుమారునితో దగ్గరసంబంధము పెట్టుకున్నదని. మేము



శ్రీ వెలగపూడి రామకృష్ణగారు

( 1921 )



గ్రంథకర్త – ఆక్సుఫర్డు, బాట్లీలో – 1921

అక్కడున్నంతకాలం, వాళ్లకు వివాహం జరిగే ప్రస్తావన రాలేదు.

రామకృష్ణగారు బారుగా, తెల్లగోధుమరంగుతో, చక్కని నున్నెదురుతో కాంతులీనే నేత్రములతో, సుస్పష్టమైన కంఠ ధ్వనితో, మిక్కిలి చలాకిగా ఉండేవారు. శ్రీ భాస్కరరావు మధ్యరకం ఎత్తుతో, ఒక్కపిసరు ఎక్కువలావుగా ఉండేవారు. వారుచామనచాయగలవారు. కాని, ఉంగరాలు తిరిగిన దట్టమైన క్రాపింగుజుట్టుతో, చురుకైనకళ్లతో, ఇంచుమించు గుండ్రని సోయగంకల ముఖముతో, జిలుగుకలిగిన కంఠస్వరముతో, అందంగానే ఉండేవారు. రామకృష్ణగారి అందము, వారు నిటారుగా నడిచే తీరు, ఖంగునమాట్లాడేవిధం, చూచినవెంటనే ఆకర్షింపగలశక్తిగలవి. కొంతపరిచయము కల్గితేకాని భాస్కర రావుగారి ఆకర్షణీయవ్యక్తిత్వం బైటపడేదికాదు. రామకృష్ణ గారు నిరంతర అధ్యయనంతో, ఆలోచనలో మునిగియుండే వారు. మేధాసంపన్నులు. భాస్కరరావుగారుకూడా తెలివి తేటలుగలవారేకాని విలాసపురుషుడు. రామకృష్ణగారు చిన్న తనమునందే ఎడింబరో విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించి ఇరవైసంవత్సరములు నిండకమునుపే, రెండు ఉన్నతడిగ్రీలను పొంద గలిగారు. భాస్కరరావుగారు మద్రాసు విశ్వవిద్యాలయ కళాశాలలో బి. ఎ. డిగ్రీని పొంది, మద్రాసుప్రభుత్వం రెవెన్యూ డిపార్టుమెంటులో సరాసరి డిప్యూటి తహసిల్ దారుగా నియమింప బడినవారు. రామకృష్ణగారు సామాన్య రైతుకుటుంబంలో జన్మించినవారు. భాస్కరరావుగారికుటుంబం ఉన్నతఉద్యోగాలతో ప్రకాశమానమైనది. వారితండ్రి కృష్ణస్వామినాయుడుగారు ఆకాలములో జిల్లాజడ్జి పదవిని చేరుకొనగలిగిన కొద్దిమంది భారతీయులలో ఒకరు.

1920 అక్టోబరులో, శ్రీ యన్. జి. రంగా, శ్రీ కల్లూరి చంద్రమౌళి, శ్రీ వెల్లంకి అక్కయ్యచౌదరి, శ్రీ నాదెళ్ల వెంకటదాసు, శ్రీ పర్వతనేని శివలింగయ్యచౌదరి, శ్రీ పర్వతనేని శివయ్య, శ్రీ కొసరాజు నరహరి కట్టగట్టుకొని ఆక్స్ఫర్డ్ నకు వచ్చి

శ్రీరామకృష్ణను దర్శించారు. శ్రీరామకృష్ణగారు, ఒక్క రంగా గారినిమాత్రం ఆక్స్‌ఫర్డ్‌లో నిలిపి, తతిమ్మావారికి తగినసలహా లిచ్చి గ్లాస్గో, లీడ్సు, యాబర్డీన్, సెయింటు ఆండ్రూస్ విశ్వ విద్యాలయాలకు పంపివేశారు. రంగాగారిని నేనుండిన 'ఎల్‌మ్స్ లాడ్జి' లో చేర్పించారు. రంగాగారు వచ్చిన కొలదిరోజులకే, మాయిద్దరిని ఎడింబరో యూనివర్శిటీకి రామకృష్ణగారు పంపారు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో అధ్యయనసంవత్సరారంభం అక్టోబరు రెండవవారం. మేమిద్దరం, బి. ఎ. డిగ్రీ పొందియుండక పోవటంచేత, రెస్‌పాన్‌షన్స్ అనే ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులవ వలసివుండెను. ఈప్రవేశపరీక్ష ప్యాసైనకాని, మమ్ములను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయములో చేర్చుకొనరు. కాని, ఎడింబరో యూనివర్సిటీలో, ఇండియాలో స్కూల్‌ఫైనల్ లేక మెట్రిక్యులేషన్ ప్యాసైనవారికి, ప్రవేశం దొరుకుచుండేది. నేను ఇంటర్మీడియేట్ పరీక్షకు కూర్చొనియుంటినిగదా, రంగాగారు స్కూల్‌ఫైనల్ పరీక్ష ప్యాసై ఉండిరి. అందువలన, మేమిద్దరం ఎడింబరో యూనివర్శిటీలో విద్యార్థులుగా చేరుటకు అర్హతకలిగియుంటిమి. రామకృష్ణగారు ఎడింబరో విశ్వవిద్యాలయంలో చదివియుండిరని పైనచెప్పాను. అందువలనకూడ, వారు మమ్ములను ప్రోత్సహించి, అక్కడికి పంపారు. అక్కడప్పుడు మాకులస్తుడు, రామకృష్ణగారికి తెలిసిన వాడు, నా ప్రాతస్నేహితుడు, కొత్త వెంకయ్యచౌదరిగారు ఇంజనీరింగువిద్య నభ్యసించుచుండినారు. వారు ఎడింబరో శివారు పోర్టొబెల్లోలో నివసించుచుండినారు. ముందుగా నవంబరు మొదటి వారంలో నేనక్కడకు వెళ్లాను. తర్వాత కొన్నిరోజులకు శ్రీ రంగా అక్కడికి వచ్చారు. నేను వెళ్లినప్పటి కక్కడ శ్రీ కల్లూరి చంద్రమౌళి, శ్రీ శివయ్య, శ్రీ నాదెళ్ళ వెంకటదాసు ఉండినారు. శివలింగయ్యచౌదరి లేడుగాని శ్రీ నరహరి ఉండినా డనుకొందును. వారందరక్కడకు క్రిస్‌మస్ సెలవులకు వచ్చి యుండినారు. వెంకయ్యచౌదరిగారున్న గృహములో మాకు వసతి ఏర్పరచబడింది ఆయింటియజమానురాలు మిసెస్ మెక్డొనాల్డ్, ఆమెభర్త పాదరక్షలుకుట్టి అమ్ముకొనేవాడు. తెలుగువాడును,



గ్రంథకర్త, వై. జి. కె. రావు, కె. వి. చౌదరి
పోర్టొబెల్లొ, ఎడింబరొ — 1920

బెజవాడ వాస్తవ్యుడును యర్రంశెట్టి గోపాలకృష్ణారావు ( వై. జి. కె. రావు ) పోర్టొబెల్లోలో ఇంకో ఇంట్లో ఉండేవారు. వారితో స్నేహంకలిసింది. ఇక్కడ ఒక చిన్నవిషయం చెప్పాలి. రంగాగారు ఆక్స్‌ఫర్డ్ వచ్చినప్పుడు శుద్ధ పల్లెటూరి వెంగళాయిగా ఉండేవారు. వారి వేషం, మాట్లాడే తీరు, ఆయన ప్రవర్తన నాకెందుకో నచ్చలేదు. అందువల్ల శ్రీ రంగానుకూడా ఎడింబరోకు పంపిస్తున్నానని రామకృష్ణగారు వ్రాసినప్పుడు, పంపించవద్దని నేను టెలిగ్రాం పంపాను. కాని రంగాగారు రానే వచ్చారు, మా విడిదిలో దిగనూ దిగారు.

మే మిద్దరం విశ్వవిద్యాలయంలో చేరాము. మేము ప్రొఫెసర్ గ్రెగరీగారి ఇంగ్లీషుబోధనకు, సర్ స్టూవర్ట్ లాజి చరిత్రబోధనకు హాజరయ్యేవారము. మరిన్ని నేను ఇంటర్మీడియెట్‌లో లాంగ్వేజెస్ గ్రూపు తీసుకొని సంస్కృతంకూడా అభ్యసించియున్నాను కాబట్టి, సర్ బెర్రిడేల్ కీత్ అనే గొప్ప వేద, సంస్కృత పండితుని సంస్కృత తరగతులకు వెళ్లుచుండేవాడను. నేను భారతీయుడనైనా, సంస్కృతాన్ని బందరులో చదివినా, నాకంటె ఎన్నోరెట్లు సంస్కృతాన్ని శ్రద్ధాభక్తులతో చదివే స్కాట్ జాతీయులను చూచి ఆశ్చర్యపడ్డాను. వారందరు యువకులుకారు. ఒకరిద్దరు వయస్సుముదిరినవా రుండినారు. మిషనరి పట్టుదలతో బాగా అబ్బాలని చదివేవారు. మేము అక్కడ రెండుమాసాలవరకు ఉండి ఆక్స్‌ఫర్డ్ బాళ్లెకు తిరిగివెళ్లాము.

మేము పోర్టొబెల్లోలో వుండినప్పుడు జరిగిన రెండు మూడు అనుభవాలు నాకు బాగుగా గుర్తున్నవి. వై. జి. కె. రావుగారు తెలుగువంట చేయటంలో కొంత అనుభవం కల్గియుండినారు. ఎడింబరోలో బియ్యం, కందిపప్పు, మిరప మొదలైనవి దొరికేవి. ఒకనాడు మేము బియ్యం, కందిపప్పు, చిన్న సన్నమిరప, కోడిపెట్ట వగైరా సమకూర్చుకొన్నాం. పప్పుపులుసు, కోడిమాంసం, వరిఅన్నం శ్రీ రావు, శ్రీ వెంకయ్యచౌదరి సాయంతో, తయారు చేశారు. మేము రొట్టలువేసుకొంటూ ఆర్చుకార్చుకొని

మిక్కిలి తృప్తిగా తిన్నాం. ఎన్నాళ్ళనుండో వరిఅన్నం తిని యుండకపోవుటవల్ల మిక్కిలి ఆసక్తితో, ఉబలాటంతో తిన్నాం. పప్పుపులుసులో వేసిన చిన్నిమిరపకాయలు పంటికి, నాలుకకు తగిలి వ్రవ్రగా మిక్కిలి సంతృప్తినిచ్చినట్లు బాగుగాగుర్తు. ఇప్పటికిని, పొడుగాటి పూసలవంటి ఆ మిరపకాయలు జ్ఞాపకానికి వస్తూవున్నవి.

పోర్టొబెల్లోకు సంబంధించి అందరు ఉపయోగించే స్నానగదులు (పబ్లిక్ బాత్స) ఉండేవి. శ్రీ రావు, శ్రీ చౌదరి ఇంచుమించుగా నిత్యం అక్కడకువెళ్లి స్నానంచేసేవారు. వేడినీళ్ళని వేరే చెప్పనక్కరలేదు. స్వల్పమైన రుసుం పుచ్చుకొనేవారు. నేనుకూడా వెళ్ళి అప్పుడప్పుడు స్నానంచేసేవాడను. మేము నలుగురైదుగురం ఉన్నాంకాబట్టి, మా వసతిగృహం ఆమెకు (లాన్డ్ లేడి) మా స్నానానికి వేడినీళ్లిచ్చే అవకాశం కల్గియుండింది కాదు. కాబట్టి ఈ పబ్లిక్ బాత్స మిక్కిలి అనుకూలంగా వుండినవి.

మేము ముగ్గురు నల్గురం కలసి హాలువంటి ఒక పెద్దగదిలో నిద్రించేవాళ్లం. అప్పుడప్పుడు శ్రీ రావువచ్చి మా పడకగదిలో కొంతకాలం వుండి వెళ్లుచుండేవాడు. శ్రీ వెంకయ్యచౌదరిగది అది. మేమందరం పడుచువాళ్లమేకాని మేము ఇండియానుండి రావటం క్రొత్త. పోర్టొబెల్లో సరిక్రొత్త. రావు, చౌదరుల కది కొట్టినపిండి. ఎవరో పిల్ల వచ్చి కొంత కాలక్షేపం జరిగితే ఆశ్చర్యమేముంది? దీపాలుతీసివేస్తే అంతాచీకటే. చీకటిలో ఎన్ని రహస్యాలు జరుగవు? క్రొత్తవాళ్లం. ఊహాద్రేకులవటం, నోళ్లు చప్పరించుకోవటం—అంతే. కాకపోయినా మంచి వయస్సు వచ్చిన యువకులు, అదివరకే స్త్రీసాంగత్యం ఉండి పిల్లలకు తండ్రులైనవారు యువతుల కౌగిలిని వాంఛించరా? మానవ స్వభావాన్ని అరికట్టగలమా? మాలోకూడా పిల్లల తండ్రులుండినాము.

పోర్టొబెల్లో కూలినాలిచేసుకొనే శ్రామికులు నివసించే బీదప్రదేశం. అక్కడ మంచి భవంతులుకాని, దుకాణాలుకాని లేవు. 6, 7 మైళ్ళలో వుండిన ఎడింబరోకు రైలుమీద

వెళ్ళుచుండేవారము. ఎడింబరో స్కాట్లండుకు ముఖ్యపట్టణం. ఎత్తైనప్రదేశంలో ఉండి చాలా అందంగా వుంటుంది. దాని రాజబాట ప్రిన్సెస్ స్ట్రీటు అనిపేరు గలది. ఈ వీధి సుందరమైంది. గొప్ప భవంతులతో, చక్కగా అలంకరించబడ్డ పెద్ద అంగళ్లతో, శృంగార, అలంకార వస్తుసముదాయముతో నిండిన దుకాణాలతో, మధ్యమధ్య పూలవృక్షాలతో విరాజిల్లుచుంటుంది. ఈ ప్రిన్సెస్ స్ట్రీటు కొండచరియను కట్టినట్లుండి, ఒకప్రక్క భవంతులు. రెండోప్రక్క దానికి మూడు, నాలు గడుగుల దిగువ భాగాన్న ఇంకొక్కవీధి ఉన్నది. దానిక్రింద మరొకటి. అంచెలవారిగా ఏర్పరచినట్లున్న వీథులు మంచి అందాన్ని ఎడింబరో నగరానికి వన్నె తెచ్చాయి. వసంతఋతువులో ఈప్రదేశమంతా మిక్కిలి మనోహరంగా ఉంటుంది.

ఎడింబరో విశ్వవిద్యాలయంలో నాకు చదువు అబ్బిందని చెప్పలేను. అప్పటికి ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చేరుట కవకాశం లేక పాశ్చాత్యవిద్యావాతావరణాన్ని అలవరచుకోవటం కోసం ఉద్దేశింపబడిన ఇక్కడి ఉనికిని సరదాగా కాలక్షేపంచేశాను.

ఇంగ్లీషు ప్రొఫెసర్ గ్రెగరిగారు మామూలు ప్రొఫెసర్ గానే కనబడేవారు. కాని వారిబోధన వారిప్రఖ్యాతికి తగినట్టుగా గొప్పగా ఉండేది. చరిత్ర అధ్యాపకులు సర్ రిఛర్డు లాడ్జిగారు ఎత్తుగా, పెద్దమీసాలతో కొట్టవచ్చినట్లుండేవారు. గట్టిగా పాఠం చెప్పేవారు. అప్పటికే వయస్సుమళ్లిన వారి మీసాలు తెల్లబడ్డవి. పొడుగు ఎక్కువైనా, సన్నంగా ఉండేవారుకాదు. వారు చరిత్రలో మిక్కిలి గట్టివారని వాడుక. 'సర్' బిరుదే వారివిశిష్టతను సూచిస్తుంది. వీరి అన్నగారు సర్ ఆలివర్ లాడ్జిగారు గొప్ప శాస్త్రజ్ఞుడు. పేరుప్రఖ్యాతులు గడించినవారు. వీరి ప్రవర్ధమాన కుమారుడు, రేమండ్ అనే 25 ఏండ్ల యువకుడు మొదటి ప్రపంచయుద్ధంలో చనిపోయాడు. అతని ఆత్మ ( సూక్ష్మరూపం ) తొందరపెట్టగా, స్పిరిచ్యుఅలిస్టుగా రూపొంది ( పరలోకమందు మృతుల ఆత్మలుండునని నమ్మువాడు ) రేమండును గురించి, అతని ఆత్మతో సంబంధాలను గురించి పుస్తకంవ్రాశాడు. స్పిరిచ్యుఅలిస్టు ల్లో ఈయనది పెద్దపేరు.

ఇక సంస్కృత మహాపండితుడు, అందులో వేదాల సంస్కృతంలో, కావ్య, శాస్త్రాల సంస్కృతంలో పరిశోధన చేసి గొప్ప పుస్తకాలను, వేద సంస్కృత వ్యాకరణాన్ని వ్రాసిన దిట్ట, సర్ బెర్రిడేల్ కీత్ గారు వీరు మిక్కిలి గాంభీర్యంగా, పొడుగ్గా, లావుగా, శీవిగా ఉండేవారు. మితభాషి. అప్పుడప్పుడు నన్ను ప్రశ్నలడిగేవారు. నేను సరిగా సమాధానా లివ్వలేకపోయేవాణ్ణి. ఒకసందర్భంలో ఒకమాటకు నేను సరియైనదనుకొన్న అర్థం చెప్పగా దానినిగురించి ఆలోచిస్తున్నట్లున్నారేగాని, కాదనలేదు.

మేము బాల్లైకు తిరిగివచ్చిన కొద్దికాలానికి అనగా 1921 ఫిబ్రవరి మాసాంతానికి వాసిరెడ్డి శ్రీకృష్ణ అక్కడకు వచ్చాడు. అతని కుటుంబాన్ని రామకృష్ణగారు బాగా ఎరిగుండినారు. అందువల్ల శ్రీకృష్ణను ఆప్యాయతతో ఆహ్వానించి, రామకృష్ణగారాయననుకూడా మా "ఎల్మ్స లాడ్జి" లో చేర్పించారు. మేము ముగ్గురంకలసి అక్కడ కొంతకాలం ఉన్నాం. మేము ముగ్గురం రెస్‌పాన్‌షన్సు అనే ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులం కావలసియుండింది. నేను ఒక అంశంగా సంస్కృతాన్ని తీసుకొన్నాను. హితోపదేశం పాఠ్యవిషయం. దానిని ఆక్స్‌ఫర్డులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ లైబ్రేరియన్‌గా పనిచేస్తూఉండిన డాక్టర్ మోరిస్ అనేవారి వద్ద చదివాను. లెక్కలు మరొక అంశం. రంగాగారు లెక్కలలో ప్రవీణులు. వారి సాయమున లెక్కలను నేర్చుకొన్నాను. ఫ్రెంచి ఇంకొక పఠనాంశం. గడ్డంతో, తల, బట్ట మాసి మిక్కిలి మందంగల కళ్లజోడు పెట్టుకొనుచుండినవారివద్ద కొంతకాలం చదివాను. వారి పేరు గుర్తులేదు. ఇవిగాక ఆర్థిక రాజకీయాంశాలు, బైబుల్‌కు బదులు ప్లేటోనుండి కొన్నిభాగాలు చదవాలి. 1921 మధ్యలో ఫ్రెంచి భాషలో తప్ప తదితరాంశాలలో ఉత్తీర్ణుడనయ్యాను. ఫ్రెంచి భాష మిగిలిపోయింది. శ్రీకృష్ణ వెనుకముందుగా ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ఏదో పొరపాటువల్ల రంగాగారొక్క అంశములోమాత్రం పరీక్షకు కూర్చోటానికి వీలుకలుగలేదు. అందువల్ల వారు మామూలుపద్ధతిని డిగ్రీకోర్సు చదువుట

కవకాశము లేకపోయింది. ఆర్థికశాస్త్రం డిప్లొమా కోర్సు చదవటానికి సిద్ధమైనారు.

రామకృష్ణ, భాస్కరరావుగార్లు హాస్టలులో వున్నప్పుడు జరిగిన ఒకవిషయం బాగా జ్ఞప్తిలోవున్నది. క్రిస్‌మస్ పండుగకో, క్రొత్త సంవత్సరానికో మిసెస్ హౌస్‌గారి "ఎల్‌మ్సుఫారం" లో వేడుక జరిగింది. ఉపాహారాలు, పానీయా లిచ్చారు. స్త్రీ పురుషులు నృత్యం చేశారు. తనయింట్లో వుంటున్న రామకృష్ణ, భాస్కరరావుగార్లను మిసెస్ హౌస్ ఆ వేడుకలో పాల్గొనండని ఆహ్వానించింది. రసికుడైన భాస్కరరావుగారు మిక్కిలి ఉత్సాహంతో పాల్గొని పడుచుపిల్లలతో విచ్చలవిడిగా నృత్యముచేశారు. రామకృష్ణగారి కిటువంటివి గిట్టవు. వారు ఉపాహారాలు తీసుకొన్నారుగాని పానీయాలజోలికి పోలేదు. నృత్యంవిషయంలో ముఖంతప్పించారు. ఇంటిపిల్ల బలవంతపెట్టగా ఒకచుట్టో రెండు చుట్లో తిరిగి మటుమాయమయ్యారు. మా వసతికి ఎదురుగావున్న 'ఎల్‌మ్సుఫారంలో' బహు ఉత్సాహంతో జరుగుచున్న ఆ వేడుకకు పడుచువాళ్లమైన మే మెక్కడ వచ్చిపోతామో అని, వసతిలోనే వుండవలసినదని రామకృష్ణగారు నొక్కిచెప్పారు. కాని 10, 15 గజాలలో విద్యుద్దీపాలతోను, బ్యాండువాయిద్యముతోను, యువతీ యువకుల కిలకిలారవములతోను, చూపరుల హర్షధ్వానములతోను జోరుగా జరుగుచున్న ఆ వినోదాన్ని, ఆకోలాహలాన్ని చూడకుండా నావంటివాడు ఎట్లు ఇంట్లో బంధించబడివుండగలడు ? చల్లగా రోడ్డుదాటి అవతలప్రక్కకంచెకుచేరి ఆ యింటి ఆవరణలో జరుగుచుండిన వేడుకలను చూచీచూడనట్లైనా చూచాను. అయ్యో, నేనుకూడ ఆ యువతీయువకులతో కలసి నాలుగు చిందులు వేస్తే ఎంతో బాగుండేదని పరితపించాను.

రామకృష్ణగారికి షికారువెళ్లటం మిక్కిలి సరదా. ఆయన నడక అంగపంగలతో. మా ముగ్గురిలో రంగాగారు ఎత్తు తక్కువ వారు. శ్రీకృష్ణ కాలుబారు మనిషి. నేను వడిగా నడిచే స్వభావం కలవాడను. శ్రీకృష్ణ, నేను రామకృష్ణగారి అంగపంగలతో కొంతవరకు సమన్వయించుకొనేవారంకాని, రంగాగారు చిన్నగునుకుతో వెంటబడవలసివచ్చేది. హాస్టెలువారు కాబట్టి

అదొక గ్రామంవంటిది. చుట్టుప్రక్కల వ్యవసాయం. అందువల్ల ఇంగ్లీషు గ్రామాలలోవలె ఇళ్లు అక్కడక్కడ వుండేవి. ఆ కారణాన షికారుకు వెళ్లుట కనువైన త్రోవలు, పచ్చిక బయళ్ళు పుష్కలం. రామకృష్ణగారు అంతటితో సంతృప్తి పడేవారు కాదు. అప్పుడప్పుడు కొన్నిమైళ్ల దూరం వెళ్లేవారం. ఆక్స్‌ఫర్డ్‌కు 7 మైళ్లదూరంలో 'కమ్‌నర్ హిల్' అనే చిన్నగుట్ట వున్నది. గుట్ట చిన్నదైనా, దానిపైకి వెళ్లటం కొండ ఎక్కినట్లే, అనగా ఏటవాలుగా వుంటుంది. ఆ గుట్ట పై భాగం విశాలమైన సమస్థలం. అక్కడొకటో రెండో టీ వగైరాలు ఇచ్చే చిన్న దుకాణాలుండేవి. కాని మే మెప్పుడో ఒకప్పుడు తప్ప, నడచి పైకివెళ్లి సమతలంచుట్టూ తిరిగి వెంటనే తిరిగివచ్చేవారం. రాను పోను 14 మైళ్ళు. పైగా మెట్లెక్కినట్లు, దిగివచ్చినట్లు. అప్పటికి మాకు తేనీరువేళ అయ్యేది. వేడి వేడి తేనీరు త్రాగి దాహం తీర్చుకొనేవాళ్ళం. నే నొకటి గమనించాను. చెమటపట్టి దాహమువేసినప్పుడు వేడి తేనీరు పరమౌషధం.

మే మింగ్లండుకు వెళ్ళినది మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన కొద్దికాలానికే కదా. యుద్ధకాలం అవసరాలనుబట్టి ప్రజలు సామాన్యంగా తమ దుస్తుల విషయంలో జాగ్రత్తతీసుకోలేదు. ఏది పనికి అనుకూలమో, అయ్యో నలిగిపోతవే, మురికిపట్టునే అనే దిగులుకు సందివ్వని బట్టలను వేసుకొనేవారు. విశ్వవిద్యాలయ విద్యార్థులుకూడా కొంతమంది యుద్ధములో పాల్గొన్నవారే. ఈ కారణాలవల్ల మేము 1920 లో అక్కడకు వెళ్లినప్పుడు మా ఆక్స్‌ఫర్డు విద్యార్థులలో దుస్తులలోను, అలంకరణలోను యుద్ధానికి పూర్వం ఉన్నవిధానాలకు భేదంగా ఆచరణ వచ్చింది. వారి కోటు ముతక. వేటకువెళ్లేవారి కోటువలె వుండేది. లాగు బూడిదరంగు గుడ్డతో కుట్టబడి వదులుగా, సంచిలాగా క్రీజ్ (మధ్యముడత) లేకుండా వుండేది. క్లాసులకు హాజరైనప్పుడు తప్ప ''టై'' వుండేదికాదు. టెన్నిస్ కాలరే ప్రధానం. జుట్టుకు చమురుండేది కాదు. పిచ్చుకలు పీకినట్లుండే జుట్టే అందం. వర్షములోనైనా, మంచుపడుచున్నా టోపీ లేకుండా వడిగా నడవటమే మంచి పద్ధతి. ఈ ధోరణి ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి

లందరిలోను ప్రబలముగావుండేది. తరువాత తరువాత, ఈ మోటు తనం తగ్గిందికాని, మేము వెళ్లిన క్రొత్తలో అదే ఫాషన్ (ప్రజాదరణనొందిన రీతి). మేము కూడా ఆ పద్ధతులనే అవలంబించాము. ఫాషన్‌లో వుండవద్దా? ఇక్కడ ఒక విషయం, నా రూపంలోని మొదటి మార్పును గురించి చెప్పాలి. నే నింటినుండి బైలుదేరి నప్పుడు లావుగా, దొంద శరీరంతో బొజ్జ గలిగి, బుర్రమీసాలతో ఉండేవాడను. ఏడెన్ చేరేటప్పటికి సగమై నా లావు, దొంద, బొజ్జ తగ్గిపోయినవి. ఆక్స్‌ఫర్డ్ చేరునప్పటికి ఇంకా తగ్గాను. కాని బుర్రమీసాలెట్లు తగ్గుతవి? రామకృష్ణగారికి రొయ్యిమీసాలు నచ్చలేదు. చదువప్పుడే ప్రారంభించే యువకుని కా బొరుమీసాలేమిటని అనుకొనియుంటారు. రంగా, శ్రీకృష్ణగార్లకంటె నేను పెద్దవాడను. అప్పటికే ఇద్దరు పిల్లల తండ్రిని. పైగా ఎక్కువ చొరవ తీసుకొనేవాణ్ణి. అందువల్ల నే నొప్పుకోననో, కొంచెం మొగమాట పడో, జుట్టు కత్తిరింపుకని అప్పుడక్కడుండిన వారి మిత్రుడు శ్రీ చెలికాని వెంకట్రావుగారితో నన్ను మంగలిషాపుకు పంపారు. శ్రీ వెంకట్రావు షాపువానితో చెప్పారుకాబోలు తలవెండ్రుకలు కత్తిరింపుతో బాటు, నా రొయ్యిమీసాలను కూడా అంటకత్తిరించి వేశాడు. ఇదేమిటని అద్దంచూచుకొంటే 10 ఏళ్లు చిన్నవానిలాగా కన్పడ్డాను. ఈ మార్పుతో యువకవిద్యార్థిగా ఫాషన్‌లో చేరుట కర్తవ్యమైనది.

ఇండియానుండి 1919 లో ఐ. సి. యస్. ప్రొబేషనర్సుగా వెళ్లిన 40 మంది పైచిల్లర భారతీయులలో ప్రతి ఒక్కరు తరిఫీదును జయప్రదముగా పూర్తిచేసుకొన్నవారేగాని, రామకృష్ణగారు మద్రాసు ఐదుగురిలో ప్రథములుగాను, మొత్తం భారతీయులలో రెండవ స్థానమో, మూడవ స్థానమో పొందినవారుగాను, తమ తరిఫీదును పూర్తిచేశారు.

రామకృష్ణ, భాస్కరరావుగార్లనుగురించి పైన చెప్పాను. మిగిలిన ముగ్గురిలో షహాబుద్దీన్‌గారు తెలుగు ముస్లిం. వెల్లోడిగారు మళయాళీ, విజయరాఘవన్‌గారు తెల్లతీయా. షహాబుద్దీన్‌గారు

కృష్ణాజిల్లా ఏలూరు ప్రాంతంవారు (ఆ రోజులలో ఏలూరుప్రాంతం కూడా కృష్ణాజిల్లాలోనిది). బందరు నోబుల్ కాలేజిలో చదువుకొన్నారు. తెలుగువారైన బజ్‌లుల్లా సాహెబ్ గారి కుమార్తెను వివాహమాడారు. వారు తెలుగు బాగుగా మాట్లాడేవారు. పెద్ద మనిషి తరహా. నెమ్మదిగా, ప్రశాంతంగా వుండేవారు. లేత గోధుమరంగు ఛాయ. గుండ్రని ముఖం. మధ్యరకం ఎత్తు, లావు. స్నేహభావంతో ఉండేవారు. నాయందు కొంత అభిమానము చూపించేవారు. మొత్తంమీద సరసులు, యోగ్యులు. పాకిస్థాన్ ఆవిర్భవించినతర్వాత రెవిన్యూ బోర్డు మెంబరుగా ప్రభుత్వోద్యోగముచేసిన వారి మామ బజులుల్లాసాహెబ్ గారి ప్రోద్బలం చేతనో, లేక ఐ. సి. యస్. ఆఫీసరుగా వుండిన వారి భార్య సోదరుడు శ్రీ కలీముల్లా ప్రోత్సాహంవల్లనో, లేక తనకు తోచిందో వారు పశ్చిమ పాకిస్థాన్‌కు వెళ్లిపోయారు. హైకోర్టు జడ్జి అయ్యారని కొంతకాలానికి విన్నాను.

వెల్లోడిగారు చాలా నలుపు. కాని నొసలు, ముక్కు, చెక్కిళ్లు చెక్కినట్లుండేవి. సమమైన తెల్లని పళ్లవరుసలు, చురుకైన కళ్లు, వర్చస్సుగల గుండ్రని ముఖం. కొంచెము ఉంగరాలుతిరిగిన జుట్టు. ఈ పొందికలతో ప్రస్ఫుట వ్యక్తిత్వం కలవారుగా వుండేవారు. మనిషి ఎత్తూగాదు, కురచాగాదు. సరిపడ్డ లావు. వారు ఐ. సి. యస్. ఉద్యోగిగా రాణించి తర్వాత 1948 లో హైదరాబాదు పోలీసుచర్య జరిగినపిమ్మట కొంతకాలం హైదరాబాద్ రాష్ట్రానికి ముఖ్యపరిపాలకులుగా వుండినారు.

విజయరాఘవన్‌గారు తెల్లగా, శ్వేతజాతీయునివలె ఉండేవారు. వారు మద్రాసు హైకోర్టు జడ్జి పదవిని నిర్వహించిన జస్టిస్ కృష్ణగారి మేనల్లుడు. కాని ముఖ పోలికలు తూర్పుదేశాలకు చెందినవారి ముఖ పోలికలె. ఆయన మంచి హుషారు మనిషి. స్నేహశీలి. పొడుగ్గా, సరిపడిన లావుతో, మంచి చలాకిగా ఉండేవారు. నాతో చనువుగా వర్తిస్తూ 'వీరా' అని పిలిచేవారు. రామకృష్ణ, భాస్కరరావులకు నేను భద్రయ్యను, విజయరాఘవన్‌కు వీరను. వారిలో ఒకరైనా నన్ను చౌదరి అని పిలిచినట్లు గుర్తులేదు. అప్పటికింకను నా చౌదరత్వం స్థిరపడలేదు

కాబోలు. విజయరాఘవన్ గారు ఐ. సి. యస్. ఆఫీసరుగా వుంటూ పోలీసు ఇన్‌స్పెక్టరుజనరల్‌గా కూడా పనిచేశారు. వారింకను పిన్నవయస్సులోనే మృతిచెందటం విచారకారం. వారు జస్టిస్ కృష్ణగారి కుమార్తెను వివాహమాడారు. వారి చక్కని కుమార్తె హేమ భరతనాట్యంలో ప్రవీణురాలై పండిత నెహ్రూ గారి సమక్షాన నృత్యప్రదర్శనమిచ్చి, వారి మెప్పును పొందింది.

వీరుగాక అప్పటిలో నాకు పరిచయమైనవారు కుమారి కౌసల్యగారు. వారు క్రిస్టియనులని గుర్తు. తెల్ల తీయా వర్గానికి చెందినవారు కాదుగాని తెల్లగా వుండేవారు. చక్కని కోలముఖంతో, అందమైన కళ్ళతో, సరిపడ్డ ఒడ్డు పొడుగులతో మిక్కిలి ఆకర్షణీయంగా ఉండేవారు. వారు ఇండియాలో బి. ఎ. యో, ఎమ్. ఎ. యో చదివి, పెద్దచదువుకు ఆక్స్‌ఫర్డ్ వచ్చారు. తర్వాతకాలంలో వారు మద్రాసు స్త్రీలకళాశాల మేరీస్ కాలేజికి ప్రిన్సిపాల్‌గా పనిచేశారని వింటిని. ఆమె అవివాహిత. విజయరాఘవన్ గారు కూడా అప్పటికి అవివాహితుడే. అందువల్ల వీ రిద్దరు పెళ్లిచేసుకొంటే బాగుండేదని నాకు అనిపించేది.

1920-'21 లో గవర్నమెంటువారిచేత నామినేట్ చేయబడిన ఐ. సి. యస్. ప్రొబేషనర్సేగాక, పోటీపరీక్షలో నెగ్గిన దిగ్దంతుల వంటివారు కొందరుండేవారు. కె. పి. యస్. మీనన్, ఎ. యస్. పి. అయ్యర్ వంటివారు. సుభాస్ చంద్ర బోసుగారుకూడా ఆ రోజులలో అక్కడున్నట్లు, వా రెందుకో ఒక చీటి వ్రాసి రామకృష్ణగారికి పంపినట్లు గుర్తు. అయితే బోస్‌గారు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చదివారని ఈమధ్య శ్రీ బి. శివరావుగారు వ్రాసిన పుస్తకంవలన తెలుస్తున్నది. అప్పటి కింకను యస్. వెంకటేశ్వరన్ గారు, పుల్లారెడ్డిగారు, సుందరంగారు, రంగస్వామి అయ్యంగారు రాలేదు.

1919 లో వచ్చిన మొత్తం 41 లేక 42 ఐ. సి. యస్. ప్రొబేషనర్సు తమ తరిఫీదును ముగించుకొని 1921 డిశెంబరుకు స్వదేశానికి తిరిగివెళ్లే సమయం దగ్గరకువచ్చింది. మద్రాసు

రాష్ట్రాన్నుండి వచ్చిన రామకృష్ణగారు, భాస్కరరావుగారు, మహబుబ్డీన్ గారు గాక తతిమ్మా ఇద్దరుకూడ ఆక్స్ ఫర్డ్ కే తరిఫీదుకు వచ్చారు. రామకృష్ణగారు స్వదేశానికి తిరిగివెళ్లుటకు సిద్ధమై నన్ను, రంగాగారిని, శ్రీకృష్ణగారిని వెంటబెట్టుకొని 1921 డిశెంబరు 14-వ తేదీన బెర్లిన్ నగరానికి బైలుదేరారు. మేము మధ్యాహ్నం రెండు గంటలకు విక్టోరియా స్టేషను నుండి బయలుదేరి 15-12-1921 రాత్రి 7 గంటలకు బెర్లిన్ నగరం చేరుకొన్నాము. దిగిన హోటల్ పేరు జ్ఞాపకంలేదు. మరునా డుదయం రామకృష్ణగారు ముందుగా వ్రాసిఉండిన యఫ్. కె. గెవీహ్గారు వచ్చి మమ్మొలను కలసికొన్నారు. ఆయనతో కలసి మేము నలుగురం పెద్ద రాజవీథి అన్టర్ డన్ లిన్ డన్ మొదలైన వీథులను, పెద్దపెద్ద షాపులను, స్టోర్సులను చూచాము. "ప్రిన్సెస్" రాజమందిరానికి వెళ్లి, అక్క డుంచబడిన పెద్ద చిత్రపటాలను, కంచు, ఇత్తడి, చంద్రకాంత శిలావిగ్రహాలను చూచి ఆశ్చర్యపోయాం. విక్టోరియా చక్రవర్తిని, జర్మన్ చక్రవర్తి కైజర్ కు బహూకరించిన పెద్ద ఇండియన్ ఫిరంగిని చూచి వింతపడ్డాం. ఇంకొక రాజప్రాసాదాన్ని పోట్స్ డమ్ను చూచాం. ఒక చాలా విస్తృతమైన స్టోర్సు నొకదానికి వెళ్లినట్లు ఇప్పటికిని గుర్తు. అన్టర్ డన్ లిన్ డన్ లో రెండు ప్రక్కలా చక్కగా కత్తిరించినట్లున్న చిన్న ఎత్తుగుబురు చెట్లుండినవి. వానివలన ఆ రాజవీథికి ఎనలేని అందం వచ్చింది. రామకృష్ణగారు 21-వ తారీఖున (21-12-1921) బెర్లిన్ నగరాన్ని విడిచిపెట్టి, మార్సైల్సులో 23-వ తారీఖున ఇండియాకు తిరిగి వెళ్లుటకు పి అన్డ్ ఒ స్టీమరు కైజర్-ఇ-హిన్డ్ను ఎక్కారు.

మిగిలిన మేము ముగ్గురము రామకృష్ణగారు వెళ్ళిన తర్వాతకూడ కొన్నిరోజులు బెర్లిన్ లో గడిపాము. గెవీహ్ గారు మాకు తోడు. వారక్కడక్కడకు మమ్మొలను త్రిప్పారు. రంగా, శ్రీకృష్ణ గార్ల విషయం గుర్తులేదుకాని, నేనక్కడ 7-1-1922 వరకుండి, ఆ రోజు సాయంత్రం 5 గంటలకు పారిస్ నగరానికి బైలుదేరాను.

బెర్లిన్ నగరంలో చూచిన కొన్ని విశేషాలు ఇప్పటికిని బాగుగా జ్ఞప్తియందున్నవి. అన్టర్ డన్ లిన్ డన్ ఒక మల్టిపుల్ స్టోర్సు. ప్రిన్సెస్ పాలెస్ పోట్సడంలోని జర్మని చక్రవర్తికి అభిమాన నివాసంగా ఉండిన మహా ప్రాసాదం. వీల్ అనే లేగ దూడల మాంసం, మూన్ కల్ బియర్ అనే జర్మన్ బియర్ (బీర్) పానీయం. పోట్సడం, బెర్లిన్ నగరానికి పది పంద్రెండు మైళ్ళదూరంలో నున్నది. అక్కడి పోట్సడమ్ రాజప్రాసాదంలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన షెల్ రూమున్నది. ఈ షెల్ రూమ్ వివిధ చిత్ర విచిత్ర సముద్రపు ఆలిచిప్పలతో, గుల్లలతో, శంఖాలతో పొదుగబడి యుండింది. ఇతర గదులు, హాలులు పేరొందిన చిత్రకళాఖండాలతోను, మిక్కిలి విలువైన పర్షియన్ వస్త్రా రత్నకంబళులతోను అలంకరింపబడి వుండినవి.

మేము మామూలుగా భోజనంచేసే రెస్టారాంటులో మాకు లభించిన వీల్ అనే దూడమాంసం మిక్కిలి మెత్తగా రుచికరముగా బంగారు ఛాయతో ఉండేది. దానితోబాటు ఇచ్చిన వేయించిన బంగాళాదుంపముక్కలు, ఆ మాంసమునకు మిక్కిలి అనువుగా నుండేవి. నేను ఇంచుమించుగా ప్రతి మధ్యాహ్నభోజనంలో దీనిని తినేవాడను. ఇట్టి వీల్ మాంసాన్ని తిరిగి నే నెక్కడా తిన్నట్లులేదు. ప్రసిద్ధ జర్మన్ బియర్ కాఫీరంగుగా ఉండేది. మత్తుకలిగించ లేదు. పైగా వీల్ మాంసానికీ పానీయం మంచి లంకెగా తోచింది.

బెర్లిన్ నగరం పరిశుభ్రమైనదిగా తోచింది. అందమైనదిగా తట్టింది. కాని మనుష్యులు మోటనిపించారు. చాలామంది మగవాళ్ళు తల నున్నగా గొరిగించుకొన్నారు. మా స్నేహితుడు గెవీహ్ కూడా నున్నగా గొరిగించుకొన్నవాడే. మధ్య వయస్సు వాళ్ళు, వయస్సువాళ్లు దామాయిషీని ఎక్కువ సంఖ్యలో లావుగా, బొర్రలతో ఉండి మోటుగా కన్పడ్డారు. ఆడవాళ్ళు అందచందాలు, శృంగార అలంకరణలో లొచ్చనిపించారు. మొత్తం మీద బెర్లిన్ వాసులు నాజూకు తక్కువవారుగా నాకు తోచారు. వారిలో చాలామందికి రాత్రి పడకదుస్తులు మోకాళ్ళవరకు దిగే చొక్కా. మామూలు పైజామాలు వేసుకొనేవారు కాదు.

ఒకసాయంత్రం నేను బజారువెంట షాపులను చూచుకొంటూ వెళ్ళుచుండగా సామాన్య దుస్తులతో, ముఖానికి పౌడరు వగైరా లేక, పల్లెటూరిమనిషిలాగు మోటుగానుండిన ఒక మధ్యవయస్సు స్త్రీ వచ్చీరాని ఇంగ్లీషులో నన్ను పలకరించింది. నా కర్థం కాలేదు. పైకిచూపి మేడమీదకు రమ్మన్నట్లుగా సైగలుచేసింది. అప్పుడర్థమైంది నాకు. ఆమె పడుచుకొనే స్త్రీ అని, నన్ను తన వృత్తినిర్వాహణకోసం పైకి రమ్మంటుందని. వద్దు వద్దని గట్టిగా (నో, నో) చెప్పి సాగిపోయాను. బహుశా, పోలీసుకు భయపడి పల్లెటూరివేషంలో ఉండవచ్చును. నేను క్రొత్తవాడను. అట్టి ఊహాలలో ఉండలేదు. పైగా ఆ మోటు మధ్యవయస్సురాలితో సంపర్కమేమిటి?

బెర్లిన్‌లో ఇంకా రామకృష్ణగారు వుండగనో లేక వెళ్లిన తరువాతనో ఒంటరిగా నేను టర్కిష్ బాత్‌కు వెళ్లాను. అది విశాలమైన భవనం. చాలాగదు లున్నవి. వేడినీళ్లస్నానానికి చిన్నకొలను వుండింది. ఆవిరిగదు లున్నవి. స్నానంచేసేవాళ్ళు బట్టలు విడిచి, ఒకచోట పెట్టి, మొండిమొలతో సర్వాంగాలకు ఆవిరిపట్టించి, వేడినీళ్ళతోను, చివరకు చన్నీళ్ళతోను స్నానం చేయాలి. ఆవిరిపట్టిన తర్వాత చెమటలు కారుచుండగా, పనివాళ్ళువచ్చి బల్లమీద పడుకోబెట్టి ఒళ్ళుపట్టి సబ్బుతో గట్టిగా దేహమంతా నలుప్రక్కల రుద్దుతారు. ఇది స్నానానికి ముందు. కొలనులో దిగి, చేతనైతే ఈతకూడా కొట్టి బైటకువచ్చి కొళాయి క్రింద చన్నీళ్లస్నానం చేసినతర్వాత, తుండుగుడ్డతో దేహాన్నంతా పనివాళ్ళు తుడిచి ఒకచోట కూర్చోబెట్టి వేడి కాఫీ యిస్తారు. తరువాత ఎవరిత్రోవన వారు పోవచ్చు.

ఈ స్నానానికి యువకులు, మధ్యవయస్కులేగాక పొట్టలు దిగజారి కాలుచేతులు సరిగా పనిచేయని వయస్సుమళ్ళినవారు ముఖ్యంగా వస్తారు. నేను వెళ్ళినప్పుడు పెద్ద బొర్రలతో, పెద్ద లావు శరీరాలతో, నెరసిన బుర్రమీసాలతో, కందగడ్డవలె ఎఱ్ఱబారిన ముఖాలతో వుండిన 4, 5 గురు వ్యక్తులు కన్పించారు. వారందరు జర్మనులే. బహుశా జర్మనీ కాలనీలలో పనిచేసినవారు. అందులో ఒకరు వచ్చీరాని ఇంగ్లీషులో నన్ను ప్రశ్నించాడు. " నీవు

ఆఫ్రికా దేశస్థుడవా?'' అని. ''కాదు, ఈస్టిండియన్‌ను. ఇండియా దేశమునుండి వచ్చాను'' అని చెప్పాను. నేను నల్లనివాడను కాను. వెడల్పుగల చట్టిముక్కు, బండపెదవులు, జిర్రజుట్టు కలవాడను కాను. అయినా నేను ఆఫ్రికా దేశస్థుడనా అని సందేహించటానికి కారణం, నేను బాగా ఎరుపుగా గాని, తెల్లగా గాని వుండకపోవటం, నా క్రిందిపెదవి ఏమాత్రమైనా కొంచెం లావుగా ఉండటం, ఆ ప్రశ్నించిన వ్యక్తి అజ్ఞానం కారణా లయివుంటవి.

ఇంకొకటి. ఒకరాత్రి నృత్యశాల ( కాబెరె ) లో భోజనం చేస్తుండగా, వాయిద్యగాళ్లలో ఒకడు వచ్చి ''ఏమి వాయించమంటా?'' రని అడిగాడు. నా కా ట్యూన్సుగాని, సంగీతంగాని తెలియవు. ''ఏదో ఒకటి వాయించం''డన్నాను. కొంచెంసేపటికి డబ్బివ్వండని వచ్చాడు. ఎందుకని అడుగగా ప్రక్కనున్నవాళ్ళు ఇవ్వటం ఆచారమన్నారు. ఏదో ఇచ్చాను. ఈవిధంగాకూడా విదేశీయులవద్ద డబ్బు గుంజుకొంటారు.

జర్మన్ స్నేహితుడు గెవిహ్ రైలెక్కించి సాగనంపాడు. ఈవ్యక్తి బ్రిటిషు రహస్య సమాచారశాఖచే నియమింపబడి ఆ నగరమును దర్శించు భారతీయులమీద ఒకకన్ను వేసి యుండేవాడేమో అని నాకు సందేహంకల్గింది. మేము విద్యాభ్యాసానికి వెళ్లాం. ఇంకా క్రొత్త. అప్పటికి రంగాగారు కూడా రాజకీయాల్లో వ్రేలుపెట్టివుండలేదు. అందువలన గెవిహ్‌గారికి పనితగులలేదు. వారు బహుశా ఈ కుర్రవాళ్ళు సరియైన నడకగలవారే అని లండన్‌కు రిపోర్టు పంపించివుంటాడు. రామకృష్ణగారి కీయనపేరు ఇండియా ఆఫీసువారో, ఆ సంబంధంకలవారో సూచించి ఉండవచ్చును.

నేను 1922, జనవరి 7-వ తారీఖున సాయంత్రం బెర్లిన్ నగరం విడిచి, 8-వ తారీఖు మధ్యాహ్నం 1-45 గంటలకు పారిస్ నగరం చేరాను. వెంటనే బైలుదేరి సాయంత్రం 5 గంటలకు జ్యువి-సూర్-ఆర్జ్ అనే గ్రామం చేరి మాడమ్యాజిక్ (కుమారి) హెచ్. యాపర్ట్ అనే ఆమె యింట్లో డబ్బిచ్చే అతిథిగా చేరాను. అక్కడ 6 రోజులుండి, 14-వ తారీఖు మధ్యాహ్నం 2½ గంటలకు

అక్కడనుండి బైలుదేరాను. ఎవరి సలహామీద ఆవూరు వెళ్లానో, ఎందుకు వారంరోజులకే వచ్చివేశానో నాకిప్పుడు గుర్తులేదు. ఈవూరు పారిస్ నగరానికి దగ్గర. కుమారి యాపర్ట్ పెండ్లికాక పోయినా, పెద్ద వయస్సు గలదే. భోజనం, పడక, వగైరా అనుకూలంగా ఉండలేదు. మరిన్ని బహుశా ఫ్రెంచిభాషను నేర్పేవారు లేనందున ఆ ఊరు విడిచిపెట్టా ననుకొందును.

14-వ తారీఖు సాయంత్రానికి పారిస్ నగరశివారు మాయిూ-సూర్-సేన్ చేరి, బూల్‌వార్డ్ విక్టర్‌హ్యూగోలో వున్న, లూయీకాటేజి అను పేరుగల పాన్స్యోలో మేడమ్‌లో రోగర్ శాన్‌స్యోడు డబ్బిచ్చే అతిథిగా చేరాను. అక్కడ మార్చి 2-వ తారీఖు ఉదయంవరకు ఉండినాను.

వెళ్లినవెంటనే ఫ్రెంచిభాష నేర్చుకొనటానికి ట్యూటరు కోసం ప్రయత్నించాను గాని 24-వ తారీఖువరకు ఎవ్వరూ కుదిరి నట్లులేదు. ఆరోజున ఇన్‌స్టిట్యూట్ పూజాడకు సంబంధించిన ఒక ట్యూటరును ఏర్పరచుకొని, 180 ఫ్రాంకులు (ఫ్రెంచిడబ్బు) ఇచ్చాను. ఆరోజుననే నా మొదటి పాఠం. లూయీకాటేజిలో కలుసుకొన్నవారిలో ఒక స్కాట్స్ కుటుంబం, ఒకస్వాన్‌యార్డ్స్ కుటుంబము వుండినవి. ఇండియన్ వనిత ఒకామె మిస్ నౌరోజి ఉండేది. మిక్కిలి పొడుగైన అమెరికన్లు కూడా వుండేవారు. స్కాట్స్ కుటుంబంవారు లాఫ్కలన్ అను పేరుగలవారు. జేమ్సు లాఫ్కలన్ భవన నిర్మాణకులు, పారిస్‌లో పనిచేస్తూ ఉండేవారు. వాళ్లకి బెట్టి అనే పేరుగల 4 ఏండ్ల చిన్నపిల్ల వుండేది. ఆ బిడ్డను నేను చాలా ముద్దుజేసేవాడను. రెండు బొమ్మలపుస్తకాలు కొని (3-2-1922) ఆపిల్లకిచ్చాను. స్వాన్‌యార్డ్స్ కుటుంబంవారు భార్యాభర్తలేగాక, 17, 18 ఏండ్ల వయస్సుగల కుమార్తెకూడా వారితో వుండేది. ఆమెకు ఇంగ్లీషు రాదు. ఫ్రెంచిభాష బాగా మాట్లాడేది. నాకప్పుడు వచ్చిన ఫ్రెంచిభాష అంతంతమాత్రం. అందువలన మా సంభాషణలు అసంపూర్తిగాను, మందకొడిగాను వుండేవి. ఆ పిల్ల చాలా చురుకైనది. కొంత చిలిపిగా ఉండేది. లైంగికభావ మామె కింకను కలుగలేదు. వయస్సురాని పిల్లవలెనే వర్తించేది.

నేనప్పుడు నా చివరిపేరు చౌదరి ఇంగ్లీషులో సి హెచ్ ఒ యు డి ఎ ఆర్ వై గా వ్రాసేవాడిని. ఆ పిల్ల నన్ను షుదారి అని పిలిచి నవ్వేది. విచారించగా, సి హెచ్ ఒ యు 'షు' అయి, ఫ్రెంచిలో కాబేజి (కోసుగడ్డ) అను అర్థము కలదట. ఆ కారణాన నా పేరు లోని 'యు' ను 'డబ్ల్యూ' గా మార్చాను. దీనివలనకూడా కొంత పొరపాటు అప్పుడప్పుడు వచ్చేది. ఇంగ్లీషువారిలో కౌడ్రే అను పేరు గలవా రున్నారు. నన్ను బాగా ఎరుగని ఒక రిద్దరు, నన్ను కౌడ్రే అనటం విన్నాను.

లూయిా కాలేజిలో ఫ్రెంచి నేర్చుకోవాలనే భావంతో 7 వారాల పైచిల్కు అక్కడవున్నా, కొంత చదివినా చదువుకంటె కాలక్షేపంతో ఎక్కువకాలం గడిచిపోయింది. అప్పుడప్పుడు వెళ్ళటం వలన పారిస్ నగరంలోని ముఖ్యభాగాలు, వాని సౌందర్యం అవగాహన మయింది.

పారిస్ నగరములో "ప్లాస్ డులకన్ కార్డ్" అనే చౌక్, ఆ నగరానికి నడిబొడ్డుకాకపోయినా నడిబొడ్డువంటిదని చెప్పాలి. అది సువిశాలమైన నాలుగు కోణములుగల చతురాంగణం (స్క్వేర్). దాని మధ్య మిక్కిలి ఎత్తైన ఏకశిలా స్తంభం నిలబెట్ట బడియున్నది. ఈ శిలా స్తంభము చతుర్కోణములు కలిగి, ఫలకాలమీాద ఈజిప్షియన్ చిత్రాలు, మాటలు చెక్కబడి యున్నవి. దీనిని ఈజిప్టునుండి తెచ్చినారని తలంచబడుచున్నది. దీని నలుముఖములను రాజబాటలవంటి విశాలమైన వీధులున్నవి. అన్నిటికంటె ముఖ్యమైనది, ప్రపంచప్రఖ్యాతిపొందినది షాంప్స్ లిజే అన్నది. ఇది మిక్కిలి వెడల్పైన మార్గం. ఈ మార్గం రెండుప్రక్కల ముచ్చటైన చెట్లున్నవి. ఒకప్రక్క పెద్దపెద్ద సుందరభవనాలతో, విలాసమందిరాలతో, ప్రసిద్ధికెక్కిన వసతి గృహాలతో విరాజిల్లుచుండును. రెండో ప్రక్కంతయు భవనాలు లేక కొంత ఖాళీస్థలా లున్నట్లుగుర్తు. అయితే ఈ రెండోప్రక్కనే అనతిదూరంలో ఫ్రెంచి గవర్నమెంటు భవనాలు, చారిత్రక ప్రసిద్ధిగన్న ప్రాసాదాలు ఉన్నవి. ఈ రాస్తా చాలా పొడుగైనది. దీనివెంట సాయంత్రం చక్కగా అలంకరించుకొన్న స్త్రీలు,

పురుషులు షికారు వెళ్తుంటారు. కొంతదూరం పోయినతర్వాత ఆర్క్-డుత్రియాంఫ్ అనే మిక్కిలి ఎత్తైన గొప్పచదరపు (మన హైదరాబాదు చార్మినార్ వంటి పోలికలుకలది) కట్టడం వున్నది. ఇది జయస్తంభము వంటిది. దీనిని ఆస్టర్లిడ్జి యుద్ధములో నెపోలియన్, ఆస్ట్రియన్లను ఓడించి, విజయసూచకముగా కట్టించినదని జ్ఞాపకం. ఈ కట్టడం నాలుగుప్రక్కల మిక్కిలి పెద్ద కమానులు (ఆర్చీలు) ఉన్నవి. ఆర్చీలపైని ఫలకములమీద, యుద్ధసంబంధమైన బొమ్మలు నిర్మింపబడియున్నవి. ఇది ఒక యాత్రాస్థలంగా, యుద్ధసంబంధమైన ఉత్సవాలు జరిపే చోటుగా రూపొందించబడినది. అప్పుడో, తర్వాతనో ఏదో యుద్ధసంబంధమైన సంస్మృతి ఊరేగింపు గొప్పగా జరుగుచుండగా, ఆసమూహం లోకివెళ్లాను. ఆ ఉత్సవం పూర్తిఅయి చాలామంది వెళ్ళిపోయిన పిమ్మట, ఐర్లండు ప్రధాని డివెలరాగారు అక్కడినుండి బైలుదేరి వెళ్లుటకు తనకారులో కూర్చొనిఉండగా నేను, ఇంకొక భారతీయ విద్యార్థి (పేరు గుర్తులేదు) కొంచెం దూరంగా నిలుచుండి వారికి నమస్కారంపెట్టాం. వారందుకొని, దగ్గరకురమ్మని సైగచేశారు. ధైర్యంచాలక తొలగిపోయాం. ఈకమానులకట్టడాన్నధిగమించి ఇంకా కొంతదూరం పోగా బ్వాదుబొలాన్ అనే పెద్ద ఉద్యానవనం వస్తుంది. ఇక్కడకు శ్రీమంతులు, ప్రభువుల కుటుంబాలకు చెందినవారు, ఇతర పెద్దలు కాలినడకను, గుర్రములమీద షికారుకు వెళ్తారు.

ప్లాస్ డులకన్ వార్డ్కు ఇతర ప్రక్కల నున్న రాజబాటలలో సుప్రసిద్ధమైన మిక్కిలి నిడివిగల బూల్ వార్డ్ వున్నది. దీని రెండు ప్రక్కలు చెట్లతో నిండిఉండును. దీని పొడుగూతా చాలా దూరంవరకు రెస్టారాంట్లు, భోజనశాల లున్నవి. వానిముందు గల పెద్ద పేవ్ మెంటు (రాళ్ళుపరచిన కాలిబాట) మీద అమర్చబడిన కుర్చీలమీద సాయంత్రం, 5 గంట లయ్యేటప్పటికి అల్పాహారాలు, పానీయాలు పుచ్చుకునే జనులు గుమికూడుతారు. సంభాషణలతో, గ్లాసులు ప్లేటుల గలగలతో మిక్కిలి సమ్మర్ధముగా వుంటుంది. పారిస్ నగరవాస్తవ్యులకు సాయంత్రమయ్యేటప్పటికి

ఇటువంటి బూల్ వార్డ్సుకు రావటం, కాఫీగాని, పానీయంగాని సేవిస్తూ కాలక్షేపంచేయటం అలవాటు. పానీయాలలో క్రేంద్ మాంత్, మినరల్ వాటర్సుకూడా వుండును. కాని సాధారణంగా ఏ తేలిక ఎర్రసారాయో జనసామాన్యానికి అభిమాన పానీయం. ఈ అల్పాహారాలు, పానీయాలు సేవించేవారు పేవ్ మెంట్సుమీద వస్తూ పోతూ వుండిన జనాన్ని చూస్తూ వినోదించటం సర్వ సామాన్యం. అందమైన స్త్రీలయితే మరీ ఉల్లాసం.

నేను పారిస్ నగరంలో చూచినవి ఇంకా నాలుగైదుండినవి. ఈఫెల్ టవర్, నోత్రోడామ్ మొదలైనవి. ఈఫెల్ టవర్ బ్రహ్మాండమైన ఎత్తు కలది. చాలా అంతస్తులతో వున్నది. మిక్కిలి వెడల్పు కూడా. మంచి ఉక్కు కడ్డీలతో, బద్దీలతో, స్తంభాలతో చతుష్కోణంగా నిర్మించబడింది. దీని పైభాగాలకు పోవటానికి ఎలక్ట్రికల్ లిఫ్టును ఉపయోగిస్తారు. మొదటిభాగంలో వివిధవస్తువులను అమ్ముదురు. ఒకటి రెండు అంతస్తులలో ఉపాహార, పానీయాలను యిచ్చే రెస్టారాంటు లున్నవి. చూచుటకు వచ్చినవారు విశ్రాంతితీసుకొనటానికి, పిల్లలు బొమ్మలువగైరా కొనుక్కోటానికి అనువు లున్నవి. ప్రపంచములో ఇంత ఎత్తుగల ఇనుపగోపుర మింకొకటిలేదు.

నోత్రోడామ్ అనేది క్రైస్తవ దేవాలయం ( చర్చి ). ఇది బ్రహ్మాండమైన కట్టడం. దీని శిఖరాలమీద సుందరమైన బొమ్మలు చెక్కబడి, నిర్మింపబడి వున్నవి. దీనిలోనిగంట మిక్కిలి ప్రసిద్ధమైనది. హెచ్చుస్థాయిలో ఇంపైన ధ్వని నిస్తుంది.

ఆట పాటలకు, నృత్య సంగీతాలకు, చిత్రకళాప్రదర్శనాలకు, నాటకప్రదర్శనాలకు, పారిస్ నగరం ప్రపంచఖ్యాతిని పొందింది. 'ఫోలీస్ బర్జేర్' అనే ప్రసిద్ధ సంగీతనృత్యనాట్యశాల లున్నది. అక్కడి విశేషం అర్ధనగ్నంగా, సుందర యువతులు చిత్రవిచిత్ర విన్యాసములతో, పాదాలు తలకు తగిలేటట్లు కాళ్లను పైకి ఎగరవేస్తూ చేతులను విచిత్రభంగులతో ఆడించుచు నృత్యం చేయటం, నటించటం. ఈ ప్రదర్శన ఎట్టివారికైన లైంగికవికారాన్ని

ప్రేరేపిస్తుంది. నావంటి యువకులకు, ఇదివరకట్టి అనుభవం లేని విదేశీయులకు, సంభ్రమోత్సాహాలను కల్గజేయటంలో ఆశ్చర్యమేముంటుంది? సామాన్య ప్రదర్శనాలుకూడా, శృంగారవాద్య నృత్యసంగీతాలతో మనోవికారాన్ని కలిగిస్తాయిగాని ఫోలీస్ బర్జేర్ ప్రదర్శనం వీటి నన్నిటిని మించినది. ఇంకొక సంగీత నృత్యనాటకాన్ని చూచాను. అప్పుడొక మిక్కిలి చక్కని స్పానిష్ యువతి ఆట పాట నన్ను ముగ్ధుణ్ణిచేసింది. ఫ్రెంచి నాటకమొకదానికి వెళ్లాను. నా కప్పటికి కొంత ఫ్రెంచి భాషాజ్ఞానం కలిగింది. మామూలు సంభాషణలను కొంతవర కర్థంచేసుకొనగలిగాను. కాని ఆ నాటకప్రదర్శనంలో పాత్రల సంభాషణలు కించిత్తైనా అర్థంకాలేదు. కారణం, అతివేగంగా సాగిన సంభాషణలు, మాటలు వరుసలుగాకాక, ఒకమాటలో మరొకమాటను అతికించినట్లు, గొలుసులుగా పాత్రలనోటినుండి వెలువడినవి. ఈ గొలుసుభాష నాకు ఎంతమాత్రము అర్థము కాలేదు. ప్రతిభాషలోను ఇడియం అనగా జాతీయత వుండును కదా. పుస్తకాలద్వారా ఇడియం-జ్ఞానం సంపాదించటం తేలిక కాదు, పైగా, మిడిమిడిజ్ఞానంమాత్రమే పొందిన నా కెట్లు సాధ్యమౌతుంది? ఇడియంకాక భాషాధ్వని (న్యూయన్సు) ఉంటుందికదా. అది పండితులకే అనుభవం. అందువల్ల నా కంతా అయోమయంగా ఉండింది. అయితే పాత్రల అభినయాలు, ప్రదర్శనవస్తువులు కొంతకుకొంత సాయంచేశాయి. ఉదాహరణకు, మత వ్యాప్తికిగాను ఫ్రెంచి స్త్రీ పురుషు లిద్దరు, నరమాంసభక్షులైన ఆఫ్రికన్ జనుల మధ్యకు వెళ్లారు. ఒకచోట ఈ యిద్దరిని కొందరు ఆఫ్రికనులు పట్టుకొని, ఇద్దరిని కలిపి బంధించి ఒక పెద్ద బానలో దింపి వండాలని, ఈ స్త్రీ పురుషుల శరీరాలలో ఏ యే భాగం ఏ విధంగా వంటచేసిన మిక్కిలి రుచికరములుగా ఉంటుందని చెప్పే విధం, కళ్లు చేతులు త్రిప్పే పద్ధతి, ముగ్గురు నల్గురు నీగ్రోలు విరబోసిన జుట్టుతో ముక్కులోను, పెదవులలోను దూపించుకొనివుండిన ఈకలతోను, అర్థనగ్నంతోను, రంగస్థలం మీద ప్రత్యక్షమవటం, టోపీలు, పాశ్చాత్యదుస్తులు ధరించిన

తెల్ల జాతీయులు, పెద్ద గంగాళం, దానిక్రింద నమర్చినరాళ్ళు, రాళ్ళమధ్యనుంచబడిన కట్టెలు, నా ఆ నాటకాన్ని కొంతకు కొంత అర్థంచేసుకొనుటకు తోడ్పడినవి.

పారిస్ నగరంలో కొన్ని చిత్రలేఖనశాల లున్నవి. వానిలో ప్రపంచఖ్యాతి పొందిన "లూవ్ర్" అనేది ఉన్నది. దీనిలో పుంఖానుపుంఖాలుగా గొప్పచిత్రకారులు రచించిన మిక్కిలి రమణీయమైన చిత్రలేఖనాలు, అతి నిపుణులైన శిల్పులు చెక్కిన అతి సుందర విగ్రహాలున్నవి, దీనిలో ననుకొందును విశ్వవిఖ్యాత "మోనోలిసా" అనే చిత్రపటాన్ని "వీనస్ ఆఫ్ మిలో" అనే చంద్రకాంతశిలావిగ్రహాన్ని చూచాను.

'మాన్ మార్త్' అని ప్రపంచప్రసిద్ధిపొందిన ప్రదేశం ప్రాత పారిస్‌లోని ఒకభాగం. ఇక్కడ చిత్రలేఖకులు, గాయకులు, కవులు ఎక్కువగా నివసిస్తారు. వీరి స్వేచ్ఛానడవడి, అలంకరణ, విహారాలు ప్రసిద్ధికెక్కినవి. సాధారణంగా ఈ రసపిపాసులు, బీదకుటుంబాల లోనివారు. తిండికంటె త్రాగుడు హెచ్చు. చేతలకంటె మాటలు జాస్తి. షికార్లు, నృత్యాలు హెచ్చు. ప్రొద్దుపోయేవరకు విలాసాలు, ప్రొద్దెక్కేవరకు నిద్ర. యువతీయువకుల సరససల్లాపాలతో, సంగమాలతో, గంటలకాలం నిమిషాలుగా గడిపివేస్తారు. వీరికొరకో అన్నట్లు చౌకఅద్దెకిచ్చే గదులు, కొద్దిడబ్బుకిచ్చే ఉపాహారాల, భోజన శాలలున్నవి. అయితే అవి అంత శుభ్రంగాను, గాలి వెలుతురు బాగా కలవిగాను, చూడటానికి అందముగాను వుండవు. అసలీ ప్రాంత మంతా బీదది. బీదవిద్యార్థులకొరకు, కళాకారుల కొరకు సృష్టించబడిందా అన్నట్లుంటుంది.

నేను లూయీకాలేజి నుండి 1922 మార్చి 2-వ తారీఖున బయలుదేరి, ఆరాత్రి 12 గంటలకు ఆక్స్‌ఫర్డ్ చేరాను. క్రొత్త నివాసం 2, యాబే రోడ్డులో చేరాను. నేను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ప్రవేశపరీక్ష పూర్తిచేసి, మామూలు (రెగ్యులర్) విద్యార్థిగా 1922 అక్టోబరులోగాని చేరలేదు. ఈ మధ్యకాలంలో ఫ్రెంచిభాషను సాధనచేస్తూ, అటుయిటు తిరుగుచు కాలంగడిపాను. 1922 మార్చికి రంగా, శ్రీకృష్ణ, నేను విడిపోయి వేరేవేరేచోట్ల వసతు లేర్పరచుకొన్నాము.

ముందుకు సాగిపోవకముందు, నేను చేసిన ఒక తెలివి తక్కువపనిని చెప్పాలి. నేను బెర్లిన్‌లోను, పారిస్‌లోను కొన్ని శృంగారసంబంధమైన బొమ్మలకార్డులను కొన్నాను. ఆక్స్‌ఫర్డ్‌కు తిరిగివచ్చిన రెండు మూడు రోజులకు వానిని పెద్ద అట్టమీద అంటింపించి, 'ఎల్స్‌నఫారంకు' తీసుకువెళ్లాను ఆ యింటికూతురు కివ్వాలని. తల్లి మిసెస్ వశాస్ వచ్చి దానిని తీసుకొన్నది. కూతు రింట లేదట. తర్వాత వెళ్లగా "ఇట్టివి తీసుక రావద్దు, మా ఆయన కోప్పడ్డాడు, మా పిల్ల కిటువంటివి ఇష్టముండ" వని చెప్పింది. పిల్ల కన్పడలేదు. నేను ఖిన్నపడి "ఆ అట్టను తిరిగి ఇచ్చివేయం" డన్నాను. "భర్త తీసికొని ఎక్కడనో దాచి వేశా" డన్నది. మిసెస్ వశాస్ కూతురు అందంగాఉండేది. వయస్సు వచ్చిన పిల్ల. అవివాహిత. నేను ఆ పిల్లయందు మోజు పడి యుంటాను. నా తప్పును తెలుసుకొని విచారించాను. అట్టి అవివేకపుపనిని తిరిగి చెయ్యలేదు.

ఆక్స్‌ఫర్డ్‌కు అనతిదూరములో నున్న ఛార్ల్సబరి చార్లింగ్‌టన్ గ్రామంలో అప్పర్ కోర్టు అనే యింటిలో శ్రీమతి ఎడ్డింగ్‌టన్ అనే ఆమె ఉండేది. ఆమెభర్త వ్యవసాయదారుడు. రెండు మూడు వందల ఎకరాల భూమిని కృషిచేస్తూ ఉండేవాడు. అది గుత్తకు తీసుకొన్న భూమిగాని, ఆ భూమి ఆ కుటుంబంలో మూడువందల సంవత్సరాలనుండి ఉన్నదట. మనదేశంలో కొన్నితరాలైనా భూమిని నిలబెట్టుకొన్నవారు అరుదు. రంగాగారు ఆ ఇంట్లో అంతకుముందే డబ్బిచ్చేఅతిథిగా వుండివచ్చినారు. వారు, నేను కలసి 15-4-'22 న ఆ యింటికి వెళ్లాము. రంగాగారు మూడు, నాలుగు రోజులుండి వెళ్లిపోయారుగాని, నేను మే 1 వర కుండినాను. ఆగ్రామం చుట్టుప్రక్కలంతా పచ్చికబయళ్లు. సుఖమైన భోజనం, స్వచ్ఛమైన వాతావరణం, విశాలమైన పచ్చికబయళ్లు, నేను పచ్చికబయళ్లకు షికారువెళ్ళుతూ ఉండేవాడిని. శ్రీమతి ఎడ్డింగ్‌టన్ నన్ను విస్టుడ్రెవ్ హ అనే చీట్లపేక ఆటలకు తీసుకు వెళ్తుండేది. కాలం సంతోషంగా గడిపి తిరిగివచ్చాను.

మిసెస్ ఎడ్డింగ్టన్ మామూలు వసతి నిచ్చే (లాండ్ లేడి) గృహస్థురాలుకంటె ఎక్కువస్నేహముతో వుండేది. నేను తిరిగివచ్చిన రోజున అనగా మే 1-వ తారీఖున మిసెస్ మానింగ్ అనే ఆమెతో కలసి నేనప్పుడు నివసించుచుండిన ఫిల్స్‌డేల్ రోడ్డుకు వచ్చింది. వారిని సినిమాకు తీసుకొనివెళ్లి భోజనంపెట్టి సాయంత్రం రైలు ఎక్కించాను. ఆమె అప్పుడప్పుడు ఆక్స్‌ఫర్డ్‌కు వస్తూ పోతూ ఉండేది. మామూలు మర్యాదలు జరిపేవాడను. సినిమాకు తీసుకువెళ్ళటం, భోజనంపెట్టటం చేసేవాడిని. నేనప్పుడప్పుడు చార్లింగ్టన్‌కు వెళ్ళుచుండేవాడను. రంగాగారు కూడ ఒకటి రెండుసార్లు వచ్చియుండిరి. వారు రెండు మూడు రోజులుండి వెళ్లి పోగా, నేను వారం పదిరోజులుండి వస్తూవుండేవాడను. ఆక్స్‌ఫర్డ్‌లో విశ్వవిద్యాలయాన్ని మూయకముందు, మే లో కాలేజిల పడవల పోటీ జరుగుచుండును. ఆ సంవత్సరం మే 21-వ తారీఖు జరిగిన పడవల పందాలను చూడటానికి బెడ్డీ, మిల్లీ అను పేరుగల పిన్న వయస్సులు, కొడుకు కూతురులతో శ్రీమతి ఎడ్డింగ్టన్ వచ్చింది. సాయంత్రంవరకు పందాలుచూచి వెళ్ళిపోయింది.

శ్రీమతి ఎడ్డింగ్టన్ భోగలాలస. అవి ఇవి చూడాలని కుతూహలం ఎక్కువ. సామాన్య రూపవతి అయినా వాంఛలు హెచ్చు. భర్త చాలా మోటుమనిషి, వికారంగా వుండేవాడు. పొలంపనులువలన కాబోలు ముఖం ఎర్రగా, కందగడ్డలాగా వుండేది. విస్తీర్ణమైన వ్యవసాయంతో దంపతులు, బిడ్డలు సుఖజీవనం చేస్తుండేవారేగాని దాంపత్యసామరస్య ముండేదికాదు. భార్య హుషారుగా, చనువుగా ఆడుతూ పాడుతూ వుంటే, భర్త ఏదో కొంపమునిగిపోయినట్లు మూతిముడుచుకొని, ముక్తసరిగా మాట్లాడుచు ముభావంగా ఉండేవాడు. అందువల్లకాబోలు క్రొత్తవారిని చూచిన, యువకులను చూచిన శ్రీమతి ఎడ్డింగ్టన్ ఉత్సాహ పడేది. ముందుకు చొచ్చుకుపోయేది. ఆ రోజులలో నల్లవారు, తెల్లవారు అనుభావం ప్రజలలో ఇంకను పాతుకొనిపోయే వుండింది. అయినా స్వల్ప సుఖాలకు, వినోదాలకు ఆశించి శ్రీమతి ఎడ్డింగ్టన్ మా వెంటపడింది. ఆమె, ఆమె పిల్లలతో రంగాగారు,

నేను నాలు గైదు స్నాప్‌షాట్స్ (చిన్న ఫొటోలు) తీసుకొన్నాం. ఆమెయింటి సమీపాన చిన్న జలపాతం వున్నది. ఆ జలపాతం వద్దకూడా ఫొటోలు తీసుకొన్నాం.

విశ్వవిద్యాలయం మూసివేసి ఇంచుమించు నాలుగుమాసముల వేసవి సెలవు లారంభించినప్పుడు (ఇంగ్లండులో వేసవి అధికార రీత్యా 21 జూన్ నుండి సెప్టెంబరు 21 వరకు) నేను కార్ని వాల్ కౌంటీలోని, సెంట్ మార్టిన్-యిన్-మినాజ్ గ్రామంలో 'విత్తన్' అనే ఇంటిపేరుగల శ్రీమతి ఎ. యమ్. బ్రెనెర్రి గృహంలో డబ్బిచ్చేఅతిథిగా 22-7-1922 తారీఖున చేరాను. అక్కడ ఆగష్టు 12-వ తారీఖు వర కుండినాను. వారికి విస్తీర్ణమైన భూములు కలవు. అవి వారి స్వంతభూములు (ఫ్రీహోల్డు భూములు). కొంత భూమిలో గోధుమ, బార్లే పండించేవారు. అయితే ఎక్కువ భాగం పశువులమేతకు పనికివచ్చే బీళ్లు. చాలా ఆవులనుపెంచి వాని పాలనుండి వెన్నను వేరుచేసి, వేరుచేసిన పాలను తాము పెంచుచున్న పందులకు పోసేవారు. కొద్దోగొప్పో కోళ్ళుకూడా ఉండేవి. వారికి కొడుకులు లేరు. ముగ్గురు కూతుళ్ళు. నాతో పాటు ఇద్దరు, ముగ్గురు శ్వేత అతిథులుకూడా వుండేవారు. నే నొక్కడనే ఇండియన్‌ను. అప్పుడప్పుడు వారాంతానికి, ఒక రిద్దరు శనివారం వచ్చి, సోమవారం ఉదయం వెళ్లిపోయేవారు.

వారికి పాడి పుష్కలం కాబట్టి, వెన్నతీసేవారు కాబట్టి పాలకుగాని, వెన్నకుగాని కొరత లేదు. కోతకు పనికివచ్చే ఎద్దులను, గొర్రెలను, పందులను, కోళ్లను పెంచేవారు కాబట్టి వీటి తాజామాంసం మాకు లభించేది. వారి భూములు వారి స్వంతం కాబట్టి ఉన్న సంసారమేగాని, నాలుగుడబ్బులు అదనంగా సంపాదించుకొనుటకు బైటవారికి భోజనవసతి నిచ్చుటకు వెనుదీయ లేదు.

అతిథులను చాలా మర్యాదగా చూచేవారు. వారికి తగిన సౌకర్యాలను కలిగించేవారు. వ్యవసాయనౌకర్లు, కూలీలు వున్నా ఇంట్లో పనిచేయటానికి నౌకరుండినట్లు గుర్తు లేదు. అప్పుడప్పుడు ఇల్లు శుభ్రపరచుటకు ఒక పనిమనిషి వస్తూఉండేది. వంట వగైరా శ్రీమతి బ్రెనెర్రి చూచుకొనేది. కూతుళ్లు సహకరించేవా రనుకొందును. రాత్రి పడకగదిలో నీరుడుపోసిన గిన్నెను ఇంటి

వారే తీసి శుభ్రపరచేవారు. ఆ మారుమూల పల్లెటూరిలో, అధికాచమానానికి (మలవిసర్జనం) ఆధునికవసతు లప్పుడు లేవు. ఇంటి కొకప్రక్కగా ఆనుకొనియున్న గదిలో ఎత్తుగా కట్టబడిన దిన్నె, దానిమధ్య, మలం క్రిందకువెళ్లేటకు రంధ్రం. ప్రక్కన పాదాలుంచి మలవిసర్జనం చేయటం. క్రిందకు పడిపోయిన మలం మీద ఇంటివారు చెత్తచెదారం వేసి, తర్వాత దానిని తొలగించి పెంటప్రోగులో వేసేవారు.

రెండు మూడు సార్లైనా నే నుండిన ఇరువది రోజుల్లో ఇతర ప్రదేశాలు చూపటానికి అతిథులను తీసికొని వెళ్లారు. ప్రత్యేకించి ఒకచోట కొండగుట్టలు ఎక్కాం. ఫొటోలు తీసుకొన్నాం. ఇంటి ఆవరణలోని కత్తిరించబడ్డ పచ్చగడ్డిమీద కూర్చుండి, నిల్చుండి ఫొటోలు తీసికొన్నాంకూడా.

బైటకు షికారుకువెళ్ళిన సందర్భములో జరిగిన ఒక సంఘటన నాకు బాగుగా గుర్తున్నది. నలుగు రైదుగురం కలసి ఉదయభోజన మైనతర్వాత, హాయినికొల్పే సెరెండలో ఇంటికి కొద్దిదూరంలోవున్న పచ్చికబయళ్ళకు షికారు వెళ్లాం. అటు యిటు తిరుగుచుండగా నేను, ఒక అవివాహితయువతి ఒకచోట పచ్చగడ్డిలో దగ్గరగా కూర్చొని మాటలుచెప్పుకోసాగాం. ఏమి బుద్ధిపుట్టిందో నేను వంగి ఆమె బుగ్గను ముద్దుపెట్టుకొన్నాను. అంతటితో లేచి ఇంటికి తిరిగివచ్చాం. అప్పటి కించుమించుగా మధ్యాహ్నభోజనవేళ అయింది. నేను ముఖంకడుగుకొనుటకు పైకి నా గదిలోనికి వెళ్ళి తిరిగివచ్చేలోపల, ఆ యువతి తన్నేదో నేను బలవంతంగా ముద్దుపెట్టుకొన్నట్లు, ఇం కేమైనా చేయదలచు కొన్నానేమో అని అక్కడివారందరికి ఊదివేసింది. నేను వచ్చే టప్పటికి భోజనంబల్లవద్ద అందరు కూర్చుని భోజనం ప్రారంభించ బోతున్నారు. నా రాకను చూచి మాటలు మానివేశారు. అప్రసన్నవాతావరణం ఏర్పడినట్లు నాకు తట్టింది. ఇతరులు కిక్కురుమనక పోయినా, ఇంటి రెండోపిల్ల ముఖంచిట్లించు కొని ఏదో గొణిగింది. నాకు సరిగా వినపడలేదు. తరువాత శ్రీ ఫ్రైనెర్రి గారు నన్నేదో అనునయించినట్లు సానుభూతితో

మాట్లాడారు. అంతటితో అప్రసన్నత తొలగిపోయింది. నామీద నిందవేసిన యువతి రెండోనాడో, మూడోనాడో వెళ్ళిపోయింది. నిజానికి నేను కావాలని కౌగలించి ముద్దుపెట్టుకొన్నది కాదు. మాటల ఉత్సాహంలో వంగి ఆమె బుగ్గలమీద అంటీ అంటనట్లుగా నా పెదవులను ఆనించాను. ఇంతమాత్రానికే ఆ పిల్ల, నే నేదో చెడ్డపని చేసినట్లు వర్తించింది. పాశ్చాత్యులకు ముద్దుపెట్టుకొనటం విపరీతమైందికాదు. ప్రేమికులు ఎప్పుడూ పెదాలను ముద్దాడుతారు. బుగ్గమీద చిన్నముద్దు లెక్కలోనికి రాదు. విక్టోరియారాణి కాలంలో ఎట్లున్నా, ప్రపంచయుద్ధానంతరం 1922 లో బుగ్గముద్దులు, చివరకు పెదవులముద్దులు జమలోకి వచ్చేవికావు. నల్లవాడు, తెల్లదానిని పెట్టుకొన్న ముద్దులు బుగ్గమీదైనా, అనుచితమని అనుకొనేవాళ్ళు ఉండకపోలేదు. కాని నాముద్దువల్ల నేను తప్పుచేశానని ఇంటిపిల్ల తప్ప, ఇతరులెవరూ చిరాకుగా తీసుకొన్నారని నేను తలంచను. ఆ యువతి కూడా అట్లు అనుకొనివుండదు. తమాషాకో, వింతగానో చెప్పియుంటుంది. తాత్కాలిక అప్రసన్నత కలిగినా, మధ్యాహ్న భోజనం పూర్తిఅయ్యేటప్పటికే అది విడిపోయింది. నా మనస్సుకు, ఆ యువతి అంతనిష్ఠకలది కాదని, అంతా నటనని తోచింది. ఇక కోపం తెచ్చుకొన్న ఆ యింటిపిల్ల చాటుగా ఆమె తండ్రి నౌకరితో కౌగిళ్ళు, ముద్దులలో మునిగేదని అక్కడే విన్నాను.

శ్రీమతి బ్రెన్నెర్రి ఉత్తమ ఇల్లాలు, సరసురాలు, సానుభూతిపరురాలు. ఆదరణతో పలుకరిస్తూ ఉండేది. మా ఉనికి సంతృప్తికరంగా ఉండాలని ప్రయత్నించేది. భోజన, ఉపాహార విషయములో ఉదారంగా ఉండేది. కోల ముఖం. బారు ముక్కు. ఒక్కగా సామాన్యమైన ఎత్తుతో వుండేది. ఆమెనుండి సానుభూతి ఉట్టిపడుతుండేది. నే నక్కడనుండి వచ్చివేసినతరువాత రెండు మూడుసార్లైనా ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకొన్నాం.

బ్రెన్నెర్రి గారు చాలా మంచివారు, చాలా సానుభూతి కలవారు. స్నేహభావమేకాకుండా ఆప్యాయతతో వుండేవారు. మేము తీసికొన్న ఫొటోలలో ఒకదానిలో వారి కోటును పట్టుకొని

నేను లాగుచున్నట్లు కన్పడుచున్నది. వారు మంచి వ్యవసాయకులు. పొట్టిగా, లావుగా, ఎర్రబుగ్గలతో వుండేవారు.

వారి ముగ్గురుకూతుళ్ళలో పెద్దామెకు తెల్లరంగు ఎక్కువ. సన్నగా కొంచెం ఎత్తుగా కోటేరువంటి ముక్కుతో అందమైన కళ్లతో ప్రశాంతంగా నవ్వుతూ ఉండేది. ఈమెకు తల్లిపోలికలు జాస్తి. ఆమె నొక యువకుడు, పెండ్లికొరకు కాశ్రయిస్తూ కొన్నిరోజు లాయింట్లో గడిపాడు. రెండవ ఆమె బ్రూనెట్ అనగా తెల్ల రంగు తక్కువకలది. ఆమె పొట్టిగా, లావుగా తండ్రివలె ఉండేది. బుద్ధిమంతురాలు. ఏ భేషజంలేని యువతి. స్నేహంగా ఉండేది. మూడవపిల్ల మధ్యరకం రంగుకలది. గడుసు ముఖం. తుస్సు ఎక్కువ. చలాకీగా, అందంగా వుండేది. మాట పరుషం. ఆమెకు నా నల్ల ముఖం నచ్చలే దనుకొంటాను.

కారన్ వాల్ కౌంటీలో ప్రసిద్ధికెక్కినవి, శాఫ్రాన్ కేక్సు అనగా పసుపుకలిపి వండిన కొంత వెడల్పైన బిస్కత్తువంటి తినుబండారం. వానిమీద క్రీము దట్టముగా పరచి తింటె చాలా రుచిగా ఉంటవి. ఇదేగాకుండా ఆ యింట్లో పాన్ కేక్సు (గోధుమపిండితో చేసిన అట్లు) జాస్తిగానే తిన్నాను. వీనిని క్రీముతో తిన్నట్లు గుర్తులేదు.

మొత్తంమీద నా అక్కడి ఇరువదిరోజుల ఉనికి సౌఖ్యంగా, సంతోషంగానే జరిగిపోయింది.

నేను 1922 ఆగస్టు 12-వ తారీఖున కారన్ వాల్ నుండి తిరిగివచ్చినతర్వాత, ససెక్సు కౌంటీలోని బర్ వాష్ అనే పేరుగల గ్రామానికి వెళ్లి కాప్టెన్ నొయల్ గారి "విదర్ హడ్స్టు" అనే ఇంటిలో డబ్బిచ్చే అతిథిగా చేరాను. ఈ బర్ వాష్ ను ప్రసిద్ధ బ్రిటిష్ సామ్రాజ్యవాది, ప్రఖ్యాతిగన్న కవి "తెల్లవారు తెల్లవారే, నల్లవాళ్ళు నల్లవాళ్లే. వా రిద్దరికి సమానత్వం ఉండ దనుభావంతో తూర్పు తూర్పే, పడమర పడమరే ఈ రెండు ఎప్పుడూ కలియ" వని ప్రబోధించిన ఇండియాలోని బ్రిటిష్ సైన్యం మాజీ సైనికుడు రుడ్ యార్డ్ కిప్లింగు నివసించే మడ్ వాష్ కు అతి దగ్గర.

కాప్టెన్ నోయల్ వ్యవసాయం చేస్తూ తెల్లపందులను విస్తారముగా పెంచేవాడు. ఆవులు, కోళ్ళు మొదలైనవి వుండేవి. కొన్ని మైళ్ళలో వున్న టౌన్ మార్కెట్టుకు తన మోటారుకారులో పందులను, కోళ్ళను అమ్మకానికి తీసుకొనివెళ్ళేవాడు. అతనికి భార్యలేదు. దగ్గరబంధువు ఒకావిడ ఇల్లు నడిపేది, ఆమె చూడటానికి వయస్సు మళ్ళిన స్త్రీవలె మాత్రమే కన్పడేదికాని ఆమె నిజముగా వృద్ధురాలు. ఆమెజుట్టు వయస్సుమీరని స్త్రీ జుట్టుమాదిరిగా వుండేది. ఒకనాడు ఆమె జుట్టును పైకి తీసి బుర్రగోక్కొనుచుండగా చూచాను. ఆమె తల తిరుపతిక్షౌరం చేసినదానివలె నున్నగా ఉండింది. ఆమె తలమీద వున్నది సొంతజుట్టుకాక తెచ్చి పెట్టుకొన్న జుట్టు (విగ్). దానినిబట్టి ఆమె వయస్సు 70 సంవత్సరములు దాటిఉంటుందని తలంచాను. అంత వయస్సుండినా ఒక్కిలి చురుకుగా, సమర్థవంతంగా పనిచేసి మా భోజనాదులను సకాలములో అందజేసేది. ఇంటియజమాని అచ్చమైన మోటు మనిషి. అతనికి సరదాలుగాని, స్నేహపూర్వకంగా నడచుకొనే స్వభావంగాని లేదు. అయితే ఆయనతో నాకు ఇంటిసంబంధం ఉండేదికాదు. మాటలు బహు క్లుప్తం. ఆతిథ్యమిచ్చే ఇండ్లలో అతిథులకు భోజన, పడక సౌకర్యాలను సమకూర్చి, వారి యోగక్షేమాలను విచారించి రావలసిన డబ్బును తీసుకొనేది స్త్రీలే. ప్రెనెర్రి గారి కుటుంబంవంటి కుటుంబంలో పురుషులుకూడ బాధ్యత తీసుకొని అతిథులతో స్నేహపూర్వకంగా కలసిమెలసి ఉంటాడుగాని అంత స్వేచ్ఛగా, స్నేహపూర్వకంగా అన్ని చోట్లను పురుషు లుండరు. నిజానికి పేయింగ్ గెస్ట్ అనగా డబ్బిచ్చేఅతిథి. డబ్బిచ్చినా అతిథే. అందువలన కుటుంబ సభ్యులతో కలసిమెలసి భోజనంచేయటం, వినోద విహారాల్లో పాల్గొనటం, యథార్థానికి కుటుంబసభ్యునివలె వుండటం పరిపాటి. అయితే ఇంటియజమానురాలే డబ్బు దస్కం విషయంలో అతిథులతో వ్యవహరిస్తుంది. నిజమైన వసతి భోజన (లాడ్జింగ్ అన్డ్ బోర్డింగ్) గృహాలలో స్త్రీలుమాత్రమే కథనడుపుతారు. పురుషుల కేమాత్రం సంబంధముండదు. నిజానికి వసతి

గృహాలను భర్తలేని లేక వివాహంకాని వయస్సుమళ్లిన స్త్రీలే ఎక్కువగా నడుపుతారు.

బర్‌వాష్‌లో అతిథిగా వున్నప్పుడు సంభవించిన రెండు సంగతులు గుర్తున్నవి. నేను చరిత్ర ముఖ్యమైన అంశములలో వ్యక్తిగతముగా బోధించుటకు ఒక ట్యూటరు కావలెనని ఆ యింటి ముసలమ్మతో చెప్పాను. "ఇండియాలో సివిల్ సర్వీస్ ఉద్యోగాన్నుండి అమధ్యనే పింఛన్ పుచ్చుకొనివచ్చినవా రొకరున్నారు, వారికి చెప్తా"నని ఆమె చెప్పింది. మరునాడో, మూడవనాడో ఒక మధ్యవయస్సుగలవాడు వచ్చి కొంచెంసేపు మాట్లాడి, వెళ్లిపోయాడు. "స్టీలుచట్రం" వంటి ఇండియన్ సివిల్ సర్వీసులో పనిచేసినవాడు కాబట్టి నా చూపులు, మాటలు ఆయనకు నచ్చియుండకపోవచ్చు. విసురుగా వచ్చాడు, నిర్లక్ష్యంగా మాట్లాడాడు. నేను కక్కినపేనును గానని అతనికి తోచియుండవచ్చును. రావటం మానేశాడు.

జోబ్‌సన్ అనే పేరుగల మధ్యవయస్సు దాటినవాడు ఆ యింటికి అతిథిగా వచ్చాడు. స్పెల్లింగునుబట్టి ఆయనపేరు జాబ్‌సన్‌గా వుండును. పొరపాటున జాబ్‌సన్ అని సంబోధించగా ఆయనకు మిక్కిలి చిరాకు కలిగింది. "నాపేరు జాబ్‌సన్ కాదు జోబ్‌సన్" అని నొక్కి చెప్పాడు. ఆయనకు రాత్రి నిద్ర పట్టేది కాదు. ఇరువదినాల్గుగంటలు సిగరెట్లు తగలేసేవాడు. రాత్రిళ్లు పడకకు చేరినప్పుడుకూడా సిగరెట్టు ఉండేది. సిగరెట్టుహోల్డరులో వెలిగించిన సిగరెట్టు పెట్టి, మంచం ఎక్కేవాడు. సూటు తీసివేసి నిద్రకు ధరించే పైజామాలు వేసుకొని, నిద్రపోవటానికి ప్రయత్నించేవాడు. అప్పుడప్పుడు కునుకురాగా కాల్చుచున్న సిగరెట్టు పైజామా, షోక్కాకు బెజ్జాలువేసేది. మర్రుమునగా లేచి ఆరిపోయిన సిగరెట్టును తిరిగి వెలిగించుకొనేవాడు. ఈవిధంగా తెల్లవారేది. నిద్రకు టైముకానప్పుడు డ్రెస్సింగ్ గౌనుతో పడకమీద ఉండేవాడుకాబోలు, దానికి కూడా బెజ్జా లుండేవి. ఈయన వృత్తి ఏదో, ఎక్కడ నివసించేవాడో, అసలు ఏ ప్రాంతం వాడో నే నడిగినా సమాధానం చెప్పలేదు. నా అనుమానం

ఏ ఆఫ్రికావంటి అనాగరిక దేశాల్లోనో ఉంటూ, అక్కడేదో ఘోరపాపం చేసివుండవచ్చును. అందువలన నిద్రపట్టేదేకాదు. మూడు నాలుగు రోజులుండి ఎక్కడకో వెళ్ళిపోయాడు.

రుడ్యార్డ్ కిప్లింగుగారు దగ్గిరి మడ్‌వాష్‌లో నివసిస్తున్నారుకదా, వారిని చూద్దామనుకొన్నాను. కాని వారప్పుడక్కడ లేరు. లండన్‌లో వున్నారట.

బర్‌వాష్ తర్వాత ఆ సంవత్సరమే (1922 వేసవి) అనుకోండును. కొద్దిరోజులపాటు లెస్టర్‌లోని మూన్‌లెన్డ్ గ్రామం, ఒక రింటికి డబ్బిచ్చేఅతిథిగా వెళ్ళాను. నేను వెళ్లిన మరునాడనుకోండును, ఇద్దరు ఇండియన్ విద్యార్థులు వచ్చి రెండు మూడు రోజులుండి వెళ్ళిపోయారు. అది వేసవికాలం. ఇంటివారికి భూములున్నవి. వారు పచ్చగడ్డిని కోశారప్పటికి. అది ఎండి ఉన్నది. దానిని ప్రోగుచేసి ఇంటికి తెచ్చుకోవాలి. కూలీలు దొరకలేదు. వారు ఆదుర్దాపడుచుండగా "మేము ముగ్గురు భారతీయులం మీకు సాయంచేస్తా"మని బైలుదేరి సాయంత్రంవరకు ఇంటివారితో కలసి ప్రోగుచేసి ఇంటికి చేర్చాం. వారెంతో సంతోషించి ఆదరించారు.

మద్రాసు జనరల్ హాస్పిటల్ పెద్ద సర్జన్‌గా పనిచేసి, పేరుప్రతిష్ఠలు పొందిన డాక్టర్ నిబ్‌లక్‌గారు ఆ గ్రామంలో వున్నారని తెలిసి వారిని దర్శించవలెనని కూతూహలపడి, యింటి యజమానురాలికి వారింటికి వెళ్లుతానని చెప్పాను. "ఎప్పుడు వారి కనుకూలపడునో కనుక్కొని చెప్తా"నన్నది. కనుక్కొనగా డాక్టర్ నిబ్‌లక్‌గారు తనే వచ్చి మాట్లాడిపోతానని చెప్పాడట. ఆ సాయంత్రం వారు రాగా, ఒకగదిలో కలసికొన్నాం. పాశ్చాత్య దేశాల్లో, చూడవచ్చినవారు మాట్లాడదలచినవారితో ఇంటివారి ముందు మాట్లాడరు. ఏ గదిలోనో మాట్లాడి వెళ్లిపోతారు. ఇంటివారు వచ్చినవారిని గదిలోకి పంపిస్తారు. వెళ్లిపోయేటప్పుడు ఇంటివారితో చెప్పవలసిన బాధ్యతకూడా వుండదు. నే నుండిన గదిలోకి వచ్చి, డాక్టర్ నిబ్‌లక్‌గారు మూడు నాలుగు నిమిషాలు మాత్రమే వుండి ఏదో మాట్లాడి వెళ్లిపోయారు. వైద్యరీత్యా నాకు

వారితో అవసరం లేదు. నేను వైద్యవిద్యార్థిని కాను, ఆదివరకు ఎరిగుండినవాడను కాను. కాబట్టి ఎక్కువసేపు మాట్లాడటానికి అవకాశం లేకపోయింది. నేను ఆయన ఖ్యాతినిబట్టి ఆయనను చూడాలని అభిలషించటం జరిగింది. మా సమీపంలోవున్న మాయింటి యజమానురాలి మాటను మన్నించి, ఆయన వచ్చుట జరిగింది. అంతేకాని విశేషాలేమీ లేవు మరిన్నీ అక్కడి చదువు ఆరంభంలోవున్నాను కాబట్టి విషయాలను బాగా అర్థంచేసుకొనే శక్తి అప్పటికింకా కలుగలేదు. ఈసంగతి వారు గ్రహించే ఉంటారు. అందువల్ల ఎక్కువసేపు సంభాషించుట కవకాశం లేకపోయింది.

అక్కడ మాతోబాటు టామ్లిన్ ఇంటిపేరుగల వయస్సు మళ్లిన తల్లి, మంచి వయస్సులో వున్న కుమార్తె ఉండేవారు. కుమార్తెపేరు డారతి. ఈపిల్లకు గుర్రంస్వారి చాలా ఇష్టం. స్వారిదుస్తులు (బ్రీచెస్ అనే లాగు, కోటు) ధరించి ఇంటివారి గుర్రంమీద వాహ్యాళికి వెళ్లేది. ఆ పిల్లతో స్నేహంగా ఉండాలని ఉబలాటపడేవాళ్లం. ఆమె కొంత ముభావంగా ఉండేది. తల్లికి పెళ్లికాని వయస్సువచ్చిన, పెళ్లి కవకాశంలేని యువకులతో, అందులో నల్లవారితో స్నేహంచేయటం ఇష్టంవుంటుందా ?

నేను ఆక్స్‌ఫర్డ్ 1920 సెప్టెంబరు ఆరంభంలో వెళ్లాను, 1922 సెప్టెంబరుకు గాని ప్రవేశపరీక్ష పూర్తిచేయలేదు. ఈ రెండు సంవత్సరాలలో నా తండ్రి రక్తమొడిచి పంపిన వేల డబ్బు చాలా వరకు వృథాచేసినట్లే అని అప్పుడప్పుడు తలచుకొని బాధపడ్డాను గాని నా సోమరితనాన్ని, కాలహరణాన్ని మానలేదు. విలాసాలను, దుబారాను తగ్గించలేదు. మొదటినుంచి డబ్బువిలువ తెలియని వాడను. వస్తువు ధర అడగకుండా కొని, అడిగినడబ్బిచ్చే మనస్తత్వంకలవాడను. ఒకప్రక్క కాలం గడిచిపోతున్నదే, డబ్బు చాలా ఖర్చైపోతున్నదే, నా తండ్రి ఇంతడబ్బు పంపటానికి ఎంత బాధ పడుచున్నాడో అని సంక్షోభం చెందుతూ, ఏదో సామెత చెప్పినట్లు, కుక్కబుద్ధి పోదన్నట్లు నడిచాను.

ఏలా అయితే 1922 అక్టోబరులో విశ్వవిద్యాలయ డిగ్రీ కోర్సులో చేరి, నూతన అధ్యాయం ప్రారంభించాను. ప్రవేశపరీక్ష ప్యాసై, నాన్ కలేజియేట్ సొసైటి విద్యార్థిగా డిగ్రీకోర్సు మొదలుపెట్టాను. ఇదికూడా కాలేజియే. దీనికి, ఇతర కాలేజిలకు భేదం, ఈ కాలేజికి విద్యార్థులుండుటకు, భోజనంచేయుటకు వసతులు (హాస్టల్సువంటివి) లేవు. వసతులున్న కాలేజిలలో కూడా, విద్యార్థులు తమ విద్య పూర్తి అయ్యేవరకు ఆ కాలేజిలలో ఉండరు. సంవత్సరమో, రెండు సంవత్సరాలో గడచినతర్వాత, కాలేజి బైట అద్దె వసతుల్లో ఉంటారు. వీరిని డిగ్సు అని విద్యార్థు లంటారు. విశ్వవిద్యాలయంవారు కాలేజిలో ఉండటానికి వీలులేని విద్యార్థులకొరకు కొన్ని పట్టణ గృహాల్లో వసతు లేర్పరచారు. వానిని లైసెన్సుడ్ ఆథరైజ్డ్ వసతు లంటారు. మా నాన్ కలేజియేట్ సొసైటి విద్యార్థు లప్పుడప్పుడు కలసి సమిష్టిభోజనం చేసేవారేగాని, ఉనికిమాత్రం ఆథరైజ్డ్ ఇండ్లలోనే. చదువులోను, ఆటలలోను, ఇతర కలాపాలలోను మా కాలేజికి ఇతర కాలేజిలకు రవ్వంత భేదమైనా లేదు కాని, నాన్ కలేజియేట్ సొసైటి అనగా ఇది సరైన కాలేజి కాదేమో అని భ్రమ జనించుట వలన, తమను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్థులుగా ఇతరులు ఎంచుటకు ఇతరులు సందేహించుచున్నారని విద్యార్థులు ఫిర్యాదు చేయటంవల్లై, విశ్వవిద్యాలయాధికారులు మా కాలేజిపేరును సెయింట్ కాథరీన్ కాలేజిగా మార్చారు. దీనికి కూడా ఒక చక్కని భవనం, దానిలో పుస్తకభాండాగారం, సమావేశానికి హాలు, ఆఫీసుగదులు వగైరా అన్ని హంగులు వున్నవి, ఒక్క హాస్టలు తప్ప. ఇతర కాలేజిలకువలె ప్రిన్సిపాల్, అధ్యాపకులు, ట్యూటర్లు కలరు. మా కాలేజి అప్పటి అధ్యక్షుడు సెన్సార్ అనే పేరుతో ఉండేవారు. వీరిపేరు ఇ. బి. జెకర్. వారు మిక్కిలి ఉత్తములు, దయార్ద్రహృదయులు. మిస్టర్ కెన్డ్రిల్ మొదలైన బోధకులు మా కాలేజివర్గములోనివారు.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్యావిధానం రెండు విధాలు. ఒకటి, లెక్చర్లద్వారా ఉమ్మడిబోధ. రెండు, ట్యుటోరియల్ సిస్టం అనే వ్యక్తిగత శిక్షణ. నిజానికి ఆక్స్‌ఫర్డ్ (కేంబ్రిడ్జికూడా)

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం చదువు పునాది ట్యుటోరియల్ సిస్టమని పైన చెప్పియుంటిని. ఏ ఏ అంశం ఏ ఏ ట్యూటరువద్ద అభ్యసించవలెనో, ముందుగనే కాలేజి అధికారులు నిర్ణయిస్తారని ముందు చెప్పాను. విద్యార్థులు ఆయా శిక్షకులను కలసికొని వారాని కొకసారో, రెండుసార్లో శిక్షణను పొందటానికి సమయాన్ని ఏర్పాటు చేసుకొంటారు. విద్యార్థి, అధ్యాపకుడు నిర్దేశించినచోటికి వెళ్తాడు. ఆయన చెప్పవలసిన అంశమును చదివించి, విమర్శనాపూర్వకంగా బోధిస్తాడు. బోధించినదానిని విద్యార్థి తన స్వంతమాటలతో వ్యాసరూపంగా (కాంపొజిషన్) ఫలానాకాలానికి వ్రాసి తీసికొనిరమ్మని చెప్తాడు. క్రొత్తపాఠాన్ని నిర్దేశించి, ఏ యే పుస్తకాలు చదవాలో చెప్తాడు. విద్యార్థి, ట్యూటరు తర్కించి వ్యాసం వ్రాయమన్న విషయాన్ని బాగా చదువుకొని వ్యాసాన్ని వ్రాసి ఒకరోజు ముందుగా ట్యూటరుకు అందజేస్తాడు. మర్నాడు ట్యూటరు, తా నంతకుముందే దిద్దిన వ్యాసంలోని తప్పులను ఎత్తిచూపించి విశదీకరిస్తాడు. మరిన్ని తా నదివరకు చదువుమన్న క్రొత్తపాఠాన్ని చదివించి సవిమర్శకంగా బోధిస్తాడు. ఈ చెప్పినదానిని ఇంటివద్ద చదివి వ్యాసాన్ని వ్రాసుకొనిరమ్మంటాడు. ఇదివరకువలెనే దానిని దిద్దటం, తప్పులను చూపి సవరణలు చెప్పటం, క్రొత్తపాఠం ఇవ్వటం, ఏ యే పుస్తకాలు చదవాలో నిర్దేశించటం జరుగుతుంది. ఈవిధంగా సంవత్సరం పొడుగూతా ఒక అంశంలోనో, రెండు లేక మూడు అంశాల్లోనో ఒకరివద్దో లేక ఇద్దరి ముగ్గురివద్దో విద్యార్థికి శిక్షణ జరుగుతుంది. అందువల్ల ఆక్స్‌ఫర్డ్ చదువు వ్యర్థంకాదు. బొత్తిగా వ్యర్థుడైనవా డక్కడక్కడా ఉండవచ్చును. అట్టి దద్దమ్మను విశ్వవిద్యాలయం గెంటివేస్తుంది.

అయినా ఆ యా కాలేజిలకు, వాని వాని ప్రత్యేకవిశిష్టత లుండవని చెప్పను. కొన్ని అంశముల్లో కొన్ని కాలేజిలు విశిష్టతను కలిగియున్నవి. ఉదాహరణకు, క్రైస్ట్‌చర్చ్ కాలేజి గ్రీకు, లాటిన్, ఇంగ్లీషు సారస్వతాలకు పేరుపొందింది. బేలియల్ కాలేజి తత్వశాస్త్రం, రాజకీయశాస్త్రం, అర్థశాస్త్రాదులకు ప్రసిద్ధి చెందింది. న్యూ కాలేజి చరిత్రబోధనకు ఘనతవహించింది.

దీనికి కారణం ఆ కాలేజిలకు సంబంధించిన అధ్యాపకులు ఆ యా అంశాల్లో విఖ్యాతులయివుండటం. ఇప్పుడున్నవారనేకాదు, చాలా తరాలనుండీ ఆ సంప్రదాయం ఆ కాలేజిలకు వున్నది. ఈ సంప్రదాయానికి పూర్వం ఏ పండితుడో ఆ ప్రత్యేక అంశంలో పేరుబడియుండవచ్చును. ఆ అంశాన్ని చదవాలనుకొన్న విద్యార్థులు ఆయనవల్ల ఆకర్షింపబడి ఆ కాలేజిలో చేరవచ్చును. ఇప్పుడు విశ్వవిద్యాలయం మొత్తంమీద చదువుచెప్పుచున్నా, ఆ రోజుల్లో ఆ యా కాలేజిల పండితుల ప్రభావం ఆ యా కాలేజి విద్యార్థులమీద ఎక్కువ పడియుండవచ్చును. పైగా ప్రొఫెసర్ల సాన్నిధ్యం, వారిని తరచు కలుసుకొనటం, వారితో సంభాషణాలు వగైరా విద్యార్థులను ఉత్తేజితులను చేయునుకదా. మరిన్ని ఒక కాలేజికి సంబంధించిన ట్యూటర్లవద్ద శిక్షణపొందుట కా కాలేజి విద్యార్థుల కెక్కువ అవకాశం ఉంటుంది. ఇదిగాక సంప్రదాయం మిక్కిలి గట్టిది. అది చప్పున కండ్లకు కన్పడని బలవంతమైన బంధం. ఒక కాలేజి సంప్రదాయం ఆ కాలేజి విద్యార్థులకు నిరంతరం ప్రస్ఫుటం చేస్తూ, ఉత్తేజితం చేస్తూ ఉంటుంది. విద్యార్థులు తమకు తెలియకుండానే ఆ సంప్రదాయాన్ని ధృవపరుస్తూ భగవంతుడు భక్తులను చేస్తే, భక్తులు భగవంతుని సృష్టిస్తారనే సూక్తిని యథార్థంచేస్తారు. కాలేజి, దాని విద్యార్థుల అవినాభావ సంబంధం విద్యార్థులను సంఘటితపరచి మేము ఫలానా కాలేజికి చెందినవారం అనే భావాన్ని (ఎస్ప్రిడికోర్) పెంపొందిస్తుంది. విద్యాభ్యాసం విశ్వవిద్యాలయ మంతటికిని సంబంధించినదైనా, ఆటపాటలలో ఏ కాలేజి వ్యక్తిత్వం ఆ కాలేజిదే. ఏ కాలేజి జయాపజయాలు, పేరుప్రతిష్ఠలు ఆ కాలేజివే. కాలేజిలో నివసించుట, కాలేజి భోజనశాలలో కలసికొనుట, దాని పఠనాశాలలో సంభాషించుకొనుట, కాలేజి ప్రత్యేక వ్యాయామశాలల్లో, ఆటల జట్లలో కలసిమెలసి పాల్గొనుట మొదలైన దినచర్యలు తా మా కాలేజికి చెందినవార మనే భావమును, ఐక్యతను, సంఘటితపరుస్తవి.

అవకాశ ముండును. బయటివారు తక్కువగా హాజరౌతారు. హాజరు కావాలని నియమం లేదు. నామట్టుకు నేను ఒక లెక్చర్‌కైనా హాజరుకాలేదు.

కాని సంఘీభావానికి, సంస్థ విద్యార్థి అని తెలిపేటందుకు, సంస్థఅధికారుల సలహా సహాయాలను పొందటానికి, సంస్థ లైబ్రరీని, ఇతర వసతుల నుపయోగించుకొనటానికి, తద్వారా చదువునం దాసక్తిని పెంచుకోవటానికి సంస్థకు అథమం, టరమ్‌కు మూడు రాత్రులచొప్పున, సంవత్సరానికి నాలుగు టరములకు పండ్రెండు రాత్రులు హాజరవ్వాలి. ఊరికినే హాజరవటం కాదు. ఆ సంస్థ ఇతర విద్యార్థులతో కలసిమెలసి మెలగాలి. అంతేకాదు, వారితో కలసి భోజనం చెయ్యాలి. ఈ భోజనం సంస్థహాలులో జరుగుతుంది. సంస్థఅధికారులు భోజనంలో పాల్గొంటారు. ఆ సమయంలో అధికారులను కలసికొని వారి సలహాలను తీసుకోవచ్చును.

వీలున్న విద్యార్థి, ఇష్టమున్న విద్యార్థి, సంస్థ కెప్పుడైనా వెళ్లవచ్చును. అక్కడి లైబ్రరీ వగైరా వసతులను ఉపయోగించుకొనవచ్చును. అక్కడి కాంటీన్‌లో ఉపాహారాలు వగైరా తీసుకోవచ్చును. కాని అథమం టరమ్‌కు మూడుసార్లైనా ఆ సంస్థకు హాజరుకావాలి.

సంవత్సరానికి నాలుగు టరములు. ఇవి మైకల్‌మస్, హిలరి, ఈస్టర్. ట్రినిటి. ఒక్కొక్కటరం, కొన్నిరోజులకుమాత్రమే పరిమితమై వుండును. టరముకు కట్టవలసిన ఫీజులో భోజనఖర్చు కూడ చేర్చబడియుండిందో, లేక వేరే దీనికి ఖర్చు వ్రాసేవారో నాకు జ్ఞాపకం లేదు. భోజనంమాత్రము మిక్కిలి తృప్తికరముగా ఉండేది. పదార్థాలు ఎక్కువగా లేకపోయినా తాజాగా, బాగా తయారుచేయబడినవిగా, మిక్కిలి రుచిగా, సంసారపక్షంగా ఉండేవి. భోజనములో పోర్ట్, షెర్రి, క్లారెట్ వంటి తేలిక మత్తుపానీయాల నిచ్చేవారు. ఆ సంస్థ సాంవత్సరికంరోజున షాంపేన్ అనే విలువగల పానీయాన్ని కూడా ఇచ్చేవారు. సూపు, చేప, మాంసం, పుడ్డింగ్ కోర్సులు, బంగాళదుంపలు, కారెట్, నూల్‌కోల్, క్యాబేజి వంటివి తప్పక వుండేవి. నేను ఎన్నిచోట్లో ఎక్కువ విలువగల పదార్థాలను భుజించానుగాని, మా లింకల్‌న్స



ఆచార్య రంగా, గ్రంథకర్త, వి. ఎస్. కృష్ణ
ఆక్స్‌ఫర్డులో (1921)

ఇన్ భోజనంలో ఇచ్చిన పదార్థాల సువాసన, రుచి, తృప్తి నాకు ఎక్కడా కలగలేదు.

నేను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఆనర్సు డిగ్రీకోర్సు తీసికొన్నాను. ఇది ఆనర్ స్కూల్ ఆఫ్ జ్యూరిస్ ప్రూడెన్స్. ఆనర్సు డిగ్రీలకు రెండు భాగా లుంటును. ప్రథమభాగం, ద్వితీయభాగం, మొదటిభాగం రెండోభాగానికి మొదటిమెట్టు. దానికి తయారుచేసేది. దీనిని ఫస్టు పబ్లిక్ అంటారు. నేను డిగ్రీ పొందదలచింది న్యాయశాస్త్రం కాబట్టి, నిజానికి ప్రథమ భాగంకూడ న్యాయశాస్త్రానికి సంబంధించి యుండవలసింది. దీనిని లా ప్రెలిమ్ అంటారు. కాని చారిత్రక, రాజకీయ, ఆర్థికశాస్త్ర లందలి విషయాలనుకూడా కొంతవరకైనా నేర్చుకోదలచి హిస్టరి ప్రీవియస్ తీసుకొన్నాను.

చదువు మామూలుగా సాగిందికాని శ్రద్ధగా సాగినట్లులేదు. నాకు మొదటినుండి సరదాలు జాస్తి. కాలకృత్యాలు తీర్చు కొనుటలోను, తల దువ్వుకొని బట్టలు వేసుకొనటంలోను జాప్యం చేస్తాను. ఏకబిగిని తదేకధ్యానంతో చదువలేదు. విలాసాలు, వింతలు ఇష్టం. అందువల్ల 1923 జూనులో జరిగిన పరీక్షలో ఈ నా ఫస్ట్ పబ్లిక్ (హిస్టరి ప్రీవియస్) లోని ఒక అంశం మిగిలిపోయింది. దీనిని 1923 డిశెంబరు లేక 1924 ఆరంభం పరీక్షలో పూర్తిచేశాను.

శ్రీ రామకృష్ణ 1921 డిశెంబరులో ఇండియాకు తిరిగివెళ్లిన తర్వాత మేము ముగ్గురం రంగా, శ్రీకృష్ణ, నేను విడిపోయామని పైన చెప్పాను. తర్వాత నేను, రంగాగారు తరచు కలుసుకొను చుండేవారం. శ్రీకృష్ణ మాత్రం దారిలో కన్పడుచూ ఒకటి రెండు మాటలు మాట్లాడుచుండేవాడు, రంగాగారు డిగ్రీకోర్సు చదువుట కవకాశంలేక ఆర్థికశాస్త్రంలో డిప్లొమాను, మిక్కిలి హెచ్చుస్థాయిలో పొందియున్నారని పైన చెప్పాను. ఒక్క డిప్లొమ చాలదని అభిప్రాయంతో రిసర్చి (పరిశోధన) చేసి, బి. లిట్. డిగ్రీని సంపాదించుకొనాలని నిశ్చయించుకొన్నారు. రిసర్చిని మాతృదేశములోనే చేయాలని తలచి, స్వదేశానికి తిరిగి

వెళ్ళారు. దక్షిణ భారతంలోని ముఖ్యంగా తెలుగుదేశంలోని గ్రామాలను తిరిగి నేతపనివాండ్రను కలసికొని, వారి ఆర్థికస్థోమత, వారి మనుగడ, జీవనప్రమాణం, నేతబట్టల క్రయ విక్రయముల స్వరూపం మొదలైన విశేషాలను కొంతకుగొంత సేకరించి తనభార్య శ్రీమతి భారతిదేవి గారితో ఇంగ్లండునకు తిరిగివచ్చారు. ఇది 1924 వేసవిలో ననుకొందును. భారతిదేవిగారికి లలితకళ లంటే అభిమానం. ఆమె పెద్దగా చదువుకోలేదు. ఇంగ్లండు ఉనికి ఆమె విద్యాభివృద్ధికి తోడ్పడుతుందని, తనకు సహవాసంగా ఉంటుందని, చిన్నవయస్సులోవున్న ఆమెను ఒప్పించి రంగాగారు తీసుకొనివచ్చారు. శ్రీమతి భారతిదేవి లండన్‌లోని సుప్రసిద్ధ చిత్రకళ బోధనశాల స్లేడ్ స్కూల్ ఆఫ్ పెయింటింగు లో చేరారు. ఆమెకొరకు రంగాగారు కొంతకాలం లండన్‌లో మకాంపెట్టారు. తమ రిసెర్చి ఫలితాలను వ్రాసి (థీసిస్) తత్సంబంధమైన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి అధికారులకు సమర్పించారు. రిసెర్చి పూర్తిగా లేదని అధికారు లభిప్రాయపడగా స్వదేశానికి తిరిగివెళ్ళి, మరి కొంతకాలం కష్టపడి తిరిగి ఇంకొంత విషయం సేకరించి, విశ్వవిద్యాలయాధికారులను తృప్తిపరచి బి. లిట్. డిగ్రీని పొందారు. ఆయన తిరిగివెళ్ళినప్పుడు శ్రీమతి భారతిదేవిగారు లండన్‌లోనే ఉండిపోయారని గుర్తు.

మేము ముగ్గురం బాల్లై విడిచాక, నేను ఆక్స్‌ఫర్డులో వివిధ గృహాల్లో ఉండినాను. కాని నేను కొలదికాలం తిరిగి బాల్లై మిస్ హెమ్మింగ్స్ ఇంటిలో చేరినట్లున్నది. 1922 డిశెంబరుకు ఆమె ఇంట్లో ఉన్నట్లు, ఆ క్రిస్‌మస్ ఆమె నాకొక చిన్న డయరి బహూకరించినట్లు, మామధ్య కొంతడబ్బులావాదేవి జరిగినట్లు నా కాగితాల్లో కన్పడుచున్నది. తర్వాత ఆ యిల్లు విడిచి మిసెస్ లో అనే ఆమెయింటికి వెళ్లాను. మిసెస్ లో మంచిమనిషి. ఆదరముతో చూచేది. ఆమెకు ఒక రిద్దరు ఎదిగిన కూతుళ్లుండేవారు. ఆయింట్లో నాతోపాటు ఇండియన్ విద్యార్థి మద్రాసు వాస్తవ్యుడు అబ్దుల్ హమీదా్ అనేవా రుండేవారు. ఆయన దృఢగాత్రుడు, చురుకైనవాడు. కాని శ్రద్ధగా చదివేవాడుకాడు. పైగా నిర్ల

ష్యంగా వర్తించేవాడు. ఈయన మద్రాసునగరం ఆర్కాటు నవాబు కుటుంబంతాలూకువాడని తెలిసింది. దూరబంధువైనా అయి వుంటాడు. అందుచేతనుకాబోలు కొవ్వు, రాజసం కల్గిఉండేవాడు. విద్యార్థులప్రవర్తనను గమనించి సరిదిద్దటానికి ప్రాక్టర్సు అనే ఉద్యోగులు విశ్వవిద్యాలయమంతటికి ఇద్దరో, ముగ్గురో ఉండేవారు. అందులో ఒకరు బెల్ అను పేరు గలవారు. ఆయన ఆరడుగులకు మించిన ఎత్తు, లావు, గాంభీర్యమైన ముఖము కలవారు. వారు చరిత్ర మొదలైనవిషయాలను బోధించు ప్రొఫెసర్లలో ఒకరు, వారివద్ద మన అబ్దుల్ హమీద్ ట్యూషన్ కు వెళ్ళుచుండేవాడు, కాని నిర్ణయించిన వ్యాసాలను వ్రాసి సకాలములో అందించటం, నిర్ణీతప్రకారం వెళ్లి తాను వ్రాసినవి దిద్దించుకొని, క్రొత్తపాఠాలు నేర్చుకొనటం సక్రమంగా చేసేవాడుకాడు. పైగా బెల్ గారి ప్రశ్నలకు వెంకిసమాధానా లిచ్చేవాడట. అందువల్ల బెల్ గారు కోపపడుచుండేవారట. అబ్దుల్ అనే నిరంకుశ ఆఫ్ఘన్ సుల్తాన్ ఒకరుండేవారట. ఆయనను బ్రిటిష్ పరిపాలకులు ఇంగ్లీషులో అబ్దుల్ ది డాంమ్డ్ (పాపిష్ఠి) అనేవారట. ప్రొఫెసర్ బెల్ గారికి కోపంవచ్చి ఆ పేరుగల ఇతనిని అబ్దుల్ ది డాంమ్డ్ అనేవారట. ఈ విద్యార్థి కూడా ఆనర్సు డిగ్రీకొరకు చదివినాడుకాని పరీక్షలో సరిగా వ్రాయనందున ఆనర్సు డిగ్రీకి బదులు ప్యాస్ డిగ్రీమాత్రమే ఇచ్చారట. ఆక్సఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఆనర్సు డిగ్రీకి చదివిన వారికి మూడవతరగతి (నాల్గవతరగతేమో గుర్తుచాలదు) ప్యాస్ కూడా రాకపోతే, బొత్తిగా నాసికాకపోతే, మామూలు డిగ్రీ యిచ్చే ఆచారమున్నది. అందుచేత చావుతప్పి, కన్ను లొట్టపోయినట్లు ప్యాస్ డిగ్రీతో తిరిగివెళ్లిపోయాడు. నేను 1927 లో స్వదేశానికి తిరిగివచ్చినతర్వాత మద్రాసులో ఒకటి రెండు సార్లు అయినను కలిసికొన్నాను. ఆయన ప్రెసిడెన్సి కాలేజిలో ననుకొంటాను లెక్చరర్ గా పనిచేస్తుండినాడు. పైన చెప్పినట్లు సహజంగా తెలివితేటలుగలవాడు. చురుకైనవాడు. మంచి వ్యక్తిత్వం (పరసనాలిటి) కలవాడు. పైగా ఆర్కాటు నవాబు గారి పలుకుబడిఉన్నది. అందువల్ల విద్యాసంస్థలో ఆచార్యస్థానం

పొందాడు. కాని ఎక్కువకాలం జీవించలేదు. ఇంకను పిన్న వయస్సులోనే చనిపోయాడు.

ఆయన మిసెస్ లో యింట్లో నాకంటె ముందు చేరి ఉండినాడు. నేను వెళ్లినతర్వాత కొన్నిరోజులకు ఒకచిన్నవిషయం జరిగింది. మిసెస్ లో రెండో కుమార్తెను మంచి వయస్సులోనున్న అవివాహితను, తల్లితో చెప్పి ఒకసాయంత్రం తన మోటరుబైక్ మీద పి. కారు తీసుకొనివెళ్లాడు. ఏ ఏడు గంటలకైనా తిరిగి రావలసింది 9½ గంటలు దాటినా రాలేదు. సహజంగా తల్లి, ఇంట్లోనివారు ఆందోళనపడ్డారు. ఏ సంబంధంలేని నాకుకూడా ఆతురతకల్గింది. ఇది, ఇంకొక పురుషుడు తా నెరిగిన చక్కని యువతితో ఇంతకాలం సాన్నిధ్యం అనుభవించుచున్నాడే అనే మగవాని ఈర్ష్య ( మేన్ జెలసి ) అయియుంటుంది. వా రిద్దరు ఎక్కివెళ్లిన మోటరుసైకిలుకు ఏమైన ప్రమాదం సంభవించిందేమో అని ఆ యువతి తల్లి, సోదరి ఆందోళన. ఆ సౌందర్యాన్ని అనుభవించుకుపోతున్నాడే అని నా దుగ్ధ. చివరకు ఏ పది గంటలకో వా రిద్దరు సురక్షితంగా ఇంటికి చేరుకొన్నారు. మామూలుగా చెప్పే సాకే అనగా మోటరుసైకిల్ మధ్యలో చెడిపోయిందని వాళ్లు చెప్పారు, ఇతరులు నమ్మనీ, నమ్మకపోనీ.

మిసెస్ లో ను ఎందుకో పిలిచాను. పలకలేదు. ఇంట్లో ఎవరూ వున్నట్లులేదు. అందువలన వెనుకదొడ్లోకి వెళ్లాను. అక్కడ కటకటాలుగా కట్టిన మధ్యరకంగూటిలో కొన్ని కోడిపెట్టలున్నవి. వానిలో ఒక్క పుంజైనా లేదు. నే నాశ్చర్యపడి ఆమె వచ్చిన తర్వాత "పుంజులేకుండా కోళ్ళు గ్రుడ్లు ఎట్లా పెడతవి ?" అని అడిగాను. ఆమె నవ్వి "గ్రుడ్లుపెట్టటానికి పుంజు అక్కరలేదు" అని చెప్పింది. తర్వాత తెలిసింది. ఈ గ్రుడ్లు పిల్లలుచేయించటానికి పనికిరావుగాని అందులోని పోషక పదార్థాలలో లోపముండదని, జీవరహితంగా మాత్రమే ఉంటవని, అందువల్ల శాకాహారులుకూడా భుజించవచ్చునని.

మిసెస్ లో ఇల్లు కొంతకాలానికి వదలి, ( కారణం గుర్తు లేదు ) నే నొక ముసలమ్మ యింట్లో నివసించాను. ఆమె కితరదిక్కు

లేక ఒక యువతిని తనతో నివసించేటట్లు ఏర్పాటు చేసుకొన్నది. ఆ యువతి ఏ షాపులోనో ఉద్యోగం చేస్తూ, నాలుగు డబ్బులు సంపాదించుకొనేది. అందులో కొంతభాగం తన భోజన నివాసానికి ఆ ముసలమ్మ కిచ్చుచుండేది. ఆ యువతి అందమైంది కాదు. అప్పటికే ముప్ఫైఅయిదేండ్లయినా ఉండవచ్చును. ఇంక వివాహావకాశము లేనట్లే. వారిద్దరు మిక్కిలి అన్యోన్యముగా వుంటూ ఒకగదిలోనే పడుకొనేవారు. రెండు మంచా లుండవచ్చును. కాని లైంగిక సంబంధమైన గాథలు వినుచుండిన వేడిరక్తముగల యువకుడను కాబట్టి, వారిద్దరకు ఏకజాతి సంగమం వున్నదేమో నని అనుకొనుచుండేవాడను, ముసలమ్మైనా ఆ యింటామె మిక్కిలి హుషారుకలది. వయస్సులో రతిసౌఖ్యాం పుష్కలంగా అనుభవించి యుంటుంది. వార్ధక్యంలో ఆ పిపాస పోక, యీ కృత్యానికి సిద్ధపడిందేమో అని సందేహం. కృత్రిమలింగాలు ఆ దేశాలలో చాలాకాలంనుండి వాడుకలోఉన్నవట.

ఆ యింటిలో, అబ్దుల్ ఖాదర్ అనేవా రుండేవారు. వారు విద్యాధికులు. మద్రాసు విశ్వవిద్యాలయంలో యమ్. ఎ. పట్టా పొంది, ఆక్స్‌ఫర్డ్‌కు, పిహెచ్. డి కి వచ్చారు. మంచి ఉచ్చారణతో ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడేవారు. భాష ప్రగల్భంగాని, నిర్దుష్టంగా ఉండేది. చరిత్ర, ఆర్థిక శాస్త్రం, రాజకీయశాస్త్రం మొదలైన వానిలో మంచి విజ్ఞానం కలవాడే కాక, మతవిషయాలు బాగా తెలిసినవాడు. మహమ్మదీయుడు కనుక ఖురాన్ క్షుణ్ణంగా తెలిసివుండుటలో ఆశ్చర్యం లేదు. కాని బైబిలును కూడ క్షుణ్ణంగా తెలిసినవాడు. ఒకసారి క్రిస్టియన్ మతబోధకు డొకరు ఆ యింటికి ఎందుకో వచ్చాడు. మా గృహయజమానురాలు ముసలమ్మ మమ్ములను ఆయనకు పరిచయపరిచింది. మాటలసందర్భంలో మతప్రస్తావన వచ్చింది. శ్రీ అబ్దుల్ ఖాదర్ బైబిలునుండి ఉదాహరణలు చూపుచు ఆ మతగురువును బోల్తా కొట్టాడు. నిజానికి శ్రీ అబ్దుల్ ఖాదర్ సామాన్యవిద్యార్థి కాడు. మద్రాసు వాసి అయిన ఆయన యం. ఎ. డిగ్రి మద్రాసు విశ్వవిద్యాలయ

ములో ఆర్జించి, హైదరాబాదులోని నిజాంకాలేజిలో పెద్దస్థాయి ఆచార్యుడుగా బోధించుచుండేవాడు. పిహెచ్. డి. అనే డాక్టరేటు డిగ్రీని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో పొందాలని కాంక్షతో అక్కడికి వచ్చియుండినాడు. కష్టపడి చదివి థీసిస్ (పరిశోధనావ్యాసం) వ్రాసినాడు. కాని ఏ కారణమువల్లనో అతని కప్పటికి డాక్టరేటు రాలేదు. శ్రీ అబ్దుల్ ఖాదర్ విజ్ఞాన ఖనియేగాని, కొన్ని స్వతంత్రాభిప్రాయాలు కలవాడు. అవి, రవి అస్తమించని బ్రిటిష్ మహాసామ్రాజ్యం రోజులు. సామాన్యంగా బ్రిటిష్‌వారు ప్రాతపద్ధతులకు, బుద్ధులకు లోనైనవారు. తాము సామ్రాజ్యపాలకుల మనే మనస్తత్వం, ధీమా, ఆ సంప్రదాయ ధోరణుల నాచరించాలనే పట్టుదల గలవారు. అబ్దుల్ ఖాదర్ గారు ఇంచుమించు సర్వస్వతంత్రుడైన నైజామ్ సేవలోనుండి వారి సాయంతో పరిశోధనకు వచ్చినవారు. అందువల్ల వారు భయపడుచు ప్రాతపంథాను వ్రాయవలసిన అవసరంలేదు. బహుశా వారు రిసర్చి చేసింది, నైజాం-బ్రిటిష్ ప్రభుత్వ సంబంధాల విషయమై ఉండవచ్చును. ఇతర విషయాల్లో ఎట్లున్నా స్వచరిత్ర, తత్సంబంధమైన రాజకీయాలు వచ్చేటప్పటికి, తమ ఔన్నత్యాన్ని కాదన్నవారి దృక్పథాన్ని, విశ్వవిద్యాలయాధికారులు థీసిస్ పరిశీలన కిచ్చిన ఇండియా పరిపాలనలో అనుభవముండినవారు సమ్మతించకపోవచ్చును. అందువలన శ్రీ ఖాదర్‌కు అప్పటిలో డాక్టరేట్ పట్టాను ఇచ్చియుండలే దనుకొందును. ఇంకొకటి ఖాదర్ గారికి మతపిచ్చ హెచ్చు. మహమ్మదీయుల గొప్పతనం అసమంజసంగా వా రుద్ఘాటించియుండవచ్చును. అదికూడా వారికి డాక్టరేటు రాకపోవటానికి కారణమయి యుండవచ్చును. అబ్దుల్ ఖాదర్ గారు స్వదేశానికి తిరిగివెళ్లి, తిరిగి ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రొఫెసర్ గా చేరినారు. ఈమధ్య వారిని హైదరాబాద్‌లో కలసికొనా లనుకున్నానుగాని వా రప్పటి కక్కడున్నట్లు లేరు.

మద్రాసులో వారు విద్య నభ్యసించుచుండినప్పుడు జరిగిన విషయం వా రొకసారి చెప్పారు. మద్రాసుప్రభుత్వం కార్యనిర్వాహకసంఘం సభ్యులుగా అధికారాన్ని చెలాయించి, తర్వాత

గవర్నర్‌గా నియమింపబడిన ఉస్మాన్ సాహెబ్‌గారు బి. ఎ. క్లాసులో ఉండగా, అబ్దుల్ ఖాదర్‌గారు ఐదవ ఫారంలోనో, ఆరవ ఫారంలోనో ఉండేవారట. ఖాదర్‌గారు వరుసక్రమంగా పరీక్షల్లో ఉత్తీర్ణులై బి. ఎ. డిగ్రీ పరీక్షలో ప్యాసైన తరువాతకూడ, వారింకను బి. ఎ. పూర్తి చేయలేదట. ఉస్మాన్ సాహెబ్‌గారు ప్రముఖ యునాని వైద్యకుటుంబానికి చెందినవారు. సంపన్నులు. ఖాదర్‌గారు సామాన్యకుటుంబంలో జన్మించి సామాన్య ఆర్థిక స్తోమతుండినవారు. వారిద్దరి గృహాలు దగ్గరగా ఉండేవట. ట్రిప్లికేన్లో పెద్దలు కోరగా అబ్దుల్ ఖాదర్‌గారు ఉస్మాన్ సాహెబ్‌గారికి పాఠాలు బోధించి, వారు (ఉస్మాన్ సాహెబ్‌గారు) బి. ఎ. ప్యాస్ అవటానికి తోడ్పడ్డారట. చదువులో అంత మందకొడిగావుండిన ఉస్మాన్ సాహెబ్‌గారు రాజకీయాల్లో బాగా రాణించి, ఆ రోజుల్లో మద్రాసువంటి పెద్దరాష్ట్రానికి గవర్నర్ పదవిని అధిష్ఠించగలిగారు. విద్యావంతుడు, విషయజ్ఞానధురీణుడు అబ్దుల్ ఖాదర్‌గారు కాలేజి ప్రొఫెసర్‌గా జీవితం గడపవలసివచ్చింది. అదృష్టానికి చాలిన దేముంది?

1922 డిశెంబరు ఆఖరుకు నేను ఇల్లు విడిచి ఇంచుమించు రెండున్నరసంవత్సరాలైంది. ఇంటివద్ద డబ్బు ఇబ్బంది వచ్చింది. ఎంతిపంపినా, ఇంకా పంపండని వ్రాసేవాడను. పైగా మూడు సంవత్సరాలకు చదువు పూర్తిచేసుకొని ఇంటికి తిరిగివస్తానని చెప్పి వచ్చాను. కాని రెండున్నర సంవత్సరాలైనా ఎంతవరకు చదివింది, ఎప్పుడు చదువు పూర్తిఅయ్యేది ఇంటివద్ద మావాళ్ళకు అంతుపట్టలేదు. అందువల్ల 1923 జనవరిలో ఆందోళన వ్యక్తపరుస్తు ఉత్తరాలు వచ్చేవి. మేనమామ త్రిపురనేని రామశాస్త్రులుగారినుండి 1923 జనవరి 3-వ తారీఖున ఉత్తరం వచ్చింది. తమ్ముడు సత్యనారాయణనుండి 4-వ తారీఖున జాబు వచ్చింది. ముఖ్యంగా తమ్ముడు "ఇంకా ఎంతకాలం అక్కడుంటావ్? ఇంకెంత డబ్బు కావాలి? డబ్బుకు ఇబ్బంది పడుతున్నాం". అని ఆందోళనతో వ్రాశాడు. ఇది చదివిన తర్వాత నా మనస్సు మనస్సులో లేదు. ఎంతో బాధపడ్డాను. ఒకసారి ఇంటికి వెళ్లి నాన్నగారిని, తమ్ముళ్లను, పినతల్లిని చూచి

సంగతి సందర్భాలు తెలుసుకోనివద్దాం అనే భావం కలిగి 13-వ తారీఖున గట్టిగా వెళ్లివద్దాం అని నిశ్చయించుకొన్నాను. ఆ రోజునే మా నాన్నగారికి "జులైలో ఇంటికి వస్తా"నని వ్రాశాను.

మాకు వేసవిసెలవులు నాలుగు మాసా లుండును. పోను రాను గాక రెండున్నర మాసాలైనా స్వదేశంలో ఉండవచ్చును. 1923 జూనులో ప్రథమపరీక్ష లైనతర్వాత, జూను చివరివారంలో ఆక్స్‌ఫర్డ్‌లో నుండిన బెల్ అన్డ్ కంపెని నుండి యస్. యస్. చైనాలో ప్రయాణంచేయటానికి టిక్కెట్టు కొన్నాను. జూలై 2-వ తారీఖున లండన్‌కు వెళ్లి 3-వ తారీఖున భూషన్ అనేవారి ఆఫీసుకు వెళ్లి సి. వి. రావు (చెలికాని వెంకట్రావు) గారిని కలసికొని, 5-వ తారీఖున లండన్‌నుండి బైలుదేరి, 6-వ తారీఖున మార్సెల్సులో యస్. యస్. చైనా అనే ఓడ నెక్కాను.

యస్. యస్. చైనా యస్. యస్. కాశ్మీర్‌కంటె చాలా పెద్దది. నావంటివారు ప్రయాణంచేసే రెండోక్లాసులో ప్రయాణం చేశాను. రెండోక్లాసులో ప్రయాణంచేస్తున్న దేశీయులు అభ్యంకర్, బతీజ లను కలసికొన్నాను. మేము ముగ్గురం జట్టుగా ఉండేవారం. మా క్లాసులో ఇతర ఇండియనులు లేరు. మొదటి క్లాసులో కుమారి ఇందిర భగవత్ ఉండినారు. ఆమె ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిని. ఇందూరు మహారాజా కుటుంబానికి చెందినవారు. సుగుణవతి, స్నేహశీలి. మర్యాదస్తురాలు. ఆమె మొదటి క్లాసులో ప్రయాణంచేస్తుండినది. ఆమెను ఒకటి రెండు సార్లు మొదటిక్లాసు డెక్‌మీద కలసికొన్నాను. మర్యాదకు ఒకసారి మా రెండోక్లాసుకు వచ్చింది. ఆమెకు నేను కొనిఉండిన బొమ్మల కార్డులు చూపాను. ఆమె ఫొటో తీశాను. అభ్యంకర్, బతీజ, నేను కలసి ఫొటోలు తీసుకొన్నాం.

శ్రీ బతీజ సింధుదేశీయుడు. ఏదో వ్యాపారం చేస్తుండే వాడు. శ్రీ అభ్యంకర్ క్రిస్టియన్ మిషనరి. సి. యమ్. యస్. మిషన్‌కు చెందినవాడు. మా బందరు నోబుల్ కళాశాలకూడ సి. యమ్. యస్. (క్రైస్ట్ మిషన్ సొసైటీకి) కి చెందిందే. అందు

వల్ల ఆయనంటే నా కెక్కువ అభిమానం కల్గింది. ఆయనగారు ఇంగ్లండులో మిషనరి సంబంధమైన తర్ఫీదును పొంది ఇంటికి తిరిగి వస్తుండినారు. రివరెండు హోదాను పొందారు.

పోర్టు సెడ్ దాటి, సూయెజ్ కెనాల్లో ప్రయాణంచేసి, ఏడెన్ చేరి అరేబియా సముద్రంగుండా బొంబాయికి 20-7-1923-వ తారీఖు ఉదయం ఆరు గంటలకు అనగా పదునాలుగు రోజులకు చేరుకొన్నాం. ఏడెన్ వరకు ప్రయాణం మిక్కిలి సుఖప్రదంగా ఉండింది. ఏడెన్ 15-వ తారీఖు ఉదయం చేరాము. మూడుగంటల తర్వాత అరేబియా సముద్రం ప్రవేశించాము. అక్కడినుండి నాకు సముద్రం జబ్బు ఆరంభించింది. ఒకరోజంతా పడకమీదనే, కొద్దిగా తిన్నాను. తరువాత కొంత మొండికేసి, కొంత అలవాటు పడి, మధ్యమధ్య గదిలో ఉండిపోయినా, మొత్తంమీద డెక్ మీదకు వెళ్లటం, భోజనశాలకు వెళ్లటం జరిపాను. సముద్ర యానం దేహానికి ఆరోగ్యమిస్తుంది. శరీరంలోని పిత్తాన్ని, వాతాన్ని హరిస్తుంది. కఫాన్ని బైటికి వెళ్లగ్రక్కుస్తుంది. దొంద శరీరం కలవాళ్ల శరీరం తగ్గి తేలికవుతుంది, గట్టిపడుతుంది. కఫం పోయి కంఠధ్వని స్వచ్ఛమౌతుంది. మొదట 1920 ఆగస్టులో ప్రయాణంచేసినప్పుడు వారం రోజులు కక్కుతూ పడకమీదనే ఉండిపోయానని పైన చెప్పాను. దానితో సగం తగ్గి చలాకీ వచ్చింది. ఇంగ్లండులోని అప్పటికి ఉనికి రెండున్నర సంవత్సరాలైనందున శరీరం ఊబగా ఉండలేదు. వాతం, పిత్తం, కఫం చాలా తగ్గియున్నది. అందువల్ల ఒక్కరోజుమాత్రమే గదిలో ఉంటిని.

బొంబాయి చేరుకోగానే శ్రీ బతీజ, మావద్ద సెలవుతీసుకొని వెళ్లిపోయారు. రివరెండు అభ్యంకర్ గారు, నేను సి. యమ్. యస్. వారి ప్రొక్టర్స రోడ్డులో వున్న కట్టడానికి వెళ్లాం. వెంటనే నేను రైల్వే హోటల్‌కు వెళ్లాను. డబ్బు అయిపోయినందున "వెంటనే రూ 100 లు పంపం" డని ఇంటికి టెలిగ్రాం పంపాను. మానాన్న త్వరగానే డబ్బు పంపారుగాని పోస్టాఫీసుకు సెలవగుట చేతను, బొంబాయి అడ్రసు అసంపూర్తిగా ( కోడ్ అడ్రస్సుఅట )

ఉండటంచేతను నాకు డబ్బు చాలా ఆలస్యంగా అందింది. అందువలన నేను న్యూనతకు, ఆకలికి లోనుగావలసివచ్చింది. రివరెండు అభ్యంకర్‌ను డబ్బు అడుగగా మొట్టమొదట అర్ధరూపాయి ఇవ్వబోయాడు. నా వాచిని కుదువబెట్తాననగా మొదట రూ. 3 లు తరువాత ఇంకొక రూ. 2 లు ఇచ్చాడు. అవిచాలక ఒక్క అరటిపండ్లు, మంచి నీళ్లతోనే పొట్టనింపుకొన్నాను. విశేషమేమనగా చేతిలో డబ్బు తక్కువగా ఉన్నా, బొంబాయి చేరిన మర్నాడు 21-వ తారీఖున కొన్ని బొమ్మల కార్డులను కొన్నాను. అప్పట్లో బందరులో నుండిన ప్రసిద్ధ హోటల్ తాజ్‌మహాల్ కు గీటే అనే వారితో కలసి తినటానికి వెళ్లాను. ఆ మర్నాడు చేతిలో దమ్మిడీ లేకపోగా రివరెండు అభ్యంకర్‌ను చేబదు లడిగాను. అప్పుకగటం, ఇంటినుండి డబ్బు రాకపోవటం నన్ను బికారినిగా ఎంచి రివరెండు అభ్యంకర్ న్యూనతతోను, అసూయగాను చూడటం మొదలుపెట్టాడు. అతనికి నేను భారం అనిపించింది. పైగా ఇంగ్లండులో తరిఫీదు పొంది తిరిగివచ్చిన ఘనుడని, అతనికి జరిగే సన్మానాలలో నేను అడ్డుపుడకనుగా ఆయనకు తోచియుండవచ్చును. నా కెంతడబ్బు లేకపోయినా నేను ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిననే ధీమాతోనే ఉంటిని. ఆయనగారు ఎంత ఇంగ్లండు వెళ్లివచ్చినా, సామాన్యచదువు చదువుకొన్న ఇండియన్ ఫాదిరి. అసూయకు తావు లేకపోలేదు. బొంబాయికి డబ్బు చేరిందని తెలిశాక, ఒకటి రెండురోజులకుగాని జోషిఅనే వారి సాయంతోగాని నాకది 26-వ తారీఖునగాని అందలేదు. అందిన సాయంత్రం ఇంటికి బైలుదేరాను. 'డబ్బు లేకపోతే డుబ్బుకుపనికిరా'డనే సామెత సార్థకమైంది. వృథాగా వారం రోజులు కష్టనిష్టూరాలకు లోనై పరాయిచోట గడపవలసివచ్చింది.

వాడి, సికింద్రాబాద్ మీదుగా బెజవాడకు 27-వ తేదీ తెల్లవారుఝామున 4-30 గంటలకు వచ్చాను. నాతమ్ముడు వగైరా స్టేషనులో నన్ను కలసికొన్నారు. నేను వెంటనే రైల్లో బైలుదేరి 28-వ తేదీ ఉదయం గుడివాడకు చేరుకొన్నాను. నా మేనమామ, కొంతమంది బంధుమిత్రులు నాకు గుడివాడ రైల్వేస్టేషన్‌లో స్వాగత మిచ్చారు. ఇంగ్లండునుండి తీసుకొని

వచ్చిన పెట్టెలు బేడలతో ఇంటికి వచ్చేశాను. చదివినా చదవక పోయినా చాలా పుస్తకాలు, ఉండేది కొద్దికాలంఅయినా సంవత్సరాలుండేటట్లుగా పెద్ద పెట్టెలనిండా బట్టలతో వచ్చాను. గుడివాడ రైల్వేస్టేషనులో రూ. 25 లు అదనం లగేజి ఛార్జి చెల్లించవలసివచ్చింది. దీనిని దుబారా అనండి, అతి జాగ్రత్త అనండి, ప్రయాణాలకు ఎక్కువబట్టలు వగైరా తీసుకొనివెళ్ళే పద్ధతి నా ఉద్యోగకాలంలోనేకాదు ఇప్పటికిని వున్నది.

నే నింటికి చేరుకొన్న కొన్నినిమిషాలకు మా తండ్రిగారు పొలంనుండి తిరిగివచ్చారు. నేను మిక్కిలి సంతోషంతో వారిని కౌగిలించుకొన్నాను. వారు సంభ్రమాశ్చర్యములకు లోనైనారు. కొంత ఎబ్బెట్టుకలిగినట్లు నాకు తోచింది. మా లింగం కుటుంబంలో తండ్రులు కుమాళ్లు చనువుగా ఉండేవారుకాదు. నిజానికి తండ్రుల ఎదుట కొడుకులు ముఖాముఖి నిలుచోటంగాని, ఎదురుగా వెళ్లటంగాని ఉండేదికాదు. తండ్రు లెదురుగావస్తుంటే, కుమాళ్లు ఏ ప్రక్క సందుకో, ఇంటికో తప్పుకొనేవాళ్లు. తండ్రులు వచ్చి బూతులుతిట్టినా కిక్కురుమనేవాళ్ళు కాదు. అంతగా కష్టంతోస్తే ఎవరితోనో సణిగేవాళ్ళు. అట్టి పరిస్థితుల్లో, తలవనితలంపుగా నేను పాశ్చాత్యపద్ధతిని వారిని కౌగిలించుకొనటం వారికి ఎబ్బెట్టుగా తోచటం ఆశ్చర్యకరంకాదు. అయినా నాయందుండే ప్రేమాభిమానాలచేత వారి హృదయం సంతసించి వుంటుంది.

బంధువులు, స్నేహితులు ఊళ్లోనివారు వచ్చి చూచారు. ఆమాట ఈమాటా మాట్లాడారు. ఇంగ్లండు వింతలు విశేషాలడిగారు. ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారుకాని, వారి అనుమానాలను వెల్లుబ్బనివ్వలేదు. శ్రీ బొల్లిని నారాయణస్వామినాయుడు, శ్రీ చలసాని సత్యనారాయణవంటి పెద్దలు, శ్రీ దుగ్గిరాల రాఘవ చంద్రయ్యచౌదరి, శ్రీ మొవ్వని లక్ష్మీనారాయణవంటి బంధు మిత్రులు వచ్చి చూచి సంతోషించి వెళ్లిపోయారు. అప్పుడు తన థీసిస్ కొరకు ఇండియాకు వచ్చియుండిన శ్రీ రంగా ఆగష్టు 1-వ తేదీ రాత్రి 10 గంటలకు వచ్చి, మర్నాడు వెళ్లిపోయారు. వారు వస్తానని ముందు వ్రాయగా ఎదురుచూస్తుండినాముకాని, అవాంతరాలవల్ల వారు పెందలకడనే రాలేకపోయారు. ఊళ్లోని జ్ఞాతులను,

ఇతర బంధువుల ఇండ్లకు వెళ్లి స్త్రీ పురుషులను పలకరించాను. గుట్టుగల కమ్మకుటుంబాల్లో, ఆ రోజుల్లో పెదతండ్రి పినతండ్రి, పెత్తల్లి పినతల్లి కుమార్తెలు అక్క-చెల్లెళ్లవరసవారుకూడా, ఎదుటబడి మాట్లాడేవారుకాదు. ఏ తలుపుచాటునో, ప్రక్కగానో ఉండి మాట్లాడేవారు. అన్నదమ్ముల భార్యలు మరీ పెద్దవయస్సు వారు కాకపోతే కన్పడేవారేకాదు. నే నింగ్లండులో స్త్రీలతో చనువుగా మెలగినవాడనై నందున, ఆ దేశాచారాలు కొంత వంట బట్టినవి. అదివరకుకూడా, బంధువుల ఇండ్లకు వెళ్లినప్పుడు ఇంటిస్త్రీలతో మాట్లాడే అలవాటు నాకు ఉండినది. అది మరింత గట్టిపడింది. మా మూడో పెదతండ్రి మూడవకుమారుడు సత్యనారాయణగారింటికి ఇతర పెదతండ్రుల ఇంటికి వెళ్లినట్లే వెళ్లాను. ఆయనభార్య శ్రీమతి రంగనాయకమ్మ నా బందరు స్నేహితుడు, కొతరం బొబ్బా వెంకట్రామయ్యగారి కుమారుడు శివాజి చెల్లెలు. ఆ విశేషంవల్లకూడా ఆమెను పలకరించాలను కొన్నాను. ఆమె సత్యనారాయణగారి మూడవ భార్య కాబట్టి ఇంకను పిన్నవయస్సులోనే ఉన్నది. ఆమె సిగ్గుపడి లోపలికి పోయింది. అయినా నేను ఆమెవెంట లోనికి వెళ్ళి చూచి పలకరించి వచ్చాను. ఆమె భర్త సత్యనారాయణ నవ్వుచూ నావెంట వున్నాడు. భర్త, విన్నవారు కొంత చకితులైనా, నాచర్య పాశ్చాత్యానుభవప్రభావమని సరిపెట్టుకొన్నారు. ఇతర ఇండ్లలోకూడా స్త్రీలను పలకరించంది, వారితో మాట్లాడంది ఆ ఇళ్లు విడిచిరాలేదు. ఇప్పుడుకూడా నేను స్త్రీలను పలకరించ కుండా ఉండనని, క్రొత్తచోట్ల కూడా గృహిణుల ఆతిథ్యానికి కృతజ్ఞత తెల్పకుండా ఉండనని అందరికి తెలిసిందే.

బంధువులవూళ్లకు, స్నేహితులవూళ్లకు తిరిగాను. గుడివాడలో, శ్రీ అడ్డుమిల్లి గోపాల కృష్ణయ్యగారిని, డాక్టర్లు సుబ్రహ్మణ్యం, శివరావు గార్లను, వల్లూరిపల్లి వెంకటరత్నంగారి వంటి ఇతర బంధువుల ఇండ్లకు వెళ్ళి చూచాను. రామనపూడి మా నాల్గో పెదతండ్రి కుమారుడు సీతారామాంజనేయులు, మా మూడో పెదతండ్రి కుమార్తె సీతారత్నం ఇండ్లకు వెళ్లాను.

నా మేనమామలు, పినతల్లు లున్న అంగలూరుకు వెళ్లాను. మా పినతాత కుమారుడు నాగభూషణంగారు, మా ఆరో పెదతండ్రి కుమారుడు వీరభద్రుడుగారు నడిపే రైస్ మిల్లుకు వెళ్ళి వా రేసందర్భంగానో చేసిన పెద్ద పులావ్ విందులో పాల్గొన్నాను. దగ్గరనున్న నూజెళ్లకు వెళ్ళి నా సహాధ్యాయి, నా పెదతండ్రి అల్లుడు శ్రీ పర్వతనేని వెంకటరత్నాన్ని, నా పక్షకుని చెల్లెలు శ్రీమతి ఈశ్వరమ్మను, ఆమె భర్త శ్రీ పర్వతనేని గోపాలకృష్ణయ్య గారిని చూచాను. చౌటపల్లి వెళ్ళి నా మూడో పినతల్లి అట్లూరి శేషమ్మగారిని, ఆమె భర్త వెంకటప్పయ్యగారిని, ఆమె మరది వెంకట సుబ్బయ్యగారిని, ఆమె తోడికోడలను చూచి ఆనందించాను. మిత్రులు శ్రీ సూరపనేని కాకుళయ్యచౌదరి, శ్రీయుతులు మల్లికార్జునరావు, బాపనయ్య, అట్లూరి రామయ్య వగైరాలతో కొంత కాలక్షేపంచేశాను.

ఒకరోజు ఉదయం గుడివాడలో న్యాయవాదిగానుండిన శ్రీ నార్ల వెంకట సుబ్బయ్యగారింటికి వెళ్లాను. వారు మిక్కిలి సరసులు, పెద్దమనిషి. వారు నేను వెళ్లినప్పుడు స్నానంలో వున్నారు. వారి ఆఫీసువద్ద కూర్చొన్నాను. అక్కడి ప్రక్క బల్లమీద కొన్ని విద్యార్థిపుస్తకా లుండినవి. ఒక దానిని తీయగా అది కాంపోజిషన్ పుస్తకమైంది. కాంపోజిషన్ ఇంగ్లీషులో వున్నది. చదువగా బాగా వ్రాసినట్లు తోచింది. ఇంటిలోనుండి ఒక పిల్లవాడు రాగా "ఎవరువ్రాసిం" దని అడిగాను. "నేనే" నన్నాడు. అభినందించి "నీపేరేమి" టని అడిగాను. "నార్ల వెంకటేశ్వరరా" వన్నాడు. ఆ కుర్రవాడే ప్రసిద్ధ పత్రికా సంపాదకుడుగా, రచయితగా, మేధావిగా రూపొందుతాడని నేను ఎంచిఉండలేదు.

ఈ ప్రస్తావన విడిచిపెట్టకముందు ఒక విషయం చెప్పాలి. నేను ఇంగ్లండులో తరచు షికార్లకు కాలినడకమీద వెళ్లుచుండే వాడను. కమ్నర్ హిల్లు వంటి గుట్టప్రదేశాలకు ఎక్కేవాడిని. అందువల్ల నా నడక వడిగా తయారైంది. నేను విసురుగా నడవటం చూచి నా బంధుమిత్రులు ఆశ్చర్యపోయేవారు. నాతో సమానంగా నడవటానికి ప్రయాసపడేవారు. అయితే మా తండ్రి

గారుకూడా మిక్కిలి వడిగా నడచేవారు. వారు త్వరగా నడుస్తూ వస్తూ ఉండటంవల్ల దూరంలో చూచి పొలంలోని నౌకరులు "అదిగో రైలింజను వస్తున్న" దనేవారు.

ఎవరెవరో వచ్చారుగాని నా భార్య రాలేదు. ఆమె, ఇద్దరు బిడ్డలు పెడసనగల్లులోనే ఉండిపోయారు. అర్ధాంగి అయిన భార్య, దూరదేశమునుండివచ్చిన భర్తకు, భర్త యింటిలో స్వాగతం ఇవ్వటం, బిడ్డలను అతని దగ్గరకు చేర్చటం మామూలుధర్మం. అయితే వ్యక్తిత్వమేగాక ఇంగితంకూడా లేని నా భార్య తల్లి, అక్క దుర్బోధలకు లోనైపోయింది. నా షడ్డకుడు సత్యనారాయణ నే నింటికిచేరుకొన్న ఆరు రోజులకు వచ్చాడు, పెడసనగల్లు వెళ్దాం రమ్మని. ఆ మర్నాడు పాపిసీడుగారిచ్చిన జట్కాలో పెడసనగల్లుకు బైలుదేరాను. సత్యనారాయణ గుడివాడలో మిగిలిపోగా, అతని తమ్ముడు నాగభూషణం నాతో పెడసనగల్లు వచ్చాడని జ్ఞాపకం. (సత్యనారాయణ నా పెదతండ్రి మనుమడని పైనచెప్పాను.) మేము తొమ్మిదిమైళ్లలోవున్న పామర్రు చేరుకొని, అడ్డదారిని ఇంకా మూడు, నాలుగు మైళ్ల దూరంలోవున్న ఐనంపూడికి చీకటిలో నడిచి వెళ్లాం. అక్కడ రెండెడ్లబండి కాచుకొని వుండింది. ఆ బండెక్కి ఏ తొమ్మిదిగంటలకో 3-8-1923 రాత్రి పెడసనగల్లుకు చేరుకొన్నాం. మామూలు మర్యాదలైనతర్వాత, నిద్రించుచుండిన నా కొడుకు పూర్ణచంద్రరావును, నా వదినె మూడో కొడుకు పూర్ణచంద్రరావును చూపించి, ఈ ఇద్దరిలో మీ అబ్బాయి ఎవరో చెప్పమని అక్కడివా రన్నారు. నాకొడుకు ఎరుపురంగువాడు, వదినెకొడుకు నలుపురంగువాడు. ఎర్రవాడు నల్లవానికంటె పెద్ద. అయినా ఎందుకో భ్రమపడి నల్లవానిని చూపించాను. కిరసనాయలు లాంతరుదీపం అగుటవల్ల సరిగా కనపడకనో, లేక వాని అకాలమరణాన్ని సూచించేవిధమో నా కొడుకును గుర్తుపట్టలేకపోయాను. అయితే నే నింగ్లండు వెళ్లుటకు వానిని బొమ్ములూరులో 1920 ఆగస్టు 1-వ తారీఖున విడిచిపెట్టినప్పుడు వాని వయస్సు సంవత్సరముపైన వారంరోజులే. నేను పదకొండురోజులు పెడసనగల్లులో వుండి 15-8-1923 తారీఖున బొమ్ములూరుకు వచ్చివేశాను. తిరిగి పెడసనగల్లుకు

వెళ్ళినట్లు గుర్తులేదు. నా భార్య, బిడ్డలు బొమ్మలూరుకు వచ్చి కొన్నిరోజులుండి వెళ్ళిపోయారు. నే నింగ్లండుకు తిరుగుప్రయాణ మైనప్పు డుండినానో లేనో నాకిప్పుడు గుర్తులేదు. భార్యాభర్తలకు సామరస్యం తక్కువగా ఉండినందున ఇట్లనవలసివచ్చింది.

పెడసనగల్లులో నన్నాదరిస్తూవుండే నా భార్య మూడో మేనమామ చెరుకూరి లక్ష్మీపతిగారి భార్య, మద్రాసు కమ్మ హాస్టల్ మానేజరుగా జీతభత్యంలేకుండా మాకు తోడ్పడిన పల్లెంపాటి రామకృష్ణయ్యగారి సోదరి శ్రీమతి వియ్యమ్మ పిన్నిగా రప్పుడక్కడ లేదు. భర్త, నే నింగ్లండుకు వెళ్లిన సంవత్సరం లోపుగానే చనిపోయాడు. మనోవర్తి విషయంలో తగాదా కోర్టుకెక్కింది. ఈమె పెడసనగల్లు విడిచి, చెల్లెలు రత్తమ్మగారింటికి గరికపర్రు వెళ్లిపోయింది. నేను స్నేహంగా వుండిన కొందరు దాటిపోయారు. మాపెద్దత్త భర్త సూరపనేని శోభనాద్రిగారి కుమారుడు వీర రాఘవయ్యగారు పూర్వంవలె రాకపోకలు తగ్గించారు. అయినా ఆయనతో నాకు చనువు తక్కువ. స్వార్థపరత్వంతో సర్వం తమదిగా వదినె, షడ్డకుడు చేసుకొని, ప్రబలి ఉన్నారు. ఇక నేను పెడసనగల్లుకు రెండోసారి వెళ్లటం అనవసర మనిపించింది.

అక్కడక్కడ కాలక్షేపంచేశాను. తిరుగుప్రయాణంరోజులు సమీపిస్తుండినవి. ఈలోగా మే మందరం ఏ వూరుకో పెళ్లికివెళ్లిన రాత్రి, నాపడకగదికి కన్నంవేసి నాతోలుపెట్టెను (సూట్ కేసును) పగులదీశారు. నేను ఉదయంవచ్చి చూచుకొనేటప్పటికి పెట్టె తెరచివున్నది. బట్టలు పోలేదుకాని నే నాక్స్‌ఫర్డ్‌లో కొన్న తిరుగుప్రయాణంటిక్కెట్టు పోయింది. తిరుగుప్రయాణం టిక్కెట్టొక్కటే పోవటం, అనుమానాస్పదంకదా. నేను తిరిగి ఇంగ్లండుకు వెళ్ళకూడదని, టిక్కెట్టు పోతే వెళ్లనని తలంచిన అనాలోచిత దుష్టులెవరో చేసియుందురు. అసూయాపరులైన బంధువులు చేసిన ప్రయత్నమిది అని తలంచాను.

నేను బందరుకు వెళ్లినప్పుడు, శ్రీకాతా శ్రీరామశాస్త్రి గారిని చూడటానికి వారింటికి వెళ్లాను. ఆ ఇంటిపేరు "సరస్వతి నికేతన్", వారప్పుడు తెలుగులో 'శారద' అనే సచిత్ర మాస

పత్రికను నడుపుచుండిరి. ఇంగ్లండునుండి తెచ్చిన జర్నల్స్ ఏవైనా ఉంటే పంపండని కోరారు. నేను 12 పంపాను. అవి రామయ్యగారిద్వారా అందినట్లు, సంతోషిస్తూ 12-9-1923 న ఉత్తరం వ్రాశారు. ప్రియమిత్రులని సంబోధిస్తూ, ఆక్స్‌ఫర్డ్ కాలేజి మొదలగు విషయాలు వ్రాసి పంపటం మూలంగా 'శారద' ను పోషించాలని కోరారు. సంతకం ఇట్లు విధేయుడు కౌతా రామ శాస్త్రి అని చేశారు. సంబోధన వారి ఆప్యాయతకు, ముగింపు వారి సుగుణానికి తార్కాణం.

టిక్కెట్టుకొరకు బొంబాయిలోని మెకిన్ సన్ కంపెనీకి 24-9-1923 న వ్రాసి, ఆ రోజున, ఇంపీరియల్ బ్యాంకు ఏజెంటు హెక్టర్ గారితో మాట్లాడటానికి బందరు వెళ్ళాను. ఆరోజుల్లో బ్యాంకు తెల్లఏజెంటుకూడా తాను గొప్పఉద్యోగి ననుకొనేవాడు. హెక్టర్ గారు పెద్దసుముఖంగా మాట్లాడలేదుకాని వెళ్లినపని చేసుకువచ్చాను. బొంబాయి రేవునుండి 6-10-1923 తారీఖున బైలుదేరే స్టీమరులో రెండోక్లాసు రిజర్వుచేయండని 44 ఇంగ్లీషు పౌన్లు డిపాజిట్ చేశాను.

నేను తిరుగుప్రయాణం ప్రయత్నంలో ఉండగా, మా నాన్నగారు ఇంతటితో విద్య పూర్తయి, తిరిగి వెళ్లనవసరం లేకపోతే బాగుండేదని, ఒకటి రెండు సార్లు అనుకొన్నారు. నా తమ్ముడు, బంధుమిత్రులు అలాగే తలంచారుకాని నేను వెళ్లటం తప్పలేదు.

1923 అక్టోబరు 3-వ తారీఖు సాయంత్రం కొందరు బంధుమిత్రుల వీడ్కోలుతో, బొమ్మలూరు విడిచిపెట్టి బెజవాడ మీదుగా బొంబాయిచేరాను. బెజవాడలో మిత్రుడు శ్రీ మెర్నేని లక్ష్మీనారాయణ, ఆయన సతీమణి శ్రీమతి నాగభూషణమ్మ నన్ను బొంబాయికి అనుసరించారు. వారు, వారివద్దకుడు శ్రీ గుత్తా రామబ్రహ్మంగారు, వారి భార్య (నాగభూషణమ్మగారి అక్క) నాకు బొంబాయిరేవు బాల్లార్డ్ పియర్ వద్ద 6-వ తారీఖున వీడ్కోలిచ్చారు. గుత్తా రామబ్రహ్మంగా రప్పుడు బొంబాయి

కార్పొరేషన్‌లో, ఎలక్ట్రిక్ డిపార్ట్‌మెంటులో ఉద్యోగి. నేను పి. అన్డ్ ఒ. స్టీమరు యస్. యస్. ఢిల్లీ ఎక్కాను. 11-వ తారీఖున ఏడెన్ చేరి, చాలాపెద్దది, మంచి వసతులు కలది, యస్. యస్. మాల్‌డేవియా ఓడకు ప్రయాణీకులం మారాము. 15-వ తారీఖున పోర్ట్ సెడ్ కు చేరాము. ఓడమీద, జెనీవాలో జరుగబోవు లీగ్ ఆఫ్ నేషన్సు ఇన్‌టర్ నేషనల్ లేబర్ కాన్ఫరెన్సుకు ఇండియా ప్రభుత్వం ప్రతినిధి, బెంగాలివారు శ్రీ కె. సి. రాయ్‌చౌధురిగారిని. ఆస్ట్రేలియాప్రభుత్వ ప్రతినిధి ఒ. జె. హాలోవెగారిని కలుసుకొన్నాను.

ఓడ మధ్యాహ్నం దాటినతర్వాత రేవు చేరుకొంది. యథాప్రకారం ఓడ అక్కడ కొన్నిగంట లుండునుకదా. ప్రయాణీకులం పట్టణంలోకి వెళ్ళాం. అక్కడక్కడ తిరుగుచు, అవిఇవి చూస్తూ, కొంటూఉండగా, సాయంత్రమయింది. ఓడకు చేరుకొనటానికి ఇంకా ఒకటిన్నర గంట వుండనగా, శ్రీ కె. సి. రాయ్‌చౌధురిగారు బజారులో ఎదురైనారు. నేను నలుగురైదు గురు భారతీయులు (వారిపేర్లు వగైరా గుర్తులేదు) కలసి తిరుగు చుండినాము. రాయ్‌చౌధురిగారు మా దగ్గరకువచ్చి మీకొక తమాషాను చూపుతాను రండని వెంటబెట్టుకొని తీసుకొని వెళ్లారు. వా రనేకపర్యాయాలు ఇంగ్లండు మొదలైన దేశాలు తిరిగి వుండినారు. పోర్టు సెడ్ టవును వారికి బాగా తెలిసినట్లుంది. సందులు గొందులు త్రిప్పారు. ఒకటి రెండుచోట్ల మమ్ములను బైటవుంచి లోపలికి వెళ్లి తిరిగివచ్చి అక్కే ఇక్కడ బాగా లేదని చెప్పి ఇంకోఇంటికి తీసుకొనివెళ్లారు. అది లంజల గృహం. యజమానురాలు వచ్చి మమ్ములను లోపలికి తీసుకొని వెళ్ళింది. అక్కడ ఏడెనమండుగురు స్త్రీలు, కొందరు పడుచు వారు, మరి కొందరు నడివయస్సువారు కూర్చుండిఉండినారు. వాళ్లు భిన్నభిన్న జాతులకు చెందినవాళ్లు. భిన్నభిన్న, దుస్తులతో అలంకరణతో వుండినారు. వారిలో నీగ్రోజాతిమిశ్రమం, ఆసియా జాతిమిశ్రమం, శ్వేతజాతిమిశ్రమం కలవాళ్ళు, నలుపు, పసుపు, తెలుపు రంగులతో వికారంగా కన్పడినారు. మచ్చుకైనా అందమైన యువతి మాకు కన్పడలేదు. అది చాలా తక్కువ

స్థాయిగల వ్యభిచారగృహం. శ్రీ చౌధురి వంటి రాజకీయవేత్త, ఇండియా ప్రభుత్వప్రతినిధి మమ్ములను, లంజలగృహాలకు తీసుకొని వెళ్తాడని ఊహించియుండలేదు. మేము మిక్కిలి సంభ్రమాశ్చర్యములకు, ఆందోళనకు లోనైనాము. చీకటిపడింది. ఎక్కడ స్టీమరు దాటిపోతుందో అనే భయం. త్వరగా బైటపడి త్వర త్వరగా నడచిపోయాం. మాకు ముందుగా తెలిసి, పిల్లలు అందమైనవాళ్ళయితే, షైముంటే, మాలో ఒకరిద్దరైనా మంచి అవకాశం కల్పించినందుకు శ్రీ రాయ్‌చౌధురిగారికి కృతజ్ఞత తెలిపేవారం.

ఓడ 20-వ తారీఖున మార్సైల్సు చేరుకొంది. అక్కడ దిగి, కె. సి. రాయ్‌చౌధురిగారు, ఒ. జి. హాలోవెగారు కాన్ఫరెన్సుకు జెనీవాకు వెళ్ళిపోయారు. నేను రాత్రి 7-35 గంటలకు రైలెక్కి పారిస్‌నగరానికి వెళ్లాను. శ్రీ యస్. కె. దాస్, శ్రీ యస్. బి. సిన్హా అనే ఇండియనులు, నేను కలసి ప్రయాణం చేశాము. మరునాడు ఉదయం 9-30గంటలకు పారిస్ నగరం చేరాము. మేము పారిస్‌లో ఆగలేదు. వెంటనే రైల్లోకి చేరి, ఇంగ్లీషు ఛానల్‌ను స్టీమరులో దాటి, రాత్రి 7-35 గంటలకు లండన్ విక్టోరియా స్టేషన్‌కు చేరుకొన్నాం. శ్రీ దాస్ స్నేహితుడు వచ్చాడు. మేము ముగ్గురం 21, క్రామ్‌వెల్ రోడ్డుకు టాక్సీలో వెళ్లాం. అది ఇండియన్ విద్యార్థులకొరకు ఇండియా ప్రభుత్వం పర్యవేక్షణక్రింద నడుపబడుచుండిన వసతి గృహం. అక్కడ వార్డన్‌గాఉండిన బౌనర్జిగారు మాకు అల్పాహారాన్నిచ్చి పడుకొనటానికి పెద్దగదిచ్చారు.

22-వ తారీఖు ఉదయం, పి. అన్డ్ ఒ. డబ్బు మారకం కార్పొరేషన్‌లో డ్రాఫ్టు మార్చుకొని, శ్రీ సిన్హా, నేను కలసి ఎవరింటికి వారు క్షేమంగా చేరుకొన్నామని కేబుల్సు ఇచ్చాం. నేను ఆదరాబాదరా పాడింగ్‌టన్ స్టేషన్‌లో రైలెక్కి, ఆక్స్‌ఫర్డ్‌కు చేరుకొన్నాను. సామానులు మిసెస్ హార్‌బడ్ ఇంటిలో పెట్టి, 36 ఎసెక్సు రోడ్డులో వుంటున్న శ్రీకృష్ణ వద్దకు వెళ్లాను. అక్కడ ఆరాత్రి గడిపాను. ఆ మర్నాడు

( 23-10-1923 ) హార్లే కోర్టులోని మిసెస్ ప్రయార్ ఇంటిలో చేరాను. అక్కడ 1924 జనవరి ఆఖరువరకు వున్నాను. తర్వాత మిసెస్ లో యింటికి, తదనంతరం ఇంకొకరింటికి, అలా నా ఆక్స్‌ఫర్డ్ విద్య 1926 జూన్‌లో పూర్తిఅయ్యేటప్పటికి, నాలైదు ఇళ్లు మార్చాను. కాని, 1920 సెప్టెంబరులో మొదటిసారిగా పరిచయమైన బాగ్లేలోని మిస్ హెమ్మింగ్స్ పరిచయం చివరివరకు కొనసాగింది. మధ్యమధ్య ఆమెయింటికి వెళ్ళటం, కొన్నిరోజు లక్కడ గడపటం, ఆమెనుంచి చేబదులు తీసుకోవటం, తిరిగి ఇచ్చి వేయటం, ఈవిధంగా నేనింగ్లండు విడిచిపెట్టేవరకు ఆమెతో సంబంధం ఉంటూనేవచ్చింది.

నేను 1924 జనవరిలో పరీక్షకు కూర్చుని మిగిలిపోయిన అంశాన్ని పూర్తిచేశాను. మాకు వైవవోసె అనే ముఖాముఖి ప్రశ్నోత్తరాల పరీక్ష వుంటుంది. జయాపజయాలు అనుమానంగా ఉన్నవారి విషయంలో మాత్రమే ఈపరీక్ష జరుగుతుంది. తిరుగు లేని పరీక్షపత్రాలు వ్రాసినవారి కుండదు. అయితే ఫస్ట్‌క్లాస్ వచ్చే విద్యార్థి విషయంలోకూడా కొంత అనుమానం వుంటే ఈ ముఖాముఖి నోటిమాటలపరీక్ష ఉంటుంది. దీనికి నన్ను పరీక్షించిన వారు, ఇద్దరి సాయంతో, ప్రొఫెసర్ బెల్‌గారు. బెల్‌గారి ప్రశ్నలకు ఉద్వేగంతో జవాబులిచ్చాను. తర్వాత వారు, నేను వైవవోసె ప్రతిభావంతంగా చెప్పానన్నారట. లేకపోతే తప్పించేవారేమో.

ఫస్ట్ పబ్లిక్ పూర్తిఅయినవెంటనే, సెకండ్ పబ్లిక్ చదవట మారంభించాను. ఇదే అసలుచదువు. దీనికి ఆనర్‌స్కూల్ ఆఫ్ జ్యూరిస్‌ప్రూడెన్స్ అనగా న్యాయస్వభావం తెలిపే ధర్మ శాస్త్రంను తీసుకొన్నాను. ఇందులో ఇంగ్లీషు సివిల్, క్రిమినల్, కాన్‌స్టిట్యూషన్ లా, రోమన్ లా, ఇన్‌టర్‌నేషనల్ లా చదువాలి. ఆనర్‌స్కూల్ అనగా మన బి. ఏ. ఆనర్స్ వంటిది.

మా కాలేజి ప్రిన్సిపాల్ ( సెన్సార్ అనేవారు ) శ్రీ జె. బెర్నార్ బేకర్‌గారు. ప్రెజరరువంటివాడు శ్రీ కెంద్రిక్‌గారు. నాకు నా విద్యావిషయం, ధర్మశాస్త్రంలో ప్రత్యేకశిక్షణ యిచ్చిన వారు ఎఫ్. హెచ్. లాసన్‌గారు, తర్వాత టి. హెచ్. టేలర్

గారు, బేకర్ గారు అర్థశాస్త్రంలో ప్రవీణులు. కెండ్రిక్ గారు చరిత్ర వగైరాలు బోధిస్తూ ఉండేవారని గుర్తు. వీరితో నా కెక్కువ సంబంధం ఉన్నట్లు కన్పడదు. వారిది కొంచెం కఠినమైన తత్వం. వీరుగాక ఇంకా కొంతమంది ఉండేవారుగాని, వారితో నాకు చెప్పుకోతగ్గ సంబంధ ముండేది కాదు. నాకు ముఖ్యంగా మా సెన్సార్ బేకర్ గారితోను, నా ట్యూటర్స్ లాసన్, టేలర్ గార్లతోనే సంబంధం ఉండేది. పైన చెప్పినట్లు మా లెక్చర్లన్నీ ఉమ్మడివేకదా. నేను హిస్టరి ప్రీవియస్ చదువుచున్నప్పుడు, బేకర్ గారి సామూహిక లెక్చర్లు విన్నాను. వారు మిక్కిలి సులభంగా బోధించేవారు. ఆదుర్దాతో కొంత తడబడినా, వారి ఉపన్యాసాలు విషయపూరితంగా, ఆకర్షణీయంగా ఉండేవి. విద్యార్థులు శ్రద్ధగా, గౌరవభావంతో వినేవారు. కెండ్రిల్ గారి ఉపన్యాసాలను నేను విన్నట్లులేదు. నా హిస్టరి ప్రీవియస్‌కు నాకు ప్రత్యేకశిక్షణ ఇచ్చే ట్యూటర్లు ఉన్నట్లు గుర్తులేదు. కాని కెండ్రిక్ గారు చరిత్ర, వగైరా నాకు చెప్పారేమో. నా బ్యాంకి పాస్ బుక్కులో (లండన్ జాయింట్ సిటి అన్డ్ మిడ్‌లాన్డ్ బ్యాంక్ లిమిటెడ్, ఆక్స్‌ఫర్డ్ బ్రాంచి, సామాన్యంగా మిడ్‌లాన్డ్ బ్యాంక్ అనేవారు) లో, వారికి 1922 అక్టోబరు ఆరంభంలో 28 పౌన్లు ఇచ్చినట్లున్నది. ఇట్లే మరొక రిద్దరి కిచ్చినట్లున్నది. వారి పూర్తిపేర్లు పాస్‌బుక్‌లో లేనందున ఇదమిద్ధమని చెప్పలేను.

శ్రీ లాసన్ గారు గాని శ్రీ టేలర్ గారుగాని మా కాలేజికి చెందినవారు కారు. లాసన్ గారే కాలేజికి చెందినవారో గుర్తు లేదుకాని, టేలర్ గారు బేలియల్ కాలేజికి చెందినవారు. మొదటి వారు కొంతకాలం జర్మనీకి వెళ్ళియుండటంవల్ల టేలర్ గారికి నన్నప్పగించి వెళ్ళారు. ఇద్దరు చాలామంచివారు. స్నేహభావం, ఆప్యాయత కలవారు. టేలర్ గారు బాగా దృష్టిమాంద్యం కలవారైనా మేధావి, గడుసువారు. మాట కొంచెం గట్టిగా ఉండినా, ఆర్ద్రహృదయం కలవారు. వా రిద్దరు విద్యార్థులను తమ్ముళ్లవలె చూచుకొనేవారు. బుద్ధిచెప్పవలసివస్తే లాసన్ గారి కంటె టేలర్ గారు గట్టిగా చెప్పేవారు. ఇద్దరు స్నేహితులవలె

సిగరెట్టు కాల్చుకుంటూ, చనువుగా ఉండండని కోరేవారే. లాసన్ గారివద్దకంటె టేలర్ గారివద్ద ఎక్కువ కాలం శిక్షణ పొందాను. వారినుండే ఎక్కువ సంగతులు గ్రహించాను.

టేలర్ గారివద్ద శిక్షణపొందుచున్న ఇద్దరితర విద్యార్థుల విషయం గుర్తు. ఒకతను (యూదుడు) జ్యూ. చూడటానికి కొంత వికృతంగానే వుండేవాడు. కొద్దిపాటి బక్కపల్చని మనిషి, సన్నని, చుంచుముఖంవంటి ముఖం, కొంచెం నోరు తెరిస్తే బాగా బైటికి కన్పడే పళ్లు వగైరా. కాని మంచి తెలివితేటలు గలవాడు. కష్టపడి బాగా చదివేవాడు. ఒకనాడు నేను టేలర్ గారివద్దకు కొంచెం ముందుగా వెళ్లగా ఈ విద్యార్థి ఇంకను ముగించలేదు. కొన్ని నిముషాలకు అతడు వెళ్లిపోగా, టేలర్ గారు "ఇతడు జ్యూ. మంచి చురుకైనవాడు. గట్టిగా చదువుకొని చాలా బాగా వ్యాసాలు వ్రాసుకొనివస్తాడు. ఎన్నెన్నో చిక్కు ప్రశ్నలడిగి తెలిసికొంటాడు" అని, జ్యూస్ అతి తెలివిగలవారన్నారు. రెండోవిద్యార్థి దేహ్‌దాప్టి అనే పేరుగల పర్షియన్ యువకుడు. చాలా అందంగా ఉండేవాడు. మాటమంచి, మర్యాద కలవాడు. ఆకర్షించే పద్ధతులు (ప్లీజింగ్ మానర్స్). కాని చదివేవాడుకాదు. ఎవరిచేతనో వ్రాయించుకొని వచ్చేవాడుకాబోలు కాంపోజిన్ లనుబట్టి టేలర్ గారు బాగానే చదువుచున్నా డనుకొనేవారట. అతడు పరీక్షలో పూర్తిగా తప్పి చివరకు ప్యాస్ డిగ్రీ అయినా పొందలేకపోయాడు. టేలర్ గారు నా ఉత్తరానికి జవాబువ్రాస్తూ నాదగ్గర చదివినట్లే ఉండేవాడు, నక్కజిత్తులమారి కాబోలు నన్నారు.

ఈస్టర్ ఏప్రిల్ మాసంలో వస్తుంది. దీనికి సెలవు లుంటాయి. 1924-వ సంవత్సరంలో ఈస్టర్ సెలవు లెప్పుడు వచ్చాయో గుర్తులేదుగాని, ఆ సంవత్సరం ఏప్రిల్ 9 నుండి 16-వ తారీఖువరకు, ఆక్స్‌ఫర్డ్‌కు అనతిదూరంలో ఉన్న హెన్లే-ఆన్-థేమ్స్ అనే చిన్న పట్టణంలో రెడ్ లయన్ అనే హోటల్ లో గ్రేట్ బ్రిటన్ లో చదువుకొనే హిందూదేశం విద్యార్థుల సమా

వేశం వారం రోజులు జరిగింది. అంతకు ఇరువది సంవత్సరా క్రితమే ఏదో ఒక రూపంలో భారతీయులు ఇంగ్లండులో సంవత్సరా కొకసారి సమావేశ మవుతూ ఉండేవారట. అది వర్తకుల శాస్త్రజ్ఞులు వగైరా వారికి సంబంధించి వుండేదట. గత ఏడ సంవత్సరాలుగా, సమావేశం ముఖ్యంగా విద్యార్థిసమావేశంగ రూపొందింది. అయితే ఇంగ్లండు, స్కాట్‌లెండు, ఐర్లండ దేశాలలోనేగాక ఇతర యూరప్ దేశాలనుండి కూడా భారతీయుల హాజరుకావచ్చును. ఇది భారతీయు లందరికి సంబంధించి ఇండియన్ కాన్ఫరెన్సు.

1923 లో లండన్‌కు 30 మైళ్ళ దూరంలోవున్న హార్‌ఫర్డ్‌షైర్ కౌంటీలో హాడ్డెస్‌డన్ పట్టణంలోని "హైవే"లో ఆరవ కాన్ఫరెన్సు ఏప్రిల్-5 నుండి 12 వరకు జర్గింది. కాని, నేను స్వదేశానికి వెళ్ళే ప్రయత్నంలో ఉండినందునకాబోలు వెళ్ళలేదు. ఆ సంవత్సరం సమావేశంలో రిపోర్టు 1924 సంవత్సరం సమావేశంలో ఇచ్చారు. ఆ రిపోర్టులో హాజరైనట్లు పేర్కొన్న అతిథిప్రముఖులు లేడి అబ్బాస్‌ఆలీ బెయిగ్, గౌరవనీయ శ్రీ పియరిస్, వారి సతీమణి (సిలాన్), డాక్టర్ రామ్, శ్రీమతి తాతా, శ్రీ అన్డ్ శ్రీమతి శకలత్‌వాలా (బ్రిటిష్ పార్లమెంటు మెంబరు) డాక్టర్ అన్డ్ శ్రీమతి పాధ్రె. కాన్ఫరెన్సు, నాటకప్రదర్శనం (రవీంద్రనాధ్‌టాగూర్ రాజు, రాణి) లో పాల్గొన్న విద్యార్థు లలో నాకు తెలిసినవారు కుమారి లీలామణినాయుడు, కుమారి ఇందిర భగవత్, శ్రీ హెచ్. యమ్. పటేల్, శ్రీ బేనిప్రసాద్, శ్రీ థామస్, శ్రీ ఫాన్సె, శ్రీ బాఖర్‌ఆలీ మీర్జా వున్నారు. శ్రీ బాఖర్‌ఆలీ మీర్జా తలగుడ్డతో రాజ్‌కుమార్ వేషంలో ఉండగా, శ్రీ పటేల్ మీసం గడ్డం నెరిసిన ముసలివానివలె కర్రసాయంతో వున్నాడు. గ్రూప్ ఫోటోలో అరవై వర కున్నారు. తెలుగువాళ్ళలో హైదరాబాద్‌కుచెందిన శ్రీ సత్యనారాయణ (యస్. యన్.) రెడ్డి, కుమారి లీలామణినాయుడు కన్పడు చున్నారు.

1924 ఏప్రిల్ 9 నుండి 16 వరకు జరిగిన సమావేశానికి నేను హాజరైనాను. 1923 కాన్ఫరెన్సులో ప్రముఖపాత్ర

వహించి, 1924 కాన్ఫరెన్సుకు కార్యదర్శిగా ఎన్నుకోబడిన కుమారి ఇందిర భగవత్ గారితో మంచిపరిచయం నేను 1923 జులైలో స్వదేశానికి వెళ్ళుచున్నప్పుడు ఓడలో కలిగిందని పైన చెప్పాను. ఆపరిచయంవల్లను, తాను కార్యదర్శి అయినందువల్లను శ్రీమతి ఇందిర భగవత్ గారి ప్రోత్సాహంవల్లకాబోలు, నేను ఆ కాన్ఫరెన్సుకు వెళ్ళింది.

కాన్ఫరెన్సు మిక్కిలి జయప్రదంగా జరిగింది. హెన్లే-ఆన్-థేమ్సు నదిగట్టున ఉన్నది. మిక్కిలి సుందరమైన ప్రాంతం, పరిసరాలు పచ్చికబయళ్ళతోను పూలచెట్లతోను కన్నుల పండువుగా నుండును. మేము సమావేశమైన రెడ్ లయన్ హోటలు మిక్కిలి అనుకూలంగావుండింది. నివాసానికి, భోజనానికి సమావేశాలకు, ఆటలకు అనువైన ప్రదేశం. ఈ సమావేశంలో కాన్ఫరెన్సు నిబంధనలను అక్కడక్కడ సరిదిద్దారు. మాటల సవరణ హెచ్చు. ముఖ్యఅతిథి, దివాన్ బహదూర్ టి. రంగాచార్యులుగారు. వీరు మద్రాసు సుప్రసిద్ధ న్యాయవాది. ఏదో గవర్నమెంటు హోదాతో ఇంగ్లండుకు వచ్చియున్నారు. వారు భారతీయ విద్యార్థులకు భావపూరితమైన సలహాలిస్తూ ఉపన్యసించారు. లండన్‌లో ఇండియాప్రభుత్వ సలహాదారుడుగా యస్. సి. సేనుగా రుండేవారు. వారు, వారిసతీమణి, ముగ్గురు కుమార్తెలు హాజరైనారు. డాక్టరు పార్థే, వారి ఇంగ్లీషుభార్య వచ్చారు. ప్రొఫెసర్ మొహాతి, శ్రీమతి మొహాత ఉన్నారు. 1923 "హైలే" కాన్ఫరెన్సుకు హాజరైనవారిలో చాలామంది వచ్చారు. ఈ కాన్ఫరెన్సుకు వచ్చిన విద్యార్థులలో లార్డ్ సిన్హా కుమారుడు, తర్వాత సుప్రీంకోర్టు జడ్జి అయిన యస్. బి. సింహా, పంజాబు హైకోర్టు జడ్జి అయిన టేక్ చంద్ దండా, ఇప్పుడు కేంద్ర మంత్రిగావున్న ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ ఉన్నారు. శ్రీమతి స్వామినాధన్ గారు హాజరయ్యారు. పదిహేను, పదహారుగురు స్త్రీలున్నారు. శకలత్ గారు రాలేదుగాని వారికుమార్తె వచ్చారు. శ్రీమతి లీలామణినాయుడు హాజరు. ఆమెగాక తెలుగువారం ఏడుగురున్నాం— ఐదుగురు నైజాం రాజ్యాన్నుండి వచ్చిన రెడ్డియువకులు, కర్నూలునుండివచ్చిన రెడ్డియువకుడొకడు, నేను.

ఇండియాకు సంబంధించినవారేగాక, ఒకరిద్దరు సిలాన్ విద్యార్థులు, ధార్సి అనే విద్యార్థి వచ్చారు. శ్రీ ధార్సి జాంజిబార్‌లో స్థిరనివాస మేర్పరచుకొన్న ఖోజామహమ్మదీయ కుటుంబానికి చెందినవారు. కార్యదర్శి శ్రీమతి ఇందిర భగవత్ గారు మిక్కిలి సమర్థవంతంగా కాన్ఫరెన్సును నడిపారు.

ఇతర కాన్ఫరెన్సులలోవలెనే ఉపన్యాసాలు, చర్చలు, మాటలు, సంభాషణలు జరిగాయి. ఆటపాటలు, నాటకాలు జరిగాయి. పోటీలలో గెల్చినవారికి బహుమతులు పంచిపెట్టారు. 1925 ఏప్రిల్‌లో జరుగబోయే కాన్ఫరెన్సుకు, శ్రీ బేనీప్రసాద్‌ను కార్యదర్శిగాను, శ్రీమతి లీలామణినాయుడును సహాయకార్యదర్శి గాను, డాక్టర్ కె. యమ్. పార్థిగారిభార్య శ్రీమతి పార్థిగారిని కోశాధిపతిగాను ఎన్నుకొన్నారు.

ఇండియన్ కాన్ఫరెన్సు విషయం ముగించకముందు, 1925 ఏప్రిల్‌లో సముద్రతీరవిహార వినోదప్రదేశమైన ఈస్ట్‌బోర్న్‌లో జరిగిన కాన్ఫరెన్సు విషయంకూడా చెప్పుతాను. నేనా కాన్ఫరెన్సుకు కూడా వెళ్లాను. ఇక్కడ మామూలు ఉపన్యాసాలు, చర్చలు, ఆటపాటలతోబాటు సముద్రతీరవిహారం మిక్కిలి ఆహ్లాదాన్ని కలిగించింది. మేము కాన్ఫరెన్సు జరుపుకొన్న పెద్దభవనం సముద్ర తీరాన వున్నది. ఈసముద్రతీరం ఇంగ్లండులో ప్రసిద్ధికెక్కిన మూడు, నాలుగు విశ్రాంతికేగాక విలాసాలకు వెళ్లే సముద్రతీరాల్లో రెండోస్థానం కలది. ఈతీరం పొడుగైనది, ప్రశాంతమైంది. వాతావరణం ఉల్లాసకరంగా ఉంటుంది.

దీనికి ముఖ్యఅతిథి సర్ సయ్యద్ ఇమామ్‌గారని గుర్తు. గ్రూపుఫొటోలో వున్నారు. ఇతర ప్రముఖుల్లో శ్రీ టాంపా ఉన్నారు. వీరు సిలాన్ దేశస్థులైనా, ఇండియన్ సివిల్ సర్వీసులో చేరి మనదేశంలోనే పెద్దఉద్యోగాలు చేశారు. మద్రాసు ప్రభుత్వంలో రెవిన్యూ బోర్డు మెంబరువంటి పదవులను నిర్వహించారు. వీరు మిక్కిలి సరసులు, భేషజం కించిత్తైన లేనివారు, నిరాడంబరులు, స్నేహశీలి. విద్యార్థులతో మిక్కిలి చనువుగా మెలిగారు. మూడునాల్గు అంశాలలో నిపుణులు.



ఇండియన్ కాన్ఫరెన్సు ( 1925 ). ఈస్టు బోరన్
టాగూర్‌గారి " రాజు, రాణి " నాటకప్రదర్శనమునందలి నటవర్గము

వీరికి ఫ్రెంచిభాష బాగావచ్చినట్లు గుర్తు. తరువాత వీరిని మద్రాసులో ఒకటిరెండుసార్లు కలసికొని సంతోషించాను. మిసెస్ పార్థె, డాక్టరు పార్థె, శ్రీయన్.సి.సేన్, (వీరు బ్రహ్మసమాజ్ నాయకుడు శ్రీ కేశవ్ చంద్రసేన్ గారి కుమారుడో వారి జ్ఞాతియో) వారి భార్య, ముగ్గురు కుమార్తెలు వచ్చారు. 1924 లో వచ్చిన తెలుగువారందరం ఉన్నాము. వీరిలో ముఖ్యులు, హైదరాబాద్ పోలీస్ కమిషనర్‌గా తదుపరి పని చేసిన యస్. యన్. రెడ్డిగారు. కడమవారిలో శ్రీనూకల రామచంద్రారెడ్డిగారి అగ్రసోదరుడు, శ్రీపింగళి వెంకట్రామరెడ్డి గారి కుమారుడు, ముష్టియుద్ధంలో చనిపోయిన జనార్ధనరెడ్డి ఉన్నారు. కాని శ్రీరంగాగాని, శ్రీ శ్రీకృష్ణగాని నేను వెళ్లియుండిన రెండు కాన్ఫరెన్సులకు రాలేదు. 1924 కాన్ఫరెన్సుకు హాజరైన విద్యార్థులలో చాలామంది వచ్చారు. కొంతమంది క్రొత్తవారున్నారు. సర్ సయ్యద్ ఇమామ్‌గారి కుమారుడు, శ్రీఅలియార్‌ఖాన్ (ఇప్పుడు జంగ్, ప్రస్తుత మహారాష్ట్ర గవర్నర్), శ్రీఅజీముల్లావంటి క్రొత్తవారు గ్రూపుఫోటోలో కన్పడుచున్నారు. హార్‌ఫర్డ్ 'హైలే' కాన్ఫరెన్సుకు హాజరైన వారికంటె హెన్లెలో హాజరైనవారెక్కువ. ఇక్కడ అంతకంటె ఎక్కువమంది వచ్చారు. అధమం, 80 మందైనా ఉంటారను కొంటాను. సముద్రతీరప్రభావం కొంత అయివుంటుంది. స్త్రీలు క్రిందటివలెనే పదిహేను, పదహారుగు రున్నారు.

1924 ఏప్రిల్ 24-వ సాయంత్రం, లండన్ శివారు వెమ్‌బ్లెలో, బ్రిటిష్ సామ్రాజ్య వస్తుప్రదర్శనం ఆరంభమైంది. ఇది కొన్నిమాసాలు జరిగింది. దీనిలో కొంత స్వతంత్రప్రతిపత్తి గల సామ్రాజ్యాంతర తెల్లభాగాలు, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు, దక్షిణ ఆఫ్రికాలేగాక, ఇండియా, సిలాన్‌వంటి స్వతంత్రంలేని భాగాలు, గోల్డుకోస్టు, నైజీరియావంటి వెనుకబడిన భాగాలు, తమతమ వస్తువులను ప్రత్యేకశాలల్లో ప్రదర్శించాయి. నేనప్పుడు వ్రాసుకొన్న రఫ్‌నోట్సు ఇప్పుడు కనిపించాయి. మనదేశ పత్రికలు ఈప్రదర్శనాన్ని బహిష్కరించండని ఉద్ఘోషించినవి. కొన్నిరాష్ట్రాలలో శాసనసభ్యులు గ్రాంటులను

తిరస్కరించాలని కోరారు. కేంద్ర శాసనసభలో భారతీయులలో కొందరు నిరాకరించారు. కాని, ప్రభుభక్తిపరాయణులు మద్రాసుమంత్రులు సహకరించినందున మద్రాసురాష్ట్రానికి ప్రదర్శనంలో మిక్కిలి మంచిస్థానం దొరికిందని వ్రాశాను. నిజానికి ఇండియా పెవిలియన్‌కు ముఖ్యాధికారి దివాన్ బహద్దర్ టి. విజయరాఘవాచారిగారు. వారిసహాయకులు సుందరాచార్యులుగారు. వీరిద్దరు మద్రాసువారని వేరే చెప్పనక్కరలేదు. అరవలకే ప్రాముఖ్యం వచ్చిందని తెలుగులు విచారించనక్కరలేదు. తెలుగు పాములవాండ్రను పాములబుట్టలతో అక్కడికి పంపారు. ఆగౌరవం ఆంధ్రులకు దక్కింది. కలలోకూడా ఊహించని పాములవాండ్రకు ఇంగ్లండు దర్శనమైంది!

ఈప్రదర్శనం, ఉద్దేశాలు, ఆదర్శాలుకూడా అప్పుడు చిత్తుగా వ్రాసుకొన్నాను. బ్రిటిష్‌సామ్రాజ్యమునందు గల వివిధ భాగముల నొకచోఁ జేర్చి, వానిమధ్య నొకదానియందు మరొకదానికిమించి యభిప్రాయం కలుగజేయుట, సామ్రాజ్యైశ్వర్యము నొకచోట జేర్చి, ఏభాగమునం దెట్టి యైశ్వర్యముకలదో, ఆ యైశ్వర్యము నెట్లు వృద్ధిచేయవచ్చునో తర్కించుట, వివిధ భాగములమధ్య వాణిజ్యము వృద్ధిజేయుట కేర్పాటుజేయుట, ఇతరభాగములనుండి బ్రిటన్‌కు ముడివస్తువులను దిగుమతి చేసుకొనుట, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు, దక్షిణాఫ్రికా దేశాలకు బ్రిటిష్‌వారి వలసను ప్రోత్సహించుట, మొదలైన వీ బ్రిటిష్‌సామ్రాజ్య వస్తుప్రదర్శనోద్దేశములు.

ఈ ప్రదర్శనం, మిక్కిలి విస్తీర్ణమైన ప్రదేశంలో ప్రదర్శనానికని నిర్మించబడిన రాజప్రసాదాలవంటి పెద్దపెద్దభవనాల, శాలల్లో ఏర్పాటుచేయబడింది. ఒక్కొక్క సామ్రాజ్యభాగం, ఒక్కొక్క స్టాలును ఏర్పరచింది. బ్రిటిష్‌ప్రభుత్వం కొన్ని శాలలను ఏర్పాటుచేసింది. పారిశ్రామికులు, వర్తకులు ఎగుమతి దిగుమతిదారులు శాలలను పెట్టారు. ఇట్టి శాలలు పెద్దవి చిన్నవి కలిపి చాలావుండినవి. వస్తుప్రదర్శనశాలలుగాక, ఆహార పానీయాలకు వినోదాలకు శాలలు, వస్తువుల నమ్ము అంగళ్లు ఉండినవి. ఇవన్నీకలిసి ఆ ప్రదేశం ఒక పట్టణంగా తయారైంది.

జనులు తండోపతండాలుగా వచ్చేవారు. పెద్ద తిరునాళ్ళవలె ఉండింది. ఆరోజులకు ఇంతగొప్ప వస్తుప్రదర్శనం అదేనేమో ప్రపంచంమొత్తంలో.

మన ఇండియన్ పెవిలియన్‌లో వివిధరాష్ట్రాలకు వివిధ శాల లున్నవి. ఇవి ఏకత్వాన్ని సూచించక భిన్నత్వాన్ని సూచించాయి. ఒకేరకం వస్తువులు ఒకటికిమించిన స్టాల్సులో చూపబడ్డవి. తాతాకంపెనివంటి కంపెనీలు తయారుచేసిన వస్తువులను చూపలేదు. ప్రత్తి, తేయాకు ప్రైవేటు కంపెనీల ప్రదర్శనం హీనంగా ఉండింది. చాలా అశ్రద్ధగా మన దేశీయ వస్తులవును ప్రదర్శించారు. అడవులు, జియలాజికల్ సర్వే, డిపార్ట్‌మెంటులను ఇండియాగవర్న మెంటు చూపిందిగాని, మొత్తం మీద ఇండియాప్రభుత్వం ప్రదర్శనశాల లేదు. అందువలన మన భారతీయప్రదర్శనం సమిష్టిస్వరూపాన్ని కోలుపోయి, బొమ్మ రిల్లుగా రూపొందింది. ఈవిధంగా నా అభిప్రాయాన్ని అప్పుడు వ్రాసుకొన్నాను.

మన మద్రాసు సెక్షన్ (భాగం) అనుబంధంగా, శ్రీ వీరాస్వామినాయుడు (తెలుగువాడు. దక్షిణాదినివాసి) నడపిన భోజనవిక్రయశాల భారతీయులనేగాక, యూరపియన్‌లనుకూడా ఆకర్షించింది. పలావు, మాంస కూర్మా, కైమా వుండలు, కోడి కట్‌లెట్లు, చపాతీలు వగైరా, చాలారుచికరంగా ఉండినవి. ఇతరపెవిలియన్లకు అనుబంధాల భోజనవిక్రయశాలలు, రకరకాల వంటశాలలతో నిండియుండేవి. నేను నాలు గైదు సార్లైనా ప్రదర్శ నానికి వెళ్లి, వివిధ రెస్టారాంట్సులో భుజించాను. కొన్నిచోట్ల చిన్న రొట్టెరోల్సు మిక్కిలి సున్నితంగా వుండి, నొక్కితే చిన్న చిన్న ముక్కలయ్యేవి, ఎంతో రుచిగా ఉండేవి.

వినోదాలు కోకొల్లలు. రాత్రి 10, 11 గంటలవరకు, కొన్నిరోజుల్లో ఇంకా ప్రొద్దుపోయేవరకు, ప్రదర్శనం తెరచి వుండేది.

శ్రీ వీరాస్వామినాయుడు, ప్రదర్శనం ముగిసిన తర్వాత, లండన్‌నగరం ఆక్స్‌ఫర్డ్ సర్కస్ దగ్గరగా ఉన్న రీజెంటు స్ట్రీటులో, వీరాస్వామి రెస్టారాంట్ అనే పేరుతో ప్రదర్శనంలో

నడిపినవంటిదానిని నడిపారు. రెండు మూడుసార్లు వెళ్లి పలావ్ వగైరా తిన్నాను.

ఇంకాముందుకు సాగిపోయేముందు కొన్ని జ్ఞాపకాలు, అనుభవాలు చెప్పాలి. మా నాన్నగారు 1924 మార్చి 12-వ తారీఖున పరమపదించారు. వారికి అతిమూత్రవ్యాధివలన ఎద్దు త్రొక్కిన కాలివ్రేలిమీద పుండు రక్కసిపుండుగా మారి, బరువు చెయ్యగా మద్రాసు తీసికొనివెళ్ళి అక్కడి జనరల్ హాస్పిటల్‌లో చేర్చారట. పుండు మోకాలివరకు ఎగప్రాకగా, మోకాలు పైవరకు తీసివేశారట. రెండోరోజున చనిపోయారట. ఈ విషయం కేబుల్ ద్వారా ఆక్స్‌ఫర్డ్‌లో నాకు తెలిసింది. నా దుఃఖాని కంతులేదు. ఎంత ఆపుకొన్నా పొంగి పొరలి వచ్చింది. నా శోకాన్ని నా వసతి ఆమె మిసెస్ లో చూచి ఎంతో ఓదార్చింది. దుఃఖసూచకంగా ఎడమదండకు నల్లగుడ్డ ముక్క కట్టుకొని, కొంతకుకొంత ఉపశమనం చెందాను.

కొన్నిమాసాలకు ఇంటివద్దనుండి డబ్బురావటం ఆలస్యమవుతూవచ్చింది. మా తండ్రిగారు పోయినతర్వాత, కుటుంబ భారం నేను వహించవలసింది. నేను ఆక్స్‌ఫర్డ్‌లో ఉంటిని. అనుభవంలేని నాతమ్ముడు సత్యనారాయణకు డబ్బు చప్పున తెమలటంలేదు. కుటుంబఋణాలు నా చదువు ఖర్చుతో పెరుగుచుండినవి. అప్పులవాళ్లకు సర్దాలి, నాకు డబ్బు పంపాలి. అందువల్ల డబ్బు సకాలంలో నా కందేదికాదు. నేనుండిన ఇంటివారి కివ్వవలసింది ఒకొక్కప్పుడు, నాలుగైదు వారాలు అంతకు మించికూడా ఆలస్యంఅయ్యేది, అయినా వారు ఓపికపెట్టి ఉండేవారు. ముఖ్యంగా, ఒకఇంట్లో 35, 40 సంవత్సరాల స్త్రీలు వుండేవారు. వారాయింటిని అద్దెకు తీసుకొని, కాలక్షేపం చేస్తుండేవారు. అర్ధభోజనంతో కాలంగడిపేవారివలె మిక్కిలి బలహీనముగా, నిరాడంబరముగా ఉండేవారు. నేను డబ్బును చాలాఆలస్యంగా ఇచ్చినా, వారు నన్ను పీడించక సరిపెట్టుకొనేవారు. తాము బీదస్థితిలోవున్నా, డబ్బుకు యిబ్బందిపడుచున్నా సౌమ్యంగా ప్రవర్తించేవారు. అయితే, ఇక్కడొకసంగతి

చెప్పాలి. ఆరోజుల్లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ విద్యార్థులంటే నమ్మకం, గౌరవం ఉండేది. ఆ విశ్వవిద్యాలయంలో చదువుకొనేవారు ఏదేశస్థులైనా, కలిగినకుటుంబంనుండి వచ్చినవారని వారి నమ్మకం.

ఇంకొకయింట్లో ఉన్నప్పుడు, నాకు సైకిల్ నేర్చుకోవాలని ఉబలాటం కలిగింది. ఆ యింటి యజమాని అంతకుపూర్వం ఏదో వాణిజ్యసంబంధమైన ఓడలో నావికుడుగా పనిచేసేవాడట. వయస్సుమళ్లినవాడు కాదుకాని, ఏదో దుర్ఘటనవల్ల ఉద్యోగం మానుకొన్నాడట. నేను సైకిల్ త్రొక్కటం నేర్చుకోవాలంటే తాను నేర్పుతానన్నాడు. ఒక సైకిల్ అద్దెకుతీసుకొని బైలుదేరాము. పట్టణానికి రెండు, మూడు మైళ్ళదూరం వెళ్లి, ఆయన సహాయంతో నేర్చుకోటానికి ప్రయత్నించాను. కాని నాలుగైదు రోజులు ప్రయత్నించినా త్రొక్కటం చేతకాలేదు. సైకిల్ ముందుకు సాగిపోలేదు. ఆయన త్రోసినంతవరకు పోయి ఆగిపోయేవాడిని. పెడల్సు త్రొక్కేవాడనుకాను. అందువల్ల త్రోపుకు ముందుకుపోయిన సైకిలు ఆ విసురుపోగానే క్రిందపడిపోయేది, నన్ను పడవేస్తూ. విసిగి ఇక రాదని మానివేశాను. ఆక్స్‌ఫర్డ్ పరిసరప్రాంతాలు చాలా రమ్యమైనవి. సైకిలుంటే తీరికవున్న సాయంత్రాల్లో దూరం షికారు వెళ్లవచ్చును. వేసవిలో ఇతర ప్రదేశాలకు వెళ్లి, దాని నుపయోగించుకొని, ఆ యా రమ్యప్రదేశాలకు వెళ్ళి హాయిగా కాలక్షేపం చేయటానికవకాశముండేది. ఎక్కడకు వెళ్లవలెనన్నా చప్పున తేలిగ్గా వెళ్ళవచ్చునుకదా. ఈ కారణాలవల్ల సైకిల్ త్రొక్కటం నేర్చుకోవాలని ఆశించాను. కాని, గాలిలో వెళ్లినట్లుండే సైకిల్ ప్రయాణం, తెలియని భీతిని కలిగించిందో, కాళ్ళలో సహజలోపమేదైనా వున్నదో, పెడల్సు త్రొక్కకుండా స్తబ్ధంగా కూర్చొనివుండటమే కారణంవల్లనో మొత్తంమీద ఆ భాగ్యం నాకు కల్గలేదు. సైకిల్ త్రొక్కటమేకాదు, మోటారుకారు నడపటం కూడా నేర్చుకోలేకపోయాను. నేను 1936 లో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా వున్నప్పుడు కారు కొన్నాను. 1961 వరకు నా

స్వంతానికి కారుండేది. ఎందరో డ్రైవర్లు మారారు. ఒక రిద్దరు నేర్పుతామన్నా నేర్చుకోటానికి ప్రయత్నించలేదు. నా ఇద్దరు కుమార్తెల్లు, చిన్న కుమార్తె సైకిలు త్రొక్కటమేగాక, కారును కూడ నడపగలరు. బహుశా గుండె నిబ్బరంగల నా భార్యనుండి ఈ సామర్థ్యము వాళ్ళకు లభించియుండవచ్చును.

ఇంకొక విషయంకూడ జ్ఞప్తియం దున్నది. ఫుట్ బాల్, రోయింగ్ (పడవ నడపటం) వంటి కష్టమైన ఆటల్లో పాల్గొనే సామర్థ్యాన్ని లేనివాడను. శరీరబలం లేనివాడను కాదుగాని, నాకు చిన్నప్పటినుండి ఆటపాటల్లో ఆసక్తి లేదు. మన దేశంలో కూడ ఏ ఆట పాటల్లోను పాల్గొనలేదు. దానికి కారణం సహజ బిడియం, చొరవలేనితనం అయి వుంటుంది. బొత్తిగా శరీర వ్యాయామం లేకుండటం బాగుండదని తలంచి టెన్నిస్ ఆటనైనా ఆడుకొనవచ్చుని ఆశించాను. పరిచయమైన ఒక ఇంగ్లీషువిద్యార్థి, నేను కలసి సమీపంలో వున్న టెన్నిస్ కోర్టులో ఆట ప్రారంభించాము. వారంరోజులు ప్రయత్నించినా, నా కా ఆట అబ్బలేదు. సర్వీస్ అనగా బంతిని అవతలకు పంపటం, కొంతవరకు నేర్చానుగాని అవతలనుండి వచ్చే బంతిని ఎదుర్కొనటానికి, దానిని తిరిగి అవతలప్రక్కకు పంపటానికి నాకు చేతకాలేదు. అందువల్ల ఆ ప్రయత్నముకూడా మానుకొన్నాను.

1924 వేసవి వచ్చింది. తిరిగి 16 వారాలు సెలవు. విశ్వవిద్యాలయం మూసివేసినతర్వాత ఆక్స్‌ఫర్డ్ చప్పగాఉంటుంది. పైగా కాలేజిసెలవుల్లో విద్యార్థులు తమయిండ్లకుగాని ఇంకొకచోటికి గాని వెళ్లటం మామూలేకదా. నావంటి భారతీయవిద్యార్థులు, పేయింగ్ గెస్టుగా వస్తాము తీసికొనదలచినవారు తెలియజేయండని న్యూస్ పేపర్లలో ప్రకటిస్తాము. ఈదఫా, కెన్ట్ కౌంటీలోని క్రేఫర్డ్ అనే చిన్న పట్టణంలో 134, స్టేషన్‌రోడ్డు "బర్న్‌హామ్ హౌస్" అనే ఇంటిలో నివసించుచుండిన, జాన్ ఎడ్విన్ పోలక్ అనేవారు రమ్మనమన్నారు. ఈ క్రేఫర్డ్, పారిశ్రామిక సంబంధం వారు నివసించే కొద్దిపాటి పట్టణంవంటిది. లండన్‌కు చాలాదగ్గర. 27 మైళ్లే దూరం. మిస్టర్ పోలక్ సైన్సులో డిగ్రీపట్టాను

పొందినవారు. ఆయన సమీపములోవున్న విలియమ్సు అండ్ బ్రరోస్ అనే మందులను తయారుచేసే ప్రఖ్యాత కంపెనీలో పనిచేస్తుండేవారు. ఆయనభార్య శ్రీమతి మేరి ఫ్రెడరిక్ సామాన్యమైన చదువు చదివిన యువతి. వా రిద్దరు ఎక్కువ వయస్సుకలవారు కాదు. జాన్‌గారు నాకంటె ఏడెనిమిది సంవత్సరములు పెద్దేమో. వారికి బ్రయన్ అనే రెండుమూడు సంవత్సరాల కొడు కొక్కడే వుండేవాడు. వారిగృహాని కనతి దూరంలోనే వికర్స్ ఆరమ్‌స్ట్రాంగ్ సుప్రసిద్ధ పారిశ్రామికసంస్థ ఉండిందని జ్ఞాపకం. ఈ కంపెని ప్రపంచప్రఖ్యాతిపొందిన రోల్స్-రాయిస్ మోటారుకార్లను, విమానాలను తయారుచేస్తుండేది. క్రేఫర్డ్ నానుకొనే డార్ట్‌మూర్‌హీత్ అనే మైదానం వున్నది. అది మిక్కిలి విశాలమైనది. చాలాభాగం పల్చని పచ్చగడ్డితో ఉండేది. అక్కడక్కడ చిన్నచిన్న దిబ్బలు, చిన్నచిన్న గోతు లుండేవి. ఇది చరిత్రప్రసిద్ధమైన మైదానం. వేసవిలో సాయంత్రం దానిచుట్టుప్రక్కల నివసించుచుండినవారు షికారుకు వెళ్తారు. నా ఆతిథేయులు జాన్, మేరీగార్లు, నేను వారిబిడ్డతో షికారుకు పోవుచుండేవారం.

విద్యావంతుడైన జాన్‌గారు రాత్రి గదిబైట పెట్టిన నా పాదరక్షలను ప్రతిఉదయం శుభ్రపరచి గదిముందు వుంచేవారు. శ్రీమతి మేరి నా రాత్రి నీరుడుగిన్నెను శుభ్రపరిచేది. మేము స్నేహపూర్వకంగా మెలిగేవారం. వారి కుటుంబం చిన్నది. ఇతర అతిథులు లేరు. వారు సహజంగా మంచివారు. అందువల్ల నేను స్వతంత్రంగా, వంటగదిని ఆనుకొనివున్న వెనుకవరండాలోకి పోయేవాడను. ఆమె బిడ్డదుస్తుల్ని నిత్యం సబ్బులో ఉతికి, వాని నుండి నీటిని పిండి ఒక రోలర్‌లో దూర్చి దానిని త్రిప్పి బట్టలను తీసివేసేది. ఒకనాడు బొత్తాలన్నింటిని కుట్టటం చూచాను. "బొత్తాలన్ని ఒకసారి ఎలాపగిలిపోయా" యని అడిగాను. ఆమె చిరునవ్వునవ్వి "బొత్తాలన్నింటిని ముందు ఊడదీసినగాని రోలర్ ద్వారాపిండుటకు వీలులేదు" అని చెప్పింది. ప్రతిసారి దుస్తుల గుండీలన్నీ ఊడదీసి, రోలర్‌ద్వారా నీటిని పిండినతర్వాత తిరిగి అప్పుడే వానిని కుట్టుచుండేది. పాశ్చాత్యస్త్రీలు మిక్కిలి ధనవంతులు

కాకపోతే, మిక్కిలి కష్టజీవులు. ఉదయం ఏ ఆరు గంటలకో, అంతకుముందో లేచి రాత్రి భోజనంవరకు ఏదో ఒకపని చేయుచునే ఉందురు. సామాన్యకుటుంబంలో, ఇంటిని శుభ్రపరుచుకొనేపని కూడా వారిపై బడుతుంది.

కారన్‌వాల్‌లోని క్రెసెర్రీగారింట్లోవలెనే ఈ యింటిలో కూడా, సాయంత్రం హైటీ తీసుకొని రాత్రి సప్పర్ (తేలికైన ఆహారం) తీసుకొనేవారు. నేను వెళ్లినది వేసవికాలం. సూర్యకాంతి రాత్రి తొమ్మిదిన్నర, పదిగంటలవరకుండేది. వేసవికాలంలో గవర్నమెంటువారు గడియారాన్ని ఒకగంట ముందుకుజరిపి మామూలుగా ఎనిమిదిన్నర గంటల సూర్యాస్తమయంకాలాన్ని, తొమ్మిదిన్నర గంటలకు చేస్తారు. అందువల్ల సాయంత్రకాలం ఇంకొకగంట వెల్తురును పొందుతుంది. వేసవి గడచినతర్వాత, గడియారాన్ని యథాస్థానానికి త్రిప్పేవారు. కాబట్టి మేము హైటీ తీసుకొని బైటికి వెళ్లి రాత్రి ఏ తొమ్మిదిన్నర గంటలకో సప్పర్ తీసికొనేవారం. జాన్‌గారు సాయంకాలం ఐదున్నర గంటలకు తన మందులఫ్యాక్టరినుండి సైకిలుమీద ఇంటికి తిరిగివచ్చేవారు. మధ్యాహ్నభోజనానికి వచ్చేవారుకాదు. అందువల్ల రాత్రిభోజనం అప్పుడప్పుడైనా ఉండేదా అని సందేహం వస్తున్నది. అయినా, ముఖ్యంగా వేసవిలో, సాయంత్రంపూట ఇంచుమించుగా రోజూ బైటకువెళ్లటంవల్ల, ఆరు గంటలకు మాంసాదులతో హైటీ, తొమ్మిదిన్నర, పది గంటలకు తేలిక ఆహారం పరిపాటి.

శ్రీ పోలక్ సరసులు, నిక్కచ్చి, నిజాయితీగల మనిషి. విద్యావంతుడైనా. గర్వపోతు కాదు. ఆర్థికంగా కొంత లాభిస్తుందని, అతిథిని తీసుకొన్నాడు. అతిథి పరాయిదేశస్థుడైనా భారతీయుడైనా చేయవలసిన మర్యాదలు, సాగించవలసిన సౌకర్యాలు అతిజాగ్రత్తగా చేయటం, చూపటం తనధర్మంగా ఎంచుకొని నెరవేర్చే స్వభావంకలవాడు. శ్రీమతి మేరిపోలక్ చాలా గుణవతి. నెమ్మది, స్నేహభావం, కొంతకుగొంత ఆప్యాయత చూపించటం, శరీరంవంచి పనిచేయటం ఆమె స్వభావం. ఆమె నాకొక అక్కగా ప్రవర్తించింది.

జూలై (1924) చివరవారంలో ఎసెక్సు కౌంటీలోని వాల్తమ్ యాబే అనే చిన్నపట్టణం, 40 సన్‌స్ట్రీటుకు, మిసెస్ జూలియా హెలెన్ వుడ్‌బ్రిడ్జి (డబ్బిచ్చే) అతిథిగా వెళ్లాను. వెళ్లిన వేళావిశేష మేమోగాని ఆమె తల్లిగాను, నేనామె కొడుకునుగాను, 1927 ఆరంభంలో నేను ఇంగ్లండు విడిచిపెట్టేవరకు సంబంధం నెరపుకొన్నాం.

ఇక్కడెన్నిరోజులు గడిపానో గుర్తులేదుకాని, ఉండిన రోజులు చాలా సుఖంగా, స్నేహపూరితంగా జరిగిపోయాయి. క్రిస్‌మస్, ఈస్టర్ వంటి పండుగదినాల్లో అక్కడకు వెళ్లి పండుగల్లో పాల్గొనుచు, మా స్నేహపూరిత పరిచయాన్ని కొనసాగించాను. ఎక్కువసార్లు వెళ్లేవాడిని. మొదట శ్రీమతి మేరి పోలక్ ద్వారా శ్రీమతి హెలెన్ వుడ్‌బ్రిడ్జి పరిచయమైనా, ఆమెయందే నాకెక్కువ ఆప్యాయతకల్గి మాతృభావంగా పరిణత జెందింది.

మిస్టర్ వుడ్‌బ్రిడ్జి పేరు జాన్. వారు అదివరకు ఒక ఫరంలో పనిచేసియుండినారు. నేను వారితో పరిచయము కలిగినప్పటికి అనారోగ్యంవల్ల కొంత, వయస్సువల్ల కొంత ముసలివారైనట్లు వుండేవారు. ఇంటివద్దనే వుండేవారు. శ్రీమతి వుడ్‌బ్రిడ్జి వయస్సు మీరిందైనా, లావుపాటి శరీరంకలదైనా మిక్కిలి చురుకుగా, ఉత్సాహపూరితంగా వుండేది. ఆమెకు సాంఘిక సంక్షేమ విషయాల్లో చాలా ఆసక్తి. తరుచు ఆ సంబంధమైన మీటింగులకు వెళ్లుచుండేది. ఆమె, పెద్దదైన మిడిల్ ఎసెక్సు హాస్పిటల్ విజిటింగు కమిటీలో సభ్యురాలు. ఆమెకు మాతృస్వభావ మెక్కువ. ఆమె సోషల్ వర్కర్ కదా. తన మృదు మాతృస్వభావంతో బీద సాదలను, రోగులను ఆదరించేది. ఇతరులయందు స్నేహభావంతో వర్తించే పద్ధతి పెంచుకొన్నది. ఆమె వయస్సుకు పెద్దది. నేను చదువుకొనే పిన్నవాడను. అందువల్లకాబోలు, ఆమె నన్ను దగ్గరకు చేరదీసి కన్నతల్లివలె ఆదరించేది. నేనుకూడ ఆమె పుత్రునివలె నడచుకొనేవాడను. నన్ను బయటివారికి పరిచయమొనర్చవలసివచ్చినప్పుడు "నా భారతీయ కుమారుడు" అని చెప్పేది. నేను రాత్రి నిద్రించుటకు నాగదికి వెళ్లేముందు నా బుగ్గమీద ముద్దిడి గుడ్ నైట్

చెప్పి పంపించేది. అంతవరకు ఆమె మాతృత్వము వెళ్లింది. పైజెప్పిన హాస్పిటలు కొకనాడు తనతో తీసుకువెళ్లి హాస్పిటల్ వార్డులు వగైరా చూపించింది. కమిటీ సభ్యులతోబాటు నేను లన్చ్ ( మధ్యాహ్నభోజనం ) తీసుకొన్నాను. పందిమాంసం అంతకుముందనేక సార్లు తినివుంటినిగాని, అక్కడిచ్చిన పందిమాంసం ఎక్కువరుచి అనిపించింది. దానికి కారణం ముదిరిన పందిది కాక మిక్కిలి లేతవయస్సులోవుండిన పందిపిల్లమాంసం అది. పంది మాంసానికి యాపుల్ సాస్ రుచిని పెంచుతుంది. లేతమాంసం, యాపిల్ సాసు - ఈరెంటి సమ్మేళనం, నాకు మిక్కిలి తృప్తి నిచ్చింది.

ఆమెకు ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కొడుకులు. పెద్దామె క్రేఫర్డ్‌లోని జాన్ పోలక్ గారి భార్య మేరి. రెండవ ఆమె యాన్. మూడవఆమె బర్త ఎలిజబెత్. నేను పరిచయ మయినప్పటికి యాన్‌కి వివాహం కాలేదు. ఫ్రెడరిక్ సైక్స్ అనే యువకుడు ఆమెను వరించి ఆమెను చూడటానికి అప్పుడప్పుడు వస్తూవుండే వాడు. కొంతకాలానికి వారు వివాహమాడారు. సైక్స్‌గారు ఏరోప్లేన్లు ఉత్పత్తిచేసే ఒక పెద్ద సంస్థ డిజైన్సు డిపార్టుమెంటులో డ్రాఫ్ట్సుమన్‌గా పనిచేస్తూ వుండేవారు. చాల నెమ్మది, మర్యాద గల వ్యక్తి. మితభాషి. స్నేహశీలి. యాన్ కూడ చాల నెమ్మదియైన పిల్ల. ఏ భేషజంలేక, ఏ దురాలోచనలేక సరళంగా, సహృదయంతో ఇతరులతో నడచుకొనేది. పెద్ద అందగత్తెకాదు. కాని తన అక్క మేరి కంటె మెరుగే. మూడోపిల్ల, బర్త ఎలిజబెత్ చురుకైనది. పొడగరికాదు. కొంచెం లావుగా, చలాకిగా మధ్యరకం అందంతో ఉండేది. వర్ణభేదం పాటించే స్వభావం కలది కాదు. స్నేహంగా, చనువుగా వర్తించే మనస్తత్వంకలది. ఆమెతో నాకు చాలా చనువు ఏర్పడింది. మేమిద్దరం కలసిమెలసి తిరిగేవారం. బయటివారికి వీ రిద్దరు ముందుముందు వివాహం చేసుకొంటారా అనే సందేహం కలిగేటట్లు మెలగేవారం. కాని ఏ అవినీతిపనులకు మేము దిగలేదు సరికదా, అట్టి సంకల్పమైనా మాకు కల్గలేదు.

పెద్దకుమారుడు జూనియర్ జాన్, తండ్రివంటి మెత్తని స్వభావం కలవాడు. నిరాడంబరుడు. ఏదోఒక సంస్థలో పని చేస్తుండేవాడు. అప్పటి కాయనకు వివాహం కాలేదు. రెండవ కుమారుడు ఆస్వాల్డ్ పెళ్ళిచేసుకొని కుటుంబంనుండి విడిపోయి, వేరేకాపురం పెట్టుకొని తన జీవితం తాను గడుపుకొనుచుండే వాడు. తండ్రి జాన్ గారు కొద్దిపాటి బక్కపల్చని మనిషి. పెద్ద కుమారుడు తండ్రి జాన్ గారివలె బక్కపల్చగా, పొట్టిగా వుండే వాడు. తల్లి హెలిన్ గారు భారీ మనిషి. లావుగా ఉండేది. కోటేరు వంటి ముక్కుతో, చదునైన ఫాలంతో, సమమైన చెక్కిళ్ళతో, చక్కని పెదవులతో, నిండైన ముఖముతో దర్జాగా వుండేది. రెండో కుమారుడు ఆస్వాల్డ్, తల్లిని పోలినవాడు. వయస్సుమీరిన తల్లివలె లావుగా వుండలేదుకాని సరిపడిన లావుతో, ఎత్తుగా ఉండేవాడు. ముఖకవళికలు తల్లివి వచ్చి అందముగా వుండేవాడు. పైగా తల్లివలె చురుకుగా, స్వేచ్ఛగా మాట్లాడేస్వభావం కలవాడు. కొంత దురుసుతనంకూడా కల్గివున్నట్లు అనుమాన పడ్డాను. పెద్ద కుమార్తె మేరి, రెండో కుమారుడు ఆస్వాల్డ్, అతని భార్య అప్పుడప్పుడు తల్లిదండ్రులవద్దకు వచ్చేవారు. ఆస్వాల్డ్ భార్య అందమైంది. చురుకైంది. ఠీవి కలది. ఈ కుటుంబం లోయర్ మిడిల్ క్లాస్ ( సామాన్య మధ్యరకం ) కు చెందింది. శరీరరంగు విషయంలో పట్టింపులేని సంప్రదాయానికి చెందినవారు. ఈ యింటిలో నా కెట్టి వర్ణవివక్షత కన్పడలేదు. ఆస్వాల్డ్ భార్య విషయంలో, నల్ల జాతివాడే అను భావం నాయందు కొంచెం ఆమె కుండిందని అనుకొన్నానుగాని అది పైకి కన్పించలేదు. ఆస్వాల్డ్ స్నేహపూర్వకంగానే ప్రవర్తించినాడుకాని, అన్న జాన్ వలె స్నేహపూరితహృదయుడు కాదని తోచింది. ఆ కుటుంబంతో పరిచయమయినప్పటినుండి నేను మరొకచోటికి అతిథిగా వెళ్ళలేదు. ఎప్పు డవకాశం వుండినా ఆ యింటికి వెళ్లేవాడను. అక్కడ రెండు, మూడు క్రిస్ మస్ క్రొత్త సంవత్సరం పండుగల్లో పాల్గొన్నాను.

ఆ యింటిలో వున్నప్పుడు జరిగిన రెండు సంగతులు నాకు గుర్తున్నవి. ఒకటి, అక్కడకు శ్వేతజాతీయు డొకడతిథిగా

వచ్చాడు. అతడు బ్రిటిషు సైనికుడుగా కొంతకాలం ఇండియాలో పని జేసినాడట. యాభై ఏళ్లకు తక్కువకాని వయస్సువాడు. పొడుగ్గా, చెలాకిగా, సైనికతరహాగా ఉండేవాడు. అతనికి, నల్లజాతీయుడను కాబట్టి, నే నక్కడ వుండటం యిష్టంలేదు. పైగా మూడవ పిల్ల బర్తఎలిజబెత్ (మామూలుగా బర్త యని పిలిచేవారు) మీద కన్నువేశాడు. నే నా పిల్లతో చనువుగా వుండటం ఆతనికి కన్నెర్రయింది. ఒక క్రిస్‌మస్‌నాడు మే మందరం కలసి హుషారుగా మాట్లాడుకొనేటప్పుడు ఏదోసందర్భంగా నవ్వుచూ, బర్త వీపుమీద చిన్నగా తట్టాను. అది చూచిన ఆ మిలిటరి మనిషి నేను లేనప్పుడు ఇంటివారితో "ఒక శ్వేతవనితను ఒక నల్లజాతీయుడు ఇండియాలో తాకినట్లయితే, అతనిని కాల్చివేసేవార" మని అన్నాడట. అతడు వెళ్లిపోయినతర్వాతగాని ఆ విషయం నాకు తెలియలేదు.

రెండోది, ఆ యింటిలో టెర్రియర్ జాతి ఆడకుక్క ఒక టుండేది. దానికి ఋతుకాలంవచ్చి తక్కువజాతి బైటకుక్కతో సంపర్కానికి సిద్ధమైందట. అదిచూచి, తల్లి హెలెన్ గారు తన కుక్కను దండించటం ప్రారంభించారు. ఆ కుక్కను వెంటబెట్టుకొని అప్పుడప్పుడు నేను షికారుకు వెళ్లుచుండేవాడను. అది కుయ్యో మొర్రో అని గోలచేస్తుండగా నాకు జాలికలిగి "దా న్నెందుకు కొడ్తున్నా" రని అడిగాను. ఆమె "ఆ కుక్క తక్కువ జాతి కుక్కతో సంయోగానికి సిద్ధపడింది, అట్టిది కూడ" దని అన్నది. నా మనస్సు చివుక్కుమన్నది. ఇప్పటికికూడ భారతీయులు తక్కువజాతి వారని చాలామంది శ్వేతజాతివారి అభిప్రాయం. ఆ కాలంలో అది చాలా హెచ్చు. ఎంత సహృదయులైనా జాతి, వర్ణ విచక్షణ పాటించనివారైనా, ఈ పాదుకొనివుండిన ఎక్కువ, తక్కువ జాతు లనేభావం ఇప్పటికీ పూర్తిగా సమసిపోలేదు. అది ఎరిగి వున్న నామనస్సు కుక్కవిషయంలో చూపిన మేలుజాతి, హీన జాతి అనే విచక్షణ, ఈమె మనుష్యులకు వర్తింపజేయదా అనే భావం నాకుకలిగి, నన్నేదో ఆమె మందలించుచున్నట్లు ఎంచుకొని కొంత బాధపడ్డాను. కాని నిజానికి ఆమె తన ప్రవర్తనను నాకు, తన కుమార్తె బర్తకు అన్వయింపచేయాలనే ఉద్దేశం

ఏమాత్రం కలిగియుండలేదని తర్వాత అనుకొన్నాను. నేను, బర్త స్నేహంగాఉండటాని కామె ఎప్పుడు అభ్యంతరం చెప్పలేదు. కాని బర్త వయస్సుపిల్ల, నేను యువకుణ్ణి. ఏ ఉద్రేకక్షణం లోనైనా హద్దుమీరుతామేమో, అందువల్ల చెడుఫలితాలు కల్గుతాయేమో అను భయంమాత్రం ఒకసారి కన్పరిచింది. ప్రాతఃకాలభోజనం తర్వాత మెత్తని బంగారుకాంతులతో సూర్యభగవానుడు ఆకాశాన్ని అలంకరించియుండగా, బైట పచ్చికబయళ్ళకు మేము కొందరం షికారుకువెళ్లాము. కొంత దూరం కలసివెళ్లిన తరువాత ఇతరులు అటు ఇటు పోగా బర్త, నేను కలసి, వేరుగా ఇంకొకప్రక్కగా వెళ్లి వృక్షాలతో దొడ్డిగా మదుగుగా వుండినచోట చెట్లనీడలో వెల్లికల పడుకొని, చెట్ల చల్లని గాలిని, వెచ్చని సూర్యరశ్మిని అనుభవించుచు, కబుర్లు చెప్పుకొనుచుండినాము. పదినిమిషాలు గడిచినవో లేవో, ఇంతలో మమ్ములను వెదుకుకుంటూ తల్లి హెలెన్‌గారు అక్కడకు వచ్చారు. మీరు "మంచి వయస్సులోవున్నారుకదా. చాటుకువస్తే ఏదైనా అవాంఛనీయమైనకార్యం చేస్తారేమో అని భయపడి మిమ్మల్ని హెచ్చరించటానికి వచ్చా" నని ఆమె నిష్కల్మషంగా తరువాత నాతో చెప్పింది. "చౌదరిబిడ్డా, మీ ఇద్దరిస్నేహానికి నే నడ్డురాను. కాని సక్రమపద్ధతిలో యువతీ, యువకులు ప్రవర్తించవలెనుగదా" అని అన్నది. పాపం, బర్తకొక దురదృష్టం అదివరకే కలిగి వుండింది. ఒకయువకుడు తాను ఇండియన్ సివిల్ సర్వీస్ ఉద్యోగానికి అర్హతపొందియున్నానని, త్వరలోనే ఇండియాకు ఉద్యోగహోదాలో వెళ్తానని నమ్మించి ఆమెను పెండ్లాడాడు. అతడే పరీక్ష కాలేదని, ఇండియాకు ఉద్యోగిగా వెళ్లటానికి అర్హత లేనివాడని, మోసగాడని తర్వాత తెలిసింది. పైగా, అతడు నపుంసకుడని తేలింది. అందువలన వివాహ రద్దుకు కోర్టుకు పిటీషను పెట్టుకొనియున్నది. కోర్టువారు వివాహ రద్దుకు ఒప్పుకొన్నారు. రద్దును ఖాయంచేయటానికి కొంత వ్యవధి ఇంకా వున్నది. ఇట్టి స్థితిలో పురుషసాంగత్యం కూడదు. ఇది కారణంగాకూడా హెలెన్ వుడ్‌బ్రిడ్జి గారు ఎక్కువ భయపడినారు.

నేను ఆక్స్‌ఫర్డ్ మజ్‌లీస్‌లో 1923 జనవరిలోగాని సభ్యుణ్ణిగా చేరలేదు. ఇది ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకొనే ఇండియన్ విద్యార్థుల సంఘం. ఇది కొన్ని సంవత్సరాలుగా వుండింది. ఇండియన్ విద్యార్థులు వారానికొకసారి సమావేశమై వివిధ విషయాలను గూర్చి చర్చించుకుంటూరు. ఇంగ్లండుకు వచ్చిన ఇండియన్ పెద్దలను ఆహ్వానించి వారి ఉపన్యాసాలను, సలహాలను వింటారు. ఇండియన్లుకాని పెద్దలను కూడా ఆహ్వానిస్తారు. ఆక్స్‌ఫర్డ్ యూనియన్ సొసైటి వంటి విద్యాసంఘాలతో సమిష్టి చర్చలను ఏర్పాటుచేసుకొంటూరు. ఇతర విద్యార్థిసంఘాలవారు తమ ప్రతినిధులను పంపటం, వీరు తమప్రతినిధులను ఇతర సంఘాలకు పంపటం పోటీగా చర్చలుజరపటం జరుగుతూంటుంది, ఒక సందర్భంలో పంజాబ్ కేసరి లాలా లజపతిరాయిగారు ఇంగ్లండుకు రాగా, వారిని మజ్లిస్‌వారు ఆహ్వానించారు. వారు ఇండియన్ విద్యార్థులు ఇంగ్లండులో బాగా చదువుకొని మాతృదేశానికి సేవచేయాలని, తమచదువు ధ్యేయం, ఉద్యోగాలుచేసి అధికారం చెలయించాలనుకోవటంకంటె, ఏ విధంగా భారతదేశాన్ని సేవించాలో, ఆమె ఘనతకు ప్రయత్నించాలో ఉద్బోధించారు. విద్యార్థులు తమ దేశ ప్రతినిధులు తమ దేశ గౌరవాన్ని, తమనడవడితో కాపాడటమే కాదు పెంపొందించాలనికోరారు. వారి ఉపన్యాసం విషయపూరితమే గాని, ఉత్తేజాన్ని కలిగించలేదు. ప్రఖ్యాత వక్తలని, జన సమూహాన్ని ఉర్రూతలూగించే గంభీరోపన్యాసకులని పేరొందిన పంజాబ్ కేసరి సుస్తీచేసినందువల్లనో, అలసటవల్లనో చాలా నెమ్మదిగా, భావోద్రేకం లేకుండా ఉపన్యసించారు.

వారికి, ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిమిత్రుడు, శ్రీ టేక్‌చంద్ దండా తెలిసియుండింది. శ్రీ దండా పంజాబి. ఆయనతండ్రి హైకోర్టు జడ్జిగా ఉండేవారు. ఆకాలంలో అనుకోందును శ్రీ లజపతిరాయి గారిని, శ్రీ దండాతోకలసి, లండన్ రైల్వేస్టేషన్‌లో వారు రైలుపెట్టెలో కూర్చొనివుండగా దర్శించి, వారి ఫొటో తీశాను. ఇది నాదగ్గరున్నది.

ఒక సాంవత్సరిక సమావేశానికి, సుప్రసిద్ధ కార్మికనాయకుడు జార్జి లాన్స్‌బరిగారు ముఖ్య అతిథిగా వచ్చారు. వారు మిక్కిలి



అక్స్ఫర్డు మజ్లిస్ (1925), అక్స్ఫర్డ్

ఉత్తములు, సహృదయులు. కనికరం, సేవ, నిస్వార్థం వారి సొత్తు. వారిది మిక్కిలి నిరాడంబర వేషం, జీవనం. వారు ఇండియా అన్నా, ఇండియన్లన్నా మిక్కిలి అభిమానం, సానుభూతి కలవారు. అప్పటికే వృద్ధమూర్తి. అయినా నిరంతరకృషితో రాజిల్లేవారు. నిండైనవిగ్రహం, సాధుత్వం ఉట్టిపడే స్వరూపం. నిష్కల్మషం వెలువడే ధోరణి. ఆక్స్‌ఫర్డ్‌లోని పెద్దహోటల్‌లో సాంవత్సరిక విందు జరిగింది. లాన్స్‌బరిగారు ఉపన్యసించి ప్రబోధించారు. మాటతీరు, ఉచ్చారణ సామాన్య కార్మికనాయకుని పద్ధతిలో వున్నవి. గ్రూప్ ఫోటో తీసుకొన్నాం.

ఆక్స్‌ఫర్డ్‌లోని ఇండియన్ విద్యార్థిప్రముఖు లందరు మజ్లిస్ చర్చలలో పాల్గొన్నవారే. నేను 1923 జనవరినుండిగాని దాని సమావేశాలకు వెళ్లటం ప్రారంభించలేదు. కాబట్టి అంతకుముందే స్వదేశానికి వెళ్లిపోయిన శ్రీ కె. పి. యస్. మీనన్, శ్రీ ఎ. యస్. పి. అయ్యర్‌వంటి మేధావులు, వక్తలైనవారి ఉపన్యాసాలు, చర్చలు వినలేదుగాని, శ్రీ యమ్. సి. చాగ్లా, శ్రీ ఫాన్సే, శ్రీ బాఖర్ ఆలీ మీర్జా, శ్రీ అలియార్ జంగ్ (అప్పుడు ఖాన్) శ్రీ డి. యస్. రెడ్డి, శ్రీ బేనీప్రసాద్‌వంటివారి ఉపన్యాసాలు విన్నాను. శ్రీ చాగ్లా, శ్రీ ఫాన్సే, శ్రీ బేనీప్రసాద్ మంచి వక్తలు. శ్రీ బాఖర్ ఆలీ మీర్జాగారు చక్కగా మాట్లాడేవారు. శ్రీ రెడ్డి ఆరోజుల్లో మేధావిగా పేరొందినారుగాని వక్తగా ఖ్యాతి పొందలేదు. శ్రీమతి ఇందిర భగవత్, శ్రీ లీలామణినాయుడు వంటి విద్యార్థులు హాజరయ్యేవారు. శ్రీ బండారునాయకే అప్పుడప్పుడు వచ్చేవారుకాని వారు సభ్యులు కాదనుకొందును.

ఆక్స్‌ఫర్డ్‌లో అనేకరకాల విద్యార్థి క్లబ్బులుండేవి. ఇవన్నీ, వారాని కొకసారి సమావేశమయి, చర్చలు జరుపుకొనేవి. సామ్రాజ్యవాదులనుండి సాంఘికవాదులవరకు, భిన్నభిన్న అభిప్రాయాలుకలవారు సంఘాలని, క్లబ్బులని పేరుతో వారానికొకసారి సభలు జరుపుకొంటూ, తమ తమ అభిమాన ధోరణులను చాటేవారు. ఈ అభిప్రాయాలుకల క్లబ్బు వుండవచ్చును, ఈఅభిప్రాయంకల క్లబ్బు వుండకూడ దనే నిషేధం లేదు. ఎవరికిష్ట

మెచ్చిన క్లబ్బు వారు పెట్టుకోనవచ్చును. ఎవరికి తోచిన అభిప్రాయాన్ని వారు వెలువరించవచ్చును. వీనిలో తలమానికం, ఆక్స్ఫర్డ్ యూనియన్ సొసైటి అని వేరే చెప్పనవసరంలేదు.

ఒక్క ఆక్స్ఫర్డ్ యూనియన్ సొసైటికి తప్ప ఏ ఇతర క్లబ్బుకు స్వంతభవన మున్నట్లులేదు. ఆక్స్ఫర్డ్ మజ్లిస్ కూడా అద్దెభవనంలోనే కార్యకలాపాలను జరుపుకొనేది. యూనియన్ సొసైటి ఆధ్వర్యాన ఐసిస్ అనే మాసపత్రిక వెలువడేది. మజ్లిస్‌కు ఇండియన్ మజ్లిస్ అను పేరుతో మాసపత్రికను శ్రీ శాఖర్ ఆలీ మీర్జావంటివారు నడిపేవారు.

వేసవి సెలవులేకాక క్రిస్‌మస్, ఈస్టర్ వంటి సెలవులు ఉన్నాయికదా. ఎప్పుడేసెలవు వచ్చినా, ముందు ఆక్స్ఫర్డ్‌నుండి లండన్ వెళ్లటం తప్పదు. అక్కడినుండి గాని ఎక్కడకు వెళ్లినా. అసలు నాకు తెలిసింది అదొక్కటేమార్గం. లండన్‌కు వెళ్లినప్పుడు కెప్లెర్‌స్ట్రీటు నుండి మారి 112, గవర్‌స్ట్రీటులో నుండుచుండిన ఇండియన్ వై. యమ్. సి. ఎ. కు వెళ్లటం, అక్కడ చపాతి మాంసం కూర్మా తినటం పరిపాటి. మరిన్ని ఎప్పుడు లండన్‌కు వెళ్లినా చైనీస్ రెస్టారాంటుకు విధిగా వెళ్లట ముండేది. లండన్‌లో చాలా చైనీస్ రెస్టారాంటు లున్నాయిగాని, నాకు అభిమానం స్ట్రాండ్‌లోని రెస్టారాంటు. ఇది ఆక్స్ఫర్డ్ సర్కస్‌కు దగ్గర. ఆ సర్కిల్‌లో పెద్దదొక టున్నది గాని, చిన్నదైన స్ట్రాండ్ లోనిదే ఎక్కువ అనుకూల మనిపించేది. తప్పనిసరి కన్నట్లు అక్కడ తినేది ఫ్రైడ్‌రైసు ( వేయించిన వరి అన్నం ), దీనితో మిశ్రం రొయ్యలుగాని, కైమాగాని, కోడిగ్రుడ్లుకాని. చాప్ సూయి అని, పందిమాంసం, చేపలు వగైరా ఉండేవికాని, నేను ముఖ్యంగా రొయ్యలు కలిపినదే తినేవాణ్ణి. పచ్చిబటాణీ వగైరాతో చేసిన ద్రవం ( సాస్ ) చల్లుకొని తింటే, మంచి రుచిగా ఉంటుంది. ఇంగ్లీషు భోజనాల్లో యిచ్చే టొమాటో ( రామములక్కాయ ) సాసు వంటివి దీనిమీద బలాదూర్. ఎక్కువ రుచిని కలిగించే రెండో తోడు బాంబెడక్. ఇది చేప. ఎండినదాన్ని పొడుగాటి సన్నముక్కలుగా కాల్చి లేక వేయించి

ఇచ్చేవారు. ఇది నంజుకుంటే, తినే వేయించిన అన్నం మిక్కిలి ఆసక్తిదాయకంగా ఉండేది. నేను ఇండియాకు వచ్చినతర్వాత ఈ బాంబెడక్ కోసం ప్రయత్నించానుగాని లభ్యంకాలేదు. మన దేశంలో మద్రాసు, కలకత్తా, బొంబాయివంటి నగరాల్లో చైనీస్ భోజనశాల లున్నవి. మద్రాసులో రెండున్నవి. దానిలో నేను రెండు మూడు సార్లు భోజనంచేశాను. సాస్ లండన్‌లో వంటిది కాదు. బాంబెడక్కును ఇవ్వలేదు. భోజనం అంత బాగా ఉండలేదు. హైదరాబాద్‌లోకూడా ఇట్టి భోజనం చేశాను. ఏమాత్రం తృప్తిని కల్గించలేదు. మద్యపానీయాలు మాత్రం దొరుకుతాయి.

రీజెంటుస్ట్రీటులోని వీరాస్వామినాయుడుగారి రెస్టారాంటు గాక, లండన్‌లో ఇంకా రెండు మూడు ఇండియన్ రెస్టారాంటు లుండేవి. ఇందులో మసాళాతోవండిన గొర్రె, కోడిమాంసాలు చపాతీలు వగైరా ఇచ్చేవారు. వానిలో చాలా సంవత్సరాలనుండి నడుస్తున్న దొకటి పికడల్లి సర్కస్‌కో, ఆక్స్‌ఫర్డ్ సర్కస్‌కో దగ్గరగాఉండేది. దీనిని పూర్తిగా మహమ్మదీయులు నడపేవారు. తరువాత అమలులోకివచ్చిన, నేను రెండు మూడు సార్లయినా వెళ్లిన రెస్టారాంటు, ఇండియన్ రెస్టారాంటు అనేపేరుతో 32, టాటెన్‌హామ్ రోడ్డులో ఉండేది. ఇంకొకటి మద్రాసు వా రెవరో నడిపేది ఒక చిన్న దుండేది. ఇవన్ని ఇప్పుడున్నవో, అంతరించిపోయినవో చెప్పలేను. శ్రీ వీరాస్వామినాయుడు చనిపోయినతర్వాత ఆయన రీజెంటుస్ట్రీటులో నడిపించిన ప్రఖ్యాత భోజనశాల మూయబడిందని విన్నాను. మద్రాసువారిది పోయియుండును. మహమ్మదీయులు (ఈజిప్షియనులా?) నడుపుచుండిన దింకా వుండవచ్చును. మరిన్ని క్రొత్తవి బైలుదేరి వుండవచ్చును.

ఏదోవిధంగా 1924 గడచిపోయింది. క్రిస్‌మస్‌కు వాల్తమ్ యాబెకు వెళ్ళాను. క్రొత్త సంవత్సరంకూడా శ్రీమతి హెలెన్ వుడ్‌బ్రిడ్జిగారి కుటుంబంతో గడిపాను. బర్త యువతితో

స్నేహం చెరపాను. లింకల్‌స్ ఇన్ సాముదాయక భోజనాలలో పాల్గొన్నాను. చదువు కొంతకుకొంత సాగింది.

1925 జూన్ వరకు ఈస్టర్‌వంటి సెలవులు క్రేకఫర్డ్‌లోనో, వాల్తమ్ యాబెలోనో, లండన్‌లోనో గడిపాను. ఈ సంవత్సరం వేసవి సెలవులలో పారిస్‌లోనేగాక, ఫ్రాన్స్ ఉత్తరపరగణా బ్రిటని లోను, శీతాకాలం సెలవులు దక్షిణఫ్రాన్సులోను గడిపాను. ఈలోగా కొన్ని అనుభవాలు కల్గాయి. జ్ఞాపకమున్నంతవరకు వ్రాస్తాను.

మా ఆక్స్‌ఫర్డ్ నానుకొని ఐసిస్ అనే ఉపనది ఉన్నది. దీని దిగువభాగాన్ని చార్‌వెల్ అంటారు. దీనికి పాయలున్నవి. ఒకపాయలో ఒకచోట ద్వారంగాక, నలుప్రక్కల మూసిన ఆవరణుండినది. ఈ ఆవరణలో విశ్వవిద్యాలయ అధ్యాపకులు, విద్యార్థులు స్నానంచేస్తారు. మనవలె పాశ్చాత్యపురుషులకు, తమ జననాంగాన్ని ఇతర పురుషులు చూచిపోతారేమో అనే సంకోచం, బిడియం తక్కువ. అందువల్ల అక్కడ స్నానంచేసేవా రందరు మొండిమొలతోనే చేస్తారు. పాశ్చాత్యదేశాల్లో, ఇటు వంటి సమయాల్లోతప్ప స్నానంచేయటం గదిలోనే. పల్లెటూరు వాళ్లుకూడా గదిలోనో, లేక మరుగున్నచోటనో చేస్తారు. మనవాళ్లు గదిలో స్నానంజేసినా అంగవస్త్రంగాని, గోచీగాని లేనిదే స్నానంచేయరు. పాశ్చాత్యులు ఏ సముద్రస్నానంలోనో, ఏ బహిరంగస్థలంలోనో, స్త్రీలున్నచోట్ల తప్ప ఏమాత్రం మరుగున్నా మొండిమొలతోనే చేస్తారు. ఒకసాయంత్రం నేను, మిత్రుడు జాంజిబారుకు చెందిన డబ్లుయు. వాలీధార్సి పాయగట్టున వెళ్లుచూ, ఆ ఎన్‌క్లోజర్‌లోకి వెళ్లాం. స్నానంచేయాలని కాదు, ఏమున్నదో అని తెలుసుకొనటానికి. మేము ప్రవేశించి రెండ డుగులు వేశామోలేదో, ఎదురుగా ఆరడుగులకు రెండుమూడు అంగుళాలైనా మించిన పొడుగుపాటి లావువిగ్రహం మొండి మొలతో ప్రత్యక్షమైంది. తీరా చూస్తే ఆ విగ్రహం ఎవరిదో కాదు, అసాధ్యుడు, మా సీనియర్ ప్రోక్టరు, ప్రొఫెసరు బెల్‌గారిది.

మేము చకితులమైనాము. మమ్ము చూచి ఆయన చిరునవ్వు నవ్వగా, మేముకూడా చిరునవ్వు నవ్వి వచ్చివేశాం. ఆయన వెనుక కొంతమంది మొండిమొలతో స్నానంచేస్తూనేవుండినారు.

నేను, మిత్రుడు ధార్సి రెండు మూడుసార్లైనా ఇటువంటి స్నానస్థలాలకు వెళ్లి ఇతర పురుషులతో కలసి మొండిమొలస్నానం చేశాము. ఒకచోట చాలామంది పడుచు, మధ్యవయస్సు, వయస్సుమళ్లినవా రుండిరి. వారిలో ఒక యువకుని లింగం చాలా పొడవు. తొమ్మిది, పది అంగుళాలైనా ఉంటుంది. ఏ ఉద్రేకంవల్లనో అది లేచివున్నది. ప్రయత్నించినా అది ముడుచుకోలేదు. అందువల్ల ఆ యువకుడు సిగ్గుపడి బోర్ల పడుకొని దానిని దాచాలని ప్రయత్నించాడు. నిజంచెప్పాలంటే ఇంత దీర్ఘలింగాన్ని ఏ స్త్రీ జననాంగం భరించగలదా అని నాకు ఆశ్చర్యంవేసింది. మేము త్వరగా స్నానం ముగించుకొని వచ్చివేశాం. మేముకూడా మొండిమొలతోనే స్నానంచేశామని వేరే చెప్పనక్కరలేదు.

ఇంకొకచోట చచ్చినంతపనైంది. ఇక్కడ స్నానం చేయటానికి పెద్ద జలాశయ మున్నది. అందరిస్నానం దానిలోనే. కొందరు స్నానంచేసి సిరెండలో విశ్రమించుచుండగా కొందరం కొలనులో దిగాం. దాని మధ్యభాగం చాలా లోతు. నాకు ఈత, ఏ కొంచెమోతప్ప, రాదు. అయినా మూర్ఖంగా లోపలికి పోయి ఈదలేక మునిగిపోయాను. ప్రక్కనున్నవాళ్లు ఇద్దరు ముగ్గురు చప్పునవచ్చి నన్ను ఒడ్డుకుచేర్చారు. మందలించారు. ఈదఫా శ్రీ ధార్సి ఉన్నదిలేనిది బాగా గుర్తులేదు.

ఈ అనుభవం తర్వాత ఇట్టి ప్రైవేటు స్నానస్థలాలకు వెళ్లలేదు. సముద్రస్నానంమాత్రం అప్పుడప్పుడు చేస్తూవచ్చాను, స్నాన దుస్తులతో.

1922 మే నెలలో ఆక్స్‌ఫర్డ్ కాలేజిలమధ్య జరిగిన పోటీ పడవపందాలను చూడటానికి మిసెస్ ఎడ్డింగ్‌టన్‌ను తీసుకువెళ్లింది గాక, తరువాత సంవత్సరాలలో నాకు వసతి యిస్తున్న ఇద్దరు ముగ్గురు వసతియజమానురాళ్లనుకూడా పడవపోటీలకు తీసుకొని వెళ్లాను. 1925 లో అనుకొంటాను, స్నేహితురాలు కుమారి

బర్త్ఎలిజబెత్ వుడ్ బ్రిడ్జిని తీసుకొని వెళ్లాను. ఆమె మధ్యాహ్న భోజనానికి వచ్చి సాయంత్రం ఆరు, ఏడు గంటలకు వెళ్లిపోయింది. ఈమెతో అద్దెకు తీసుకొన్న పంట్ (చిన్నపడవ) లో మిక్కిలి ఉత్సాహంగా రెండు మూడుగంటలు గడిపాను. ఐసిస్ నది మాగ్డలీన్ కాలేజిప్రాంతమున మిక్కిలి రమణీయంగా ఉంటుంది. మాగ్డలీన్ కాలేజి నదిఒడ్డున కట్టబడింది. దాని గడియారం టవర్ నీళ్ళలో ప్రతిబింబిస్తూ వుంటుంది. కాలేజి నానుకొని చక్కని బ్రిడ్జి వున్నది. బ్రిడ్జిగుండా ఆప్రక్కకుపోతే చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. పంట్లో ప్రయాణిస్తూ అక్కడక్కడ ఆగి పరిసరాలను చూస్తూ కాంతివంతమైన వెచ్చని, బంగారు నీరూదినట్లుండిన ఎండలో కాలంగడిపాము. ఈసంగతులు తెలుసుకొన్న విలియమ్స్ అనేవారు నన్నుకలసికొని స్త్రీలతో ఇట్టి విహారాలు కూడవని మందలించారు. ఈయన ఇండియా ఆఫీసు గూఢచారివంటివాడు. ఇండియన్ విద్యార్థులకు సహాయ సలహా లిచ్చుటకున్నట్లుగా ఏదో పేరుపెట్టుకొని మా మీద నిఘావేయటాని కుండినాడు. నాతో అంతకుముందు నన్నప్పు డప్పుడు వచ్చి చూస్తూవుండుమని చెప్పాడుగాని నేను ఖాతరు చేయలేదు. ఈ మందలింపు తర్వాత నే నతని ఉనికిని గమనించ నట్లే వ్యవహరించాను. నిజానికి ఆయనతో నాకు పొత్తు ఎప్పుడు లేదు. మొదట ఎవరో పెద్దమనిషి మన కుద్యోగాలు కావాలంటే సలహాయిస్తాడు కాబోలు ననుకొన్నాను. మాకు ఆక్స్‌ఫర్డ్‌లో విద్యావిషయంలోగాని, హద్దుమీరని నడవడిలోగాని పూర్తి స్వేచ్ఛ. విశ్వవిద్యాలయాధికారులకు ఈ పానకంపుడకతో సంబంధంలేదు. ఏ అవరోధాన్ని వారు తమవిద్యార్థుల విషయంలో సహించరు. ఈ అడ్డపుడక పట్టించుకొనని వారికి వట్టి పుల్లే. ఆవిధంగానే అతనిని నేను చూచాను. ఇండియా ఆఫీసువారు తమ కే విద్యార్థివల్ల, తమ సామ్రాజ్యాధిపత్యానికి చిక్కులు వస్తవో అని వేయికళ్ళతో చూస్తూవుండేవారని దీనినిబట్టి తెలుస్తున్నది.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో 22 కాలేజీ లున్నవి. స్త్రీల నాల్గు కళాశాల లిందులో చేరవు. ఇవిగాక మతసంబంధమైనవి నాలుగున్నవి. స్త్రీల కళాశాలలు సంవత్సరం జరిగే పడవల పోటీ పందాల్లో పాల్గొనేవికావు. నిజానికి బార్జెస్ అనే పడవ ఇళ్ళు వాని కుండేవి కావు. పోటీ అల్లా మగవాళ్ల కళాశాలల మధ్యనే. ప్రతి కాలేజికి ఒక పడవ ఇల్లున్నది. పందెంపడవ లున్నవి. క్రికెట్, రగ్బీ, హాకీ, టెన్నిస్‌వంటి ఆటలకేగాక, పడవ నడపటానికికూడా ఏ కాలేజి కా కాలేజికి టీములుంటాయి. ప్రతి కాలేజి పడవల పోటీపందాల్లో పాల్గొంటుంది. బార్జెస్ వుంచినచోట, పోటీపందాలు జరిగేచోట, ఐసిస్ ప్రవాహం మిక్కిలి వెడల్పుగా, పుష్కలంగా ఉంటుంది. ప్రవాహం ఒక ఒడ్డున పెద్దపెద్ద గుబురువృక్షాలు, వృక్షాల కవతలప్రక్క పచ్చిక బయలు. చెట్లున్నవైపు అంచున బార్జెస్‌ను వుంచుతారు. దీనికి పై అంతస్తు ఉంటుంది. పై డెక్కమీద గుడారం వేసుకోవచ్చు. ప్రవాహం రెండోప్రక్క పడవల ఇల్లు ఉన్నది. దీనిలో కాలేజిల బోటు లుంటాయి. తరిఫీదుకు, పందానికి ఏ కాలేజి కా కాలేజి వారు తమ పడవలను వాడుకొంటారు. బోటుహౌస్ ఉండేప్రక్క అక్కడక్కడ సన్నపాటి సామాన్యచెట్లుగాక, రస్తామాత్ర ముంటుంది. పందాల సమయంలో విద్యార్థులు, చూడటానికి వచ్చినవారు, వారి వారి అభిమాన పడవలను ప్రోత్సహిస్తూ పరుగెత్తుతారు. గుంపులు గుంపులుగా ప్రజలు గుమిగూడుతారు. మిళితమై రస్తాబారునా ఒకే ప్రజావాహినిగా తయారవుతారు, వచ్చిన అతిథులు ముందుగా బార్జెస్‌లోకి వెళ్లి, ఆతిథేయులిచ్చిన టీ, కేకు స్వీకరిస్తారు. తర్వాత కొందరు, అద్దెకు తీసుకొన్న పంట్లలో, ఎవరిచేతనైన నడిపించుకొనో, తామే స్వయంగా నడుపుకొనో, పందెంలోని పడవల ననుకరిస్తారు. ఎక్కువమంది రెండోప్రక్కకు వచ్చి చూస్తారు. కొద్దిమంది బార్జెస్‌ప్రక్క నున్న చెట్లకట్టమీదనుండి అవలోకిస్తారు.

ఈ పందాలకాలాన్ని మైట్సువీక్ అంటారు. పడవను ఎనమండుగురు, చుక్కానికాక, నడుపుతారు. పోటీలు వారం రోజులు జరుగుతాయి. అందువలన ఈపేరు వచ్చియుండును. ఈసమయంలో బార్జెస్‌ను కాలేజి కలర్సుగల గుడ్డలతోను, రంగు కాగితాల తోరణాలతోను చక్కగా, నిండుగా అలంకరిస్తారు.

ఈసందర్భంలో ఒకసారి జరిగిన సంగతి గుర్తుకువస్తున్నది. శ్రీ యస్. సి. సేనుగారిభార్య, వారి ముగ్గురు కూతుళ్లు ఒకరి అతిథులుగా మైట్సువీక్‌కు వచ్చారు. వారిని ఆహ్వానించినవారి కాలేజిబార్జి ప్రక్కన నిల్చుండి పడవలపందాలు చూస్తుండినారు. నే నివతలప్రక్క నుండినాను. నన్ను చూచారు. నన్నిదివరకు హెన్లలోను ఈస్ట్‌బర్న్‌లోను జరిగిన ఇండియన్ కాన్ఫరెన్సులో చూచి పరిచయమైవున్నారు. కాబట్టి వారిలో రెండోపిల్ల, మూడో పిల్ల నాకు చెయ్యిఊపారు. నన్ను ఆ ప్రక్కకు రమ్మనో, వారే ప్రక్కకు వస్తామనో వారుకోరినట్లైనా కావచ్చును, వారు నన్ను గుర్తించినట్లు పలకరించినట్లయినా కావచ్చును. ప్రతిగా నా చేయికూడా ఊపకుండా, నేనుండినచోటునుండి తప్పుకొని, ప్రక్కనున్నవారిచాటుకు పోయాను. ఇది బిడియంకావచ్చును, పిరికితనం కావచ్చును. పల్లెటూరిలో పుట్టిపెరిగినవారికి కాంక్షఎంతవున్నా చప్పున పరాయిస్త్రీతో చనువుగా ఉండలేరు. ఉంటే వారికి తోచేది అంతిమచర్యే. సేనుగారి కూతుళ్లు బాగా చదువుకొన్న వారు. సంస్కారం, సంస్కృతి కలవారు. వారిని నేను, నన్ను వారు అదివరకు చూచివుండినా, మాకు ముఖపరిచయమేగాని, చనువు ఏర్పడియుండలేదు. ఆపిల్లల తల్లితో మాట్లాడికూడా ఎరుగను. అందువల్లకూడా వారిగుర్తింపుకు సరితూగలేకపోయాను. నే నిదివరలో చెప్పితినికదా, నాది సహజంగా బిడియంతోకూడిన జంతు అని.

ఇంకొకటి గుర్తువస్తున్నది. యస్. వెంకటేశ్వరన్ అనేవారు మా ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి. ఆయన ప్రతిభాశాలి. వారు ఐ. సి. యస్. పోటీపరీక్షకు కూర్చొనినారు. మొదట తీసుకోలేదుకాని, తరువాత ఖాళీఏర్పడగా సర్వీసులోకి తీసు

కొన్నారు. వారి మైట్సువీక్‌లో పడవలపందాలను చూడటానికి మామూలుగా అందరుండే ప్రక్కను నిల్చుని, మాకాలేజిబార్జిలో వున్న నన్నుచూచి చేయివూపి, నేనుకూడ బార్జిలోకి వస్తానని సంజ్ఞచేశారు. అప్పుడొకామె (శ్వేతవనిత) మాత్రమే నాతో ఆబార్జిలో వున్నది. అందుచేత వద్దని తిరిగి సంజ్ఞచేశాను. ఆయన చిన్నబుచ్చుకొన్నాడనుకొందును. ఆయనను వద్దనిచెప్ప టానికి రెండుకారణా లుండియుంటవి. ఒకటి, నేను తీసుకొనివెళ్లిన స్త్రీ సాంగత్యానికి ఈయన పానకంలోపుడక అవుతాడని; రెండు, ముఖ్యమైంది, ఈయన నల్లగా స్ఫోటకంమచ్చలతో బక్కగా కొద్దిపాటి విగ్రహంతో, కొంతవికారంగానే వున్నట్లు తోచేవాడు. నేను ఎరుపుకాదుగాని, నలుపుమట్టుకు కాదు. కొంతవరకు బాగానే ఉంటానని అనుకొనేవాడను. శ్రీవెంకటేశ్వరన్ మేధావి, విద్యాధికుడు. పైగా, ఇండియన్ సివిల్ సర్వీసులో స్థానం సంపాదించుకొన్నాడు. అయినా, తక్కువవ్యక్తిత్వం కలవాడుగా చప్పన తోచేవాడు. నావెంటనుండిన శ్వేతస్త్రీ చీదరించు కొంటుందేమో అని భయపడ్డాను. జీవితంలో ఆయనకంటె నేను చాలా లొచ్చు. కాని స్త్రీ మమకారం, నన్నట్టి అమర్యాదకు గురిచేసింది.

లండన్‌లోని సివిల్ సర్వీసు బోర్డువారు, హోమ్ ఇండియన్, కలోనియల్ సర్వీసుకు కావలసినవారికొరకు కలిపి, పరీక్ష పెడతారు. పరీక్షలో ఉత్తీర్ణులవటం, తప్పటం అనేవిధానం ఉండదు. మార్కులనుబట్టి స్థానాలు (రాంకింగ్) నిర్ణయిస్తారు. సర్వీసుకు కావలసిన సంఖ్యకు పైనుండి సంఖ్యచివరకు విడదీసి, అంతవరకు స్థానం వచ్చినవారిని సర్వీసులోకి తీసుకొంటారు. పరీక్షకు కూర్చున్న అభ్యర్థులు, తమకు ఏ సర్వీసు అనగా హోమ్, కలోనియల్, లేక ఇండియన్ సర్వీసు కావాలో ముందుగా చెప్తూతారు. పరీక్షలో స్థానంవచ్చినవారు, ఉద్దేశం మార్చుకొని హోంసర్వీసుకు బదులు కలోనియల్‌సర్వీసో, ఇండియన్‌సర్వీసో కోరుకొనవచ్చును. ఆవిధంగానే ఇండియన్ సర్వీస్ కావాలన్న వారు, తీరా మేము హోమ్‌సర్వీసులో చేర్తాం అని అర్థించవచ్చును,

ఆసంవత్సరం ఇండియన్ సర్వీసుకు వెళ్తామన్న ఇద్దరోముగ్గురో పరీక్షఫలితాలు తెలిసినతర్వాత హోమ్‌సర్వీసు కోరుకొన్నారట. వీరిలో చివరిస్థానానికి క్రిందిస్థానం వచ్చిన వెంకటేశ్వరన్‌గారికి అవకాశంవచ్చింది, అదృష్టంకలసివచ్చి. ఒకసంవత్సరం, తీసుకొన్న చివరస్థానం అభ్యర్థికంటె నాల్గుస్థానాలు తక్కువ వచ్చిన శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణాగారు ఇండియన్ సివిల్ సర్వీసులో చేరలేక పోయారు. వెంకటేశ్వరన్‌గారి విషయంలోవలె ఖాళీలు వస్తే ఆయనకూ, ఆ ఛాన్సు వచ్చేది.

మాతండ్రిగారు 1924 మార్చిలో చనిపోయినతర్వాత, నాతమ్ముడు సత్యనారాయణ, ఋణాల బాధకు తట్టుకోలేక భూములను అమ్మాలని నిశ్చయించాడు. అమ్మటానికి నాసమ్మతి కావాలి కదా. అందుకని సర్వాధికారాలతో అతడు వ్యవహరించేందుకు జనరల్ పవర్ ఆఫ్ యటార్నీ పంపుమని వ్రాశాడు. నేను 26-6-1925 న ఆక్స్‌ఫర్డ్‌లోని నోటరి పబ్లిక్ శ్రీ ఎడ్విన్ టి. హాట్‌గారిద్వారా జనరల్ పవర్ ఆఫ్ యటార్నీని సిద్ధంచేయించి, తమ్మునకు పంపాను. అతడు భూములను తెగనమ్మి, కుటుంబాన్ని ఋణవిముక్తిగా చేశాడు.

పైదానిని ముగించినవెంటనే లండన్ బైలుదేరాను. అంతకుముందు లండన్ రసెల్ స్క్వేర్‌లోని ఇంపీరియల్ హోటల్‌కు ఉండటానికి వ్రాస్తే వారు గది ఇస్తామని జవాబిచ్చారు. నేను 26-వ సాయంత్రమో 27-వ ఉదయమో హోటల్‌కు సామానుతో టాక్సీలో వెళ్లాను. హోటల్ రెసెప్షనిస్టు (గదులువగైరా ఇచ్చే మనిషి) ఒక 55 ఏండ్ల వయస్సు స్త్రీ నన్ను ఎగాదిగా చూచి, ఖాళీలేదన్నది. నేను వాళ్లుపంపిన జవాబు చూపించాను. ఏదో పొరపాటు జరిగివుంటుంది, ఖాళీ లేదని ఖచ్చితంగా చెప్పింది. చేసేదేమిలేక వెళ్లి, ఇదివరకు దిగివుండిన రాగ్లన్ హోటల్‌లో దిగాను. ఈ హోటల్ చిన్నది. సామాన్యవసతులు, సామాన్య భోజనం – తగినట్లుగానే తక్కువ రేట్లు. తరువాత వెంటనే, గవర్‌స్ట్రీటు వై.యమ్.సి.ఎ. ఇండియన్ స్టూడెంట్సు యూనియన్‌కు

వెళ్లాను. అక్కడొకరిద్దరకు జరిగిన సంగతి చెప్పి, వారిసహాయంతో 27-6-1925 తారీఖున ఇంపీరియల్ హోటల్‌కు ఉత్తరం వ్రాశాను. 29-వ తారీఖున హోటల్ నుండి జవాబువచ్చింది. ఇంపీరియల్ లండన్ హోటల్సు లిమిటెడ్ శక్రటరి సంతకంతో వచ్చింది. అది ఈ విధంగా వున్నది. (తెలుగు తర్జుమాలో) "మీ 27-వ తారీఖు ఉత్తరానికి జవాబుగా -ఇంపీరియల్ హోటల్‌లో మీకు వసతిఇచ్చేవిషయంలో పొరపాటు జరిగినందులకు మేము గాఢంగా విచారిస్తున్నాం. ఈ దురదృష్టకరమైన సంఘటన (ఇన్‌సిడెంటు) క్రొత్త రెసెప్షన్ క్లర్కు క్రిందటిరోజు లిస్టుచూడటంవల్ల జరిగింది. ఇక వచ్చేవారి (విజటర్స్) సౌమనస్యంకొరకు ఆమెను గట్టిగా చివాట్లుపెట్టాం. ఈసంఘటన మీరు తిరిగి లండన్‌కు వచ్చినప్పుడు మాహోటల్సుకు రాకుండాఉండటానికి కారణంకాబోదని మేము నమ్ముచున్నాం."

పైవిధంగా క్షమాపణ చెప్పుకొన్నట్లుగా ఇంపీరియల్ హోటల్‌వాళ్లువ్రాసినా తిరిగి ఆహోటల్‌కు వెళ్లటానికి ప్రయత్నించ లేదు. నేను 1926 చివరలోగాని లండన్‌లో ఎక్కువరోజు లుండలేదు. వీలైనప్పుడల్లా దగ్గరలో వున్న వాల్తమ్‌యాబెకో, క్రేఫర్డ్‌కో వెళ్తూవుండేవాడను. పైగా ఇంపీరియల్ హోటలు ఛార్జీలు నావంటివానికి అందనట్టివి. మరిన్ని, అక్కడకు వెళ్లేది దక్షిణాఫ్రికా జాతిదురహంకారులు తెల్లవాళ్లు, నల్లతెల్ల రంగు వివక్షతగల అమెరికన్లు. అక్కడ నావంటిరంగుతక్కువగల ఇండియన్, నీటినుండి, బైటబడ్డ చేపవలె ఉండవలసివచ్చేది. మామూలుగా నేనుండే రాగ్లన్ హోటలుకూడా ఇంపీరియల్ హోటల్సు లిమిటెడ్‌వారిదే. అది చౌక. నగరం మంచి పశ్చిమ పరిసరాలలోఉన్నది. సామాన్యస్థితిగలవారు, భారతీయుల వంటివారికి సులువుగా ప్రవేశం దొరికే చిన్నహోటల్.

నేను కొన్నిరోజులు లండన్‌లో గడపి, జూలై రెండో వారారంభంలో ననుకొంటాను, పారిస్‌కు బైలుదేరివెళ్లాను. పారిస్‌లో హోటల్ "డుసేజ్" లో 13 జూలైనుండి ఆగష్టు 4-వ తారీఖువరకు (1925) ఉండినట్లు వ్రాసుకొనియున్నాను.

అంతకుముందే ఇంకొక హోటల్లో ఏ ఐదారురోజులైనా ఉండి వుంటాను. 13 జూలైన, మెడామ్ సొలెడాడ్ అనే ఆమెను కలసికొన్నాను. ఎక్కడ ఎట్లు కలసికొన్నానో గుర్తులేదు. ఆమె తాను స్పానిష్ స్త్రీనని, కోట్లైస్ "డుమాటా" అని తన హోదా చెప్పింది. హోటల్ జేకబ్ అనే హోటల్ ఉండేది. ఆమె నిజంగా పెద్దహోదాగల భూస్వాములకుటుంబానికి చెందినదిగా తోచలేదు. సామాన్యవేషం, రూపం, సన్నిహితస్నేహంతో వర్తించింది. ఆమె నేను కలసి, కొన్నిరోజు లక్కడక్కడా తిరిగాము. అవిఇవి చూచాము. చాలాదగ్గరకే వచ్చింది. ఒకరాత్రి ఇంచుమించు లైంగికవ్యాపారానికి సిద్ధమైనాం. కాని అది నెరవేరలేదు, నా తెలివితక్కువ (అసమర్థత అనుకోండి) వలన. ఆమె ఏమీ చిరాకుపడలేదుసరికదా, స్నేహాన్ని పెంచింది. నేను ఆక్స్‌ఫర్డ్‌కు తిరిగివెళ్లినతర్వాత రెండుమూడు ఉత్తరాలు ఫ్రెంచిలో వ్రాసింది. నా కవి సరిగా అర్థంకాలేదు.

ఆమె నానుండి డబ్బేమీ ఆశించలేదు. నేనామె కెట్టి బహుమతులను ఇవ్వలేదు. ఎందుకు నాస్నేహం కోరిందో నాకర్థం కాలేదు. ఆమెకు 35 ఏళ్లైనా వుంటవి. హెచ్చుండినవేమో చెప్పలేను. ఆమెకు పెండ్లి కాలేదని చెప్పింది. పురుషసాంగత్యం వాంఛించివుండవచ్చును. ఆమె సామాన్యరూపవతి, లావుగా వుండేది. ముఖానికి రంగువేసుకొనేదికాదు, విలాసవతివలె ఆకర్షణీయమైన దుస్తులను ధరించేదికాదు. అందువలన పురుషులామెవంక చూడకపోవచ్చును. నేను మంచి దుస్తులను ధరించి, ఉషారుగా తిరిగే 27 ఏండ్ల యువకుణ్ణి. ఈకారణాలచేత, ఉత్తముండకంటె అత్తముండ మే లనుసామెతగా, నాస్నేహాన్ని కోరియుండవచ్చును. ఏదిఏమైనా, కూపంలో పడకుండా, దైవం తప్పించాడు.

నేను 4-వ ఆగష్టువరకు హోటల్ 'డుసేజ్' లో ఉన్నట్లు పైనచెప్పానుకదా. అంతకుముందే సర్ కె. వి. రెడ్డి నాయుడుగారి కుమారుడు, బేలియల్ కాలేజివిద్యార్థి శ్రీ కె. వి. గోపాలస్వామిగారిని పారిస్‌లో కలసికొన్నాను. కొన్నిరోజులు

కలసిమెలసి మిక్కిలి దగ్గరస్నేహితులంగా తిరిగాము. ఆయన స్నేహశీలి. ప్రక్కవాని వీలును, హితమును బట్టి నడచుకునే స్వభావంగల సంస్కారముకలవాడు. 4-వ తారీఖు తర్వాత, పై హోటల్‌ను మార్చి, నేను శ్రీ గోపాలస్వామితో ఇంకొక హోటలులో కొన్నిరోజులున్నానేమో చెప్పలేను. ఆయన, నేను కలసి ఉత్తరఫ్రాన్సు పరగణా బ్రిటనిలోని ట్రూవిల్ - డూవిల్‌కు వెళ్లాము. నాదగ్గరున్న డూవిల్ కాశినో ఇచ్చిన టిక్కెట్టు కార్డు ప్రకారం, నేను ట్రూవిల్‌లో 18 ఆగష్టునుండి 18 సెప్టెంబరువరకుండినాను. దీనినిబట్టి, ఆగష్టు రెండోవారాంతానికి శ్రీ గోపాలస్వామి నేను, ట్రూవిల్ - డూవిల్‌కు వెళ్ళియుంటాము. శ్రీ గోపాలస్వామిగారీమధ్య వ్రాస్తూ మేమక్కడకు ఆగష్టుమొదటి వారంలో వెళ్లినట్లు, రెండువారాలుండి నేను పారిస్‌కు తిరిగివెళ్లినట్లు, ఆయన, శ్రీ యమ్. ఎ. అహమ్మద్, టెన్నీసుఆటకొరకు, ఇంకా కొన్నిరోజు లక్కడుండినట్లు, తర్వాత ఆయన, నేను ఆగష్టు చివర వారంలో పారిస్‌లో తిరిగి కలసికొన్నట్లు, ఆయన సెప్టెంబరు నెలలో జెనీవాకు ఎదో తర్ఫీదుకు వెళ్లినట్లు తెలిపారు.

ట్రూవిల్, డూవిల్ సముద్రతీరప్రాంతాలు. అవి వేరు వేరు పట్టణాలైనా చాలాదగ్గరగా ఉంటాయి. మా మకాం ట్రూవిల్‌లో. కొంచెందూరంలో నున్న డూవిల్‌కు నడచి వెళ్లేవారం అనిగుర్తు. 'కాశినోడూవిల్' జూదగృహం. పెద్దదాని క్రింద లెఖ్ఖ. అక్కడ రూలెట్, బాకరెట్టు, దుమాన్డ్ ఫేర్ అనే ఆటలు ఆడతారు. రూలెట్‌లో చిన్నమొత్తాలు ఒడ్డవచ్చును. ఆట చిన్నఅంతస్తులో ఉంటుంది. తతిమ్మా రెంటిలోను, లక్షలతో ఆడవచ్చును. వాటిజోలికి పోవటానికి మాకు డబ్బులేదు, గుండెనిబ్బరం లేదు. ఇట్టి జూదగృహంలో కోటీశ్వరులేగాక, రాజులకుటుంబాలకు చెందినవారుకూడా పెద్దఆటలకు వస్తారు. అంతేకాదు,రకరకాల మనుష్యులు, వింతవింతరంగుల దుస్తులతో మిక్కిలిఅందమైన స్త్రీలు వస్తారు. మంచి వయస్సువాళ్ళు వస్తారు. ఎక్కువమంది ఆటపిచ్చికి వచ్చినా, కొంతమందైనా ఆటతమాషాకు, అక్కడ గుమిగూడేవారిని చూడటానికి, విశ్రాంతిగా, హుషారుగా,

కాలంగడపటానికి, వస్తారు. కొందరు చిరునవ్వుతో శాంతంగా ఉండగా, కొందరు జ్వరతీవ్రతకలవారివలె ఉబ్బినముఖం, అస్తిమితమైన నడవడితో ఉంటారు. కొందరు నవ్వుతూ ప్రేలుతూ ఉంటే, కొందరు చిరాకుగా అటుఇటు తిరుగుతూవుంటారు. కొందరు సంతోషంగా వెళ్ళిపోతే, కొందరు ఏడ్పుముఖాలతో బైటపడతారు.

అక్కడ బైటవరండాల్లో విశ్రాంతిగా కూర్చోవచ్చు. పానీయాలు ఉపహారాలు తీసుకోవచ్చు. మొత్తంమీద ఆటపిచ్చి లేనివాళ్ళు, సర్దాకు కొద్దిగా ఆడేవాళ్ళు హాయిగా సాయంత్రం అక్కడ గడపవచ్చును. సాయంత్రం అనగా రాత్రి 7 గంటల నుండి 10 గంటలు. 10 గంటలకు కాశినోను మూసివేస్తారని కాదు, ఏ 1 గంటకు మూస్తారో, లేక తెల్లవార్లు ఉంటుందో, ఇప్పుడు గుర్తులేదు.

ట్రూవిల్-డూవిల్ లో సముద్రస్నానం అనువుగా వుండేది. వేసవిలో సముద్రస్నానం సంతోషప్రదం కదా. ఈజంటపట్టణాల ఆకర్షణ, జూదగృహంతోపాటు సముద్రతీరవిహారం, సముద్ర స్నానం. వీనితో సుఖంగా సాయంత్రంవరకు గడచిపోయేది. శ్రీ గోపాలస్వామివంటి టెన్నిస్ ఆటలో అభిరుచివున్నవారికి ఆడుటకు పుష్కలమైన అవకాశం. నావంటివానికి తీరవిహారమో, స్నానమో. భోజనం చేపలు, రొయ్యలు (మాంసంతోబాటు) వగైరా. ఫ్రెంచివారు పదార్థాలను రుచిగా పచనంచేయటంలో సిద్ధహస్తులుకదా.

మగవాడన్నతర్వాత, స్త్రీ తారసిల్లక మానదు. ఒకరాత్రొక స్త్రీ వెంటబడి నన్ను భ్రమపెట్టి మారుమూలనున్న తన గదికి తీసుకువెళ్ళింది. ఆగది ఒక చిన్న మేడపై వున్నది. ఎందువల్లో ఆప్రాంతమంతా కటికచీకటి. మేడమెట్లు సరిగా కన్పడలేదు. ఎట్లో కష్టపడి ఎక్కితే, గదిలో దీపంలేదు. ఆ యువతి దీపంవెలిగించాలని ప్రయత్నించిందికాని, చప్పున తెమలలేదు. నేనక్కడికనిల్వక, త్వరితగతిని క్రిందకు దిగి, వెళ్ళిపోయాను. నేను గండం తప్పించుకొనియుంటాను.

ట్రూవిల్‌లో కలసికొన్న ఇంకొకరు, ప్రస్తుతం కేంద్ర కాబినెట్ మంత్రి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్‌గారు. వారి నా సమయంలో కలుసుకోవటమే కాదు, మేమిద్దరం కలసి సముద్ర స్నానం చేశాము. అప్పుడు తీసిన ఫొటోలలో స్నానానికివచ్చిన కొంతమంది ఫ్రెంచిస్త్రీపురుషుల సమూహంలో నేను, అహమ్మద్ గారున్నాము. ఒక ఫ్రెంచిపురుషుని చెరిఒకప్రక్క కూర్చొని తీయించుకొన్న ఫొటో, మేమిద్దరం ఒకరిబుజంమీద ఒకరు చేతులువేసుకొని తీయించుకొన్న ఫొటో, ఉన్నవి.

పారిస్ నగరం ఇప్పుడెట్లున్నదో తెలియదుకాని ఆకాలంలో లంజలకు పుట్టినిల్లు. వయస్సులోవున్న మగవాళ్లను భ్రమింపజేసి, మోహ వశులనుజేసి, తనపనిని జరుపుకొంటుంది. లంజలు, లంజల గృహాలు ప్రతిదేశంలోను ఉన్నవి. లంజతనం అతిప్రాచీనం, అదే ఆదిమవృత్తి అని పెద్దలు చెప్తారు. అయితే పారిస్ నగరం ఈవిషయాల్లోకూడా ప్రత్యేకవిశిష్టత కలది. గంతకుతగిన బొంత, డబ్బుసంచికి తగిన వింత ఈనగరంలో దొరుకుతవి. మాన్ మార్త్ వంటి విలాసప్రదేశాలలో జరుగు యువతీయువ వినోదాలు, సాంగత్యాలు కాక, పల్లెటూళ్లు లేక చిన్నపట్టణాలనుండి వచ్చే పెద్దమనుష్యులకుకూడా ఈనగరం సౌకర్యాల నిస్తుంది. నే నెక్కడనో చదివాను. ఒక సంపన్నగృహస్తునకు పెండ్లిఅయి, కొడుకున్నాడు. భార్య లేదనుకొందును. పారిస్ నగరములో ఒకామెను చేపట్టి, వారానికొకరోజు ఆమెకొరకు తీసుకొన్న ఇంటికి వచ్చి, ఆరాత్రి గడపి, మర్నాడుదయం తనవూరుకు వెళ్లేవాడు. ఇలా సంవత్సరాలు గడవగా, ఇద్దరుముగ్గురు బిడ్డలు కల్గారు. ఈ కుటుంబాన్ని ప్రేమతో చూస్తూ, వారికి కావలసిన వస్తువులు, డబ్బు సమకూరుస్తూ ఉండేవాడు. కొన్నిసంవత్సరాలు గడచిన తర్వాత, ఆ నియమిత వారంరోజు రాకముందే, ఆయన చనిపోయాడట. ఆసంగతి తెలియని పారిస్ ఉపభార్య ఆయన కా రాత్రి భోజనం సిద్ధంచేసి, ముస్తాబై, పిల్లలతో ఆయనకొరకు

ఎదురుచూచుచుండినదట. ఆలస్య మయ్యేటప్పటికి, ఆందోళనతో నుండగా, ఎవరో తలుపుతట్టారట. తలుపు తెరవగా, ఒక యువకుడు లోనికివచ్చాడట. యువకుడు చనిపోయినవారి కుమారుడు, విషయం తెలియజెప్పి, ఆమెను ఓదార్చి తన తండ్రివలెనే, ప్రతివారం నిర్ణీతరోజుకు వచ్చి కుటుంబంతో కలసి భోజనంచేసి వెళ్తానని చెప్పాడట. ఆవిధంగానే వస్తూ, ఆమెకు కావలసిన వస్తువులను డబ్బును సరఫరా చేస్తూ, ఆమెబిడ్డలను తన స్వంతసోదరసోదరీలగా ఎంచుకొంటూ, ఆమె పెద్దబిడ్డవలె ఆ కుటుంబాన్ని నడిపాడట.

ఇక నాసంగతి. ఒకసారి ఒక అందంగా కన్పడిన యువతి, ఇంకొక పడుచుది బూల్ వార్డ్‌లో తటస్థపడ్డారు. అందంగా కన్పడిన యువతిని కాంక్షించాను. నాహోటల్ కు ( ఆహోటల్ లంజల ననుమతిస్తుందని నాకంతవరకు తెలియదు ) రమ్మంటే, రెండోఅమ్మాయికూడా వచ్చింది. నేను వెళ్లిపొమ్మన్నా పోలేదు. పైకి నాగదిలోకి ఇద్దరు వచ్చారు. నేనుకోరిన అమ్మాయి చెవిచుట్టూ తిరిగిన గిరజాలతో వుండింది. నాగదికి వచ్చినతర్వాత గిరజాలను రెండుప్రక్కలనుండి రెండు తీసింది. అంతవరకు ఎరువువని నాకు తెలిసియుండలేదు. బట్టలు విప్ప బోవుచుండగా, రెండోఅమ్మాయిని బైటకి పొమ్మని నేను గట్టిగా మందలించాను. ఆమె తలుపు కానుకొని నాకక్కరలేదులే, మీరు కానివ్వండన్నది. నాకు చిరాకువేసి, ఇద్దరిని పొమ్మన్నాను. వాళ్లు తిట్టి, బెదిరించి, వెళ్లిపోయారు. ఇంకొకదఫా పారిస్‌లోనే నేను, ఒక రెడ్డిస్నేహితుడు కలసి ఇద్దరుయువతులను కలసికొన్నాం. స్నేహితు డొకపిల్లను తనతో తీసుకువెళ్లాడు. నేను రెండోపిల్లను నాతో తీసుకువెళ్లాను. నాతోవచ్చినస్త్రీ ఎక్కడకో దూరంగా వుండిన చీకటిగదికి తీసుకువెళ్లింది. ఆస్త్రీ మోటుది, మాట సరసం లేదు. పైగా చీకటిగది. ఈపరిస్థితులు నన్ను నిర్వీర్యుని చేశాయి. తృప్తిమించకుండానే, బైటపడ్డాను. ఇట్టిదొకటి 1922 జనవరి ఆరంభంలో బెర్లిన్ నగరంలో జరిగిందని గుర్తు.

ఒక కాబెరెలో (నృత్యం, గానం, భోజనం ఉండే రాత్రివిలాస ప్రదేశం) ఒకపిల్లను కలిసికొన్నాను. ఆమె, నేను కలిసి ఒక ఇంటికి వెళ్లాం. డబ్బడిగింది. జేబులో కొద్దిమాత్రమే వున్నది. నాహోటల్‌కు తీసుకొనివెళ్ళి ఇస్తానన్నాను. ఆపిల్ల చప్పునలేచి వెళ్ళిపోయింది. అప్పటికేమిన్ని, కామకలాపం జరుగలేదు. నేను బిక్కముఖంవేసి యుండగా, ఎవరో మగవాడు వచ్చి ఓదార్చి నన్ను పంపివేశాడు.

ఈవిధంగా ఎన్నిఅవకాశాలు వచ్చినా, కల్పించుకొన్నా, ఏ శ్వేతస్త్రీతోను అసలైన సంపర్కం కల్గలేదు. దీనికి కారణం ఇద మిద్ధమని చెప్పలేనుగాని, కొంత పిరికితనం, కొంత చేతకాని తనం, కొంత క్రొత్తస్త్రీతో ఏవిధంగా మెలగాలో తెలియక పోవటం, కొంత అనుకోని సంభవాలు కలసి, ఈఫలితానికి దారితీసి వుండవచ్చును. నా నీతికాదు.

స్త్రీపురుష సంపర్కం సహజం. "ఇనుపకచ్చడాల్ గట్టిన మునిముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందాలుగారె" అని పెద్దన్న గారు ఊరికేచెప్పారా? పైగా, రంగుభేదం, యౌవనం పొంగు, వంటరితనం, స్వేచ్ఛగా స్త్రీలు వ్యవహరించటం, భారతీయులకు శ్వేతవనితలు ఎక్కువ ఆకర్షణీయమౌతారు, వాంఛకు గురిఅవుతారు. ఇదివరకే పెండ్లయి స్త్రీసంయోగంకల్గిన నావంటియువకులు కామోద్రేకంలో పడటం ఆశ్చర్యంకాదు, ఖండించవలసిందికూడా కాదు.

1925 సెప్టెంబరు మొదటివారంలోనో రెండోవారంలోనో, లండన్‌కు తిరిగివచ్చియుంటాను. అక్టోబరు మూడోవారంలోగాని విశ్వవిద్యాలయం పనిచేయటానికి ఆరంభించదు. అందువల్ల బహుశా వాల్థమ్‌యాబెకో క్రేఫర్డ్‌కో వెళ్లినానో, లండన్‌లోనే వుండిపోయానో, లేక ఆక్స్‌ఫర్డ్‌కు వెళ్లిపోయానో గుర్తులేదు. యథాప్రకారం కార్యకలాపాలు జరిగియుండును. విశ్వవిద్యాలయం తెరిచినతర్వాత మొట్టమొదటి సెలవులు క్రిస్‌మస్ క్రొత్త సంవత్సరంకు. ఈసెలవులకు దక్షిణఫ్రాంసుకు వెళ్లాలని తలంచాను.

దక్షిణఫ్రాన్స్ సముద్రతీరాన్ని "కోట్ డజూర్" (నీలవర్ణం తీరం) అంటారు. దీనినే 'రివీరా' అని వాడుకగా అంటారు. ఈ రివీరాలో నీస్ అనేప్రదేశం మిక్కిలి ప్రసిద్ధికెక్కింది. ఇక్కడకు డిశెంబరులో వెళ్లాను. నీస్ సముద్రతీరం చాలాపొడవు, సువిశాలమైంది. దీనిపొడుగునా మంచి మరమ్మతులోవున్న, చక్కని వెడల్పైన బాట (రోడ్డు) వుండును. దీనిమీద వినోదయాత్రికులు సంకీర్ణంగా అటుఇటు పచారుచేస్తుంటారు. ఈపచారురోడ్డును ఆంగ్లేయులు ప్రామినేడ్ అంటారు. శ్రీమంతులు, భూనాథులైన ఆంగ్లేయులిక్కడకు వస్తూ శీతాకాలం గడుపుచుండటంవల్ల, వారిపేరుతో ఆకర్షణీయమై, వృద్ధిపొందింది. విక్టోరియారాణి చాలాసార్లు ఇక్కడ చలికాలం గడిపినారట.

ఇక్కడితీరం కొంతదూరాన్నిగాని నీళ్లుండవు. ప్రామినేడ్ కు, నీటికి మధ్య వెడల్పైన ఇసుకబయలు. ఈబయలుమీద పిల్లలు (మన మద్రాసు ట్రిప్లికేన్ బీచిమీదవలె) ఆడుకొంటారు. పెద్దలు విశ్రమిస్తారు. నీళ్లలోతు తక్కువ. శుభ్రంగా వుంటవి. అందువల్ల స్నానానికి మిక్కిలిఅనువుగా ఉంటుంది.

ఈతీరాని కెదురుగా చిన్నపట్టణం. చాలా హోటళ్లున్నవి. నేను హోటల్ (పాన్స్యో) బెర్లీజ్‌లో ఉండినాను. రెడ్డి అనే వారప్పుడు విల్లఅసెంటనే చోట ఉండేవారని నా నోటుబుక్కు చెప్పుచున్నది. వారు నాస్నేహితుడు, బి. అన్నారెడ్డో ఇంకొకరో గుర్తులేదు. శ్రీ అన్నారెడ్డి నేను కలసి అక్కడికి వెళ్లినట్లుగాని, వారి నక్కడ కలసికొన్నట్లుగాని జ్ఞాపకంలేదు. ఇక్కడ పదిహేను రోజులైనా ఉండివుంటాను.

షికారుకు అటుఇటూ తిరిగేవారిని చూడటం, షికారుకు వెళ్ళటం, నీరెండలో కూర్చోటం, స్నానంచేయటం సుష్టుగా భోజనంచేసి విశ్రమించటం—ఇవి అక్కడి దినచర్యలు. వాతావరణం చాలాసుఖప్రదంగా ఉంటుంది. శీతాకాలం చలి చాలాతక్కువ. సూర్యరశ్మి మెత్తని, వెచ్చని, లేయెండ. మధ్యాహ్నం ఎండ కొంత తీవ్రమైతే, సముద్రంగాలి దానిని తగ్గిస్తుంది. భోజనం విషయంలో ఉడకబెట్టిన పీచురొయ్యలు అప్పుడప్పుడు ఇచ్చేవారు. వానిని చేతితో వలుచుకొని తినాలి.

ఉప్పునీళ్ళు చల్లేవారు కాబోలు ఉప్పఉప్పగా రుచిగా ఉండేవి. ఒకటిరెండుసార్లు ఆయిస్టర్సు అనే సముద్రం ఆలిచిప్ప లిచ్చినట్లు గుర్తు. ఇవి మిక్కిలి రుచిగావుంటవి. నాజూకు భోజన పదార్థంగా ఎంచుతారు.

నీస్‌నుండి క్రిస్‌మస్ (1925) కు ముందు తిరిగివచ్చి, క్రిస్‌మస్, వాల్తమ్‌స్టో యాబెలో శ్రీమతి హెలెన్ వుడ్‌బ్రిడ్జిగారి కుటుంబంతో గడిపాను. తర్వాత, జనవరి 1–వ తారీఖు సాయంత్రం నుండి 14–వ తారీఖువరకు లండన్ శివారు హాంప్‌స్టెడ్‌లో 56, గ్రీన్‌గార్డెన్స్ అనే ఇంటిలో మిసెస్ హార్డింగ్ బోర్డరుగా వున్నారు. ఇది యొక బోర్డింగు లాడ్జింగు (భోజనం, ఉనికి) వసతిగృహం. ఈ వసతిలో నేను ట్రూవిల్‌లో కలసికొనియుండిన కేంద్ర కాబినెట్ మంత్రిగా ఇప్పుడు ప్రాముఖ్యానికి వచ్చిన శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్‌గా రుండినారు. మేము కలసికొంటూ, పెరిగిన స్నేహభావంతో మెలగాము. వారికి శ్వేత జాతీయుల అహంభావ మెంతమాత్రం గిట్టేదికాదు. ఈ తెల్ల యువతులకు మనం బిడ్డలను పుట్టిస్తే, వీళ్ల పొగ రణగుతుంది అనేవారు. వారి భావం పెండ్లిచేసుకోవాలని కాదని నే నర్థం చేసుకొన్నాను. ఇంకేవో, ఒకటి రెండు ఛలోక్తిగా స్త్రీ సంబంధం చెప్పారుగాని, వాని నిక్కడ వ్రాయటం భావ్యంగా వుండదు. యువకరక్తం ఎన్నెన్నో ఊహాలను, భావాలను ప్రేరేపిస్తుందికదా.

ఇక్కడొక పడుచుపిల్ల ఉండేది. ఆమెతో మాకు కొంచెం పరిచయమో, చనువో ఏర్పడింది. ఒకటి రెండుసార్లు కలసికోవటం తటస్థించింది. ఆమెలోని విశేషం, ఆమె కళ్లు చిక్కని ఆకుపచ్చ రంగుగా ఉండేవి. అవి కొంత వ్యాకులాన్నికలిగించేవి. ఎంత నీలిరంగువైనా, నేత్రాలు ఆకర్షిస్తాయిగాని చికాకు (రిపెల్) ను కల్గించవు. ఆకుపచ్చరంగు వైనా, పసుపు లేక దాని మిశ్రమం (పెద్దపులి కళ్ల రంగు) రంగుగల కళ్లు వ్యాకులాన్ని కల్గిస్తవి, నామట్టుకు నాకు. ఆ కారణంవల్లకాబోలు, ఆ యువతి సామాన్య అందగత్తె అయినా ఇప్పటికిని జ్ఞాపకానికి వస్తూంటుంది.

లాడ్జింగు బోర్డింగు గృహం, డబ్బుపుచ్చుకొనే అతిథేయుల గృహంవంటిది కాదు. హోటల్ వంటిది కాదు. ఈ రెంటి సంకరం వంటిది. బస నడిపేవారితో (సామాన్యంగా స్త్రీ) కొంత చనువు, అక్కడున్న ఇతర నివాసుల (బోర్డర్సు) తో కొంత పరిచయం, స్వేచ్ఛ ఉంటుంది. సామాన్యంగా ఉండాలంటే పడక, విశ్రమించటానికి కలిపి ఒకేగది ఉంటుంది.

సెలవులైన తర్వాత 1926 హిలరి టరంకు ఆక్స్‌ఫర్డ్‌కు వచ్చివేశాను. చదువు యథాప్రకారం సాగింది. నేను బ్యారిష్టర్‌గా ప్రాక్టీస్ చేసే హక్కును సంపాదించుకొనుటకు ఏ బ్యారిష్టర్ ఆఫీసులోనైనా 6 మాసాలు శిష్యరికం (అప్రంటిస్) చేయాలి. అందువల్ల లండన్ 3, మిడిల్ టెంపుల్ లేన్‌లో వున్న జాన్ ఎ. పేస్‌గారి ఆఫీసులో అప్రంటిస్‌గా 12-1-1926-న నమోదుచేయించుకొన్నాను. అప్పుడప్పుడు వారి ఆఫీసుకు వెళ్లుచుండేవాడను. ఆరు మాసాలైన తర్వాత, తర్ఫీదు పొందినట్లు వారు సర్టిఫికేట్ ఇచ్చారు.

ఈస్టర్ సెలవులకు ఎక్కడికైనా వెళ్లానో, లేక ఆక్స్‌ఫర్డ్‌లోనే ఉండి చదువుకొన్నానో ఇప్పుడు చెప్పలేను. ఆ జూనులో (1926) నా చివరిపరీక్షలు. అందువల్ల గట్టిగా చదువవలసియుండింది. పైగా న్యాయశాస్త్ర పరీక్షకు, లాటిన్ భాష కొంచెమైనా రావాలి. రోమన్ లా కూడా ఉన్నదికదా. వానిని నేర్చుకొనుటకు ఒక ప్రైవేటు ట్యూటరును పెట్టుకొన్నాను. వారి పేరు సపోటే అని గుర్తు. వారు బ్రిటిష్ వారు కాదని పేరునుబట్టే తెలుస్తున్నది.

ఈ కాలంలోనే అనుకుంటాను, సిలాన్ వాస్తవ్యుడు పి. రామలింగం అనేవాడు ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షలో నెగ్గి, ఆక్స్‌ఫర్డ్‌లో ప్రొబేషనర్‌గా ఉండినారు. వారితో పరిచయమైంది. ఒకనాడు మా వసతికి భోజనానికి రండని పిలిచాను. ఆయన సందేహించి, తటపటలాడి, మీరే మా వసతికి భోజనానికి రండని అన్నారు. నే నొప్పుకొని వారితో భోజనంచేశాను. తర్వాత వారు మద్రాసు రాష్ట్రంలో ఐ. సి. యస్. ఆఫీసరుగా వున్నప్పుడు కలసికొనటం తటస్థించింది. అప్పు డాయన, ఆరోజున

మీరు భోజనానికి పిలవగా రాలేదు, జ్ఞాపకమున్నదా అని అడిగాను. జ్ఞాపకమున్నదనగా, ఎందుకు రాలేదంటే, మీరు ఇండియా ఆఫీసు తరఫున గూఢచారిగా పనిజేస్తుండినారేమో అని సందేహించానని చెప్పి, నవ్వారు. ఇండియా ఆఫీసు, భారతీయ (రామలింగంగారు సిలాన్‌లో స్థిరపడిపోయిన అరవవంశంవారు) విద్యార్థులు, అందులోను ముఖ్యంగా సివిల్ సర్వీస్‌లో చేరిన వారిమీద, నిఘావుంచేదన్నమాట.

ట్రినిటి (1926) టరంలో అనగా జూన్‌లో మా పరీక్షలు వచ్చాయి. నేనేదో తంటాలుపడి చదివి, పరీక్షకు కూర్చొన్నాను, నెగ్గాను. 3-వ క్లాసు ఇచ్చారు. అక్టోబరు 21 (1926) తారీఖున జరిగిన కాన్‌వొకేషన్‌లో పట్టా యిచ్చారు. నేను చదివింది ఆనర్స్‌కోర్సు (ఆనర్ స్కూల్ ఆఫ్ జ్యూరిస్‌ప్రూడెన్స్). పట్టా వచ్చింది, ఆనర్స్ డిగ్రీకి. అయితే, మా సంప్రదాయం ప్రకారం బి. ఏ. (ఆనర్స్) అని వ్రాసికోరు. విశ్వవిద్యాలయంలో చేరిన 7 సంవత్సరాలు పూర్తి అయిన తర్వాత ఆనర్స్ కోర్సు చదివిన వారికి, యమ్. ఏ. డిగ్రీ తామంతట తాము విశ్వవిద్యాలయంవారిస్తారు. అయితే యమ్. ఏ. పట్టా పుచ్చుకొనదలచినవారు, వారి కాలేజికి నామమాత్రం ఫీజు చెల్లించి, కాలేజి రిజిస్టర్‌లో పేరు నిలబెట్టుకోవాలి. మరిన్నీ, డిగ్రీని తాను స్వతహాగా కాన్‌వొకేషన్‌కు హాజరై తీసుకోలేకపోతే, "ఇన్ యాబ్‌సెన్షియా" (హాజరుకాలేమి) కి కొంతడబ్బు కట్టాలి. ఈ రెండు నేను చేయనందున నేను యమ్. ఏ. అని వ్రాసుకోను, నేను 1929 లోనే ఆ డిగ్రీ కర్హుడనైనా.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం పరీక్షాపత్రాలలో మార్కులుగాక, స్థాయిలు వేస్తారు. ఇన్ని మార్కులు వచ్చాయనిగాక, ఈ స్థాయికి వచ్చాడని నిర్ణయిస్తారు. వారు 4 స్థాయిలు అనుకరిస్తారు ఆల్ఫా, బీటా, గామా, డెల్టా. (ఎ. బి. సి. డి. ల వంటివి) ఈ నాల్గింటికి మెరుగు తరుగులు నిర్ణయిస్తారు. అనగా "ఆల్ఫా" తీసుకొంటే, ఆల్ఫా ప్లస్ ఒకటి, రెండు మొదలైనవి. ఆల్ఫా మైనస్ ఒకటి రెండు వగైరా. ఆ విధంగానే తక్కినవాని

విషయంలో. ఆల్ఫావారికి మొదటితరగతి, బీటావారికి రెండో తరగతి, గామావారికి మూడోతరగతి, డెల్టావారికి నాల్గోతరగతి ప్రసాదిస్తారు. ప్లస్ ఆ క్లాస్‌కంటె హెచ్చు, మైనస్ ఆ క్లాస్ కంటె తరుగు. క్రిందిక్లాసుకు తగ్గించటానికిగాని, పై క్లాసుకు పెంచటానికిగాని ఇష్టం లేకపోతే ఈప్లస్, మైనస్‌లను ఉపయోగిస్తారు. ఆనర్స్‌కోర్సు తీసుకొన్నవారికి నాల్గవక్లాసు వచ్చినా, ప్యాసైనట్లే. నాల్గవక్లాసుకు కూడా పూర్తి అర్హత లేకపోతే, ఆనర్స్ డిగ్రీ కాక పాస్ డిగ్రీ ఇస్తారు. వీరి కెప్పటికి యమ్. ఎ. డిగ్రీకి అర్హత వుండదు. ఇంచుమించు అందరు ఆనర్స్ కోర్సే తీసుకొంటారు. ముఖ్యంగా విదేశీయులు, పాస్ డిగ్రీ కొరకు ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జిలకు వెళ్ళరు.

ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో అనేక దేశాల నుండి, అనేక జాతులనుండి, పశ్చిమ దేశాలనుండేగాక, తూర్పు దేశాలనుండి వచ్చిన విద్యార్థు లుంటారు. యూరపియన్ దేశాల నుండేగాక, అమెరికన్ దేశాలనుండి వస్తారు. బ్రిటిష్ సామ్రాజ్యాంతర దేశాలనుండి రావటం ఆశ్చర్యకరంకాదు. చైనా మొదలైన దేశాలనుండి వచ్చినవారూ వుండినారు. ఆక్స్‌ఫర్డ్‌లో 1926 జూలైలో ఒక చైనీస్ విద్యార్థిని కలసికొని, అత డున్నచోటికి వెళ్లి అతనితో కొంతకాలం గడిపాను. అతని పేరు సి. వై. హ్సు. తన యడ్రస్సు 20 మ్యూజియమ్ రోడ్డు, షాంఘాయ్, చైనా, అని తన విజిటింగు కార్డుమీద వ్రాసి యిచ్చాడు. జూలై 26-వ తారీఖున స్వదేశానికి వెళ్లిపోయాడు.

పరీక్షలు జరుగుచుండగా (జూన్ 1926) ప్రొఫెసర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు ఆక్స్‌ఫర్డ్‌కు వచ్చారు. వారప్పుడు కలకత్తా విశ్వవిద్యాలయంలో పాలిట్ తత్వశాస్త్రపండితులుగా ఉండేవారు. ఆక్స్‌ఫర్డ్ మాన్స్‌ఫీల్డు కాలేజీలో దాని ఆధ్వర్యాన, అప్టన్ అనే ఫౌండేషన్ లెక్చర్సు ఇవ్వటానికి వచ్చారు. వారిని తెలుగు విద్యార్థులం కలసికొన్నాం. వారి ప్రథమోపన్యాసానికి చాలా మందితోబాటు నేనుకూడా హాజరయ్యాను. వారి ఉపన్యాస పురవడి, భాషాప్రగల్భత, ధారాశుద్ధి, సభికులనందరిని ముగ్ధులను



ఆక్స్‌ఫర్డులో ఆంధ్రులు ( 1926 )

కూర్చున్నవారు

1. ఆచార్య సర్వేపల్లి రాధాకృష్ణగారు
2. కూర్మా వేణుగోపాలస్వామిగారు
3. శ్రీమతి భారతీదేవి రంగాగారు
4. గ్రంథకర్త శ్రీ ఎల్. వి. బి. చౌదరి
5. టి. మురారిగారు

నిల్చున్నవారు

1. బి. పుల్లారెడ్డిగారు, ఐ. సి. ఎస్.
2. డా. వాసిరెడ్డి శ్రీకృష్ణగారు
3. ఆచార్య ఎన్. జి. రంగాగారు
4. డా. వాసిరెడ్డి వెంకయ్య చౌదరిగారు

చేసింది. ఆవాగ్ధాటి, ఆవిజృంభణ వర్షాకాల నదీప్రవాహంవలె వుండినది. భాషాపాండిత్యం, ఉపన్యాసం నడక శరదృతువులోని గంగాప్రవాహంవలె ఉండింది. వాగికంఠం ఖంగున మ్రోగింది. ఉచ్చారణ స్వచ్ఛం, విస్పష్టం, ఆహ్లాదకరంగా ఉంది. ఉపన్యాసం విషయప్రపూర్ణం. మాన్స్‌ఫీల్డు కాలేజి మతతత్వవిషయాలలో తరిఫీదునిచ్చేది. రాధాకృష్ణగారిచ్చిన నాలుగు ఉపన్యాసాలు మతతత్వసంబంధమైనవి. "హిందువుల జీవితదృష్టి" అనే అంశం. హిందువుల సహానదృష్టి, వారేమతాభిప్రాయాలనైన మన్నించు తీరు, హిందూమతంలోని విశిష్టత, వగైరా విషయాలను చెప్పారు. నేను పరీక్షలు వ్రాస్తుండినందున మొదటిరోజున, నాల్గవరోజు చివరభాగంకుమాత్రం వెళ్లగల్గాను. మొదటిఉపన్యాసంలో వారు చెప్పినదానిలో ఒకటి గట్టిగా జ్ఞాపకంవున్నది. అది హిందూమతం ధర్మసత్రంవంటిది, ఏ మతానికైనా ఆశ్రయం ఇస్తుంది, ఏ అభిప్రాయాన్నైనా మన్నిస్తుంది అని.

వారి ఉపన్యాసాలను విన్నవారందరు వారివక్తృత్వానికి, భాషావైశద్యానికి, పాండిత్యప్రకర్షకు ఎంతో సంతోషించారు. కాలేజి ప్రిన్సిపాలు వగైరా ప్రశంసించుటయేగాక, సభికులలోని ప్రముఖులుకూడా, వారి నభినందించారు. ఇండియన్ విద్యార్థులం పొంగిపోయాం.

వారు మహాపండితులేగాక భూమినంటుకొనియున్న మనిషి. వారిజాగ్రత్తను వ్యవహారధోరణిని చూచి, నేను ప్రొఫెసరుగారూ, మీరు వేదాంతంలో బిజినెస్ ( లౌకిక ) వ్యవహారాలను చక్కగా కలుపుతారని చమత్కరించాను. వారు చిరునవ్వు నవ్వి, ఊరుకొన్నారు. ఉపన్యాసాల అనంతరం, ఆచార్య రాధాకృష్ణ గారితోకలసి ఆక్స్‌ఫర్డ్‌లోని తెలుగువిద్యార్థులం ఫొటోతీయించు కొన్నాం. ఆఫొటోలో ఆచార్య రాధాకృష్ణగారుగాక, శ్రీ రంగా, శ్రీమతి భారతీదేవి రంగా, శ్రీ ఒ. పుల్లారెడ్డి, శ్రీ వి. యస్. కృష్ణ, శ్రీ వి. వి. చౌదరి, శ్రీ కె. వి. గోపాలస్వామి, శ్రీ మురారి, నేను ఉన్నాము.

కొన్ని సంవత్సరాల తర్వాత, వారు ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ గా ఉండినప్పుడు, బెజవాడ రైల్వేస్టేషన్ లో వారిని చూడటం తటస్థించింది. దగ్గరకు వెళ్ళి నమస్కరించగా, ఏం, భద్రయ్యా బాగున్నావా అని కుశలప్రశ్నలు వేశారు. "భద్రయ్యా" అని నన్ను కొన్ని ఏండ్ల తర్వాత సంబోధించటం నాకు సంభ్రమాన్ని కలిగించింది. వారిని ఆక్స్ ఫర్డ్ లో చూచింది స్వల్పకాలమే. అందులోను ఏ ఇద్దరో ముగ్గురో చిరపరిచితులు మాత్రమే నన్ను "భద్రయ్యా" అనేవారు. ఆసంబోధన వారి వాత్సల్యాన్ని తెలిపింది. తర్వాత ఒకటిరెండు సార్లు వారిని దూరంనుండి ఏ సభలోనో చూడటం తటస్థించిందికాని, వారు భారత వైస్ ప్రెసిడెంటుగా, ప్రెసిడెంటుగా మహోన్నతపదవిలో ఉండినారు, నేను సామాన్య ప్రభుత్వోద్యోగిని. వారిని సమీపింప సాహసించలేకపోయాను. అయినా, నా ఉద్యోగవిరమణానంతరం 1954 మార్చిలో నేను ఢిల్లీకి వెళ్ళినప్పుడు వారు వైస్ ప్రెసిడెంటుగా ఉండగా, వారిని దర్శించాను. వారి రిసెప్షన్ అధికారి, వారు చాలా తొందరపనిలో ఉన్నారు, ఇప్పుడు వీలుపడదన్నారు. నేను వారు తప్పక నన్ను చూస్తారు. విజిటింగుకార్డు వారికి చూపండని కోరాను. కార్డును చూడటంతోనే, వారు రమ్మన్నారు. వెళ్ళగా వారేదో చదువుకొనుచుండినారు. నన్ను కుశలప్రశ్నలు వేసి క్షేమసమాచారాలు తెలిసికొన్నారు. రంగా ఇప్పుడు నాయకుడు కదా అన్నారు. వారు రాజ్యసభకు అధ్యక్షులుకదా, సభసమావేశానికి వారు వెళ్ళాలి. నేనే తొందరగా సెలవుతీసుకొని వచ్చేశాను. వారిసౌహార్ద మట్టిది. వారికి మూడు, నాలుగు మాసాలకు 80 సంవత్సరాలు నిండుతవనగా, వారిని నాకుమారుడు రాధాకృష్ణతో కలసి దర్శించాను. రెండోసారి వారింటికి వెళ్ళి 1926 ఆక్స్ ఫర్డ్ లో తీయించుకొన్న ఆంధ్రవిద్యార్థుల గ్రూప్ ఫొటో క్రొత్తకాపీని వారికి సమర్పించుకొన్నాను. వారికి జ్ఞాపకశక్తి అపారం. పేరుపేరున అడిగి, క్షేమసమాచారాలు తెలుసుకొన్నారు. శ్రీ వాసిరెడ్డి వెంకయ్యచౌదరినిగురించి రెండుదఫాలు అడిగారు. 1958 మే 28-వ తారీఖున జరిగిన మా రెండోకుమార్తె కమల కుమారి వివాహానికి ఆశీస్సులను పంపినారు.

1922 లోనో లేక 1923 ఆరంభంలోనో రామ్‌సె మెక్డొనాల్డ్‌గారు ఆక్స్‌ఫర్డ్‌కు వచ్చారు. వారు విద్యార్థులతో మాట్లాడుతారని ఎవరో చెప్పగా, వారుండిన చోటికి వెళ్లాను. అదొక పెద్దగది. నలభై, ఏభై మంది విద్యార్థులు వచ్చారు. ఇండియన్ విద్యార్థులు నలుగురో, ఐదుగురో వుండినారు. వారు ముందు నాలుగుముక్కలు చెప్పి, విద్యార్థులను ప్రశ్నలడగండన్నారు. సమాధానాలు చెప్పారు. వారిసంభాషణ ఒకగంట సాగింది. వారి జవాబులు సూటిగానే వున్నవికాని వారిభాష కొంత మెలికలుతిరిగిం దన్నట్లుగా ఉందనుకొన్నాను. ఆక్స్‌ఫర్డ్ భాషాపద్ధతికి, అసలు ఇంగ్లీషువారు మాట్లాడే విధానానికి భిన్నంగా వున్నదని తోచింది. వారు ఉత్తరస్కాట్లాండులో బీదకుటుంబంలో పుట్టినవారు. అందువల్లకాబోలు, వారి ఉచ్చారణ స్పష్టంగా వున్నా, ధారాశుద్ధి, వక్తృత్వంవున్నా, కంఠధ్వని బాగున్నా భాషాధోరణి నాకు క్రొత్త అనిపించింది.

వారు చాలా అందమైనవారు. అందమైన నొసలు, ముచ్చటగొలిపే మీసకట్టు. వారితల్లి పల్లెకారిపడుచైనా, తండ్రి ఒక ప్రభువని వదంతి. అందువల్లకాబోలు అంతఠీవి, రాజసం, అందం. వీరు కార్మికనాయకుడుగా రెండుసార్లు బ్రిటిష్ ప్రధాని అయ్యారు.

1923 లో గాని, 1924 లోని ఇంకొక మాజీప్రధాని దర్శనం ఆక్స్‌ఫర్డ్‌లో కలిగింది. వారు మొదటి ప్రపంచయుద్ధంలో ప్రధానమంత్రిగా ఆయుద్ధాన్ని జయప్రదంగా నడపిన లాయడ్ జార్జిగారు. వారొకహాలులో ఉపన్యసించారు. హాలంతా క్రిక్కిరిసిపోయింది. నేను హాజరై, వారిఉపన్యాసం విని ముగ్ధుణ్ణైనాను. వారు మనిషి పొట్టియైనా ఉపన్యసించేటప్పుడు ఇంకొకగుప్పెడు పెరిగినట్లు కన్పడినారు. వారు చేతులు కదిలిస్తూ, చూపుడు వ్రేలు పైకెత్తి చూపుతూ, అనర్గళంగా, హాసవిన్యాసాలతో ఉపన్యసించారు. గొంతు కొంతకీచు కలిగివున్నా, ఖంగున మ్రోగింది. చాలాదూరం వినపడే కంఠధ్వని అది. వారు ఉపన్యసించేటప్పుడు సభికులను కలయజూస్తారు. ఏవ్యక్తికా వ్యక్తి తన్నేచూచి ఉపన్యసిస్తున్నారేమో అనిపించింది. నామట్టుకునాకు

కొంతదూరంలో కూర్చున్నా, నన్నే చూస్తున్నారేమో అన్నట్లు అనిపించింది. వారి గొప్పవక్తృత్వం ప్రజాసందోహాలను ఉర్రూతలూగించటంలో ఆశ్చర్యంలేదు. వారిని చూచి, వారి మహోపన్యాసాన్ని విని మిక్కిలి సంతోషించాను. తిరిగి వారినిగాని, రామ్సె మెక్డోనాల్డ్ గారినిగాని చూచినట్లు లేదు.

నా ఆక్స్‌ఫర్డ్ డిగ్రీకోర్సు అయింది. ఇక మిగిలింది బ్యారిష్టర్ పట్టాను పొందటం. పరీక్షలు 1926 సంవత్సరం అంతానికో, 1927 జనవరి ఆరంభంలోనో జరిగాయి. నే నంతవరకు ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నట్లు లేదు. డిగ్రీని కాన్వొకేషన్‌లో అక్టోబరు 21-వ తారీఖున తీసుకొనేవరకైనా అక్కడ వుండి వుంటాను. ఈమధ్య క్రేఫర్డ్ శ్రీ జాన్ పోలక్, శ్రీమతి మేరి పోలకుగారివద్దకు వెళ్లివచ్చినట్లున్నది. తరువాత లండన్‌కు వెళ్లియుండవచ్చును. శ్రీమతి ఈవ అనే ఆమెకు బ్యాంక్ చెక్కులిచ్చుచున్నట్లున్నది. ఆమెఇంటిలో బసచేసి యుండవచ్చును. ఈ కాలంలో ఇండియన్ మిత్రులతో ఇచ్చి పుచ్చుకోవటాలు హెచ్చుగానే జరిగినట్లున్నవి.

కౌన్సిల్ ఆఫ్ లీగల్ ఎడ్యుకేషన్ జరిపిన బ్యారిష్టరు పరీక్షలకు హాజరై పరీక్షలో జయంపొందాను. 1922 నవంబరులో లింకన్స్ ఇన్‌లో చేరాను. 1927 జనవరిలో చదువు పూర్తి చేశాను. ఏ క్లాసువచ్చిందో తెలియలేదు. తెలిసికొనటానికి జనవరి 21-వ తారీఖున లీగల్ కౌన్సిల్‌కు వ్రాశాను. 27-వ తారీఖున డైరెక్టర్ ( డైరెక్టర్ ఆఫ్ లీగల్ స్టడీస్) గారు జవాబిచ్చారు. విద్యార్థుల మార్కులు తెల్పటం ఆచార విరుద్ధమని అంటూ, మీకు మిక్కిలి హెచ్చుస్థాయిలో మూడో క్లాసువచ్చింది, మీ కామన్ లా పేపరు బాగావున్నది. మీ ఎక్విటి పేపరు, జనరల్ పేపరులోని ఎక్విటిభాగం, రెండో క్లాసు ప్రమాణంలో వున్నవి, ఎవిడెన్సు అన్డ్ ప్రొసీజర్ పేపరు ఫరవాలేదు అని వ్రాశారు.

1927 హిలరి టరంలో ( 26-1-1927 ) బ్యారిష్టర్-యట్-లా గా లింకన్సు-ఇన్ వారు నన్ను పట్టభద్రుని చేశారు. నాతోబాటు ఇంకా 11 మంది పట్టభద్రులైనారు. ఇంకొకరుకూడా కావలసివున్నారుగాని వారు రాలేదు. ఇండియనులం నలుగురం,



గ్రంథకర్త — ఆక్స్‌ఫర్డులో డిగ్రీనిపొందిన సందర్భం
1926 జూన్



ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ స్నాతకోత్సవము

సిలానీస్ ఒకరు, బర్మను ఒకరు, ఆరుగురు బ్రిటిష్ వారు హాజరు. కాని 13-వ వారు యమ్. ఎ. యు. అన్సారిగారు ఇప్పుడు ఒరిస్సా రాష్ట్రంలోనో ఎక్కడో హైకోర్టు జడ్జిగా ఉన్నారు అనుకొంటాను. దక్షిణాదివాడిని నేనొక్కడనే.

మర్నాడో, ఒకటి రెండురోజుల తర్వాతనో ఇంటికి బైలుదేరి, మార్సెల్సులో ఫ్రెంచి స్టీమ్‌షిప్ కంపెని మెస్సాజరీ మారిటైమ్ వారి ఓడనెక్కి కొలంబో మీదుగా మద్రాసుహార్బరుకు 1927 ఫిబ్రవరి 27-వ తారీఖు రాత్రి ఏడు గంటలకు సురక్షితంగా చేరుకొన్నాను.

# సింహావలోకనం

నేను ఇంగ్లండునుండి తిరిగివచ్చి 45 సంవత్సరాలు దాటినవి. చిన్న నోటుబుక్కులలో అప్పుడప్పుడు పేర్లు, చిరునామాలు వ్రాసుకోవటంతప్ప దినచర్య (డయిరి) వ్రాసుకొనివుండలేదు. తారీఖులు వ్రాసుకొన్నవి చాలాతక్కువ. అందువల్ల, నే ఇంగ్లండులోనుండిన సుమారు ఆరున్నర సంవత్సరాలకాలంలో జరిగిన సంగతులను, అనుభవాల నన్నింటిని వరుసక్రమంగా పైన చెప్ప లేకపోయి యుండవచ్చును. పైగా కొన్నిటిని చెప్పటంలో పొరపాట్లు జరిగియుండవచ్చును. కాబట్టి పైన వ్రాసినదానిలో పొరుమారులున్నా, అస్ఫుటములుగాని, సందిగ్ధములుగాని వున్నా, ఆశ్చర్యం కాదు. మరిన్ని, కొన్నివిషయాలను అసంపూర్తిగా చెప్పివుండవచ్చును. కొన్నిటిని విడిచిపెట్టి ఉండవచ్చును. ఈ కారణాలవల్ల, తిరిగి మననంచేసుకొనే రీతిగా ఈక్రింద వ్రాస్తున్నాను.

నా కార్యకలాపాలు ముఖ్యంగా ఆక్స్‌ఫర్డ్‌లో, రెండవ దశం లండన్‌లో. మొదటిదానిలో బి. ఎ. ఆనర్సు డిగ్రీ తీసుకొన్నాను, రెండవదానిలో బ్యారిష్టరుపట్టాను పొందాను. ఈ రెండు ప్రదేశాలలో కాక పారిస్ నగరంలో ఫ్రాన్స్‌లో కొంత వ్యవహరించాను. సెలవుల్లో డబ్బిచ్చి అతిథిగా వెళ్లినచోట్లను

గురించి ఇదివరకే చెప్పియున్నాను. ఇంక ఏమైనా జ్ఞాపకం వస్తే చెప్తాను.

**ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిగా:** నా చదువు సామాన్యాభ్యాసతో వుండేది. చిన్నప్పటినుండి ఎక్కువకష్టపడి చదివినవాడను కాను. చదువంటే ఆసక్తిగావున్నా, ఆసర్దుడు ఈసర్దుడుతో కాలం వృథా అయ్యేది. నేను నిత్యకృత్యాలు తీర్చుకొనటంలో, బట్టలువగైరా వేసుకొనటంలో చాలా ఆలస్యంచేసేవాడిని. ఈ దురభ్యాసం ఇప్పటికిని పోలేదు. పైగా, ఊసులు, వింతలు కొంతకాలాన్ని హరించేవి. అన్నిటినిమించి ఏకబిగిని చదివే ఓపిక వుండేదికాదు. ఈ లోపం మొత్తంమీద భారతీయవిద్యార్థు లందర కున్నది. గంటలకొలది ఏకబిగిని చదవటంలో శ్వేతజాతీయులదే పైచేయి.

నాచదువు మిక్కిలి నెమ్మది, అనగా కొంతమంది గంట చదివేది నాకు రెండుగంటలైనా పట్టేది. ఇప్పటికిని అంతే. ఇవిగాక, నేను పెద్ద తెలివితేటలు కలవాడను కాను. విషయం చప్పున అర్థంచేసుకోలేను. ఇవన్నీ కలసి, నా ఆక్స్‌ఫర్డ్ చదువు మూడున్నర సంవత్సరాలు, అంతకుతప్పితే నాలుగు సంవత్సరాలలో పూర్తికావలసింది, ఆఱు సంవత్సరాలు పట్టింది. నేను ఇండియాలో ఇంటర్మీడియేట్ వరకే చదివి వెళ్లాను. బి. ఎ. డిగ్రీ వుంటేగాని, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చేర్చుకొనరు కాబట్టి, రెస్‌పాన్‌షన్స్ అనే ప్రవేశపరీక్ష చదవాల్సివచ్చింది. ఈపరీక్షకు ఫ్రెంచి భాష నేర్చుకోవలసివచ్చింది. భాషలునేర్చుకొనటంలో నేను మిక్కిలి మందబుద్ధిని. ఈ మందబుద్ధితనంవల్ల, నేను నేర్చుకొన్న సంస్కృతం, లాటిన్, ఫ్రెంచి, ఉరియా భాషలు ఇంచుమించు మర్చిపోయాను. నేను ఫ్రెంచిభాషను ప్రవేశపరీక్షకు ప్రాసేస్థితికి నేర్చుకొనటానికి, సంవత్సరంపైచిల్లు అదనంగా పట్టింది. ఆకారణాన 1921 అక్టోబరులో విశ్వవిద్యాలయంలో చేరటానికి బదులు, 1922, అక్టోబరు వరకు ఆగవలసివచ్చింది. నేను 1921 జూన్ నాటికే ఫ్రెంచిభాషలోగాక, తతిమ్మా అంశాలలో నెగ్గాను. నిజానికి, మాకాలేజి ప్రిన్సిపాల్ బేకర్‌గారు ఒక అంశం మిగిలిపోయిన ఇతర విద్యార్థులను యూనివర్శిటీలో చేర్పించినట్లే, నన్ను కూడ చేర్పించియుంటే, యూనివర్శిటీ చదువు ఒత్తిడివల్లనైనా

ఫ్రెంచిభాషను త్వరగా నేర్చుకోనేవాణ్ణి. యూనివర్శిటీలో చేర్చుకోనందున, అశ్రద్ధ పెరిగి కాలయాపన జరిగింది. ఇదిగాక, 1923 జూన్‌లో నా ప్రథమభాగం ( ఫస్ట్ పబ్లిక్ ) పరీక్షలో ఒకఅంశం మిగిలిపోవటం నాదురదృష్టం. పైస్థితిగతులు, నా ఆక్స్‌ఫర్డ్ చదువు కాలాన్ని రెండు సంవత్సరాలైనా పెంచాయి. ఈ సందర్భంలో 17–10–22 న, అనగా యూనివర్శిటీలో చేరటానికి నాలుగు రోజులకు ముందు, నేనప్పుడుంటున్న 327, కౌలీ రోడ్డులో " నాదురదృష్టములు " అనే శీర్షిక క్రింద వ్రాసుకొన్నది ఇక్కడ చేర్చుతాను. " నేనిక్కడకు మొట్టమొదట వచ్చినప్పుడు నాకు మంచిసహాయము దొరకకపోవుటయేగాక, " చెడు " సహాయము ఎదురుపడుట, సహవాసము మంచిదికాకపోవుట, ఎడింబరో కు వెళ్లుటవలన తీరరానినష్టము కలిగినది.

1921 జూన్‌లో సంస్కృతము, లెఖ్ఖలు, ఇంగ్లీషు ప్యాసు అయినతర్వాత ఫ్రాంసునకు వెళ్ళుట చెరుపుచేసినది. తత్ఫలితముగ సోమరితనము కలిగి ఫ్రెంచిభాష చదువకపోవుట ఒక విధమైన రియాక్షన్ కలిగినది.

' సెన్సార్ ' నన్ను 1921 అక్టోబరులో మెట్రిక్యులేట్ చేయకపోవుటవలన నాకు చాలానష్టము కలిగినది. వైస్-ఛాన్సలర్ ఒక సర్క్యులర్ పంపినాడనియు, అందువలన మెట్రిక్యులేషన్ చేయుటకు వీలులేదనియు సెన్‌సార్ చెప్పిన వాక్యములు వట్టి మిష. ఎందువల్లననగా, గతసంవత్సరమే కాకుండా, ఈరోజునకూడా మూడు అంశములలో ప్యాసుచేసిన వారినికూడ మెట్రిక్యులేట్ చేసినాడు.

జీతములు పూర్తిగ చెల్లించలేదు కాబట్టి ఈరోజున నిన్ను మెట్రిక్యులేట్ చేయుటకు వీలులేదని చెప్పుటకూడ వట్టి మిష అని నా అభిప్రాయము. మెట్రిక్యులేషన్ ఫీ, కాషన్ మనీ చెల్లించియున్నాను. తదితర జీతములు యూనివర్శిటీ తెరచిన నాలుగువారముల లోపుగ కట్టవచ్చును. మఱియు రంగనాయకులును మెట్రిక్యులేట్ చేసినప్పుడు, రంగనాయకులు మెట్రిక్యులేషన్ ఫీ మాత్రమే కట్టినాడని నాకు జ్ఞాపకము. ( మెట్రిక్యులేషన్ ఫీ కూడా కట్టలేదని రంగనాయకులు చెప్పినాడు. )

పైది మిక్కిలి అతిశయోక్తితో కూడిన, తాత్కాలిక మనోపరితప్తతవల్ల వ్రాసింది, నిజానికి రామకృష్ణగారు, రంగాగారు సహాయాన్ని అందించారు. రామకృష్ణగారు తోడునీడగా నుండినారు. మనోవైకల్యానికి కారణం లేకపోలేదు. నేను వెళ్లి మా ప్రిన్సిపాల్ (సెన్సార్.) బేకర్‌గారిని నన్నుకూడా యూనివర్శిటీలో చేర్పించండని అంతకుముందే అడిగాను. నీవు డబ్బు కట్టలేదని సాకు చెప్పుతూ, కట్టనందుకు మందలించారు. దానికి కళ్లనీళ్లు తిరిగి, క్రిందకువచ్చి వెక్కివెక్కి ఏడ్చాను. ఇంతలో రూథర్‌ఫర్డ్ అనే పేరుగల మా కాలేజి పోర్టరు అక్కడకు రాగా, చప్పున ముఖం కడుక్కొనే చోటికి వెళ్లి ముఖం కడుక్కొన్నాను. కాని రూథర్‌ఫర్డ్ నా దుఃఖాన్ని చూచాడు. నేను బైటికిరాగా దుఃఖంవిషయం ఎత్తకుండా, ఆ మాట ఈ మాటతో అనునయించాడు. పాశ్చాత్యులు ముఖ్యంగా ఇంగ్లీషువారు ఇటువంటి వానిని గమనించినట్లు ప్రత్యక్షంగా తెలియనీయరు. మనవాళ్లయితే ఏమిజరిగింది, ఎందుకు ఏడుస్తున్నావు మొదలైన ప్రశ్నలతో విసిగించేవారు.

బేకర్‌గారు కఠినుడుకాదు. సానుభూతి, మంచితనం వున్న పెద్దమనిషి. నేనిదివరలో చెప్పిన విలియమ్సుగా రేమైనా చాడీలు చెప్పియుందురు. అయినా, నా పద్ధతులు వారికి నచ్చియుండకపోవచ్చును. అప్పటి కింకను మా వార్డన్‌గా వుండిన శ్రీరామకృష్ణగారు బేకర్‌గారి అభిప్రాయంతో ఏకీభవించి యుండవచ్చును, లేదా బేకర్‌గారితో వారు చెప్పియుండకపోవచ్చును. చెప్పినా, బేకర్‌గారు ఆ సలహాను పాటించకపోయి యుండవచ్చును,

చదువు సామాన్యమైనా, ఆటలు, పాటలలో కొందరు ఆరితేరి వుంటారు. నా కా సామర్థ్యము, చతురత లేదు. మా విశ్వవిద్యాలయం రోయింగు (పడవలు నడపటం) లో ప్రసిద్ధి. రగ్బీ, ఫుట్‌బాల్, క్రికెట్, హాకీ, టెన్నీసు వంటి ఆటలలో తక్కువదికాదుగాని, రోయింగులో ఎక్కువ శ్రద్ధ తీసుకొనేది. వేసవిలో నీళ్ళమీద సంచారం చాలా సుఖప్రదంకదా. ఆక్స్‌ఫర్డ్‌ను ఆనుకొనే థేమ్సునదిపాయ ఐసిస్ వున్నది. దాని పరిసరాలు

పచ్చికబయళ్ళతో, వృక్షసంతతులతో మిక్కిలి రమణీయంగా వుంటవి. అందువల్ల విద్యార్థులు మిక్కిలి ఉత్సాహంతో రోయింగు నేర్చుకొంటారు. నే నా జోలికే పోకపోవటమేగాక, నే నే ఆటల లోను పాల్గొనలేదు. చివరకు సైకిలు త్రొక్కటంకూడా నేర్చుకో లేకపోయానని ఇదివరకే చెప్పాను.

నే నే విద్యార్థిసంఘంలోను చురుకుగా పాల్గొనలేదు. ఆక్స్‌ఫర్డ్ యూనియన్ సొసైటిలోను, ఆక్స్‌ఫర్డ్ మజిలీస్‌లోను సభ్యుడనే. అప్పుడప్పుడు వాని సమావేశాలకు, వానిలో జరుగు చర్చలకు వెళ్లేవాడనుకాని గమ్మున కూర్చుండి వినటమే నా వంతు. ఒకటి రెండు విద్యార్థి, ఇతరక్లబ్బుల సమావేశాలకు హాజరైనానేమోకాని ఏవిధముగాను పాల్గొనలేదు. ఆక్స్‌ఫర్డ్ విద్యార్థులు నడుపుచుండిన ఐసిస్ అనే మాగజీన్‌కుగాని, ఆక్స్‌ఫర్డ్ ఇండియన్ విద్యార్థులు నడుపుచుండిన భారత్ అనే మాసపత్రికకు గాని, ఎన్నడూ ఎట్టి రచనను నేను పంపియుండలేదు. అందువలన నా ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ఉనికి ఒక్క చదువుకుమాత్రమే పరిమితమై ఉండింది.

అన్ని కాలేజిలలో వలెనే, మా కాలేజికి లైబ్రరీ ఉన్నది. పైగా బాడ్లెవంటి పెద్ద పుస్తకభాండాగారం, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ అనే సంస్థలో మంచి లైబ్రరి వున్నవి. శ్వేతవిద్యార్థులు అతిశ్రద్ధగా గంటలకొలది ఈ పుస్తకభాండాగారాలలో చదవటం చూచానుగాని నేనుమాత్రం చదివినపాపాన పోలేదు. కాబట్టి, నా చదువు సామాన్యంగా నడచిన చదువని తెలుస్తుంది.

వేషధారణ మొదటి ఒకటిరెండు సంవత్సరాలలో, అంతకు కొలదికాలం ముందే ముగిసిన మొదటి ప్రపంచయుద్ధప్రభావం వల్ల, అప్పటి పద్ధతి ప్రకారం, (ఫాషన్) నిర్లక్ష్యంగా వుండినా, తరువాత తరువాత, మంచిమంచి బట్టలు వేసుకోవటంలో నా అభిరుచి ఎక్కువైంది. తలకు స్వచ్ఛమైన కొబ్బరినూనెతప్ప ఏబ్రిలియంటీన్ వాడలేదు, ముఖానికెన్నడూ పౌడరు అద్దుకోలేదు. కాని, ఏకోటుకు ఏషర్టు వేసుకోవాలో, ఏ టై కట్టుకోవాలో,

ఏకోటుకు తగినలాగు ఏదివుండాలో, మొదలైనవానిలో మిక్కిలి శ్రద్ధవహించేవాడిని. ఆక్స్‌ఫర్డ్‌లోని భారతీయ విద్యార్థులలో బాగా దుస్తులువేసుకొనేవారిలో నేనొకడ నని పేరుగడించు కొన్నాను.

చదువునందు ఆసక్తిగల కొందరు విద్యార్థులవలె, లెక్చరర్సునుగాని, ప్రొఫెసర్సునుగాని సందేహాల నివారణకొరకు కలసికొనేవాడను కాను. చివరకు ట్యూటర్సు వద్దకుకూడా పాఠంవేళతప్పితే, వెళ్లేవాడనుకాను. ఉమ్మడి ఉపన్యాస పాఠాలకు హాజరయ్యేవాడనుకాని, శ్రద్ధగా నోట్సుతీసుకొనేవాడను కాను. ఆపాఠాల ఉపయోగం, బైటకువచ్చి చీదివేసినట్లుగా వుండేది. అందువల్ల విశ్వవిద్యాలయ అధ్యాపకులతో నాసంబంధం ఇంచు మించుగా నాస్తి. ఈకారణాలవల్ల నాచదువు మధ్యరకంగా వుండటం, నాకు మూడోక్లాసే రావటం ఆశ్చర్యంకాదు. నా ట్యూటరు టి. హెచ్. టేలర్‌గారు ఈసందర్భంలో వ్రాసిన యుత్తరం పేర్కొనవచ్చును. వారు 1926 జూలై 26-వ తారీఖున వ్రాసిన యుత్తరంలో ఈవిధంగా ( తెలుగు అనువాదం ) వున్నది : "నీకు మంచిబుర్ర వున్నదని నేను ఎప్పుడో అను కొన్నాను. నిజానికి నీవు కష్టపడి చదివితే సెకండ్ క్లాసు వస్తుందను కొన్నాను. నీకు నీవు న్యాయం కలుగజేసుకోలేదు. స్నేహితుడుగా నీకొక వార్నింగ్ ( సలహా ) యివ్వవలసియున్నది. జీవితంలో ఏదోవిధంగా త్రోసుకొనివస్తూ, గండాలు తప్పించుకొంటూ, తమకు వుండిన శక్తులను పూర్తిగా తాముపయోగించుకోకుండా, ఇతరులకు అందజేయకుండా కాలక్షేపం చేసేవారు, చివరకు దుర్దశ పొందుతారు" అని వ్రాశారు.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో అనేక దేశాలవారు, అనేక జాతులవారు చదువుచుంటారు. కాని టెన్నిస్ నేర్చుకొనటానికి సహాయంవచ్చిన ఒక ఇంగ్లీషువిద్యార్థితప్ప ఇతర శ్వేతవిద్యార్థి నాకు స్నేహితుడు కాలేదు. ఈటెన్నిస్‌విద్యార్థి స్నేహమయినా, తాత్కాలికంగానే. నీగ్రోజాతివారుగాని, మంగోలియన్ జాతివారు గాని నాకెవ్వరూ స్నేహితులు కాలేదు. ఒక చైనీస్ విద్యార్థితో మాత్రం అతి స్వల్పమైన పరిచయం కల్గింది. అదియు ఒకటి,

రెండు రోజులే. మన భారతీయ విద్యార్థులు చాలామందితో నాకెట్టిసంబంధ ముండేదికాదు. కొంతమంది ముఖపరిచయంవారు, కొంతమంది పలుకరించటంతో సరిపెట్టుకొన్నవా రుండినారు. కొలది స్నేహితులలో ముఖ్యులు రంగాగారు, శ్రీకృష్ణగారని వేరే చెప్పనక్కరలేదు. తెలుగువారైన శ్రీ కె. వి. గోపాలస్వామి, శ్రీ ఒ. పుల్లారెడ్డి, శ్రీ వి. వి. చౌదరి, శ్రీ టి. మురారి మిత్రులైనారు. వీరుగాక, కొలది కాలం సన్నిహిత స్నేహితుడుగా జాంజిబార్‌కుచెందిన ఖోజా ముస్లిం యువకుడు శ్రీ డబ్లుయు. వాలీధార్సి వుండినారు. వారు నేను కలసి సామూహికస్నానానికి వెళ్ళుచుండేవారం. శ్రీ ఐ.వర్ఘీస్ (సిరియన్ క్రిస్టియన్) మిక్కిలి చనువుగా, వికవికలతో వుండేవారు. వారు తత్వశాస్త్రంలో డిగ్రీ తీసుకొన్నారు. చామనచాయ రంగైనా, ఎత్తుగా, సరిపడ్డలావుతో చక్కని ముఖకవళికలు కలిగి అందంగా వుండేవారు. చలాకీగా నవ్వుతూ ప్రేలుతూ వుండే మాటకారి. శ్రీ టేక్‌చంద్ థండా, శ్రీ హెచ్. యమ్. పటేల్, శ్రీ అష్వాక్ హుస్సేన్ మంచి పరిచయులక్రింద లెక్క. శ్రీ టి. యస్. రామచంద్రన్, శ్రీ అలియార్ ఖాన్, శ్రీ ఫాన్సే, శ్రీ రహిమాన్, శ్రీ జోషి, శ్రీ థాపర్, శ్రీ విఠల్‌పాయ్, శ్రీ విజయరాఘవన్, శ్రీ అన్సారి, శ్రీ ఝూ స్వల్పపరిచయులు. అయితే శ్రీ అలియార్ ఖాన్, శ్రీ విఠల్‌పాయ్ కొంత స్నేహభావం కనబరచేవారు.

రంగాగారు, నేను తరచు కలుసుకొనుచుండేవారం. శ్రీకృష్ణ గారు దారిలో కలిసినప్పుడుగాని, అంతగా దగ్గరకు వచ్చేవారు కాదు. శ్రీ గోపాలస్వామి, శ్రీ ఒ. పుల్లారెడ్డి కనపడినప్పుడల్లా స్నేహభావంతో ఉండేవారు. శ్రీ మురారి మాకాలేజివాడే. శ్రీ వి. వి. చౌదరి ఆక్స్‌ఫర్డ్ విద్యార్థి కాదు. లండన్‌లో బ్యారిష్టరుపట్టాకు, న్యాయశాస్త్రంలో డాక్టరేటుకు చదువుతూ, మా ఆక్స్‌ఫర్డ్‌లో కొంతకాలం మకాంపెట్టాడు. ఆయన స్నేహశీలియేగాని అరుదుగా కలసికొనేవారం. తరచు కలసికొన్నా లేకపోయినా కలసికొన్నప్పుడు ఆప్యాయతతో, చనువుతో వుండేవారం. వీరందరు తెలుగువారు. ప్రొఫెసర్ సర్వేపల్లిరాధాకృష్ణ

గారు అప్టన్ ఉపన్యాసా లిచ్చుటకు ఆక్స్‌ఫర్డుకు 1926 జూన్‌లో వచ్చినప్పుడు, అక్కడున్న తెలుగువారం శ్రీమతి భారతీదేవి రంగాగారితోసహా, గ్రూప్‌ఫొటో తీయించుకొన్నాం.

తరువాతకాలంలో తెలుగువిద్యార్థులలో శ్రీరంగా అఖిల భారత జాతీయనాయకుడై వున్నారు. శ్రీ శ్రీకృష్ణ ఆంధ్ర విశ్వ విద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా కొన్ని సంవత్సరాలు పనిచేసి, పిమ్మట యూనివర్శిటీ గ్రాంట్సు కమీషన్ అధ్యక్షులై ఇంకను కొన్ని సంవత్సరాలు జీవించటానికి వయస్సువున్నా, గుండెజబ్బుచేత అకస్మాత్తుగా చనిపోయారు. శ్రీ కె. వి. గోపాలస్వామి ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో మంత్రిగానేగాక, ఆరాష్ట్రానికి గవర్నర్ పదవిని కూడా అధిష్ఠించిన సర్ కూర్మా వెంకటరెడ్డిగారి జ్యేష్ఠపుత్రుడు. వీరు న్యాయవాదవృత్తి కొంతకాలం సాగించి, తదనంతరం ఆంధ్ర విశ్వవిద్యాలయం రెజిస్ట్రారుగా, కావలి కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. ఇప్పుడు హైదరాబాదులో వుంటున్నారు. ఒ. పుల్లారెడ్డిగారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలో ఛీఫ్ సెక్రటరీగా పని చేసి, కేంద్ర ప్రభుత్వం డిఫెన్సు సెక్రటరీగా వుండి, మొన్నటి వరకు ఆంధ్ర ప్రభుత్వ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి అధ్యక్షులుగా వుండినారు. శ్రీ టి. మురారి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలోను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలోను పశుసంవర్ధకశాఖ డైరెక్టర్‌గా వుండి, ఇప్పు డేదో వ్యాపారము చేసుకొంటూ, మద్రాసులో వున్నారు. శ్రీ వి. వి. చౌదరి మద్రాసు, ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టులలో న్యాయవాద వృత్తిని నిర్వహించి, లా జర్నల్ రిపోర్టర్‌గా వుండి, ఈ మధ్యనే చనిపోయారు.

ఇక తెలుగువారు కానివారిలో శ్రీ టేక్‌చంద్ ధండా పంజాబ్ హైకోర్టు జడ్జిగా పనిచేసి, ఇప్పుడు విశ్రాంతి తీసుకొంటు న్నారని విన్నాను. ఎ. విఠల్‌పాయ్‌గారు ఐ. సి. యస్. ఆఫీసరై, కేంద్ర ప్రభుత్వ హోంశాఖ సెక్రటరీగా పనిచేశారు. శ్రీ హెచ్. యమ్. పటేల్‌గారు ఐ. సి. యస్. కాడర్‌లో చేరి కేంద్ర రక్షణ శాఖ, ఆర్థికశాఖ, వాణిజ్యశాఖ మొదలైనవానిలో సెక్రటరీగా పనిచేసి, ఇప్పుడు గుజరాత్ రాజకీయాలలో స్వతంత్రపార్టీ నాయకులుగా సతమతమవుతున్నారు. శ్రీ అలియార్‌ఖాన్ (ఇప్పుడు

జంగ్) ఈజిప్టువంటి దేశాలలో రాయబారిగా వుండి, ఇప్పుడు మహా రాష్ట్ర గవర్నర్ గా వున్నారు. శ్రీఅన్సారిగారు ఒరిస్సాకు గవర్నర్ గా వున్నారు లేక ఉండినారు. శ్రీ టి. యస్. రామచంద్రన్ గారు ఐ. సి. యస్. ఆఫీసరుగా పెద్దఉద్యోగాలు నిర్వహించారు. శ్రీ థాపర్, ఝూగార్లు ఐ. సి. యస్. ఆఫీసర్లై పెద్దఉద్యోగాలు నిర్వహించారు. రహిమాన్ గారు మద్రాసు హైకోర్టు జడ్జిగా పని చేసిన సర్ అబ్దుల్ రహిమాన్ గారి కుమార్డు. . వీరు బ్యారిష్టర్ గా న్యాయవాదవృత్తి నవలంబించారని గుర్తు. శ్రీ అష్పాక్ హుస్సేన్ గారిని 1954 లో ఢిల్లీలో కలసికొన్నప్పుడు, శ్రీఅబుల్ కలామ్ అజాద్ గారి విద్యా, సాంస్కృతిక శాఖలో పెద్ద ఉద్యోగములో నుండినారు. వీరు నేను మిక్కిలి చనువుగా మెలగేవారం. అప్పుడప్పుడు చెట్టాపట్టాలు వేసుకొని షికారుకు వెళ్లేవారం. అతడు పండునిమ్మపండువలె పచ్చగా ఉండేవాడు. ముఖం మార్దవంగా ఉండేది. చిన్నవయస్కుడుగా కన్పించేవాడు. మేము షికారుకు వెళ్తుండగా, ఎదురువచ్చిన శ్వేతవిద్యార్థులలో ఒకరిద్దరు మా చెట్టాపట్టాలను చూచి, చిరునవ్వుతో వెళ్లిపోవటం చూచాను. వారేం అభిప్రాయం పడినారో ఊహించటం అసాధ్యంకాదు. శ్రీవిజయరాఘవన్ లెక్కలలో మిక్కిలి దిట్ట అని పేరుపొందారు. వీరు మద్రాసు ప్రెసిడెన్సి కాలేజిలో లెక్కల ప్రొఫెసర్ గా పనిచేశారని విన్నాను. మేధావియైన శ్రీషాన్నే ఎక్కడ ఏపని చేశారో తెలియదు. 1925 నవంబరులో తీసుకొన్న ఆక్స్ ఫర్డ్ మజిలీస్ గ్రూప్ ఫొటోలో పై వారిలో చాలా మంది ఉన్నారు. ఎందువల్లనో తెలుగువారిలో నేను, గోపాలస్వామిగారు మాత్రమే ఉన్నాము.

ఆక్స్ ఫర్డ్ లో, ఇతరపట్టణాల్లోవలెనే, హోటల్సు, రెస్టారాంట్సు ఉన్నవి. మామూలుగా విద్యార్థులం కాలేజిల్లోనో, వసతిగృహాల్లోనో భోజనం చేసేవారం. అయితే, మధ్యాహ్న భోజనానికి ( లంచ్ ) పూర్వం అప్పుడప్పుడు ఏహోటల్ లోనో మిఠాయి ( కేక్సు ), కాఫీగాని ఇతర పానీయంగాని తీసికొనేవారం. సాయంత్రం తప్పకుండా ఏరెస్టారాంటులోనో ఉపాహారాలు తీసుకొనేవారం. ఈ ఉపాహారాల్లో క్రంపెట్సు అని, మఫిన్సు అని

కోన్సు అని మైదాపిండితోగాని, గోధుమపిండితోగాని చేసేవి యిచ్చేవారు. ఒకవేళ కొంత బియ్యంపిండి ఉపయోగించేవారేమో అని అనుమానం. అవి మిక్కిలి రుచికరంగా ఉండేవి. నేను ఎక్కువగా ఒకే రెస్టారాంటుకు వెళ్లేవాడిని. శ్రీకృష్ణగారికి ఎక్కువ పరిచితురాలైన మేధావి మిస్ స్ట్రాక్ అనే విద్యార్థినిని, అప్పుడప్పుడు ఆ రెస్టారాంటులో చూచేవాడను. మిస్ స్ట్రాక్, రంగాగారికి కూడా పరిచయమైనారు. 1954 మార్చిలో నేను ఢిల్లీ వెళ్లినప్పుడు రంగాగారింటికి ఆమె రావటం చూచాను. ఆక్స్‌ఫర్డ్‌లోని భోజన, ఉపాహారాలు కొంతవరకు సంసారపక్షంగా ఉండేవి. నాజూకు పదార్థాలు విద్యార్థులకు మంచివి కావని అభిప్రాయ ముండింది కాబోలు.

మలవిసర్జన తర్వాత, ప్రక్షాళనం నీళ్లతోగాక ఉల్లిపొరవంటి కాగితంతో. అయినా స్నానం మామూలుగా వారానికి ఒకసారి మాత్రమే. ఇది వేడినీళ్లతో అని వేరే చెప్పనక్కరలేదు. మామూలుగా ఎవరివసతిలో వారు స్నానంచేస్తారు. కాని, నేను బాల్లిలో వున్నప్పుడు పట్టణంలో జుట్టు కత్తిరింపు వేయించుకొని, చిరాకుగా వుండినందువల్ల మావసతిగృహానికి పోలేక ప్రక్కనున్న హోటలులో ఒకషిల్లిం గిచ్చి స్నానంచేశాను. నాకు స్నానంలో కూడా ఆలస్యమే. మామూలుకంటె ఎక్కువకాలం తీసుకొని వుంటాను, హోటలతను ఇంతసేపు స్నానంచేస్తే ఎట్లా అని కోప్పడ్డాడు. తిరిగి ఆ హోటల్‌కు వెళ్లలేదు. మరొకసారి బయట స్నానంచేసినట్లు గుర్తులేదు.

ఇక, పట్టణవాసులు విద్యార్థులతో వర్తించేవిధం - సర్వసామాన్యంగా, ఆ విశ్వవిద్యాలయం విద్యార్థులంటే అందరికి గౌరవం. వారితో మర్యాదగా వర్తిస్తారు. బ్రిటిష్ విద్యార్థుల విషయం చెప్పనక్కరలేదు. ఇతర శ్వేతవిద్యార్థులుకూడా ఆ విధముగనే గౌరవంపొందుతారు. భారతీయులవంటి ఆసియా విద్యార్థులనుకూడా సగౌరవంగా చూస్తారు. వారితో మర్యాదగా నడుచుకొంటారు. అయితే, నా ప్రారంభదశలో రెండుమూడు దఫాలు నాయెడల వర్ణద్వేషం కనబడింది. ఒకదఫా, దక్షిణాఫ్రికా శ్వేతవిద్యార్థు లిద్దరు, ముగ్గురు, నేను వెళ్లుచున్నరోడ్డు కవతల

ప్రక్క బాట (పేవ్‌మెంటు) మీద వెళ్ళుచూ నన్నుచూచి "కూలీ" వంటి కించపరచే మాటలు బిగ్గరగా అన్నారు. అందులో ఒకడు అన్నవానిని మందలించినట్లున్నది. ఎవరిత్రోవన వారు పోయాం. రెండవదఫా ఒక బీద స్త్రీ, ఒక చిన్నబిడ్డను వెంటబెట్టుకొని పోతుండినది. దూరంగావుండిన నన్నాపిల్లవానికి చూపించి, అదిగో బ్లాకీ అన్నది. నేను తేరిపారచూడగా, తల వంచుకొని వెళ్లిపోయింది. ఇంకొకదఫా ఇద్దరు యువకకార్మిక దుండగులు పేవ్‌మెంటుమీద నాకు ఎదురై, నన్నడ్డగించి, నేను నీగ్రో నన్నట్లుగా తమమూతిచుట్టూ వ్రేళ్ళుత్రిప్పుకొంటూ, నా మూతిచుట్టూ త్రిప్పబోయారు. నాచేతిలో నున్న గొడుగుతో వాళ్లను కొట్టటానికి పైకెత్తాను. ఇంతలో పోలీసు కానిస్టేబుల్ దగ్గరకురాగా, ఆయనతో చెప్పాను. ఆయనను చూచి దుండగులు పారిపోయారు.

చివరకు చెప్పదలచిందిది – మొత్తంమీద, నా ఆక్స్‌ఫర్డ్ విద్య కొంతదండుగే. మొత్తంఖర్చు నలభై ఐదు వేల రూపాయల దాకా అయింది. ఆరోజులలో రూపాయివిలువ హెచ్చు. నేను వెళ్లిన మొదటిసంవత్సరం 1920 లో బంగారుసవర్సు ధర పది, పదిన్నర రూపాయలుమాత్రమే. అప్పుడు ఎక్స్ఛేంజిరేటు కూడా పది, పదిన్నర రూపాయలకు మించలేదు. ఆ రేటునుబట్టి, అంతమొత్తంఖర్చు విపరీతం. అదిగాక, రైతులమైన మా కుటుంబానికి ఆదాయం వరిధాన్యంనుండి. ఆరోజుల్లో వడ్లబస్తా (166 పౌన్లు) ధర పది రూపాయలకు మించలేదు. కాబట్టి, నాఖర్చు మాకుటుంబానికి పెద్దభారమైంది. కుటుంబభూములను చాలావరకమ్మివేయవలసివచ్చింది. ఈవిషయాలు ఆలోచించగా, నేను స్వల్పజీతంతో, సామాన్యహోదాతో, 20 సంవత్సరాలు పైచిల్లు, ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా పనిచేయటం, నాలుగు సంవత్సరాలలోపుగా ఇన్‌కమ్‌టాక్స్ అసిస్టెంటు కమిషనరుగా పనిచేయటం చాలాదండుగనిపిస్తుంది. బహుశా, ఎవరో ఒకరిద్దరు వ్యర్థులుతప్ప, ఆక్స్‌ఫర్డ్ విద్యార్థులలో నాఅంత తక్కువస్థాయిలో జీవితాన్ని నడుపుకొన్నవారు లేరనుకొంటాను. మూర్ఖపుపట్లు

దలతో, ఇంగ్లండులో చదువు గొప్పఅవకాశాన్ని కల్పిస్తుందన్న పిచ్చినమ్మకంతో, కుటుంబాస్తులు తగలబెట్టి, ఇప్పుడు సామాన్య రైతు జీవితాన్ని గడుపుచున్నాను.

## లండన్‌లో

ఆక్స్‌ఫర్డ్ పుట్టినిల్లువంటి దవగా, లండన్ అత్తవారిల్లు వంటిది. ఆక్స్‌ఫర్డ్ విడిస్తే, లండన్‌కు వెళ్లవలసిందే. అసలు ఇంకొక సులువైన మార్గంకూడా లేదనుకొంటాను. లండన్‌కు వెళ్లి వెళ్ళటంతోనే, 112, గవర్ స్ట్రీటు (వై. యం. సి. ఎ. ఇండియన్ విద్యార్థుల వసతిగృహం) కు వెళ్ళవలసిందే. 21 క్రామ్‌వెల్ స్ట్రీటులో ఇండియా ఆఫీసు ఆధ్వర్యాన ఇండియన్ స్టూడెంట్సు వసతిగృహం వున్నదికాని ఏదో ఒకటి రెండుసార్లు తప్ప, అక్కడకు వెళ్ళలేదు. నిజానికి గవర్ స్ట్రీటుకు వెళ్లే విద్యార్థులు అక్కడకు వెళ్ళరు. క్రామ్‌వెల్ స్ట్రీటుది అధికార పెత్తనంక్రింద వున్నదికాబట్టి, జాతీయభావంగల విద్యార్థులు అక్కడకు వెళ్ళటాని కిష్టపడేవారుకాదు. గవర్ స్ట్రీటులో కొద్ది మంది వుండటానికి వసతున్నదిగాని, నే నెప్పుడూ అక్కడుండినట్లు లేదు. ఏ రాగ్లన్‌వంటి హోటలులోనో మకాం. అయితే, ఎక్కువ రోజులుంటే, ఏ బోర్డింగు హౌస్‌లోనో చేరేవాడను. 1926 జనవరి 1 నుండి 14 వరకు హాంప్‌స్టెడ్‌లోని మిసెస్ హార్డింగ్, 56 గ్రీన్‌క్రాఫ్ట్ గార్డెన్సు ఇంటిలో వుండినట్లు, నా నోటు బుక్కులో ఉన్నది పైన వ్రాశాను.

గవర్ స్ట్రీటులోని ఇండియన్ విద్యార్థుల వసతిగృహంలో, ఒకరాత్రి మా బందరు నోబుల్‌కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వుండిన విలియం ఛార్ల్స్ పెన్‌గారిని, వారు భోజనం చేయుచుండగా చూచాను. వారు బందరులో ఎప్పుడు చక్కగా కత్తిరించి క్రిందకు మొనగా తేలిన గడ్డంతో వుండేవారు. ఇప్పుడు గడ్డం లేదు. అయినా సులభంగా గుర్తుపట్టాను. వారి టేబుల్

వద్దకు వెళ్లి, మీరు పెన్ గారు కాదా అని అడిగాను అవునన్నారు. నేను బందరులో మీ విద్యార్థినని చెప్పాను. వారు సంతోషించారు. వారి భార్యకూడా వారివెంట ఉన్నది. ఆమెను పరిచయపరిచారు. వా రప్పుడు లండన్ న్యూపార్కు హైబరిలో ఉండుచుండినారు. మరిన్ని 1923 లో 1924 వెంబ్లె వస్తుప్రదర్శన లోని ఇండియన్ పెవిలియన్‌లో వారిని చూచాను. ఆ సెక్షన్‌ను చూస్తూవుండినవారు ఏదోపనిమీద వెళ్తూ, తాను తిరిగివచ్చేవరకు పెన్ గారిని చూస్తూఉండమన్నారట. ఆ సెక్షన్ మతసంబంధమైన దనుకొంటాను. అక్కడున్న నోబుల్ కాలేజి విద్యార్థుల గ్రూపు ఫోటోలు చూపించారు. నే నందులో లేను.

ఆక్స్‌ఫర్డ్‌లో చప్పనికూడు తిన్నతర్వాత, వర్ర కావలసి వచ్చేది. ముందు గవర్ స్ట్రీటుకు వెళ్లి, చపాతీ మాంసంకూర్మా వగైరాలతో చప్పదనం కొంతవరకు తగ్గించుకొనేవాణ్ణి. తరువాత నా కభిమానమైన చైనీస్ రెస్టారాంటుకు పోయి అక్కడ వేయించిన వరి అన్నం, రొయ్యలు వగైరా తినేవాణ్ణి. నే నుండిన హోటల్ లోగాని, వసతిగృహంలోగాని ఉదయభోజనం, మధ్యాహ్న భోజనం, రాత్రిభోజనం చేసేవాడిని. కాని, అవి చప్పకూడే. లండన్‌లో ఏ పెద్ద హోటల్‌లోను ఉండలేదు. అక్కడి భోజనం ఎంత బాగుంటుందో నాకు తెలియదు. ఎంత బాగున్నా, ఇంగ్లీషు భోజనం. వర్ర కావాలంటే ఇండియన్ భోజనం, తప్పితే చైనీస్ భోజనం.

నాటకాలు, సినిమాలు తప్పకుండా చూసేవాణ్ణి. నిజానికి నాటకాలకు హెచ్చు రేట్లుగల డ్రెస్ సర్కిల్ వంటి సీట్లకే వెళ్లేవాడిని. షేక్స్‌పియర్ నాటకాలకు అంతగా వెళ్లలేదు. సంగీతంతో కూడిన మ్యూజికల్ కామెడీస్‌కు, గిల్బర్ట్‌సుల్లివాన్ ప్రదర్శనాలకు ఎక్కువగా వెళ్లేవాడను.

ప్రపంచప్రఖ్యాతి గల బ్రిటిష్ మ్యూజియమ్‌కు మూడు నాల్గు సార్లు వెళ్లివుంటాను. అది అతి విస్తీర్ణమైన పురాతన వస్తు ప్రదర్శనశాల. బహుశా ప్రపంచంలోని మ్యూజియా లన్నిటి కంటె పెద్దది. ఇక్కడ చరిత్రకందని అతిప్రాచీన యుగాల్లో

జీవించిన మృగాల కళేబరాలు మనుష్యుల పుర్రెలు వగైరా వున్నవి. ఆదిమజాతుల పనిముట్లు ఆయుధాలవంటివానిని చూడ వచ్చును. ఈజిప్టు ఫారోల సమాధులనుండి వెలికితీసిన వింత వస్తువులు, ఆఫ్రికా ప్రాచీనజాతులకు చెందిన వస్తువులు కలవు. శతాబ్దాలక్రింద రచించిన పుస్తకాలలో చిత్రించిన కాలిగ్రాఫ్సు వగైరా ప్రదర్శింపబడి వుంటవి. అంతేగాక మధ్యయుగానికి, ఆధునిక యుగానికి సంబంధించినవి, వర్తమాన కాలానివి, పుస్తకాలు, చిత్రాలు, బొమ్మలు, కవచాలు, దుస్తులు వగైరా అనేకరకాలు ఈమహావస్తు ప్రదర్శనశాలలో కలవు. మన ఆంధ్ర అమరావతినుండి సంగ్రహించిన శిల్పఫలకాలు, మెట్లవద్ద, లోపల ఉంచబడివున్నవి. ఈ శిల్పఫలకాలు అపూర్వమైన పనితనం, అందం కలవి. ఈ గొప్ప విజ్ఞాన భాండాగారంలో కొన్ని సంవత్సరాలు చదివినా పూర్తికాదు. చూచినా తనివితీరదు. కొంతమంది బ్రిటిష్ వారు, శ్వేతవిదేశీయులు తరుచు ఆ విజ్ఞానాన్ని చూరగొనటానికి వెళ్ళుదురుగాని, మన భారతీయ విద్యార్థులు సాధ్యమైనంతవరకు దానిజోలికి పోరు.

బ్రిటిష్ మ్యూజియమ్ గాక నేషనల్ గాలరి, టేట్ గాలరివంటి చిత్రలేఖన భాండాగారాలున్నవి. వానిని విడివిడిగా చూచి ఆనందించాను. బ్రహ్మాండమైన సెయింట్ పాల్ చర్చి, వెస్ట్‌మినిస్టర్ యాబె, హౌస్ ఆఫ్ కామన్సు, డౌనింగు స్ట్రీటు చూచాను. చర్చిలలో కెల్ల పెద్దగోపురం (డోమ్) కలది సెంట్ పాల్ చర్చి. దీనిక్రింద కొన్నివేలమంది భక్తులు ప్రార్థనలు ఏకకాలమందు జరుపుకొనవచ్చును. వెస్ట్‌మినిస్టర్ యాబెలో రాజులవి, గొప్పవారివి మృతశరీరాలను ఖననంచేస్తారు. డౌనింగు స్ట్రీటు పది నంబరు బ్రిటిష్ ప్రధాని నివాసగృహం. ఆయింటిని వీధిగుండా వెళ్లి చూచాను. నావంటివానికి దాని ప్రవేశార్హత వుండదుకదా. ప్రసిద్ధిపొందిన టవర్ ఆఫ్ లండన్‌లోకి వెళ్లి రాజాభరణాలను చూచాను. ప్రేక్షకులను ఎక్కువసేపు సాగనీయరు. క్రిస్టల్ పాలెస్‌కు వెళ్లాను. థేమ్సునదిమీది పెద్ద బ్రిడ్జిని, నిలచియున్న పెద్దపడవలను గమనించాను. మొత్తంమీద లండన్ చాలాభాగం

చూచాను. ట్రాముల్లో, బస్సుల్లో, భూగర్భరైళ్లల్లో ప్రయాణం చేశాను. లండన్‌లో సుప్రసిద్ధ ఆక్స్‌ఫర్డ్ సర్కస్, పిక్కడిల్లి సర్కస్ వున్నవి. ఇవి రస్తాలను కలిపే కూడలి స్థలాలు. ఆక్స్‌ఫర్డ్ సర్కస్‌లో ట్రెఫాల్‌గర్ స్క్వేర్ ఉన్నది. స్పానిష్ ఆర్మెడాన్ని (నావికాదళం) యుద్ధంలో ఇంగ్లీషు యడ్మిరల్ నెల్‌సన్ నాయకత్వంక్రింద ట్రెఫాల్గర్ అనేచోట బ్రిటిష్‌వారు ఓడించారు. ఈవిజయసూచకంగా నిర్మించిన దీ ట్రెఫాల్గర్ స్క్వేర్. ఇది విశాలమైన చదురాంగణం. మధ్య పెద్దఎత్తు నెల్సన్ కాంశ్య విగ్రహం, నాలుగుమూలల నాల్గు పెద్ద కాంశ్యసింహాలు కలవు. చదురాంగణంలో అప్పుడప్పుడు రాజకీయ తీవ్రవాదులు గందర గోళంగా ఉపన్యసిస్తారు. దీనిని సోప్‌బాక్సు ఆరేటరి అంటారు. ఎత్తుకు, సబ్బులను రవాణా కుపయోగించే పెద్ద దేవదారుచెక్క పెట్టెలమీద నిలుచుండి ఉపన్యసించేవారట. అందు కీ పేరు. పిక్కడిల్లి సర్కస్ మధ్య 'ఇరోస్' అనే కాంశ్యవిగ్రహం ఎత్తైన వేదికమీ దున్నది. ఇరోస్ అనగా మన మన్మధునివంటివాడు. ఈప్రదేశంలో ముఖ్యమైన క్లబ్బులు, పెద్ద హోటల్సు, రాయల్ యకాడమి, బర్లింగ్‌టన్ హౌస్ మొదలైన ప్రాముఖ్యమైన బిల్డింగులున్నవి. ఇది హైడ్ పార్కుకు దగ్గర.

హైడ్ పార్క్ లండన్ నగరంలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన పార్కు. చాలావిస్తీర్ణం కలది. ఇందులో పెద్దసరస్సున్నది. స్నానం, పడవలషికారు చేస్తూవుంటారు. దీనిలో రాటెన్ రో అనుప్రాంతంలో గుర్రపువాహ్యాళికి, పెద్దలు, ప్రభువులు వస్తారు. అతిమనోహరమైన పూలమొక్కలు, సుందరమైన పచ్చికనేల లున్నవి. దీని తూర్పుభాగాన ప్రసిద్ధికెక్కిన రెండుగే ట్లున్నవి. ఒకటి మరీప్రసిద్ధి కెక్కింది. దీనిపేరు మార్బుల్ ఆర్చి. ఈగేటు ఆర్చి గొప్పది. అందంగా వుంటుంది. ఈ ఆర్చిప్రక్క ఖాళీస్థలంలో బహిరంగసభలు జరుగుతాయి. అన్నిరకాల ఆందోళనకారులు తమ వాచాలత్వాన్ని ప్రదర్శిస్తారు. అన్నిరోజుల్లోనూ ఈ సమావేశాలు, సభలుంటవిగాని, సెలవుదినమైన ఆదివారంలో జాస్తి.

లండన్‌లో అనేక క్లబ్బులున్నవి. ఏక్లబ్బులోను సభ్యునిగా చేరలేదు. ఒకటిరెండు క్లబ్బులలోకి తొంగిచూచానేకాని లోపలికివెళ్ళి పది నిముషాలైనా గడిపినట్లు గుర్తులేదు. చివరకు గవర్ స్ట్రీటులోని ఇండియన్ విద్యార్థుల యూనియన్‌లోకూడా సభ్యుణ్ణికాలేదు.

రాజకీయాల్లో నేను ఆసక్తిని కల్గించుకోలేదు. ఇతర పెద్దలతోనైనా పరిచయంలేదు. ఏ పంగులూరి వెంకట సుబ్బారావు గారితోనో తప్ప, ఏ ఇండియన్ పెద్దతోకూడా సంబంధం పెట్టుకోలేదు. నేనెరిగిందల్లా కొందరు ఇండియన్ విద్యార్థులే.

ఆక్స్‌ఫర్డ్ విద్యార్థులుకాని ఇండియన్ విద్యార్థులతో పరిచయంగాని, స్నేహంగాని తక్కువ. ఎరిగినవారుకూడా కొద్దిమందే. హైదరాబాద్‌నుండి వచ్చిన ఐదుగురు రెడ్డివిద్యార్థులలో శ్రీ యస్. యన్. (సత్యనారాయణ) రెడ్డి, శ్రీ బి. అన్నారెడ్డి, శ్రీ జనార్దనరెడ్డి పేర్లు గుర్తున్నాయి. ఈముగ్గురిలో నాకు మిక్కిలి సన్నిహితులుగా నుండినవారు శ్రీ అన్నారెడ్డి. శ్రీ సత్యనారాయణ రెడ్డి స్నేహభావంతో మెలగేవారు. నిజానికి వారు ఆంధ్ర విద్యార్థుల నాయకుడుగా వర్తించేవారు. వీరిలో ఎవరును ఆక్స్‌ఫర్డులో చదువ లేదు. వీరితో లండన్‌లోనే నాపరిచయం. శ్రీ సత్యనారాయణ రెడ్డిని, ఇతర రెడ్డియువకులను, ఇండియన్ కాన్ఫరెన్సులలో కలసి కొన్నాను. శ్రీ అన్నారెడ్డి నేను కలసి తీసుకొన్న ఫొటోలు (స్నాప్‌షాట్సు) వున్నవి. ఎక్కడ తీసుకొన్నానో గుర్తులేదు. 1921 అక్టోబరు - నవంబరులో ఆక్స్‌ఫర్డ్‌కు వచ్చిన కమ్మ విద్యార్థులను, వీరిలో కొందరిని ఎడింబరో శివారు పోర్టొ బెల్లోలో కలసికొన్నతర్వాత, కలసికొన్నట్లు లేదు. బర్మింగ్ హామ్‌లో అనుకొంటాను, చదివిన శ్రీ టి. శివశంకర్‌గారిని లండన్‌లో కలసికొన్నాను. వారు ఐ. సి. యస్. ఉద్యో గాన్నిపొంది, కొంతకాలం బెజవాడలో సబ్‌కలెక్టరుగా ఉద్యోగం చేశారు. 1931 ఏప్రిల్‌లో పెదసవగల్లులో జరిపిన నాపెద్దకుమార్తె వజ్రాంబ వివాహానికి హాజరైనారు. తదనంతరం భారత టెక్స్టైల్సు కమిషనర్‌వంటి పెద్దఉద్యోగాలను నిర్వహిం చారు. శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్‌గారిని గురించి ఇదివరకే

చెప్పాను. తెలుగు వారైన శ్రీ టి. రామకృష్ణ చెట్టి ( చెట్టిబలిజ ), శ్రీ పద్మనాభ నాయుడులు లండన్ లో చదువుచుండేవారు. వారితో పరిచయమైంది. శ్రీ రామకృష్ణ చెట్టి బ్యారిస్టరు పట్టాను పొంది, కడపజిల్లా ప్రొద్దుటూరులో అనుకొంటాను ప్రాక్టీసు చేశారు. శ్రీ పద్మనాభనాయుడు మద్రాసు వాస్తవ్యుడు. ఆయనతండ్రి రైల్వేలో పెద్దఉద్యోగి, నేను మద్రాసులో చాలాకాలం గడపినా, ఇంతవరకు వారిని కలసికోకపోవటం ఆశ్చర్యమే. ఇంకొక మద్రాసువాసి శ్రీ (వి. ఆర్. అనిగుర్తు ) రంగనాథన్ గారితో మంచిపరిచయమే కల్గింది. వారు శైవసిద్ధాంతాన్ని గురించి పరిశోధన చేస్తూ దాని థీసిస్ వల్ల డాక్టరేట్ డిగ్రీని పొందటానికి లండన్ లో ఉండేవారు. వారి నొకసారిమాత్రం మద్రాసులో కలసికొన్నాను. లండన్ లో చదివేవారు శ్రీ యస్. అజీముల్లా కర్నూల్ వాసి. ఆయనతండ్రి పోలీస్ డిపార్టుమెంటులో ఉద్యోగంచేసేవారు. ఒకసా రెందుకో ఆక్స్ఫర్డుకు లండన్ నుండి వచ్చి నాబసలో ఒకరాత్రో, మరునాడుదయంకూడానో గడిపారు. వారు ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరుగా బెజవాడ మొదలైనచోట్ల ఉద్యోగంచేసి మంచివారనే పేరు సంపాదించారు. స్నేహశీలి. వారిమామ బజులుల్లా, బావమరది కలీముల్లాగార్ల మాటలువిని, ఒలగబెట్టుందని, పాకిస్తాన్ కు వెళ్లారు. అక్కడ వారు ఆశించినంత వృద్ధిలోకి రాలేదు. జయరామనాయు డనేవారు ( తెలుగు బలిజ మద్రాసు ) లైబ్రరి సైన్సు చదవటానికి వచ్చారు. వారు వయస్సు ముదిరినవారు. ఆక్స్ఫర్డు చూడటానికి రెండుమూడుసార్లు వచ్చారు. వారిని కలసికోవటం, మాట్లాడటం తటస్థించింది. వారికుమారుడు, శ్రీ బోసు, మాకు అసిస్టెంటు కమిషనర్ గా వుండిన శ్రీ హెచ్. గోపాలస్వామినాయుడుగారి పెద్దకుమార్తెను వివాహమాడారు. స్టేట్ బ్యాంకులో ఇప్పటికిని ఉద్యోగంచేస్తున్నారు. పై వారుగాక, ఇంకా కొంతమందిని కలసుకొనేవుంటాను. వారిపేర్లు నోటుబుక్కులో ఉన్నవి. కాని వారితో ముఖపరిచయంకంటే ఎక్కువ సన్నిహిత్వం వుండినట్లు లేదు. లండన్, రవి అస్తమించని బ్రిటిష్ మహాసామ్రాజ్యానికి ముఖ్యపట్టణం, గుండెకాయవంటిది.

ఆరోజుల్లో ప్రపంచానికి కొన్ని విషయాల్లో కేంద్రం. అందువల్ల, అనేకమంది వస్తూపోతూంటారు. రైల్లో కలుసుకొని విడిపోయే ప్రయాణీకులవలె కలసికోవటం, విడిపోవటం.

అయితే, లండన్‌లో చదువుచున్న ఒక కమ్మవిద్యార్థిని గురించి చెప్పాలి. ఆయన గుంటూరుజిల్లాకు చెందిన చదలవాడ ఉమామహేశ్వరరావుగారి తమ్ముడు నాగయ్యగారు. ఉమామహేశ్వరరావుగారు చుట్టు ప్రక్కల పేరుగల భూస్వామి. తమ్ముడు నాగయ్యగారు చదువులో తగినపునాది లేనప్పటికి, పెద్ద చదువు చదువుకోవాలనే కాంక్షతో వచ్చారు. ఇంటినుండి డబ్బు వస్తూవుండేది. ఈయన సావకాశంగా చదువుచుండేవారు. ఒక ఇంట్లో ఉంటూ, వారితో మామూలుస్నేహంకంటె ఎక్కువ సన్నిహిత్వమే పెట్టుకొన్నారు. మధ్య, మధ్య జబ్బుపడుచుండేవారు. చదువు సాగలేదు. సంవత్సరాలు గడచిపోయాయి. ఎంత వున్న రైతయినా, సంవత్సరాలకొలది వేలకువేలు పంపించటం కష్టం. ఇంటివద్ద ఉమామహేశ్వరరావుగారు గుండెనిబ్బరంతో ఆర్థికఇబ్బందులను తట్టుకొంటూ, డబ్బు పంపిస్తునే వుండినారు. కాని మాటదక్కలేదు. శ్రీ నాగయ్య లండన్‌లో తనజీవితాన్ని చాలించారు. కుటుంబాన్ని ఆర్థికంగా ఇబ్బందిపెట్టటంలో శ్రీ నాగయ్యతో నాకు సామ్యంవున్నదికాని, నేను బ్రదికిబైటపడి 74 సంవత్సరాలు నిండినా, ఇది వ్రాయగల్గుచున్నాను.

గుంటూరుజిల్లాకు చెందిన కమ్మయువకులు శ్రీ పంగులూరి వెంకటసుబ్బారావు (పి. వి. సుబ్బారావు) గారు మొదటి ప్రపంచయుద్ధకాలంలో లండన్‌లో బ్యారిష్టరుచదువు చదువుచుండేవారు. వారు జబ్బుపడి హాస్పిటల్‌లో చేరారు. ఒక శ్వేతనర్సు ఆయన కుపచారంచేసింది. ఇద్దరు ప్రేమించుకొని పెండ్లిచేసుకొన్నారు. లండన్‌లోనే బ్యారిష్టర్ ప్రాక్టీసు సుబ్బారావుగారు మొదలుపెట్టారు. ప్రీవికౌన్సిల్ జ్యుడిషియల్ కమిటీ ముందు జూనియర్ కౌన్సిల్‌గా పనిచేస్తూ ఉండేవారు. వారిని వారింట ఒకటిరెండుసార్లు కలసికొన్నాను. వారికప్పుడు చక్కని కుమారుడుండేవాడు. అతని ఇండియన్‌పేరు "మోహన్". నిజంగా

మోహింపజేసేటట్లుగానే ఉండేవాడు. తెల్లనిశరీరం, నల్లనిజుట్టు, కళ్లు, తండ్రి వెంకటసుబ్బారావుగారు రంగుతక్కువైనా చక్కని ముఖకవళికలతో, మిక్కిలిపొందికైన అవయవములతో ఆకర్షణీయంగా ఉండేవారు. కుమారుడు మోహన్‌కు తల్లిరంగు, తండ్రి అందం వచ్చింది. అప్పటికి 6, 7 ఏండ్లు వయస్సువాడు. చొట్టబుగ్గలు, చంద్రకాంతి వంటి చిరునవ్వు. ఒక వైట్సువీక్‌లో రంగా, శ్రీ కృష్ణ, నేను శ్రీ సుబ్బారావుగారి కుటుంబాన్ని ఆక్స్‌ఫర్డ్‌కు ఆహ్వానించాము. వారి సతీమణి రాలేదుకాని, మోహన్‌తోను, ఒక స్నేహితునితోను సుబ్బారావుగారు వచ్చి ఒకరోజు గడిపి వెళ్లిపోయారు. మేమక్కడున్నప్పుడే రెండో కొడుకు పుట్టాడు. వాడు చామనచాయను పోలిన రంగులో వుండేవాడు. నే నిండియాకు తిరిగివచ్చిన తర్వాత, సైకిల్ మీద వెళ్లుచుండగా ఒకలారి వచ్చి ఢీకొన్నందున మోహన్ అక్కడికక్కడే చనిపోయాడని విని మిక్కిలిపరితపించాను. వానిముఖం, చిరునవ్వు, చొట్టబుగ్గలు ఇప్పటికిని నాకు గుర్తువస్తూనేఉంటవి. సుబ్బారావుగారికి ఇంకొక కొడుకు పుట్టాడు. రెండోవాడు ఇండియా హైకమిషన్ ఆఫీసులో పనిచేస్తున్నాడట. మూడవవాడు తెల్ల రంగుతో, బాగావుంటాడని వినికిడి. అతడు సుప్రసిద్ధుడైన క్రికెటీయరయి, మన దేశానికి బ్రిటిష్ టీమ్‌లో మాచెస్‌కు వచ్చి ఆడిపోయాడు. అతనిఫొటో పేపర్లలో చూచాను. అంతకు ముందే వెంకట సుబ్బారావుగారు చనిపోయారు.

వెంకట సుబ్బారావుగారు బ్యారిష్టర్ గా లండన్ లో రాణించలేదు. అక్కడ తెల్లవారి పోటీ ఎక్కువకదా. మనదేశం వచ్చారు. ఏ సంవత్సరమో గుర్తులేదు కాని నే నప్పుడు మద్రాసులో (ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో) ఉద్యోగం చేస్తుండినాను. వా రక్కడ ప్రాక్టీస్ పెట్టలేదు. రంగస్వామి అయ్యంగారివంటి మిత్రుల సాయంతో రైల్వే రేట్ల బోర్డు మెంబరుగా కొంతకాలం పనిచేశారు. జబ్బుపడి ఇంగ్లండుకు వెళ్లి, కొద్దిరోజులకే, కుటుంబసభ్యులమధ్య చనిపోయారు. అంతకు ముందు కొన్ని సంవత్సరాలక్రితం భార్యతో మన దేశానికి వచ్చి గుంటూరులో ప్రాక్టీసు పెట్టారటగాని, ఇక్కడి శీతోష్ణస్థితులు,

భోజనాదివిషయాలు, శ్రీమతి సుబ్బారావుకు సరిపడలేదు. పైగా ఆ రోజుల్లో శ్వేతభార్య, అందులో గుంటూరువంటి చిన్న పట్టణంలో, పలకరించేవారు, రాకపోకలు జరిపేవారు లేక సంకట పడవలసి వచ్చేది. అందుచేత భార్యాభర్తలు వెళ్ళిపోయారు. తిరిగి సుబ్బారావుగా రొకటి రెండు సార్లు స్వదేశానికి వచ్చినా, ఆమెమాత్రం రాలేదు.

చివరిదఫా సుబ్బారావుగారు మద్రాసుకు వచ్చినప్పుడు, నేను మర్యాదకు భోజనానికి పిల్చాను. మాట త్రోసివేయలేక వారు వచ్చారు. నే నిచ్చిన పదార్థాలలో మామూలు మసాళా, కారం వారికి పడలేదు. రెండుమూడురోజులు కడుపుమంటతో, విరోచనాలతో బాధపడ్డానని, వారిని తరువాత కలసికోగా, చెప్పారు.

లండన్ విషయం ముగించేముందు ఒకవిషయం చెప్పాలి. పారిస్ నగరంలోవలె ఇక్కడ లైంగికసంబంధమైన తంటాలు ఏమిన్నీ జరుగలేదు. దారిని వస్తూపోయే సుందరాంగులను చూచి గుటకలు మ్రింగివుండవచ్చునుకాని, పిచ్చివేషా లేమిన్నీ వేయలేదు. కాని ఒకటి జ్ఞాపకంవస్తున్నది. నేనున్నూ ఇంకొక ఇండియన్ విద్యార్థిన్నీ కలసి, చాటుగా పచ్చిశృంగారసమేతంగా జరిగే కాబరెవంటి నృత్యగీతామందిరానికి వెళ్లాము. ఆప్రదేశం, దీపకాంతిలేని సందు. అందులో రెండుమూడున్నవట. అన్నిటికిని తలుపులు బిగించియున్నవి. ఒకతలుపు తట్టగా కాపలాదారు లోపలినుండి తలుపు ఓరగా తీసి తల బైటకుపెట్టి ఎవరని అడిగాడు. మా నల్లముఖాలు చూచి లేదు అని తలుపులు వేసుకొనిపోయాడు. ఇంకొకచోట తట్టాంకాని, జవాబే రాలేదు. ఇక లాభంలేదని వచ్చివేశాం.

లండన్ లో వర్ణవివక్షత అంతగా కన్పడేదికాదు. ఒకసారి ఒక రెస్టారాంటులో ఉపాహారం తీసుకొనుచుండగా, నాబల్లకు మూడు, నాలుగు బల్లల తర్వాత భోజనంచేస్తుండిన మధ్యవయస్సు ఇంగ్లీషతను, నన్ను తేరిపార చూడటం మొదలుపెట్టాడు. ఈ బ్లాకీ ఇక్కడ కెందుకు వచ్చాడా అనేభావం అతనిముఖంలో కన్పడింది. తీక్షణమైన చూపులతో నన్ను కించపరచి, నేనక్కడ

నుండి లేచిపోవాలని ప్రయత్నిస్తున్నాడా అనే యోచన నాకు తట్టింది. వెంటనే, నేను సిగరెట్టు వెలిగించి, ధిక్కారంగా అతనివైపు పొగవిడిచిపెట్టటం మొదలుపెట్టాను. కొన్నిక్షణాలు నావంక తీవ్రంగా చూచి, లేచి వెళ్ళిపోయాడు. అతడు ఇండియాలో ఏదో పెద్దఉద్యోగమే చేస్తున్న వ్యక్తిలాగు కన్పించాడు.

ఒకసంవత్సరం లండన్‌నుండి వెళ్ళి, సుప్రసిద్ధ ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల సాంవత్సరిక పన్నె - మాల్ టేక్ పడవ పోటీపందెం చూచాను. దూరం రెండుమైళ్లు పైచిల్కు ఉంటుంది. విశ్వవిద్యాలయాలకు సంబంధించినవారేగాక, ఇతర ప్రజలు తండోపతండాలుగా దారిపొడుగూతా గుమిగూడి, కొందరు అరుస్తూ పరుగెత్తుచూ ఎవరి అభిమానజట్టును వారు ప్రోత్సహిస్తారు.

ఇక, సుప్రసిద్ధ లండన్ పోలీసులను గురించి ఇతరపోలీసుల సంగతేమోగాని ట్రాఫిక్ (రహదారి) పోలీసులు చాలాఎత్తైన వారు, మిక్కిలి సహనం, నెమ్మది కలవారు. వచ్చేపోయే బాటసారులకు సాయంచేయుటకు సిద్ధంగావుంటారు. ప్రత్యేకించి విదేశీయులయెడల అతిమర్యాదగా వారు చెప్పినవి శ్రద్ధగా విని, త్రోవవిషయం వగైరాలలో తగినసలహా లిస్తారు. నేనొకటి రెండుసార్లు ట్రాఫిక్ బాబి (పోలీసుజవాను) సహాయాన్ని పొందాను. రాజుగారి ప్రాసాదం, బకింగ్‌హామ్ ప్యాలెస్‌ను, రెండు మూడుసార్లు (బైటనుండి) చూచాను. అక్కడ కాపలావుండే గార్డ్సు మారకంకూడా చూచాను.

## పారిస్‌నగరం వగైరా

పారిస్‌నగరంలోను, ట్రూవిల్-డూవిల్‌లోను, నీస్‌లోను జరిగిన సంఘటనలు, కల్గిన అనుభవాలు పైనచెప్పియున్నాను. ఫ్రెంచిజాతికి మొత్తంమీద వర్ణవివక్షత లేదని చెప్పవచ్చును. నాకు ఎక్కడ అది అనుభవంలోకి రాలేదు. నేను తెల్లవాడను,

నీవు నల్లవాడవు అనే భేదభావం లేకుండా స్వేచ్ఛగా ఫ్రెంచివారు, భారతీయులు వ్యవహరించుకోనవచ్చును. ఫ్రెంచిభాష తెలిసి యుంటే కుటుంబాలతో రాకపోకలు వృద్ధిపరచుకోవచ్చును. అయితే, సంసారులతో ఇష్టమువచ్చినట్లు నడుచుకోవచ్చునని కాదు.

రాణా అనేవారు లఫేయట్ వీథిలో 'లిన్ స్టిట్యూట్ దేజిండూస్' అనుపేరుతో ఒక ఇండియన్ సంఘాన్ని నడిపేవారు. కాళిదాస్ నాగ్ అనేవారు సోర్‌బోన్ విశ్వవిద్యాలయం సమీపాన ఉండేవారు. మన దేశస్థులు స్వేచ్ఛావాతావరణంలో కార్యక్రమాలు కొనసాగించుకొనేవారని దీనినిబట్టి తెలుస్తుంది. పారిస్ నగరంనకు ఆయువుపట్టు, నగరంగుండా ప్రవహించే సేన్ నది, బూల్‌వార్డ్స్, బూల్‌వార్డ్స్‌నుగురించి ఇదివరకే చెప్పి యున్నాను. సేన్ నది పడవల వాహ్యాళికి, ఇరుప్రక్కల షికార్లకు మిక్కిలి అనువైన జలప్రవాహం. ఈ సేన్ నది పారిస్ నగరానికి నిర్మల వాయుప్రసారానికి సహకరిస్తుంది. వినోదానికి, విశ్రాంతికి తోడ్పడుతుంది. రాత్రిపూట దీనిమీద నడిచే పడవలలోని దీపకాంతులు జ్యోతిర్లతోరణాలుగా అందాన్నిస్తవి.

లూవ్రు చిత్రకళా భాండారం, ప్లాస్ దులకన్ కార్డ్ షాంజ్లె విజే, ఆర్క్‌దుత్రియాంఫ్, బ్వాదుబులోన్, ఈఫెల్ టవర్, నోత్రుడామ్ చర్చి, మొదలైనవానిని గురించి ఇదివరకే చెప్పి యున్నాను.

ట్రూవిల్, నీస్‌ల్లో సముద్రస్నానంకాక ఇంకొక ఫ్రెంచి సముద్రతీరాన స్నానంచేసినట్లు బాగాగుర్తు. కాని ఆ సముద్ర తీరమేదో, ఎప్పుడు వెళ్లానో, ఎంతకాల మున్నానో జ్ఞప్తికి రావటంలేదు.

## ఇతర విషయాలు

వేసవిలోనేగాక ఇతర సెలవుల్లోకూడ డబ్బిచ్చే అతిథిగా వెళ్ళటం, అక్కడివారితో స్నేహం నెరపటం పైనచెప్పియున్నాను.

1922 ఏప్రిల్, మే మాసాలలో సంబంధం పెట్టుకొన్న చార్ల్టన్ బరిలోని చార్లింగ్‌టన్ నివాసి మిసెస్ ఎడ్డింగ్‌టన్, ఆ సంవత్సరం వేసవిలోనే వెళ్లియుండిన కారన్‌వాల్‌లోని మిసెస్ బ్రైస్రే, ససెక్సులోని బర్‌వాష్ వాస్తవ్యుడు కెప్టెన్ నోయల్, హెరిఫర్డ్ షైర్ కౌంటీలోని లెలిన్‌స్టన్‌లో కలసికొన్న మిస్ డారతి టామ్లిన్, అంతటితోనే మరుగుపడిపోయారు. కెంట్ కౌంటీలోని బ్రేకేఫర్డ్‌లో వుండుచుండిన శ్రీ జాన్ ఎడ్విన్ పోలక్, ఆయన భార్య శ్రీమతి మేరి పోలక్, ఎసెక్సు కౌంటీలోని వాల్తమ్ యాబెలో 40, సన్ స్ట్రీటులో కాపురముండుచుండిన శ్రీమతి జూలియ హెలెన్ వుడ్‌బ్రిడ్జిగారు, వారి కుటుంబం నాకు చివరివరకూ కావలసిన వారుగా వుండినారు. స్నేహితురాలు మిస్ బర్త ఎలిజబెత్ నే నక్కడుండగనే టామ్ టేలర్ అనేవారిని వివాహం చేసుకొన్నది. నేను పరీక్షలలో వుండబట్టి వివాహానికి హాజరుకాలేదు. చివరకు వివాహబహూకరణ (వెడ్డింగ్ ప్రెజెంటు) కూడా పంపలేదు. పంపాలనుకొన్నానుగాని, సమకూడలేదు. వివాహానంతరం ఆమెను తిరిగి చూడలేదు. నేను ఇండియాకు వచ్చిన పిమ్మట శ్రీమతి హెలెన్ వుడ్‌బ్రిడ్జిగారికి ఉత్తరం వ్రాశాను. వారు దీర్ఘమైన జవాబిచ్చారు. దానికి తిరిగి వ్రాశానో లేదో గుర్తులేదు.

సింహావలోకనం అని వ్రాసింది, ముఖ్యరచనలో అక్కడక్కడ విడిపోయినవి, అదనంగా కలిపినవి చేర్చిన సంగ్రహం.

3

# ఇంటికి తిరుగు ప్రయాణం

నేను మార్సెల్సులో ఎక్కిన ఫ్రెంచి మెస్సాజరీ మారిథీమ్ ఓడలో ఒక టే క్లాసు వుండింది. అది టూరిస్టు క్లాసు. (మూడవ క్లాసువంటిది) మామూలుప్రకారం, మధ్యధరాసముద్రంనుండి సూయజ్ కెనాల్ గుండా ఎర్రసముద్రం, తర్వాత ఏడెన్ నుండి అరేబియాసముద్రం ప్రవేశించి, అక్కడినుండి తూర్పుగా ప్రయాణం చేసి బొంబాయి రేవుకు చేరటానికిబదులు, మాఓడ దక్షిణానికి ప్రయాణంసాగించి, కొలంబో చేరి అక్కడినుండి తూర్పుగా మద్రాసు రేవుకు చేరుకొన్నది. ప్రయాణం సుఖంగానే సాగింది. వర్షాకాలం కానందున, పైగా శీతాకాలం చివరదశ కాబట్టి, అరేబియాసముద్రం ప్రశాంతంగా వుండింది. భోజనం, విశ్రాంతి, పడక వగైరా సౌఖ్యప్రదముగా వుండినవి. ఫ్రెంచిభోజనం కాబట్టి, రుచికరంగా వుండింది. నేను 1920 లో మొదటి తరగతిలోను, 1923 లో రెండవ తరగతిలోను ప్రయాణంచేసిన దానికంటె, ఈటూరిస్టుక్లాసు ప్రయాణమే సౌఖ్యప్రద మనిపించింది. కొలంబోలో ఓడ ఇరవైనాలుగు గంటలో లేక అంతకు ఎక్కువ గానో ఆగింది. మేము రేవులో దిగి, కొలంబో పట్టణమంతా తిరిగి చూచాము. ఎక్కడెక్కడ ఏవేవి చూచానో గుర్తులేదు, చూచిన విషయాలు ఏనోటుబుక్కులోను వ్రాసుకోలేదు. కాని, కొలంబోరేవు బీచ్ శుభ్రంగా, విశాలంగా, రమణీయంగా వుందని గుర్తు. బీచ్ వద్ద మంచిభవంతులు వున్నవని, హోటల్సు,

రెస్టారెంట్లు వున్నవని జ్ఞాపకం. భోజనం తృప్తికరంగానే వుండినది. అంతమాత్రమే చెప్పగలను. ఏవో కొన్ని చిల్లరమల్లర వస్తువులు కొనియుండవచ్చును.

అక్కడనుండి ప్రయాణం సాగించి ఓడ మద్రాసు హార్బరుకు ఫిబ్రవరి 27 (1927) తారీఖున రాత్రి పదున్నర గంటలకు చేరుకొన్నది. శ్రీరంగా, శ్రీమతి భారతీదేవి రంగా 27-6-1926 న ఆక్స్‌ఫర్డ్ విడిచిపెట్టి ఇండియాకు వచ్చేసియుండినారు. వారికి వ్రాయుటవలన కాబోలు, నేనెప్పుడు మద్రాసు చేరుకొనేది వారికి, వారిద్వారా మద్రాసులోని కమ్మవిద్యార్థులకు తెలిసింది. ఆరోజులలో మాంబలం అని పిలువబడే త్యాగరాజనగరంలో, కొంతమంది కమ్మవిద్యార్థులు వసతిగృహాన్ని నడుపుకొంటుండినారు. వారిలో కొంతమంది, శ్రీమతి భారతీదేవిరంగా నన్ను ఓడలో కలసికొని పూలమాలలు వేసి సురక్షితంగా క్రిందకు దింపారు. కమ్మవిద్యార్థులు నన్ను వారి వసతికి తీసుకొనివెళ్లారు. వారు నన్ను రెండు, మూడు రోజులు వారి అతిథిగా అట్టిపెట్టుకొని, మర్యాదమన్ననలు చేశారు. వారిపేర్లిప్పుడు గుర్తులేదు. ఒక్క సి. నరసింహంగారు బాగా జ్ఞాపకమున్నారు. వారప్పుడు బి. ఎ. ఆనర్సు చదువుచుండినారు. లెక్కలలో మిక్కిలి నిపుణులని అక్కడివారు చెప్పారు. ఇంకొకటి చెప్పారు, వారు (శ్రీ నరసింహం) హాస్యప్రియులని, చమత్కారంగా మాట్లాడుతారని. తర్వాతకాలంలో వారితో నాకు సన్నిహిత్వమేర్పడింది కాని వారిహాస్యంగాని, చమత్కారంగాని నాకు కన్పడలేదు. గొప్పగా పనిలో మునిగిపోయి, మిక్కిలి దక్షతతో కార్యాచరణ చేసి, మద్రాసు కార్పొరేషన్ కమిషనర్‌గా, ఆంధ్రరాష్ట్ర స్థాపనకు ముందు కర్నూలులో కార్యాలయాలను కట్టించే స్పెషల్ ఆఫీసరుగా, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ శెక్రటరిగా, విద్యుత్ బోర్డు అధ్యక్షులుగా రాణించుట మెరుగుదును. ఇంకొక పేరు జ్ఞప్తికి లీలామాత్రంగా వచ్చుచున్నది. అది, కనక బాపయ్య గారిది. వీరు కొంతకాలం విజయవాడలో అసిస్టెంటు లేక అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశారు. తదనంతరం వారివద్ద సెలవుతీసుకొని, స్వగ్రామం బొమ్మలూరుకు చేరుకొన్నాను.

నేను ఇంటికి చేరుకొన్నప్పుడు నాసోదరుడు సత్యనారాయణ, నామారుటితల్లి శ్రీమతి మాణిక్యమ్మగారు, నామారుటితమ్ముడు శివరామకృష్ణయ్య, నామారుటిఅక్క, నామేనమామ భార్య శ్రీమతి త్రిపురనేని అన్నపూర్ణమ్మ ఉండినారు. నన్ను చూచీ చూడటంతోనే మాఅక్క అన్నపూర్ణమ్మ నన్ను కౌగిలించుకొని గొల్లున ఏడ్చింది. మాతండ్రి వెంకటరత్నంగారు 1924 సంవత్సరం మార్చి 12-వ తారీఖున పరమపదించారుకదా, ఆతరువాత నన్ను చూడటం అదే మొదటిసారికాబట్టి, ఆమె దుఃఖం ఆగలేదు. సహజంగా నామారుటితల్లి, సోదరుడు కంట నీళ్లుపెట్టుకొన్నారు. నేనే వారిని ఓదార్చవలసివచ్చింది.

ఇల్లు వాకిళ్ళు, దొడ్లు చావిళ్ళు అవే. 1923 జూలైలో నేను ఇండియాకు మధ్యకాలంలో వచ్చినప్పుడున్న బంధువులు, స్నేహితులు వుండినారు. కాని ఆర్థికపరిస్థితులు చాలా మారి పోయినవి. మాతండ్రిగారు లేనిలోటేగాక, పెద్ద రైతుకుటుంబంగా వుండిన సంసారం చాలావరకు భూములు పోగొట్టుకొని, సామాన్య స్థితికి దిగజారినందున కలుగు వాతావరణం, యింటిని ఆవరించి యుండింది. నెమ్మదినెమ్మదిగా, కొంతమంది బంధువులు, స్నేహితులు వచ్చి చూచిపోయినా, పూర్వం దిలాసా, సంతోషాలు లేవు. నిజానికి మాతండ్రిగారు జీవించియుండి, మా కుటుంబాస్తులు చెదరకుండా వుండినట్లయితే, నే నింగ్లండులో విద్యాభ్యాసం పూర్తిచేసుకొని, ప్రఖ్యాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ డిగ్రీతోనే గాక, పూర్తిగా బ్యారిస్టరునై, ఇంటికి రావటం మిక్కిలి జయప్రదంగా వుండేది.

ఇంటికి చేరుకొన్న పిమ్మట ఐదు, ఆరు రోజులకు బయలు దేరి, భార్యాబిడ్డలను చూడటానికి పెడసనగల్లు వెళ్లాను. నేను వస్తున్న సంగతి పెడసనగంటివారికి తెలుసును. చేరుకొన్న సంగతి తెలుసును. అయినా 1923 లో వలెనే, నాభార్య బిగబట్టుకొని పెడసనగల్లులోనే వుండిపోయింది. కొండ మహమ్మద్ వద్దకు వెళ్లక పోతే, మహమ్మదే కొండవద్దకు వెళ్లాడని సామెత. ఆవిధంగానే నేను పెడసనగల్లుకు వెళ్లాను. నన్ను తీసుకురమ్మని పెడసనగల్లు

నుండి పంపిన నాపక్షకుడు గుడివాడలోనే దిగబడిపోవటంచేత, ఇప్పుడుకూడా నేను ఎవరినో తీసికొని వెళ్లవలసివచ్చింది. నా కుమార్తె వజ్రాంబకు అప్పటికి సుమారు పదిన్నర సంవత్సరాల వయస్సు, నాకుమారుడు పూర్ణచంద్రరావుకు ఏడున్నర సంవత్సరాలు దాటిన వయస్సు. భార్యాబిడ్డలు సుఖంగానే వుండినారు. ఆమె తల్లి, అక్క, అక్కసంతానం కులాసా. ఆస్తిపాస్తులు పెరిగినవే గాని, తరగలేదు. అయినా, అక్కడి వాతావరణం సంతోష ప్రదంగాగాని, నాకు ఉత్సాహం కలిగించేటట్లుగాగాని వుండలేదు. దానికి కారణం ఇంటిలోనివారి అప్రసన్నత, నాభార్య ముభావం. నేను, నాభార్యకు రావలసిన అర్ధభాగం ఆస్తివిషయంలో తగాదాపెడ్తానసేభయం ఇంటిలోని వారిది. పెద్దచదువు చదివి, బ్యారిస్టర్ హోదాతో వచ్చాను. మాట కొంతవరకైనా చెలాయించుకొనే అంతస్థు కల్గింది. కాబట్టి నన్నదుర్కొనటానికి వారికి నాభార్య ఆయుధం. ఆమెను తమ కనుకూలంగా, నాకు వ్యతిరేకంగా చేస్తేనేగాని, వారి ఆస్తిదురాక్రమణ చెల్లదు. అందువల్ల ఆమె కేవేవో నూరిపోసి వుంటారు. మొదటినుండి నాభార్య వారిచేతుల్లో కుమ్మరమట్టివంటిది. సహజంగా తెలివి తక్కువది. అంతటితో ఆగితే, కొంతవరకు సంబాళించుకొనే అవకాశముండేది. కాని వట్టి మూర్ఖురాలు. ఏకారణంవల్ల నైతేనేమి ఆమె హృదయం కరగని సుద్దలాగే వుండిపోయింది. మనస్సు విప్పి నాతో ఎప్పుడూ ఏదీ చెప్పేదికాదు. ఆమెకు నాకు మధ్య ఏదో తెరవుండినట్లే జరుగుతూవచ్చింది. ఇప్పుడా ముభావం, స్నేహం లేకపోవటం ముదిరిపోయింది. మీఆయన కుటుంబాస్తి తరిగిపోయింది. ఇంగ్లండులో డబ్బుచాలా ఖర్చుపెట్టాడు, అందువల్ల ఇక్కడనుండి డబ్బు తీసుకొనివెళ్లి తమ్ముళ్లకిద్దామని చూస్తాడు, కాబట్టి మనము గట్టిగా వుండకపోతే, నీఆస్తికూడా పాడుచేస్తాడు అని ఏవేవో చెప్పియుంటారు. ఫలితం నేను ఇంటికి వెళ్దాం రమ్మంటే రానన్నది, నీవు ఎక్కడైనా రెండు వేలు తెచ్చుకొని ఉద్యోగం సంపాదించుకొంటే, అప్పుడు వస్తాను, అంతవరకు రాను అని నిష్కర్షగా చెప్పేసింది. నేనెంతో బ్రతిమాలాను. నచ్చచెప్పటానికి ప్రయత్నించాను. మన లింగం కుటుంబం గౌరవ

మర్యాదలు కలది, మాతండ్రి చనిపోయిన తరువాత ఆయింటికి పెద్దను నేను. కుటుంబం అవిభక్తంగానే వున్నదికదా, అందువల్ల కుటుంబబాధ్యత నామీద పడింది. డబ్బు యివ్వమని నిన్ను అడగటంలేదు. నీవు ఇంటికి పెద్దకొడలవు. కాబట్టి నీవు నాతో వచ్చి మనకుటుంబ కష్టసుఖాలను ఆలోచించుకోవటం మంచిది. నీవు వస్తే కుటుంబానికి నిండు వస్తుంది, మనగౌరవం నిలుస్తుంది. చూచిన పదిమంది తండ్రిపోయినా, పెద్దకొడుకు వచ్చి కుటుంబ గౌరవాన్ని నిలబెట్టాడని సంతోషిస్తారు అని ఎన్నెన్నో చెప్పాను. అయినా, ఒకటే మాట. నీవు వెళ్లు, ఎక్కడైనా రెండు వేలు తెచ్చుకో, ఉద్యోగం సంపాదించుకో, అప్పుడు నేను వస్తాను. ఇక విసిగి వేసారి, నేను విచారభారహృదయంతో, బొమ్మలూరుకు తిరిగివెళ్లాను.

బొమ్మలూరుకు తిరిగివచ్చిన తర్వాత, మద్రాసు హైకోర్టులో అడ్వకేటుగా చేరితేనేగాని నా బ్యారిస్టరుపట్టా ఉపయోగం వుండదని, తమ్ముని నుంచి కొంతడబ్బు తీసికొని మద్రాసు హైకోర్టుకు కట్టవలసిన ఫీజు కట్టాను. ఆరోజుల్లో బార్ అసోసియేషన్ అని, వకీల్సు అసోసియేషన్ అని రెండు వేరు వేరు సంఘాలుండేవి. బ్యారిస్టరుపట్టాను పొందినవారు బార్ అసోసియేషన్ లో సభ్యులు. బ్యారిస్టర్లేగాక, చాలా కొద్దిమంది న్యాయవాదులుకూడా అందులో మెంబర్లు. బార్ అసోసియేషన్ మెంబర్లను అడ్వకేట్సు అనేవారు. 20 సంవత్సరాలో, పైచిల్కో న్యాయవాదవృత్తిలో నుండి దరఖాస్తుమీద అడ్వకేట్సు హోదాను పొందినవారుమాత్రమే బార్ అసోసియేషన్ లోని ఇతర సభ్యులు. వకీల్సు అసోసియేషన్ లో అనేక సంవత్సరాలుగా న్యాయవాదవృత్తిని కొనసాగిస్తూ, అత్యున్నతస్థానాన్ని గెలుచుకొన్న శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్, శ్రీ యస్. శ్రీనివాస అయ్యంగార్ వంటి మనీషులు, వకీల్సు అసోసియేషన్ లోనే సభ్యులుగా వుండిపోయారు. వారు అడ్వకేట్సు హోదాను పొందివుందురు. కాని వారు ఎన్నడూ బార్ అసోసియేషన్ కు వచ్చేవారుకాదు; న్యాయవాదివృత్తిలో ప్రథమశ్రేణిలోని

ప్రథములుకాబట్టి వారు బార్ అసోసియేషన్ మెంబర్లైతే, వారికి ఒరిగేదేమీ వుండేదికాదు. కాని, బార్ అసోసియేషన్ అని, వకీల్సు అసోసియేషన్ అని వ్యత్యాసముండేది. బార్ అసోసియేషన్ అంతస్థు (స్టేటస్) పైది.

బార్ అసోసియేషన్‌లో సిడ్నీ స్మిత్ గారు, పి. వెంచయ్యగారు, వగైరా సీనియర్లు వుండేవారు. శ్రీ సేలం గోవిందరాజులు నాయుడువంటి జూనియర్సు వుండేవారు. గోవిందరాజులుగారిని నే నింగ్లండులో ఎరిగియుంటిని. వారు కేంబ్రిడ్జి యూనివర్శిటీలో ట్రైపాస్ అనేపేరుగల ఆనర్సు డిగ్రీని పొంది బ్యారిస్టర్ పట్టాను పొందారు. వారు నాకంటె రెండు, మూడు ఏండ్లు సీనియరు. వి. రామకృష్ణ, టి. భాస్కరరావుగార్లతో స్నేహంగా వుండేవారు. వారిని సమీపించి నేను అడ్వొకేటుగా గుర్తింపబడటానికి మీరు ఆసరావుండు డని కోరాను. హైకోర్టులో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించటానికి హైకోర్టువారి అనుమతి పొందాలి. దానికి, అదివరకునుండి ప్రాక్టీసుచేస్తున్న న్యాయవాది, క్రొత్తవానిని పరిచయ (స్పాన్సర్) పరచాలి. పరిచయంచేసేవారు, క్రొత్త వానిని జడ్జిగారిముందు హాజరుపరచి, పేరు వగైరా చెప్పి అతడు న్యాయవాదిగా ప్రాక్టీసుచేయటానికి అనుమతి కోరాలి. జడ్జిగారు అంగీకరిస్తారు.

గోవిందరాజులుగారు ఏకారణంవల్లనో, నే నెందుకు లే అన్నారు. బహుశా జూనియర్ బ్యారిస్టరు అగుటవల్లకాబోలు. అందుమీదట నేను సిడ్నీ స్మిత్ గారిని సమీపించి వారిని అర్థించాను. వారు ఒప్పుకొన్నారు. 30-3-27-వ తారీఖున వారు నన్ను జస్టిస్ దేవదాస్‌గారిముందు హాజరుపరిచారు. జస్టిస్ దేవదాస్‌గారు మిక్కిలి మంచివారు. మర్యాదస్తులు. వారుకూడా బ్యారిస్టరే. అందువల్ల క్రొత్తగా వచ్చిన బ్యారిస్టర్లయందు సహజంగా వారికి సానుభూతి ఉండియుంటుంది. వారు నన్ను అంగీకరించి సలహా చెప్పినట్లు నాలుగు ముక్కలు చెప్పారు. నేను వారికి వందన మర్పించాను. అంతటితో, నేను బ్యారిస్టర్ అడ్వొకేటుగా, హైకోర్టు రికార్డుల్లో నమోదుచేయబడ్డాను.

ఇంటికి తిరిగివచ్చాను. మాకుటుంబ లెక్కలు చూచుకోవటం ఆరంభించాం. మా మారుటితమ్ముడు శివరామకృష్ణయ్య తరఫున, మా మారుటితల్లి అక్క పెనిమిటి మోటూరి చిన పిచ్చయ్యగారు, వారి సోదరిభర్త మా ప్రాతబంధువు గుత్తా దత్తుడు రత్తయ్య అనే వెంకటరత్నంగారు వచ్చారు. నాకు, నా అనుజుడు సత్యనారాయణకు వేరే తోడు లేదు. లెక్కలు పరిష్కరించుకొన్నాం. కుటుంబాస్తిలో నాభాగం పోను, ఇరవై ఐదువేల రూపాయలు నాతమ్ముళ్ళకు యివ్వవలసివచ్చినట్లు తేలింది. అందువలన నా ఆస్తిని వదలుకొని సత్యనారాయణపేర పదమూడు వేలపై చిల్లర, శివరామకృష్ణయ్యపేర సుమారు పన్నెండు వేలకు వాయిదాలమీద తీర్చుకొనేటట్లు 21-6-27 తారీఖున బాండులు వ్రాశాను. కుటుంబచరాస్తిలో మా తండ్రిగారు వుపయోగిస్తుండిన కంచు మంచినీళ్ళపాత్ర, ఇంకొక మంచినీళ్లు త్రాగే కంచుగ్లాసు మాత్రం తీసుకొన్నాను. తాత్కాలికంగా జీవనం గడవటానికి మూడువందల రూపాయలు పుచ్చుకొని, ఇంటినుండి బయలుదేరి గుడివాడకు వెళ్లాను. గుడివాడలో పోలుకొండకు చెందిన పర్వతనేని గంగయ్యగారు, మేడకట్టుకొని తన ఉపపత్ని నీలమ్మతో సంసారం గడుపుకొంటున్నారు. నూజెళ్ల పర్వతనేనివారికి మాకు దగ్గరబంధుత్వం. పోలుకొండవారు, నూజెళ్లవారు జ్ఞాతులక్రింద లెక్క. మాకుటుంబాన్నంతా గంగయ్యగారు ఎరుగుదురు. అందువల్ల వారభిమానించి, నేను వారిమేడమీద వుండటాని కంగీకరించారు. ఇంచుమించుగా వెళ్లినవెంటనే సుబ్బారావు అనే యువకుణ్ణి వంటవాణ్ణిగా, గంగయ్యగారి సహాయముతో ఏర్పరచుకొన్నాను. బియ్యం, పప్పు, ఉప్పు మొదలైనవి కొన్నాం, వంటసామాగ్రి వగైరా గంగయ్యగారే యిచ్చారు. గంగయ్యగారు నాకు మామవరస అవుతారు. పర్వతనేనివారు డబ్బు సంపాదనలో ఘటికులు. వారికి వ్యాపారదృష్టి ఎక్కువ. గంగయ్యగారు వీనిలో తీసిపోరుకాని, ఉదారహృదయులు. సానుభూతి, స్నేహభావం, ఆప్యాయత, చనువు కలవారు. బాగా చదువుకొన్నానని వారికి అభిమానం హెచ్చు. అందువల్ల, నాకు అన్ని విధాల తోడునీడగా వుండి నా కెట్టియిబ్బంది కలుగకుండా,

చూచుకొన్నారు. వారి ఉపపత్ని నీలమ్మ చేసుకొన్న భార్యగా, సంసారిగా, ఇంకా అంతకంటె హెచ్చుగా ఉండేది. పొదుపుగా, గుట్టుగా సంసారాన్ని దిద్దుకొనే మనస్తత్వం, పద్ధతి గల ఉత్తమ స్త్రీ. ఏకకులస్థులు, పెండ్లిచేసుకొన్నవారు, చాలచోట్ల ఎడముఖం, పెడముఖంగా వుంటారు. కాని గంగయ్య, నీలమ్మగార్లు మిక్కిలి అన్యోన్యంగా ఒకరి శ్రేయస్సును మరొకరు కోరుచూ, సంసారాన్ని చక్కదిద్దుకొనేవారు. నీలమ్మగారు నా అక్కడి ఉనికికి, సుముఖంగా, సుహృద్భావంతో సహకరించింది.

వంటవాడు సుబ్బారావు వంట రుచిగా, తృప్తికరంగా వుండేది. ఇంగ్లండులోవలెగాక రెండుపూటలే భోజనం. నేను, ఇంగ్లండునుండి తిరిగివచ్చిన వెంటనే కుటుంబపరిస్థితులనుబట్టి, మా మారుటితల్లికి శ్రమఇవ్వటాని కిష్టంలేక టీ, కాఫీలు ఉదయం, సాయంత్రం మానివేశాను. ఇంటివద్ద రెండుపూటలే భోజనం చేసేవాడిని. ఆపద్ధతే గుడివాడలోనూ సాగించాను. పని పాటలు లేనందున, భోజనంమాత్రమే గాకుండా ఇంకేదైనా అలవాటుచేసికొందా మనిపించింది. నాకు సిగరెట్లుగాని, చుట్టలు గాని కాల్చటం అయిష్టం. త్రాగుడు అలవాటుకాలేదు. అందు వలన తమలపాకులైనా వేసికొందామని బుద్ధిపుట్టింది. దగ్గరలో వున్న కిల్లీకొట్టువానితో కానీకిబదులు అర్ధణాయిస్తాను మంచి మిఠాయికిల్లీ కట్టుమని చెప్పాను. నాలుగు, ఐదు రోజులకు కిల్లీకొనటంకంటె, మంచి కవటాకులు తెప్పించి, వక్కపొడి ఇంట్లో చేయించి వేసుకొంటే బాగుంటుందని అనిపించింది. మంచి పీటి వక్కలు తెప్పించి, వానిని నేతిలో వేయింపించి, సుగంధ ద్రవ్యాలు చేర్పించి కమ్మని వక్కపొడి చేయించాను. కాని పది, పదిహేను రోజులు రెండుపూటలు తమలపాకులు వేసుకొనేటప్పటికి నానోరంతా కళాయిపూసినట్లయింది. భోజనం రుచి తెలియటం తగ్గిపోయింది. కొండనాలుకకు పెడితే, అసలునాలుక ఊడిపోయిన ట్లనిపించింది. ఛీ, పనికిరాదని మానివేశాను. అప్పటికి ఇప్పటికి ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఏవిందుసమయంలోనో యిస్తే వేసి కోవటంతప్ప, తమలపాకు వాడటంలేదు. ఈమధ్య కొంతకాలం నుండి అసలే ముట్టుకోవటంలేదు.

గంగయ్యమామగారికి నీలమ్మవల్ల మగపిల్లలుగాక, ఇద్దరు ఆడపిల్లలు. పెద్దదానిపేరు కమల, రెండవదానిపేరు రంగనాయకి. రంగానాయకి ఇంకను చిన్నపిల్లయేగాని కమల వయస్సువచ్చిన పిల్ల. రంగనాయకి మంచిఎరుపు. బక్కపల్చగా నాజూకుగా వుండేది. కమల చామనచాయ పిల్ల. అయినా బొద్దుగా అవయవ సౌష్ఠవంతో బాగానే వుండేది. నాభార్య నన్ను తృణీకరించిన తర్వాత, నామనస్సు విరిగి, తిరిగి వివాహం చేసుకోవాలనేబుద్ధి పుట్టింది. కమలను చూడటంతోనే ఆబుద్ధి ఎక్కువైంది. కాబట్టి గంగయ్యమామతో, ఈ పిల్లను నా కివ్వండి నేను పెళ్లిచేసుకొంటా నన్నాను. గంగయ్యమామగారు కమ్మకులస్తుడైనా, నీలమ్మ కాదు. పైగా నీలమ్మ ధర్మపత్నికాదు, ఉపపత్ని మాత్రమే. మా లింగం కుటుంబం గుడివాడతాలుకాలో పేరుపొందినది. నా కప్పటి కిద్దఱు బిడ్డ లున్నారని, నాభార్య కాస్తివుందని వారికి తెలుసు. మరిన్ని, నాభార్యను వారు ఎరుగుదురు. అందువల్ల వారు సందేహించారు. కోమరవోలు కాపురస్తులు మిక్కిలి తెలివితేటలుగలవారు, మంచి మాటనిపుణుడు శ్రీ సింగరాజు రామయ్యగారు మేడక్రింద ఒక భాగంలో వైద్యంచేయించుకొంటూ వుండేవారు. వారిని గంగయ్యగారు సంప్రదించారు. వద్దని వారు సలహాయిచ్చారు. అంతటితో ఆప్రయత్నం ఆగిపోయింది. గంగయ్యగారు తనకూతు ళ్లిద్దరికి కమ్మేతరుల కిచ్చి వివాహం చేశారు. అల్లుళ్లిద్దరు ఉద్యోగంలో వున్నారు. వారిబిడ్డలుకూడా ఉద్యోగంలో వున్నట్లు విన్నాను. కొన్నిసంవత్సరాలకు ఆ పిల్ల లిద్దరిని గంగయ్యమామగారింట్లో ఒకసారో రెండుసార్లో చూచి, పలకరించాను.

మా నాల్గవ పెదతండ్రి లింగం వెంకటశివుడుగారి కుమార్డు సీతారామాంజనేయులు గుడివాడలో వుంటూవుండినాడు. మా లింగం కుటుంబానికి భూములున్న గ్రామాల్లో, మా స్వగ్రామం బొమ్ములూరుకు రెండుమైళ్ళకు తక్కువదూరంలో పామర్రు-గుడివాడ రోడ్డు సమీపంలో వున్న రాయనపూడి ఒకటి. తన వాటాకు అక్కడి భూములను తీసికొని, రాయనపూడిలో పెదతండ్రి వెంకటశివుడుగారు స్థిరనివాస మేర్పరచుకొని వుండినారు. వారు

నా చిన్నతనంలోనే చనిపోయారు. వారి ఏకైకపుత్రుడు సీతారామాంజనేయులు, నాకంటె పది మాసములు పెద్ద. అతడు తన మేనమామ అంగలూరువాసి, దుగ్గిరాల సీతారామయ్యగారి కుమార్తెను వివాహమాడాడు. ఆమె చనిపోగా, ఆమె చెల్లెలను వివాహం చేసుకొన్నాడు. కాని గుడివాడలో ఉపపత్నితో కాపురం పెట్టాడు. అదివరకొక రిద్దరయ్యారట. నేను గుడివాడలో మకాం పెట్టినప్పుడు ఇంకొక ఆమె వుండేది. అప్పుడప్పుడు సీతారామాంజనేయులు వచ్చి నన్ను కలసికొంటూ వుండేవాడు. మరిన్నీ నా మూడవ పెద తండ్రి ఆదినారాయణగారి నాల్గవ కూతురు భర్త వెంట్రప్రగడ నివాసి, సూరపనేని వెంకట సుబ్బయ్యగారు ఏకారణమువల్లనో, గుడివాడలో వుంటూవుండే వారు. వారుకూడా అప్పుడప్పుడు వచ్చి వెళ్లేవారు. గుడివాడకు మావూరు శివారువంటిది. దూరం రెండుమైళ్ళు లోపే. మావాళ్లందరు, గుడివాడకు ఇంచుమించుగా రోజూ వస్తూ పోతూ వుంటారు. ఇంతకుతప్ప నాకు గుడివాడలో ఇతర సహవాస ముండేదికాదు.

అప్పుడప్పుడు డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టు ఆవరణలో వుండే క్లబ్బుకు వెళ్లేవాడిని. ఈ క్లబ్బులో సభ్యులు ఇంచుమించుగా అందరు వకీళ్లే. అప్పుడు రాజమండ్రి వాస్తవ్యుడు తరువాత సబ్ జడ్జిగా అధికారం చెలాయించినవాడు, నరసింహంపంతులుగారు డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా వుండేవారు. ఆయన మంచి తెలివితేటలు గలవాడు, మంచి మాటకారి. కాని స్థిరమైనబుద్ధి కలవాడు కాదు. ఆయనకు కొన్ని అపోహలు, దురభిప్రాయా లుండేవి. ఒకనాడు మాటలసందర్భంలో, బ్యారిస్టర్లను నిరసించటం మొదలుపెట్టాడు. లండన్‌లో విందులు తిని, చేసి, బ్యారిస్టరు పట్టా తెచ్చుకొంటారు. వీళ్ళ కేమీరాదు అని మొదలుపెట్టాడు. నేను విందులసంగతి విడమర్చి చెప్పి, ప్రీవీ కౌన్సిల్ జ్యుడిషియల్ కమిటీలో ఉండేవారు బ్యారిస్టర్లేకదా. వారి జడ్జిమెంట్లు మనకు ఆదర్శాలుగదా. లార్డ్ బర్కిన్ హెడ్, సర్ జాన్ సైమన్ మొదలైన ప్రముఖన్యాయవాదులు ఈ దేశం వచ్చి ప్లీడరు

చదువుకొని వెళ్లినారా అని సమాధానం చెప్పవలసివచ్చింది. ఈ నరసింహంపంతులు చిత్తప్రవృత్తి కొక ఉదాహరణ చెప్తాను. ఏదో కేసులో, మా పినతాత కుమారుడు నాగభూషణంగారు ప్రతివాది. వాదివకీలు నాగభూషణంగారిని కించపరచటానికి, ఆయనకు ఇన్నిలక్ష లప్పు లున్నాయి, అన్నిలక్ష లప్పు లున్నాయి అని చెప్పసాగాడట. వెంటనే శ్రీ నరసింహంపంతులు కల్పించుకొని, ఏమయ్యా, నాగభూషణంగారు ఘరానామనుష్యులు కాకపోతే, అన్ని లక్షలు అప్పు ఎవరిస్తారయ్యా, అని వాదివకీలు మాటను త్రుంచివేశాడట.

నేను గుడివాడలో గంగయ్యగారింట్లో నాలుగు, ఐదు మాసములో లేక 1925 జనవరివరకో వుండివుంటాను. పిమ్మట మద్రాసుకు వెళ్లియుందును. 1928 మా ర్చారంభంలో రాయపేటలోని 20, ముత్తు మొదలిస్ట్రీటులో వున్నట్లు కన్పడుచున్నది. ఆ యింట్లో శ్రీ రంగా, వారి సతీమణి శ్రీమతి భారతీదేవిగారు నివసించుచుండినారు. నావద్ద వుండిన రికార్డు ప్రకారం 15 ఆగష్టు నెలవరకక్కడుండినాను. ఆ సంవత్సరం ఆగష్టు 15 తర్వాత రాయపేట 35, పైక్రాఫ్ట్సు ఫస్ట్‌స్ట్రీటులో వున్నట్లు, 20-8-1929-వ తారీఖున గోపాలకృష్ణ అనే కుర్రవానిని నౌకరుగా పెట్టుకొన్నట్లు తెలియుచున్నది.

నేను 1928 జూన్‌లో వ్రాసిన తెలుగు, ఇంగ్లీషు వ్యాసాలు రంగాగా రింట్లోనే వ్రాశాను. వారింటివద్ద కొన్నిరోజులు మాత్రమే కాదు, మూడు, నాలుగు నెలలైనా వుండివుంటాను. నా కింకొకటి గుర్తు. నేను వారింటిలో నుండగనే, ఇద్దరు ఛాటులు వచ్చి కేసులు తెస్తాం అని నన్ను బెల్లించి రూ. 5 లు పట్టుకుపోయారు. అప్పటికి నేను హైకోర్టుకు వెళ్లటం ఆరంభించి యుండవచ్చును. బొమ్ములూరునుండి 1927 జూన్ ఆఖరుకు గుడివాడలో గంగయ్యగారింట్లో చేరి, అక్కడ నాలుగు, ఐదు మాసాలైనావున్నది ఖాయం. కాబట్టి 1928 లో గాని నేను హైకోర్టుకు వెళ్లటం ప్రారంభించియుండను. 1926 క్రొత్త బార్ కౌన్సిల్ యాక్టు ప్రకారం నేనుకూడా 18-7-1928-వ తారీఖున హైకోర్టు

అడ్వొకేట్‌గా తిరిగి నమోదయ్యాను. కాబట్టి ఆసందర్భంలోనే ఖాటులు నన్ను సమీపించి యుండవచ్చును. ఖాటులను దగ్గరకు రానివ్వటం తప్పని, నాకు అప్పటికి తోచలేదు. కడుపుఆత్రంతో స్నేహితుల పంచన చేరిన నాకు ఎవ్వరో వచ్చి మీకు కేసులు తెచ్చిపెడ్తామంటే ఉబలాటపడ్డాను గాని, నీతి, సదాచారం నా బుర్రను తాకలేదు.

శ్రీరంగా, భారతీదేవిగారు నన్నెంతో ఆదరణతో రక్త బంధువుడైనట్లు, కుటుంబంలోనివాడనైనట్లు, నన్ను పోషించటం వారిధర్మమన్నట్లు, మిక్కిలి ఆప్యాయతతో మూడు, నాలుగు మాసాలు నన్ను అతిథిగా అట్టిపెట్టుకొన్నారు. కష్టకాలంలో ఆదుకొన్నవారు దేవుళ్లవంటివారు. వారికి నేను ఎల్లప్పుడూ కృతజ్ఞుడనై వుంటూవున్నాను.

సైమన్ కమీషన్ ఇండియాకు ఏమాత్రం స్వపరిపాలన ఇవ్వవచ్చునో తెలుసుకొనటానికి ఇండియాకు వచ్చి మద్రాసుకు వచ్చారు. వారి గౌరవార్థం సర్ కె. వి. రెడ్డి, డాక్టర్ నటేశన్ ఆధిపత్యంక్రింద వుండుచుండిన, నాన్‌బ్రాహ్మిన్ కానిస్టిట్యూషనలిస్టు పార్టీ 2-3-1928-వ తారీఖున మద్రాసు విక్టోరియా పబ్లిక్ హాలులో ఇచ్చిన టీపార్టీకి హాజరయ్యాను. పిఠాపురం మహారాజాగారు అధ్యక్షతవహించారు. ఉపన్యాసాలు జోరుగా సాగినవి. తేనీటివిందు అయిపోయినతర్వాత, ఒకరు పార్టీకి హాజరైనవారిని సర్. జాన్ సైమన్‌గారికి పరిచయపర్చారు. నాదగ్గరకు వచ్చినప్పుడు సైమన్‌గారిచేతిని గట్టిగా నొక్కి కరచాలనం చేశాను. సైమన్‌గారు దెబ్బతగిలినట్లుగా చప్పున వెనుకకు తగ్గి, నావంక సూటిగాచూసి, ప్రతివాడు బ్యారిస్టరే అన్నాడు. అది నిరసనసూచకంగా అన్నమాట. ఆ రోజుల్లో భారతీయులు ఇంగ్లీషువారికి లోకువ. తెల్లవాడు ఎక్కువ, నల్లవాడు తక్కువ అను భేదమేగాక, బ్రిటిషువారికి మనం పాలకులం, భారతీయులు పాలితులు, పాలిత నల్లవాడు ఇంగ్లండులో చదువుకొన్నా, బ్యారిస్టరైనా, స్థాయికలవానివలె దుస్తులు వేసుకొన్నా, హుందాగావున్నా మనకు క్రిందివాడే అనే భావం ఉండేది. ఈభావాన్ననుసరించి, తనవంటి ఆధిక్యతగల తెల్ల

వానితో సమానస్థాయిగా కరచాలనం చేయటం సైమన్ గారికి నచ్చలేదు. వంగివంగి, అణుకువతో మునివ్రేళ్లు అందించి, అదే బ్రహ్మావరంగా పుచ్చుకొంగవలసినదానికి బదులు, స్నేహితుని రీతిగా సమాన ప్రతిపత్తితో వున్నట్లు గట్టిగా చేతిని పట్టుకొని బిగింపుగా కరచాలనం చేశావు. నీవు గొప్పవాడ ననుకొంటున్నావేమో, నీవు సామాన్య ఇండియన్ బ్యారిస్టరువేగదా అన్న భావం వారి నిరసనలో కనబడింది.

సైమన్ గారి కిచ్చిన టీపార్టీనుండి బైటకురాగానే నా షడ్డకుడు కనబడి, నీభార్యాబిడ్డలు నీతో వుండటానికి వచ్చారని చెప్పాడు. నేను ఆశ్చర్యపోయాను. నేను పెడసనగల్లులో నా భార్యచేత తృణీకరింపబడి, సంవత్సరమైనది ఈలోపుగా నేను గుడివాడలో గంగయ్యగారి కుమార్తెను వివాహంచేసుకొంటానటం, అక్కడక్కడ నేను తిరిగి పెళ్లి చేసుకోవాలనటం వాళ్లకు తెలిసియుంటుంది. అందుచేత తగుదునమ్మా అంటూ నాషడ్డకుడు తనమరదలిని తీసుకువచ్చాడు. మరునాడుదయం నేనప్పుడు నివసించుచుండిన 20, ముత్తుమొదలి వీధికి నాషడ్డకుడు సత్యనారాయణ, నా భార్య, ఆమె మేనమామభార్య శ్రీమతి చెరుకూరి వియ్యమ్మతో వచ్చాడు. ఆసమయానికి మద్రాసులో న్యాయవాదిగావుంటూ మా అందరిగౌరవాన్ని పొందుచుండిన అడుసుమిల్లి లక్ష్మయ్యగారు కూడా వచ్చారు. మీభార్యను స్వీకరించండని చెప్పారు. తిరిగి నాల్గవరోజున వచ్చారు. ఆమె ఏమేమో బెదిరింపుమాటలు మాట్లాడింది. మనం భార్యాభర్తలగా రసవంతమైనజీవనం చేయలేదు, ఎడముఖం పెడముఖంగా కాలం గడిపాము, కాబట్టి విడిపోయి ఎవరిబ్రతుకు వారు బ్రతికితేనే సుఖం అన్నాను. అక్కడితో అప్పుడు వెళ్లిపోయారు, కాని అంతటితో ఊరుకోనలేదు. తరువాత రెండుమూడుసార్లైనా వచ్చారు. ఈ తతంగం 1929 డిశెంబరువరకు సాగింది. ఈప్రథమసమాగమానికి తరువాత జరిగిన సంఘటనలు తరువాత చెప్తాను.

నేను పైనచెప్పినట్లు, 1928 ఆగష్టు 15-వ తారీఖుకు రాయపేట 35, పైక్రాఫ్ట్సు రోడ్డు స్ట్రీటుకు మకాం మార్చాను.

మా ఊరు దేవస్థానం ధర్మకర్తలు తగాదాపడి రు 1460 లను నూజెళ్లకాపురస్తుడు పర్వతనేని భూషయ్యగారివద్ద వుంచారు. మాతండ్రులు, పినతాతకుమారులు, ఎవరికి వీలైన దేవస్థాన భూమిని వారు అమరకంచేశారు. కాని అమరకం బాపతు కట్టుబడి దేవస్థానంనకు అప్పజెప్పలేదు. ఎవరు ఎంత ఇవ్వ వలసింది తేల్చుకోలేకపోయారు. తరువాత వారిలోవారు తగాదా పడి, ఒక తీర్మానానికి వచ్చారు. స్నానంచేసి తడిగుడ్డలతో దేవుని ఎదుట నేను ఇంత ఇవ్వాలని ఒప్పుకొని, అది మధ్యవర్తివద్ద పెద్దా మనుకొన్నారు. ఈవిధంగా ఇవ్వాలని ఒప్పుకొన్న రు. 1460 లు మొత్తం పర్వతనేని భూషయ్యగారివద్ద వుంచారు. మానాన్న భూమి అమరకం చేసియుండలేదు. అందువల్ల మానాన్న బాకీ యుండవలసిన అవకాశమే లేదు. ఈ రు. 1460 లు నుండి భూషయ్య గారు రు. 360 లు 24-8-1928-వ తారీఖున, రు. 1100 లు 19-9-28-వ తారీఖున నాకు ఇన్సూర్డ్ పోస్టుద్వారా అందజేశారు. భూషయ్యగారి అభిప్రాయం, మీ నాయనతప్ప, ధర్మకర్తలందరు దేవునిసొమ్ము తిన్నవాళ్లే కాబట్టి, మీ కుటుంబంవంతుకు ఈ రు. 1460 లు మీరు తీసుకొనండని. అయినా, ఆడబ్బును నేను బాకీ గానే ఎంచుకొన్నాను. కొన్నిసంవత్సరాలక్రితం మేనేజింగ్ ట్రస్టీగా వున్న మాపెదతండ్రికుమారుడు నారాయణరావుకు రు. 2000 లు విజయవాడ స్టేట్ బ్యాంకుమీద చెక్కు యివ్వటానికి సిద్ధమయ్యాను. కాని, అత డిప్పుడువద్దులే, తర్వాతచూచుకొందాం అన్నాడు. దానితో కాలం గడిచిపోయింది. ఎప్పటికప్పుడు నేను యిద్దా మనుకోవటం, ధర్మకర్తలమధ్య తగాదాలు వచ్చి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కొంతకాలం నియామకమై, ఆయన చప్పగా దేవాలయా దాయాన్ని కుంచించివేయటం, దానివల్ల తగాదాలు రావటం వగైరాతో, నాప్రయత్నం మాగిపోయింది. ఇకనైన, యివ్వటానికి నిశ్చయించుకొన్నాను. ఆ డబ్బును భూషయ్యగారు సమయానికి అందజేయకపోతే, నేను మిక్కిలి యిబ్బందిపడేవాడిని.

నేను 35, పైక్రాఫ్ట్సు ఫస్ట్ స్ట్రీటులో ప్రవేశించిన తద నంతరం, నౌకరిగా పెట్టుకొన్న గోపాలకృష్ణ అనే కుర్రవానితో

సమీపంలో వున్న మోడరన్ హిందూ హోటల్‌నుండి భోజనం తెప్పించుకొనేవాడిని. 27-4-29న గాని, గోవిందనాయర్ అనే మళయాళిని వంటవానిగా పెట్టుకొనలేదు.

8-4-29 న గాని ఇన్‌కమ్‌టాక్సు డిపార్ట్‌మెంటులో చేరలేదు. ఈలోపుగా ఒక రాయబారం వెళ్లాను. రెండుకేసులు పరిశీలించి, సలహా వ్రాసియిచ్చాను. ఈ రెండింటిలో ఒకదానిలో, హైకోర్టు రివిజన్ పిటీషను వాదించాను. ఆ రోజుల్లో, పిఠాపురం మహారాజావారు శ్రీ రావు సూర్యారావు బహద్దర్ వారు పీపుల్సు పార్టీ అనే రాజకీయ పార్టీని స్థాపించి, దానికి అధ్యక్షులుగా వుంటూవుండేవారు. అప్పుడు జస్టిస్ పార్టీ బలంగా వుండేది. దానితరఫున కొంతమంది మంత్రులుండేవారు. 1928 లో, శ్రీ పానగల్లురాజా రామారాయణింగారు ముఖ్యమంత్రిగా వుండేవారు. ముఖ్యనాయకులలో, మధురకు చెందిన పి. టి. రాజన్‌గారొకరు. కారణం గుర్తులేదుగాని రాజన్‌గారితో సంప్రదింపు కావలసివచ్చింది. పిఠాపురం మహారాజావారితరఫున, వారి భార్య సోదరుడు నూజివీడు తాలూకా గొల్లప్రోలు జమీందారుగారు ప్రాతినిధ్యము వహించారు. ఏసంబంధమోగాని అయ్యదేవర కాళేశ్వరరావుగారు జోక్యము కల్పించుకొన్నారని జ్ఞప్తికివున్నది. (నేను పొరపాటుపడుచుండుటలేదుకదా?) పోలవరపు నాగేశ్వరరావుగారుకూడా వున్నట్లు గుర్తు. వారు మా యింటివద్ద చేరి నన్ను ప్రోత్సహించి కొంతడబ్బిచ్చి, పి. టి. రాజన్‌గారితో మాట్లాడటానికి మధురకు పంపారు. నేను వెళ్లినప్పుడు రాజన్‌గారు ఊళ్లోలేరు. అప్పుడు స్వామినాయుడుగారనేవారు మధుర మున్సిపాలిటీకి చైర్మన్. వారు బ్యారిస్టరు. రాజన్‌గారికి స్నేహితుడు. ఆసంగతి తెలుసుకొని వారింటికి వెళ్లాను. వారు నన్నాదరించి, అతిథిమర్యాదలు చేశారు. వారిసాయంతో మధుర నాయక్ పాలస్ మొదలైనవి చూచాను. ఆ రోజు రాజన్‌గారు తిరిగిరానేలేదు. ఎప్పుడు వచ్చేదీ తెలియలేదు. అందువలన వట్టిచేతులతోనే తిరిగివచ్చి ఆసంగతి నన్ను పంపినవారికి తెల్పాను.

అక్కడితోనే నా రాజకీయాలజోక్యం ముగిసిపోయింది. తిరిగి ఎన్నడు ఏ రాజకీయపార్టీ అనుసంధానలలోను, నేను జోక్యం కలుగ జేసుకోలేదు.

5-9-1928-వ తారీఖున పోలవరపు నాగేశ్వరరావుగారికి, శ్రీ వరదాచారనేవారికి ఏదో భూమివిషయమై జరిగిన యగ్రిమెంటు విషయమై, తగాదా వచ్చింది. నాగేశ్వరరావుగారు నన్ను సంప్రదించారు. నేను యస్. దొరస్వామిఅయ్యర్ గారిని సంప్రదించి, ప్లైంటు వ్రాసియిచ్చాను. నాగేశ్వరరావుగారు నాకు రు. 50 లు ఫీజిచ్చారు. అదే నా మొదటి ఫీజు.

12-10-1928 న నూజివీడు తాలూకా తేలప్రోలుగ్రామం మనుబ్రహ్మాచారి అనేఆయన ఒక కాలెండరుకేసులో తనకు నూజివీడు సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు జరిమానా వేసినదానికి హైకోర్టుకు రివిజన్ పిటీషను పెట్టటానికి నన్ను ఏర్పరచుకొన్నాడు. రూ. 40 లు ఫీజుమాట్లాడి, రు. 28 లు యిచ్చాడు. కేసులో పటుత్వంలేదు. కాని నా శాయశక్తులా ప్రయత్నించి రివిజన్ పిటీషన్ వ్రాసి దాఖలుచేశాను. జడ్జిగారు దానిని ఒప్పు (ఎడ్మిట్) కొనలేదు. ఆ సమయాన పప్పు సోమసుందరంగారివంటి అనుభవన్యాయవాదులున్నారు. పట్టుదలతోకూడిన నావాదనను విని, వారు చిరునవ్వునవ్వారు. తిరిగి మనుబ్రహ్మాచారి నాకు కనపడలేదు.

ఇంకొకసందర్భంలో నాచెల్లెలు ద్రౌపదమ్మ పెనిమిటి గుడివాడ తాలూకా సిద్ధాంతం వాస్తవ్యులు నిమ్మగడ్డ దుర్గానాగేశ్వరుడుగారు ఒక చిన్నకేసును సుప్రసిద్ధ న్యాయవాది ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారి కిచ్చాడు. ఎందుకైనా మంచిదని నాచేతకూడా మెమో దాఖలుచేయించాడు. కేసు విచారణరోజున, సత్యనారాయణరావుగారికి రెండు, మూడు కోర్టులలో పనితగిలింది. అందువలన నాతో చెప్పి, మీరు చూస్తూవుండండి, కేసు కోర్టువారు పిలవగానే నన్ను పిలవండని చెప్పారు. తీరా కేసు విచారణకు వచ్చినప్పుడు సత్యనారాయణరావుగారు రాలేకపోయారు. నేనేదో చెప్పబోవటంకూడా అనవసరమైంది. ప్రతివాది వకీలు అడ్డుమిల్లి లక్ష్మయ్యాగారు

నాలుగుముక్కలు చెప్పారు. జడ్జి ప్రతివాది వాదనను అంగీకరించలేదు. మా కేసు ఒప్పుకొన్నారు. ఇంతకుతప్ప, నే నే కేసులలోను హాజరుకాలేదు. ఏ ప్లీడింగ్సుపత్రాన్ని వ్రాయలేదు.

పైవిగాక, ఇంకొక చిన్నవిషయం, కాగితాలు తిరగ వేస్తుండగా బైటపడ్డది చెప్తాను. మిత్రుడు యన్. జి. రంగాగారు పుసులూరు అబద్ధాలు అనువారిని నావద్దకు పంపారు. అబద్ధాలు గారు, నే నొక వారసత్వపుకేసులో ఇరుక్కొన్నాను. నా వంశ వృక్షం కావలసివచ్చింది, అది మా గురువువద్ద దొరుకుతుంది, మీరు నాకు సాయంగా రావాలి, అని కోరినాడు. రంగాగారి సిఫార్సు తప్పదని, అబద్ధాలుగారిని వెంటబెట్టుకొని 15-6-1928 తారీఖున, భీమవరం తాలుకా పెద్దకాపవరంగ్రామం, వారి గురువులు పెద్దింటి తిరుమలాచార్యులుగారి కుమారులు, రాఘవాచార్యులు, లక్ష్మీ నరసింహాచార్యులు ఇంటికి వెళ్లాను. ఆచార్లుగార్లు మర్యాదచేసి, భోజనమమర్చి వంశవృక్ష మిచ్చారు. మేమొకచోట రైలుదిగి, ఒంటెద్దుబండిలో ఆ వూరుకు వెళ్లాము. ఆ బండివాని దావూరే. మధ్యాహ్నం ఆ బండిలోనే రైలుస్టేషనుకు తిరిగి వచ్చాము. టిక్కెట్లు కొనునంతలో రైలు వచ్చింది. రైలెక్కబోతూ అబద్ధాలుగారికొరకు చూడగా, వారుకనపడలేదు. నాది రెండో తరగతిపెట్టె. వారు మూడవతరగతిపెట్టెలో ఎక్కినారోలేదో అని అబద్ధాలుగారూ, అబద్ధాలుగారూ అని గొంతెత్తి పిలుస్తూ రైలుపొడుగూతా తిరిగాను. ఆయన కిమ్మనలేదుగాని, నా పిలుపు విన్నవారు హేళనగా నవ్వటం ప్రారంభించారు. నే నదిగ్రహించి సిగ్గుపడి, చప్పున నా పెట్టెలోకి వెళ్ళిపోయాను. ఈ సంఘటనలోని విశేషం, "అబద్ధాలు" అని పాఠకులు గ్రహించియేయుందురు.

నేను 1928 ఆరంభంలో మద్రాసుకు వచ్చి, న్యాయవాద వృత్తిపనిని, ఒక సీనియర్ న్యాయవాది ఆఫీసులో నేర్చుకోవాలని అనుకొన్నప్పుడు, అప్పుడు మద్రాసు ద్వంద్వప్రభుత్వంలో (డయార్కి) ముఖ్యమంత్రిగా వుంటున్న పానగల్లు రాజాగారిని, శ్రీ బొల్లిని మునిస్వామినాయుడుగారి ద్వారా సమీపించాను.

శ్రీ బొల్లిని మునిస్వామినాయుడుగారు, బందరులో న్యాయవాదిగా వుంటున్న శ్రీ బొల్లిని నారాయణస్వామినాయుడుగారి అన్న. బొల్లిని నారాయణస్వామినాయుడుగారితో నా పరిచయం పైన చెప్పాను. మునిస్వామినాయుడుగారు శ్రీ పానగల్లు రాజాగారికి కుడిభుజంవంటివారు. కాబట్టి రాజాగారు వారిమాట త్రోసివేయ లేక, మిక్కిలి పేరుపొందిన నూజెంటు గ్రాంటు అనే క్రిమినల్ లాయర్‌గారికి సిఫార్సు ఉత్తరం యిచ్చారు. గ్రాంటుగారు, నాకిదివరకే చాలామంది వున్నారు. ఈ మధ్యనే బ్యారిస్టరు జి. వి. చౌదరి, యల్. యల్. డి గారిని తీసుకొన్నాను. కాబట్టి మిమ్ములను తీసుకొనుటకు అవకాశంలేదు అని నిష్కర్షగా చెప్పివేశారు. గత్యంతరంలేక, సిడ్నీ స్మిత్ గారిని సమీపించాను. వారు నన్ను అడ్వొకేటుగా చేర్పించినవారు. వారికి వార్ధక్యం వచ్చింది. త్వరలోనే విరమించుకొని ఆస్ట్రేలియాకు వెళ్లిపోవాలని అనుకొంటుండినారు. అందువల్ల, నావల్లకాదు అని, యస్. దొరస్వామిఅయ్యర్ అనే అడ్వొకేటున్నారు, వారు చాలా ఉత్తములు మాటతీసివేయలేరు, మీరు వారివద్దకు వెళ్లండి, వారి ఛేంబర్సు ఆర్మీనియన్ స్ట్రీటులో ఉన్నదని చెప్పారు. నేను వెళ్లి వారి ఆఫీసులో దొరస్వామిఅయ్యర్‌గారిని కలసికొన్నాను. వారన్నారు, నేను ఒరిజినల్ సైడ్ ప్రాక్టీసువాడిని, మాకు అప్పీలువర్కు అరుదుగాగాని వుండదు, ఒరిజినల్ సైడ్ ప్రాక్టీసుకు అరవం తెలిసివుండాలి, మీకదిరాదుగదా, కాదుకూడదంటే, అలాగే నావద్దకు రావచ్చును, అని సమ్మతించారు.

నేనప్పుడప్పుడు వారింటికి వెళ్లుచుండేవాడిని. ఏదైనా సలహా కావలసివస్తే అడిగి తెలిసికొంటూ వుండేవాడిని. అయితే, శ్రద్ధగా వారిశుశ్రూష చేసివుండలేదు. నేర్చుకొన్నది బహుకొద్ది. రోజూ వారింటికి వెళ్తూవుండేవాడనుకాను. వారి ఇతరజూనియర్సు శ్రద్ధగా చదువుచుండి, రిఫరెన్సును అందిస్తూ, తాము తెచ్చిన కేసులలో సలహాలు తీసుకొంటూ ఎంతగానో శ్రద్ధగా వుండేవారు. కాని నేను చదవటం తక్కువ, రిఫరెన్సులను వారికందివ్వ లేదు. నేను కేసులను సంపాదించలేదు. ఏ కేసులను తీసుకొని వెళ్లి,

వారికి సీనియర్ యంగేజ్‌మెంట్సును ఇవ్వలేదు. అయినా, అందరు జూనియర్స్‌తో బాటు, అప్పుడప్పుడు నేను వారింట్లో భోంచేసే వాడిని. భోజనం సరిగా వడ్డిస్తున్నాడో లేదో అని, వంటవానిని వారు హెచ్చరించేవారు. ఎంతో తృప్తిగా భోజనంచేసే వాడిని.

నేను ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటు ఉద్యోగములో చేరునప్పుడు వారినుండి సెలవుతీసుకొన్నాను. వా రెంతో దయా దాక్షిణ్యాలు కలవారు, సాత్వికసంపన్నులు. ఆధ్యాత్మికచింతన కలవారు. వారు మంచిసంపాదనలో వున్నప్పుడు వృత్తిని వదలి, సన్యాసం పుచ్చుకొన్నట్లు, పాండిచేరికి వెళ్ళి అరవిందాశ్రమంలో చేరిపోయారు. కొంతకాలానికి శ్రీ రమణమహర్షివద్దకు చేరి వారి శిష్యుడుగా వుండినారు. చాలా సంవత్సరాల తర్వాత, వారు మద్రాసులో వున్నారని తెలిసి వారిని దర్శించి, వారి పాదములకు నమస్కరించాను. వారు ఎంతోసంతోషించి వారికి నే నొకప్పుడు అనటోల్ ఫ్రాన్స్‌గారి, రివోల్ట్ ఆఫ్ ఏంజెల్సు అను పుస్తకం యిచ్చినట్లు గుర్తుచేశారు. తిరిగి వారిదర్శనం కాలేదు. వా రిప్పుడు జీవించియున్నారో లేదో తెలియదు. వారి ఆప్యాయత, నిరాడంబ రత్వం, అరమరిక, కులవివక్షత లేకుండటం, శిష్యవాత్సల్యం నా కెప్పుడును గుర్తుకు వస్తూవుంటవి.

వారి కిద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. పెద్దబ్బాయి, పెద్దమ్మాయి స్ఫురద్రూపులు, చాలాచక్కనివారు. పెద్దమ్మాయిని విశ్వనాథం ఐ. సి. యస్. ఆఫీసరుగారి కిచ్చి వివాహంచేశారు. పెద్దబ్బాయి మిత్ర చాలావృద్ధిలోనికి రావలసినవాడు. రెండో ప్రపంచయుద్ధ సమయంలో ఏరోప్లేను యాక్సిడెంటులో చని పోయాడు. రెండో అబ్బాయికూడా ఏరోప్లేను యాక్సిడెంటులోనే చనిపోయాడట. రెండో అమ్మాయిసంగతీ గుర్తులేదు. నేను దొరస్వామిఅయ్యర్ గారిని చాలాసంవత్సరాలకు మద్రాసులో కలసి కొన్నప్పుడు, వా రిద్దరి కుమారులు చనిపోయివుండినారు. నే నా విషయం ప్రస్తావించగా, వారు దైవభీష్టమని అన్నారు. ఇంచు కంతైనా విచారం కనుపించ నివ్వలేదు. నేను చూచిన



మదరాసు, ముత్యాలపేట హైస్కూలు విద్యార్థులు

గ్రంథకర్త, ఆచార్య రంగా, వి. వెంకయ్యచౌదరి, కె. శేషాచలంగార్లను సన్మానించిననాటి చిత్రము — 1927



సర్ కె. వి. రెడ్డినాయుడుగారు దక్షిణాఫ్రికా ఏజెంట్-జనరల్‌గా నియమితులైనప్పుడు ఆచార్య రంగా, గ్రంథకర్త, డా. వి. వి. చౌదరి మదరాసులో యిచ్చిన వీడ్కోలు సభ
(1927)

మొదటి పంక్తి :

పి. వెంకటరమణనాయుడుగారు, 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు,
సర్ వి. పరశురామపాత్రోగారు, పిఠాపురం మహారాజావారు,
సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు, సామి వెంకటాచలంచెట్టిగారు,
ఆచార్య రంగాగారు, సర్ వేపా రామేశంగారు, శొంఠి రామమూర్తిగారు

వెనుక నిల్చొన్న పంక్తి :

శ్రీ ఎల్. వి. బి. చౌదరి (గ్రంథకర్త), డా. వి. వెంకయ్యచౌదరి,
శ్రీ శీలం గోవిందరాజులునాయుడు, శ్రీ పి. సాంబశివరావు, శ్రీ గంటి లచ్చన్న,
ఆచార్య సుబ్రహ్మణ్య అయ్యర్, శ్రీ గద్దె రంగయ్యనాయుడు,
శ్రీ పింజల సుబ్రహ్మణ్యంచెట్టి, శ్రీ యార్లగడ్డ రంగనాయకులునాయుడు,
శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు

సాయంత్రం పెద్దకూతురు దగ్గరకు వెళ్తున్నానని చెప్పారు. ఆమె భర్త అప్పుడు బొంబాయిలో ఉండినారు.

సర్ కె. వి. రెడ్డినాయుడుగారు సౌత్ ఆఫ్రికాలో మన ఇండియాగవర్నమెంటు ఏజెంటు-జనరల్‌గా నియమింపబడ్డారు. ఆసందర్భంగా, వారిగౌరవార్థం ఆచార్య రంగా, డా॥ వాసిరెడ్డి వెంకయ్యచౌదరి (వి. వి. చౌదరి) నేను కలసి సన్మానం (రెసెప్షన్) రాయపేటలోని మోడరన్ హిందూ హోటల్‌లో 5-12-1928-వ తారీఖున చేశాం. అనేకమంది పెద్దలు వచ్చారు. శ్రీ పిఠాపురం మహారాజాగారు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, హైకోర్టు జడ్జి సర్ వేపాగారు, సర్ పరశురామ పాత్రోగారు, పాకాల వెంకటరమణనాయుడుగారు, శొంఠి రామమూర్తిగారు, యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారు, గద్దే రంగయ్యనాయుడుగారు, గంటి లచ్చన్నగారు, శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బ్యారిస్టరు సి. సాంబశివరావుగారు, ప్రొఫెసరు సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, శేలం గోవిందరాజులు నాయుడుగారు, ఇతరపెద్దలు వచ్చారు. స్వామి వెంకటాచలం గారు అధ్యక్షతవహించారు. సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు పేరుపొందిన వక్త. వారిది ఖంగున మ్రోగే కంచుకంఠం. చక్కని స్ఫుటమైన ఉచ్చారణతో, ధారావాహినిగా ఉజ్వలంగా, ఉద్వేగంతో, గంటపైచిల్కు వివిధ విషయాలు మాట్లాడినారు. శ్రోతలు ముగ్ధులైనారు. నావంటి యువకులు పొంగిపోయారు. క్రిక్కిరిసిన హాలు హర్షధ్వానాలతో నిండి పోయింది. రంగాగారు ప్రారంభంలో నాయుడుగారి విశిష్ట వ్యక్తిత్వం, వారి కార్యనిర్వహణదక్షత వగైరాలను గురించి మాట్లాడారు. నేను వందనసమర్పణ చేశాను.

20 మార్చి 1929-వ తారీఖున, లేబర్ కమిషనర్ శ్రీ యస్. హెచ్. స్లేటర్, ఐ. సి. యస్. గారికి శ్రీ రంగాగారు రాయపేట లోని మోడరన్ హిందూహోటలులోనే, టీపార్టీ ఇచ్చారు. ఈ పార్టీకి శ్రీ బజ్‌లుల్లా, దివాన్ బహద్దర్ టి. వరదరాజులు నాయుడుగారు, డా. నటేశ మొదలియారు, ప్రిన్సిపాల్ చినతంబి

పిళ్లై, శ్రీ డి. యస్. రెడ్డి, శ్రీ యమ్. వి. వెల్లోడి, శ్రీ వెంకయ్యా, యమ్. యల్. సి., కొందరు యూరపియన్ పెద్దలు, చాలామంది ఇతరులు హాజరయ్యారు. దివాన్ బహద్దర్ గోపిశెట్టి నారాయణ స్వామి శెట్టిగారు అధ్యక్షతవహించారు. వారిని నేను అధ్యక్షుడుగా ఉపపాదించాను. రంగాగారు స్లేటర్ గారి సేవలను గురించి ప్రశంసించారు.

ఆ కాలంలోనే, కొంతమంది కమ్మవిద్యార్థులు ముత్యాలుపేట హైస్కూల్ హెడ్ మాస్టరు (కమ్మవారు) అధ్యక్షులైన, ఇంగ్లండులో విద్య నభ్యసించి తిరిగివచ్చిన శ్రీ కాట్రగడ్డ శేషాచలంగారికి, శ్రీ రంగాకు, శ్రీ వాసిరెడ్డి వెంకయ్యాచౌదరికి, నాకు సన్మానసభ జరిపారు. విద్యార్థులలో సి. నరసింహంగారు, కనక బాపయ్యగారు, తర్వాత హైకోర్టు జడ్జి అయిన కౌసలేంద్రరావుగారు, గోగినేని వెంకటనరసయ్యగారు వగైరా వుండినారు. శ్రీ శేషాచలం కుమార్తె అప్పటికి చిన్నపిల్ల స్వర్ణకుమారుండినది.

ఈ లోపుగా 5-3-1929-వ తారీఖున ఇన్ కమ్ టాక్స్ కమిషనర్ గారి నుండి 8-వ తారీఖు ఉదయం ఇంటర్వ్యూకు రావలసిందని ఉత్తరం వచ్చింది. వెళ్లి అప్పుడు యాక్టింగు (బదులు పనిచేయు) కమీషనర్ ఇ. డబ్ల్యూ. క్లార్కుగారిని చూచాను. సెలవుమీద వెళ్లిన కమీషనర్, యఫ్. హెచ్. సెనెక్ గారు, మీకుద్యోగ మిమ్మన్నారు. ప్రస్తుతానికి ప్రొబేషనరి ఇన్ కమ్ టాక్స్ ఆఫీసరు పదవి ఖాళీలేదు. అసిస్టెంటు ఇన్ కమ్ టాక్స్ ఆఫీసరు పదవి ఖాళీవున్నది. అది మీరు అంగీకరించండి, జూన్, జూలైలో ప్రొబేషనరి ఆఫీసరు పదవికి ఖాళీవస్తుంది. ఆ పదవిని మీకు యిస్తాను అని చెప్పారు. 13-వ తారీఖున వారికి ఉత్తరం వ్రాస్తూ మీరు జూన్, జులైలోగాని అంతకుముందుగాని ప్రొబేషనరి ఆఫీసరు పద విస్తానన్నారుకదా, ఆ షరతుమీద అసిస్టెంటు ఇన్ కమ్ టాక్స్ ఆఫీసరు పదవికి అంగీకరించానని తెలియజేశాను. 16-౩-1929-వ తారీఖున కమీషనర్ క్లార్కుగారిని తిరిగి దర్శించి ఆ మాటే చెప్పాను. వారు ఒప్పుకొన్నారు.

నేను కొంత వ్యవధి తీసుకొని, 8-4-1929-వ తారీఖున, ఇన్‌కమ్ టాక్స్ డిపార్టుమెంటులో అసిస్టెంటు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా ప్రవేశించాను. అక్కడితో, ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో నా ఉద్యోగం ప్రారంభమైంది.

అసిస్టెంటు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు పోస్టు చిన్నది. ఇప్పుడు దానిని ఇన్‌స్పెక్టరంటారు. వేతనం నెలకు రూ. 100 లు మాత్రమే. ఈ పోస్టును నేను అంగీకరించానని మిత్రులు, ముఖ్యంగా ఆక్స్‌ఫర్డ్ మిత్రులు శ్రీ కె. వి. గోపాలస్వామి వంటి వారు, నిందించారు. నేను ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్ నేగాక, బ్యారిస్టరును కూడా. నా పెద్దచదువుకు ఈ స్వల్ప ఉద్యోగం తగనిది. ఈ ఉద్యోగాన్ని స్వీకరించటంవల్ల నా ఆక్స్‌ఫర్డ్ డిగ్రీని, నా బ్యారిస్టరుపట్టాను కించపరచానని వారందరు నిందించారు. కాని ఇది రెండు మాసముల ఉద్యోగమే నని, ఈ అవకాశానికి ఒప్పుకొనకపోయినట్లయితే, దీనిని సాకుగా తీసుకొని యాక్టింగ్ కమిషనర్ నాకు స్థానము లేకుండా చేస్తాడేమో అని భయపడ్డాను. అసలు కమిషనర్ వచ్చి అడిగితే, నన్నేమి చెయ్యమంటారు. ఉద్యోగం యిస్తానంటే వద్దన్నాడని మోసగిస్తాడేమో యని శంకించాను. నా అప్పటి పరిస్థితులు ఈ నా తాత్కాలిక కించత్వానికి నన్ను ఒప్పించినవి. యాక్టింగు కమిషనర్‌గారు మాటయిచ్చినట్లు 12-6-29-వ తారీఖుననే నన్ను ప్రొబేషనరి ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా నియమించారు. హోదా పెరిగింది. కాని, నేను అదివరకు అసిస్టెంటు ఆఫీసరుగా పనిచేస్తున్న మొదటి సర్కిల్‌లోనే వుండిపోయాను. నిజానికి క్లార్క్‌గారు నేను అసిస్టెంటు ఆఫీసరుగా చేరినప్పుడు నన్ను స్వయముగా ఫస్ట్ సర్కిలు ఆఫీసరు యస్. ముత్తు కృష్ణఅయ్యర్‌గారి దగ్గరకు తీసికొనివెళ్లి, నన్ను పరిచయపర్చి, ఈయన తాత్కాలికంగా అసిస్టెంటు ఆఫీసరుగా వున్నారు. జాగ్రత్తగా చూడండని చెప్పారు.

ఈ సందర్భంలో మధ్యపరగణాల ప్రఖ్యాత రాజకీయవేత్త, మొదటిమంత్రిగాను, తర్వాత గవర్నర్‌గాను వుండిన ఈడ్పుగంటి

రాఘవేంద్రరావుగారు వ్రాసిన ఉత్తరం పేర్కొనటం అసమంజసం కాదు. వారు బిలాస్‌పూరునుంచి 26-6-1929-వ తారీఖున, క్రిందివిధంగా ఉత్తరం వ్రాశారు. "మిమ్ములను ప్రొబేషన్ మీద ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగా నియమించినట్లు ఫోర్ట్ సెయింట్ జార్జి గజెట్‌లో చూచి చాలా ఆనందించాను. ఈ ఉద్యోగం మీకు చాలాకాలం క్రిందటనే రావల్సింది. అయినా, డిపార్టు మెంటువారి షరతులమీద మీరు ఈ డిపార్టుమెంటులో చేరి యుండటం మంచిదైంది. ఈ ఉద్యోగం, మీరు జూనియర్ అడ్వొకేటుగా ప్రాక్టీసు ఇబ్బందులు పడకుండా, సుఖజీవనానికి తోడ్పడుతుంది. మీరు చాలా సంవత్సరా లుపయోగకరంగా ఉద్యోగం చేస్తారని, సంవత్సరం సంవత్సరం నిచ్చెన పైమెట్లు ఎక్కుతారని ఆసిస్తున్నాను" అని వ్రాశారు.

మేధావియు, రాజకీయ దురంధరుడును, పరిపాలనాదక్షుడు నైన శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు చాలాకాలంక్రిందట నాగపూర్‌కు వలసవెళ్లిన కమ్మవారి కుటుంబాలలోనివారు. వారింగ్లండుకువెళ్లి, బ్యారిస్టర్ పట్టాను పొందినారు. కొంతకాలం న్యాయవాదివృత్తిని కొనసాగించి, తర్వాత రాజకీయాల్లో ప్రవేశించి మధ్యపరగణాల ప్రభుత్వంలో మంత్రయి, తర్వాత గవర్నరు పదవిని అధిష్ఠించినారు. అటుపిమ్మట, లండన్‌లో ప్రీవికౌన్సిల్ మెంబరుగా వుండినారు. వారు స్వతంత్రపతిపత్తి కలవారు. మేధావంతులేకాక, ధీరగుణ సంపత్తి కలవారు. రాజకీయ చతురతలో పేరొందినవారు. పరిపాలనలో సునిశిత క్రమశిక్షణ పాటించేవారు.

భారతావనికి స్వతంత్రము రాకమునుపు, 1937 ప్రాంతములో, ద్వైపాక్షికప్రభుత్వ మేర్పడినప్పుడు, వారు మంత్రిగా వుండిన కాలములో ఆంగ్లేయుల ప్రాబల్యం తగ్గలేదు. వారింకను తాము అగ్రజాతి పాలకవర్గంలోనివార మనియు, భారతీయు లెట్టి పదవులలో నున్నా వారి నంతగా లక్ష్యపెట్టవలసినది లేదనియు అభిప్రాయము కలవారై యుండినారు. ఒకనాడు మంత్రిగా శ్రీ రాఘవేంద్రరావుగారు తన పరిపాలనలోవున్న ఫారెస్టు డిపార్ట్‌మెంటు ఛీఫ్ కన్సర్వేటర్‌తో మాట్లాడవలసి వచ్చింది. అతనిని

పిలిపించగా ఆ ఆంగ్లేయ ఉద్యోగి తాను క్యాంపుకువెళ్లిన కాకీ దుస్తులతో వారిగదిలోకి వచ్చినాడట. రాఘవేంద్రరావుగారు అతనిని ఎగా దిగా చూచి, ఈ దుస్తులతో నా సముఖానికి రావలసిందికాదు, వెళ్లి వెంటనే దుస్తులు మార్చుకొని సముచిత దుస్తులను ధరించి రావలసినదని ఆజ్ఞాపించారట. ఆ యుద్యోగి కుక్కిన పేనువలె ఇంటికివెళ్లి, దుస్తులను మార్చుకొని వచ్చినాడట.

రాఘవేంద్రరావుగారు కాంగ్రెసువాది కాబట్టి ఖద్దరు దుస్తులనే ధరించేవారు. అయితే, వారు సర్వసామాన్యంగా సూటు వేసుకొనేవారు. ఆ సూటు మొదటిరకం ఖద్దరు నూలుతో నేయబడిన వస్త్రమునుండి తయారుచేయబడినది. ఏమాత్రం నలగకుండా అప్పటి కప్పుడు శుద్ధిచేసి తీసికొనివచ్చిన దానివలె తాజాగా వుండేది. వారి లాగు మధ్య మడత ( క్రీజ్ ) చెక్కు చెదరకుండా వుండేది. ధోవతి ధరించినా తెల్లని కోటు, గాంధి టోపి ఉండేవి. కోటు, ధోవతి అప్పటికప్పుడు ఇస్త్రీ చేసినట్లుండేవి. వారి కోటు బొత్తాలు పెద్దవిగాను, స్వాస్తిక్ చిహ్నాలతోను హుందాగా వుండేవి. వారు పరిశుభ్రమైన, ఏమాత్రము నలగని గాంధీటోపీని ధరించి తెల్లని జరీ ఖాదీకండువాను మెడకు చుట్టి ఒక భాగము ఎదురొమ్ముమీదగాను, ఒక భాగము వీపు మీదగాను వ్రేలాడునట్లు ధరించేవారు. మల్లెపూవువంటి తెలుపు కోటుమీద, నలుపు పైభాగములో తళతళలాడే బంగారు ఛాయ గల స్వాస్తిక్ చిహ్నాల వెడల్పాటి గుండీలు మిక్కిలి ఆకర్షణీయంగా వుండేవి. రాఘవేంద్రరావుగారు మధ్యరకం లావుతో ఎత్తైన విగ్రహం కలవారు. వారి ఫాలభాగం విశాలమైనది. సూటియైన ముక్కు, దృఢమైన దవడలు, పట్టుదలను తెల్పే గడ్డం, విశాలమై, తేజోవంతమై, కొద్దిగా బెబ్బులి కన్నుల ఛాయలను జ్ఞప్తికి తెచ్చే కన్నుగవ, వారి గంభీర విశిష్టతను తెల్పేవి. వారి తేజోవంతములైన నేత్రములనుండి వెలువడిన నిశితదృక్కులు ఎట్టివారినైనను ఆకర్షించగల శక్తికలవి. వారి చెవులు సుదీర్ఘములై, బొమ్మలలో జూచు శ్రీ రామానుజాచార్యులవారి చెవులను జ్ఞప్తికి తెచ్చేవి. అయినను, రాఘవేంద్రరావుగారు అందగాడని ఎవరును అనుకొనియుండరు. కారణం, వారి పెదవులు

మందముగను, మూతి వెడల్పుగను, పండ్లు పెద్దవిగను ఉండేవి. ఒక సిద్ధాంతి వారిని చూచి, హనుమంతుని మూతివంటి మూతి అని అన్నారు. బహుశా, ఆమూతి ఆ విధముగా నుండుటవల్లనే వారు మేధావిగా, కార్యదీక్షా పరాయణులుగా, దృఢమనస్కులుగా, దక్షులుగా విలసిల్లినారేమో.

వేషమునందేగాక భోజన శయనాదులయందును సున్నితమును, భోగలాలసత్వమును కన్పరచెడివారు. వారి అతిథిసత్కారం గొప్పది. వివిధరకములైన వంటకములతో గొప్పగా ఆతిథ్యమిచ్చేవారట. శయనవిషయంలోకూడ మిక్కిలి జాగ్రత్తను తీసుకొని, పడకగదులను మిక్కిలి శుభ్రమైన పరుపులు, అందమైన దుప్పట్లు మొదలైనవానితో ఏర్పాటుచేసేవారట. వారు అల్పాహారులైనను భోజనపదార్థములు మిక్కిలి శుచిగా, రుచిగా ఉండునట్లు ఏర్పాటు చేసుకొనేవారట. వారు సౌందర్యోపాసకులు, రసపిపాసులుకూడ.

శ్రీ రాఘవేంద్రరావుగారు తమహోదాను కాపాడుకొనేవారు. వారు గవర్నర్‌గా వున్నప్పుడు ఎక్కడికో వెళ్లుచుండినారట. రైల్వేస్టేషను ప్లాటుఫారంమీదనుండి తనమంత్రులు మొదలైనవారితో మాట్లాడుచుండగా, ఒకపరిచితుడు చప్పున వారిని సమీపించి, ఓహో రాఘవేంద్రరావుగారు అంటూ కరచాలనం చేశాడట. ఎంతపరిచితుడైనను, చివరకు స్నేహితుడైనను గవర్నర్ హోదాలోవున్న వారిని ఆవిధముగా తనంతట తానే చొరవచేసుకొని, సమీపించి చనువుగా కరచాలనంచేయటం సముచితంకాదు. అందువలన చిరునవ్వు నవ్వుచుండినను, గవర్నరు రాఘవేంద్రరావుగారి కా చొరవ సహించియుండదు. వారు వెళ్లిపోయినతర్వాత, ఆ పరిచితుణ్ణి పోలీసుఉద్యోగులు చివాట్లుపెట్టారట. ఈసందర్భములో అమెరికా ప్రెసిడెంట్ జనరల్ ఐసన్‌హోవర్‌గారి సంగతొకటి జ్ఞప్తికివచ్చుచున్నది. వారు ప్రెసిడెంటుగా వున్నప్పుడు ఏదో క్లబ్బుకు వెళ్లటం సంభవించినదట. ఒక పరిచయవ్యక్తి ఐసన్‌హోవర్‌గారు అని సంబోధించుచు వెళ్లి వారిచేతిని తనచేతిలోకి తీసుకొని కరచాలనం

చేశాడట. అమెరికా ప్రెసిడెంటును పేరుతో పిలవక ప్రెసిడెంటు గారని పిలవట మాచారం. తగినంత మర్యాదతో మెలగటం, వారు పూనుకొని దగ్గరకు తీయనిదే, చొరవచేసుకొనటం సముచితంకాదు. అందువల్ల క్లబ్బువా రాయనను క్లబ్బునుండి బహిష్కరించారట.

వారిని మొదట నేను 1929 ఆరంభంలో కలసికొన్నప్పుడు, వారితోబాటు కృష్ణాజిల్లాలోని నూజివీడుకు వెళ్లుట తటస్థించింది. మేము మొదట శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి నూజివీడు లోని మామిడితోటలు మొదలైనవి చూచి, నూజివీడు జమీందా రుల్లో నొకరు ( తేలప్రోలురాజాగా రనుకొందును ) ఒక పెద్ద దర్బారుహాలును కట్టించి, అందులో బంగారుపూత పూయబడి, వెల్ వెట్ దిండ్లతో అమర్చబడిన కుర్చీలను పొందుపర్చినారని, వారికెవరో తెలిపి అందంగా వుంటుందని చెప్పియుండిరి. సౌందర్యో పాసకులైన వారి కా దర్బారుహాలును చూడాలని బుద్ధిపుట్టింది. దానిని చూచి చప్పరించారు. పాశ్చాత్య దేశములందలి సౌందర్య భవనములను, అందు అమర్చబడిన సౌఖ్యకరమైన వస్తువులను చూచిన నాకు కూడ తృప్తికల్గలేదు. హాలు పెద్దదేగాని చిన్న రకం సినిమాహాలువలె వుండింది.

మాకు చూపించినవారిలో బొందిలికులస్థుడుకూడ వుండినాడు. ఆబొందిలి పూర్వులు నాగపూరువా రనుకొందును. లేక ఆయనకు బంధువులు నాగపూరులో వుండియుండవచ్చును. మొత్తంమీద, ఏదోసంబంధము కలుపుకొని రాఘవేంద్రరావుగారిని వారింటి కాహ్వానించాడు. మొగమాటపడి ఆయనగారింటికి వెళ్ళి ఆయ నిచ్చిన ఉపహారమును తీసుకొని వచ్చివేశాము. బయలుదేరు నపుడు ఆబొందిలి, వారికి మర్యాదపూర్వకముగా తమలపాకు లిచ్చాడు. మేము కారులో బైలుదేరాము. కొంతదూరం వచ్చినతర్వాత, రాఘవేంద్రరావుగారు తమలపాకులను బైటకు పారవేశారు. నా కీచర్య ఆశ్చర్యాన్ని కల్గించింది. వా రట్లు చేయుటకు కారణం, జమీందారుగారి హాలును చూచునప్పటికే ప్రొద్దుతిరిగిపోయింది. భోజనం చేయలేదు. ఇంకా గుడివాడ చేరుకొనుటకు ఇంచుమించు 30 మైళ్లు ప్రయాణం చేయవలసి

యుండింది. ఈ కారణాలవల్ల వారికి చిరాకుకల్గి యుండవచ్చును. లేక శుచి, శుభ్రత తన అంతస్తుకు (స్టాండర్డ్) తగినట్లుగా ఆ ఆతిథేయుని యింటిలో కనపడకపోయి వుండవచ్చును. తమలపాకులు మంచివి గాకపోవచ్చును. ఏ కారణంవల్లనైనా, ఎంతో మర్యాదగా స్వీకరించిన ఆ తాంబూలాన్ని నిరసనగా పారవేయటం నాకాశ్చర్యాన్నే కల్గించింది. శ్రీ రాఘవేంద్రరావు గారు స్వతంత్రప్రవృత్తి కొంత అహంకారముతో కూడినదని చెప్పవచ్చును. రాజనీతిజ్ఞుడైనను, నిరసనకూడ చూపగల ప్రజ్ఞావంతుడు. మరియు నటనకు, తంత్రములకు విముఖుడని చెప్పుటకష్టం. సరళంగా, రంజితంగా, చాకచక్యంగా మాట్లాడు సామర్థ్యముకలవారేగాని, తీవ్రపదజాలము నుపయోగించుశక్తి కలవారుకూడ. వారు ఒక విశిష్టవ్యక్తి. మరచిపోదగినవారు కాదు.

నేను ఇన్‌కమ్‌టాక్సు డిపార్ట్‌మెంటులో 1929 ఏప్రిల్ లో జేరకముందు, నాకు ఆక్స్‌ఫర్డ్‌లో వార్డెన్‌గా నుండిన శ్రీ వెలగపూడి రామకృష్ణగారిద్వారా అక్కడక్కడ ఉద్యోగానికి ప్రయత్నించాను. నేను బ్యారిస్టరనేగాక, నా ఆక్స్‌ఫర్డ్ చదువు న్యాయ శాస్త్రసంబంధమైనది కాబట్టి మద్రాసు లా కాలేజిలో లెక్చరర్‌గా చేరాలనుకొన్నాను. అది సంభవంకాలేదు. తరువాత ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులో చేరా లనుకొన్నాను. అది కుదరలేదు. వీనికొరకు సర్ ఆర్కాటు రామస్వామి మొదలియార్‌గారితో కూడా రామకృష్ణగారు ప్రయత్నించారు. కాని ఫలితం శూన్యం. అంతకుముందు నేను స్వదేశంకు తిరిగివచ్చిన అనతికాలంలోనే ఎందుకైనా మంచిదని, సిఫార్సు ఉత్తరాలకొరకు మాకాలేజి ప్రిన్సిపాల్ జె. బెర్నార్డ్ బేకర్‌గారికి, నాట్యూటర్సు యఫ్. హెచ్. లాసన్, టి. హెచ్. టేలర్సుగార్లకు వ్రాశాను. ముందు టేలర్ గారు 1-4-27-వ తారీఖున ఆక్స్‌ఫర్డ్ బేలియర్ కాలేజినుంచి జవాబిచ్చారు. సిఫార్సు ఉత్తరం పంపించారు.

"శ్రీ యల్. వి. బి. చౌదరి నావద్ద ఆనర్సు స్కూల్ ఆఫ్ జ్యూరిస్‌ప్రూడెన్సు డిగ్రీకి ట్యూషన్ చదువుకొన్నారు. ఆయన జనరల్‌శక్తిని గురించి నాకు పెద్ద అభిప్రాయం కల్గింది.

ఇతర విషయములలో జోక్యం కల్పించుకొని చదువునందు అశ్రద్ధ చేసేవారు. లేకపోతే మూడవక్లాసుకన్నా యింకాయింకా పెద్ద క్లాసే వచ్చేది. ఆయన విషయములందు ఆసక్తి, త్వరగా అర్థముచేసుకొనేశక్తి, మిక్కిలి అభివృద్ధిచెందిన విమర్శనాశక్తిని కన్పరచారు. ఇంకాకొంత విజ్ఞానాన్ని సంపాదించినమీదట ఆయన మిక్కిలి సమర్థుడై, జయప్రదజీవితాన్ని గడపగలడనుటకు నాకు సందేహములేదు" అని వ్రాశారు. 17-5-27 తారీఖున మొదటి ట్యూటరుగారు యఫ్. హెచ్. లాసన్‌గారు గొట్టింజన్, జర్మన్ నుంచి వ్రాశారు. "శ్రీ యల్. వి. బి. చౌదరి నావద్ద ట్యూషను చదువుకొన్నాడు. కార్యాంతరమున నేను ఆక్స్‌ఫర్డ్‌ను విడిచిపెట్టి వెళ్లవలసివచ్చింది. అప్పుడు శ్రీ చౌదరిని శ్రీ టేలర్‌కు అప్పచెప్పి వెళ్లాను. ఆయన నావద్ద శ్రద్ధగానే చదివాడు. తర్వాతసంగతి నాకు తెలియదు. ఆయన ఆనర్సు డిగ్రీ తీసుకొని బ్యారిస్టరుపట్టాను పొందినట్లు విని సంతోషించాను. ఆయన లా లెక్చరర్ పదవి కోసం దరఖాస్తుపెట్టుకొంటున్నాడని తెలిసింది. సమర్థుడైన లా టీచరు కాగలడు" అని సిఫార్సుచేశారు. మా కాలేజి ప్రిన్సిపాల్ (సెన్సార్) జె. బి. బేకర్‌గారు ఆక్స్‌ఫర్డ్ 74, హైస్ట్రీటునుండి 26-4-1927-వ తారీఖున వ్రాస్తూ, "యల్. వి. బి. చౌదరి మా కాలేజీ సభ్యుడై, యూనివర్సిటీ విద్యార్థిగా 22 అక్టోబరునుండి 26 జూన్ వరకుండినాడు. మూడవక్లాసులో జ్యూరిస్‌ప్రూడెన్స్ ఆనర్సు స్కూలులో డిగ్రీ తీసుకొన్నారు. అప్పుడాయనకున్న స్థితిగతులలో, లాటిన్ భాష రానిసందర్భంలో పట్టుదలతో, ధైర్యంతో ఈ డిగ్రీని సంపాదించినందుకు సంతోషించవలసి వున్నది. ఆయన సామర్థ్యము, దృఢసంకల్పంవల్ల ఆయన జయప్రదజీవితం కొనసాగిస్తారని నేను నమ్ముచున్నాను. ఆయన ప్రవర్తన (కారెక్టర్) మచ్చలేనిదని చెప్పుటకు నేను సందేహించను" అని సెలవిచ్చారు.

పై సర్టిఫికెట్లను నే నుపయోగించుకొనలేకపోతిని. నేను ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో చేరుటకు వీరి సిఫార్సు లవసరం కాలేదు.

మా కమిషనర్ సెనెక్, ఐ. సి. యస్. గారు మొదటి ప్రపంచయుద్ధంలో, అప్పుడు కృష్ణాజిల్లాలో భాగంగా నుండిన నర్సాపురంలో సబ్ కలెక్టరుగా నుండేవారు. వారితో మా పినతాత కుమారుడు నాగభూషణంగారికి స్వల్పపరిచయ ముండినది. కాని, గుడివాడ తాలూకా పెదపాలపర్రు కాపురస్థుడు ఈదర శోభనాద్రిగారి కప్పుడు కృష్ణాజిల్లా కలెక్టరుగానుండిన వై. జి. కాంబెల్ గారితో ఎక్కువ పరిచయం కలిగింది. కారణం, శోభనాద్రిగారు ప్రథమ యుద్ధసమయంలో, ఇండియన్ సిపాయి సైన్యంలో చేర్చటానికి రిక్రూటింగ్ ఆఫీసరుగా ఎక్కువగా తోడ్పడ్డారు. అందువలన కాంబెల్ గారు, శోభనాద్రిగారియం దభిమానం కలిగియుండినారు. నా పినతండ్రి నాగభూషణంగారు శోభనాద్రిగారికి కబురుపంపి, వారు నాకు తోడ్పడునట్లు ఏర్పాట్లుచేశారు. శోభనాద్రిగారు, నేను మద్రాసువెళ్లి, కాంబెల్ గారిని దర్శించాం. కాంబెల్ గారు సెనెక్ గారికి ఉత్తరం వ్రాసి మాచేతి కిచ్చారు. మేమిద్దరం సెనెక్ గారి దర్శనార్థం మద్రాసు రాయపురంలోని ప్రాత హైకోర్టు బిల్డింగులో వున్న వారి ఆఫీసుకు వెళ్లాం. మాపేర్ల (విజిటింగు) కార్డులను వారికి పంపాము. శోభనాద్రిగారి నొక్కరినే రమ్మన్నారని కబురువచ్చింది. శోభనాద్రిగారిని సెనెక్ గారు కూడా ఎరుగుదురు. కొంతసేపైన తర్వాత, నేను కూడా లోపలికి వెళ్లాను. వారు, ప్రస్తుతానికి ఖాళీలు లేవని, ఖాళీలు రాగానే ఉద్యోగములోనికి తీసుకొంటానని మాట యిచ్చారు. పై చెప్పినట్లు, వారిపేరుమీదుగానే నేను ఇన్ కమ్ టాక్సు డిపార్టుమెంటులో చేరాను. వారు సెలవునుండి తిరిగి వచ్చి ఆఫీసుకు వచ్చిన మొదటిరోజున నన్ను పిలిపించారు. నేను లోపలి కడుగుపెట్టిన వెంటనే, నావంక గుర్రుగా చూచి మీరు అసిస్టెంటు ఇన్ కమ్ టాక్సు ఆఫీసరుగా చేరారా అని ప్రశ్నించారు. నేను తొట్రుపాటు పడ్డాను. నిలద్రొక్కుకొని, ఆ చిన్న ఉద్యోగాన్ని మీ పేరుమీదుగానే నాకు యిస్తామన్నారు. రెండు

మాసాలలో ప్రొబేషనరి ఆఫీసరుపదవి నిస్తామని మాటిచ్చారు. మీపేరు చెప్పి యిచ్చినదానిని నేను తిరస్కరించలేకపోయాను. రెండుమాసములేకదా ఎట్లో తలఒగ్గవచ్చునని ఒప్పుకొన్నాను అని చెప్పాను. దానితో వారు కొంత సమాధానపడ్డారు. సెనెక్ గారుకూడా ఆక్స్‌ఫర్డ్ వారే. వారు న్యూకాలేజి విద్యార్థి. అందువలన ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్ చిన్నపదవికి ఒప్పుకోవటం, వారికికూడా నామోషి అనిపించింది.

పై విధంగా నా రక్తబంధువు, నా పినతాత కుమారుడు నాగభూషణంగారివల్లనే నేను ప్రభుత్వోద్యోగంలో చేరాను. ఉద్యోగంలో చేరిన తర్వాత శ్రీ వై. జి. కాంబెల్ గారికి కృతజ్ఞత తెల్పుచూ వ్రాశాను. తదనంతరం వారు గవర్నర్ గారి కార్య నిర్వాహకసంఘ సభ్యులుగా నియమింపబడినప్పుడు వారి నభినందించుచు ఉత్తరం వ్రాశాను. వారు ట్రావెన్ కూర్ స్టేట్ పీర్ మడె నుండి 26-12-1929 తారీఖున జవాబు వ్రాశారు. వారప్పుడక్కడ కొన్నిరోజులు విశ్రాంతి తీసుకొంటున్నారు. వారి ఉత్తరంలో మీరు ఇన్ కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో చేరినందుకు మిక్కిలి సంతోషం. త్వరలోనే మీ పదవి ఖాయమవుతుందని నమ్ముచున్నాను అని వ్రాశారు. నూతనవర్ష శుభాకాంక్షలు కూడా పంపారు.

నేను తిరిగి వివాహం చేసుకోవాలనే ఉద్దేశంతో ఉండినట్లు పైన చెప్పాను. ఆ ఉద్దేశం నిశ్చయంగా మారింది. నేను ప్రొబేషనరి ఆఫీసరుగా పదవిని స్వీకరించిన కొలది రోజులకే, అనగా 23-6-1929 తారీఖున కృష్ణాజిల్లా నూజివీడు రైల్వేస్టేషను దగ్గరగావున్న ఏలేరు గ్రామ నివాసి గోగినేని సీతారామయ్యగారి కుమార్తెను వివాహం చేసుకోవాలనే ఉద్దేశంతో బెజవాడకు వచ్చాను. సీతారామయ్యగారు, ఆయన తమ్ముడు, ఆయన పినతండ్రి వచ్చి కలసికొన్నారు. నాతరఫున పర్వతనేని భూషయ్యగారు, మెర్నేని లక్ష్మీనారాయణగారు, నూతక్కి రామశేషయ్య

గారు, డాక్టరు ముళ్ళపూడి రంగయ్యగారు మధ్యవర్తులుగా మాట్లాడారు. కాకుమాని లక్ష్మయ్యగారు, సూరపనేని పురుషోత్తం గారుకూడా వున్నారు. దీర్ఘంగా ఆలోచించిన తర్వాత, పినతండ్రి ఆ పిల్లను నా కిచ్చుట కొప్పుకొన్నాడు. శ్రావణమాసంలో బెజవాడలోగాని, ఏలేరులోగాని పెళ్లిజరిగే పద్ధతి. కొద్దిరోజులలో వచ్చి పిల్లను చూస్తానని చెప్పాను.

8-7-1929 తారీఖున, మమ్ములను తీసికొనివెళ్లటానికి వచ్చిన పిల్లతండ్రి గోగినేని సీతారామయ్యగారితో కలసి, నేను, మెర్నేని లక్ష్మీనారాయణగారు, నూతక్కి రామశేషయ్యగారు ఏలేరు వెళ్లాం. పిల్లను చూచాం. సుమారు 18, 19 ఏళ్లు ఉంటవి. బాలవిధవ. చిన్నతనములోనే పెళ్ళిచేయగా భర్త పోయాడు. చామనచాయకంటె ఒకపిసరు తక్కువేమో. మొత్తంమీద నలుపుక్రిందకు వస్తుంది. కాని, ముఖకవళికలు, పొందికలు మంచివే. పేరు చాలాపొడుగు. కమలమోహిని జగపతిరాజ వరలక్ష్మీ సంపూర్ణవిలాసం. కమలని పిలుద్దా మనుకొన్నాను, శుభలేఖలలో కమలాదేవి అని అచ్చువేయించ వచ్చును. ఆవూరు వెళ్లటం సాయంత్రానికిముందు వెళ్లాం. శ్రావణశుద్ధ పంచమి శుక్రవారం అనగా 9-8-29 నాడు వివాహం జరుపుకొందామని తాత్కాలికంగా అనుకొన్నాం. ఆరాత్రి అక్కడుండి మరునా డుదయం బయలుదేరివచ్చాం.

మాయిద్దరి తమ్ముళ్లపేర వాయిదాలమీద చెల్లింపు షరతులతో వ్రాసిన ఇరువైఐదువేల రూపాయలు రెండు బాండులకు, పదివేల రూపాయలిచ్చి చెల్లువ్రాయించటానికి నాతమ్ములిద్దరు ఒప్పుకొన్నారు. ఈ పదివేలరూపాయ లివ్వవలసిందని పిల్లతండ్రి సీతారామయ్యగారిని అడుగగా, వారు ఒప్పుకొన్నారు. ఆషరతుమీదనే పెండ్లి శ్రావణమాసంలో జరుపుకొందా మనుకొన్నాం. కాని సీతారామయ్యగారు ఆడబ్బిచ్చే స్థితిలో లేరు. ఆరోజుల్లో ధవబాలికల పెళ్లిళ్లు అరుదు. పైగా, నావంటి ఉద్యోగస్థుడు

దొరకటం కష్టం. అందువల్ల కక్కుర్తిపడి డబ్బిస్తామన్నారుగాని, తీరా డబ్బుకు కటకటపడ్డారు. అందువల్ల 17-10-29-వ తారీఖున కమలచేత ఉత్తరం వ్రాయించారు. తనతండ్రి పదివేలివ్వలేడని, నాలుగువేలుమాత్రమే యివ్వగలడని, తతిమ్మాడబ్బు మిత్రులు భూషయ్య, లక్ష్మీనారాయణగార్లనుండి అప్పుగా తీసుకోమని వ్రాసింది. తర్వాత 27-10-29-వ తారీఖున సీతారామయ్యగారు మద్రాసుకు రాగా, తమ్ముళ్లఅప్పులు తీర్చందే వివాహం చేసుకోలేను, కాబట్టి పదివేలు యివ్వవలసే ఉంటుందని చెప్పాను. సరే, ఆలోచించుకొని మిమ్ములను బెజవాడలో నవంబరు 10-వ తారీఖున కలసికొని ఏసంగతి చెప్పుతానని వెళ్లిపోయాడు. నేను మద్రాసునుండి బయలుదేరి 10-వ తారీఖు మధ్యాహ్నం బెజవాడకు చేరుకొన్నాను. వారు రాలేదు. కాని 17-11-29-వ తారీఖున నా పెదతండ్రి మనుమడు లింగం వెంకటశివుడు వివాహానికి వెళ్లి తిరిగివస్తూ బెజవాడస్టేషనులో దిగినప్పుడు, సీతారామయ్యగారు, పిల్లమేనమామ ఆలూరి సీతారామయ్యగారు స్టేషనులో నన్ను కలసికొన్నారు. మేమందరం కలసి 2-వ క్లాసు వెయిటింగురూములో కూర్చుని మాట్లాడుకొన్నాం. చివరకు వారు కోరింది, తక్కువవడ్డీకి రు. 5000 లు పర్వతనేని భూషయ్యగారితో అప్పు యిప్పించండి. 22-వ తారీఖున నూజెళ్లలో భూషయ్యగారిని కలసికొంటాం, వారు ఒప్పుకొంటే వివాహం ఖాయం, లేకపోతే ఆలోచించి చెప్తాం అన్నారు. నేను మద్రాసు తిరిగివెళ్లి 19-వ తారీఖున భూషయ్యగారికి అప్పు యిస్తే మిక్కిలి సంతోషిస్తానని వ్రాశాను. భూషయ్యగారు, సీతారామయ్యగారికి అప్పు యివ్వలేదు. సీతారామయ్యగారంతటితో ఆప్రస్తావన మానివేశారు. ఈమధ్య 1967 సంవత్సరం నవంబరులో ఈవూరుకు ఏదో సంబంధంకొరకు వచ్చిన పిల్ల ఇంకొక మేనమామ, ఆలూరి సూర్యనారాయణగారు, ఆప్రస్తావన తెచ్చి నాకు జ్ఞాపకపర్చారుగాని, అప్పటికి ఇప్పటికి పిల్లతండ్రి గోగినేని సీతారామయ్యగారినిగాని, ఆపిల్ల కమలనుగాని నేను చూడలేదు. ఆమెను తర్వాత కొద్దికాలానికి, కోఆపరేటివ్

డిపార్టుమెంటులో పనిచేస్తున్న కమ్మయువకుని కిచ్చి పెళ్ళిచేశారట. ఇద్దరు పిల్లలుకల్గారని సూర్యనారాయణగారు చెప్పారు.

ఈలోపుగా, నా భార్యతరఫున ఆమెను తిరిగి స్వీకరించవలసిందని ఒత్తిడి ప్రారంభమైంది. నేను రాయపేటలోని 20, ముత్తు మొదలిస్ట్రీటులో వున్నప్పుడు, 1928 మార్చారంభంలో నన్ను నాభార్య, నాషడ్డకుడు, చెరుకూరి వియ్యమ్మ మొదలగువారు కలసికొనటమేగాకుండా, నేను 35 పైక్రాఫ్ట్సు మొదటివీధిలో నున్నప్పుడు 1929-వ సంవత్సరము మార్చి ఏడవ తారీఖున, చెరుకూరి వియ్యమ్మగారిని తీసుకొని నాభార్య తిరిగి వచ్చింది. నా కుమార్తె వజ్రాంబ వివాహానికి సంబంధాలు చూస్తున్నామని, మీరు రావలసిందని కోరారు. వస్తానన్నాను. కాని, తిరిగి నా భార్యను స్వీకరించటానికి నేను ఒప్పుకోలేదు. పిమ్మట 1929 జులై 25-వ తారీఖున మా పినతాత కుమారుడు లింగం నాగభూషణంగారిని, నా తమ్ముడు సత్యనారాయణను, నా పెదతండ్రి ఆదినారాయణగారి కుమారుడు వీరభద్రుడుగారిని, నా చెల్లెలు భర్త నిమ్మగడ్డ దుర్గానాగేశ్వరుడుగారిని మా ప్రాతబంధువు గుత్తా దత్తుడు వెంకటరత్నంగారిని వెంటపెట్టుకొని నా భార్య, కుమారులతో, నా షడ్డకుడు సత్యనారాయణ పైక్రాఫ్ట్సు స్ట్రీటుకు వచ్చాడు. వారెంత బలవంతపెట్టినా, నేను ససేమిరా అన్నాను. వచ్చినవారు మరునాడుకూడా నన్ను కలసికొన్నారు. మూడవనాడు నా భార్య నాతో, నేను అనుకూలంగా వుంటాను, మీ తమ్ముళ్లకు వ్రాసిన బాండులు తీర్చివేస్తాను, పెదసనగల్లు ఆస్తి మనకు చాలా అండగా వుంటుంది. మీరు విధవను చేసుకొంటే, మనపిల్లలకు సంబంధాలు రావు. మీ రంతగా కావాలనుకొంటే ఏ స్త్రీనైనా దగ్గరకు తీసుకోండి, అని చెప్పింది. నాకామెమాటలు నచ్చలేదు. ఒకనెల జరగకముందే, 1929 ఆగష్టు 23-వ తారీఖున పర్వతనేని భూషయ్యగారు పనిగట్టుకొనివచ్చారు. వారు నాతో మీ భార్య తనవంతు యావదాస్తిని భూములు, డబ్బు వగైరా, మీపేర దఖలు వ్రాస్తానంటున్నది. చాలా వినయ విధేయతలతో ప్రవర్తిస్తా నంటున్నది. నేను మెర్నేని

లక్ష్మీనారాయణగారు, మీ శ్రేయస్సు కోరేవారం కదా. మీరు మీ భార్యను స్వీకరించవలసిందని కోరుచున్నాం అని చెప్పారు. నా యిబ్బందికాలంలో నాకు సాయమందించిన భూషయ్యగారి మాట త్రోసివేయలేక, వారితో, ఆ షరతులమీద ఒప్పుకొంటాను, ఏవిధంగా ఆ షరతులను పూర్తిచేయాలో మీకు విడిచిపెట్టాను అని చెప్పాను. తర్వాత, 1929 సెప్టెంబరు 12-వ తారీఖున భూషయ్యగారుత్తరం వ్రాస్తూ, మొదట వారు చెప్పిన షరతులకు వారిప్పుడొప్పుకోవటంలేదు వగైరా వ్రాశారు. నేను నా అసమ్మతిని తెల్పాను. ఈవిధంగా కొంతకాలం గడచిన తదనంతరం, నేను 1929 డిశెంబరు 20-వ తారీఖున, మద్రాసు నుంచి బెజవాడ చేరుకొన్నాను. స్టేషనులో నా పెదతండ్రి కుమారుడు లింగం వెంకటకృష్ణయ్య కలసికొన్నాడు. అతడు, నేను కలసి బెజవాడలోని భూషయ్యగారిల్లు హిమాలయమహల్‌కు వెళ్లాం. అక్కడ మా కుటుంబంవారు, పెదసనగంటికి సమీప గ్రామం భట్లపెనుమర్రు నివాసి, ప్రాతస్నేహితుడు చలసాని వెంకటప్పయ్య మొదలైన కొంతమంది నన్ను కలసికొని, మీ భార్య, అత్త వగైరాలు వచ్చారు, మీబాండుల అప్పు పదివేలు తీర్చివేస్తా మన్నారు. మీ భార్యవాటా సగం ఆస్తిని మీ అత్తగారు మీ భార్యపేర దఖలువ్రాస్తామన్నారు. ఒప్పుకోండి అని గట్టిగా పట్టుబట్టారు. గోగినేని సీతారామయ్యగారు జారిపోయారు. నాకు ఇబ్బందిలో తోడ్పడిన భూషయ్యగారు, నాకు మిక్కిలి దగ్గరస్నేహితుడైన లక్ష్మీనారాయణగారు, మా జ్ఞాతులు, నా ఇతర స్నేహితుల ఒత్తిడి ఎక్కువైంది. ఆ ఒత్తిడికి తట్టుకోలేక, అంగీకరించాను.

ఆ సాయంత్రమే (20-12-1929) బయలుదేరి, బొమ్ములూరు వెళ్ళి మాజ్ఞాతులలో ఒకరింట్లో పెళ్లికి హాజరయ్యాను. ఆమరునాడు గుడివాడకు వెళ్లి అక్కడ మామేనమామ త్రిపురనేని రామశాస్త్రులుగారి రెండవకూతురు లక్ష్మమ్మను మా మారుటి తమ్ముడు శివరామకృష్ణయ్య కిచ్చి చేసిన పెండ్లి చూచుకొని,

22-వ తారీఖున బొమ్ములూరుకు పెళ్ళికూతురుతో తిరిగి వెళ్ళాను. ఏ కారణంవల్లనో సజ్జనోత్తములు, సాత్వికసంపన్నులు (శ్రీ) ఆరికపూడి సోమనాధరావుగారు నూజెళ్ళకు వెళ్ళగా, అక్కడివారు వారిని బొమ్ములూరుకు పంపించారు. ఆయనను సత్కరించి ఉపాహారం వగైరా యిచ్చి సాగనంపాను. పిమ్మట, 25-వ తారీఖున నేను, పర్వతనేని భూషయ్యగారు, లక్ష్మీనారాయణగారు, లింగం వీరభద్రయ్యగారు, భూషయ్యగారికారులో పెడసనగల్లు వెళ్ళి, అక్కడ మాటమంతి జరుపుకొని, మరునాడు చల్లపల్లికి వెళ్ళి, చల్లపల్లి జమీందారుగారు (శ్రీ)మంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్‌గారి పట్టాభిషేక సంరంభాన్ని బైటనుండి చూచాం. ఈ పట్టాభిషేకం విశేషం, శతావధాని చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారు జమీందారుగారిని స్వయంగా ఆశీర్వదించటం. తండోపతండాలుగా ఎస్టేటుప్రజలు గుమిగూడటంవల్ల, అడ్సుమిల్లి గోపాలకృష్ణయ్యగారివంటి వారికికూడా లోపలికి వెళ్లటానికి యిబ్బంది కలిగింది. కొంతసేపటికి పెడసనగల్లుకు తిరిగివెళ్ళి, సంప్రదింపులు పూర్తిచేసుకొన్నాం. బాండుల అప్పులు తీర్చటానికి భూషయ్యగారికి, మా అత్తగారు పదివేల రూపాయల ప్రోనోట్లు బదిలీచేసింది. ఆ పదివేలను నాతమ్ముళ్ళకిచ్చి, ఆ రెండు బాండులను రద్దుచేయించుకోవటం జరిగింది.

నేను 1929 సంవత్సరము ఏప్రిల్ 8-వ తారీఖునగాని ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో చేర లేదుకదా. నే నింగ్లండునుండి తిరిగివచ్చిన రెండు సంవత్సరాలు పైచిల్కు కాలంలో, నాకు సంభవించిన సంఘటనలు, అనుభవాలు చాలావరకు పైన చెప్పియున్నాను. న్యాయవాదివృత్తి సాధనంలోకన్నా ఉద్యోగప్రయత్నంలోను, పెళ్లిప్రయత్నంలోను, బంధుమిత్రులను కలసికొనటంలోను చాలా కాలం ఖర్చైపోయింది. ఆ కాలంలోనే, ప్రసిద్ధ న్యాయవాదులు ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు, చింతగుంట రాఘవరావుగారు, పలగాని చంద్రారెడ్డిగారు, పప్పు సోమసుందరంగారు, గంటి లచ్చన్నగారు, అడ్సుమిల్లి లక్ష్మయ్యగారు, వగైరా న్యాయవాదులు పరిచయమైనారు. నేను మద్రాసు

లోని ప్రఖ్యాత న్యాయవాదులందరిని చూచానుగాని, వారితో ముఖపరిచయమైనవారిలో, అప్పుడు గవర్నమెంటు ప్లీడరుగా నుండిన పాకల వెంకటరమణారావునాయుడుగారు, వారి కుమారుడు రాజమన్నార్‌గారు, వారి అల్లుడు కోకా సుబ్బారావుగారు, వారి ఛేంబర్స్‌లో పనిచేస్తుండి తర్వాతకాలంలో హైకోర్టు జడ్జి అయిన సోమసుందరంగారు వగైరా ఉండినారు. అప్పుడే బొల్లిని మనవాళ్లచౌదరిగారు, బొల్లిని భక్తవత్సలంనాయుడుగారు, వారి తమ్ముడు పార్థసారథిగారు పరిచయమైనారు.

వీరుగాక పింజల సుబ్రమణ్యంశెట్టిగారు, గానాల రామమూర్తిగారు, ఆచార్యగారు, మరుపూడి కోదండరామరెడ్డి గారు వంటి పాత్రికేయులు నన్ను ఎరుగుట సంభవించింది. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారిని, వారి బావ మరది మావూరు కరణంగారి కుమారుడు మల్లాప్రగడ రామచంద్ర రావుగారిని దర్శించితిని. ఇంతేగాక, త్రివేణి అను పేరుతో ద్వైమాసపత్రికను ఇంగ్లీషులో స్థాపించిన శ్రీ కోలవెన్ను రామ కోటేశ్వరరావుగారి పరిచయభాగ్యం కల్గింది. వారు 1928 లో త్రివేణి పత్రికను అత్యున్నతస్థాయిలో నడిపించటం మొదలు పెట్టారు. వివిధ దేశభాషల్లో నిష్ణాతులైన పండితుల, కవుల, శాస్త్రజ్ఞుల రచనలను ఆంగ్లీకరించి ప్రచురించుటయేగాక, ప్రవీణులు, ప్రముఖులైన వారి మౌలికరచనలను అందులో ప్రచురించేవారు. నేను 1928 జూనులో ఏకబిగిని వ్రాసిన ఇంగ్లీషు వ్యాసాలను నాల్గింటిని, వారిప్రోత్సాహంవలన, 1928–29 సంవత్సరాలలో త్రివేణికి పంపాను. వారు దయతో వానిని ప్రచురించారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు స్థాపించిన ఆంధ్ర దినపత్రికతోబాటు నడుపుచుండిన 'భారతి' అను మాస పత్రికలో, నేను వ్రాసిన మూడు తెలుగు వ్యాసరచనలను అర్ధాంగి, అర్ధనారీశ్వరుడు, గృహలక్ష్మి అనువాని నాకాలం లోనే ప్రచురించారు. పింజల సుబ్రమణ్యంశెట్టిగారి ఆధ్వర్యాన, పండిత గానాల రామమూర్తిగారి సంపాదకత్వాన వెలువడు చుండిన 'సమదర్శిని' ఉగాది సంచికలో వివాహవిచ్ఛే[illegible]

పాశ్చాత్యస్త్రీలు అనే రెండువ్యాసాలు ప్రచురింపబడ్డాయి. ఆ రోజుల్లో, మరుపూరు కోదండరామ రెడ్డిగారు సమదర్శిని పత్రికలో పని చేస్తూండేవారు. ఆచార్య అనేవారు చిత్రగుప్త అనే పత్రికను నడుపుచుండేవారు. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు గారు, శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు జాతీయ వాదులై, ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకు సంబంధించిన 'వారు' గా వుండగా, సమదర్శినికి సంబంధించిన పింజల సుబ్రమణ్య శెట్టిగారు, గానాల రామమూర్తిగారు వగైరా బ్రాహ్మణేతరోద్యమమునకు సంబంధించిన జస్టిస్ పార్టీకి చెందిన వారు. నేను భారతిలో ప్రచురించిన మూడురచనలు పాఠకుల కామోదయోగ్యంకాగా, సమదర్శిని వార్షికసంచికలలో ప్రచురించిన రెండు వ్యాసాలు కొంతమంది దాడికి గురిఅయినవి. మొదట ప్రచురించిన 'వివాహవిచ్ఛేదం' మావూరు, అంగలూరు వంటి గ్రామాల్లో కొంతమంది సనాతనులలో వ్యతిరేక భావం కల్గించినా, దాని నంతగా చెప్పుకోవలసిందికాదు. కాని 'పాశ్చాత్యస్త్రీలు' మద్రాసు పాఠకులలో కొంత చలనం కలిగించింది. మిస్ మేయో అనే అమెరికన్ స్త్రీ " మదర్ ఇండియా " అనుపేరుతో ఇండియానుగురించి ఛడామడా వ్రాసింది. ఆ పుస్తకాన్ని మహాత్మాగాంధి మురుగుకాల్వలను తనిఖీచేసే ఇన్‌స్పెక్టర్ రిపోర్టు అన్నారు. నా 'పాశ్చాత్యస్త్రీలు' రచనలో ఎత్తిచూపిన భారతీయ గ్రామీణజీవితంలోని లోపాలను, ఎత్తి చూపిన విధానాన్ని ఆవిధంగానే వర్ణించి, నన్ను మిస్ మేయో భర్త అని విమర్శన కొందరువ్రాశారట. ఆ విమర్శకు జవాబు వ్రాయండని గానాల రామమూర్తగారు నన్ను కోరారు. నేను జర్నలిస్టునుగాను, రాజకీయాల్లో ప్రవేశంలేదు. నా రచనలు నా జీవనోపాధికి కాదు, నా అనుభవాన్ని నాకు తోచిన విధంగా పాఠకులకు అందజేశాను. కొందరు పాఠకులకు నా భావాలు నచ్చకపోతే, నేను చెప్పవలసిందేమీ లేదు. వారి దూషణకు, నా సమాధానాలు అనవసరం అని చెప్పాను. అసలావిమర్శనలనే నేను చూడలేదు. భారతిలో

ప్రచురించబడ్డ వ్యాసాలు పాఠకలోకాన్ని మెప్పించినవానిలో ఉత్తమమైన దనుకొన్న "గృహలక్ష్మి" లో, మాటలసందర్భంగా వకీళ్ల గుమాస్తాలను విమర్శించాను. అది మద్రాసు తెలుగు న్యాయవాదుల గుమాస్తాల మనస్సులకు కష్టం కల్గించిందట. అందరిని మెప్పించటం బ్రహ్మకుకూడా సాధ్యంకాదుకదా! త్రివేణిలో పడిన నాఇంగ్లీషు రచనలను శ్రీ కె. యస్. వెంకటరమణి వంటివారు బాగున్నవన్నారట. ఆక్స్ఫర్డ్ జీవితవిధానం అని వ్రాసిన వ్యాసాన్ని కొంతమంది స్నేహితులు మెచ్చుకొన్నా, కొంత మంది వట్టి మాటలబూటకం అన్నారు. బాగున్నవంటే నేనుప్పొంగిపోలేదు, బాగాలేవంటే నేను నీరసంకారిపోలేదు.

అడుసుమిల్లి లక్ష్మయ్యగారు కృష్ణాజిల్లా పొణుకుమాడు గ్రామానికి చెందిన వెంకటరత్నంగారి ప్రథమపుత్రుడు. వారు న్యాయవాదవృత్తి నవలంబించి, మద్రాసు మైలాపూరులో నుండుచుండేవారు. మిక్కిలి శ్రద్ధతో న్యాయశాస్త్ర గ్రంథాలను, జర్నల్సును పఠించి, హైకోర్టులు, ప్రీవికౌన్సిల్ ఇచ్చిన తీర్పులను పూర్తిగా చదివి, సూత్రాలను, సిద్ధాంతాలను, కేసు లా ను బాగుగా తెలుసుకొన్నవారు. తనకు వప్పగించిన కేసును అతిజాగరూకతతో చదివేవారు. శాస్త్రజ్ఞానంతోబాటు, కేసులోని విషయాలను తెలుసుకొనటంలో దిట్ట. వారే యితరవ్యాసంగాలను పెట్టుకొనక, వృత్తికొరకే బ్రతుకుచుండినట్లు, రాత్రింబగళ్లు శ్రమించేవారు. అందువల్ల జూనియర్ న్యాయవాదుల్లో మంచి స్థానం సంపాదించుకొన్నారు. వారికి వాగ్ధాటి, వాదింపునేర్పు, కేసును న్యాయమూర్తికి నచ్చజెప్పే కౌశలం తక్కువ. అందువల్ల సీనియర్ స్థానానికి చేరుకోలేకపోయారు. పైగా, పిన్నవయస్సులోనే చనిపోయారు. ఆయువుండి అనుభవమెక్కువైనకొలది, మిక్కిలి రాణింపుకువచ్చేవారు.

వారిహృదయం మంచిది. మన్నన మర్యాద లెక్కువగా కలవారు. క్రొత్తగా న్యాయవాదవృత్తి నవలంబించినవారి కండదండ లిచ్చేవారు. స్వకులీయులందు సహజంగా మిక్కిలి అభిమానం చూపేవారు. నేను మద్రాసుకు వెళ్లిన క్రొత్తలో వారు నన్నాదరించి మూడునాలుగురోజులు వారిఅతిథినిగా అట్టిపెట్టుకొన్నారు.

అప్పుడప్పుడు వారింటికి వెళ్లుచుండేవాడను. అక్కడ వారితండ్రి వెంకటరత్నంగారిని, తమ్ముడు పున్నయ్యగారిని కలసికొనుచుండేవాడను. వారు కొందరు జూనియర్స్‌ను తయారుచేశారు. వారిలో ముఖ్యులనుకొందును, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జిగా నుండుచున్న శ్రీ ఆవుల సాంబశివరావుగారు.

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు, శ్రీ చింతగుంట రాఘవరావుగారప్పటికే సీనియర్ అడ్వొకేట్సుగా తయారయ్యారు. సత్యనారాయణరావుగారు తొందరపాటులేక కేసును చక్కగా అర్థంచేసుకొని, జాగ్రత్తగా చదివి, సామరస్యంగా లేక సమతల స్థితిలో వాదించేవారు. రాఘవరావుగారు కొంతఒడుదుడుకులు గలవారని వాడుక. అయితే మిక్కిలిచురుకుదనం, మంచివక్తృత్వం, డాంబికంతోగూడిన నేర్పు గలవారని ప్రసిద్ధి. వారిద్దరు హైకోర్టు జడ్జీలైనారు. పైగా సత్యనారాయణరావుగారు లా కమిషన్‌కు చాలాసంవత్సరాలు అధ్యక్షులుగా నుండినారు. రాఘవరావుగారింకను జీవించవలసియుండినకాల ముండగనే పరలోకప్రాప్తులైనారు. నెల్లూరుజిల్లావారగు శ్రీ పలగాని చంద్రారెడ్డిగారితో పై వారిద్దరి కంటె, నాకు పరిచయ మెక్కువ. వారప్పటి కింకను సీనియర్ స్థాయికి చేరుకోలేదు. వీరు ముగ్గురు మైలాపూరులో శ్రీ అడుసుమిల్లి లక్ష్మయ్యగారింటికి దగ్గరఇండ్లలో ఉండేవారని గుర్తు. వారి నప్పుడప్పుడు దారిలో వెళ్లుచు చూచేవాడను, ముఖ్యంగా చంద్రారెడ్డిగారిని. వీరుగాక శ్రీకాకుళంజిల్లా శ్రీకూర్మంకు చెందిన వి. గోవిందరాజాచార్యులుగా రుండేవారు. వారు మిక్కిలి సమర్థులు. న్యాయశాస్త్రమునం దారి తెలిసినవారేగాక, ఇంగ్లీషుభాషాప్రకర్షులు. వారిరచన లప్పుడు త్రివేణిలో ప్రచురింపబడేవి. ఆ భాషాసౌష్ఠవం, అసందిగ్ధమైన వివరణ, విషయప్రపూర్ణత పాఠకులకు ఇతరులనుండి అరుదుగా లభ్యమౌతుంది. వారు హైకోర్టు జడ్జిగా పెద్దపేరుపొంది, జడ్జియైన కొలదికాలానికే దేహయాత్ర చాలించారు.

శ్రీ బొల్లిని భక్తవత్సలంనాయుడుగారు మిక్కిలి మాటకారి. చమత్కృతిగా గంటలకొలది మాట్లాడే శక్తిగలవారు. చురుకైన బుర్రేగాని ఎందుకో న్యాయవాదిగా రాణించలేదు. తర్వాత

చాలాసంవత్సరాలు రంగూన్‌లో న్యాయవాదవృత్తిని కొనసాగించి, కొన్ని సంవత్సరాలక్రితం మద్రాసుకు తిరిగివచ్చి లాయడ్సురోడ్డులో, వారి స్వగృహంలో స్థిరపడిపోయారు. వారితమ్ముడు పార్థసారథి నాయుడుగారు న్యాయవాదిగా అక్కడక్కడ ప్రాక్టీసుచేసి, కొంతకాలం తిరుపతిలోను, చిత్తూరులోను వృత్తిని కొనసాగించి చనిపోయారు. వీరు చిత్తూరుజిల్లా జోలింగర్ ప్రాంతానికి చెందిన కమ్మనాయుళ్లు. వీరి పినతండ్రి కుమారుడు మునవాళ్లచౌదరిగారు 'లా' బాగా తెలిసినవారైనా, వాదించగలశక్తి గలవారైనా మరీ అంతపైకి రాలేదు. వారు మద్రాసులో నుండినప్పుడు నా భార్య కుటుంబవారసత్వం కేసులో కొంతపనిచేశారు. తర్వాత, హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాదిగా నుండి ఇప్పుడు రిటైరై తనవలె న్యాయవాదవృత్తిని చేబట్టిన కొడుకు వద్ద వుంటున్నారట.

ఇక శ్రీ గంటి లచ్చన్న, శ్రీ పప్పు సోమసుందరంగార్ల విషయ మంతగా తెలియదుగాని, వారు పెద్దలని సీనియర్ ఆంధ్ర న్యాయవాదులని నాకెంతో గౌరవం. వారిద్దరు స్ఫురద్రూపులు, వ్యక్తిత్వం గలవారు. అప్పటికే వారికి వయస్సు మళ్లింది. శ్రీ లచ్చన్నగారి బుర్రమీసాలు తెల్లగా మెరుస్తుండేవి. తెల్ల తల పాగతో వారి భారీవిగ్రహం ఆకర్షణీయంగా వుండేది. శ్రీ సోమసుందరంగారితో నాకెక్కువ పరిచయం, కొంతచనువు.

మా యస్. దొరస్వామి అయ్యర్ గారివిషయం పైన చెప్పి యున్నాను. వారు సామాన్యఎత్తుకంటె ఎక్కువపొడుగు, మధ్య రకం లావు, ప్రశాంతమైన సమత్వంగల ముఖం. వర్తన నెమ్మది. మాట మృదులం. ఆయ నొక ఉత్తమపురుషుడు. వారి జూనియర్స్‌లో రాజగోపాలం అనే బక్కపలచని,పొడుగుపాటి అయ్యంగారుండేవారు. చూడటంతోనే అయ్యంగారు కులస్థుడనితోస్తుంది. మంచి శరీరవర్ణం, కోటేరువంటి ముక్కు, కోలముఖం, తగినట్లున్న ఫాలం, కళ్లు, చెంపలు. వారిని చాలాసంవత్సరాల తర్వాత నా ఉద్యోగవిరమణానంతరం, మద్రాసు పూనమల్లి హైరోడ్డులో కలసికొని, క్షేమసమాచారా లడిగి తెలుసుకొన్నా. వారి వల్లనే అప్పటి దొరస్వామిఅయ్యర్ గారి మద్రాసుఉనికి తెలుసుకొన్నాను.

శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారిని, వారి మైలాపూరు నివాసభవనం 'శ్రీ బాగ్' లో కలసికొనలేదుగాని, వారి తంబుచెట్టివీధి 'ఆంధ్రపత్రిక' కార్యాలయంలో రెండుమూడు సార్లు కలసికొన్నాను. నేను వారిమామగారి స్వగ్రామం గుడివాడతాలూకా బొమ్ములూరువాడ నని చెప్పాను. వారాదరించి, నా తెలుగు వ్యాసాలను వారి భారతి మాసపత్రికలో ప్రచురిస్తామన్నారు. వారితో ఎక్కువ మాట్లాడటానికి సావకాశమే కల్గలేదు. నిరంతరం, ఎడతెగకుండా, వచ్చేవారు పోయేవారు. యాచకులుకూడా జాస్తియే. వారి వితరణ పేరొంది, వారిని విశ్వదాతనుగా జేసింది. వారి వ్యక్తిత్వం, విశిష్ఠత కలదని జగమెరుగును. వారి దేశభక్తి, త్యాగం అనుపమానం. కాంగ్రెసు ఆంధ్ర అగ్రనాయకులలో ప్రథమస్థానం లోనివారు. వారికి గాంధిమహాత్మునియందు అపరిమిత పూజ్యభావం. గాంధిగారొకసారి వారింటికి వెళ్లగా, ఎదురుగా వచ్చి, పైపంచెను నడుముకు బిగించి, దేవునివిగ్రహంముందువలె, దాసోహం అనుసట్లుగా, సాష్టాంగప్రణామం చేసినారట. వారు సహజగంభీరులు, మితభాషి. వ్యాపారదృష్టి గలవారైనా, కరుణార్ద్రహృదయులు, మనస్సును నొప్పించని మర్యాదస్తులు, కార్యచతురులు. వారి ఆంధ్రపత్రిక సంపాదకీయం పైన ముద్రింపబడు మహాభారతంలోని పద్యం "ఒరులేయవియొనరించిన నరవర యప్రియము తనమనంబున కగు, దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్" వారి న్యాయబుద్ధిని, ఆ ధర్మాన్ని తెల్పుతుంది.

శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి స్వభావం మిక్కిలి సున్నితమైనది. వారిహృదయం మెత్తనిది. ఆమెత్తని హృదయంలోని ఆర్ద్రత, భావోద్రేకం పైకి ఉబికివస్తుండేవి. వారి రసతృష్ణ, సౌందర్యపిపాస ఉన్నతమైనవి. వారి కళాదృష్టి, ఆరాధన శ్రేష్ఠం. స్నేహశీలత, మర్యాద, మన్నన చెప్పుకోవలసినవి. వారి పట్టుదల, కార్యదీక్ష గొప్పవి. వారెన్నోకష్టనష్టములకు లోనై, సాహసముతో త్రివేణిని నడపేవారు. దానిని సర్వాంగసుందరంగా చేయాలని తహతహలాడేవారు. ఆత్మ

గౌరవాభిమానములకు కించిత్తైనా లోటురానీయకుండానే, పది మందిసాయం కోరేవారు. ఒక్కొక్కప్పుడు చేతిలో తగినంతడబ్బు లేక త్రివేణి సకాలంలో బైటపడకపోయినా, చిల్లిగవ్వ లేక చందా దారులకు పంపుట కాలస్యమగుచుండినా వారు పడుచుండిన క్షోభ నాకుకూడా కొంతకుగొంత తెలియును. వారు నిజముగా తన జీవితసర్వస్వమును త్రివేణికి ధారబోశారు. దానిని శ్రేష్ఠమైన జర్నల్ గా రూపొందించారు. ఆ ఖ్యాతి అజరామరణం.

వారు భారీమనిషి గాకపోయినా, మిక్కిలి అందగాడని వెంటనే తట్టకపోయినా, వారి విశిష్టవ్యక్తిత్వం సుస్పష్టంగా ఉండేది. వారిది కోలముఖం, కోటేరువంటి నాసిక, తేజోవంతమైన నేత్రాలు, తీర్చిదిద్దినట్లున్న చెవులు, కొంచెమెత్తుగా నుండి సమతలమైన ఫాలభాగం, పల్చని చెక్కిళ్లు, ఎరుపుశరీరవర్ణం. పళ్లు మిక్కిలి కొంచెం పెదవులను దాటివస్తున్నవా అనునట్లుండినా, చిన్న మీసంతో, మొత్తంమీద ఆకర్షణీయంగా వుండేవారు. నేను ముఖ్యంగా గమనించింది వారి మిక్కిలినాజూకు, చాలాఅందమైన యువతివ్రేళ్లవంటి వ్రేళ్లు. అవి కళామయత్వాన్ని తెల్పేవి.

వారు నాయందు స్నేహభావమేగాక, గౌరవాదరణలను చూపేవారు. ఆరోజుల్లో, మద్రాసు ప్రభుత్వం పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా ఒక ఆంగ్లేయు డుండేవారు. ఆయనను త్రివేణికి చందాదారునిగా చేర్పించాలని రామకోటీశ్వరరావుగారి ప్రయత్నం. నేను బ్యారిస్టరును కాబట్టి, హైకోర్టుకు వెళ్లు చుండేవాడనుకాబట్టి, నాయందు కొంత అభిమానం ఆయన చూపుతాడేమో అని, రామకోటీశ్వరరావుగారు వారి నడగండని కోరారు. సరే అని వారు హైకోర్టు వరండాలో తటస్థపడగా ప్రస్తావించాను. వారసమ్మతిని కొంచెం చిరాకుగానే తెల్పారు. బహుశా నేను వరండాలో ప్రస్తావించటం, వారు పని తొందరలో నుండటం కారణం కావచ్చును. అంతటితో ఆ ప్రయత్న మాగింది. సందర్భం గుర్తులేదు. త్రివేణి అభిమానుల నొకప్పు డొకచోట (సంవత్సరాలు గడచినతర్వాత) శ్రీ రామకోటీశ్వరరావు గారు సమావేశపరచారు. ఆ సమావేశంలో శ్రీ టి. టి. కృష్ణ మాచారిగారి వంటివా రుండినారు. నావంతు రాగా నేను లేచి

నేనెవరినో, ఏమి చేస్తున్నానో చెప్పుకొన్నాను. రామకోటీశ్వర రావుగారు కొన్నిసంవత్సరాలు కాంపోజిటు మద్రాసు శాసన సభలో సభ్యులుగా నుండినారు. వారి స్వస్థలం గుంటూరుజిల్లా నర్సారావుపేట. కొంత వృద్ధాప్యం, కొంత చివికిపోయిన శరీరం వారి పూర్తివిశ్రాంతి కాకరమైంది. నర్సారావుపేటలోని స్వగృహమందు కొలదిసంవత్సరాలక్రితం కన్నుమూశారు. వారు స్థాపించి తనసర్వస్వం ధారబోసిన త్రివేణి బ్రతికియున్నంతవరకు వారు బ్రతికియున్నట్లే. త్రివేణి నిప్పుడు శ్రీ భావరాజు నరసింహా రావుగారు బందరులో సమర్థవంతంగా వెలువరించుచున్నారు.

శ్రీ పింజల సుబ్రహ్మణ్యం చెట్టిగారు, గానాల రామమూర్తి గారు తెలుగువారని వేరే చెప్పనక్కరలేదు. వారినిగురించి నాకు బాగా తెలియదు. తెలుగు తలగుడ్డ, కోటు, లోపల చిన్నకోటు, చిన్నకోటుమీద ధరించిన గడియారం బంగారుగొలుసు, ధోవతి, చెప్పులు నలుపువర్ణంగలవారైనా, మంచి మీసకట్టుతో వెడల్పైన ముఖంతో కొంతవర్చస్సు గలిగి పింజల సుబ్రహ్మణ్యం చెట్టిగారు ఠీవిగా, హుందాతనంతో ఉండేవారు. వారు దీక్షతో సమదర్శిని దినపత్రికను నడపేవారు. దానికి సంపాదకులైన గానాల రామమూర్తిగారు మిక్కిలి చురుకైన బుర్ర గలిగినవారు. సమర్థులు. వారు విశ్వబ్రాహ్మణులని తెలియును. కాని ఎక్కడి వారో తెలియదు. నల్లగా సామాన్యులుగా తోచేవారు. చిత్రగుప్త పక్ష లేక మాసపత్రికను ప్రచురించుచుండిన ఆచార్య అనే (పూర్తిపేరు తెలియదు) వారుకూడా విశ్వబ్రాహ్మణులు. పచ్చని శరీరంతో అందంగావుండే కొద్దిపాటి మనిషి. చురుకైన వారని, బాగుగావ్రాసేవారని గుర్తు. చాల పిన్నవయస్సులోనే మరణించారు. మరుపూరి కోదండరామరెడ్డి సమదర్శిని పత్రికలో ఉపసంపాదకులనుకొందును. వారు నాయందు మిక్కిలి స్నేహ భావంతో ఇప్పటికి నుండుచున్నారు. చాలాసంవత్సరాలక్రితమే వారు పత్రికాసంబంధం వదులుకొని, సారస్వతకృషి సాగించారు. ఇప్పుడు వారు ఆంధ్రరచయితలలో పేరుపొందినస్థానం సంపాదించు కొన్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులుగా నున్నారు. దానితరపున కొన్ని గ్రంథాలను ప్రచురించారు.

అందులో ఈమధ్య వచ్చిన మహాభారతకర్ణపర్వాన్ని సాహిత్య అకాడమి అందర కందుబాటు ప్రచురణలపథకం క్రింద, నూత్న దృష్టితో మిక్కిలి బాగుగా వ్రాసిన పీఠికతో వెలువరించారు. వారు మధ్యలావుతో, పొడుగ్గా, వంకరతిరిగిన జుట్టుతో అందంగా వుంటారు. నేను మద్రాసుచేరిన క్రొత్తలో రంగస్వామినాయుడుగారనేవారు "ఆంధ్రప్రదేశ్" అనే పత్రికను నడుపుచుండేవారు. వారితో మాట్లాడానుకూడా. వారికి వృద్ధాప్యం వచ్చియుండింది. వారు గతించినవెంటనే ఆపత్రికకూడా మాటుమణిగింది.

నేను 35, పైక్రాఫ్ట్సు మొదటివీథిలో చేరినప్పుడు, రెండో వివాహం చేసుకోవాలని దృఢనిశ్చయుడనై యుండినందువల్ల, ఎదురింటి పడుచుపిల్లలు నన్నాకర్షించటం మొదలుపెట్టారు. ఒకరు ఎరుపు, ఒకరు నలుపుగాని, ఇద్దరు మంచివయస్సుతో అందంగావుండేవారు. వారరవ బ్రాహ్మణేతరులు. మొదలియార్లనుకొన్నాను. వాళ్లిద్దరు వాళ్ళఇంటి బైటగుమ్మంవద్దకు వచ్చి, చీటికిమాటికి సంజ్ఞలుచేయటం, వారితరఫున తండ్రికాబోలు వచ్చి నన్ను డబ్బడగటం, వారి నిజస్వభావాన్ని బైటబెట్టింది. అంతటితో వాళ్ళలో నొకరిని వివాహమాడవచ్చునా అనే నా ఆలోచన అంతమైంది.

తర్వాత నేను, నాభార్య 1930 జనవరి ఆరంభంలో తిరిగి సంసారంచేయట మారంభించినప్పుడు, ఆయింటిలోనే ఉండినాము. మాఅత్త రంగమ్మగారు కూతురుకు తోడువచ్చారు. భార్యాభర్తల మిద్దరం బైటికి రిక్షాలో బైలుదేరునప్పుడు, ఊరువిడిచి దూరదేశానికి వెళ్లుచున్న మాదిరిగా, నాభార్య తనతల్లికి పదేపదే చెప్పి మరీ బైలుదేరేది.

సాంఘికంగా (సోషల్) మద్రాసులో నా రాకపోకలు చాలామితం. న్యాయవాది అడుసుమిల్లి లక్ష్మయ్యగారిని, శ్రీ కాట్రగడ్డ శేషాచలంగారిని, శ్రీ పల్లెంపాటి రామకృష్ణయ్యగారిని అప్పుడప్పుడు కలసికొంటూవుండేవాడిని. ఒకటిరెండుసార్లు సెంట్రల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగానుండిన బత్తిన పెరుమాళ్లు నాయుడుగారిని, జాగర్లమూడి చౌదరయ్యగారిని వారిలో నొకరి

ట్రిప్లికేన్‌లోని నివాసగృహంలో కలసికొంటిని. యస్. దొరస్వామి అయ్యర్‌గారి యింటికి వెళ్లటం వృత్తిరీత్యానే. 1929 ఆగష్టు 22-వ తారీఖున చెంగల్పట్టుజిల్లా తిరుపుత్తూరుతాలూకా దండుమిట్టకు పల్లెంపాటి రామకృష్ణయ్యగారి తోడిఅల్లుడు దండుమిట్ట శ్రీరాములునాయుడుగారి కుమార్తె వివాహానికి వెళ్లాను. ఆ అమ్మాయిని తిరువాన్కూర్ జిల్లా ఇళియర్‌సందన్ జమీందారు గారి కుమారుని కిచ్చారు. వధూవరులు పచ్చని శరీరవర్ణంతో అందంగా వుండినారు. శ్రీరాములునాయుడుగారితోపాటు రామకృష్ణయ్యగారు, ఆయనభార్య జ్ఞానాంబగారు, వారి అన్న వెంకట్రామయ్యగారు నాకు మర్యాదలుచేశారు.

దండుమిట్ట కుగ్రామం. శ్రీరాములుగారింటి వెనుక భాగంలో పెద్దదొడ్డి, దాని నానుకొని వారి వ్యవసాయభూమి దొడ్డి ఆవరణలో పెద్దబావి యుండేది. దానికి ఆయిల్ ఇంజన్ సాయముతో పంపింగుసెట్టు అమర్చి, 35 ఎకరాలు మాగాణి సాగు చేసేవారు. అంత పెద్ద నుయ్యిని చూడటం, అన్ని ఎకరాలు ఒక బావిక్రింద సాగుచేస్తారని తెలుసుకోవటం నాకదే మొదటిసారి.

వెంకట్రామయ్యగా రారోజుల్లో మద్రాసు మౌంటురోడ్డు గ్రామం ఆలందూర్‌లో వుండేవారు. ఆలందూర్‌లోని వారింటికి రెండు, మూడు సార్లు వెళ్లినట్లు గుర్తు. దీపావళివంటి ఒకటి, రెండు పండుగలకు. వారింటికి విందుకు వెళ్లాను. దీపావళిరోజున గారెలతోబాటు, మాంసంకూడా భుజింపజేశారు. ఈప్రాంతాల్లో ఒక్క సంక్రాంతికి, ముఖ్యంగా కనుముకుతప్ప, మాంసం పండుగల్లో తీసుకోరు. ఆలందూరుతర్వాత, నేను పండుగలలో కూడా మాంసభక్షణకు వెనుదీయటంలేదు. నిజానికి పండుగంటే ఇష్టమైనపదార్థాలతో తృప్తిగా భోజనంచేయటమే అని నా గట్టి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని తప్పకుండా అమలులోబెట్టు చున్నాను. నాకు మాంసాదులెక్కువ ఇష్టమనిపాఠకులు గ్రహించే యుందురు.

*